# దివ్య గ్రంథం

# ఖుర్‌ఆన్

ఉర్దూ అనువాదం

**మౌలానా వహీదుద్దీన్ ఖాన్**

తెలుగు రూపం

**ముహమ్మద్ అజీజుర్రహ్మాన్**

ప్రకాశకులు

**టాప్ పబ్లిషర్స్, హైదరాబాద్**

8–1–363/34, ఆదిత్య నగర్ కాలని

టోలి చౌకి, హైదరాబాద్ – 8 (ఎ.పి.) ఇండియా

సెల్ : 7893597596, 9246294664

E-mail : aijazadil19@yahoo.com

# దివ్య గ్రంథం ఖుర్‌ఆన్

ఉర్దూ అనువాదం

**మౌలానా వహీదుద్దీన్ ఖాన్**

తెలుగు రూపం

**ముహమ్మద్ అజీజుర్రహ్మాన్**

**DIVYA GRANDHAM QUR'AN**

**The Holy Quran (Telugu Translation)**

Urdu Translation by

**Maulana Waheeduddin Khan**

Telugu Translation by

**Muhammad Azeez-ur-Rahman**



First Edition : July 2013
Second Edition : October 2013

**Goodword Books**
1, Nizamuddin West Market
New Delhi - 110 013
Tel. 9111-4182-7083, 4652-1511
e-mail : info@goodwordbooks.com
www. goodwordbooks.com
cpsglobal.org/quran

Published by :

**TOP Publishers, Hyd.**
# 8-1-363/34, Aditya Nagar Colony
Tolichowki, Hyderabad- 500 008
A.P. India
Cell Nos.7893597596, 9246294664
E-mail : aijazadil19@yahoo.com

***గమనిక :***

◆ పారా (నం.....) మొదలయ్యే గుర్తు

# విషయ సూచిక



# పరిచయం

ఖుర్‌ఆన్ దైవగ్రంథం. దేవుని అంతిమ సందేశహరుడు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ద్వారా సమస్త మానవాళి మార్గదర్శకత్వం కొరకు అందజేయబడిన అంతిమ దైవవాణి. ఇది ఒకేసారి కాకుండా 23 ఏండ్ల వ్యవధిలో వివిధ భాగాలుగా అవతరించింది. క్రీ. శ. 610లో ఇస్లాం ప్రవక్త మక్కాలో ఉండగా ఖుర్‌ఆన్ మొదటి భాగం అవతరించింది. ఆ తరువాత అంచెలవారీగా – అవసరాల కనుగుణంగా – వివిధ భాగాలు అవతరించేవి. ఖుర్‌ఆన్ చివరి భాగం క్రీ. శ. 632 లో – మహనీయ ముహమ్మద్ (స) మదీనాలో ఉన్నప్పుడు అవతరించింది. దైవదూత జిబ్రీల్ ద్వారా ఖుర్‌ఆన్ అందజేయబడేది.

దివ్య ఖుర్‌ఆన్‌లో మొత్తం 114 అధ్యాయాలు ఉన్నాయి. వాటిలో కొన్ని పెద్దవి, మరికొన్ని చిన్నవి. దివ్య ఖుర్‌ఆన్ స్వచ్ఛమయిన అరబీ భాషలో అవతరించింది. అది అవతరించిన నాటి నుండీ నేటి వరకూ పొల్లు పోకుండా యధాతథంగా – సురక్షితంగా – ఉంది. ప్రపంచంలో ఈ ఉద్గ్రంథం ఎన్నో భాషలలో తర్జుమా అయింది. కాని తర్జుమాలు ఎన్నటికీ మూల ప్రతికి ప్రత్యామ్నాయం కాజాలవు. ఖుర్‌ఆన్ అవగాహన నిమిత్తమే ఈ తర్జుమాలు. అలా అని అరబీ భాష రానివారు ఖుర్‌ఆన్‌ను అర్థం చేసుకోలేరని అనటం కూడా సరికాదు. ఒక అరబ్బేతరుడు సయితం దాని సందేశాన్ని ఆకళింపు చేసుకోగలడు. ఖుర్‌ఆన్ అరబీ భాషలో ఉన్నప్పటికీ, అది తన వాస్తవికత రీత్యా ప్రకృతి భాషలో ఉంది. ఈ వాస్తవమే ఈ గ్రంథంలో ఒకచోట ఇలా చెప్పబడింది :

**'వాస్తవానికి ఇవి చాలా స్పష్టమయిన వచనాలు. జ్ఞానమొసగబడిన వారి అంతర్యాలలో ఇవి పదిలమై ఉన్నాయి. దుర్వర్తనులు మాత్రమే వీటిని తృణీకరిస్తారు'** ***(29:49)***

దీని భావమేమిటంటే ఏ దైవిక వాస్తవాన్ని ఖుర్‌ఆన్ తెలిసిన భాషలో చాటి చెబుతోందో అది తెలియని భాషలో ముందునుంచే మానవ మనోక్షేత్రంలో నాటుకుని ఉంది. ఖుర్‌ఆన్ సందేశం మానవుని కోసం అపరిచిత సందేశం కాదు, అది మానవ నైజంతో పెనవేసుకుని ఉన్న అనిర్వచనీయమయిన 'ఎరుక'కు అక్షరరూపమే.

తరువాతి కాలాల్లో జన్మించే వారంతా – ప్రాథమికంగా ఆదమ్ సృష్టించబడినపుడే పుట్టించబడ్డారని, ఆ సమయంలో దేవుడు ఆ మానవాత్మలతో ప్రత్యక్షంగా సంభాషించాడని ఖుర్‌ఆన్ మనకు చెబుతోంది. ఆ సంఘటన ఖుర్‌ఆన్‌లో ఇలా చెప్పబడింది :

**"నీ ప్రభువు ఆదమ్ సంతతి వారి వీపుల నుండి వారి సంతానాన్ని తీసి, స్వయంగా వారినే వారి మాటకు సాక్ష్యంగా పెట్టి, 'నేను మీ ప్రభువును కానా?' అని అడిగినప్పుడు, 'ఎందుకు కావు?' (నీవే మా ప్రభువువి) దీనికి మేము సాక్షులుగా ఉన్నాం' అని వారన్నారు. 'ఏమో! దీని గురించి మాకు తెలియదు' అని మీరు ప్రళయదినాన అనకూడదని (ఈ విధంగా చేయబడింది)"** ***(7 : 172)***

దేవునికి – మానవునికి మధ్య జరిగిన మరో సంభాషణను ఖుర్‌ఆన్ ఈ విధంగా ప్రస్తావించింది :

**"మేము అమానతు (అప్పగింతలు, బరువు బాధ్యతల)ను ఆకాశాలకు, భూమికి, పర్వతాలకు ఇవ్వదలిచాము. కాని అవి దానిని మోయటానికి నిరాకరించాయి. దానికి అవి**

**భయపడి పోయాయి. అయితే మానవుడు మాత్రం దానిని తన మీద వేసుకున్నాడు. ఈ విధంగా తాను మహా మొండివాడినని, మూర్ఖుడనని మానవుడు నిరూపించు కున్నాడు.” *(33:72)***

పై రెండు వచనాల ద్వారా అవగతమయ్యేదేమిటంటే, సృష్టి ఆరంభంలో దేవుడు సమస్త మానవాళిని ఉద్దేశించి నేరుగా మాట్లాడాడు. ఆ సందర్భంగా చెప్పిన మాట మానవ స్వభావంలో అంతర్లీనం అయి ఉంది. ప్రస్తుతం మనిషి ఖుర్‌ఆన్ రూపంలో ఏ సందేశాన్ని చదువు తున్నాడో దానిని అతడు అంతకుముందే దేవుని ప్రసంగ రూపంలో విని ఉన్నాడు. ఒక విధంగా చెప్పాలంటే ఖుర్‌ఆన్ మానవునికి సుపరిచితమైన విషయాన్ని మరింత క్షుణ్ణంగా తెలుసుకోవటమే.

ఈ విషయాన్ని దృష్టియందుంచుకున్నప్పుడు ఖుర్‌ఆన్‌ను అర్థం చేసుకోవటానికి ఖుర్‌ఆన్ అనువాదం కూడా ఒక మహత్తర సాధనమే అని అనటంలో సందేహం లేదు. ఏ మనిషి నైజం సచేతనంగా ఉందో, ఎవరు పరిస్థితుల ప్రభావం (Conditioning) నుండి తనను తాను కాపాడు కున్నాడో, అతను ఖుర్‌ఆన్ పఠనానికి ఉపక్రమించినపుడు అతని హృదయ కవాటాలు ఒక్కసారిగా తెరచుకుంటాయి. అతనిలో నిద్రాణమై ఉన్న దైవసంబోధనాంశం ఒక్కసారిగా జాగృతమవుతుంది. ఎందుకంటే ‘అహదె అలస్త్’ దేవుని తొలి పలుకు అయితే, ‘ఖుర్‌ఆన్’ దేవుని తుది పలుకు. ఇవి రెండూ పరస్పరం ధ్రువీకరణగా ఉన్నాయి. ఎవరికయినా అరబీ భాషలో ప్రవేశం లేకుంటే, లేదా ప్రవేశం అంతంత మాత్రంగా ఉంటే, ఖుర్‌ఆన్ అవగాహనకు సంబంధించి వారు నిరాశ చెందవలసిన పని లేదు.

## దేవుని సృష్టి ప్రణాళిక

ప్రతి గ్రంథానికి ఒక విషయం (Subject) ఉంటుంది. దానికొక నిర్దిష్ట లక్ష్యం ఉంటుంది. ఖుర్‌ఆన్ ప్రధానాంశం దేవుని సృష్టి ప్రణాళిక

(Creation Plan of God) ను మనిషికి ఎరుకపరచటం. అంటే దేవుడు ఈ జగతిని సృష్టించటంలోని ఉద్దేశ్యమేమిటో మనిషికి తెలియపరచటం అన్నమాట. అంటే మనిషి ఈ భువిపై ఎందుకు వసింపజేయబడ్డాడు? మరణించే వరకూ అతనిక్కడ ఏ విధంగా జీవించాలి? మరణానంతరం అతనికి ఎదురయ్యే సవాళ్ళేమిటి? అనేవి అతనికి ముందుగానే తెలియపర చటం అవసరం.

మానవుడు ఒక శాశ్వతమయిన సృష్టిగా పుట్టించబడ్డాడు. అతని జీవన యాత్ర మరణానంతరం కూడా కొనసాగుతుంది. ఈ సంపూర్ణ జీవన యాత్రలో ఖుర్‌ఆన్ అతనికి ఒక మార్గదర్శినిగా ఉంటుంది. ఈ సత్యాన్ని మనిషికి ఎరుకపరచటమే ఖుర్‌ఆన్ ముఖ్యోద్దేశం. ఖుర్‌ఆన్‌లోని ప్రధానాంశం కూడా ఇదే.

దేవుడు మనిషిని ఓ శాశ్వత సృష్టిగా పుట్టించాడు. తరువాత అతని జీవిత వ్యవధి (Life Span) ని రెండు భాగాలుగా విభజించాడు. వాటిలో ఒక భాగం అత్యల్పమైనది; అది మరణానికి పూర్వం ఉన్నది. రెండవది సుదీర్ఘమైనది; అది మరణానంతరం ఉంటుంది. మరణానికి పూర్వం ఉన్న జీవన వ్యవధి ఒక పరీక్షా వ్యవధి. మరణానంతరం ఉన్న వ్యవధి ఆ పరీక్షా ఫలితాన్నిబట్టి ఉంటుంది. అంటే, అది సత్పరిణామంగానో లేక దుష్పరిణా మంగానో ఉంటుంది. జీవితానికి సంబంధించిన ఈ 'పరిచయం' చేసేందుకు ఉద్దేశించిన గ్రంథమే ఖుర్‌ఆన్.

మానవుడు జన్మతః అన్వేషకుడు. ప్రతి దానినీ శోధించాలన్న కుతూహలం అతనిలో మెండుగా ఉంది. నేనెవరిని? నా జీవిత పరమార్థం ఏమిటి? జీవన్మరణాలలోని వాస్తవికత ఏమిటి? మనిషి జయాపజయాల వెనుక ఉన్న రహస్యాలేమిటి? లాంటి ప్రశ్నలు అతని మదిని తొలుస్తూ ఉంటాయి. ఖుర్‌ఆన్ ప్రకారం ప్రాపంచిక జీవితంలోని ఈ ప్రశ్నలు పరీక్షా పత్రంలోని ప్రశ్నలే. దేవుని సృష్టి ప్రణాళికను అవగాహన చేసుకున్న వారు మాత్రమే ఈ ప్రశ్నలకు ఖచ్చితమయిన సమాధానాలను కనుగొన గలుగు

తారు. మరణానంతర జీవితంలో దేవుని బహుమానానికి నోచుకునేది కూడా ఇలాంటివారే.

## దైవవాక్కు

మీరు ఖుర్‌ఆన్ పారాయణానికి ఉపక్రమించినపుడు ఇది దేవుడు అవతరింపజేసిన వాక్కు (Word of God) అన్న ప్రకటన పదే పదే పునరావృతం కావటం గమనిస్తారు. పైకి ఇది చాలా సాధారణమయిన విషయంగానే కనిపించినప్పటికీ దీని లోతుల్లోకి వెళ్ళి, తులనాత్మక అధ్యయనం చేసే కొలదీ ఇదొక అసాధారణమయిన, అద్భుతమయిన విషయం అన్న సంగతి విదితమవుతుంది. ప్రజలు పవిత్ర గ్రంథాలుగా నమ్మే గ్రంథాలు ప్రపంచంలో అనేకం ఉన్నాయి. కాని ఒక్క ఖుర్‌ఆన్ తప్ప మరే ఇతర పవిత్ర మత గ్రంథంలోనూ 'ఇది దైవ వాక్కు' అనే వాక్యం కనబడదు. ఈ రకమయిన ప్రకటన ఖుర్‌ఆన్‌కే సొంతం.

ఖుర్‌ఆన్ విషయాన్ని వివరించే తీరు కూడా విలక్షణమైనది. సాధారణ పుస్తకాలలో చెప్పదలచిన విషయం ఒక క్రమం ప్రకారం నమోదై ఉంటుంది. అందులో 'అ' నుండి 'ఱ' వరకు గల ముఖ్యాంశాలు ఒక వరుస క్రమంలో ఉంటాయి. కాని ఖుర్‌ఆన్‌లో సాధారణ పాఠకునికి వస్తుతః ఇలాంటి వరుస క్రమం కనిపించదు. అయితే వాస్తవికత దృష్ట్యా చూసినపుడు అందులో ఒక అద్భుతమైన కూర్పు కానవస్తుంది. అంశాల మధ్య అవినాభావ సంబంధం గోచరిస్తుంది. ఖుర్‌ఆన్‌ను అధ్యయనం చేస్తున్నప్పుడు పాఠకునికి ఒక వింత అనుభూతి కలుగుతుంది. అదేమంటే దీని రచయిత ఒక అత్యున్నత స్థానంలో ఆసీనుడై సమస్త మానవాళిని కనిపెట్టుకుని ఉన్నాడు. అక్కడి నుండి అందరినీ శాసిస్తున్నాడు. అందరి సాధకబాధకాలను గమనిస్తున్నాడు. అత్యున్నత స్థానంలో నుండి అందరినీ సంబోధిస్తున్నాడు. అయితే ఈ సంబోధన సమయంలో ఆయన దృష్టి

ఉన్నట్టుండి ఒక ప్రత్యేక వర్గంపై మళ్ళుతుంది. వేరొక సందర్భంలో వేరొక వర్గంపై ఆయన ప్రత్యేకంగా దృష్టిని సారిస్తాడు.

ఖుర్‌ఆన్‌లోని ఒక విశిష్ఠ కోణం ఏమిటంటే, దాని పాఠకుడు ఏ క్షణంలోనయినా దాని రచయితను సంప్రతించగలడు. ఖుర్‌ఆన్ రచయిత దేవుడే. ఆయన నిత్య సజీవుడు. అజరుడు. ఆయన సమస్త మానవాళిని పరివేష్ఠించి ఉన్నాడు. ఆయన నేరుగా ప్రతి మనిషి మొరను ఆలకిస్తాడు. అతని పిలుపునకు స్పందిస్తాడు, సమాధానమిస్తాడు. అందుకే ఖుర్‌ఆన్‌ను పఠించే వ్యక్తి అనుక్షణం దైవాన్ని సంప్రతించగలడు. దైవాన్ని ప్రశ్నించ గలడు. ఆ ప్రశ్నకు సమాధానం పొందగలడు.

## శాంతియుతమైన సైద్ధాంతిక పోరాటం

కేవలం మాధ్యమం (మీడియా) ద్వారా ఖుర్‌ఆన్ గురించి విన్నవారు దానినొక యుద్ధప్రేరిత (జిహాద్) గ్రంథమని అనుకుంటారు. వారి దృష్టిలో జిహాద్ అంటే – హింస ద్వారా లక్ష్యాన్ని సాధించటం! ఇది కేవలం ఒక అపోహ మాత్రమే. ప్రత్యక్షంగా ఖుర్‌ఆన్‌ను అధ్యయనం చేసిన వ్యక్తికి సుబోధకం అవుతుంది – ఖుర్‌ఆన్‌కు హింసతో ఎలాంటి సంబంధం లేదని, ఖుర్‌ఆన్ ఆసాంతం శాంతియుతమైన గ్రంథమే గాని యుద్ధాన్ని ప్రేరేపించే గ్రంథం కాదని! ఖుర్‌ఆన్ బోధనల్లో జిహాద్ కూడా ఒక అంశం అనేది వాస్తవమే. అయితే శాంతియుతమైన నిరంతర సాధనకు మరో పేరే జిహాద్. అంతేగాని హింసాత్మకమయిన చర్యకు జిహాద్ ప్రతిరూపం కానేకాదు. ఖుర్‌ఆన్ యొక్క జిహాద్ భావనను తెలుసుకోవటానికి ఈ సూక్తిని గమనించండి :

> **"దీని (ఖుర్‌ఆన్) ఆధారంగా వారితో రాజీలేని పోరాటాన్ని కొనసాగించు"** ***(25:52)***

ఈ సూక్తిలో ఖుర్‌ఆన్ ద్వారా పోరాడమని ప్రబోధించబడింది. మరి ఖుర్‌ఆన్ ఒక ఆయుధం కాదు. ఇదొక సైద్ధాంతిక గ్రంథం. దైవ

సిద్ధాంతాన్ని పరిచయం చేసే గ్రంథం ఖుర్‌ఆన్. ఖుర్‌ఆన్ యొక్క జిహాద్ భావన ఏమిటో దీనిద్వారా స్పష్టంగా అవగతం అవుతోంది. ఖుర్‌ఆన్ ప్రకారం జిహాద్ అంటే అర్థం; శాంతియుతమైన సైద్ధాంతిక పోరాటం (Peaceful Ideological Struggle). ఈ సైద్ధాంతిక పోరాట లక్ష్యం ఏమిటో కూడా ఖుర్‌ఆన్‌లో చెప్పబడింది : ఖుర్‌ఆన్ సందేశం ప్రజల హృదయాలలో చొచ్చుకు పోయేలా కృషిచేస్తూ ఉండటం *(4:63).*

పై వచనం ప్రకారం ప్రజలను ఆలోచింపజేసే, వారి మనో మస్తిష్కాలకు పదునుపెట్టే విషయం చెప్పాలి. అది వారి ఆంతర్యాలలో జనించే సందేహాలను సమాధానపరిచేదిగా ఉండాలి. తద్వారా ఖుర్‌ఆన్ బోధనలపై ప్రజలకు నమ్మకం కుదరాలి. వారు దానిని సత్యమని ధ్రువీక రించగలగాలి. తద్వారా వారిలో భావ విప్లవం పెల్లుబకాలి. ఇదీ అసలు ఖుర్‌ఆన్ ఆశయం. ఈ ఆశయ సాధన సహేతుకమయిన ఆధారాలు, నిదర్శనాల ద్వారానే సాధ్యమవుతుంది గాని హింస ద్వారానో, సైనిక చర్య ద్వారానో సాధ్యం కాదు.

## సందేశ ప్రధానమైన గ్రంథం

ఖుర్‌ఆన్‌ను అవగాహన చేసుకునేవారు గమనించవలసిన ఓ ముఖ్యాంశం ఏమిటంటే; ఖుర్‌ఆన్ శాసన గ్రంథం కాదు, ఇది ఒక సందేశ ప్రధానమైన గ్రంథం. దీని సంబోధనా శైలి శాసనపరమైనది కాదు, బోధనా పరమైనదే. శాసన గ్రంథాలలోని ప్రతి అంశం శాసించే విధంగానే ఉంటుంది. అయితే సందేశ గ్రంథాల శైలి తద్భిన్నంగా ఉంటుంది. సందేశ ప్రతులలో విషయాన్ని ప్రభావవంతంగా చెప్పటానికి పదజాలాన్ని 'ఆధారంగా' మాత్రమే తీసుకోవటం జరుగుతుంది. కాని శాసనాలలో వాడే పదజాలం వస్తుతః ఆ శాసనంతో ముడిపడి ఉంటుంది. కాకపోతే ఒక్కోసారి సందేశ గ్రంథం కూడా కఠిన పదజాలం ప్రయోగిస్తుంది. శుభవార్త వినిపించటంతో పాటు భయబోధ కూడా చేస్తుంది. మనిషిలోని

మనసులో నిద్రాణమై ఉన్న ప్రేరిత శక్తులను జాగృతం చేయటానికి, అంతర్యంలో దాగి ఉన్న భావాలు భావనలను ఉత్తేజితం చేయటానికి ఇది అవసరమవుతుంది.

ఖుర్ఆన్ క్రీ.శ. 7వ శతాబ్ది ప్రథమార్ధంలో అవతరించిన కాలం లోనే కాగితావిష్కరణ జరిగింది. అది పాపిరస్ (Papyrus) గా వ్యవహరించబడేది. ఖుర్ఆన్‌లోని ఏ భాగం అవతరించినా అది ఆ కాగితంపై వ్రాసుకోబడేది. అరబీలో ఇది 'ఖిర్తాస్' (6:7) అనబడింది. దాంతోపాటే ప్రజలు ఈ ఉద్గ్రంథాన్ని తమ మనో ఫలకాలపై భద్రపరచుకునేవారు. ఎందుకంటే ఖుర్ఆన్ ఒక్కటే అప్పట్లో ఇస్లామీయ సాహిత్యంగా ఉండేది. ఖుర్ఆన్ అనుదినం నమాజులలో పఠించబడేది. సందేశ కార్యక్రమాలలో జనులకు ఖుర్ఆన్ చదివి వినిపించబడేది. ఆ విధంగా ఖుర్ఆన్ ఏక కాలంలో లిఖించబడటంతో పాటు కంఠస్థం కూడా చేసుకోబడేది.

## ఖుర్ఆన్ ప్రాచుర్యం

ఇస్లాం ప్రవక్త (సఅసం) కాలం చివరి వరకూ ఖుర్ఆన్‌ను భద్రపరచడానికి ఇదే పద్ధతి అవలంబించబడింది. ప్రథమ ఖలీఫా హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) కాలంలో తొలిసారిగా పూర్తి ఖుర్ఆన్‌ను ఒక గ్రంథంగా కాగితం లేదా పాపిరస్‌పై తీసుకురావటం జరిగింది. ఈ క్రోడీకరణ ప్రక్రియ తృతీయ ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) హయాంలో ఊపందుకుంది. అనేక గ్రంథ ప్రతులను లిఖించి వివిధ పట్టణాలకు పంపటం జరిగింది. ఈ మూలప్రతులు పట్టణాలలోని పెద్ద మస్జిదులలో ఉండేవి. ప్రజలు ఆ గ్రంథాలను పారాయణం చేయటంతో పాటు, వాటిని చూసి మరిన్ని ప్రతులను లిఖించేవారు.

ఈ ఖుర్ఆన్ లేఖనా ప్రక్రియ 19వ శతాబ్ది వరకూ నిరాఘాటంగా కొనసాగింది. క్రీ. శ. 19వ శతాబ్దిలో ముద్రణాయంత్రం కనుగొన బడింది. కాగితపు పరిశ్రమ అభివృద్ధి చెందింది. తత్ఫలితంగా భారీ ఎత్తున

ప్రింటింగ్ ప్రెస్ ద్వారా ఖుర్‌ఆన్ ప్రతులు విపణిలోకి రావటం మొదలెట్టాయి. నేడు ప్రపంచంలో ఏ మూలకు వెళ్ళి చూసినా అందమైన అద్భుతమయిన ఖుర్‌ఆన్ అరబీ ప్రతులు కానవస్తాయి. కాని 'అలిఫ్' నుండి 'వన్నాస్' వరకు (ఆద్యంతం) ఎక్కడా ఒక్క అక్షరం కాదుకదా, ఒక్క పొల్లు కూడా వ్యత్యాసం కానరాదు. ఖుర్‌ఆన్‌ను పూర్తిగా కంఠస్థం చేసుకున్న 'ఖ్వారీల' మనోఫలకాలపై ముద్రితమై ఉన్నదే ఖుర్‌ఆన్ అరబీ ప్రతులలోనూ ఉంటుంది. ఏ దేశమేగినా, ఏ పఠిత నోట విన్నా మీకు భిన్నత్వం కనిపించదు. ఖుర్‌ఆన్ పఠన సందర్భంగా ఒక గొప్ప పండితుని వల్ల మరుపు జరిగినా, హాఫిజ్ అయిన ఒక పిల్లాడు సయితం ఆ దోషాన్ని సవరించగలడు. ఖుర్‌ఆన్ అప్పజెప్పే ఒక వ్యక్తి వల్ల పొరపాటు జరిగితే అంధుడయిన ఒక హాఫిజ్ దానిని సరిదిద్దగలడు. ఇదొక్కటి చాలు – ఖుర్‌ఆన్ ఎలాంటి ప్రక్షిప్తాలకు లోనుకాని సురక్షితమైన దైవగ్రంథం అని చెప్పటానికి!

## ఖుర్‌ఆన్ ప్రధాన లక్ష్యం

ఖుర్‌ఆన్ వాంఛించే మనిషి 'రబ్బానీ మనిషి' (3:79). అంటే అతని జీవితం ప్రభువు ప్రసన్నతను లక్ష్యంగా పెట్టుకున్న జీవితం అయి ఉంటుంది. దాని కొరకు అతను పవిత్ర జీవితం గడపవలసి ఉంటుంది. తన ఆత్మను పరిశుద్ధపరచుకోవలసి ఉంటుంది. అదే ఖుర్‌ఆన్‌లో తజ్కియ (2:129) గా అభివర్ణించబడింది. ఈ లోకంలో పరిశుద్ధతను అవలంబించినవారే పరలోకంలో స్వర్గంలో ప్రవేశింపజేయబడతారు (20 : 76).

'తజ్కియ' అంటే పరిశుద్ధత, పరిశుభ్రతల (Purification) ను అవలంబించటం అని భావం. అంటే మనిషి తన వ్యక్తిత్వాన్ని అవాంఛనీయమయిన విషయాల నుండి దూరంగా ఉంచుకోవటం. వ్యక్తిత్వాన్ని అవాంఛనీయాల నుండి దూరంగా ఉంచుకునే ఈ ప్రక్రియ ఒక నాటిది కాదు, నిరంతరమైనది. అది ఎప్పటికీ అంతం కాదు. ఖుర్‌ఆన్

ప్రకారం ఒక విశ్వాసి జీవితాంతం ఈ ప్రక్రియ కోసం రాజీలేని పోరాటం సాగించవలసి ఉంటుంది.

అసలు విషయం ఏమిటంటే, ప్రతి మనిషీ పుట్టుక రీత్యా సహజత్వంపైనే ఉంటాడు. జన్మతః అతను 'మిస్టర్ నేచర్' అయి ఉంటాడు. కాని ప్రాపంచిక జీవితంలో అతను అనుదినం ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొంటాడు. కాలం వేసిన కళ్ళెంలో ఇరుక్కుంటాడు. పరిస్థితుల మాయాజాలానికి మోసపోతాడు. దైనందిన జీవితంలోని అనుభవాలు అతని సహజ వ్యక్తిత్వంపై నకారాత్మక మచ్చలు ఏర్పరుస్తూ ఉంటాయి. ఆగ్రహం, ఆవేశం, ద్వేషం, ఈర్ష్య, పేరాశ, దురభిమానం, ఓర్వలేనితనం, గర్వం, వాస్తవాన్ని ఒప్పుకోకపోవటం, ప్రతీకారేచ్ఛ – ఇత్యాదివన్నీ నకారాత్మక మచ్చలే. ఇవన్నీ మానవుని సహజ వ్యక్తిత్వాన్ని కలుషితం చేస్తుంటాయి. ఇలాంటి పరిస్థితిలో మనిషి చేయాల్సిందేమిటి? అతను ఎడతెగని ఆత్మావలోకనం (Introspection) ద్వారా తన జీవితాన్ని తీర్చిదిద్దుకుంటూ ఉండాలి. స్వీయసంస్కరణా కృషిని నిరాఘాటంగా కొనసాగించాలి. కలుషితం అవుతూ ఉన్న వ్యక్తిత్వాన్ని సహజ వ్యక్తిత్వంగా సంస్కరించుకుంటూ ఉండాలి. ప్రతి మనిషి ఊపిరిపీలుస్తున్న పరిసరాల వాతావరణం అతన్ని కండిషన్డ్ (Conditioned) మనిషిగా మారుస్తూ ఉంటుంది. కాగా; ప్రతి మనిషీ డీ–కండిషనింగ్ ద్వారా మళ్లీ తనను తాను 'మిస్టర్ నేచర్'గా మలచుకోవాలి. ఈ మిస్టర్ నేచరే ఖుర్ఆన్ పరిభాషలో రబ్బానీ మనిషి (దేవునివాడైన మనిషి) అనబడతాడు.

న్యూ ఢిల్లీ
2010, జూన్ 3

**– వహీదుద్దీన్ ఖాన్**
sk@skhan.org

# 1. అల్ ఫాతిహా (ఆరంభం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

**1. ప్రశంసలన్నీ అల్లాహ్ కోసమే. ఆయన సర్వలోకాలకు ప్రభువు. 2. అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు. 3. తీర్పు దినానికి అధిపతి. 4. మేము నిన్నే ఆరాధిస్తున్నాము. నీ సహాయాన్నే అర్థిస్తున్నాము. 5. మాకు రుజుమార్గం చూపు. 6. నీవు కటాక్షించిన వారి మార్గం, 7. నీ ప్రకోపానికి గురికాని వారి, దారి తప్పని వారి మార్గం చూపించు.**

## 2. అల్ బఖరహ్ (ఆవు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1.అలిఫ్ - లామ్ - మీమ్. 2. ఇది దైవగ్రంథం. ఇందులో సందేహానికి తావే లేదు. భయము, భక్తి కలవారికి ఇది మార్గదర్శిని. 3. వారు అగోచరాలను నమ్ముతారు. ప్రార్థనా వ్యవస్థను నెలకొల్పుతారు. మేము వారికి ప్రసాదించిన దానిలో నుండి ఖర్చుచేస్తారు. 4. నీపై అవతరించిన దానిని, నీకు పూర్వం అవతరించిన దానినీ విశ్వసిస్తారు. ఇంకా పరలోకాన్ని కూడా గట్టిగా నమ్మి నడుచుకుంటారు. 5. ఇలాంటి వారే తమ ప్రభువు మార్గాన్ని పొందినవారు. ఇలాంటివారే సాఫల్యం పొందేవారలు.

6. సత్యాన్ని తిరస్కరించిన వారిని నీవు హెచ్చరించినా, హెచ్చరించక పోయినా ఒకటే. వారు విశ్వసించరు. 7. అల్లాహ్ వారి హృదయాలకు, వారి చెవులకు సీలు వేశాడు. వారి కళ్ళపై పొరలు కమ్మాయి. వారికి వ్యథాభరితమయిన యాతన తథ్యం.

8. ప్రజలలో కొందరు, “మేము అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించాము” అని అంటున్నారు. కాని వాస్తవానికి వారు విశ్వాసులు కారు. 9. వారు దైవాన్ని, విశ్వాసులను మోసగించదలుస్తున్నారు. కాని నిజానికి వారు తమను తామే మోసగించుకుంటున్నారు. అయితే వారు ఆ విషయాన్ని గ్రహించటం లేదు. 10. వారి హృదయాలలో రోగం ఉంది. దేవుడు ఆ రోగాన్ని మరింతగా పెంచాడు. వారు చెప్పే అబద్ధాల కారణంగా వారి కొరకు బాధాకరమయిన శిక్ష ఉంది. 11. ‘భువిలో అరాచకాన్ని (అవ్యవస్థను) సృష్టించకండి’ అని వారితో అన్నప్పుడు, ‘అయ్యో! మేము సంస్కర్తలమండీ’ అని వారు సమాధానమిస్తారు. 12. జాగ్రత్త! అసలు అరాచకవాదులు వారే. కాని ఆ నిజాన్ని వారు గ్రహించరు. 13. ‘ఇతరులు విశ్వసించినట్లే మీరూ విశ్వసించండి’ అని వారితో అన్నప్పుడు, ‘ఏమిటీ, అవివేకులు విశ్వసించినట్లుగా మేము కూడా విశ్వసించాలా?’ అని

వారంటారు. నిశ్చయంగా అసలు వారే అవివేకులు. కాని వారా విషయాన్ని తెలుసుకోవటం లేదు. 14. వారు విశ్వాసులను కలుసుకున్నప్పుడు, 'మేమూ విశ్వసించాము' అనంటారు. కాని తమ దుష్ట నాయకుల వద్దకు వెళ్ళినపుడు, 'మేమసలు మీ వారమేనండీ! కాకపోతే వారితో పరిహాసమాడుతున్నాము' అని సంజాయిషీ ఇచ్చుకుంటారు. 15. దేవుడే వారిని ఆటపట్టిస్తున్నాడు. వారికి వారి తలబిరుసుతనంలో విడుపు ఇస్తూపోతున్నాడు. వారేమో (అంధకారంలో) తచ్చాడుతూ తిరుగుతున్నారు. 16. వీరే మార్గదర్శనానికి బదులుగా మార్గభ్రష్ఠతను కొనుగోలు చేసినవారు. అందుకే వారి వర్తకం వారికేమాత్రం లాభదాయకం కాలేదు. పోనీ వారు సన్మార్గాన్ని పొందారా అంటే అదీ లేదాయె.

17. వారిని నిప్పు రాజేసిన వ్యక్తితో పోల్చవచ్చు. తీరా ఆ నిప్పు పరిసరాలను ప్రకాశమానం చేయగానే, దేవుడు వారి కంటిచూపును లాక్కుని, వారిని దట్టమయిన చీకటిలో, ఏమీ కానరాని స్థితిలో వదిలేశాడు. 18. వారు చెవిటివారు, మూగవారు, గుడ్డివారు. వారిక (సన్మార్గానికి) మరలి రారు. 19. లేదా వారి పరిస్థితి ఇలా ఉంది – ఆకాశం నుండి భారీ వర్షం కురుస్తోంది. కారు మబ్బులు క్రమ్ముకుని, చీకటి అలుముకుంది. దానికి తోడు ఉరుములు, మెరుపులు కూడా! వారు ఉరుముల గర్జనకు భీతిల్లి మృత్యువు నుండి కాపాడుకోవటానికి తమ చెవులలో వ్రేళ్లు దూర్చుకుంటున్నారు. వాస్తవానికి దేవుడు సత్యతిరస్కారులను అన్ని వైపుల నుండీ చుట్టుముట్టి ఉన్నాడు. 20. మెరుపు తీగ వారి చూపును పోగొట్టేలాగే ఉంటుంది చూడబోతే. వారిపై మెరుపు మెరిసినప్పుడల్లా, ఆ వెలుగులో వారు నడవటం మొదలెడతారు. చీకటి ఆవరించగానే ఆగిపోతారు. దేవుడే గనక తలచుకుంటే వారి వినికిడి శక్తినీ, వారి దృష్టినీ లాక్కోగలడు. నిశ్చయంగా దేవుడు అన్నింటిపై అధికారం కలవాడు.

21. ప్రజలారా! మిమ్మల్నీ, మీ పూర్వీకుల్నీ సృష్టించిన మీ ప్రభువును ఆరాధించండి – తద్వారానే మీరు (నరకాగ్ని నుండి) రక్షించబడే అవకాశముంది. 22. ఆయనే మీ కొరకు భూమిని పరుపుగానూ, ఆకాశాన్ని

కప్పుగానూ చేశాడు. పై నుండి వర్షాన్ని కురిపించి, తద్వారా మీ కొరకు ఆహారంగా (జీవనోపాధిగా) రకరకాల పండ్లను, పంటలను పండించాడు. ఇది మీకు తెలిసినపుడు నిజ దైవానికి సాటిగా ఎవరినీ కల్పించకండి. 23. మేము మా దాసునిపై అవతరింపజేసిన ఈ వాక్కు గురించి మీకేదయినా సందేహముంటే, దీని వంటి ఒక్క అధ్యాయమయినా రచించి తీసుకురండి. నిజదైవం తప్ప మీ సహాయకులందరినీ ఇందు నిమిత్తం పిలుచుకోండి – మీరు సత్యసంధులే అయితే (ఈ పని చేసి చూపాలి)! 24. మీరు గనక ఇది చేయలేకపోతే – అది ఎన్నటికీ మీ వల్ల కాదు. మనుషులు, రాళ్ళు ఇంధనంగా మారే ఆ అగ్ని గురించి భయపడండి. అది సత్యతిరస్కారుల కోసం తయారు చేయబడి ఉంది. 25. విశ్వసించి, సదాచరణ చేసే వారికి స్వర్గవనాలు ఉన్నాయని, వాటి క్రింద సెలయేరులు ప్రవహిస్తూ ఉంటాయని శుభవార్త వినిపించు. ఆ తోటలలోని పండు వారికి తినటానికి ఇవ్వబడినప్పుడల్లా, 'ఇలాంటిదే ఇంతకు మునుపు కూడా మాకు ఇవ్వబడేది' అని వారంటారు. పరస్పరం పోలి ఉండే వస్తువులే వారికి లభిస్తాయి. అక్కడ వారికి పవిత్రమయిన జంట లభిస్తుంది. వారందులో కలకాలం ఉంటారు.

26. దేవుడు దేనినీ ఉపమానంగా చెప్పటానికి సిగ్గుపడడు – చివరికి దోమ లేదా అంతకంటే అల్పమయినదయినా సరే! విశ్వసించిన వారు మాత్రం దానిని తమ ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యమని తెలుసుకుంటారు. కాని సత్య తిరస్కారులు, 'ఇంతకీ ఈ ఉపమానం ఇవ్వటంలో దేవుని ఉద్దేశ్యమేమిటీ?' అని అడుగుతారు. ఈ విధంగా దేవుడు దీనిద్వారా ఎంతోమందిని మార్గ విహీనుల్ని చేస్తాడు, మరెంతో మందికి సన్మార్గం చూపుతాడు. అయితే ఆయన మార్గవిహీనతకు లోను చేసేది అవిధేయులను మాత్రమే. 27. (ఎందుకంటే) వారు దేవుని ఒడంబడికను స్థిరపరచిన మీదట భంగపరుస్తారు. దేవుడు కలపమని ఆజ్ఞాపించిన దానిని త్రెంచివేస్తారు. భువిలో విచ్ఛిన్నాన్ని సృష్టిస్తారు. నష్టపోయేది ఇలాంటి వారే. 28. అసలు మీరు నిజదైవాన్ని ఎలా తిరస్కరించగలరు? యదార్థానికి నిర్జీవులుగా ఉన్న మీకు ఆయనే జీవం పోశాడు. మరి ఆయనే మీ ప్రాణాలు తీసేవాడు.

మిమ్మల్ని తిరిగి బ్రతికించేవాడు కూడా ఆయనే. కడకు మీరంతా ఆయన వైపునకే మరలించబడతారు. 29. ఆయనే మీ కొరకు ధరణిలో ఉన్న వస్తువులన్నింటినీ సృష్టించాడు. తరువాత ఆయన ఆకాశం వైపు దృష్టిని కేంద్రీకరించి, (దానిని) సప్తాకాశాలుగా సవరించాడు. ఆయన ప్రతిదీ తెలిసినవాడు.

30. 'నేను భువిలో ఒక ఖలీఫా (పరంపరానుగతంగా వచ్చేవాని)ని చేయబోతున్నాన'ని నీ ప్రభువు దైవదూతలతో అన్నప్పుడు, దైవదూతలు 'ఏమిటీ, భూలోకంలో కల్లోలాన్ని సృష్టించి, రక్తపాతానికి ఒడిగట్టే వానిని వసింపజేస్తావా (ప్రభూ)? మేమెలాగూ నిన్ను స్తుతిస్తూ, నీ పవిత్రతను కొనియాడుతూ ఉన్నాము కదా!' అన్నారు. దానికి ఆయన, 'నిశ్చయంగా మీకు తెలియనివెన్నో నాకు తెలుసు' అన్నాడు. 31. తరువాత ఆయన ఆదంకు అన్ని పేర్లనూ నేర్పాడు. ఆ తరువాత వాటిని దైవదూతల ముందు ప్రవేశపెట్టి, 'మీరు సత్యశీలురే అయితే వీరి పేర్లేమిటో చెప్పండి?' అన్నాడు. 32. దైవదూతలు ఇలా అన్నారు, '(మహాప్రభూ!) నీవు పరమ పవిత్రుడవు. నీవు మాకు తెలియజేసినది మాత్రమే మాకు తెలుసు. నిశ్చయంగా నీవు జ్ఞాన సంపన్నుడవు. యుక్తిపరుడవు.' 33. అప్పుడు దేవుడు ఆదంతో, 'ఓ ఆదం! వారి పేర్లేమిటో తెలియజెయ్యి' అని అనగానే, ఆదం వారి పేర్లన్నీ తెలియజేశాడు. అప్పుడు దేవుడు దైవదూతలతో ఇలా చెప్పాడు : "భూమ్యాకాశాలలో గోప్యంగా ఉన్న విషయాలన్నీ నాకు మాత్రమే తెలుసనీ, మీరు వెల్లడించేవీ, దాచిపెట్టేవి కూడా నాకు తెలుసనీ నేను మీకు చెప్పలేదా!?"

34. మేము దైవదూతలతో, 'మీరు ఆదం ముందు సాష్టాంగపడండి' అని అన్నప్పుడు, వారంతా సాష్టాంగ ప్రణామం చేశారు. కాని ఇబ్లీసు (సాతాను) మాత్రం సాష్టాంగపడలేదు. అతను నిరాకరించాడు. గర్విష్టి అయి, అవిశ్వాసులలో చేరిపోయాడు. 35. మేము అతనితో, 'ఓ ఆదం! నీవూ, నీ భార్య – ఇద్దరూ కలసి స్వర్గంలో హాయిగా ఉండండి. మీరు కోరిన చోటి నుండి స్వేచ్ఛగా తినండి. అయితే ఆ చెట్టు దరిదాపులకు మాత్రం వెళ్ళకండి. వెళ్ళారో, దుర్మార్గులలో చేరిపోతారు (జాగ్రత్త!)' అని సావధానపర్చాము.

36. కాని షైతాన్ (ఆ చెట్టు ద్వారానే) వారిద్దరినీ ఏమార్చి, వారిని వారి (స్వర్గ) సుఖాల నుండి బయటికి తీయించాడు. అప్పుడు మేము వారితో, 'మీరు ఇక్కణ్ణుంచి దిగిపోండి. మీరు పరస్పరం శత్రువులు. ఒక నిర్ణీత గడువు వరకు మీరు భూమి మీదే ఉండి, ప్రయోజనం పొందవలసి ఉంటుంది' అని సూచించాము. 37. అప్పుడు ఆదం తన ప్రభువు నుండి కొన్ని (ప్రార్థనా) వచనాలు నేర్చుకుని ప్రార్థించగా ఆయన అతనివైపు దయతో మరలాడు. నిశ్చయంగా ఆయన పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడూ, కృపాసాగరుడు. 38. మేమిలా అన్నాము : 'మీరంతా ఇక్కణ్ణుంచి దిగిపోండి. నా తరఫు నుండి ఏదయినా మార్గదర్శక సూచన మీ వద్దకు వచ్చినపుడు, ఆ మార్గదర్శకత్వాన్ని అనుసరించే వారికి ఎలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు. 39. ఎవరయితే దానిని కాదని, మా సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చుతారో, అలాంటివారే నరకవాసులు. వారందులో శాశ్వతంగా మగ్గుతూ ఉంటారు.

40. ఇస్రాయీలు సంతతివారలారా! నేను మీకు చేసిన ఉపకారాన్ని జ్ఞాపకం చేసుకోండి. మీరు నాకిచ్చిన మాటను నిలబెట్టుకోండి. నేను మీకు చేసిన వాగ్దానాన్ని నెరవేరుస్తాను. మీరు నాకు మాత్రమే భయపడండి. 41. నేను అవతరింపజేసిన దానిని (ఖుర్ఆన్ గ్రంథాన్ని) విశ్వసించండి. అది మీ వద్ద ఉన్న దానికి (తౌరాత్ గ్రంథానికి) ధృవీకరణగా ఉంది. అందరికంటే ముందు మీరు దానిని తిరస్కరించినవారు కారాదు. నా సూక్తులను కొద్దిపాటి మూల్యానికి అమ్ముకోకండి. నాకు మాత్రమే భయపడండి. 42. సత్యాన్ని అసత్యంతో కలగాపులగం చేయకండి. తెలిసి కూడా సత్యాన్ని కప్పిపుచ్చకండి. 43. నమాజును స్థాపించండి, జకాత్‌ను చెల్లించండి, రుకూ చేసే (వంగే) వారితో పాటు మీరూ రుకూ చేయండి (వంగండి). 44. మీరు జనులకైతే మంచిని చేయమని ఆజ్ఞాపిస్తారు. కాని మిమ్మల్ని మీరు మరచిపోతున్నారే! వాస్తవానికి మీరు గ్రంథ పారాయణం కూడా చేస్తున్నారు. ఏమిటీ, ఆ మాత్రం అర్థం చేసుకోలేరా? 45. సహనం ద్వారా, నమాజు ద్వారా సహాయం అర్థించండి. నిశ్చయంగా అది కష్టమయిన

అభ్యాసమే - కాని భయభక్తులు గలవారికి (అది కష్టమేమీ కాదు)! 46. వారు తమ ప్రభువును కలుసుకోవలసి ఉందనీ, ఆయన వైపునకే మరలవలసి ఉందని భావిస్తుంటారు.

47. ఇస్రాయీలు సంతతివారలారా! నేను మీకు చేసిన మేలును, లోకవాసులపై నేను మీకు ప్రసాదించిన ఆధిక్యతను (ఓసారి) జ్ఞప్తికి తెచ్చుకోండి. 48. ఏ ప్రాణీ మరో ప్రాణికి ఏ విధంగానూ తోడ్పడలేని, ఎవరి సిఫారసూ ఆమోదించబడని, ఎవరి పాప పరిహారమూ స్వీకరించబడని, ఎవరికీ ఎలాంటి సహాయమూ అందని ఆ దినానికి భయపడండి. 49. ఫిరౌను జనుల చెర నుండి మేము మిమ్మల్ని విడిపించిన సందర్భం కూడా జ్ఞాపకం చేసుకోదగినదే. వారు మిమ్మల్ని నానా యాతనలకు గురిచేసేవారు. వారు మీ మగపిల్లలను వధించి, మీ స్త్రీలను మాత్రం బ్రతికి ఉండనిచ్చేవారు. ఇది మీ ప్రభువు తరఫు నుండి మీకు పెట్టబడిన కఠిన పరీక్ష. 50. అప్పుడు మేము మీ కొరకు సముద్రాన్ని చీల్చి, మిమ్మల్ని సురక్షితంగా ఆ దరికి చేర్చాము. మీరు చూస్తూ ఉండగానే ఫిరౌను జనులను (సముద్రంలో) ముంచివేశాము. 51. మేము మూసాతో నలభై రాత్రుల వాగ్దానం చేసి (పిలిపించి)నపుడు, అతని పరోక్షంలో మీరు ఆవుదూడను ఆరాధ్య దైవంగా చేసుకుని దుర్మార్గానికి పాల్పడ్డారు. 52. ఇంత జరిగిన తరువాత కూడా మేము మిమ్మల్ని క్షమించాము - బహుశా మీరు కృతజ్ఞులవుతారేమోనని!

53. (జ్ఞాపకం చేసుకోండి!) మేము మూసాకు గ్రంథాన్నీ, (సత్యాసత్యాలను స్పష్టంగా వేరుపరచే) గీటురాయినీ ప్రసాదించాము - తద్వారా మీరు సన్మార్గం పొందుతారని. 54. మూసా తన జాతి వారితో ఇలా అన్నప్పటి సంగతి : 'ఓ నా జాతి జనులారా! ఆవుదూడను ఆరాధ్య దైవంగా చేసుకుని మీరు మీ ఆత్మలకు తీరని అన్యాయం చేసుకున్నారు. కనుక పశ్చాత్తాపభావంతో మిమ్మల్ని సృష్టించిన వాని వైపునకు మరలండి. మీలోని అపరాధ జనులను హతమార్చండి. మీ సృష్టికర్త దృష్టిలో ఇదే మీ కొరకు సరైనది.' అప్పుడు దేవుడు మీ పశ్చాత్తాపాన్ని ఆమోదించాడు. నిశ్చయంగా ఆయన పశ్చాత్తాపాన్ని

ఆమోదించేవాడు, దయాగుణం కలవాడు. 55. మీరు మూసాతో, 'ఓ మూసా! మేము మా చర్మచక్షువులతో దైవాన్ని వీక్షించనంత వరకూ నిన్ను విశ్వసించేది లేదు' అని (తెగేసి) చెప్పినపుడు, మీరు చూస్తుండగానే అమాంతం మీపై పిడుగుపడింది. 56. అయినా మరణించిన మీదట మిమ్మల్ని తిరిగి లేపాము – మీరు కృతజ్ఞతా భావంతో మసలుకుంటారేమోనన్న ఉద్దేశంతో! 57. మేము మీపై మేఘాల ఛాయను కల్పించాము. మీపై మన్న్, సల్వాలను (ఆహారంగా) దించాము. 'మేము మీకు ప్రసాదించిన పరిశుద్ధమయిన వస్తువులను తినండి' (అన్నాము). (ఆజ్ఞోల్లంఘనకు ఒడిగట్టి) వారు మాకెలాంటి నష్టం కలిగించలేదు. వారు తమ ఆత్మలకే నష్టం కలిగించు కున్నారు.

58. మేము మీతో ఈ విధంగా అన్నప్పటి విషయాన్ని కూడా జ్ఞాపకం చేసుకోండి : "ఈ పురములో ప్రవేశించండి. ఇక్కడ మీరు కోరిన స్థలం నుండి, మీకు ఇష్టమయిన దానిని హాయిగా తినండి. అయితే పట్టణ ముఖద్వారం గుండా పోతున్నప్పుడు, తలవంచుకుని – 'మా ప్రభూ! మా తప్పులను క్షమించు' అంటూ సాగిపోవాలి. మేము మీ తప్పులను క్షమిస్తాము. సజ్జనులకు మరింతగా అనుగ్రహిస్తాము." 59. కాని దుర్వర్తనులు, తమతో అనబడిన ఈ మాటను మరో మాటతో మార్చేశారు. అందువల్ల దుర్మార్గానికి ఒడిగట్టిన వారిపై మేము, వారి అవిధేయత కారణంగా ఆకాశం నుండి శిక్షను అవతరింపజేశాము. 60. మూసా తన జాతి ప్రజల కొరకు నీళ్ళను అడిగినపుడు, 'నీ చేతి కర్రతో రాతిపై కొట్టు' అని మేము సూచించాము. దాంతో ఆ రాతి నుండి పన్నెండు ఊటలు పెల్లుబికాయి. ప్రతి తెగవారు తమ తమ నీరు త్రాగే స్థలాన్ని గుర్తించారు. (వారితో అన్నాము) "దేవుడిచ్చిన ఉపాధిని తినండి, త్రాగండి. భువిలో కల్లోల జనకుల మాదిరిగా కలియ తిరగకండి.' 61. 'ఓ మూసా! ఒకే రకమయిన అన్నం మాకు సహించటం లేదు. మా కోసం నీ ప్రభువును ప్రార్థించు. నేల నుండి ఉత్పత్తి అయ్యే ఆకుకూరలు, దోసకాయలు, వెల్లుల్లి, పప్పు దినుసులు, ఉల్లిపాయలు (తదితర ఆహార వస్తువుల కోసం అర్థించు)' అని వారు నిలదీసి అడిగినపుడు, మూసా

ఇలా అన్నాడు : 'ఏమిటి, మీరు ఒక మేలైన వస్తువుకు బదులుగా ఒక అధమమైన వస్తువును తీసుకోవాలనుకుంటున్నారా? అలాగయితే ఏదయినా పట్టణానికి వెళ్ళండి. అక్కడ మీరు కోరేవన్నీ మీకు దొరుకుతాయి.' ఆ క్షణం నుంచీ వారిపై పరాభవం, దారిద్ర్యం రుద్దబడింది. వారు దైవాగ్రహానికి పాత్రులయ్యారు. వారు దైవ సూచనలను తిరస్కరించటం వల్ల, దైవప్రవక్తలను అన్యాయంగా చంపేవారైనందువల్ల వారికి ఈ శాస్తి జరిగింది. ఇది వారి అవిధేయత, హద్దులను అతిక్రమించిన దాని పర్యవసానమే.

62. నిశ్చయంగా విశ్వాసులుగానీ, యూదులు గానీ, క్రైస్తవులు గానీ, సాబియీలు గానీ – వారిలో ఎవరయినాసరే అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించి సత్కార్యాలు చేసినట్లయితే వారి కొరకు వారి ప్రభువు వద్ద ప్రతిఫలం ఉంటుంది. వారికెలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు.

63. (ఇస్రాయీలు వంశీయులారా!) తూరు పర్వతాన్ని మీ పైకి ఎత్తి, మీ చేత ప్రమాణం చేయించినప్పటి సందర్భాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. అప్పుడు మేమిలా అన్నాము : 'మేము మీకు ప్రసాదించిన దానిని గట్టిగా పట్టుకోండి. అందులో ఉన్న విషయాలను బాగా గుర్తుంచుకోండి. అలా చేస్తే (దౌష్ట్యాల నుండి) మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం ఉంది.
64. కాని ఆ తరువాత మీరు దాని నుండి మరలిపోయారు. ఒకవేళ దైవకృప, ఆయన కారుణ్యం గనక మీపై లేకుంటే మీరు సర్వనాశనమైపోయేవారే.
65. శనివారం విషయంలో దైవాజ్ఞను అతిక్రమించిన వారి గురించి మీకు తెలిసిందే. మేము వారిని, 'నీచమైన కోతులుగా మారిపోండి' అని శపించాము. 66. మరి మేము ఆ సంఘటనను సమకాలికులకు, భావితరాల వారికి గుణపాఠంగా చేశాము. భయభక్తులు కలవారి కొరకు మేమందులో హితబోధను పొందుపరిచాము.

67. మూసా తన జాతి వారితో 'దేవుడు మిమ్మల్ని ఒక ఆవును బలివ్వవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాడ'ని అన్నప్పుడు, వారు 'ఏమిటీ, నువ్వు మాతో పరిహాసమాడుతున్నావా?' అన్నారు. దానికి మూసా, 'అలాంటి మూర్ఖుడు కావటం పట్ల నేను దేవుని శరణు కోరుతున్నాను' అన్నాడు.

68. 'అయితే ఆ ఆవు ఎలాంటిదై ఉండాలో మాకు విడమరచి చెప్పవలసిందిగా నీ ప్రభువుకు విజ్ఞప్తి చెయ్యి' అని వారన్నారు. దానికి మూసా, 'ఆ ఆవు మరీ ముసలిదిగానీ, మరీ పడుచుది గానీ కాకుండా ఆ రెంటికీ మధ్యలో ఉండాలి అని దేవుడు సెలవిస్తున్నాడు. కాబట్టి మీకివ్వబడిన ఆదేశం ప్రకారం చేయండి' అన్నాడు. 69. 'దాని రంగు ఎలా ఉండాలో మాకు వివరించమని కాస్త నీ ప్రభువును అడగవయ్యా!' అని వారు మళ్ళీ పేచీపెట్టారు. మూసా ఇలా అన్నాడు : 'అది పసుపు పచ్చగా, కంటికి ఆకర్షణీయంగా కనిపించాలన్నది దైవాజ్ఞ.' 70. వారిలా అన్నారు : 'అదెలా ఉండాలో మరింత స్పష్టంగా మాకు వివరించమని నీ ప్రభువును ప్రార్థించు. ఎందుకంటే ఆవు విషయంలో మేము మీమాంసకు లోనయ్యాము. దైవచిత్తమయితే మేము సరైన నిర్ధారణకు వస్తాము.' 71. మూసా సమాధానమిచ్చాడు : 'మీ ప్రభువు ఇలా సెలవిచ్చాడు – ఆ ఆవు పని చేయించుకోబడేది గానీ, నేల దున్నేది గానీ, పొలాలకు నీరందించేది గానీ అయి ఉండకూడదు. ఎలాంటి మచ్చ లేకుండా సురక్షితంగా ఉండాలి (సరేనా!?).' దానికి వారు, 'ఆc. ఇప్పుడు నువ్వు బాగా అర్థమయ్యేటట్లు చెప్పావ్' అన్నారు. ఎట్టకేలకు వారు దానిని బలి ఇచ్చారు. వారి ధోరణి చూస్తే అలా చేస్తారని అనిపించలేదు. 72. మీరొక వ్యక్తిని చంపినపుడు, ఆ నేరాన్ని ఒండొకరిపై మోపసాగారు. కాని మీ లోగుట్టును రట్టు చేయాలన్నదే దేవుని అభిమతం. 73. అందుకే, దాని (ఆవు) మాంసపు ముక్కతో మృతుని దేహానికేసి కొట్టండి అని మేము ఆజ్ఞాపించాము. ఇదేవిధంగా దేవుడు మృతులను బ్రతికిస్తాడు. మీరు అర్థం చేసుకోగలందులకు ఆయన తన సూచనలను (మహిమలను) మీకు చూపుతున్నాడు.

74. దీని తరువాత కూడా మీ హృదయాలు కఠినమయిపోయాయి. శిలల మాదిరిగా! లేదా వాటికంటే కఠినంగా అయిపోయాయి. కొన్ని రకాల శిలలలో నుంచి నీటి కాలువలు పుట్టుకొస్తాయి. మరికొన్ని శిలలు పగిలినపుడు వాటి నుంచి నీళ్లు చిమ్ముకొస్తాయి. ఇంకా కొన్ని శిలలయితే దైవభీతితో (కంపించి) క్రిందపడిపోతాయి. మీ కార్యకలాపాల పట్ల దేవుడు అజాగ్రత్తగా లేడు సుమా!

75. ఏమిటి, మీరు చెప్పినంత మాత్రాన ఈ యూదులు విశ్వసిస్తారని మీరు ఆశిస్తున్నారా? నిజానికి వారిలో కొంతమంది దైవ వాక్కును విని, అర్థం చేసుకున్న మీదట కూడా ఉద్దేశ్యపూర్వకంగా దానిని మార్చివేసేవారు. 76. వారు విశ్వాసులను కలిసినప్పుడు, 'మేమూ విశ్వాసులమేనండీ!' అనంటారు. కాని వారు ఏకాంతంలో తమ వారిని కలుసుకున్నప్పుడు, ఒండొకరితో 'దేవుడు మీకు స్పష్టపరచిన విషయాలను వారికి తెలియజేస్తారేమిటి? దాని ఆధారంగా వారు మీ ప్రభువు సమక్షంలో మీతో వాదించటానికా? ఆ మాత్రం అర్థం చేసుకోరేమిటి?' అనంటారు. 77. వారు దాచిపెట్టేదీ, చాటిచెప్పేదీ – అంతా దేవునికి తెలుసు అన్న సంగతి వారికి తెలియదా ఏమి?

78. వారిలో నిరక్షరాస్యులు కొందరున్నారు. వారికి బొత్తిగా గ్రంథజ్ఞానం లేదు – వట్టి ఆశలు తప్ప! వారు కేవలం ఊహాలోకాల్లో విహరిస్తూ ఉంటారు. 79. తమ స్వహస్తాలతో గ్రంథం వ్రాసుకుని, ఇది దేవుని తరఫున వచ్చిన గ్రంథమని బుకాయించే వారికి వినాశం తథ్యం – తద్వారా వారు కొద్దిపాటి మూల్యం పొందజూస్తారు. వారి చేతులు లిఖించినది వారి వినాశానికే కారణభూతమవుతుంది. వారి ఈ సంపాదన కూడా వారి ముప్పుకు కారణమవుతుంది. 80. 'లెక్కించదగిన కొన్ని దినాలు తప్ప మమ్మల్ని నరకాగ్ని తాకదు' అని వారంటున్నారు. వారిని అడుగు : "ఏమిటీ, ఆ మేరకు మీరు దేవుని నుండి వాగ్దానం పొందారా? – దానికి వ్యతిరేకంగా ఆయన వ్యవహరించక పోవటానికి? లేక దేవుని గురించి మీకు తెలియని దానిని అంటున్నారా? 81. ఖచ్చితంగా! ఎవడయితే చెడును మూటకట్టుకున్నాడో, ఎవడి పాపాలు అతనిని చుట్టుముట్టాయో – అలాంటివారే నరకవాసులు. వారందులో శాశ్వతంగా ఉంటారు. 82. మరెవరు విశ్వసించి, సత్కార్యాలు చేశారో – వారే స్వర్గవాసులు. వారందులో శాశ్వతంగా ఉంటారు.

83. మేము ఇస్రాయీలు సంతతి వారి నుండి ఈ వాగ్దానం (కూడా) తీసుకున్నాము : 'మీరు అల్లాహ్‌ను తప్ప వేరెవరినీ పూజించకూడదు. తల్లిదండ్రుల యెడల, బంధువుల యెడల, అనాథల, అగత్యపరుల యెడల

ఉత్తమంగా వ్యవహరించాలి. ప్రజలను మృదువుగా పలకరించాలి. నమాజును స్థాపించాలి. జకాత్ ఇస్తూ ఉండాలి.' అయితే మీలో కొద్దిమంది తప్ప అందరూ ఆ వాగ్దానం నుండి తిరిగిపోయారు. విముఖత చూపటం మీకు మామూలేగా!

84. మీలో మీరు రక్తపాతం సృష్టించరాదనీ, మీ తోటి వారిని ఇండ్ల నుండి గెంటివేయరాదని మేము మీ నుండి వాగ్దానం తీసుకున్నప్పుడు, దానికి మీరు ఒప్పుకున్నారు. దానికి మీరే సాక్షులు. 85. కాని మీరు ఒండొకరిని చంపుకుంటున్నారు. మీలోని ఒక వర్గం వారిని వారి స్వస్థలాల నుండి తరిమివేస్తున్నారు. వారికి వ్యతిరేకంగా, వారి శత్రువులకు మీరు సాయం చేస్తున్నారు – పాపానికి, దౌర్జన్యానికి ఒడిగడుతూ! మరి వారు ఖైదీలుగా మీ వద్దకు వచ్చినపుడు, నష్టపరిహారం ఇచ్చి వారిని విడిపిస్తారు. అసలు వారిని వెళ్ళగొట్టడమే అధర్మం. ఏమిటీ, మీరు దైవగ్రంథంలోని ఒక భాగాన్ని విశ్వసించి, మరో భాగాన్ని తిరస్కరిస్తున్నారా? మీలో ఇలా చేసేవారికి శిక్షగా ఇహలోక జీవితంలో పరాభవం తప్ప ఇంకేముంటుంది? ప్రళయదినాన అయితే వారు తీవ్రమయిన యాతనకు గురిచేయబడతారు. దేవుడు మీ చేష్టలను గమనించటం లేదని అనుకోకండి. 86. ఇలాంటి వారే పరలోకానికి బదులుగా ఇహలోక జీవితాన్ని కొనుగోలు చేసిన వారు. కనుక వారికి విధించే శిక్షను తగ్గించటం గానీ, వారికి సహాయం అందటం గానీ జరగదు.

87. మేము మూసాకు గ్రంథం వొసగాము. అతని తరువాత ప్రవక్తలను ఎడతెగకుండా పంపాము. మర్యమ్ కుమారుడగు ఈసాకు స్పష్టమయిన సూచనలు ఇచ్చాము. పరిశుద్ధాత్మ ద్వారా అతన్ని బలపరిచాము. ఎప్పుడు, ఏ ప్రవక్త మీ మనసు మెచ్చని విషయాన్ని మీ వద్దకు తెచ్చినా మీరు అహంకారం ప్రదర్శించారు. వారిలో కొందరిని అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. మరికొందరిని తుదముట్టించారు. 88. 'మా హృదయాలు భద్రంగా ఉన్నాయి' అని యూదులంటున్నారు. అది కాదు, వారి తిరస్కార వైఖరి కారణంగా దేవుడు వారిని శపించాడు. అందుకే వారు విశ్వసించేది బహు తక్కువ. 89. దేవుని తరఫు నుండి వారి వద్దకు ఎప్పుడు గ్రంథం వచ్చినా, అది వారి వద్ద ఉన్న గ్రంథాన్ని ధ్రువపరుస్తూ ఉన్నా వారి వైఖరి

మారలేదు. అంతకు ముందైతే వారు అవిశ్వాసులపై తమకు విజయం చేకూర్చమని ప్రార్థించేవారు. తీరా అది (ఖుర్ఆన్) తమ వద్దకు వచ్చాక, దానిని గుర్తించి కూడా తిరస్కరించారు. ఇలాంటి సత్య తిరస్కారులపై దేవుని శాపం విరుచుకుపడుగాక! 90. ఏ వస్తువుకు బదులుగా వారు తమ స్వయాన్ని అమ్ముకున్నారో అది అత్యంత చెడ్డది. వారు దేవుడు అవతరింపజేసిన వాక్కును తిరస్కరిస్తున్నారు – దేవుడు తన అనుగ్రహంతో తన దాసులలో తాను కోరిన వానిపై దానిని అవతరింపజేశాడన్న అక్కసుతో! వారు ఆగ్రహంపై ఆగ్రహాన్ని ఆర్జించారు. తిరస్కారులకు అవమానకరమయిన శిక్ష కలదు.

91. 'దేవుడు అవతరింపజేసిన వాక్కును విశ్వసించండి' అని వారితో అన్నప్పుడు, 'మాపై అవతరించిన దానినే మేము విశ్వసిస్తామ'ని వారంటారు. దాని తరువాత వచ్చిన దానిని–వాస్తవానికి అది సత్యమైనప్పటికీ, తమ వద్ద ఉన్న దానిని సత్యమని అది ధృవీకరిస్తున్నప్పటికీ – వారు తిరస్కరిస్తున్నారు. వారిని అడుగు : 'మీరు నిజంగా విశ్వాసులే అయితే మీకు పూర్వం వచ్చిన దైవప్రవక్తలను ఎందుకు హత్యచేసినట్లు?' 92. మూసా మీ వద్దకు స్పష్టమయిన మహిమలను తీసుకువచ్చాడు. కాని అతను వెళ్ళగానే – అతని వెనుక – మీరు ఆవు దూడను పూజించటం మొదలెట్టారు. అసలు మీరు దుర్మార్గులు! 93. మేము తూరు పర్వతాన్ని మీపైకి ఎత్తి, మీ నుండి వాగ్దానం తీసుకున్నప్పుడు, 'మీకు అనుగ్రహించబడిన దానిని గట్టిగా పట్టుకోండి, బాగా వినండి' అన్నాము. దానికి వారు, 'మేము విన్నాముగాని ఒప్పుకోలేదు' అని జవాబిచ్చారు. అసలు విషయం ఏమిటంటే వారిలోని అవిశ్వాస గుణం మూలంగా వారి హృదయాలలో ఆవు దూడ ప్రేమ అల్లుకుపోయింది. వారితో అనండి : 'మీరు గనక విశ్వాసులే అయితే, మీ విశ్వాసం మీకు నేర్పుతున్న విషయం ఎంత చెడ్డది!?' 94. వారితో అను : 'ఒకవేళ దేవుని వద్ద పరలోక నిలయం ఇతరులెవరికీ కాకుండా కేవలం మీ కొరకే ప్రత్యేకమై ఉంటే, మీరు మీ వాదనలో సత్యవంతులే అయితే మీరు చావును కోరుకోండి.' 95. కాని వారు తమ ముందుకు పంపుకున్న స్వయంకృతాల కారణంగా, వారెన్నటికీ చావును కోరుకోరు. దుర్మార్గుల సంగతి అల్లాహ్‌కు బాగా తెలుసు.

96. జీవితం పట్ల అందరికన్నా ఎక్కువ ఆశ వారికే ఉందన్న విషయాన్ని నీవు గ్రహిస్తావు. ఈ విషయంలో వారు బహుదైవారాధకులను సయితం మించిపోయారు. వారిలో ప్రతి ఒక్కడూ వెయ్యేండ్లపాటు జీవించాలని కాంక్షిస్తున్నాడు. ఇంతటి దీర్ఘాయుష్షు పొందినా, అది వారిని (మా) శిక్ష నుండి కాపాడజాలదు. వారి చర్యలన్నింటినీ దేవుడు గమనిస్తూనే ఉన్నాడు.

97. వారికి చెప్పు : జిబ్రీల్‌కు విరోధి అయిన వాడెవడయినాసరే (అతనొక వాస్తవం తెలుసుకోవాలి). అతను దైవాజ్ఞతోనే ఈ వాక్కు (ఖుర్‌ఆన్)ను నీ హృదయంపై అవతరింపజేశాడు. ఇది తనకు పూర్వం ఉన్న దానిని సత్యమని ధ్రువపరుస్తుంది. విశ్వాసుల కొరకు అది మార్గ దర్శకంగా, శుభవార్తగా ఉంది. 98.ఎవడు దైవానికి, ఆయన దూతలకు, ఆయన ప్రవక్తలకు, జిబ్రీల్ – మేకాయిూల్‌లకు విరోధిగా ఉంటాడో అటువంటి సత్య తిరస్కారులకు దేవుడు విరోధి అవుతాడు. 99. మేము నీపై చాలా స్పష్టమయిన సూచనలను అవతరింపజేశాము. హద్దుమీరిపోయే పాపాత్ములు తప్ప ఎవరూ వాటిని తిరస్కరించరు. 100. ఏమిటీ, ఎప్పుడు వారు వాగ్దానం చేసినా, వారిలోని ఒక వర్గం దానిని భంగపరుస్తుందా? అసలు వారిలోని అనేకులు విశ్వసించేవారు కాదు. 101. తమ గ్రంథాన్ని సత్యమని ధ్రువపరిచే ప్రవక్త దేవుని తరఫు నుండి వారి వద్దకు వచ్చినపుడు, గ్రంథం వొసగబడిన ప్రజలలోని ఒక వర్గం వారు, తమకసలు ఏమీ తెలియనట్లు దైవగ్రంథాన్ని తమ వీపు వెనుక పడవేశారు.

102. వారు సులైమాన్ రాజ్య కాలంలో షైతానులు అవలంబించిన క్షుద్రవిద్య వెనుక పడిపోయారు. యదార్థానికి సులైమాను తిరస్కారానికి ఒడిగట్టలేదు. ఈ దుష్టశక్తులు మాత్రమే అవిశ్వాస పోకడకు ఒడిగట్టాయి. వారు జనులకు చేతబడి (క్షుద్రవిద్య) నేర్పేవారు. వారు బాబిలోనియాలో హారూత్, మారూత్ అనే ఇద్దరు దైవదూతలపై అవతరించిన విషయాల వెంట పడ్డారు. వారెప్పుడు ఎవరికి ఈ విద్య నేర్పినా ఈ విధంగా చెప్పి మరీ నేర్పేవారు : "మేమొక పరీక్షగా ఉన్నాము. కాబట్టి నీవు మాత్రం సత్య తిరస్కారానికి పాల్పడకు". అయినాసరే జనులు వారి నుండి భార్యాభర్తలను

విడదీసే క్షుద్రవిద్యను నేర్చుకునేవారు. యదార్థానికి వారు దైవాజ్ఞ కానంత వరకూ ఆ చేతబడి ద్వారా ఎవరికీ ఎలాంటి హాని కలిగించలేరు. తమకు నష్టమే తప్ప, ఎలాంటి లాభం కలిగించలేని విద్యను వారు నేర్చుకుంటున్నారు. ఆ క్షుద్రవిద్యను కొనుగోలు చేసిన వారికి పరలోకంలో ఎలాంటి భాగం ఉండదన్న విషయం వారికి సయితం తెలుసు. ఎంత నికృష్టమైన వస్తువుకు బదులుగా వారు తమ ఆత్మలను అమ్ముకుంటున్నారో వారికి తెలిస్తే ఎంత బాగుండేది! 103. వారే గనక విశ్వాసులై, దైవభీతి పరాయణతను అవలంబించి ఉంటే, దేవుని వద్ద ప్రతిఫలం పొంది ఉండేవారు. ఆ విషయాన్ని వారు తెలుసుకుని ఉంటే ఎంత బావుండేది?

104. ఓ విశ్వాసులారా! మీరు (ప్రవక్త ముందు) 'రాయినా' అని అనకండి. 'ఉన్‌జుర్నా' అని అనండి. చెప్పేది శ్రద్ధగా వినండి. సత్య తిరస్కారులకు బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 105. సత్య తిరస్కారానికి ఒడిగట్టిన వారు – వారు గ్రంథం కలవారుగాని, ముష్రిక్కులు గానీ – నీ ప్రభువు తరఫు నుండి నీపైన ఏ మంచి విషయమయినా అవతరించటాన్ని బొత్తిగా ఇష్టపడరు. అయితే దేవుడు తాను కోరిన వారిని తన కారుణ్యం కొరకు ఎంపిక చేసుకుంటాడు. అల్లాహ్ గొప్ప అనుగ్రహభాగ్యం కలవాడు. 106. మేము ఏ సూక్తిని ఉపసంహరించుకున్నా లేదా మరపింపజేసినా దాని స్థానంలో అంతకంటే ఉత్తమమయిన లేదా అటువంటిదే మరో సూక్తిని తీసుకువస్తాము. ఏమిటి, దేవుడు ప్రతిదానిపై అధికారం కలవాడన్న సంగతి మీకు తెలియదా? 107. ఏమిటీ, భూమ్యాకాశాల రాజ్యాధికారం అల్లాహ్‌దేనని, ఆయన తప్ప వేరెవరూ మీకు రక్షకుడూ, సహాయకుడూ కాదన్న సంగతి నీకు తెలియదా? 108. ఏమిటీ, పూర్వం మూసాకు అడగబడినటువంటి ప్రశ్నలే మీరు మీ ప్రవక్తను అడగదలుస్తున్నారా? ఎవడు విశ్వాసాన్ని అవిశ్వాసంతో మార్పిడి చేశాడో నిశ్చయంగా అతడు రాచబాట నుండి తప్పిపోయాడు. 109. గ్రంథం కల వారిలో చాలామంది మీరు విశ్వసించిన మీదట, ఎలాగయినా సరే మిమ్మల్ని అవిశ్వాసులుగా మార్చాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నారు. సత్యం వారి ముందు ప్రస్ఫుటం అయ్యాక

కూడా, కేవలం తమ అంతర్యాలలో ఉన్న ఈర్ష్య వల్ల వారు ఆ విధంగా చేస్తున్నారు. కాబట్టి దైవాజ్ఞ వచ్చే వరకూ మన్నింపుల వైఖరిని అవలంబించండి. ఉపేక్షించండి. నిశ్చయంగా దేవుడు అన్నింటిపై అధికారం కలవాడు. 110. నమాజును స్థాపించండి. జకాత్ ఇస్తూ ఉండండి. మీరు మీ స్వయం కొరకు ఏ మేలును ముందుగా పంపుకున్నా, దానిని దేవుని వద్ద పొందుతారు. నిశ్చయంగా మీరు చేసే పనులన్నింటినీ దేవుడు గమనిస్తూనే ఉన్నాడు. 111. యూదులు లేదా క్రైస్తవులు మాత్రమే స్వర్గానికి వెళతారని వారంటున్నారు. ఇవి వారి ఆశలు, అభిలాషలు మాత్రమే. 'మీరు చెప్పేదే నిజమయితే (దానికి) మీ ప్రమాణం ఏమిటో తీసుకురండి' అని వారితో అనండి. 112. ఇది తథ్యం! ఎవరయితే తనను తాను దైవానికి సమర్పించుకున్నాడో, చిత్తశుద్ధి కూడా కలిగి ఉన్నాడో, అలాంటి వ్యక్తికి అతని ప్రభువు వద్ద మంచి ప్రతిఫలం ఉంది. అలాంటి వారికి ఏ విధమయిన భయంగానీ, దుఃఖంగానీ ఉండదు.

113. క్రైస్తవులకు ఏ ప్రాతిపదికా లేదని యూదులంటున్నారు. యూదులకు ఏ భూమికా లేదని క్రైస్తవులు అంటున్నారు. చూడబోతే వారంతా గ్రంథ పారాయణం చేసేవారే. విద్యా గంధం లేనివాళ్ళు కూడా ఇలాంటి ప్రేలాపనలే చేస్తున్నారు. కాబట్టి దేవుడు ప్రళయదినాన వారిమధ్య ఏర్పడిన భేదాభిప్రాయంపై తీర్పు చేస్తాడు. 114. దేవుని మస్జిదులలో ఆయన నామ స్మరణ జరగకుండా అడ్డుకుని, వాటిని పాడు చేయటానికి ప్రయత్నించే వాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? అలాంటివారు ఒకవేళ మస్జిదులలో ప్రవేశించినా దైవానికి భయపడుతూనే ప్రవేశించాల్సింది. వారికి ఇహలోకంలో పరాభవం తథ్యం. పరలోకంలోనయితే ఘోరమైన శిక్ష ఉంటుంది. 115. తూర్పు పడమరలు అల్లాహ్‌కు చెందినవే. మీరు ఎటు వైపు తిరిగినా అటు అల్లాహ్ ఉంటాడు. నిశ్చయంగా అల్లాహ్ విశాల సంపన్నుడు. సర్వం తెలిసినవాడు. 116. దేవునికి కుమారుడు ఉన్నాడని వారంటున్నారు. ఇలాంటి వాటి నుండి ఆయన పరిశుద్ధుడు. పైగా భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనదే. అన్నీ ఆయన ఆజ్ఞకు బద్ధమై

ఉన్నాయి. 117. భూమ్యాకాశాలను ఆయన వినూత్నంగా సృష్టించనున్నాడు. ఆయన ఏ పనినయినా చేయాలని నిర్థారించుకున్నప్పుడు, దానినుద్దేశించి, 'అయిపో' అంటాడు. అంతే, అది అయిపోతుంది.

118. జ్ఞానం లేనివారు, 'దేవుడు మాతో ఎందుకు మాట్లాడడు?' లేదా 'మా వద్దకు ఏదయినా సూచన ఎందుకు రాదు?' అనంటారు. వారి పూర్వీకులు కూడా వారి మాదిరిగానే చెప్పి ఉన్నారు. వారందరి హృదయాలు ఒకే విధమైనవి. యదార్థానికి మేము నమ్మేవారి కొరకు సూచనలను ప్రస్ఫుటం చేసే ఉంచాము. 119. నిశ్చయంగా మేము నీకు సత్యధర్మాన్ని ఇచ్చి, శుభవార్తను వినిపించేవానిగా, భయపెట్టేవానిగా చేసి పంపాము. నరకానికి పోయే వారి గురించి నిన్ను ఏ విధంగానూ ప్రశ్నించటం జరగదు. 120. యూదులయినా, క్రైస్తవులయినా నీవు వారి విధానాన్ని అనుసరిం చనంతవరకూ వారు నీ పట్ల ప్రసన్నులవరు. దేవుడు చూపిన మార్గమే సిసలయిన మార్గమని నీవు వారికి చెప్పేయ్. నీ వద్దకు (సత్య) జ్ఞానం వచ్చిన తరువాత కూడా నీవు గనక వారి కోరికలను అనుసరించావంటే, దైవానికి ప్రతిగా నీకు అండగా నిలిచే సంరక్షకుడుగానీ, సహాయకుడు గానీ ఎవడూ ఉండడు. 121. మేము గ్రంథం వొసగినవారు దానిని పఠించవలసిన రీతిలో పఠిస్తారు. ఇలాంటివారే దానిని విశ్వసిస్తారు. మరెవరు దానిపట్ల తిరస్కార వైఖరిని అవలంబిస్తారో, అలాంటివారే నష్టపోయేవారు.

122. ఓ ఇస్రాయీలు సంతతివారలారా! నేను మీపై కురిపించిన అనుగ్రహ భాగ్యాన్ని, లోకవాసులందరిపై మీకు వొసగిన ఆధిక్యతను గురించి స్మరించుకోండి. 123. ఎవరూ ఎవరికీ, ఏ విధంగానూ తోడ్పడలేని, ఎవరి తరఫు నుండీ ఎటువంటి పరిహారం స్వీకరించబడని, ఎవరి సిఫారసూ ఉపయోగపడని, వారికి ఏ సహాయమూ అందని ఆ దినానికి భయపడండి. 124. ఇబ్రాహీమును అతని ప్రభువు పలు విషయాలలో – పరిపరి విధాలుగా – పరీక్షించినపుడు, అతను వాటన్నింటిలోనూ నెగ్గాడు. అప్పుడు దేవుడు, 'నేను నిన్ను సమస్త మానవాళికి పీష్వాగా చేస్తాన'న్నాడు. దానికి ఇబ్రాహీమ్, 'నా సంతానంలో నుండి కూడానా!?' అని (ఆశగా) అడిగాడు. 'నా వాగ్దానం దుర్మార్గులకు వర్తించదు' అని దేవుడన్నాడు.

125. మేము కాబా (గృహము)ను ప్రజలు సమావేశమయ్యే స్థలంగా, ప్రశాంత క్షేత్రంగా చేసినపుడు, ఇబ్రాహీము నిలబడిన చోటును నమాజు చేసే స్థలంగా చేసుకోమని ఆదేశించాము. 'నా ఈ ఆరాధనా క్షేత్రాన్ని ప్రదక్షిణ చేసేవారి, ఏతెకాఫ్ పాటించేవారి, రుకూ సజ్దాలు చేసేవారి కొరకు పరిశు భ్రంగా (పరిశుద్ధంగా) ఉంచాలి' అని మేము ఇబ్రాహీము, ఇస్మాయీలులకు గట్టిగా తాకీదు చేశాము.

126. 'నా ప్రభూ! ఈ నగరాన్ని శాంతి నగరంగా చెయ్యి. ఇక్కడ నివసించేవారిలో దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించే వారికి పండ్లు ఫలాలను ఉపాధిగా ప్రసాదించు' అని ఇబ్రాహీము ప్రార్థించినపుడు దేవుడిలా సెలవిచ్చాడు : 'తిరస్కరించే వారికి కూడా నేను కొన్నాళ్ళపాటు ప్రయోజనం చేకూర్చుతాను. తరువాత వారిని అగ్ని యాతన వైపు ఈడుస్తాను. అది అత్యంత దుర్భరమయిన ప్రదేశం.'

127. ఇబ్రాహీమ్, ఇస్మాయీల్‌లు కాబా గృహ గోడలను నిర్మిస్తు న్నప్పుడు, వారిరువురూ ఇలా ప్రార్థించేవారు : 'ప్రభూ! మా ఈ సేవను ఆమోదించు. నిశ్చయంగా నీవు అంతా వినేవాడవు, అన్నీ తెలిసినవాడవు. 128. ప్రభూ! మమ్మి నీ విధేయులుగా చేసుకో. మా సంతతి నుండి కూడా నీ విధేయతకు కట్టుబడి ఉండే సముదాయాన్ని ప్రభవింపజెయ్యి. మాకు మా ఆరాధనా పద్ధతులను తెలియజెయ్యి. మమ్మి క్షమించు. నిశ్చయంగా నీవు క్షమించేవాడవు. దయ చూపేవాడవు. 129. మా ప్రభూ! ఇంకా వారిలో – నీ సూక్తులను వారికి వినిపించే, గ్రంథం గురించి, వివేకం గురించి బోధపరిచే, వారిని పరిశుద్ధపరిచే ఒక ప్రవక్తను స్వయంగా వారిలో నుండే ప్రభవింపజెయ్యి. నిశ్చయంగా నీవు గొప్ప శక్తిమంతుడవు, వివేక సంపన్నుడవు.'

130. ఇబ్రాహీము విధానాన్ని (ధర్మాన్ని) ఇష్టపడని వాడెవడుంటాడు – వట్టి శుంఠ తప్ప! నిజానికి మేమతన్ని ప్రపంచంలోనూ ఎన్నుకున్నాము. పరలోకంలో కూడా అతను సజ్జనుల సరసన ఉంటాడు. 131. 'నిన్ను నీవు సమర్పించుకో' అని అతని ప్రభువు అతనితో అన్నప్పుడు, '(చిత్తం) నన్ను

నేను సకల లోక ప్రభువుకు సమర్పించుకున్నాను' అని అతను సమాధానమిచ్చాడు. 132. ఈ ఉపదేశమే ఇబ్రాహీమ్ తన సంతానానికి చేశాడు, ఇదేవిధంగా యాఖూబ్ తన పిల్లలకు, "ఓ నా కుమారులారా! దేవుడు మీ కొరకు ఈ ధర్మాన్నే ఎంపిక చేశాడు. కనుక విశ్వాస స్థితిలో తప్ప మరో స్థితిలో మీకు మరణం రాకూడదు" అని బోధపరిచాడు. 133. ఏమిటీ, యాఖూబ్‌కు మరణ ఘడియ ఆసన్నమైనపుడు మీరుగాని అక్కడ ఉన్నారా? ఆ సమయంలో ఆయన తన కుమారులతో, "నా తరువాత మీరు ఎవరిని పూజిస్తారు?" అని అడగ్గా, 'మీరు, మీ పూర్వీకులయిన ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాఖ్‌లు పూజిస్తూ వచ్చిన ఆ ఏకైక ఆరాధ్య దైవాన్నే పూజిస్తాము. మేము ఆయనకే విధేయులం' అని వారంతా అన్నారు. 134. అది గతించిన ఒక సముదాయం. వారు చేసుకున్నది వారికి లభిస్తుంది. మీరు సంపాదించుకునేది మీకు చెందుతుంది. వారి కర్మలను గురించి మిమ్మల్ని ప్రశ్నించటం జరగదు.

135. యూదులుగానో, క్రైస్తవులుగానో మారితే మీరు సన్మార్గం పొందుతారని వారంటున్నారు. అనండి : లేదు, మేమైతే ఇబ్రాహీమ్ విధానాన్ని అనుసరిస్తున్నాము. ఆయన ఏకాగ్రచిత్తంతో దేవుని వైపునకు మరలినవాడు. ఆ మహానుభావుడు బహుదైవారాధకుడు కాడు. 136. ఇలా అనండి : 'మేము అల్లాహ్‌ను విశ్వసించాము. మా వైపు అవతరించబడిన దానినీ, ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాఖ్, యాఖూబ్ మరియు వారి సంతతి వైపు అవతరించిన దానినీ, ఇంకా మూసా, ఈసాలకు వొసగబడిన దానినీ, ప్రవక్తలందరికీ వారి ప్రభువు తరపు నుండి ప్రసాదించబడిన దానిని కూడా మేము విశ్వసించాము. మేము వారి మధ్య ఎలాంటి భేదభావం పాటించము. మేము ఆయన విధేయతకే కట్టుబడిన వారము.' 137. వారు గనక మీరు విశ్వసించినట్లే విశ్వసిస్తే, ఖచ్చితంగా వారు సన్మార్గం పొందగలరు. ఒకవేళ వారు మరలిపోతే మంకుతనం చూపినట్లే. (వారి సంగతి చూసుకోవటానికి) నీకు అల్లాహ్ చాలు. ఆయన అంతా ఆలకించేవాడు, సమస్తం తెలిసినవాడు. 138. (అనండి) మేము అల్లాహ్ రంగును గ్రహించాము. అల్లాహ్ రంగుకన్నా

మంచి రంగు ఎవరిది కాగలదు? మేము మాత్రం ఆయన్నే ఆరాధిస్తాము. 139. వారితో అను : 'ఏమిటీ, మీరు దేవుని విషయంలో మాతో పోట్లాడుతున్నారా? నిజానికి ఆయన మాకూ ప్రభువే. మీకూ ప్రభువే. మా కర్మలు మాకు. మీ కర్మలు మీకు. మేము కేవలం ఆయనకే అంకితం అయినవారము. 140. ఏమిటీ, ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాఖ్, యాఖూబ్ ఇంకా వారి సంతానం – వీరంతా యూదులుగానో, క్రైస్తవులుగానో ఉన్నారని మీరంటున్నారా? ఏమిటి, ఈ విషయం మీకు ఎక్కువ తెలుసా? లేక అల్లాహ్‌కా?' అని వారిని (నిలదీసి) అడుగు. అల్లాహ్ తరఫు నుండి తన దగ్గరకు వచ్చిన సాక్ష్యాన్ని దాచిపెట్టేవాడికన్నా అన్యాయపరుడు ఎవడుంటాడు? మీ చేష్టల పట్ల దేవుడు అజాగ్రత్తగా లేడు సుమా! 141. అది గతించిన ఒక సముదాయం. వారు ఆర్జించిన దానిని వారు అనుభవిస్తారు. మీరు ఆర్జించిన దానిని మీరు అనుభవిస్తారు. వారి నిర్వాకం గురించి మిమ్మల్ని ప్రశ్నించటం జరగదు.

◆ (2) 142. ప్రజాబాహుళ్యంలోని (కొందరు) మూర్ఖులు అడుగుతారు :ముస్లిములను వారి ప్రార్థనా దిక్కు (ఖిబ్లా) నుండి ఏ విషయం మరల్చింది? అని. వారికి చెప్పు : 'తూర్పు పడమరలు దైవానికే చెందుతాయి. ఆయన తాను కోరిన వారికి రుజుమార్గం చూపుతాడు.' 143. ఈ విధంగా మేము మిమ్మల్ని ఒక మధ్యస్థ సముదాయంగా చేశాము – మీరు మానవాళిపై సాక్షులుగా ఉండాలని! ప్రవక్త (సఅసం) మీపై సాక్షిగా ఉండాలని! ఎవరు ప్రవక్తను అనుసరిస్తారో, మరెవరు మడమ తిప్పి మరలిపోతారో తెలుసుకునేందుకే మేము, పూర్వం మీరు మరలి ఉండే దిక్కును మీ 'ఖిబ్లా'గా ఖరారు చేశాము. నిశ్చయంగా ఇది కష్టమయిన విషయమే. అయితే దైవమార్గ దర్శకత్వం లభించిన వారికి ఇదేమంత కష్టతరం కాదు. దేవుడు మీ విశ్వాసాన్ని వృధా కానివ్వడు. నిశ్చయంగా దేవుడు మానవుల యెడల కనికరం కలవాడు, దయాశీలుడు.

144. నీవు నీ ముఖాన్ని పదే పదే ఆకాశం వైపు ఎత్తటం మేము గమనించాము. కనుక నీవు ఇష్టపడే దిక్కు వైపునకే మేము నిన్ను

త్రిప్పుతున్నాము. ఇక నీ ముఖాన్ని మస్జిదె హరామ్ వైపు మరల్చుకో. మీరెక్కడున్నాసరే, మీ ముఖాలను దాని వైపునకే త్రిప్పుకోండి. ఇది తమ ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యమన్న విషయం గ్రంథం వొసగబడిన వారికి బాగా తెలుసు. దేవుడు వారి కార్యకలాపాల పట్ల ఏమరుపాటుకు గురై లేడు. 145. ఒకవేళ నీవు గ్రంథం ఇవ్వబడిన వారికి నిదర్శనాలన్నీ సమర్పించినా వారు నీ 'ఖిబ్లా'ను అంగీకరించరు. నీవు వారి 'ఖిబ్లా'ను అనుసరించవు. స్వయంగా వారిలో కూడా కొందరు మరికొందరి ఖిబ్లాను అంగీకరించరు. నీ వద్దకు జ్ఞానం వచ్చేసిన పిమ్మట కూడా నీవు గనక వారి మనోరథాన్ని ఈడేర్చావంటే నీవూ దుర్మార్గులలో ఒకడుగా పరిగణించ బడతావు. 146. మేము గ్రంథం ప్రసాదించిన వారు తమ కన్న కొడుకులను గుర్తుపట్టినట్లే అతనిని గుర్తుపడతారు. వారిలోని ఒక వర్గం సత్యమేదో తెలిసి కూడా దానిని కప్పిపుచ్చుతోంది. 147. నీ ప్రభువు తరఫు నుండి వచ్చినదే అసలు సత్యం. కాబట్టి నీవు సందిగ్ధంలో పడకు.

148. ప్రతి వర్గానికీ ఒక దిశ అనేది ఉంది. కనుక మీరు సత్కార్యా లలో దూసుకుపోయేందుకు కృషి చేయండి. మీరెక్కడ ఉన్నాసరే దేవుడు మిమ్మల్ని ఒకచోట సమీకరిస్తాడు. నిశ్చయంగా దేవుడు ప్రతిదీ చేయగల సమర్థుడు. 149. నీవు ఎక్కడి నుండి బయలుదేరినా నీ ముఖాన్ని మస్జిదె హరామ్ (పవిత్ర కాబా గృహం) వైపునకు త్రిప్పుకో. నిశ్చయంగా ఇది నీ ప్రభువు తరఫు నుండి ఉన్న సత్యం. మీరు చేసేదంతా దైవానికి తెలియకుండా లేదు. 150. నీవు ఏ ప్రదేశం నుండి వెడలినా నీ దిశను మస్జిదె హరామ్ (పవిత్ర కాబా గృహం) వైపు మరల్చుకో. మీరు ఎక్కడ ఉన్నాసరే – మీ ముఖాలను దాని వైపునకే త్రిప్పుకోండి. మీకు వ్యతిరేకంగా జనులకు ఎలాంటి వాదనకు ఆస్కారం కలగకుండా ఉండటానికి! ఇక వారిలోని అన్యాయస్థులంటారా, మీరు వారికి భయపడకండి, నాకు మాత్రమే భయపడండి – నా అనుగ్రహాన్ని మీపై పూర్తిచేయడానికి, ఇంకా మీరు సన్మార్గగాములు కావటానికి (మీరు ఇలా మసలుకోవటం అవసరం). 151. అలాగే మేము మీ మధ్య ఒక ప్రవక్తను స్వయంగా మీలో నుండే

పంపాము – అతను మా సూక్తులను మీకు చదివి వినిపిస్తున్నాడు. మిమ్మల్ని పరిశుద్ధపరుస్తున్నాడు. మీకు గ్రంథాన్ని బోధిస్తున్నాడు. వివేకాన్ని నేర్పుతున్నాడు. మీకు తెలియని ఎన్నో విషయాలను బోధపరుస్తున్నాడు. 152. కాబట్టి మీరు నన్ను జ్ఞాపకముంచుకోండి. నేను మిమ్మల్ని జ్ఞాపకం ఉంచుకుంటాను. నా యెడల కృతజ్ఞతా భావంతో మసలుకోండి, కృతఘ్నులు కాకండి. 153. విశ్వాసులారా! సహనం, నమాజు ద్వారా సహాయం పొందండి. నిశ్చయంగా దేవుడు సహన మూర్తులకు తోడుగా ఉన్నాడు. 154. దైవమార్గంలో చంపబడినవారిని మృతులు అనకండి. పైగా వారు సజీవంగానే ఉన్నారు. కాని ఆ వైనం మీకు తెలియదు. 155. మేము తప్పకుండా మిమ్మల్ని పరీక్షిస్తాము – కొంత భయపెట్టి, ఆకలి బాధకు గురిచేసి, ధన ప్రాణాల నష్టానికి లోనుచేసి, పంటలను తగ్గించి. (ఈ పరీక్షలో) నిలకడ చూపిన వారికి శుభవార్త వినిపించు. 156. వారి పరిస్థితి ఎలాంటిదంటే; వారికి ఎప్పుడు ఏ ఆపద వచ్చినా, 'మేము అల్లాహ్‌కే చెందినవారము, మేము మరలిపోవలసినది కూడా ఆయన వైపునకే' అనంటారు. 157. ఇలాంటి వారిపైనే దేవుని దీవెనలు, కారుణ్యం వర్షిస్తాయి. ఇలాంటి వారే సన్మార్గగాములు.

158. నిశ్చయంగా సఫా మర్వాలు దైవ చిహ్నాలలోనివి. కనుక దైవ గృహమయిన కాబాను సందర్శించి హజ్జ్ లేదా ఉమ్రహ్ చేసేవాడు వాటి ప్రదక్షిణ చేస్తే అందులో తప్పేమీ లేదు. మరెవరయినా స్వచ్ఛందంగా ఏదయినా సత్కార్యం చేస్తే, దేవుడు సత్కరించేవాడు, (సర్వం) ఎరిగినవాడు. 159. మేము గ్రంథంలో మానవుల కొరకు వాస్తవాలను క్షుణ్ణంగా విశదీకరించిన తరువాత కూడా మేము అవతరింపజేసిన నిదర్శనాలను, మార్గదర్శనాన్ని దాచిపెట్టేవారిని దేవుడు శపిస్తాడు. శపించేవారు కూడా వారిని శపిస్తారు. 160. అయితే పశ్చాత్తాపం చెంది, తమ వైఖరిని సరిదిద్దుకుని, ఉన్నదున్నట్టు విషయాన్ని వెల్లడించేవారికి నేను క్షమాభిక్ష పెడతాను. నేనున్నదే క్షమించటానికి, దయదలచటానికి! 161. నిశ్చయంగా సత్య తిరస్కారానికి ఒడిగట్టి, తిరస్కారులుగానే మరణించినవారు; అలాంటి

వారిపై దేవుడు, దైవదూతలు, మానవులందరి శాపం పడుతుంది. 162. వారందులోనే ఎల్లకాలం ఉంటారు. వారి యాతనను తగ్గించటంగానీ, వారికి విడుపు ఇవ్వటం గానీ జరగదు.

163. మీ దేవుడు ఒకే దేవుడు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేనేలేడు. ఆయన అపార కరుణామయుడు, కృపాసాగరుడు. 164. నిశ్చయంగా భూమ్యాకాశాల నిర్మాణంలో, రేయింబవళ్ళ రాకపోకలలో, ప్రజలకు ఉపయోగపడే వస్తువులను మోసుకుంటూ సముద్రాలలో నడిచే ఓడలలో, ఆకాశం నుండి దేవుడు కురిపించే వర్షపు నీటిలో – తద్వారా ఆయన మృతభూమికి జీవం పోశాడు. ఇంకా అందులో అన్ని రకాల జంతువులను వ్యాపింపజేశాడు – వీచే పవనాల మార్పిడిలో, నింగికి – నేలకు నడుమ దైవాజ్ఞాబద్ధమై కర్తవ్య పాలన చేసే మేఘ మాలికల్లో బుద్ధిని ఉపయోగించే జనులకు ఎన్నో సూచనలున్నాయి.

165. జనులలో మరి కొంతమంది ఉన్నారు – వారు నిజదైవమయిన అల్లాహ్‌ను కాదని ఇతరులను ఆయనకు సాటి కల్పిస్తున్నారు. నిజదైవాన్ని ప్రేమించవలసిన విధంగా వారిని (మిథ్యా దేవుళ్లను) ప్రేమిస్తున్నారు. అయితే విశ్వసించినవారు అందరికన్నా అధికంగా అల్లాహ్‌ను ప్రేమిస్తారు. ఈ దుర్మార్గులు తమకు పడే శిక్షను చూసుకున్నప్పుడు, సర్వశక్తులు అల్లాహ్‌కే చెందుతాయని, అల్లాహ్ చాలా కఠినంగా శిక్షించేవాడని తెలుసుకుంటారు. 166. ఆ సమయంలో వారు (ప్రపంచంలో) ఏ నాయకుల అడుగులకు మడుగులొత్తేవారో, వారు తమ అనుయాయుల గోడు ఏమీ పట్టనట్లే వేరైపోతారు. శిక్ష వారి కళ్ల ముందే కదలాడుతూ ఉంటుంది. వారి సంబంధా లన్నీ తెగిపోతాయి. 167. వారి అనుయాయులు ఇలా అంటారు: 'మాకే గనుక ప్రపంచం వైపు మరలే అవకాశం దొరికితే వీళ్లు (నాయకమన్యులు) మా నుండి వేరైపోయినట్లే మేము కూడా వీళ్ల నుండి వేరైపోతాము.' ఈ విధంగా దేవుడు వారి కర్మలను వారు సిగ్గుపడేటట్లుగా చూపిస్తాడు. ఇక వారు నరకాగ్ని నుండి బయటపడలేరు.

168. ప్రజలారా! ధరణిలోని ధర్మసమ్మతమయిన, పరిశుద్ధమయిన

వస్తువులను తినండి. షైతాన్ అడుగుజాడలలో నడవకండి. నిశ్చయంగా వాడు మీకు బద్ధ విరోధి. 169. వాడు మిమ్మల్ని కేవలం చెడు వైపు, నీతి బాహ్యత వైపు పురికొల్పుతాడు. దేవుని గురించి మీకేమాత్రం తెలియని విషయాలను ఆయన పేర చెప్పమని మిమ్మల్ని ప్రేరేపిస్తాడు. 170. 'దేవుడు అవతరింపజేసిన దానిని అనుసరించండి' అని వారితో అన్నప్పుడు, 'మేము మా తాతలు తండ్రుల మార్గాన్నే అనుసరిస్తాము'ని వారు సమాధానమిస్తారు. ఏమిటీ, వారి తాతలు తండ్రులు అవివేకులు, మార్గవిహీనులైనప్పటికీ (వారినే అనుసరిస్తారటనా)?

171. సత్యతిరస్కారుల ఉపమానం పశువుల వెనుక కేకలు పెట్టే, అరిచే వ్యక్తి లాంటిది. కేకను, అరుపును వినటం తప్ప అవి ఏమీ అర్థం చేసుకోలేవు. వారు చెవిటివారు, మూగవారు, గ్రుడ్డివారు. వారు బొత్తిగా గ్రహించరు.

172. ఓ విశ్వాసులారా! మీరు దైవాన్ని ఆరాధించేవారే అయితే మేము ప్రసాదించిన పవిత్రమయిన వస్తువులను తినండి. దైవానికి కృతజ్ఞతలు తెలుపండి. 173. దేవుడు మీకు మృత జంతువులను, రక్తాన్ని, పంది మాంసాన్ని దైవేతరుల పేర ఉచ్చరించబడిన దానిని మాత్రమే నిషేధించాడు. ఎవరయినా గత్యంతరం లేని పరిస్థితిలో, మక్కువ చూపకుండా, హద్దు మీరకుండా కొద్దిగా తింటే అది పాపం కాదు. నిశ్చయంగా దేవుడు క్షమించే వాడు, జాలి చూపేవాడు.

174. దేవుడు తన గ్రంథంలో అవతరింపజేసిన విషయాన్ని దాచిపెట్టేవారు, దానిని కొద్దిపాటి మూల్యానికి అమ్ముకునేవారు, తమ పొట్టలను అగ్నితో నింపుకుంటున్నారు. ప్రళయదినాన దేవుడు వారితో మాట్లాడటం గానీ, వారిని పరిశుద్ధపరచటం గానీ చేయడు. వారికి బాధాకర మయిన శిక్ష ఉంటుంది. 175. వీరే మార్గదర్శకత్వానికి బదులుగా మార్గ భ్రష్టత్వాన్ని, క్షమాపణకు బదులుగా శిక్షను కొనుగోలు చేసినవారు. ఎటువంటి అగ్నిని ఆశ్రయించారు వారు! 176. ఇలా ఎందుకు జరిగిందంటే, దేవుడైతే తన గ్రంథాన్ని సత్యబద్ధంగానే అవతరింపజేశాడు. కాని వారు

గ్రంథంలో నుండి అనేక దారులు తీసుకున్నారు. తమ పంతం నెగ్గించుకోవటానికి బహుదూరం వెళ్ళిపోయారు.

177. మీరు మీ ముఖాలను తూర్పుకో లేక పడమరకో త్రిప్పుకోవటమే సత్కార్యం కాదు. సత్కార్యం అంటే మనిషి దైవాన్నీ, అంతిమదినాన్నీ, దైవదూతలను, దైవగ్రంథాన్నీ, దైవప్రవక్తలనూ విశ్వసించటం. దైవ ప్రసన్నత నిమిత్తం బంధువులకు, అనాథలకు, అగత్యపరులకు, బాటసారులకు, యాచించే వారికి ధనాన్ని ఇవ్వటం. బానిసల విముక్తికై ధన వ్యయం చేయటం. ఇంకా నమాజును స్థాపించాలి, జకాత్ చెల్లించాలి. చేసిన వాగ్దానాన్ని నెరవేర్చాలి. లేమిలో, బాధల్లో, పోరాట సమయంలో సహన స్థయిర్యాలను ప్రదర్శించాలి. ఇలాంటివారే సత్యసంధులు. ఇలాంటివారే దైవభీతిపరులు.

178. ఓ విశ్వాసులారా! హతుల ప్రతీకార న్యాయం (ఖిసాస్) మీపై విధిగా చేయబడింది - స్వతంత్రునికి బదులుగా స్వతంత్రుణ్ణి, బానిసకు బదులుగా బానిసను, స్త్రీకి బదులుగా స్త్రీని. ఒకవేళ హతుని సోదరుడు హంతకునికి క్షమాభిక్ష పెడితే, అతను మంచిని అనుసరిస్తూ ఉత్తమ రీతిలో (రక్త శుల్కం) చెల్లించాలి. ఇది మీ ప్రభువు తరఫు నుండి ప్రసాదించబడిన రాయితీ మరియు కారుణ్యం. ఇక దీని తరువాత కూడా ఎవరయినా హద్దుమీరి ప్రవర్తిస్తే, అతనికి వ్యధాభరితమయిన శిక్ష పడుతుంది. 179. ఓ బుద్ధిమంతులారా! ప్రతీకార న్యాయం (ఖిసాస్)లో మీకు జీవనం ఉంది. తద్వారానే మీరు సురక్షితంగా ఉంటారు. 180. మీలో ఎవరికయినా మరణ సమయం ఆసన్నమై, అతను తన వెనుక ఆస్తిని వదలివెళుతున్నట్లయితే, అతను ఉత్తమ రీతిలో తన తల్లిదండ్రుల పేర, బంధువుల పేర విల్లు వ్రాయటం విధిగా నిర్ణయించబడింది. దైవానికి భయపడేవారు ఇలా చేయటం తప్పనిసరి. 181. వీలునామాను విన్న తర్వాత ఎవరయినా దానిని మార్చివేస్తే ఆ పాపం మార్చినవానికే చుట్టుకుంటుంది. నిశ్చయంగా దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 182. విల్లు వ్రాసేవాడు పక్షపాతంతో వ్యవహరించాడనో లేదా అన్యాయం చేశాడనో ఎవరికయినా అనుమానం వస్తే, అతను

సంబంధీకుల మధ్య రాజీ కుదుర్చటంలో తప్పు లేదు. నిశ్చయంగా దేవుడు క్షమాగుణం కలవాడు, కరుణామయుడు.

183. ఓ విశ్వాసులారా! మీ పూర్వీకులపై ఉపవాసం విధించబడినట్లే మీపై కూడా విధించబడింది – తద్వారా మీలో భయభక్తులు జనించే అవకాశం ఉంది. 184. లెక్కించదగిన కొన్ని దినాలు మాత్రమే. మరి మీలో ఎవరయినా వ్యాధిగ్రస్తులుగానో, ప్రయాణంలోనో ఉంటే వేరే దినాలలో ఆ లెక్కను పూర్తిచేసుకోవాలి. మరెవరయినా అతి కష్టమ్మీద ఉండవలసివస్తే, అలాంటి వారు ఒక ఉపవాసానికి బదులుగా (పరిహారంగా, ఫిదియాగా) ఒక నిరుపేదకు భోజనం పెట్టాలి. మరెవరయినా అంతకంటే ఎక్కువే సదాచరణ చేయదలచుకుంటే అది అతనికే మేలు చేకూరుస్తుంది. అయినప్పటికీ మీరు గనక తెలుసుకోగలిగితే మీరు ఉపవాసం పాటించటమే మీకు శ్రేయో దాయకం. 185. రమజాన్ నెల – అందులోనే ఖుర్ఆన్ అవతరింపజేయ బడింది. అది మానవులందరికీ మార్గదర్శిని. మార్గం చూపే స్పష్టమయిన నిదర్శనాలు అందులో ఉన్నాయి. ఇంకా అది సత్యసత్యాలను ప్రస్ఫుటం చేసే గీటురాయి. కాబట్టి మీలో ఈ నెలను పొందినవారు, దాని ఉపవాసా లుండాలి. వ్యాధిగ్రస్తులుగా ఉన్నవారు లేదా ప్రయాణంలో ఉన్నవారు, ఇతర దినాలలో ఈ లెక్కను పూర్తిచేయాలి. దేవుడు మీ కొరకు సౌలభ్యాన్ని కోరుకుంటున్నాడు. మిమ్మల్ని కష్టపెట్టాలన్న ఉద్దేశం ఆయనకు ఎంతమాత్రం లేదు. మీరు ఈ (ఉపవాసాల) లెక్కను పూర్తిచేయడానికి, సన్మార్గం చూపినందుకుగాను మీరు దేవుని ఘనతను కొనియాడటానికి, ఇంకా – మీరు ఆయనకు కృతజ్ఞులై ఉండటానికి ఆయన మీకు ఈ వెసులుబాటు కల్పించాడు.

186. నా దాసులు నా గురించి నిన్ను ప్రశ్నించినపుడు, నేను చాలా సమీపంలో ఉన్నాననీ, పిలిచేవాడు నన్ను పిలిచినపుడు, అతని పిలుపుకు సమాధానం ఇస్తానని వారికి చెప్పు. కాబట్టి వారు నా ఆజ్ఞను శిరసావ హించాలి. నన్ను విశ్వసించాలి. తద్వారానే వారు మార్గదర్శకత్వం పొందుతారు. 187. ఉపవాస కాలంలోని రాత్రిపూట మీరు మీ భార్యలతో

రతిలో పాల్గొనటం మీకు ధర్మసమ్మతం చేయబడింది. వారు మీకు దుస్తులు. మీరు వారికి దుస్తులు. మీరు ఆత్మద్రోహానికి పాల్పడుతున్న సంగతి దేవునికి తెలిసిపోయింది. అందుకే ఆయన మీపై దయదలిచాడు. మిమ్మల్ని మన్నించాడు. కాబట్టి ఇక నుంచి మీరు మీ భార్యలతో రమించండి. దేవుడు మీకు రాసిపెట్టిన దానిని అన్వేషించండి. ఉషోదయపు తెలుపు, రాత్రి నలుపు నుండి ప్రస్ఫుటం అయ్యేవరకూ తినండి, త్రాగండి. ఆ తరువాత రాత్రి చీకటి పడేవరకూ ఉపవాసం ఉండండి. మీరు మస్జిదులలో 'ఏతెకాఫ్' (దీక్ష) పాటిస్తున్నప్పుడు మీ భార్యలతో సమాగమం జరపకండి. ఇవి దేవుడు నిర్ధారించిన హద్దులు. కాబట్టి వాటి దరిదాపులకు కూడా పోకండి. ఈ విధంగా దేవుడు తన ఆదేశాలను ప్రజలకు విశదపరుస్తున్నాడు – వారు జాగ్రత్తపడాలని!

188. మీరు ఒకరి సొమ్మును మరొకరు అధర్మంగా స్వాహా చేయకండి. ఇతరుల సొమ్ములోని కొంత భాగం అక్రమంగా తినే ఉద్దేశంతో ఆ వ్యవహారాన్ని అధికారుల వద్దకు తీసుకుపోకండి. అది (అన్యాయం అన్న సంగతి) మీకూ తెలిసిందే.

189. వారు నిన్ను నెలవంక దశల గురించి ప్రశ్నిస్తున్నారు. అవి ప్రజల కొరకు, హజ్జ్ కాలం కొరకు నిర్ధారించబడిన వేళలని వారికి చెప్పు. మీరు మీ ఇండ్లలోకి కప్పుపై నుండి రావటం పుణ్యకార్యం కాదు, దైవభీతితో మసలుకోవటమే అసలు పుణ్యకార్యం. కాబట్టి మీరు మీ ఇండ్లలోకి తలుపుల గుండానే రండి. దైవభీతిని కలిగి ఉండండి – తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు. 190. దైవమార్గంలో మీతో పోరాడే వారితో మీరూ పోరాడండి. కాని మితిమీరకండి. మితిమీరే వారిని దేవుడు ఇష్టపడడు. 191. వారు ఎక్కడ తారసపడినా వధించండి. వారు మిమ్మల్ని వెళ్ళగొట్టిన చోటు నుండి మీరు కూడా వారిని వెళ్ళగొట్టండి. పీడన (ఫిత్నా) నరసంహారం కన్నా తీవ్రమైనది. 'మస్జిదె హరామ్' (కాబా పవిత్ర ఆలయం) దగ్గర మీరు వారితో యుద్ధం చేయకండి. అయితే వారు గనక మీపై కయ్యానికి కాలుదువ్వితే, అప్పుడు మీరు సంహరించవచ్చు. సత్యతిరస్కారులకు తగిన శాస్తి ఇదే.

192. మరి వారు గనక దారికి వస్తే, నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, దయాసాగరుడు. 193. వేధింపు (ఫిత్నా) సద్దుమణిగేదాకా, దైవధర్మం నెలకొనేదాకా వారితో పోరాటం సాగించండి. ఒకవేళ వారు తమ దమన నీతిని మానుకుంటే, వారిపట్ల కఠినంగా ప్రవర్తించకూడదు. అయితే దుర్మార్గులను మాత్రం దండించవచ్చు.

194. పవిత్ర మాసం పవిత్ర మాసానికి బదులుగా ఉన్నది. నిషేధాజ్ఞల ఉల్లంఘనకు కూడా ప్రతీకారం (ఖిసాస్) ఉంది. కాబట్టి మీపై ఎవరన్నా దాడిచేస్తే, వారు దాడి చేసినట్లుగానే మీరు కూడా వారిపై ఎదురుదాడి చేయండి. అయితే ఈ సందర్భంగా దైవభీతితో మసలుకోవాలి సుమా! దేవుడు దైవభక్తిపరాయణులకు తోడుగా ఉన్నాడన్న విషయాన్ని తెలుసుకోండి. 195. దైవమార్గంలో ఖర్చుపెట్టండి. చేజేతులా మిమ్మల్ని మీరు నాశనం చేసుకోకండి. ఉపకారం చేసినా ఉత్తమ రీతిలోనే చేయండి. ఉత్తమ రీతిలో ఉపకారం చేసేవారిని దేవుడు ప్రేమిస్తాడు.

196. హజ్జ్, ఉమ్రహ్‌లను దేవుని (ప్రసన్నత) కొరకు నెరవేర్చండి. ఒకవేళ మీకు అవరోధం ఎదురైతే, మీ దగ్గరున్న ఖుర్బానీ పశువునే సమర్పించండి. ఖుర్బానీ పశువు దాని స్థానానికి చేరుకోనంతవరకూ శిరోముండనం చేయించుకోకండి. మీలో అస్వస్థతకు లోనైనవారు లేదా తలలో బాధ ఉన్నవారు (శిరోముండనం ముందుగానే చేయించుకుంటే) పరిహారంగా ఉపవాసం ఉండటమో, దానం ఇవ్వటమో, ఖుర్బానీ ఇవ్వటమో చేయాలి. తరువాత ప్రశాంత పరిస్థితి ఏర్పడినపుడు, ఎవరయినా హజ్జ్ (కాలం) వరకూ ఉమ్రహ్ లబ్ది పొందదలిస్తే, అలాంటివారు తమ వద్ద ఉన్న ఖుర్బానీ (పశువు)ని సమర్పించుకోవాలి. ఖుర్బానీ సమర్పించలేనివారు హజ్జ్ దినాలలో మూడు రోజులు ఉపవాసం పాటించాలి. ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఏడు రోజులు ఉపవాసం ఉండాలి. ఇవి పూర్తిగా పది రోజులవుతాయి. మస్జిదె హరామ్‌కు దగ్గరలో నివసించని వ్యక్తికి మాత్రమే ఇది వర్తిస్తుంది. దైవానికి భయపడుతూ ఉండండి. దేవుడు కఠినంగా శిక్షించేవాడన్న సంగతిని తెలుసుకోండి. 197. హజ్జ్ నెలలు నిర్ధారితమై ఉన్నాయి. కాబట్టి

ఈ నెలలలో హజ్జ్ చేయాలని సంకల్పించుకున్న వ్యక్తి – హజ్జ్ సమయంలో – రతిక్రీడలకు, పాప విషయాలకు, ఘర్షణలకు దూరంగా ఉండాలి. మీరు ఏ మంచి పనిచేసినా దానిని దేవుడు తెలుసుకుంటాడు. ప్రయాణ సామగ్రిని సమకూర్చుకోండి. అత్యుత్తమమైన సామగ్రి దైవభీతి మాత్రమే. ఓ వివేకవంతులారా! నాకు భయపడండి.

198. (ఈ సందర్భంగా) మీరు మీ ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించినా తప్పులేదు. మరి మీరు అరఫాత్ నుండి మరలి వస్తున్నప్పుడు 'మష్అరే హరామ్' దగ్గర దైవాన్ని స్మరించండి. ఆయన సూచించిన విధంగానే ఆయన్ని స్మరించండి. లోగడ మీరు మార్గభ్రష్టులుగా ఉండేవారు. 199. తరువాత మీరు, ప్రజలు మరలే చోటు నుండే తవాఫ్ కొరకు మరలండి. దైవాన్ని క్షమాపణ కోరుకోండి. నిశ్చయంగా దేవుడు క్షమాభిక్ష పెట్టేవాడు, కరుణించేవాడు. 200. హజ్జ్ క్రియలన్నీ నెరవేర్చినమీదట దైవాన్ని స్మరించండి, మీరు మీ తాతముత్తాతలను పూర్వం జ్ఞాపకం చేసినట్లే, అంతకంటే అధికంగానే దైవాన్ని జ్ఞాపకం చేసుకోండి. జనులలో ఒకడు, 'మా ప్రభూ! మాకు ఈ లోకంలోనే ప్రసాదించు' అని అంటాడు. అలాంటివానికి పరలోకంలో ఏమీ లభించదు. 201. వారిలో ఒకడు ఇలా విన్నవించుకుంటాడు : 'మా ప్రభూ! మాకు ప్రపంచంలోనూ మేలును ప్రసాదించు, పరలోకంలోనూ మేలును ప్రసాదించు. మమ్ము అగ్ని యాతన నుండి కాపాడు.' 202. ఇలాంటి వారికే వారి సంపాదననుబట్టి వారి వాటా లభిస్తుంది. దేవుడు చాలా తొందరగా లెక్క తీసుకోనున్నాడు. 203. గణనీయమయిన ఆ దినాలలో దైవాన్ని స్మరించండి. ఎవరయినా వేగిరపడి రెండు దినాలలోనే మక్కాకు తిరిగి వచ్చినా అతనిపై ఎలాంటి దోషం లేదు. మరెవరయినా ఆగి ఉంటే అతనిపై కూడా ఎలాంటి పాపం లేదు. ఇది దైవానికి భయపడే వారికి చేయబడే సూచన. దైవానికి భయపడుతూ ఉండండి. తెలుసుకోండి! మీరంతా ఆయన వద్దకే సమీకరించబడతారు.

204. జనులలోని ఒకడు చెప్పే మాటలు ప్రాపంచిక జీవితంలో నిన్ను అలరించవచ్చు. వాడు తన మనసులో ఉన్న మాటకు దైవాన్ని సాక్షిగా

పెడుతున్నాడు. నిజానికి వాడు జగడాలమారి. 205. వాడు వెనుతిరగగానే భువిలో కల్లోలం సృష్టించే, పంటలను నాశనం చేసే, ప్రాణులకు అపకారం తలపెట్టే ప్రయత్నంలో ఉంటాడు. దేవుడైతే కల్లోలాన్ని ఎంతమాత్రం ఇష్టపడడు. 206. 'దైవానికి భయపడు' అని వాడితో అన్నప్పుడు, వాడి బడాయి వాణ్ణి పాపంపైనే తిష్ఠవేసేలా చేస్తుంది. అలాంటి వాడికి నరకం చాలు. అదెంతో చెడ్డ నివాస స్థలం. 207. దైవ ప్రసన్నతను అన్వేషించే కృషిలో తన ప్రాణాన్ని పణంగా పెట్టేవాడు కూడా ప్రజలలో ఉన్నాడు. దేవుడు తన దాసుల పట్ల అనంతమయిన కరుణగలవాడు.

208. ఓ విశ్వాసులారా! ఇస్లాంలో పూర్తిగా ప్రవేశించండి. షైతాన్ అడుగు జాడలలో నడవకండి. వాడు మీకు బహిరంగ శత్రువు. 209. మీ వద్దకు స్పష్టమయిన ఆధారాలు వచ్చేసిన తరువాత కూడా మీరు గనక డోలాయమానానికి లోనవుతే, దేవుడు సర్వశక్తిమంతుడు, వివేక సంపన్నుడని తెలుసుకోండి. 210. ఏమిటీ, దేవుడు మేఘాల నీడలో దిగివచ్చి, దైవదూతలు కూడా ఏతెంచి వ్యవహారాన్ని తేల్చాలని వారు ఎదురుచూస్తున్నారా? సమస్త వ్యవహారాలు (తీర్పు నిమిత్తం) దేవుని వద్దకే మరల్చబడతాయి. 211. ఇస్రాయీలు సంతతి వారిని అడగండి, మేము వారికి ఎన్నెన్ని స్పష్టమయిన నిదర్శనాలు ఇచ్చామో! దైవానుగ్రహం తన వద్దకు వచ్చిన పిమ్మట కూడా ఎవరయినా దానిని తారుమారు చేస్తే, నిశ్చయంగా దేవుడు కఠినంగా శిక్షించేవాడని మరువరాదు. 212. సత్య తిరస్కారుల దృష్టిలో ప్రాపంచిక జీవితం అందంగా, ఆకర్షణీయంగా చేయబడింది. వారు విశ్వసించిన వారిపై వెకిలిగా నవ్వుతున్నారు. వాస్తవానికి భక్తిపరులు ప్రళయదినాన వారికన్నా ఎంతో ఉన్నత స్థితిలో ఉంటారు. దేవుడు తాను కోరిన వారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తాడు.

213. మానవులంతా ఒకే సముదాయంగా ఉండేవారు. వారు విభేదించుకోవటం వల్ల దేవుడు ప్రవక్తలను శుభవార్త వినిపించేవారుగా, భయపెట్టేవారుగా చేసి పంపాడు. ప్రజలు విభేదించుకుంటున్న విషయాలపై తీర్పు చేయటానికి, వారి వెంట సత్యబద్ధమయిన గ్రంథాన్ని అవతరింపజేశాడు.

ఈ విభేదాలు సృష్టించిన వారెవరో కాదు, సత్యం ప్రసాదించబడినవారే, తమ వద్దకు స్పష్టమయిన మార్గదర్శక సూచనలు వచ్చిన మీదటే వారు పరస్పరం పంతాలకు పోయి తలోదారి పట్టారు. అయితే దేవుడు తన అనుజ్ఞతో వారు విభేదించుకుంటున్న విషయంలో విశ్వాసులకు సత్యం వైపు దర్శకత్వం వహించాడు. దేవుడు తాను కోరిన వారికి రుజుమార్గం వైపు దర్శకత్వం వహిస్తాడు. 214. ఏమిటీ, మీరు స్వర్గంలో ఇట్టే ప్రవేశించగలమని భావిస్తున్నారా? యదార్థానికి మీ పూర్వీకులకు ఎదురైన పరిస్థితులు మీకింకా ఎదురవనేలేదు. వారెన్నో కష్టాలకు ఓర్చుకున్నారు. బాధలు భరించారు. తీవ్రంగా కుదిపివేయబడ్డారు. చివరికి (ఆ బాధలకు తాళలేక) ప్రవక్తలు, వారితో పాటు విశ్వసించినవారు, 'ఇంతకీ దైవ సహాయం ఎప్పుడొస్తుంది?' అనేవారు. వినండి! దైవసహాయం అతి చేరువలోనే ఉంది.

215. తామేం ఖర్చుపెట్టాలి? అని ప్రజలు అడుగుతున్నారు. వారికి చెప్పు : మీరేం ఖర్చుపెట్టినా అందులో మీ తల్లిదండ్రులకు, మీ సమీప బంధువులకు, అనాథలకు, అగత్యపరులకు, బాటసారులకు హక్కు ఉంటుంది. మీరేమి ఖర్చుచేసినా, నిశ్చయంగా అది అల్లాహ్‌కు తెలుస్తుంది. 216. యుద్ధం చేయటం మీపై విధిగా చేయబడింది – అది మీకు కష్టం అనిపించినప్పటికీ. ఒక విషయం మీకు సహించకపోవచ్చు, కాని అదే మీ పాలిట శుభకరం కావచ్చు. అలాగే ఒక విషయాన్ని మీరు ఎంతగానో ఇష్టపడవచ్చు. కాని అదే మీ పాలిట హానికరం కావచ్చు. అల్లాహ్‌కు తెలుసు, మీకు తెలియదు.

217. నిషిద్ధ (పవిత్ర) మాసంలో యుద్ధం చేయటం గురించి ప్రజలు నిన్ను అడుగుతున్నారు. వారితో అను : అందులో (నిషిద్ధమాసంలో) యుద్ధం చేయటం చాలా తీవ్రమయిన విషయం. కాని దైవమార్గం నుండి ఆపటం, దైవాన్ని తిరస్కరించటం, మస్జిదె హరామ్ నుండి ఆపటం, అక్కడ నివసించేవారిని అక్కణ్ణుంచి వెళ్ళగొట్టడం దేవుని దృష్టిలో ఇంతకన్నా తీవ్రమయిన అపచారం. పీడన (ఫిత్నా) నరసంహారం కన్నా ఘోరమైనది. వారికే గనక అవకాశం చిక్కితే మిమ్మల్ని మీ ధర్మం నుండి మరల్చేవరకూ మీతో పోరాడుతూనే ఉంటారు. మీలో గనక ఎవడయినా తన ధర్మం నుండి

తిరిగిపోయి, అవిశ్వాస స్థితిలో చనిపోతే, అలాంటివారి కర్మలన్నీ ఇహపరాలలో వ్యర్థమైపోయినట్లే. ఇలాంటివారు నరకాగ్నికి ఆహుతి అవుతారు. వారందులో శాశ్వతంగా ఉంటారు. 218. నిశ్చయంగా విశ్వసించి, హిజ్రత్ చేసినవారు (వలసపోయినవారు), దైవమార్గంలో పోరాడినవారు – ఇలాంటి వారే దైవ కటాక్షానికి అభ్యర్థులు. దేవుడు క్షమాసాగరుడు, కృపాకరుడు.

219. ప్రజలు నిన్ను మద్యపానం, జూదం గురించి అడుగుతున్నారు. వారికి చెప్పు : ఈ రెండింటిలోనూ పెద్ద పాపం ఉంది, ప్రజలకు కొన్ని లాభాలూ ఉన్నాయి. అయితే వీటి లాభాలకన్నా పాపమే చాలా పెద్దది. తామేం ఖర్చుపెట్టాలి? అని వారు నిన్ను అడుగుతున్నారు. ఇలా అను : 'మీ అవసరాలకు పోగా మిగిలినది.' మీరు ఆలోచించేటందుకు గాను దేవుడు ఈ విధంగా తన ఆజ్ఞలను మీకు విశదీకరిస్తున్నాడు – 220 – ప్రపంచం గురించి, పరలోకం గురించి కూడా! ఇంకా వారు నిన్ను తండ్రిలేని బిడ్డల గురించి ప్రశ్నిస్తున్నారు. వారికి చెప్పు : "వారి కోసం ఏం చేసినా వారి బాగోగులను దృష్టియందుంచుకోవటం మంచిది. ఒకవేళ మీరు వారిని మీతో చేర్చుకుంటే వారూ మీ సహోదరులే. చెడగొట్టేవాడెవడో, చక్కదిద్దేవాడెవడో దైవానికి ఎరుకే. దేవుడే గనక తలచుకుంటే మిమ్మల్ని కష్టాల్లో పడవేసేవాడే. నిశ్చయంగా దేవుడు శక్తిమంతుడు, యుక్తిపరుడు.

221. బహుదైవారాధన చేసే స్త్రీలు విశ్వసించనంత వరకూ వారిని వివాహం (నికాహ్) చేసుకోకండి. బహుదైవారాధకురాలయిన స్త్రీ మీకు నచ్చినాసరే ఆమెకంటే విశ్వాసురాలైన ఒక బానిస స్త్రీ మేలు. మీ స్త్రీలను బహుదైవారాధకులైన పురుషులకు ఇచ్చి వివాహం చేయకండి – వారు విశ్వసించి ముస్లింలు కానంతవరకు! స్వతంత్రుడైన ఒక బహుదైవారాధకుడు మీకు నచ్చినప్పటికీ అతనికన్నా విశ్వాసి అయిన బానిస మిన్న. వారు (మిమ్మల్ని) నరకాగ్ని వైపునకు పిలుస్తున్నారు. కాగా; దేవుడు తన చిత్తంతో (మిమ్మల్ని) స్వర్గం వైపునకు, తన క్షమాపణ వైపునకు పిలుస్తున్నాడు. ప్రజలు గుణపాఠం గ్రహించాలని ఆయన తన ఆదేశాలను వారికి విపులీకరిస్తున్నాడు. 222. వారు నిన్ను బహిష్టు స్థితి గురించి కూడా ప్రశ్నిస్తున్నారు. వారికి

చెప్పు : అదొక అశుద్ధావస్థ. ఆ అశుద్ధ స్థితిలో మీరు స్త్రీలకు దూరంగా ఉండండి. వారు పరిశుద్ధలు కానంతవరకూ వారి వద్దకు వెళ్ళకండి. వారు పరిశుద్ధతనొందిన తరువాత, దేవుడు మీకు ఆదేశించిన విధంగా వారివద్దకు వెళ్ళండి. నిశ్చయంగా దేవుడు పశ్చాత్తాపపడేవారిని ఇష్టపడతాడు, పరిశుద్ధతను పాటించేవారిని ప్రేమిస్తాడు. 223. మీ స్త్రీలు మీ పంట పొలాలు. మీరు మీ పొలాల్లోకి మీరు ఇష్టపడిన విధంగా పోవచ్చు. మీ స్వయం కొరకు ముందు జాగ్రత్తపడండి. దైవానికి భయపడండి. మీరు ఆయన్ని కలుసుకోవలసి ఉందన్న విషయాన్ని తెలుసుకోండి. విశ్వాసులకు శుభవార్త వినిపించు.

224. మీరు పుణ్యకార్యాలను, దైవభీతిపరాయణతను, ప్రజల మధ్య సయోధ్య కుదుర్చటాన్ని మానుకునే ఉద్దేశంతో దేవుని పేరును మీ ప్రమాణాలకు లక్ష్యంగా పెట్టుకోకండి. దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 225. మీరు అసంకల్పికంగా చేసిన ప్రమాణాలను గురించి దేవుడు మిమ్మల్ని నిలదీయడు. మనస్ఫూర్తిగా మీరు చేసే ప్రమాణాలను గురించి మాత్రం ఆయన మిమ్మల్ని తప్పకుండా నిలదీస్తాడు. దేవుడు క్షమాశీలి, సహనశీలి కూడా. 226. తమ భార్యల వద్దకు పోమని ఒట్టేసుకున్న వారికి నాలుగు నెలల వరకు గడువు ఉంది. ఒకవేళ వారు దానిని ఉపసంహరించు కుంటే (మరలివస్తే) నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కనికరించేవాడు. 227. ఒకవేళ వారు విడాకులు ఇవ్వాలనే దృఢ నిశ్చయం చేసుకుంటే, దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 228. విడాకులు పొందిన మహిళలు మూడు రుతువుల వరకూ తమను తాము ఆపి ఉంచుకోవాలి. వారు దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసించేవారే అయినట్లయితే దేవుడు వారి గర్భాలలో సృష్టించిన దానిని దాచి ఉంచటం వారికి ధర్మసమ్మతం కాదు. ఈ లోగా వారితో రాజీపడాలనుకున్న వారి భర్తలకు, తమ భార్యలను తిరిగి రప్పించుకునే హక్కు ఉంటుంది. భర్తలకు భార్యలపై హక్కులున్నట్లే శాస్త్రం ప్రకారం భార్యలకు కూడా వారిపై హక్కులున్నాయి. కాకపోతే పురుషులకు వారిపై ఒకింత ఆధిక్యత ఉంది. దేవుడు సర్వాధికుడు, వివేక సంపన్నుడు.

229. విడాకులు (ఇస్తున్నట్లు) రెండుసార్లు మాత్రమే ప్రకటించాలి. తరువాత నియమానుసారం ఆపుకోవాలి. లేదంటే మేలైన పద్ధతిలో సెలవు ఇవ్వాలి. మీరు వారికి ఇచ్చి ఉన్న దానిలో నుంచి ఏదయినా వాపసు తీసుకోవటం మీకు ధర్మసమ్మతం కాదు. అయితే దేవుడు విధించిన హద్దులకు కట్టుబడి ఉండలేమన్న భయం ఆ దంపతులిద్దరికీ ఉంటే అది వేరే విషయం. వారిరువురూ దేవుడు నిర్ణయించిన పరిమితులకు కట్టుబడి ఉండలేరన్న భయం మీకుంటే, ఆ సొమ్ములో నుండి భార్య నష్టపరిహారం రూపంలో ఇస్తే, వారిరువురిపై ఎలాంటి దోషం లేదు. ఇవి దేవుడు నిర్ధారించిన అవధులు. వాటిని మీరి పోకూడదు. ఎవరు దేవుని హద్దులను దాటిపోతారో, అలాంటివారే దుర్మార్గులు. 230. ఒకవేళ అతనామెకు (మూడవసారి) విడాకులిచ్చేస్తే, ఇక ఆ స్త్రీ అతనికి ధర్మసమ్మతం కాజాలదు – ఆమె మరో వ్యక్తిని వివాహమాడి, అతను ఆమెకు విడాకులిస్తే తప్ప. అప్పుడు వారిద్దరూ, దేవుడు నిర్ధారించిన హద్దులకు కట్టుబడి ఉండగలమన్న నమ్మకం ఉంటే మళ్లీ వివాహబంధంలో ఏకమవటంలో తప్పులేదు. ఇవి దేవుని నియమ నిబంధనలు. అర్థం చేసుకోగల వారికి ఆయన వీటిని విపులీకరిస్తున్నాడు. 231. మీరు స్త్రీలకు విడాకులిచ్చినపుడు, వారు తమ గడువు (ఇద్దత్)కు చేరుకుంటూ ఉండగా, వారిని ఉత్తమ రీతిలో ఆపుకోండి లేదా ఉత్తమ రీతిలోనే సెలవు ఇప్పించండి. వేధించే ఉద్దేశంతో ఆపి ఉంచుకుని వారిపై దాష్టీకానికి ఒడిగట్టకండి. ఇలా చేసేవాడు తనకు తానే అన్యాయం చేసుకున్నాడు. దైవాదేశాలతో చెలగాటమాడకండి. దేవుడు మీకు ప్రసాదించిన అనుగ్రహ భాగ్యాన్ని జ్ఞాపకం చేసుకోండి. మీ హితబోధ నిమిత్తం ఆయన మీకు అవతరింపజేసిన గ్రంథాన్ని, వివేక నిధిని (గ్రహించండి). దైవం యెడల భయభక్తులు కలిగి ఉండండి. దేవుడు సర్వం ఎరిగినవాడని తెలుసుకోండి.

232. మీరు మీ స్త్రీలకు విడాకులిచ్చినపుడు, వారు తమ గడువు (ఇద్దత్)ను పూర్తి చేసుకున్న మీదట, శాస్త్రం ప్రకారం పరస్పరం ఇష్టపడి తమ భర్తలను పెండ్లి చేసుకోదలిస్తే వారికి అడ్డు తగలకండి. మీలో దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవానికి ఈ విధంగా ఉపదేశించబడుతోంది.

ఇదే మీ కొరకు అత్యంత పరిశుద్ధమైన, పరిశుభ్రమైన పద్ధతి. దైవానికి తెలుసు. మీకు తెలియదు. 233. తల్లులు తమ బిడ్డలకు గడువు కాలం పూర్తయ్యే వరకు పాలు పట్టదలచుకుంటే పూర్తిగా రెండు సంవత్సరాలు పాలు పట్టాలి. అట్టి పరిస్థితిలో సముచితమయిన రీతిలో తల్లులకు అన్నవస్త్రాలు సమకూర్చే బాధ్యత బిడ్డ తండ్రిపై ఉంటుంది. ఈ విషయంలో ఎవరిపైన కూడా శక్తికి మించిన భారం మోపబడదు. ఏ తల్లినీ బిడ్డ కారణంగా బాధించటంగానీ, ఏ తండ్రినీ అతని సంతానం మూలంగా పీడించటం గానీ చేయరాదు. ఇదే బాధ్యత వారసునిపై కూడా ఉంటుంది. ఒకవేళ వారిరువురూ ఇష్టపూర్వకంగా, పరస్పర సంప్రతింపులతో పాలు విడిపించాలను కుంటే వారు నిందార్హులు కారు. ఒకవేళ మీరు మీ బిడ్డలకు వేరే స్త్రీల చేత పాలు పట్టించాలనుకుంటే అందులోనూ దోషం లేదు. అయితే నియమాను సారం మీరు వారికి ఇవ్వవలసిన ప్రతిఫలాన్ని ఇస్తూ ఉండాలి. దేవునికి భయపడండి. తెలుసుకోండి! నిశ్చయంగా దేవుడు మీ పనులన్నింటినీ చూస్తూ ఉన్నాడు.

234. మీలో ఎవరయినా చనిపోయి, తమ భార్యలను వదలిపోతే, ఆ స్త్రీలు తమను తాము నాలుగు నెలల పది రోజుల వరకు ఆపి ఉంచుకోవాలి. తరువాత వారు తమ గడువు (ఇద్దత్)కు చేరుకుని, తమ స్వవిషయంలో – శాస్త్రం ప్రకారం – ఏ నిర్ణయానికి వచ్చినా, దానికి మీపై ఏ ఆక్షేపణా లేదు. మీరు చేసేదంతా దైవానికి ఎరుకే. 235. (ఇద్దత్‌లో ఉన్న) ఆ స్త్రీలను వివాహమాడాలన్న మీ ఉద్దేశ్యాన్ని వారికి సూచనాప్రాయంగా తెలియజేసినా లేదా మీ మనసులోనే గోప్యంగా ఉంచినా అది మీకు దోషం కాదు. మీరు తప్పకుండా వారి గురించి ప్రస్తావిస్తారని దేవునికి తెలుసు. అయితే మీరు లోపాయికారిగా వారితో ఎలాంటి అవగాహనకు రాకూడదు. మీరు వారికేమన్నా చెప్పదలిస్తే శాస్త్రం ప్రకారమే చెప్పాలి. నిర్ధారిత గడువు (ఇద్దత్) ముగిసేవరకూ నికాహ్ (వివాహ) ఒప్పందం గురించి కృతనిశ్చయానికి రాకండి. తెలుసుకోండి! మీ అంతర్యాల్లో మెదిలేదంతా దైవానికి తెలుసు. కాబట్టి ఆయనకు భయపడండి. వినండి! నిశ్చయంగా దేవుడు క్షమాశీలి,

సహనశీలి. 236. ఒకవేళ మీరు స్త్రీలను తాకకుండానే, మహర్ కూడా నిర్ధారించని స్థితిలోనే వారికి విడాకులిస్తే, వారి మహర్ గురించి మీపై ఎలాంటి అభియోగం ఉండదు. అయితే ఆనవాయితీ ప్రకారం వారికి ఎంతో కొంత ముట్టజెప్పండి. కలవారు తమ స్థాయికి తగ్గట్టుగా, పేదవారు తమ స్థోమతకు తగ్గట్టుగా ఇవ్వాలి. సద్వర్తనులకు ఇది అవశ్యం. 237. మీరు మీ స్త్రీలను ముట్టుకోకముందే విడాకులిస్తే, మరోవైపు మీరు వారి మహర్ సొమ్మును నిర్ధారించి ఉంటే, మీరు నిర్ధారించిన మహర్‌లో సగభాగం వారికి చెల్లించండి. ఒకవేళ వారు (స్త్రీలు) మన్నించి వదలిపెడితే లేదా వివాహముడి తన చేతిలో ఉన్న పురుషుడు మన్నించినట్లయితే – ఈ మన్నింపుల వైఖరి దైవభక్తికి చాలా సన్నిహితమైనది. పరస్పరం ఔదార్యం చూపటాన్ని మరువకండి. నిశ్చయంగా దేవుడు మీ నిర్వాకాన్ని గమనిస్తూనే ఉన్నాడు. 238. నమాజులను క్రమం తప్పకుండా చేయండి – ముఖ్యంగా మధ్యలో ఉన్న నమాజును కాపాడుకోండి. దైవ సమక్షంలో వినమ్రులై నిలబడండి. 239. ఒకవేళ ప్రమాదం పొంచి ఉంటే నడుస్తూనో లేదా వాహనంపైనో నమాజు చేయండి. శాంతిభద్రతలు నెలకొన్న తరువాత దేవుడు మీకు నేర్పిన విధంగానే ఆయన్ని ధ్యానించండి. నేర్పకముందు దాని గురించి మీకు తెలియదు. 240. మీలో ఎవరయినా చనిపోతూ, వారు తమ భార్యలను వదలిపోతుంటే, ఏడాది కాలం వరకూ వారిని ఇంట్లోనే ఉంచి, పోషణా బాధ్యత వహించాలని వారి గురించి విల్లు వ్రాయాలి. ఒకవేళ వారు తమంతట తాముగా ఇల్లు విడిచి, తమ స్వవిషయంలో ధర్మబద్ధంగా ఏ నిర్ణయం గైకొన్నా దానికి మీరు నిందార్హులు కారు. దేవుడు శక్తిమంతుడు, వివేకవంతుడు. 241. విడాకులు ఇవ్వబడిన మహిళలకు కూడా సముచిత రీతిలో ఖర్చులు ఇవ్వాలి. దైవభీతిపరులపై ఇది తప్పనిసరిగా చేయబడింది. 242. ఈవిధంగా దేవుడు తన ఆదేశాలను మీకు విడమరచి చెబుతున్నాడు – మీరు బుద్ధిగా మసలుకుంటారని.

243. వేల సంఖ్యలో ఉండి కూడా, చావుకు భయపడి తమ ఇండ్ల నుండి పలాయనం చిత్తగించడానికి సిద్ధపడిన వారిని నీవు చూడలేదా?

అందుకే దేవుడు వారితో 'చావండి' అన్నాడు. తరువాత వారిని మళ్లీ బ్రతికించాడు. నిశ్చయంగా దేవుడు మానవుల యెడల అనుగ్రహశాలి. కాని వారిలో చాలామంది కృతజ్ఞత చూపరు. 244. దైవమార్గంలో పోరాడండి. నిశ్చయంగా దేవుడు అంతా వినేవాడని, సర్వం ఎరిగినవాడని తెలుసుకోండి. 245. మీలో దైవానికి మంచి రుణం ఇచ్చేవాడెవడు? దానిని ఆయన పెంచి, అతని కొరకు ఎన్నోరెట్లు అధికం చేస్తాడు. దేవుడే (జీవనోపాధిని) కుదిస్తాడు, వికసింపచేస్తాడు. చివరికి మీరంతా ఆయన వద్దకే మరలించబడతారు.

246. ఏమిటీ, మూసా తదనంతరం ఇస్రాయీల్ సంతతికి చెందిన పెద్దల ధోరణి ఎలా ఉందో నీవు చూడలేదా? 'మేము దైవమార్గంలో పోరాడటానికి, మాపై ఒక రాజును నియమించు' అని వారు తమ ప్రవక్తను కోరినపుడు, "తీరా మీకు యుద్ధం గురించి ఆదేశించినపుడు, మీరు వెనుకంజవేస్తారేమో!" అని అతను సందేహపడ్డాడు. దానికి వారు, 'మేము దైవమార్గంలో పోరాడకుండా ఎలా ఉంటాము? నిజానికి మేము మా ఇండ్ల నుండి వెళ్ళగొట్టబడ్డాము. మా పిల్లల నుండి విడదీయబడ్డాము' అన్నారు. కాని తీరా యుద్ధాజ్ఞ రాగానే వారిలో కొద్దిమంది తప్ప మిగిలిన వారంతా వెన్ను చూపారు. దుర్మార్గుల వ్యవహారం దైవానికి ఎరుకే. 247. 'దేవుడు తాలూత్‌ను మీపై రాజుగా నియమించాడ'ని ఆ ప్రవక్త వారికి చెప్పినప్పుడు, 'మాపై అతనికి రాజరికం ఎలా సంక్రమిస్తుంది? యదార్థానికి అతనికన్నా మేమే రాజరికానికి ఎక్కువ హక్కుదారులము. అతని దగ్గర తగినంత సంపద కూడా లేదయ్యే' అనన్నారు. ప్రవక్త వారిని ఇలా సముదాయించాడు : "దేవుడు అతనినే మీపై నాయకునిగా ఎన్నుకున్నాడు. జ్ఞానపరంగానూ, శారీరకంగానూ అతనికే ఆధిక్యతను వొసగాడు. దేవుడు తాను కోరిన వారికి రాజ్యాధికారం ఇస్తాడు. దేవుడు గొప్ప ఉదాత్తుడు, జ్ఞాన సంపన్నుడు." 248. వారి ప్రవక్త వారితో ఇలా అన్నాడు : 'రాజుగా తాలూత్ నియామకానికి సూచనగా ఆ పేటిక మీ వద్దకు తిరిగివస్తుంది. అందులో మీ ప్రభువు తరఫున మీకు నిమ్మళం ఉంది. మూసా కుటుంబీకులు, హారూన్ కుటుంబీకులు వదలివెళ్ళిన కొన్ని అవశేషాలు కూడా అందులో ఉన్నాయి.

ఆ పేటికను దైవదూతలు మోసుకువస్తారు. మీరు గనక విశ్వసించేవారయితే ఇందులో మీకు గొప్ప సూచన ఉంది.'

249. తాలూత్ సైన్యాన్ని తీసుకుని బయలుదేరినపుడు ఇలా అన్నాడు: "దేవుడు ఒక కాలువ ద్వారా మిమ్మల్ని పరీక్షించబోతున్నాడు. చూడండి! అందులోని నీరు త్రాగినవాడు నా వాడు కాడు. త్రాగనివాడే నా వాడు. ఎవడయినా దోసిలితో కొంచెం తీసుకుంటే ఫరవాలేదు. కాని వారిలో కొద్దిమంది తప్ప మిగిలిన వారంతా తనివితీరా త్రాగారు. తరువాత తాలూత్, అతని వెంట ఉన్న విశ్వాస సహచరులు కాలువ దాటినప్పుడు, 'ఈ రోజు మాకు జాలూత్‌తో, అతని సేనలతో పోరాడే శక్తి లేదు' అన్నారు. అయితే (ఒకానొక రోజు) అల్లాహ్‌తో సమావేశం కావలసి ఉందని భావించే విశ్వాసులు ఇలా అన్నారు : 'ఎన్నో చిన్న చిన్న సమూహాలు దైవాజ్ఞపై పెద్ద సమూహాలతో తలపడి విజయం సాధించాయి. దేవుడు సాహసవంతులకు తోడుగా ఉంటాడు.' 250. వారు జాలూత్‌ను, అతని సేనలను ఎదుర్కొన్నప్పుడు ఇలా ప్రార్థించారు : 'మా ప్రభూ! మాలో సహన స్థయిర్యాలను నూరిపొయ్యి. మా పాదాలకు నిలకడను ప్రసాదించు. తిరస్కార జనులకు వ్యతిరేకంగా మాకు సహాయపడు.'

251. తరువాత వారు దేవుని అనుజ్ఞతో వారిని చిత్తుగా ఓడించారు. దావూదు జాలూత్‌ని వధించాడు. దేవుడు దావూదుకు రాజ్యాధికారాన్ని, యుక్తిని ప్రసాదించాడు. తాను కోరిన విషయాల పరిజ్ఞానాన్ని అనుగ్రహించాడు. దేవుడే గనక కొందరిని మరికొందరి ద్వారా తొలగించకపోతే భువిలో అరాచకం ప్రబలిపోతుంది. అయితే దేవుడు లోకవాసుల పట్ల గొప్ప అనుగ్రహం కలవాడు.

252. ఇవి దైవసూక్తులు. వీటిని మేము నీకు ఉన్నదున్నట్టుగా వినిపిస్తున్నాము. నిశ్చయంగా నీవు ప్రవక్తలలోని వాడవు.◆ (3) 253. ఈ ప్రవక్తలలో మేము కొందరికి మరికొందరిపై ప్రాధాన్యతను ప్రసాదించాము. వారిలో కొందరితో దేవుడు సంభాషించాడు. కొందరి స్థానాలను ఉన్నతం చేశాడు. ఇంకా మేము మర్యమ్ కుమారుడు ఈసాకు స్పష్టమయిన నిదర్శనాలు

ఇచ్చాము. పరిశుద్ధాత్మ ద్వారా అతనికి తోడ్పడ్డాము. దేవుడే గనక తలచుకుంటే, వారి తరువాతి వారు స్పష్టమయిన నిదర్శనాలు వచ్చాక పోట్లాడుకునేవారు కారు. కాని వారు విభేదించుకున్నారు. తరువాత వారిలో కొందరు విశ్వసించగా, మరికొందరు తిరస్కరించారు. దేవుడే గనక తలిస్తే వారు పరస్పరం పోట్లాడుకునేవారు కారు. కాని దేవుడు తాను తలచినదే చేస్తాడు.

254. విశ్వాసులారా! క్రయ విక్రయాలుగానీ, స్నేహబంధాలుగాని ఉండని, సిఫారసులు చెల్లని ఆ రోజు రాకముందే మేము మీకు ప్రసాదించిన ఉపాధిలో నుండి ఖర్చుపెట్టండి. సత్యతిరస్కారులే అసలు దుర్మార్గులు. 255. అల్లాహ్ – ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేదు. ఆయన సజీవుడు. అందరికీ మూలాధారం. ఆయనకు కునుకు గానీ, నిద్రగానీ పట్టదు. ఆకాశాలలో, భూమిలో ఉన్నదంతా ఆయనదే. ఆయన సమ్ముఖంలో ఆయన ఆనతి లేకుండా సిఫారసు చేయగలవాడెవడు? వారికి ముందున్న దానినీ, వారి వెనుక ఉన్న దానినీ ఆయన ఎరిగినవాడు. ఆయన కోరితే తప్ప ఆయన జ్ఞాన నిధిలోని ఏ విషయం కూడా వారి గ్రహణ పరిధిలోకి రాదు. ఆయన సామ్రాజ్యపీఠం భూమ్యాకాశాలను పరివేష్ఠించి ఉంది. వాటి రక్షణ ఆయనకు అలుపు రానీయదు. ఆయనే సర్వోన్నతుడు, మహిమాన్వితుడు. 256. ధర్మం విషయంలో ఎలాంటి బలవంతం లేదు. సన్మార్గం అపమార్గం నుండి వేరైపోయింది. కాబట్టి షైతాన్ (తాగూత్)ని తిరస్కరించి, దైవాన్ని విశ్వసించినవాడు గట్టి ఆధారాన్ని పట్టుకున్నాడు. అది తెగిపోనిది. దేవుడు అంతా వినేవాడు. అన్నీ తెలిసినవాడు. 257. దేవుడు విశ్వాసుల కార్యసాధకుడు. ఆయన వారిని చీకట్ల నుండి వెలికి తీసి వెలుగు వైపునకు తీసుకువస్తాడు. మరెవరయితే విశ్వసించేందుకు నిరాకరించారో వారి మిత్రులు షైతానులే. వాళ్లు వారిని వెలుగు నుండి తీసి చీకట్ల వైపు గొనిపోతారు. ఇలాంటివారే నరకాగ్నిలో కాలేవారు. వారందులో కలకాలం ఉంటారు.

258. ఏమిటీ, ఇబ్రాహీమ్‌తో అతని ప్రభువు విషయంలో వితండ

వాదనకు దిగిన ఆ వ్యక్తిని నీవు చూడలేదా? ఎందుకంటే దేవుడతనికి రాజ్యాధికారం ఇచ్చాడు. 'జీవన్మరణాలను ఇచ్చేవాడే నా ప్రభువు' అని ఇబ్రాహీమ్ చెప్పినపుడు, 'నేనూ బ్రతికిస్తాను, చంపుతాను' అని అతనన్నాడు. దానికి ఇబ్రాహీమ్, 'దేవుడు సూర్యుణ్ణి తూర్పు నుండి ఉదయింపజేస్తున్నాడు కదా, నీవు దానిని పడమర నుండి ఉదయింప జెయ్యి' అని సవాలు విసిరాడు. దీనికి ఆ సత్యతిరస్కారి ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. దేవుడు దుర్మార్గ జనులకు సన్మార్గం చూపడు.

259. లేదా ఒక పట్టణం మీదుగా సాగిపోయేటి ఆ వ్యక్తి (గురించి ఆలోచించావా?). ఆ పట్టణంలోని ఇండ్ల కప్పులు కూలిపోయి ఉన్నాయి. 'నిర్జీవమైపోయిన తరువాత దేవుడు దీనికి ప్రాణం ఎలా పోస్తాడు?' అని అతనన్నాడు. అంతే. దేవుడు అతనిపై నూరేళ్ళ వరకూ మృత్యువును ఆవహింపజేశాడు. తరువాత అతనిని లేపి, 'నువ్వీ స్థితిలో ఎంతకాలం ఉన్నావ్?' అని అడిగాడు. 'ఒక రోజు లేదా ఒక రోజులో కొంతభాగం' అని అతను సమాధానమిచ్చాడు. దానికి దేవుడు, 'లేదు, నువ్వు నూరేళ్ళు (ఈ స్థితిలో) ఉన్నావు. కాస్త నీ అన్నపానీయాల వైపు చూడు! అవి ఏమాత్రం కుళ్ళిపోలేదు. ఇక నీ గాడిదను కూడా చూసుకో. మేము నిన్ను ప్రజలకు ఒక సూచనగా చేయదలిచాము. ఆ అస్థిపంజరం వైపు చూడు! (ఆ గాడిద) ఎముకల గూడును నిలిపి, దానిపై మాంసం ఎలా ఎక్కిస్తామో!' ఇదంతా అతనికి బోధపడిన తరువాత, 'నిశ్చయంగా దేవుడు ప్రతిదీ చేయగల దిట్ట అని నాకు తెలుసు' అన్నాడు. 260. ఇబ్రాహీమ్, 'ఓ నా ప్రభూ! నీవు మృతులను ఎలా బ్రతికిస్తావో నాకు చూపు' అని విన్నవించుకున్నప్పుడు, 'నీకు నమ్మకం లేదా?' అని దేవుడన్నాడు. దానికి ఇబ్రాహీమ్, 'నమ్మకం లేక కాదు. నమ్మకం ఉంది. కాని ఆత్మ తృప్తి కోసం అలా అన్నాను' అని సమాధానమిచ్చాడు. 'అలాగయితే నాలుగు పక్షులను తీసుకుని, వాటికి శిక్షణ ఇవ్వు. తరువాత వాటి (శరీరపు ఒక్కో మాంసపు ముక్క)ని వేర్వేరు పర్వతాలపై ఉంచి, వాటిని పిలువు. అవి ఎగిరి నీ దగ్గరకు వస్తాయి. దేవుడు సర్వశక్తిమంతుడు, వివేకవంతుడని తెలుసుకో' అన్నాడు దేవుడు.

261. దైవమార్గంలో తమ సంపదను ఖర్చుపెట్టేవారి ఉపమానం ఒక విత్తనం లాంటిది. దాని నుండి ఏడు వెన్నులు పుట్టుకువస్తాయి. ప్రతి వెన్నులో నూరేసి గింజలుంటాయి. ఈ విధంగా దేవుడు తాను కోరినవారికి సమృద్ధిని ప్రసాదిస్తాడు. దేవుడు అనంత శుభాలు కలవాడు, సమస్తం తెలిసినవాడు. 262. ఎవరయితే దైవమార్గంలో ఖర్చుచేసిన తరువాత, తమ దాతృత్వాన్ని చాటకుండా, (గ్రహీతకు) మనస్తాపం కలిగించకుండా ఉంటారో, వారి ప్రతిఫలం వారి ప్రభువు వద్ద ఉంటుంది. వారికెలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు. దానం చేసి బాధించటం కన్నా మృదువుగా మాట్లాడటం, క్షమించటం మిన్న. దేవుడు నిరపేక్షాపరుడు, అత్యంత సహనశీలుడు. 264. విశ్వాసులారా! ప్రజల మెప్పుకోసం ప్రదర్శనా భావంతో తన సంపదను ఖర్చుపెడుతూ, దైవాన్నీ, అంతిమదినాన్ని విశ్వసించని వాని మాదిరిగా మీరు మీ ఉపకారాన్ని చాటుకుంటూ, (గ్రహీతలను) బాధిస్తూ మీ దానధర్మాలను వృధా చేసుకోకండి. అతని ఉపమానం కొద్దిగా మట్టి పేరుకున్న నున్నని రాయి వంటిది. దానిపై భారీ వర్షం కురవగానే మట్టంతా కొట్టుకుపోయి కేవలం రాయి మాత్రమే మిగులుతుంది. ఇలాంటి వారికి వారి సంపాదన నుండి ఏమీ దక్కదు. దేవుడు తిరస్కార జనులకు సన్మార్గం చూపడు.

265. దైవ ప్రసన్నతను చూరగొనటానికి, తమ మనసులు నిమ్మళించటానికి సంపదను ఖర్చుపెట్టేవారి ఉపమానం ఎత్తయిన ప్రదేశంలో ఉన్న తోట లాంటిది. భారీ వర్షం కురిస్తే అది రెండింతల పంటను ఇస్తుంది. ఒకవేళ భారీవర్షం పడకుండా సన్నని జల్లు కురిసినా దానికి అదే చాలు. దేవుడు మీ పనులను కనిపెట్టుకునే ఉన్నాడు. 266. ఏమిటీ, మీలో ఎవరికయినా ఖర్జూరం, ద్రాక్ష పండ్ల తోట ఉండి, దాని క్రింద పిల్లకాలువలు ప్రవహిస్తూ, అందులో అతనికి అన్ని రకాల పండ్లు లభిస్తూ ఉండి, అతను ముసలివాడైపోతే, మరోవైపు అతని పిల్లలు కూడా బలహీనులుగా ఉండగా ఆ తోటపై అకస్మాత్తుగా నిప్పులు చెరిగే వడగాలి వచ్చి ఆ తోట కాలిపోవటాన్ని

అతను ఇష్టపడతాడా? ఈ విధంగా దేవుడు మీరు ఆలోచించటానికి తన సూచనలను మీకు విపులీకరిస్తున్నాడు.

267. ఓ విశ్వసించిన వారలారా! మీ సంపాదనలోని, నేల నుండి మీ కోసం మేము ఉత్పత్తి చేసిన వస్తువులలోని మేలైన దానిని ఖర్చుచేయండి. పనికిరాని వాటిని ఇచ్చే సంకల్పం చేయకండి. కళ్లు మూసుకుని ఉంటే తప్ప మీరు సయితం అలాంటి వాటిని తీసుకోరు. దేవుడు అక్కరలేనివాడని, స్తవనీయుడని తెలుసుకోండి. 268. షైతాన్ మిమ్మల్ని దారిద్ర్యం గురించి భయపెడతాడు. సిగ్గుమాలిన పనులకై పురికొల్పుతాడు. అయితే దేవుడు మిమ్మల్ని క్షమిస్తానని, అనుగ్రహిస్తానని వాగ్దానం చేస్తున్నాడు. దేవుడు విశాల సంపన్నుడు, సర్వం తెలిసినవాడు. 269. ఆయన తాను కోరినవారికి యుక్తిని ప్రసాదిస్తాడు. యుక్తి లభించిన వానికి అగణ్యమయిన మేలు ప్రాప్తించినట్లే. బుద్ధిమంతులు మాత్రమే హితబోధను గ్రహిస్తారు.

270. మీరు (దానధర్మాల రూపేణా) ఏమి ఖర్చుచేసినా, ఏ మొక్కుబడి చేసుకున్నా, నిశ్చయంగా దానిని అల్లాహ్ తెలుసుకుంటాడు. దుర్మార్గులకు సహాయపడేవారెవరూ ఉండరు. 271. మీరు మీ దానధర్మాలు బహిరంగంగా ఇచ్చినా మంచిదే. అయితే మీరు వాటిని గోప్యంగా నిరుపేదల వరకూ చేరిస్తే అది మీకు మరీ మంచిది. దేవుడు మీ పాపాలను మీ నుండి తొలగిస్తాడు. మీరు చేసేదంతా దైవానికి ఎరుకే. 272. వారిని సన్మార్గానికి తీసుకొచ్చే బాధ్యత నీపైన లేదు. దేవుడు తాను కోరిన వారికి సన్మార్గం వొసగుతాడు. మీరు ఏ సొమ్మును ఖర్చుపెట్టినా అది మీ (మంచి) కొరకే. అయితే మీరు దైవప్రసన్నతను బడయటానికే ఖర్చుచేయాలి. మీరేమి ఖర్చుచేసినా అది మీకు పూర్తిగా (తిరిగి) ఇవ్వబడుతుంది. మీకు ఎంతమాత్రం అన్యాయం జరగదు. 273. దైవమార్గంలో లీనమైపోయి, (జీవనోపాధి కోసం) రాజ్యంలో తిరిగేందుకు వీలుపడని అగత్యపరులకే అసలు దానధర్మాలు చెందాలి. వారి గురించి తెలియనివాడు, వారు (నోరు విప్పి) అడగకపోవటం వల్ల వారిని స్థితిమంతులుగానే భావిస్తాడు. కాని మీరు వారి వాలకాన్ని

చూసి వారి నిజ స్థితిని పసిగట్టవచ్చు. ధర్మం చేయండి బాబూ! అంటూ వారు జనుల వెంటపడరు. (అలాంటి ఆత్మాభిమానుల సహాయార్థం) మీరేమి ఖర్చుచేసినా, దానిని దేవుడు తెలుసుకుంటాడు. 274. ఎవరయితే తమ సిరిసంపదలను రేయింబవళ్ళు రహస్యంగానూ, బహిరంగంగానూ ఖర్చు పెడతారో, వారికోసం వారి ప్రభువు వద్ద ప్రతిఫలం ఉంది. వారికెలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు.

275. వడ్డీ తినేవారు ప్రళయదినాన దెయ్యం పట్టిన ఉన్మాదిలా లేచివస్తారు. ఈ విధంగా ఎందుకు జరుగుతుందంటే, వారు వ్యాపారం కూడా వడ్డీ లాంటిదే కదా! అన్నారు. నిజానికి దేవుడు వ్యాపారాన్ని ధర్మసమ్మతం చేశాడు. వడ్డీని నిషేధించాడు. ఇక ఎవరి వద్దకయినా అతని ప్రభువు తరపు నుండి హితోపదేశం అంది, అతను గనక దానిని మానుకుంటే, (గతంలో) అతను తీసుకున్నదేదో తీసుకున్నాడు. అతని వ్యవహారం దైవాధీనం. ఎవడయినా మళ్లీ అదే పనికి పాల్పడితే – అలాంటివారే నరకవాసులు. అందులో వారు శాశ్వతంగా మగ్గుతూ ఉంటారు. 276. దేవుడు వడ్డీని కుంచింపజేస్తాడు, దానధర్మాలను వికసింపజేస్తాడు. మేలును మరిచేవారినీ, పాపాత్ములను దేవుడు ఎంతమాత్రం ఇష్టపడడు. 277. నిశ్చయంగా విశ్వసించి, సదాచరణ చేసినవారికి, నమాజులను క్రమం తప్పకుండా పాటించినవారికి, జకాత్‌ను చెల్లించిన వారికి – వారి ప్రభువు వద్ద వారి ప్రతిఫలం ఉంది. వారికి ఏ విధమయిన భయంగానీ, దుఃఖంగానీ ఉండదు.

278. ఓ విశ్వాసులారా! దైవానికి భయపడండి. మీరు నిజంగా విశ్వాసులే అయితే మిగిలి ఉన్న వడ్డీని వదిలేయండి. 279. ఒకవేళ మీరు అలా చేయనట్లయితే దేవుడు మరియు ఆయన ప్రవక్తతో యుద్ధానికి సిద్ధమవండి. ఒకవేళ మీరు పశ్చాత్తాపం చెందినట్లయితే మీ అసలు సొమ్ముకు మీరు హక్కుదారులవుతారు. మీరూ ఒకరికి అన్యాయం చేయకూడదు. మీకు కూడా అన్యాయం జరగకూడదు. 280. ఒకవేళ (అప్పు తీసుకున్న వ్యక్తి) ఆర్థిక ఇబ్బందుల్లో ఉంటే, అతని పరిస్థితి మెరుగుపడే వరకూ గడువు ఇవ్వండి.

ఒకవేళ మన్నించి వదలిపెడితే – మీరు గ్రహించగలవారయితే – ఇది మీ కొరకు మరింత శ్రేయస్కరం. 281. మీరంతా దేవుని వైపు మరలించబడే దినానికి భయపడండి. అప్పుడు ప్రతి వ్యక్తికీ అతను సంపాదించినదంతా పూర్తిగా లభిస్తుంది. వారికెలాంటి అన్యాయం జరగదు.

282. విశ్వసించిన ప్రజలారా! మీరు ఒక నిర్ణీత గడువుపై అప్పు ఇచ్చి పుచ్చుకుంటున్నప్పుడు, దానిని వ్రాసుకోండి. వ్రాసే వ్యక్తి మీ మధ్య ఈ వ్యవహారాన్ని న్యాయబద్ధంగా వ్రాయాలి. వ్రాయగలవాడు వ్రాయటానికి నిరాకరించకూడదు. దేవుడు తనకు నేర్పిన విధంగానే అతను వ్రాయాలి. రుణగ్రహీత విషయమంతా చెప్పి మరీ వ్రాయించాలి. అతను తన ప్రభువయిన దైవానికి భయపడాలి. అందులో ఎలాంటి తగ్గింపూ చేయకూడదు. ఒకవేళ అప్పు తీసుకునే వ్యక్తి మందబుద్ధి గలవాడో, బలహీనుడో, లేదా స్వయంగా చెప్పి వ్రాయించే శక్తి లేనివాడో అయి ఉంటే, అతని సంరక్షకుడు న్యాయసమ్మతంగా చెప్పి వ్రాయించాలి. మీలోని ఇద్దరు పురుషులను సాక్షులుగా పెట్టుకోండి. ఒకవేళ పురుషులు అందుబాటులో లేకుంటే మీకు ఆమోదయోగ్యమయిన ఒక పురుషుడు, ఇద్దరు స్త్రీలను పెట్టుకోండి. వారిలో ఒకామె మరచిపోతే రెండవ స్త్రీ అయినా ఆమెకు గుర్తు చేయవచ్చు. సాక్ష్యం కొరకు పిలిచినపుడు సాక్షులు నిరాకరించకూడదు. వ్యవహారం చిన్నదయినా, పెద్దదయినా నిర్ణీత గడువుతో సహా దానిని వ్రాసుకోవటంలో బద్ధకం చూపకూడదు. ఈ విధంగా వ్రాసుకోవటం దేవుని దృష్టిలో ఎంతో న్యాయమైనది. ఇది సాక్ష్యాన్ని స్థిరపరుస్తుంది. మీరు అనుమానానికి లోనుకాకుండా ఉండేందుకు కూడా ఇది దోహదపడుతుంది. అయితే మీ మధ్య జరిగే వర్తక వ్యవహారం అప్పటికప్పుడే తేలిపోయేదైతే, ఆ లావాదేవీల గురించి మీరు వ్రాసుకోకపోయినా తప్పులేదు. అయితే ఈ వ్యవహారానికి కూడా సాక్షులను పెట్టుకోండి. దస్తావేజు వ్రాసే వ్యక్తికి గానీ, సాక్షులకు గానీ ఎలాంటి హాని కలిగించరాదు. ఒకవేళ మీరలా చేస్తే, అది పాపమవుతుంది. దేవునికి భయపడండి. దేవుడు మీకు (ఇదంతా) నేర్పుతున్నాడు.

దేవుడు ప్రతి విషయం తెలిసినవాడు. 283. ఒకవేళ మీరు ప్రయాణంలో ఉండి, వ్రాసే వ్యక్తి అందుబాటులో లేకపోతే తాకట్టు పెట్టదగిన వస్తువులను స్వాధీనపర్చండి. మీలోని ఒకడు మరొకడిని నమ్ముతున్నట్లయితే, నమ్మకం ఉంచబడిన వ్యక్తి దానిని – వమ్ము చేయకుండా – నెరవేర్చాలి. అతను తన నిజ ప్రభువైన దైవానికి భయపడి మసలుకోవాలి. సాక్ష్యాన్ని దాచకండి. సాక్ష్యాన్ని దాచేవాని హృదయం పాపంతో నిండిపోతుంది. మీరు చేసేదంతా దైవానికి తెలుసు.

284. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం దైవానిదే. మీరు మీ అంతర్యాలలో ఉన్నదానిని వెల్లడించినా, గోప్యంగా ఉంచినా – దేవుడు మీ నుండి దాని లెక్క తీసుకుంటాడు. తరువాత ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు, తాను కోరిన వారిని శిక్షిస్తాడు. దేవునికి అన్నింటిపై పూర్తి అధికారం ఉంది. 285. దైవప్రవక్త తన ప్రభువు తరఫు నుండి తనపై అవతరించిన దానిని విశ్వసించాడు. ముస్లింలు కూడా (దానిని విశ్వసించారు). వారంతా దైవాన్ని, దైవదూతలను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను విశ్వసించారు. (వారిలా అంటారు :) మేము ఆయన ప్రవక్తలలో ఎవరి మధ్యా భేదభావం పాటించము. ఇంకా వారిలా అంటారు : 'మేము విన్నాము. విధేయత చూపాము. మేము నీ క్షమాభిక్షను అర్థిస్తున్నాము ప్రభూ! మేము నీ వద్దకే మరలి రావలసి ఉంది.' 286. దేవుడు ఎవరిపైనా అతని శక్తికి మించిన భారం మోపడు. అతను సంపాదించినదే అతనికి లభిస్తుంది. అతని స్వయం కృతాలు అతని మీదే పడతాయి. (వారిలా వేడుకుంటారు), 'మా ప్రభూ! మేము మరచిపోయినా లేదా పొరపాటు చేసినా మమ్మొ నిలదీయకు. మా ప్రభూ! నీవు మా పూర్వీకులపై వేసినటువంటి భారాన్ని మాపై వేయకు. మా ప్రభూ! దేనిని ఎత్తుకునే శక్తి మాలో లేదో దానిని మాపై వేయకు. మమ్ము మన్నించు. మాకు క్షమాభిక్ష పెట్టు. మాపై కరుణించు. నీవే మాకు దిక్కు. తిరస్కార జనులకు వ్యతిరేకంగా మాకు సహాయపడు.'

# 3. ఆలి ఇమ్రాన్ (ఇమ్రాన్ పరివారం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ – లామ్ – మీమ్. 2. అల్లాహ్ – ఆయన తప్ప మరో
దేవుడు లేడు. ఆయన సజీవుడు. సకల చరాచర సృష్టికి మూలాధారం
అయినవాడు. 3. ఆయన నీపై సత్యంతో పాటు గ్రంథాన్ని అవతరింపజేశాడు.
దానికి పూర్వం ఉన్న గ్రంథాలను అది ధృవపరుస్తుంది. ఇంకా – ఆయనే
తౌరాతు, ఇన్జీలు గ్రంథాలను అవతరింపజేశాడు. 4. దీనికి పూర్వం
మానవాళికి మార్గదర్శకంగా. ఆయనే గీటురాయిని (నిర్ణాయకమైన దానిని)
అవతరింపజేశాడు. నిశ్చయంగా దైవ సూచనలను తిరస్కరించిన వారికి
కఠిన శిక్ష తథ్యం. దేవుడు సర్వశక్తిమంతుడు, ప్రతీకారం తీర్చుకునేవాడు.
5. నిశ్చయంగా భూమ్యాకాశాలలోని ఏ వస్తువూ దేవుని నుండి దాగిలేదు.
6. ఆయనే మాతృ గర్భాలలో మీ రూపు రేఖలను తాను కోరిన విధంగా
రూపొందిస్తాడు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. ఆయన మహాశక్తి
మంతుడు, వివేకవంతుడు.

7. ఆయనే నీపై ఈ గ్రంథాన్ని అవతరింపజేశాడు. అందులోని
కొన్ని సూక్తులు చాలా స్పష్టమైనవి (ముహ్కమాత్). అవి గ్రంథ మూలాలు.
మరికొన్ని సూక్తులు బహుళార్థ ప్రాతిపదికగలవి (ముతషాబిహాత్). హృదయా
లలో వక్రత ఉన్నవారు నానార్థాలకు ఆస్కారమున్న సూక్తుల వెంటపడి –
చిచ్చుపెట్టే ఉద్దేశ్యంతో – తికమకపెట్టే తాత్పర్యాలు తీస్తుంటారు. వాస్తవానికి
వాటి నిజభావం దైవానికి తప్ప వేరెవరికీ తెలీదు. జ్ఞానంలో పరిపక్వత
గలవారు, 'మేము వీటిని విశ్వసిస్తున్నాము. ఇవన్నీ మా ప్రభువు తరఫు
నుంచే ఉన్నాయి' అనంటారు. వాస్తవానికి విజ్ఞులు మాత్రమే హితబోధను
గ్రహిస్తారు. 8. (వారిలా ప్రార్థిస్తారు), 'ప్రభూ! నీవు మాకు మార్గదర్శకత్వం
వహించిన మీదట మా హృదయాలను వక్రత వైపు మళ్ళించకు. మాకు నీ
వద్ద నుండి కారుణ్యాన్ని ప్రసాదించు. నిశ్చయంగా నీవే గొప్ప ప్రదాతవు.
9. మా ప్రభూ! నీవు ఒకానొక దినాన ప్రజలందరినీ సమావేశపరచనున్నావు.

అందులో ఎలాంటి సందేహం లేదు. నిశ్చయంగా దేవుడు వాగ్దానానికి విరుద్ధంగా వ్యవహరించడు.'

10. నిశ్చయంగా ఎవరయితే సత్య తిరస్కారానికి ఒడిగట్టారో, వారి సిరిసంపదలు, వారి సంతానం దైవానికి వ్యతిరేకంగా ఎంతమాత్రం ఉపయోగపడవు. ఇలాంటివారే నరకాగ్నికి ఇంధనం అవుతారు. 11. ఫిరౌను జనులకు, వారి పూర్వీకులకు పట్టిన గతే వీరికీ పడుతుంది. (ఎందుకంటే) వారు మా సూచనలను అసత్యమని త్రోసిపుచ్చారు. అందువల్ల దేవుడు వారి పాపాల మూలంగా వారిని పట్టుకున్నాడు. దేవుడు ఎంతో కఠినంగా శిక్షించేవాడు. 12. సత్యతిరస్కారులతో చెప్పు : 'ఇక మీకు మిగిలింది పరాజయమే. మీరు నరకం వైపు సమీకరించబడతారు. అది ఎంతో చెడ్డ నివాస స్థలం.' 13. నిశ్చయంగా (బద్ర్ సమరంలో) ముఖాముఖీ అయిన ఆ రెండు వర్గాలలో మీకు గుణపాఠ సూచన ఉంది. ఒక వర్గం దైవమార్గంలో పోరాటం సాగించేదైతే, రెండవది సత్య తిరస్కారులది. ఈ తిరస్కారులు వారిని (విశ్వాసులను) రెట్టింపు సంఖ్యలో ఉన్నట్లు కళ్లారా తిలకించసాగారు. దేవుడు తాను తలచుకున్నవారికి, తన సహాయ శక్తిని ఇస్తాడు. నిశ్చయంగా కళ్లున్నవారికి ఇందులో గొప్ప గుణపాఠం ఉంది.

14. ప్రియాతి ప్రియమయిన వస్తువుల పట్ల గల మక్కువ ప్రజలకు ఆకర్షవంతం చేయబడింది – (ఉదాహరణకు) స్త్రీలు, కుమారులు, వెండిబంగారం రాశులు, అచ్చువేయబడిన గుర్రాలు, పశుసంపద, పంటపొలాలు. ఇది ప్రాపంచిక జీవన సామగ్రి. అయితే అత్యుత్తమమయిన నివాసం మాత్రం దేవుని వద్దనే ఉంది. 15. వారికి చెప్పు : 'దీనికన్నా మేలైన వస్తువు ఏదో నేను మీకు తెలుపనా? దైవానికి భయపడేవారి కొరకు వారి ప్రభువు వద్ద కాలువలు ప్రవహించే స్వర్గవనాలు ఉన్నాయి. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. అక్కడ వారి కొరకు పరిశుద్ధులైన భార్యలు ఉంటారు. వారికి దేవుని ప్రసన్నత ప్రాప్తమవుతుంది. దేవుడు తన దాసులను కనిపెట్టుకునే ఉన్నాడు. 16. వారిలా విన్నవించుకుంటారు : 'మా ప్రభూ! మేము విశ్వసించాము. కనుక మా పాపాలను క్షమించు. మమ్మ నరకాగ్ని

యాతన నుండి కాపాడు.' 17. వారు సహనమూర్తులు, సత్యసంధులు, విధేయులు, (దైవమార్గంలో) ఖర్చుపెట్టేవారలు, రాత్రి చివరి ఘడియల్లో క్షమాభిక్షను అర్థించేవారు.

18. తాను తప్ప మరో దేవుడు లేడన్న విషయానికి స్వయంగా అల్లాహ్, ఆయన దూతలు, జ్ఞాన సంపన్నులు సాక్షులుగా ఉన్నారు. ఆయనే న్యాయపాలకుడు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. ఆయన సర్వశక్తిమంతుడు, వివేకవంతుడు. 19. దేవుని దృష్టిలో నిజధర్మం ఇస్లాం మాత్రమే. గ్రంథం వొసగబడిన ప్రజలు తమ వద్దకు జ్ఞానం వచ్చేసిన మీదటే – పరస్పరం పంతాలకుపోయి – విభేదించుకున్నారు. దేవుని సూచనల పట్ల ఎవరు తిరస్కార వైఖరిని అవలంబించినా, దేవుడు శీఘ్రంగానే వారి లెక్క తీసుకుంటాడు. 20. ఆ తరువాత కూడా వారు నీతో గనక వాదులాడితే, 'నేను దైవాజ్ఞ ముందు తల ఒగ్గాను. నా అనుచరులు కూడా దైవ విధేయతకు అంగీకరించారు' అని వారికి చెప్పు. 'మీరు కూడా ఇదేవిధంగా ఆత్మ సమర్పణకు సిద్ధంగా ఉన్నారా?' అని గ్రంథం కలవారిని, నిరక్షరాస్యులను అడుగు. వారు గనక సమర్పణా భావానికి అంగీకరించినట్లయితే వారు సన్మార్గం పొందినట్లే. ఒకవేళ వారు విముఖత చూపితే సందేశాన్ని అందజేయటం వరకే నీ బాధ్యత. దేవుడు తన దాసులను గమనిస్తూనే ఉన్నాడు. 21. నిశ్చయంగా ఎవరయితే దైవ సూచనలను నిరాకరిస్తూ, అన్యాయంగా దైవప్రవక్తలను చంపుతూ, ప్రజా బాహుళ్యంలో న్యాయం ధర్మాలను గురించి ఉపదేశించేవారిని కూడా సంహరిస్తున్నారో, అలాంటి వారికి బాధాకరమయిన యాతన ఉందన్న శుభవార్తను వినిపించు. 22. అలాంటివారి కర్మలు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ వ్యర్థమై పోయాయి. వారికి సహాయపడే వారెవరూ ఉండరు.

23. గ్రంథంలోని ఒక భాగం ఇవ్వబడిన వారిని నీవు చూడలేదా? వారి మధ్య (గల విభేదాలపై) తీర్పు ఇచ్చేందుకు వారిని దైవగ్రంథం వైపు పిలిచినపుడు, వారిలోని ఒక వర్గం ముఖం త్రిప్పుకుని వెళ్ళిపోతుంది. 24. దీనికి కారణం; 'నరకాగ్ని మమ్మల్ని లెక్కించదగిన కొన్నాళ్ళు తప్ప

తాకదు' అని వారు పలకటమే. వారి ఈ కాల్పనిక విషయాలే ధర్మం విషయంలో వారిని మోసంలో పడవేశాయి. 25. మేము వారిని సమావేశపరిచే ఆ రోజు వారి పరిస్థితి ఏమిటి? ఆ రోజు రావటంలో ఎంతమాత్రం సందేహం లేదు. అప్పుడు ప్రతి వ్యక్తికీ అతను సంపాదించుకున్న దాని పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుంది. వారికెలాంటి అన్యాయం జరగదు. 26. ఇలా అను : 'ఓ అల్లాహ్! సామ్రాజ్యానికి అధిపతీ! నీవు కోరిన వారికి రాజ్యాధికారం ప్రసాదిస్తావు. నీవు కోరిన వారి నుండి రాజ్యాధికారాన్ని లాక్కుంటావు. నీవు తలచిన వారికి గౌరవం వొసగుతావు. నీవు తలచిన వారిని పరాభవం పాల్జేస్తావు. మేలు అంతా నీ చేతుల్లోనే ఉంది. నిశ్చయంగా నీకు అన్నింటిపై పూర్తి అధికారం ఉంది. 27. నీవు రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేస్తున్నావు. పగటిని రాత్రిలోనికి ప్రవేశపెడుతున్నావు. నీవు ప్రాణంలేని దాని నుండి ప్రాణమున్న దానిని వెలికి తీస్తున్నావు. ప్రాణమున్న దాని నుండి ప్రాణం లేని దానిని తీస్తున్నావు. నీవు కోరిన వారికి లెక్కలేనంత జీవనోపాధిని ప్రసాదిస్తావు.'

28. విశ్వసించినవారు, తమ తోటి విశ్వాసులను విడిచిపెట్టి సత్య తిరస్కారులను మిత్రులుగా చేసుకోరాదు. ఇలా చేసేవాడికి నిజదైవంతో ఎట్టి సంబంధం లేదు. అయితే వారి అపకారం నుండి రక్షణోపాయంగా అలా చేస్తే తప్పు లేదు. తనకు మాత్రమే భయపడవలసినదిగా దేవుడు మిమ్మల్ని సావధానపరుస్తున్నాడు. 29. వారికి చెప్పు : 'మీ ఆంతర్యాల్లో ఉన్నదానిని మీరు దాచినా లేదా వెల్లడించినా దేవుడు మాత్రం దానిని తప్పక తెలుసుకుంటాడు. భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనకు తెలుసు. దేవుడు సమస్తంపై సర్వాధికారం కలవాడు.' 30. ఏ రోజున ప్రతి వ్యక్తీ తాను చేసుకున్న సత్కర్మను, తన దుష్కర్మను కూడా తన ముందరే చూసుకుంటాడో, ఆనాడు ప్రతి మనిషీ తనకూ – దానికీ (ఆ దినానికి) మధ్య అంతరం ఏర్పడితే ఎంత బాగుండు! అని అభిలషిస్తాడు. తనకు భయపడవలసిందిగా దేవుడు మిమ్మల్ని సావధానపరుస్తున్నాడు. దేవుడు తన దాసుల పట్ల అమితమయిన కనికరం కలవాడు. 31. వారికి చెప్పు : 'మీరు నిజంగా

దైవాన్ని ప్రేమించేవారే అయితే, మీరు నన్ను అనుసరించండి. దేవుడు మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను క్షమిస్తాడు. దేవుడు అపారంగా క్షమించేవాడు, అమితంగా దయదలిచేవాడు.' 32. వారితో అను : 'దైవానికీ, దైవప్రవక్తకూ విధేయత చూపండి. ఒకవేళ వారు గనక మరలిపోతే, నిశ్చయంగా దేవుడు సత్య తిరస్కారులను ఇష్టపడడు.

33. నిశ్చయంగా దేవుడు ఆదమ్‌ను, నూహును, ఇబ్రాహీమ్ కుటుంబీకులను, ఇమ్రాన్ పరివారాన్నీ లోకవాసులపై (మార్గదర్శకులుగా) ఎన్నుకున్నాడు. 34. వారిలో కొందరు కొందరికి సంతానం. దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 35. ఇమ్రాన్ భార్య ప్రార్థించినప్పటి విషయం: 'నా ప్రభూ! నా గర్భంలో ఉన్న దానిని నీ సేవకు అంకితం చేయాలని మొక్కుకున్నాను. దానిని (ఆ శిశువును బాదరబందీలన్నింటి నుండి) స్వేచ్ఛగా ఉంచుతాను. నా నుండి దీనిని స్వీకరించు. నిశ్చయంగా నీవు సర్వం వినేవాడవు, సమస్తం తెలిసినవాడవు.' 36. తరువాత ఆమె ప్రసవించినపుడు, 'ప్రభూ! నేను ఆడపిల్లను కన్నాను' అంది. ఆమె కన్నదేదో దైవానికి బాగా తెలుసు. మగపిల్లవాడు ఆడపిల్ల వంటి వాడు కాడు – 'నేనీ బిడ్డకు మర్యమ్ అని నామకరణం చేస్తున్నాను. ఈమెనూ, ఈమె సంతానాన్ని శాపగ్రస్తుడయిన సాతాను బారి నుండి (సురక్షితంగా ఉండేందుకు) నీకు అప్పగిస్తున్నాను' అని ఆమె అంది. 37. ఆమె ప్రభువు ఆ పసిపాపను ఉత్తమ రీతిలో స్వీకరించాడు. ఉత్తమ రీతిలోనే పెంపకం ఏర్పాట్లు చేశాడు. జకరియ్యాకు ఆమె పోషణా బాధ్యతను అప్పగించాడు. జకరియ్యా ఆమె గదిలోకి వెళ్ళినప్పుడల్లా అక్కడ ఆహార పదార్థాలు కనిపించేవి. 'మర్యమ్! ఇవన్నీ నీకు ఎక్కడి నుండి లభిస్తున్నాయి?' అని అతను అడిగితే, 'ఇవి దేవుని వద్ద నుండి' అని ఆమె చెప్పేది. నిశ్చయంగా దేవుడు తాను కోరిన వారికి లెక్కకు మించిన ఉపాధిని ప్రసాదిస్తాడు. 38. అప్పుడు జకరియ్యా తన ప్రభువును ప్రార్థిస్తూ ఇలా అన్నాడు : 'నా ప్రభూ! నీ వద్ద నుండి నాకు సుగుణ సంతానాన్ని ప్రసాదించు. నిశ్చయంగా నీవు మొరను ఆలకించే వాడవు.' 39. అతను తన కుటీరంలో నిలబడి నమాజు చేస్తుండగా దైవ

దూతలు అతనిని పిలిచి, '(జకరియ్యా!) దేవుడు నీకు యహ్యా శుభవార్త ఇస్తున్నాడు. అతను దైవవాక్కును ధ్రువీకరించేవాడై ఉంటాడు. విశిష్ఠ నాయకుడుగా ఉంటాడు. ఇంద్రియ నిగ్రహం గలవాడై ఉంటాడు. సత్పురుషుల కోవకు చెందిన ప్రవక్త అయి ఉంటాడు' అన్నారు. 40. జకరియ్యా ఇలా అన్నాడు, 'నాకు పిల్లవాడు ఎలా పుడతాడు? నేనా ముసలివాణ్ణి. నా భార్య గొడ్రాలు.' దానికి, 'అలాగే జరుగుతుంది. దేవుడు తలచుకున్న దానిని చేసి తీరుతాడు' అని సెలవీయబడింది. 41. 'నా ప్రభూ! నా కొరకు ఏదయినా సూచనను నిర్ధారించు' అని జకరియ్యా విజ్ఞప్తి చేసుకోగా, 'నీ కొరకు సూచన ఏమిటంటే, నువ్వు మూడు రోజుల వరకూ ప్రజలతో మాట్లాడలేవు. అయితే సైగలు చేయగలవు. నీ ప్రభువును అత్యధికంగా ధ్యానిస్తూ ఉండు. సాయంత్రం, ఉదయం ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండు.' 42. దైవదూతలు ఇలా అన్నారు : 'ఓ మర్యమ్! దేవుడు నిన్ను ఎన్నుకున్నాడు. నిన్ను పరిశుద్ధపరిచాడు. మహిళా జగతికి చెందిన వారందరిపై నీకు ప్రాధాన్యతను ఇస్తూ, నీ ఎంపిక చేశాడు. 43. ఓ మర్యమ్! నువ్వు నీ ప్రభువుకు విధేయురాలివై ఉండు. ఆయన సన్నిధిలో సాష్టాంగపడుతూ ఉండు. మోకరిల్లేవారితో పాటు నీవూ వినమ్రతతో మోకరిల్లుతూ ఉండు.' 44. ఇవి అగోచర విషయాలు. వీటిని నీకు దివ్య వాణి (వహీ) ద్వారా తెలియజేస్తున్నాము. మర్యమ్ సంరక్షకులుగా ఎవరుండాలి? అన్నదాని గురించి వారు అదృష్టాన్ని పరీక్షించుకుంటున్నప్పుడు గానీ, వారు పరస్పరం గొడవపడినప్పుడు గానీ నీవు అక్కడ లేవు కదా!

45. దైవదూతలు ఇలా అన్నప్పుడు : 'ఓ మర్యమ్! దేవుడు నీకు తన తరఫున ఒక వాక్కుకు సంబంధించి శుభవార్తను ఇస్తున్నాడు. అతని పేరు మసీహ్, మర్యమ్ కుమారుడైన ఈసా. అతను ఇహపరాలలో ఆదరణీయుడై, దైవ సామీప్యం పొందిన దాసులలో ఒకడుగా ఉంటాడు. 46. అతను తల్లి ఒడిలో ఉన్నప్పుడూ, పెద్దవాడైనప్పుడూ ప్రజలతో మాట్లాడతాడు. ఇంకా అతను సజ్జనులలోని వాడై ఉంటాడు.' 47. మర్యమ్ ఇలా అంది : 'ప్రభూ! నాకు పిల్లవాడు ఎలా పుడతాడు? నన్ను ఏ పురుషుడూ

తాకనయినా లేదే!' సెలవీయబడింది : 'అలాగే జరుగుతుంది. దేవుడు తాను కోరినది సృష్టిస్తాడు. ఆయన ఏ పని గురించయినా నిర్ణయించుకున్నప్పుడు, దాని నుద్దేశించి 'అయిపో' అంటాడు. అది అయిపోతుంది.' 48. దేవుడు అతనికి గ్రంథాన్ని, విషయం లోతుల్లోకి పోవటాన్ని నేర్పుతాడు. తౌరాతు, ఇంజీల్ గ్రంథాల జ్ఞానం బోధిస్తాడు. 49. అతను ఇస్రాయీలు సంతతి వైపు ప్రవక్తగా పంపబడతాడు. వారితో ఇలా అంటాడు : 'నేను మీ ప్రభువు తరఫు నుండి మీ వద్దకు సూచనను తీసుకువచ్చాను. నేను మీ కోసం మట్టితో పక్షి ఆకారంలో ఉన్న బొమ్మను తయారుచేసి, అందులో ఊదుతాను. అది దైవాజ్ఞతో నిజంగా పక్షి అయిపోతుంది. ఇంకా నేను దైవాజ్ఞతో పుట్టుగుడ్డిని, కుష్ఠురోగిని బాగుచేస్తాను. ఇంకా నేను దైవాజ్ఞతో మృతుణ్ణి బ్రతికిస్తాను. మీరేం తింటారో, మీ ఇండ్లలో ఏమేమి నిల్వచేసి ఉంచారో కూడా చెబుతాను. మీరే గనక విశ్వసించేవారైతే ఇందులో మీకు సూచన ఉంది. 50. ఇంకా, నాకు పూర్వం ఉన్న తౌరాతును నేను ధ్రువపరచేవాడను. మీకు నిషేధించబడిన కొన్ని వస్తువులను ధర్మసమ్మతం గావించటానికి నేను వచ్చాను. నేను మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి సూచనను తీసుకువచ్చాను. కనుక మీరు దైవానికి భయపడండి. నాకు విధేయత చూపండి. 51. నిశ్చయంగా దేవుడు నాకూ ప్రభువే, మీకూ ప్రభువే. కాబట్టి ఆయన్నే ఆరాధించండి. ఇదే రుజుమార్గం.'

52. తరువాత ఈసా (యేసుక్రీస్తు) వారిలోని తిరస్కార ధోరణిని పసిగట్టినప్పుడు, 'దైవమార్గంలో నాకు సహాయపడగల వారెవరు?' అని అడిగాడు. దానికి హవారీలు, 'దైవ సహాయకులుగా మేమున్నాం. మేము దైవాన్ని విశ్వసించాము. మేము విధేయులమయ్యామన్న దానికి మీరే సాక్షి. 53. మా ప్రభూ! నీవు అవతరింపజేసిన దానిని మేము విశ్వసించాము. మేము ప్రవక్తను కూడా అనుసరిస్తున్నాము. కనుక సాక్ష్యమిచ్చేవారిలో నీవు మమ్మల్ని చేర్చుకో' అన్నారు. 54. వారు (తిరస్కారులు) రహస్యంగా ఎత్తులు వేశారు. దేవుడు కూడా వారి ఎత్తులకు పైఎత్తులు వేశాడు. ఎత్తులు వేసేవారిలో దేవుడు ఘనాపాటి. 55. అప్పుడు దేవుడు ఇలా అన్నాడు : 'ఓ ఈసా! నేను

నిన్ను వెనక్కి రప్పించుకోబోతున్నాను. నిన్ను నా వైపునకు లేపుకోబోతున్నాను. తిరస్కారుల (కాలుష్యం) నుండి నిన్ను పవిత్రపరుస్తాను. నిన్ను అనుసరించిన వారికి, నీ తిరస్కారులపైన ప్రళయదినం వరకూ ఆధిక్యతను వొసగుతాను. ఆ తరువాత అందరూ మరలిరావలసినది నా వైపే. అప్పుడు నేను మీ మధ్య ఉన్న విభేదాల గురించి తీర్పు చెబుతాను. 56. ఇక తిరస్కారానికి ఒడిగట్టిన వారిని ప్రపంచంలోనూ, పరలోకంలోనూ కఠినంగా శిక్షిస్తాను. వారికి సహాయపడే వాడెవరూ ఉండరు.' 57. అయితే విశ్వసించి, సదాచరణ చేసిన వారికి, దేవుడు వారి పూర్తి పుణ్యఫలాన్ని ఇస్తాడు. దేవుడు దుర్వర్తనులను ఎంతమాత్రం ప్రేమించడు. 58. ఇవి మేము నీకు వినిపించే సూక్తులు, వివేకంతో నిండిన ప్రస్తావనలు.

59. నిశ్చయంగా ఈసా (క్రీస్తు) దృష్టాంతం దైవ సన్నిధిలో ఆదం దృష్టాంతం వంటిదే. దేవుడు ఆదమ్‌ను మట్టితో చేసి 'అయిపో' అన్నాడు, అతను అయిపోయాడు. 60. నీ ప్రభువు నుండి (వచ్చిన) సత్యమిది. కాబట్టి నీవు శంకించేవారిలో చేరకు. 61. ఇక నీ వద్దకు జ్ఞానం వచ్చేసిన మీదట కూడా ఈ విషయంలో నీతో ఎవరయినా వాదులాడితే, వారితో ఇలా చెప్పేయ్: "రండి, పిలుచుకుందాం మా కుమారులను, మీ కుమారులను. మీ స్త్రీలను, మా స్త్రీలను. స్వయంగా మేమున్నూ, మీరున్నూ సమావేశమై, అందరం కలసి, 'అబద్ధాలు చెప్పే వారిపై దేవుని శాపం పడుగాక!' అని ప్రార్థిద్దాము." 62. నిశ్చయంగా ఇదే నిజమయిన వృత్తాంతం. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. నిశ్చయంగా అల్లాహ్‌యే తిరుగులేనివాడు, వివేక సంపన్నుడు. 63. అప్పటికీ వారు అంగీకరించక మరలిపోతే కల్లోల జనకుల సంగతి దైవానికి తెలిసిందే.

64. వారితో అను : 'ఓ గ్రంథం కల ప్రజలారా! మీకూ, మాకూ మధ్య సమానంగా ఉన్న ఒక విషయంపై అంగీకారానికి రండి! అదేమిటంటే, మనం అల్లాహ్‌ను తప్ప మరెవరినీ ఆరాధించకూడదు. ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ పరిగణించకూడదు. మనలో ఎవరూ అల్లాహ్‌ను తప్ప వేరెవరినీ తమ ప్రభువుగా చేసుకోరాదు.' వారు గనక దీనిపట్ల విముఖత

చూపితే, వారికి చెప్పెయ్యి : 'మేము మాత్రం దైవ విధేయులం అన్న దానికి మీరు సాక్షులుగా ఉండండి.' 65. గ్రంథవహులారా! మీరు ఇబ్రాహీమ్ విషయంలో ఎందుకు వితండవాదన చేస్తారు? తౌరాతు, ఇన్జీలు గ్రంథాలు అవతరించినది అతని తరువాతనే కదా! ఏమిటీ, ఆ మాత్రం అర్థం చేసుకో లేరా? 66. కొద్దోగొప్పో తెలిసినదాని గురించి ఎలాగూ మీరు వాదిస్తూ వచ్చారు. కాని మీకు తెలియని విషయాల గురించి ఎందుకు వాదులాడు తున్నారు? దైవానికి తెలుసు. మీకు తెలియదు. 67. ఇబ్రాహీమ్ యూదుడూ కాడు, క్రైస్తవుడూ కాడు. అతను ఏకోన్ముఖుడైన ముస్లిం. అతను బహుదైవారాధకులలోని వాడు కాడు. 68. జనులలో ఇబ్రాహీమ్‌తో దగ్గరి సంబంధం ఎవరికయినా ఉందనుకుంటే, అది అతనిని అనుసరించేవారికే. ఇంకా ఈ ప్రవక్తకు, అతనిని విశ్వసించిన వారికే ఉంది. దేవుడు విశ్వాసులకు మాత్రమే సంరక్షకుడు. 69. గ్రంథవహులలోని ఒక వర్గం వారు ఎలాగయినా సరే మిమ్మల్ని పెడదారి పట్టించాలని చూస్తున్నారు. వారు పెడత్రోవ పట్టించలేరు సరికదా, వారు స్వయంగా పెడత్రోవకు లోనై ఉన్నారు. కాని ఆ విషయాన్ని వారు గ్రహించటం లేదు. 70. గ్రంథం కల ప్రజలారా! మీరు దైవ సూచనలకు సాక్షులుగా ఉండి కూడా వాటిని ఎందుకు తిరస్కరిస్తున్నారు? 71. గ్రంథం కల ప్రజలారా! మీరు తెలిసి కూడా సత్యాన్ని అసత్యంతో ఎందుకు కలగలుపుతున్నారు? సత్యాన్ని ఎందుకు కప్పిపుచ్చు తున్నారు?

72. గ్రంథవహులలోని ఒక వర్గం వారు ఇలా కూడబలుక్కున్నారు: 'విశ్వాసులపై అవతరింపజేయబడిన దానిని మీరు ఉదయం విశ్వసించి సాయంత్రం త్రోసిపుచ్చండి. బహుశా అలాగయినా వారు (విశ్వాసులు సందిగ్ధానికి లోనై) మరలిపోతారేమో! 73. మీరు మీ మతస్థుల్ని తప్ప ఎవరినీ నమ్మవద్దు సుమా!' వారితో ఇలా అను : 'నిశ్చయంగా దేవుని మార్గదర్శకత్వమే సిసలయిన మార్గదర్శకత్వం.' వారి అక్కసుకు అసలు కారణం ; మీకు లభించినదే వేరొకరికి కూడా ఎందుకు లభించింది? లేదా మీ ప్రభువు సన్నిధిలో వారు మీపై ఆధిక్యత ఎందుకు సాధించారు? అన్నదే. ఇలా అను:

'అనుగ్రహమంతా దేవుని చేతుల్లో ఉంది. ఆయన తాను కోరిన వారికి దానిని ప్రసాదిస్తాడు. దేవుడు విశాల దృక్పథం కలవాడు, అన్నీ తెలిసినవాడు. 74. ఆయన తాను కోరిన వారిని తన కారుణ్యం కొరకు ప్రత్యేకించుకుంటాడు. దేవుడు మహదానుగ్రహం కలవాడు. 75. గ్రంథవహులలో ఒకని నిజాయితీ తత్పరత ఎలాంటిదంటే, ఒకవేళ నీవు అతని వద్ద అప్పగింత (అమానతు)గా ఒక పెద్ద ధనరాశిని ఉంచినా, అతను దానిని నీకు తిరిగి ఇచ్చేస్తాడు. వారిలో మరొకని పరిస్థితి ఎటువంటిదంటే, ఒకవేళ నీవు అతని వద్ద ఒక్కగానొక్క దీనారును అమానతుగా భద్రపరచినా అతను నీకు వాపసు చేయడు – నీవు అతని నెత్తిమీద కూర్చుంటే తప్ప! వారి ఈ నైతిక దివాలాతనానికి కారణం; 'నిరక్షరాస్యుల (గ్రంథేతరుల) విషయంలో మనం నిందార్హులం కాము' అని వారు చెప్పుకోవటమే. ఇంకా – వారు తెలిసీ దైవానికి అబద్ధాలు ఆపాదిస్తున్నారు. 76. వాస్తవానికి ఏ వ్యక్తి తన వాగ్దానాన్ని నెరవేరుస్తాడో, దైవానికి భయపడుతాడో – నిశ్చయంగా అలాంటి భక్తిపరులను దేవుడు ప్రేమిస్తాడు.

77. నిశ్చయంగా ఎవరయితే దేవుని వాగ్దానాన్ని, తమ ప్రమాణాలను స్వల్పమయిన ధరకు అమ్ముకుంటారో అలాంటివారికి పరలోకంలో ఎలాంటి వాటా ఉండదు. ప్రళయదినాన దేవుడు వారితో మాట్లాడడు సరికదా, వారి వైపు చూడనయినా చూడడు. వారిని పరిశుద్ధపరచడు. వారికి వ్యధాభరిత మయిన యాతన ఉంటుంది. 78. వారిలో మరికొందరు, గ్రంథం పఠిస్తూ, తాము పఠించేది గ్రంథంలోనిదేనని మిమ్మల్ని నమ్మించటానికి తమ నాలుకను మెలిక త్రిప్పుతారు. వాస్తవానికి వారు చదివేది గ్రంథంలోనిదై ఉండదు. అది దేవుని తరపున వచ్చిన విషయమని వారంటారు. వాస్తవానికి అది దేవుని తరఫు నుండి రాలేదు. వారు తెలిసీ దేవునిపై అసత్యం కల్పిస్తున్నారు. 79. దేవుడు ఏ మనిషికయినా గ్రంథాన్నీ, యుక్తినీ, ప్రవక్త పదవినీ ప్రసాదించినపుడు అతను ప్రజలతో, 'మీరు దైవాన్ని వదలి నా దాసులవండి' అని చెప్పటం అతనికి ఎంతమాత్రం తగదు. పైగా అతను, 'మీరు దైవ సేవకులవండి' అనంటాడు. ఎందుకంటే మీరు ఇతరులకు గ్రంథోపదేశం

చేస్తారు. మీరు స్వయంగా కూడా దానిని పఠిస్తారు. 80. 'మీరు దైవదూతలను, దైవప్రవక్తలను మీ ప్రభువులుగా చేసుకోండి' అని కూడా అతను మీకు ఆజ్ఞాపించడు. ఏమిటీ, మీరు దైవ విధేయతకు తలఒగ్గిన మీదట కూడా అతడు మిమ్మల్ని అవిశ్వాసానికి పాల్పడమని ఆదేశించటమా? (అసంభవం).

81. దేవుడు తన ప్రవక్తల నుండి, 'నేను మీకు గ్రంథాన్ని, వివేకాన్ని ప్రసాదించాను. ఇక దీని తరువాత మీ వద్ద ఉండే భవిష్యవాణిని సత్యమని ధృవీకరించే ప్రవక్త ఎవరయినా మీ వద్దకు వచ్చినట్లయితే మీరు అతనిని విశ్వసించాలి, అతనికి సహాయపడాలి' అన్న వాగ్దానం తీసుకున్నప్పుడు, 'ఏమిటీ, మీరు దీనిని అంగీకరిస్తున్నారా? ఈ బాధ్యతను స్వీకరిస్తున్నారా?' అని దేవుడు అడగ్గా, 'అంగీకరిస్తున్నాము' అని వారంతా చెప్పారు. 'అలాగయితే దీనికి మీరు సాక్షులుగా ఉండండి. మీతోపాటే నేనూ సాక్షిగా ఉంటాన'ని దేవుడన్నాడు. 82. ఇకమీదట ఎవరు వెనుతిరిగిపోతారో, అలాంటివారే పరమ అవిధేయులు. 83. ఏమిటీ, వీరు దైవధర్మాన్ని కాదని మరో ధర్మాన్ని కోరుకుంటున్నారా? వాస్తవానికి భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఆయన ఆజ్ఞలకు లోబడి ఉన్నాయి – ఇష్టమున్నాసరే! ఇష్టం లేకపోయినాసరే! సమస్తం ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది. 84. వారికి చెప్పు : 'మేము దైవాన్ని విశ్వసించాము. ఇంకా మాపై అవతరింపజేయబడిన దానినీ, ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్‌హాఖు, యాఖూబులపై, యాఖూబు సంతానంపై అవతరింపజేయబడిన దానినీ, ఇంకా మూసా, ఈసా తదితర ప్రవక్తలకు వారి ప్రభువు తరఫు నుండి ప్రసాదించబడిన దానిని కూడా విశ్వసించాము. మేము వారి మధ్య ఎలాంటి భేదభావం చూపము. మేము ఆయనకే విధేయత చూపినవారము.' 85. ఎవడయినా ఇస్లాంను కాదని వేరొక జీవన విధానాన్ని కోరుకుంటే, అది అతని నుండి సుతరామూ స్వీకరించబడదు. అతను పరలోకంలో ఘోరంగా నష్టపోతాడు. 86. విశ్వసించిన మీదట కూడా తిరస్కార వైఖరికి ఒడిగట్టిన జనులకు దేవుడు సన్మార్గం ఎలా చూపిస్తాడు? వాస్తవానికి వారు ఈయన సత్యప్రవక్త అని సాక్ష్యం కూడా ఇచ్చి ఉన్నారు. ఇంకా వారి వద్దకు జ్యోతిర్మయమయిన

నిదర్శనాలు కూడా వచ్చి ఉన్నాయి. దేవుడు దుర్మార్గులకు మార్గదర్శనం చేయడు. 87. ఇలాంటి వారిపై – తగిన శాస్తిగా – దేవుని శాపం, దైవదూతల, సమస్త జనుల శాపం పడుతుంది. 88. వారాస్థితిలో ఎల్లకాలం ఉంటారు. వారి యాతనను తగ్గించటం గానీ, వారికి విరామం ఇవ్వటం గానీ జరగదు. 89. అయితే ఆ తరువాత ఎవరయినా పశ్చాత్తాపపడి, తమను సంస్కరించుకున్నట్లయితే నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, దయచూపేవాడు. 90. నిశ్చయంగా ఎవరు విశ్వసించిన మీదట తిరస్కార వైఖరికి పాల్పడతారో, ఆ తర్వాత కూడా తిరస్కార ఊబిలోనే కూరుకుపోయి ఉంటారో, వారి పశ్చాత్తాపం ఎట్టి పరిస్థితిలోనూ స్వీకరించబడదు – ఇలాంటివారే మార్గభ్రష్టులు. 91. నిశ్చయంగా ఎవరయితే తిరస్కారానికి పాల్పడి, తిరస్కారులుగానే మరణించారో, వారు భూమి నిండా బంగారాన్ని పరిహారంగా ఇచ్చుకున్నా అది స్వీకరించబడదు. అలాంటివారికి బాధాకర మయిన శిక్ష ఉంటుంది. వారికి సహాయపడేవాడెవడూ ఉండడు.

◆ (4) 92. మీరు అమితంగా ఇష్టపడే వస్తువులలో నుండి (దైవ మార్గంలో) ఖర్చుపెట్టనంత వరకూ మీరు పుణ్యస్థాయికి చేరుకోలేరు. మీరేమి ఖర్చుచేసినా అది దేవునికి తెలుస్తుంది. 93. తౌరాత్ గ్రంథం అవతరించక పూర్వం ఇస్రాయీల్ (యాఖూబ్) తనపై నిషేధించుకున్న కొన్ని వస్తువులు తప్ప మిగిలిన ఆహార పదార్థాలన్నీ ఇస్రాయీల్ సంతతి వారికి ధర్మసమ్మతం (హలాల్) గానే ఉండేవి. 'మీరు సత్యశీలురే అయితే తౌరాతును తీసుకురండి, దానిని చదవండి' అని వారితో చెప్పు. 94. దీని తరువాత కూడా ఎవరయినా దేవునికి అసత్యాన్ని ఆపాదిస్తే, అలాంటివారే దుర్మార్గులు. 95. ఇలా అను: 'దేవుడు నిజం చెప్పాడు. కాబట్టి ఏకోన్ముఖుడయిన ఇబ్రాహీమ్ విధానాన్ని అనుసరించండి. అతను బహుదైవోపాసకులలోని వాడు కాడు.' 96. నిశ్చయంగా మానవాళి కొరకు నిర్మించబడిన ప్రప్రథమ (ఆరాధనా) గృహం బక్కా (మక్కా)లో ఉన్నదే. అది శుభప్రదమైనది, లోకవాసులందరికీ మార్గదర్శక కేంద్రం కూడాను. 97. అందులో చాలా స్పష్టమయిన సూచనలున్నాయి. ఇబ్రాహీమ్ నిలబడిన స్థానం ఉన్నది. అందులో ఎవరు

ప్రవేశించినా, అతను సురక్షితుడే. జనులపై దేవునికి గల హక్కు ఏమిటంటే, అక్కడికి వెళ్ళే స్థోమత ఉన్నవారు ఆ గృహాన్ని సందర్శించి హజ్జ్ చేయాలి. మరెవరయినా అందుకు నిరాకరిస్తే, నిశ్చయంగా దేవుడు లోకవాసుల అవసరం లేనివాడు. 98. ఇలా అను : ఓ గ్రంథం కల ప్రజలారా! మీరు దేవుని సూచనలను ఎందుకు నిరాకరిస్తున్నారు? వాస్తవానికి మీరు చేసే పనులన్నింటికీ దేవుడు సాక్షిగా ఉన్నాడు. 99. ఇలా అడుగు : 'గ్రంథం కల ఓ ప్రజలారా! విశ్వసించిన వారిని మీరు దైవమార్గం నుండి ఎందుకు అడ్డుకుంటున్నారు? అందులో లోపాలు వెతికే ప్రయత్నం ఎందుకు చేస్తారు? వాస్తవానికి మీరు సాక్షులుగా చేయబడ్డారు. దేవుడు మీ చేష్టల పట్ల అజాగ్రత్తగా లేడు సుమా!' 100. ఓ విశ్వాసులారా! మీరు గనక గ్రంథవహులలోని ఏ ఒక్క వర్గం మాట విన్నా, వారు మిమ్మల్ని విశ్వాసం (ఈమాన్) తర్వాత మళ్లీ అవిశ్వాసుల్ని చేసేస్తారు. 101. మీరసలు ఎలా అవిశ్వాసానికి ఒడిగట్టగలరు? వాస్తవానికి మీకు దైవ వచనాలు చదివి వినిపించబడుతున్నాయి. మీ మధ్యన దైవప్రవక్త కూడా ఉన్నాడు. ఎవడు అల్లాహ్ (ధర్మము)ను గట్టిగా పట్టుకుంటాడో అతను రుజుమార్గ దర్శనం పొందినట్లే. 102. విశ్వసించిన వారలారా! దైవానికి భయపడవలసిన విధంగా భయపడండి. ముస్లింలుగా ఉన్న స్థితిలో తప్ప మీకు మరణం రాకూడదు. 103. మీరంతా కలసి దైవ త్రాటిని గట్టిగా పట్టుకోండి. విభేదించుకోకండి. దేవుడు మీపై కురిపించిన అనుగ్రహాన్ని జ్ఞాపకం చేసుకోండి. మీరు ఒకరికొకరు శత్రువులుగా ఉండేవారు. అప్పుడు ఆయన మీ హృదయాలలో ప్రేమానురాగాలను నింపాడు. మరి ఆయన కృప వల్లనే మీరు అన్నదమ్ములయ్యారు. మీరు అగ్ని గుండం అంచున నిలబడి ఉండగా, దేవుడు మిమ్మల్ని కాపాడాడు. ఈ విధంగా దేవుడు తన సూచనలను మీకు విడమరచి చెబుతున్నాడు – మీరు సన్మార్గం పొందాలని.

104. మీలో మేలు వైపునకు పిలిచే, మంచి పనులు చేయమని ఆజ్ఞాపించే, చెడుల నుండి వారించే ఒక వర్గం తప్పకుండా ఉండాలి. ఇలాంటి వారే సాఫల్యం పొందేవారలు. 105. తమ వద్దకు స్పష్టమయిన ఆదేశాలు వచ్చిన తరువాత కూడా ముఠాలుగా విడిపోయి, పరస్పరం విభేదించుకున్న

వారి మాదిరిగా అవకండి. అలాంటి వారికి మహా ఘోరమయిన శిక్ష ఉంటుంది. 106. ఆ రోజు కొన్ని ముఖాలు దేదీప్యమానంగా ఉంటాయి. మరికొన్ని ముఖాలు నల్లబడి ఉంటాయి. ఎవరి ముఖాలపై నలుపు ఆవరించి ఉంటుందో వారితో ఇలా అనబడుతుంది : 'ఏమిటీ, మీరు విశ్వసించిన తరువాత తిరస్కారానికి పాల్పడ్డారా? అలాగైతే మీరు ఒడిగట్టిన తిరస్కారం మూలంగా శిక్షను చవిచూడండి.' 107. ఎవరి ముఖాలు దేదీప్యమానంగా ఉంటాయో వారు దైవకారుణ్యంలో ఉంటారు. వారందులో కలకాలం ఉంటారు. 108. ఇవి దైవ వచనాలు. వీటిని మేము నీకు యధాతథంగా వినిపిస్తున్నాము. లోకవాసులకు అన్యాయం చేయాలన్న తలంపు దేవునికి ఎంతమాత్రం లేదు. 109. ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న సమస్తం దైవానికే చెందుతుంది. సమస్త వ్యవహారాలు దేవుని వైపునకే మరలించ బడతాయి.

110. ఇప్పుడు మీరు మానవుల కొరకు ఉనికిలోకి తీసుకురాబడిన అత్యుత్తమ సముదాయం. మీరు మంచిని చెయ్యమని ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి ఆపుతారు. దైవాన్ని విశ్వసిస్తారు. ఒకవేళ గ్రంథవహులు కూడా విశ్వసించి ఉంటే అది వారి కొరకు శ్రేయస్కరం అయి ఉండేది. వారిలో కొందరు విశ్వాసులు ఉన్నారు. కాని అత్యధికులు అవిధేయులే. 111. వారు మిమ్మల్ని ఎంతో కొంత వేధించటం తప్పితే మీకెలాంటి అపకారం చేయలేరు. ఒకవేళ వారు మీతో యుద్ధం చేయటానికి వచ్చినా, మీకు వెన్నుచూపుతారు. ఆనక వారికి సహాయం కూడా అందదు. 112. వారెక్కడ ఉన్నాసరే పరాభవం వారిపై విధించబడింది – దేవుని నుండి ఏదయినా వాగ్దానం ఉంటే లేదా ప్రజలతో ఏదయినా ఒడంబడిక జరిగి ఉంటే తప్ప. వారు దైవాగ్రహానికి పాత్రులయ్యారు. దైన్యావస్థ వారిపై రుద్దబడింది. ఎందుకంటే వారు దేవుని సూచనలను త్రోసిపుచ్చేవారు. అన్యాయంగా దైవప్రవక్తలను హతమార్చేవారు. ఇది వారి అవిధేయతకు, అతిక్రమణా ధోరణికి పరిణామ స్వరూపం.

113. గ్రంథం కలవారంతా సమానులు కారు. వారిలో ఒక వర్గం వారు తమ మాటపై నిలబడి ఉన్నారు. వారు రాత్రివేళల్లో దైవ వచనాలను

పారాయణం చేస్తారు, సాష్టాంగపడతారు. 114. దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసిస్తారు. మంచిని చెయ్యమని ఆజ్ఞాపిస్తారు, చెడు నుండి ఆపుతారు. సత్కార్యాలలో ముందుకు దూసుకుపోతారు. ఇలాంటివారే సజ్జనులు. 115. వారు ఏ మంచి పనిచేసినా ఆదరించకపోవటం అనేది జరగదు. ధర్మపరాయణుల గురించి దేవునికి బాగా తెలుసు. 116. నిశ్చయంగా ఎవరు సత్య తిరస్కారానికి ఒడిగట్టినా, దైవానికి ప్రతిగా వారి సిరిసంపదలు, వారి సంతానం వారికేమాత్రం ఉపయోగపడవు. వారే నరకాగ్ని వాసులు. వారందులో శాశ్వతంగా పడి ఉంటారు. 117. వారు ఈ ప్రాపంచిక జీవితంలో చేసిన ఖర్చు మంచు కురుస్తున్నప్పటి శీతల పవనం వంటిది. తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నవారి పొలాలపై అది వీచి సర్వనాశనం చేసేసింది. దేవుడు వారికెలాంటి అన్యాయం చేయలేదు. వాస్తవానికి వారు తమకు తామే అన్యాయం చేసుకున్నారు.

118. ఓ విశ్వాసులారా! మీ వారిని తప్ప అన్యులను మీ ఆంతరంగికులుగా చేసుకోకండి. వారు మీకు నష్టం కలిగించటానికి దొరికిన ఏ అవకాశాన్నీ జారవిడువరు. మీరు బాధపడినకొద్దీ వారు సంతోషిస్తారు. వారిలోని వైరభావం వారి మాటల ద్వారానే వెల్లడవుతుంది. ఇక వారి ఆంతర్యాలలో ఉన్నది ఇంతకన్నా తీవ్రమైనది. మేము మా సూచనలను మీకు చాలా స్పష్టంగా వ్యక్తపరిచాము – మీరు గనక విజ్ఞత గల వారయితే (వీటిని గ్రహించండి). 119. మీరు వారిని అభిమానిస్తున్నారు. కాని వారికి మీ పట్ల అభిమానం లేదు. మరి చూడబోతే మీరు ఆకాశ గ్రంథాలన్నింటినీ విశ్వసిస్తున్నారు. వారు మిమ్మల్ని కలసినప్పుడు 'మేము విశ్వసించాము' అనంటారు. కాని వారు పరస్పరం కలుసుకున్నప్పుడు, మీ మీద ఉన్న కోపంకొద్దీ తమ వ్రేళ్లను కసితీరా కొరుక్కుంటారు. వారితో అను : 'చావండి మీ కోపంలోనే.' నిశ్చయంగా అంతరంగాల్లో ఉన్న దాని గురించి దేవునికి తెలుసు. 120. మీకేదయినా మంచి జరిగితే వారికి బాధ కలుగుతుంది. మీకు చెడు జరిగితే మాత్రం వారు సంతోషిస్తారు. మీరే గనక సంయమనంతో, దైవభీతితో మెలగినట్లయితే వారి పన్నాగమేదీ మీకు హాని కలిగించజాలదు.

నిశ్చయంగా వారి కార్యకలాపాలన్నింటినీ దేవుడు దిగ్బంధం చేసి ఉన్నాడు.

121. నీవు ఉదయాన్నే ఇంటి నుండి బయలుదేరి, ముస్లిములను యుద్ధ స్థావరాలపై నియమించినపుడు (జరిగిన విషయం స్మరించుకోదగినది). దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 122. మీలోని రెండు బృందాలు ధైర్యం వీడినపుడు, దేవుడు వారికి అండగానే ఉన్నాడు. విశ్వసించిన వారైతే సదా దైవాన్నే నమ్ముకోవాలి. 123. బద్ర్ (సంగ్రామం)లో మీరు ఎంతో బలహీనులుగా ఉన్నప్పుడు దేవుడు మీకు సహాయపడే ఉన్నాడు కదా! కాబట్టి దైవానికే భయపడండి – తద్వారానే మీరు కృతజ్ఞులుగా ఉండగలుగుతారు. 124. (ఓ ప్రవక్తా!) నీవు విశ్వాసులనుద్దేశించి ఇలా అన్నావు : 'ఏమిటీ, మీ ప్రభువు ఆకాశం నుండి మూడు వేల మంది దైవదూతలను పంపి మీకు సహాయపడటం మీకు చాలదా? 125. మీరే గనక ఓపికతో, ధర్మనిష్ఠతో ఉంటే, శత్రువు అకస్మాత్తుగా మీపై దండెత్తి వచ్చినా మీ ప్రభువు అయిదువేల మంది ప్రత్యేక గుర్తులు గల దైవదూతలతో మిమ్మల్ని ఆదుకుంటాడు.' 126. ఇది మీకు శుభవార్త కాగలగాలని, తద్వారా మీ హృదయాలు నెమ్మదించాలని దేవుడు ఈ విధంగా చేశాడు. అసలయిన సహాయం దేవుని వద్ద నుండి లభించేదే. ఆయన తిరుగులేనివాడు, వివేకవంతుడు. 127. సత్య తిరస్కారులలోని ఒక వర్గం వారి కథ పరిసమాప్తం అవటానికి లేదా వారు పరాజయం పాలై, అవమానంతో వెనుతిరగటానికి (ఈ ఏర్పాటు జరిగింది). 128. దేవుడు వారి పశ్చాత్తాపాన్ని ఆమోదించినా లేదా వారిని శిక్షించినా – ఈ వ్యవహారంలో నీ ప్రమేయం ఏమీ లేదు. ఎందుకంటే వారు దుర్మార్గులు. 129. భూమ్యాకాశాలలో ఉన్నదంతా అల్లాహ్ ఏలుబడిలోనే ఉంది. ఆయన తాను కోరిన వారిని క్షమించగలడు. తాను కోరిన వారిని శిక్షించగలడు. అల్లాహ్ క్షమాగుణం కలవాడు, దయాసాగరుడు.

130. ఓ విశ్వాసులారా! వడ్డీని అనేక రెట్లు పెంచి తినకండి. దైవానికి భయపడండి. తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు. 131. సత్యతిరస్కారుల కొరకు సిద్ధపరచబడిన అగ్నికి భయపడండి. 132. దేవునికి, దైవప్రవక్తకు విధేయత చూపండి – మీరు కరుణించబడవచ్చు. 133. మీ ప్రభువు క్షమాభిక్ష

వైపు, స్వర్గం వైపు పరుగులు తీయండి. దాని వెడల్పు భూమ్యాకాశాలంత ఉంటుంది. అది భయభక్తులు కలవారి కోసం సిద్ధపరచబడింది. 134–వారు కలిమిలోనూ, లేమిలోనూ ఖర్చుపెడతారు. కోపాన్ని దిగమ్రింగుతారు. ప్రజల పట్ల మన్నింపుల వైఖరిని అవలంబిస్తారు. దేవుడు పుణ్యాత్ములను ప్రేమిస్తాడు. 135. వారెలాంటివారంటే; ఎప్పుడయినా ఏదయినా సిగ్గుమాలిన చేష్టకు ఒడిగట్టినప్పుడు లేదా తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నప్పుడు, వారు దైవాన్ని స్మరించి తమ తప్పులను క్షమించమని వేడుకుంటారు. దేవుడు తప్ప తప్పులను క్షమించగలవాడెవడున్నాడు? తెలిసి కూడా వారు తమ స్వయంకృతాలపై మంకుతనం చూపరు. 136. ఇలాంటివారికి వారి ప్రభువు తరఫు నుండి ప్రతిఫలంగా క్షమాభిక్ష లభిస్తుంది, క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలు ఉంటాయి. వారు అందులో కలకాలం ఉంటారు. సదాచరణ చేసేవారికి ప్రాప్తించే పుణ్యఫలం ఎంత చక్కనిది? 137. మీకు పూర్వం ఇలాంటి ఘటనలెన్నో సంభవించాయి. కనుక భూమిలో సంచరించి, ధిక్కార వైఖరిని అవలంబించిన వారికి పట్టిన గతేమిటో చూడండి. 138. జన సామాన్యం కొరకు ఇది (ఖుర్‌ఆన్) జాగృతి. దైవభీతిపరులకు ఇది మార్గదర్శనం, ఉపదేశం.

139. ధైర్యం వీడకండి. దుఃఖించకండి. విశ్వాసులుగా గనక ఉంటే మీరే ప్రాబల్యం వహిస్తారు. 140. మీరు క్షతగాత్రులయ్యారనుకుంటే శత్రువుకు కూడా అలాంటి గాయాలే అయ్యాయి. మేము ఈ రోజులను జనుల మధ్య త్రిప్పుతూ ఉంటాము. మీలో చిత్తశుద్ధిగల విశ్వాసులెవరో దేవుడు తెలుసుకోవటానికి, మీలో కొందరిని సాక్షులుగా ఎంపిక చేసుకోవటానికి. దేవుడు దుర్మార్గులను ఎంతమాత్రం ఇష్టపడడు. 141. ఇంకా–దేవుడు విశ్వాసులను వేరుపరచుకుని, సత్య తిరస్కారులను తుడిచిపెట్టాలనుకున్నాడు. 142. ఏమిటీ, మీరు స్వర్గంలో సునాయాసంగా ప్రవేశించగలమని తలపోస్తున్నారా? వాస్తవానికి మీలో పోరాటపటిమ గల వారెవరో, స్థిరసంకల్పం గలవారెవరో దేవుడు ఇంకా పరికించనేలేదు. 143. మరణం ఎదురవక ముందు మీరు (వీర) మరణం పొందాలన్న తీవ్ర ఆకాంక్షతో ఉండేవారు. ఇదిగో, ఇప్పుడు మీరు దానిని కళ్లారా చూసుకున్నారు.

144. ముహమ్మద్ ఒక దైవప్రవక్త మాత్రమే. ఇతనికి పూర్వం కూడా ప్రవక్తలు గతించారు. ఒకవేళ అతను చనిపోతే లేదా చంపబడితే మీరు మడమ త్రిప్పి (ధర్మం నుండి) మరలిపోతారా? వెనుతిరిగిపోయేవాడు దైవానికి ఎలాంటి నష్టం కలిగించలేడు. కృతజ్ఞతా భావం గలవారికి దేవుడు మంచి ప్రతిఫలం ప్రసాదిస్తాడు. 145. దైవాజ్ఞ అవనంతవరకూ ఏ ప్రాణీ చావదు. దేవుడు దీనిని రాసిపెట్టాడు. ప్రాపంచిక లాభాన్ని కాంక్షించేవానికి మేము ప్రపంచం నుండే ఇచ్చేస్తాము. పరలోక లాభాన్ని కోరుకునే వానికి మేము పరలోకంలో నుండే ప్రసాదిస్తాము. కృతజ్ఞులై ఉండేవారికి మేము వారి ప్రతిఫలాన్ని తప్పక ఇస్తాము. 146. గతంలో ఎందరో దైవప్రవక్తలతో కలసి ఎందరో దైవభక్తిపరాయణులు యుద్ధం చేశారు. దైవమార్గంలో తమపై వచ్చిపడిన కష్టాలకు వారు ధైర్యం కోల్పోలేదు. చతికిలపడలేదు. అణగారి పోలేదు. దేవుడు స్థయిర్యం కలవారిని ప్రేమిస్తాడు. 147. వారి నోట ఈ మాట తప్ప మరొకటి వెలువడలేదు : 'మా ప్రభూ! మా పాపాలను క్షమించు. కార్యనిర్వహణలో మేము మితిమీరి ఉంటే మమ్ము మన్నించు. మాకు నిలకడను ప్రసాదించు. తిరస్కార మూకలకు వ్యతిరేకంగా మాకు సహాయ పడు.' 148. కనుక దేవుడు వారికి ప్రాపంచిక ప్రతిఫలాన్నీ ఇచ్చాడు, పారలౌకిక ఉత్తమ ప్రతిఫలాన్నీ ప్రసాదించాడు. ఉత్తమ రీతిలో సదాచరణ చేసేవారిని దేవుడు అమితంగా ఇష్టపడతాడు.

149. విశ్వసించిన ప్రజలారా! మీరు గనక సత్య తిరస్కారులు చెప్పినట్లుగా నడచుకుంటే, వారు మిమ్మల్ని మీ కాలి మడమలపైనే వెనక్కి త్రిప్పుతారు. తరువాత నష్టపోయేది మీరే సుమా! 150. నిజానికి దేవుడే మీకు దిక్కు. ఆయన అత్యుత్తమ సహాయకుడు. 151. మేము తిరస్కారుల గుండెల్లో భయోత్పాతం నింపుతాము. ఎందుకంటే దేవుడు ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయనప్పటికీ వారు నిజ దైవానికి సహవర్తులుగా ఇతరులను కల్పించారు. నరకాగ్నే వారి నివాసం. అది దుర్మార్గుల పాలిట ఎంతో చెడ్డ స్థలం. 152. దైవాజ్ఞతో మీరు వారిని సంహరిస్తున్నప్పుడు, దేవుడు తన వాగ్దానాన్ని మీకు నిజం చేసి చూపాడు. అయితే మీరు ఇష్టపడే దానిని దేవుడు మీకు చూపగానే మీ దౌర్బల్యం బయటపడింది. కర్తవ్య నిర్వహణలో

ఘర్షణ పడి, మీరు చెప్పినట్లు చేయలేదు. (ఆ సమయంలో) మీలోని కొందరు ప్రపంచాన్ని కోరుకోగా, మరికొందరు పరలోకాన్ని కోరుకున్నారు. అప్పుడు దేవుడు మిమ్మల్ని పరీక్షించటానికి, వారి (తిరస్కారుల) చేత మీరు వెనక్కి మరలే విధంగా చేశాడు. ఇంత జరిగినా ఆయన మిమ్మల్ని క్షమించాడు. దేవుడు విశ్వాసుల పాలిట గొప్ప అనుగ్రహం కలవాడు. 153. మీరు పరుగులు తీయసాగారు. వెనుతిరిగి ఎవరినీ చూడనయినా లేదు. మీ వెనుక ప్రవక్త మిమ్మల్ని కేకవేస్తూనే ఉన్నాడు. తరువాత దేవుడు మీకు ఆవేదన వెంబడి ఆవేదనను కలిగించాడు – మీ నుండి చేజారిపోయిన దానిపై, మీపై విరుచుకుపడిన ఆపదపై మీరు దుఃఖించకుండా ఉంటారని! మీ నిర్వాకాన్ని దేవుడు కనిపెట్టుకునే ఉన్నాడు.

154. ఈ ఆవేదన తరువాత దేవుడు మీపై ప్రశాంత స్థితిని అవతరింపజేశాడు. అంటే, మీలోని ఒక బృందానికి కునుకు పట్టసాగింది. మరోవర్గం వారికి తమ ప్రాణాల గురించి దిగులు పట్టుకుంది. వారు దేవుని గురించి వాస్తవ విరుద్ధమయిన, అజ్ఞానభరితమయిన అనుమానాలను ఏర్పరచుకోవటం మొదలెట్టారు. 'ఇంతకీ ఈ వ్యవహారంలో మాకేమన్నా అధికారం ఉందా?' అని అడగనే అడిగారు. వారికి చెప్పు : 'ఈ వ్యవహారంలో నిర్ణయాధికారమంతా దైవానిదే.' వారు తమ అంతరంగంలో గోప్యంగా ఉంచిన విషయాన్ని నీ ముందు వెలిబుచ్చరు. 'ఈ వ్యవహారంలో మాకూ ఏదన్నా అధికారం ఉండి ఉంటే మేమిక్కడ చంపబడి ఉండేవారం కాము' అని వారంటున్నారు. వారికి చెప్పు : 'మీరు మీ ఇండ్లలో ఉన్నాసరే – వధించబడాలని రాసిపెట్టి ఉన్నవారు తమ వధ్య స్థలాలకు బయలుదేరేవారే.' మీ ఆంతర్యాలలో ఉన్న దానిని పరీక్షించేందుకే, మీ హృదయాలలో ఉన్న దానిని నిగ్గుతేల్చేందుకే ఈ విధంగా జరిగింది. గుండెల్లోని గుట్టును గురించి దైవానికి ఎరుకే. 155. ఇరువర్గాలు ముఖాముఖి అయిన రోజున ఎవరు వెన్నుచూపారో, వారి కొన్ని స్వయంకృతాల కారణంగా షైతాన్ వారిని తడబాటుకు లోను చేశాడు. అయినప్పటికీ దేవుడు వారిని మన్నించాడు. నిశ్చయంగా దేవుడు క్షమాగుణం కలవాడు, సహనశీలుడు.

156. ఓ విశ్వాసులారా! మీరు అవిశ్వాసుల వలే అవకండి. తమ సోదరులు ప్రయాణానికిగానీ, యుద్ధానికి గాని వెళ్ళి ఉండగా వారికి గనక చావువస్తే, 'వారు మా వద్దనే ఉండి ఉంటే చనిపోయేవారూ కాదు, చంపబడేవారూ కాదు' అని వారంటారు. దేవుడు దీనిని వారి హృదయాలలో అంతులేని నిస్పృహకు కారణంగా చేస్తాడు. అసలు ప్రాణభిక్ష పెట్టేవాడు, ప్రాణం తీసేవాడు దేవుడే. మీరు చేసే పనులన్నింటినీ దేవుడు గమనిస్తూనే ఉన్నాడు.

157. ఒకవేళ మీరు దైవమార్గంలో చంపబడినా లేక చనిపోయినా దేవుని క్షమాభిక్ష మరియు దైవకారుణ్యం వారు కూడబెడుతున్న దానికన్నా ఎంతో మేలైనది. 158. మీరు చచ్చిపోయినా లేక చంపబడినా మీరు సమావేశపరచబడేది మాత్రం దేవుని వద్దనే. 159. (ప్రవక్తా!) నీవు వారి యెడల మృదు స్వభావుడవు అవటం కూడా దైవకృపే. ఒకవేళ నువ్వే గనక కర్కశుడవు, కఠినాత్ముడవు అయివుంటే వారు నీ నుండి దూరంగా వెళ్ళిపోయేవారు. కనుక వారి యెడల మన్నింపుల వైఖరిని అవలంబించు. వారిని క్షమించమని (దైవాన్ని) ప్రార్థించు. కార్యనిర్వహణలో వారిని సంప్రదిస్తూ ఉండు. ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత దేవునిపై భారం మోపు. నిశ్చయంగా దేవుడు తనను నమ్ముకున్న వారిని ఇష్టపడతాడు. 160. దేవుడే గనక మీకు అండగా ఉంటే మిమ్మల్ని ఎవడూ ఓడించలేడు. ఆయనే గనక మీకు చేయూతనివ్వటం మానేస్తే, ఆనక మీకు తోడ్పడే వాడెవడు? కనుక విశ్వాసులు నిత్యం దైవాన్నే నమ్ముకోవాలి.

161. దేనినయినా దాచిపెట్టడమనేది ప్రవక్తకు తగని పని. దాచిపెట్టినవాడు, తాను దాచిన వస్తువును తీసుకుని ప్రళయదినాన హాజరవుతాడు. తరువాత ప్రతి ప్రాణికీ, అది సంపాదించుకున్న దాని ప్రతిఫలం పూర్తిగా లభిస్తుంది. వారికెలాంటి అన్యాయం జరగదు. 162. ఏమిటీ, దైవాభీష్టానికి లోబడి నడుచుకునే వ్యక్తి దైవాగ్రహాన్ని కొనితెచ్చుకున్నవానితో సమానుడవుతాడా? నరకమే వాడి గమ్యస్థానం. అది ఎటువంటి చెడ్డ గమ్యస్థానం! 163. దేవుని వద్ద వారి స్థానాలు వేర్వేరుగా

ఉంటాయి. వారు చేసేదంతా దేవుడు గమనిస్తూనే ఉన్నాడు. 164. దేవుడు విశ్వాసులకు చేసిన గొప్ప ఉపకారం ఏమిటంటే; వారి మధ్యన స్వయంగా వారిలోనుండే ఒక ప్రవక్తను ప్రభవింపజేశాడు. అతను వారికి దైవ వచనాలను వినిపిస్తున్నాడు. వారిని పరిశుద్ధుల్ని చేస్తున్నాడు. వారికి గ్రంథాన్ని, వివేకాన్ని బోధిస్తున్నాడు. నిశ్చయంగా అంతకు ముందైతే వారు స్పష్టమయిన మార్గభ్రష్టతకు లోనై ఉండేవారు.

165. మీపై ఆపద వచ్చిపడగానే, 'ఇదెక్కడ నుండి వచ్చిపడింది?' అని అంటారేమిటి? మీ ద్వారా దీనికి రెట్టింపు ఆపదే (మీ శత్రువర్గంపై) విరుచుకుపడింది కదా! 'అలా అనుకుంటే ఇది మీరు స్వయంగా చేసుకున్నదే' అని వారికి చెప్పు. నిశ్చయంగా దేవుడు ప్రతిదీ చేయగల సమర్థుడు. 166. ఇరు వర్గాలు మార్కొన్న దినాన మీకు ఏ బాధ కలిగినా అది దైవాజ్ఞతోనే కలిగింది. ఎందుకంటే దేవుడు నికార్సయిన విశ్వాసులెవరో తెలుసుకో దలిచాడు. 167. నయవంచకులు ఎవరో కూడా ఆయన తెలుసుకోదలిచాడు. 'రండి, దైవమార్గంలో పోరాడండి. లేదా శత్రువును ప్రతిఘటించండి' అని వారితో అన్నప్పుడు, 'యుద్ధం జరుగుతుందని మాకు తెలిస్తే మేము తప్పకుండా వచ్చేవారమే' అన్నారు. వారు ఆ రోజు విశ్వాసం కన్నా అవిశ్వాసానికి చాలా సమీపంలో ఉన్నారు. వారు తమ హృదయాలలో లేని మాటను తమ నోటితో పలుకుతున్నారు. వారు గోప్యంగా ఉంచిన దానిని దేవుడెరుగు. 168. వారు స్వయంగా కూర్చుని ఉన్నది గాకుండా, తమ సోదరుల గురించి, 'వారు గనక మా మాట విని ఉంటే ఇలా చంపబడి ఉండేవారు కాదు' అని ప్రేలాపనలు చేస్తారు. వారికి చెప్పు : 'మీరు సత్యవంతులే అయితే మృత్యువు బారి నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి.'

169. దైవమార్గంలో హతులైన వారిని మృతులుగా భావించకండి. వారు తమ ప్రభువు వద్ద సజీవులుగా ఉన్నారు. వారికి జీవనోపాధి లభిస్తోంది. 170. దేవుడు తన అనుగ్రహం నుండి ప్రసాదించిన దాంతో వారు సంతోషంగా ఉన్నారు. తమ వెనుక ఉండిపోయిన వారి గురించి, తమతో ఇంకా వచ్చి చేరని విశ్వాసుల గురించి, వారికెలాంటి భయంగానీ,

దుఃఖంగానీ ఉండదన్న శుభవార్తను వారు అందుకుంటున్నారు. 171. దేవుని బహుమానాల పట్ల, ఆయన అనుగ్రహం పట్ల వారెంతో సంతోషంగా ఉన్నారు. విశ్వాసుల పుణ్యఫలాన్ని దేవుడు వృధా కానివ్వడన్న విషయం కూడా వారిని ఆనందంలో ముంచెత్తింది. 172. ఎవరయితే తీవ్రంగా గాయపడిన తరువాత కూడా దేవుడు మరియు ప్రవక్త ఆజ్ఞలను శిరసావహించారో, వారిలో ఎవరు సజ్జనులుగా, భక్తిపరులుగా రాణించారో, వారి కొరకు గొప్ప ప్రతిఫలం ఉంది. 173. 'శత్రువులు మీకు వ్యతిరేకంగా పెద్ద శక్తిని సమీకరించుకున్నారు. దానికి భయపడండి' అని కొంతమంది వారిని జడిపించినప్పుడు, అది వారి విశ్వాసాన్ని (ఈమాన్‌ను) మరింత అధికం చేసింది. 'మాకు అల్లాహ్ చాలు. ఆయన అత్యుత్తమ కార్యసాధకుడు' అని వారు సమాధాన మిచ్చారు. 174. చివరికి వారు దేవుని వరాలతో, దైవానుగ్రహంతో తిరిగి వచ్చారు. వారికెలాంటి హాని జరగలేదు. వారు దేవుని అభీష్టం ప్రకారం నడుచుకున్నారు. దేవుడు గొప్ప అనుగ్రహం కలవాడు. 175. ఈ షైతాను మిమ్మల్ని తన స్నేహితుల ద్వారా భయపెడతాడు. కనుక మీరు వారికి భయపడకండి. విశ్వసించిన వారయితే మీరు నాకు భయపడండి.

176. తిరస్కార వైఖరిలో ముందుకు దూసుకుపోతున్న వారిని చూసి నీవు దుఃఖించకు. వారు దేవునికి ఎలాంటి నష్టం కలిగించలేరు. వారికి పరలోకంలో ఎలాంటి వాటా దక్కరాదన్నది దేవుని అభిమతం. వారికి ఘోరమయిన యాతన ఉంటుంది. 177. విశ్వాసానికి బదులుగా అవిశ్వాసాన్ని కొనుగోలు చేసినవారు దేవునికి ఎలాంటి చెరుపు చేయలేరు. వారి కోసం బాధాకరమయిన శిక్ష సిద్ధంగా ఉంది. 178. అవిశ్వాసానికి ఒడిగట్టినవారు, మేము వారికి ఇస్తున్న గడువును, తమ పాలిట శుభకరమని తలపోయరాదు. వారు తమ పాపాన్ని మరింతగా పెంచుకునేందుకే మేము వారికి గడువు ఇస్తున్నాము. వారికి అవమానభరితమయిన శిక్ష ఉంటుంది. 179. ఇప్పుడు మీరున్న స్థితిలోనే దేవుడు విశ్వాసుల్ని వదలిపెట్టడు. నీచులను పవిత్రుల నుండి వేరుపరచే వరకూ ఆయన వదిలేవాడు కాదు. అగోచర విషయాన్ని మీకు తెలుపటం కూడా దైవవిధానం కాదు. దేవుడు తన

ప్రవక్తలలో తాను కోరిన వారిని (ఈ పనికోసం) ఎంపిక చేసుకుంటాడు. కాబట్టి మీరు దైవాన్ని, ఆయన ప్రవక్తలను విశ్వసించండి. మీరు గనక విశ్వసించి, భయభక్తులతో మసలుకున్నట్లయితే మీకు గొప్ప ప్రతిఫలం లభిస్తుంది.

180. దేవుడు తన అనుగ్రహం నుండి ప్రసాదించిన దానిలో పిసినారితనం చూపేవారు, ఎట్టి పరిస్థితిలోనూ అది తమ పాలిట శుభకరమని భావించకూడదు. పైగా అది వారి పాలిట హానికరం. ఏ విషయంలో వారు లోభత్వం కనబరుస్తున్నారో అదే ప్రళయదినాన వారికి కంఠపాశంగా తొడిగించబడుతుంది. భూమ్యాకాశాల వారసత్వం దైవానికే చెందుతుంది. మీ పనులన్నింటిపై దేవుడు నిఘావేసి ఉన్నాడు. 181. 'దేవుడు పేదవాడు, మేము ధనవంతులం' అని చెప్పిన వారి మాటను నిశ్చయంగా దేవుడు విన్నాడు. వారి ఈ పలుకును మేము వ్రాసుకుంటాము. అన్యాయంగా తమ ప్రవక్తలను హతమార్చటాన్ని కూడా మేము నమోదు చేసుకుంటాము. మేము వారితో అంటాము, 'ఇక అగ్ని యాతనను చవిచూడండి. 182. ఇది మీ చేతులారా చేసుకున్నదే. దేవుడు తన దాసులకు అన్యాయం చేసేవాడు కాడు.' 183. 'అగ్ని హరించి వేసేటటువంటి బలి (ఖుర్బానీ)ని మా ముందు సమర్పించే వరకూ మేము ఏ ప్రవక్తనూ నమ్మరాదని దేవుడు మమ్మల్ని ఆదేశించాడు' అని వారంటున్నారు. వారితో అను : 'నాకు పూర్వం కూడా మీ వద్దకు ప్రవక్తలు స్పష్టమయిన నిదర్శనాలు తీసుకుని వచ్చారు. మీరు ప్రస్తావించిన ఈ నిదర్శనాన్ని కూడా (తెచ్చారు). మరి మీరు సత్యవంతులయి నట్లయితే వారిని ఎందుకు చంపినట్లు?'

184. ఇంత చెప్పినా వారు గనక నిన్ను ధిక్కరిస్తే, నీకు పూర్వం కూడా స్పష్టమయిన నిదర్శనాలను, సహీఫాలను, జ్యోతిర్మయమయిన గ్రంథాన్ని తీసుకువచ్చిన ప్రవక్తలు ధిక్కరించబడ్డారు. 185. ప్రతి వ్యక్తీ మృత్యువు రుచి చూడవలసిందే. మీకు పూర్తి ప్రతిఫలం ప్రళయదినాన మాత్రమే లభిస్తుంది. కాబట్టి అగ్ని (యాతన) నుండి రక్షించబడి, స్వర్గంలో ప్రవేశం కల్పించబడినవాడే వాస్తవానికి సఫలీకృతుడు. ఈ ప్రాపంచిక జీవితమైతే మభ్యపెట్టే సరంజామా మాత్రమే.

186. నిశ్చయంగా మీరు మీ ధనప్రాణాల ద్వారా పరీక్షించబడతారు. మీకు పూర్వం గ్రంథం ఇవ్వబడిన వారిచేత, బహుదైవోపాసకుల చేత కూడా ఎన్నో బాధాకరమయిన మాటల్ని మీరు వినవలసి ఉంటుంది. మీరు గనక సంయమనంతో, ధర్మనిష్ఠతో వ్యవహరించినట్లయితే నిశ్చయంగా ఇది వజ్ర సంకల్పంతో కూడుకున్న పనే. 187. దేవుడు గ్రంథం ప్రసాదించబడిన వారి నుండి, 'మీరు దైవగ్రంథాన్ని ప్రజలకు క్షుణ్ణంగా విశదీకరించాలి. దానిని దాచకూడదు' అని వాగ్దానం తీసుకున్నప్పటికీ, వారు దానిని వీపు వెనుక పడవేశారు. అంతేకాదు, స్వల్పమయిన మూల్యానికి దానిని అమ్ముకున్నారు. వారు చేస్తున్న ఈ వర్తకం ఎంత చెడ్డది! 188. తమ నిర్వాకంపై సంబరపడేవారు, తాము చేయని పనులకు కూడా తమకు ప్రశంసలు లభించాలని ఆకాంక్షించేవారు శిక్ష నుండి తప్పించుకుంటారని నీవు భావించకు. వారికి వ్యధాభరిత శిక్ష ఉంటుంది. 189. భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అధిపతి దేవుడే. దేవుడు ప్రతిదానిపై తిరుగులేని అధికారం కలవాడు.

190. నిశ్చయంగా భూమ్యాకాశాల సృష్టిలో, రేయింబవళ్ళు వంతుల వారీగా రావటంలో విజ్ఞులకు ఎన్నో సూచనలున్నాయి. 191. వారు నిల్చొని ఉన్నా, కూర్చుని ఉన్నా, పడుకున్నా – దైవాన్ని స్మరిస్తూ ఉంటారు. భూమ్యాకాశాల సృష్టిపై ఆలోచిస్తూ ఉంటారు. వారు (అప్రయత్నంగా) ఇలా అంటారు : 'మా ప్రభూ! నీవు ఇదంతా లక్ష్యరహితంగా సృష్టించలేదు. నీవు పరమ పవిత్రుడవు. మమ్మల్ని నరకాగ్ని శిక్ష నుండి కాపాడు. 192. మా ప్రభూ! నీవు నరకాగ్నిలో పడవేసినవాణ్ణి నిజంగా నీవు అవమానపరచినట్లే. దుర్మార్గుల సహాయకుడెవడూ ఉండడు. 193. మా ప్రభూ! పిలిచేవాడొకడు "మీ ప్రభువును విశ్వసించండి" అంటూ విశ్వాసం వైపు పిలుపు నివ్వటం విన్నాము. అంతే, మేము విశ్వసించాము. స్వామీ! మా పాపాలను క్షమించు. మా చెడుగులను మా నుండి దూరం చేయి. సజ్జనులతో పాటే మాకు మరణం వొసగు. 194. మా ప్రభూ! నీవు నీ ప్రవక్తల ద్వారా మాకు ఏ వాగ్దానాలు చేశావో వాటిని కూడా మాకు ప్రసాదించు. ప్రళయదినాన మమ్మ

అవమానపరచకు. నిశ్చయంగా నీవు వాగ్దానానికి విరుద్ధంగా చేసేవాడవు కావు.'

195. వారి ప్రభువు వారి ప్రార్థనను ఆమోదించాడు. 'నేను ఎవరి కర్మనూ వృథా కానివ్వను - వారు పురుషులైనా సరే, స్త్రీలు అయినాసరే! మీరంతా ఒకే రాశికి చెందినవారు. కనుక ఎవరు వలసపోయారో (హిజ్రత్ చేశారో), తమ ఇండ్ల నుండి వెళ్లగొట్టబడ్డారో, నా మార్గంలో వేధించబడ్డారో, ఇంకా ఎవరు ప్రాణాలకు ఒడ్డి పోరాడారో, వీరమరణం పొందారో - అలాంటివారి చెడులను నేను వారి నుండి తప్పక దూరం చేస్తాను. క్రింద సెలయేరులు ప్రవహించే స్వర్గవనాలలో వారిని ప్రవేశింపజేస్తాను. ఇదీ దేవుని వద్ద నుండి వారికి లభించే పుణ్యఫలం. అత్యుత్తమమయిన పుణ్యఫలం దేవుని వద్దనే ఉంది.' 196. రాజ్యంలో సత్య తిరస్కారుల కార్యకలాపాలు చూసి నీవు మోసపోవలదు.

197. ఇది స్వల్పమయిన లబ్ధి మాత్రమే. తరువాత నరకమే వారి గమ్యస్థానం. అది పరమ దుర్భరమయిన నివాస స్థలం. 198. అయితే తమ ప్రభువుకు భయపడేవారి కోసం క్రింద కాలువలు ప్రవహించే స్వర్గ వనాలుంటాయి. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇది దేవుని తరపున వారికి లభించే ఆతిథ్యం. సజ్జనుల కోసం దేవుని వద్ద ఉన్నదే అన్నిటికంటే శ్రేష్ఠమైనది. 199. నిశ్చయంగా గ్రంథవహులలో కొందరున్నారు; వారు దైవాన్ని విశ్వసిస్తారు. మీ వద్దకు పంపబడిన గ్రంథాన్ని, అంతకు ముందు స్వయంగా తమ వద్దకు పంపబడిన గ్రంథాన్ని కూడా విశ్వసిస్తారు. దైవ సన్నిధిలో వినమ్రులై ఉంటారు. వారు దైవ వచనాలను కొద్దిపాటి మూల్యానికి అమ్ముకోరు. అలాంటి వారి ప్రతిఫలం వారి ప్రభువు వద్ద ఉంది. నిశ్చయంగా దేవుడు శీఘ్రంగా లెక్క తీసుకుంటాడు. 200. ఓ విశ్వాసులారా! ఓర్పు వహించండి. ప్రతిఘటించినపుడు స్థయిర్యం కనబరచండి. అప్రమత్తంగా ఉండండి. దైవానికి భయపడుతూ ఉండండి – మీరు సాఫల్యం పొందుతారని ఆశించవచ్చు.

# 4. అన్ నిసా (మహిళామణులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. దాని నుండే దాని జతను కూడా సృష్టించి, వారిరువురి ద్వారా ఎంతోమంది స్త్రీ పురుషులను వ్యాపింపజేశాడు. దైవానికి భయపడండి. ఆయన పేరు చెప్పుకునే మీరు పరస్పరం మీకు కావలసిన వాటిని అడుగుతుంటారు. బంధువుల (హక్కుల) విషయంలో జాగ్రత్తగా ఉండండి. నిశ్చయంగా దేవుడు మిమ్మల్ని పర్యవేక్షిస్తూ ఉన్నాడు. 2. అనాథలకు దక్కవలసిన సొమ్మును వారికి అప్పగించండి. అపవిత్రమయిన సొమ్మును పవిత్రమయిన సొమ్ముతో మార్పిడీ చేయకండి. వారి సొమ్ములను మీ సొమ్ముతో కలిపి తినకండి. నిశ్చయంగా ఇది చాలా పెద్ద పాపం. 3. అనాథ బాలికల విషయంలో న్యాయం చేయలేమన్న భయం మీకుంటే ఇతర వనితలలో నుండి ఇద్దరినో, ముగ్గురినో, నలుగురినో వివాహం చేసుకోండి. వారి మధ్య న్యాయంగా వ్యవహరించలేమన్న భయం ఉన్నప్పుడు ఒకే వివాహం చేసుకోండి. లేదా మీ ఆస్తిగా ఉన్న బానిస స్త్రీతో ధర్మబద్ధంగా గడపండి. ఇలా చేస్తే మీరు న్యాయాన్ని వీడకుండా ఉంటారని ఆశించవచ్చు. 4. స్త్రీలకు వారి మహర్ సొమ్మును హృదయపూర్వకంగా ఇవ్వండి. ఒకవేళ వారు ఆ సొమ్ములో నుండి అంతో ఇంతో ఇష్టపూర్వకంగా మీకు వదలిపెడితే, దానిని మీరు సంతోషంగా, హాయిగా తినవచ్చు.

5. మీరు ఆర్థికంగా నిలదొక్కుకోవటానికి దేవుడు మీకు ఆధారంగా చేసిన సంపదలను మానసికంగా పరిపక్వతకు చేరని వారికి అప్పగించకండి. అయితే ఆ సంపదలో నుండి వారికి అన్న వస్త్రాలు సమకూర్చండి. వారి బాగోగులను గురించి మాట్లాడండి. 6. అనాథలు పెళ్ళీడుకు వచ్చేవరకూ వారిని జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండండి. ఒకవేళ వారిలో ప్రతిభ కనిపిస్తే వారి సంపదను వారికి అప్పగించండి. వారు ఎదిగివస్తున్నారన్న భయంతో

వారి ఆస్తిపాస్తులను అడ్డగోలుగా తినకండి. సంరక్షకుడు స్థితిమంతుడైనపుడు వారి సొమ్మును ముట్టుకోకుండా ఉండటమే మంచిది. ఒకవేళ అతను అవసరార్థుడై ఉంటే, ధర్మబద్ధంగా – సముచితమైన రీతిలో – తినవచ్చు. తరువాత మీరు వారి ఆస్తిని వారికి అప్పగించేటప్పుడు దీనిపై సాక్షుల్ని పెట్టుకోండి. లెక్క తీసుకోవటానికి దేవుడు చాలు. 7. తల్లిదండ్రులు, సమీప బంధువులు వదలి వెళ్ళిన ఆస్తిలో పురుషులకూ భాగం ఉంది. తల్లిదండ్రులు, సమీప బంధువులు వదలివెళ్ళిన ఆస్తిలో స్త్రీలకు కూడా భాగం ఉంది – అది ఎక్కువయినాసరే, తక్కువయినా సరే. (ఇది దేవునిచే) నిర్ధారించబడిన భాగం. 8. ఆస్తి పంపకం జరుగుతున్నప్పుడు బంధువులు, తండ్రిలేని బిడ్డలు, అగత్యపరులు అక్కడుంటే వారికీ అందులో నుంచి ఎంతోకొంత ఇవ్వండి. వారిని ఆప్యాయంగా పలకరించండి. 9. ఒకవేళ తాము తమ వెనుక పసిపిల్లలను వదలిపోతే, వారి పరిస్థితి ఎలా ఉంటుందోనని చింతించేవారు (ఈ సందర్భంగా) భయపడాలి. అందుకే వారు దైవానికి భయపడాలి. స్పష్టంగా, సూటిగా మాట్లాడాలి. 10. అనాథల సొమ్మును అన్యాయంగా భక్షించేవారు తమ పొట్టలను అగ్నితో నింపుకుంటున్నారు. త్వరలోనే వారు మండే అగ్నికి ఆహుతి చేయబడతారు.

11. దేవుడు మీకు మీ సంతానం గురించి ఇలా ఆజ్ఞాపిస్తున్నాడు : పురుషుని భాగం ఇద్దరు స్త్రీల (భాగాని)కి సమానం. ఒకవేళ (మృతుని సంతానం) ఇద్దరు ఆడపిల్లలకు మించి ఉంటే, మృతుడు వదలివెళ్ళిన ఆస్తిలో వారికి మూడింట రెండు వంతులు ఉంటుంది. ఒకవేళ ఒకే కూతురు ఉంటే ఆస్తిలో సగభాగం ఆమెకు లభిస్తుంది. మృతునికి గనక సంతానం ఉంటే; అతను వదలిపోయిన ఆస్తిలో అతని తల్లిదండ్రుల్లో ఒక్కొక్కరికి ఆరవ భాగం ఉంటుంది. ఒకవేళ మృతునికి పిల్లలు లేకుంటే, అతని తల్లిదండ్రులు మాత్రమే ఆ ఆస్తికి వారసులైనపుడు, తల్లికి మూడో భాగం దక్కుతుంది. ఒకవేళ మృతునికి సోదరులు, సోదరీమణులు కూడా ఉంటే అట్టి పరిస్థితిలో తల్లికి ఆరవ భాగం మాత్రమే ఇవ్వబడుతుంది. మృతుని వీలునామాను అమలుపరచిన మీదట లేదా అతను చేసిన అప్పులను తీర్చిన మీదటే ఈ

ఆస్తి పంపకం జరగాలి. మీ తండ్రులయినా లేదా మీ కుమారులయినా – వారిలో మీకు ఎవరు ఎక్కువ ప్రయోజకులో మీకు తెలీదు. ఇది దేవుడు నిర్ధారించిన విధ్యుక్త ధర్మం. నిశ్చయంగా దేవుడు జ్ఞానసంపన్నుడు, వివేకవంతుడు. 12. మీ భార్యలకు పిల్లలు లేనట్లయితే, వారు వదలి వెళ్ళిన ఆస్తిలో సగం మీది. ఒకవేళ వారికి పిల్లలుంటే, వారి ఆస్తిలో నాల్గోభాగం మీకు దక్కుతుంది. వారు వ్రాసివెళ్ళిన వీలునామాను అమలు జరిపిన మీదట లేదా వారి అప్పులు తీర్చిన మీదట ఈ పంపకం జరగాలి. ఒకవేళ మీకు సంతానం లేనిపక్షంలో మీరు వదలిపోయిన ఆస్తిలో మీ భార్యలకు నాల్గవ భాగం లభిస్తుంది. ఒకవేళ మీకు సంతానముంటే అప్పుడు మీరు వదలిన ఆస్తిలో ఎనిమిదవ వంతు మాత్రమే వారికి దక్కుతుంది. మీరు వ్రాసివెళ్ళిన వీలునామాను అమలుపరచిన పిదప లేదా మీరు చేసిన అప్పులు తీర్చిన పిదపే మిగిలి ఉన్న ఆస్తిని పంచుకోవాలి. ఒకవేళ చనిపోయిన పురుషుడు లేక స్త్రీకి కొడుకుగానీ, కూతురుగాని లేకుంటే (వారు 'కలాలా' అయి ఉంటే), వారికి ఒక సోదరుడు లేదా ఒక సోదరి మాత్రమే ఉంటే, వారిరువురిలో ప్రతి ఒక్కరికీ ఆరవ భాగం లభిస్తుంది. ఒకవేళ వారు అంతకన్నా ఎక్కువ మంది ఉంటే, అప్పుడు వారంతా మొత్తం ఆస్తిలో మూడవ భాగానికి వారసులవుతారు. అయితే మృతులు వ్రాసివెళ్ళిన వీలునామా ప్రకారం అమలుపరచిన తరువాత లేదా వారి అప్పులు తీర్చిన తరువాతే ఈ పంపకం జరగాలి. ఎవరికీ నష్టం జరగకుండా వ్యవహరించాలి. ఇది దేవుని తరఫు నుండి ఉన్న ఆదేశం. దేవుడు సర్వం తెలిసినవాడు, సహనశీలుడు. 13. ఇవి దేవుడు నిర్ధారించిన హద్దులు. దైవానికి, దైవప్రవక్తకు విధేయుడై మసలుకునే వానిని, దేవుడు క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇదే మహా గొప్ప విజయం. 14. మరెవడు దేవుని యెడల, దైవప్రవక్త యెడల అవిధేయుడై, ఆయన విధించిన పరిమితులను దాటిపోతాడో, అతనిని ఆయన అగ్నిలో పడవేస్తాడు. వాడందులో శాశ్వతంగా పడి ఉంటాడు. వాడి కొరకు అవమానకరమయిన యాతన ఉంటుంది.

15. మీ స్త్రీలలో ఎవరయినా నీతిబాహ్యమయిన చేష్టకు ఒడిగడితే మీలోని నలుగురు పురుషులను సాక్షులుగా తీసుకురండి. వారు గనక సాక్ష్యం ఇస్తే ఆ స్త్రీలను – మరణకాలం వచ్చే వరకూ లేదా దేవుడే వారి కొరకు ఏదయినా మార్గం చూపేవరకూ – గృహ నిర్బంధంలో ఉంచండి. 16. మీలోని ఇద్దరు పురుషులు అదే సిగ్గుమాలిన పని చేస్తే వారిద్దరినీ దండించండి. ఒకవేళ వారిద్దరూ పశ్చాత్తాపపడి, తమను సంస్కరించుకుంటే వాళ్ళను వదిలేయండి. నిశ్చయంగా దేవుడు పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడు, దయామయుడు. 17. తెలిసీ తెలియక ఏదయినా చెడు పనిచేసేసి, వెంటనే పశ్చాత్తాపపడే వారి పశ్చాత్తాపాన్ని ఆమోదించే బాధ్యత దేవునిపై ఉంటుంది. అలాంటి వారి పశ్చాత్తాపాన్నే దేవుడు ఆమోదిస్తాడు. నిశ్చయంగా దేవుడు సర్వం తెలిసినవాడు, వివేచనాపరుడు.

18. ఎల్లకాలం చెడు పనులు చేస్తూపోయేవారికి పశ్చాత్తాపం వర్తించదు. వారిలో ఎవరయినా మరణ సమయం ఆసన్నమయినపుడు, 'ఇప్పుడు నేను పశ్చాత్తాపపడుతున్నాన'ని అంటాడు. అలాగే సత్య తిరస్కార స్థితిలో మరణించేవారి పశ్చాత్తాపం (తౌబా) కూడా స్వీకారయోగ్యమవదు. అలాంటి వారి కోసం మేము బాధాకరమయిన శిక్షను సిద్ధపరచి ఉంచాము.

19. ఓ విశ్వాసులారా! బలవంతంగా స్త్రీలకు వారసులవటం మీకు ధర్మసమ్మతం కాదు. మీరు వారికి ఇచ్చిన దానిలో నుండి కొంతభాగం తీసుకునే ఉద్దేశంతో వారిని ఆపి ఉంచకండి – వారు బాహాటంగా ఏదయినా నీతిమాలిన చేష్టకు ఒడిగడితే తప్ప! వారితో ఉత్తమ రీతిలో కాపురం చేయండి. ఒకవేళ వారు మీకు గిట్టకపోతే, ఏదన్నా ఒక విషయం కారణంగా గిట్టకపోవచ్చు. కాని ఆ విషయంలోనే దేవుడు మీకు మేలును పొందుపరచి ఉండవచ్చు. 20. ఒకవేళ మీరు ఒక భార్య స్థానంలో మరో భార్యను తెచ్చుకోదలిస్తే, మీరు ఆమెకు ఓ పెద్ద ధనరాశి ఇచ్చి ఉన్నాసరే అందులో నుండి ఏ కాస్త కూడా వాపసు తీసుకోకండి. ఏమిటీ, మీరామెపై అపనింద మోపి, బహిరంగంగా దౌర్జన్యం చేసి దానిని తీసుకుంటారా? 21. పరస్పరం ఏకాంత సుఖం పొందిన తరువాత కూడా, వారు మీ నుండి

గట్టి వాగ్దానం పొందిన మీదట కూడా మీరు దానిని ఎలా తీసుకుంటారు? 22. మీ తండ్రులు మనువాడిన స్త్రీలను మీరు ఎట్టిపరిస్థితిలోనూ వివాహమాడకండి. పూర్వం జరిగినదేదో జరిగిపోయింది. ముమ్మాటికీ అదొక నీతిమాలిన చేష్ట. పరమ జుగుప్సాకరం. మా చెడ్డ విధానం.

23. మీకు హరామ్ (నిషిద్ధం) చేయబడ్డారు – మీ తల్లులు, మీ కూతుళ్ళు, మీ అక్కాచెల్లెళ్ళు, మీ మేనత్తలు, మీ పిన్నమ్మలు, మీ సోదరుల కుమార్తెలు, మీ అక్కా చెల్లెళ్ళ కుమార్తెలు, మీకు పాలు పట్టిన తల్లులు, మీకు తోడుగా పాలు త్రాగిన సోదరీలు, మీ భార్యల తల్లులు, మీ పోషణలో ఉన్న, మీరు దాంపత్య సుఖం అనుభవించిన మీ భార్యల కూతుళ్ళు – కాని ఒకవేళ మీరు వారితో సమాగమం జరపకుండా ఉంటే (కేవలం పెళ్లి చేసుకుని వదిలేసి ఉంటే, అలాంటి వారి కుమార్తెలను నికాహ్ చేసుకోవటంలో) మీపై తప్పు లేదు. మీ వెన్ను నుండి పుట్టిన మీ కొడుకుల భార్యలు. ఏక కాలంలో అక్కా చెల్లెళ్ళిద్దరినీ వివాహ బంధంలో ఉంచటం కూడా అధర్మమే (హరామ్). కాని పూర్వం జరిగిందేదో జరిగిపోయింది. నిశ్చయంగా దేవుడు క్షమించే వాడు, కరుణించేవాడు. ◆ (5) 24. వేరొకరి వివాహ బంధంలో ఉన్న స్త్రీలు కూడా మీకు నిషిద్ధమే. – యుద్ధప్రాప్తిగా మీ యాజమాన్యంలోనికి వచ్చిన బానిస స్త్రీలు తప్ప! ఇది మీపై దేవుడు విధించిన శాసనం. వీరు తప్ప మిగిలిన స్త్రీలంతా మీకు ధర్మసమ్మతమే. అయితే (మహర్ రూపేణా) మీరు మీ ధనం వెచ్చించి మరీ వారిని మీ వివాహబంధంలోకి ఆశించవలసి ఉంటుంది. అంతేగాని కామక్రీడల కొరకు కాదు. ఇక ఆ స్త్రీలలో ఎవరితోనయితే మీరు సుఖం పొందారో, వారికి వారి నిర్ధారిత మహర్ సొమ్మును చెల్లించండి. మహర్ నిర్ధారణ జరిగిన తరువాత మీరు పరస్పరం ఒక అంగీకారానికి వచ్చినా అందులో తప్పేమీ లేదు. నిశ్చయంగా దేవుడు సర్వజ్ఞాని, వివేచనాపరుడు. 25. మీలో ఎవరికయినా స్వతంత్రులైన ముస్లిం మహిళలను నికాహ్ చేసుకునేంత శక్తిస్థోమత లేకుంటే, అప్పుడు అతను మీ యాజమాన్యంలో ఉన్న విశ్వాసులైన బానిస స్త్రీలలో నుండి ఎవరినయినా మనువాడాలి. దైవానికి మీ విశ్వాస స్థితి గురించి బాగా తెలుసు. మీరంతా

పరస్పరం ఒక్కటే. కనుక వారి యజమానుల ఆనతితో వారిని వివాహం చేసుకోండి. సముచితమయిన రీతిలో వారి మహర్ సొమ్మును చెల్లించండి. ఈ విధంగా వారు – మర్యాదస్తులైన స్త్రీల మాదిరిగా – వివాహబంధంలోకి తేబడాలి. అంతేగాని విచ్చలవిడి రాసలీలల కోసమో, చాటుమాటు సరస సల్లాపాల కోసమో కాదు. ఒకవేళ ఆ బానిస స్త్రీలు వివాహ బంధంలో ఒదిగిపోయిన తరువాత కూడా అక్రమ సంబంధాలకు పాల్పడితే, స్వతంత్రులైన వనితలకు విధించబడే శిక్షలో సగం శిక్ష వారికి విధించబడు తుంది. మీలో పాపభీతి (ఆత్మ నిగ్రహం చేసుకోలేనన్న భయం) ఉన్న వ్యక్తికి ఈ వెసులుబాటు ఇవ్వబడింది. ఒకవేళ మీరు గనక ఆత్మ నిగ్రహంతో ఉండగలిగితే ఇది మీకు ఎంతో శ్రేయస్కరం. దేవుడు క్షమాసాగరుడు, దయాశీలుడు.

26. దేవుడు మీకు (ఈ విషయాలను) విశదీకరించదలుస్తున్నాడు. మీ పూర్వీకుల (సద్వర్తనుల) విధానాలను మీకు తెలియపరచాలని, మీ వైపు దయతో మరలాలని అభిలషిస్తున్నాడు. దేవుడు మహా జ్ఞాని, మహా వివేకి. 27. దేవుడు తన కటాక్ష వీక్షణాలను మీపై ప్రసరించదలుస్తున్నాడు. కాగా; మనోవాంఛలను అనుసరించేవారు, మీరు సన్మార్గం నుండి కడు దూరం వెళ్ళిపోవాలని కోరుకుంటున్నారు. 28. మీ బరువును తగ్గించాలన్నది దేవుని అభిమతం – మానవుడు బలహీనుడుగా చేయబడ్డాడు.

29. ఓ విశ్వాసులారా! ఒకరి సొమ్మును మరొకరు అధర్మంగా తినకండి. అయితే పరస్పర అంగీకారంతో జరిగే వ్యాపార లావాదేవీల వల్ల వచ్చే దానిని తినవచ్చు. ఒండొకరిని చంపుకోకండి. నిశ్చయంగా దేవుడు మీ యెడల పరమ కృపాశీలుడు. 30. ఎవడు బరితెగించి, అన్యాయంగా అలా చేస్తాడో, వాణ్ణి మేము నరకాగ్నిలో పడవేస్తాము. ఇలా చేయటం దైవానికి చాలా తేలిక. 31. మీరు గనక వారించబడిన పెద్ద పాపాలకు దూరంగా ఉంటే, మేము మీ చిన్న పాపాలను మన్నిస్తాము. మిమ్మల్ని గౌరవప్రదమయిన స్థానాలలో ప్రవేశింపజేస్తాము. 32. దేవుడు మీలో కొందరికి మరి కొందరిపై ఇచ్చిన వైశిష్ట్యాన్ని ఆశించకండి. పురుషులు

సంపాదించుకున్న దానిని బట్టి వారి ఫలితం ఉంటుంది. స్త్రీలు సంపాదించుకున్న దానిని బట్టి వారి భాగం లభిస్తుంది. అయితే మీరు మాత్రం దేవుని నుండి ఆయన అనుగ్రహాన్ని అర్థిస్తూ ఉండండి. నిశ్చయంగా దేవుడు ప్రతి దానిని ఎరిగినవాడు. 33. మేము తల్లిదండ్రులు, సమీప బంధువులు వదలిపోయిన ప్రతి ఆస్తిలో వారసులను నిర్ధారించి ఉన్నాము. ఒకవేళ మీరు ఎవరితోనయినా ఒడంబడిక చేసుకుని ఉంటే, దాని ప్రకారం వారి భాగం వారికి ఇవ్వండి. నిశ్చయంగా ప్రతి వస్తువూ దేవుని ఎదుటే ఉంది.

34. పురుషులు స్త్రీలకు రక్షకులు. ఎందుకంటే దేవుడు ఒకరిపై ఇంకొకరికి ప్రాధాన్యతను ఇచ్చి ఉన్నాడు. అదీగాక పురుషులు తమ సంపదను ఖర్చుపెట్టారు. కాబట్టి సుగుణవతులైన స్త్రీలు విధేయతా భావంతో మసలుకుంటారు. వారు భర్తల పరోక్షంలో దేవుని రక్షణలో ఉంటూ (తమ శీలాన్ని, భర్త హక్కులను) కనిపెట్టుకుని ఉంటారు. మిమ్మల్ని ఎదిరిస్తారని భయమున్న స్త్రీలను (తొలుత) బోధపరచండి. (పిదప) వారిని వారి పడకలపై ఒంటరిగా వదిలేయండి. (అవసరమైతే) వారిని కొట్టండి. ఆ తరువాత వారు మీకు విధేయత చూపితే, వారికి వ్యతిరేకంగా సాకులు వెతక్కండి. నిశ్చయంగా దేవుడు అత్యున్నతుడు, అందరికన్నా గొప్పవాడు. 35. ఒకవేళ భార్యాభర్తల మధ్య సంబంధాలు బెడిసికొట్టే ప్రమాదం ఉందని మీకు అనిపించినపుడు భర్త తరఫు నుండి ఒక న్యాయశీలుడైన వ్యక్తిని, భార్య తరఫు నుండి ఒక న్యాయశీలుడైన వ్యక్తిని నిలబెట్టండి. వారిరువురు గనక సంస్కరణను అభిలషిస్తే దేవుడు వారి మధ్య రాజీ కుదిరిస్తాడు. నిశ్చయంగా దేవుడు సర్వజ్ఞాని, అప్రమత్తుడు.

36. నిజ దైవాన్ని ఆరాధించండి. దేనినీ ఆయనకు భాగస్వామ్యంగా ఎంచకండి. తల్లిదండ్రుల యెడల ఉత్తమ రీతిలో వ్యవహరించండి. బంధువుల పట్ల, అనాథల పట్ల, అగత్యపరుల పట్ల, దగ్గరివారైన ఇరుగుపొరుగు పట్ల, అపరిచితులయిన పొరుగువారి పట్ల, ప్రక్కన కూర్చునే వారిపట్ల, ప్రయాణీకుల పట్ల, మీ అధీనంలో ఉన్న బానిసల పట్ల ఉదార భావంతో మసలుకోండి. నిశ్చయంగా దేవుడు స్వీయోత్కర్ష మూలంగా మిడిసిపడేవాణ్ణి, గర్వాతిశయంతో

విర్రవీగేవాడిని ఇష్టపడడు. 37. వారెలాంటివారంటే వారు స్వయంగా లోభులుగా వ్యవహరించటమే గాక, ఇతరులకు కూడా లోభత్వాన్ని నేర్పుతారు. దేవుడు తన అనుగ్రహం నుండి ప్రసాదించిన దానిని దాస్తారు. సత్య తిరస్కారుల కొరకు మేము అవమానభరితమయిన శిక్షను సిద్ధపరచి ఉంచాము. 38. మరెవరయితే తమ సొమ్ములను జనులకు చూపేందుకు ఖర్చుపెడతారో, దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసించరో (వారిని సయితం దేవుడు ఇష్టపడడు). షైతాను ఎవడికి సావాసిగా ఉన్నా వాడు మా చెడ్డ సావాసి (అని మరువరాదు). 39. వారే గనక దైవాన్నీ, అంతిమదినాన్నీ విశ్వసించి, దేవుడు తమకు అనుగ్రహించిన దానిలో నుండి ఖర్చుపెట్టి ఉంటే ఏం పోయేది? దేవుడు వారి నైజాన్ని బాగా ఎరిగినవాడు. 40. దేవుడు ఎవరికీ అణువంత అన్యాయం చేయడనేది నిర్వివాదాంశం. ఒకవేళ సత్కార్యమై ఉంటే ఆయన దానిని రెండింతలు పెంచుతాడు. ఇంకా – తన వద్ద నుండి మరింత పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు.

41. మేము ప్రతి సముదాయం నుండి ఒక సాక్షిని తెచ్చి, నిన్ను వారందరిపై సాక్షిగా నిలబెట్టినప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందీ? (కాస్త ఆలోచించు!) 42. ఆ రోజు సత్యతిరస్కారులూ, ప్రవక్తను ఎదిరించినవారు తాము నేలమట్టం చేయబడితే బాగుండును కదా! అని ఆకాంక్షిస్తారు. వారు దేవుని నుండి ఏ విషయాన్నీ దాచలేరు. 43. ఓ విశ్వాసులారా! మీరు మైకంలో ఉన్నప్పుడు నమాజు దరిదాపులకు కూడా పోవద్దు. మీరు పలికే దేమిటో మీకు అర్థం కానంత వరకూ (నమాజ్ చెయ్యకూడదు). లైంగిక అశుద్ధావస్థకు లోనై ఉన్నప్పుడు కూడా – దారిగుండా సాగిపోవలసి ఉంటే తప్ప – స్నానం చేయనంత వరకూ నమాజు చేయకూడదు. ఒకవేళ మీరు వ్యాధిగ్రస్తులై ఉంటే లేదా ప్రయాణంలో ఉంటే లేదా మలమూత్ర విసర్జన చేసి ఉంటే లేదా స్త్రీలతో సమాగమం జరిపి ఉంటే – అలాంటి పరిస్థితిలో మీకు నీరు లభించకపోతే పరిశుభ్రమయిన మట్టితో 'తయమ్ముమ్' (సంకల్పం) చేసుకోండి. దాంతో మీ ముఖాలను, మీ చేతులను తడుముకోండి. నిశ్చయంగా దేవుడు మన్నించేవాడు, క్షమాభిక్షపెట్టేవాడు.

44. గ్రంథంలో నుండి కొంతభాగం ఇవ్వబడిన వారిని నీవు చూడలేదా? వారు మార్గభ్రష్టతను కొనుగోలు చేస్తున్నారు. మీరు కూడా మార్గం తప్పిపోవాలన్నది వారి కోరిక. 45. మీ విరోధుల సంగతి దైవానికి ఎరుకే. రక్షకుడుగా దేవుడు చాలు. సహాయకుడుగా దేవుడు చాలు. 46. యూదులలోని ఒక వర్గంవారు విషయాన్ని యథాస్థానం నుండి తొలగించి, 'మేము విన్నాము గాని అంగీకరించలేదు' అనంటారు. ఇంకా ఇలా అంటారు : 'విను. అసలు నీకు వినబడకూడదు.' వారు తమ నాలుకలను మెలి త్రిప్పి, 'రాయినా' అనంటారు. సత్యధర్మంలో లోపాలు ఎంచటమే వారి ఉద్దేశ్యం. వారు గనక 'మేము విన్నాము, శిరసావహించాము' అనీ, 'వినండి, కాస్త మా వైపు కూడా చూడండి' అని పలికి ఉంటే అది వారికి శ్రేయస్కరం, సమంజసం అయి ఉండేది. కాని దేవుడు వారి తిరస్కార వైఖరి కారణంగా వారిని శపించాడు. ఇక వారిలో బహుకొద్దిమంది తప్ప విశ్వసించరు.

47. గ్రంథం ప్రసాదించబడిన ప్రజలారా! మేము అవతరింపజేసిన దానిని విశ్వసించండి. అది మీ వద్ద ఉన్న దానిని ధ్రువీకరించేది, మేము ముఖాలను చెరిపివేసి వెనక్కి త్రిప్పివేయక ముందే, లేదా 'శనివారం వాళ్ళ'ను శపించినట్లుగానే వారిని శపించకముందే దీనిని విశ్వసించండి. దైవాజ్ఞ అమలు జరగటం తథ్యం. 48. నిశ్చయంగా దేవుడు తనకు భాగస్వామ్యం కల్పించటాన్ని క్షమించడు. అయితే అది మినహా మిగతా వాటిని – ఆయన తాను కోరినవారికై క్షమిస్తాడు. దైవానికి సహవర్తుల్ని నిలబెట్టినవాడు ఘోరమయిన అపచారానికి ఒడిగడుతూ అసత్యం ఆపాదించాడు. 49. తమను తాము పవిత్రులమని చెప్పుకునే వారిని నీవు చూశావా? అసలు విషయం ఏమిటంటే దేవుడే తాను కోరినవారిని పవిత్రపరుస్తాడు. వారికి ఏ కాస్త కూడా అన్యాయం జరగదు. 50. చూడు! వారు దేవునిపై ఎలాంటి అబద్ధాలను కల్పిస్తున్నారో! వారి మహాపరాధాన్ని ఎత్తి చూపేందుకు ఇదొక్కటి చాలు.

51. ఏమిటీ, గ్రంథంలో నుండి కొంతభాగం ఇవ్వబడిన వారిని నీవు చూడలేదా? వారు క్షుద్రవిద్య (జిబ్త్, బాణామతి, చేతబడి మొదలగు

వాటి) యందు, మిథ్యాదైవాల (పైశాచిక శక్తుల, ప్రేతాత్మల) యందు నమ్మకం కలిగి ఉన్నారు. వారు అవిశ్వాసుల గురించి మాట్లాడుతూ, 'ముస్లిములకంటే వారే చాలావరకు సరైన మార్గంలో ఉన్నార'ని అంటారు. 52. ఇలాంటి వారినే దేవుడు శపించాడు. దైవశాపానికి గురయిన వారికి సహాయపడేవాణ్ణి నీవు కనుగొనలేవు. 53. ఏమిటీ, దేవుని రాజ్యాధికారంలో వారి ప్రమేయం ఏమన్నా ఉందా? ఒకవేళ ఉంటే వారు ప్రజలకు రవంత వాటా కూడా ఇవ్వరు. 54. ఏమిటి, దేవుడు తన అనుగ్రహం నుండి జనులకు ప్రసాదించిన దానిపై వారు ఈర్ష్య చెందుతున్నారా? అలా అనుకుంటే మేము ఇబ్రాహీము కుటుంబీకులకు గ్రంథాన్నీ, వివేకాన్ని వొసగాము. మహా సామ్రాజ్యాన్ని కూడా ప్రసాదించాము.

55. తరువాత వారిలో కొందరు దానిని విశ్వసించగా, మరికొందరు దాన్నుండి ఆగిపోయారు. ఇలాంటి వారికి మండే నరకాగ్ని చాలు. 56. నిశ్చయంగా మా సూచనలను తిరస్కరించిన వారిని మేము నరకాగ్నిలో పడవేస్తాము. వారి చర్మాలు కాలిపోయినప్పుడల్లా మేము వారి చర్మాలను మార్చి వేరే చర్మాలను సృష్టిస్తాము – వారు ఆ శిక్షను చవిచూస్తూ ఉండేందుకు! నిశ్చయంగా దేవుడు సర్వశక్తిమంతుడు, వివేకవంతుడు. 57. మరెవరు విశ్వసించి, సదాచరణ చేస్తారో వారికి మేము క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశం కల్పిస్తాము. అందులో వారు శాశ్వతంగా ఉంటారు, అక్కడ వారికి పవిత్రులైన జంటలుంటాయి. ఇంకా, మేము వారిని దట్టమయిన నీడల్లో ఉంచుతాము.

58. అమానతులను వారి హక్కుదారులకు ఇవ్వమని, ప్రజల మధ్య తీర్పు చేస్తున్నప్పుడు న్యాయంగా తీర్పు చెయ్యమని దేవుడు మీకు ఆజ్ఞాపిస్తున్నాడు. నిశ్చయంగా దేవుడు మీకు చాలా చక్కని ఉపదేశం చేస్తున్నాడు. నిశ్చయంగా దేవుడు వినేవాడు, చూసేవాడు. 59. ఓ విశ్వాసులారా! దైవానికి విధేయత చూపండి. దైవ ప్రవక్తకు కూడా విధేయత చూపండి. మీలోని అధికారులకు విధేయత కనబరచండి. తరువాత మీ మధ్య ఏ విషయంలోనయినా భేదాభిప్రాయం వస్తే దానిని దైవం మరియు దైవప్రవక్త

వైపునకు మరల్చండి – మీరు నిజంగా దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించేవారే అయితే ఇదే మేలైన విధానం. పరిణామం దృష్ట్యా కూడా ఇదే ఉత్తమమైనది. 60. ఏమిటీ, నీపై అవతరించిన దానినీ, నీకు పూర్వం అవతరించిన దానిని మేము విశ్వసించామని చెప్పేవారిని నీవు చూడలేదా? కాని వారు తమ వివాదాలను షైతాన్ వద్దకు తీసుకుపోదలుస్తున్నారు. వాస్తవానికి షైతాన్‌ను తిరస్కరించమని వారికి ఆజ్ఞాపించబడింది. షైతానేమో వారిని ఏమార్చి మార్గభ్రష్టతలో బహుదూరాన పడవేయాలని కోరుకుంటున్నాడు. 61. 'దేవుడు అవతరింపజేసిన గ్రంథం వైపునకు, దైవప్రవక్త వైపునకు రండి' అని వారికి పిలుపు ఇచ్చినపుడు, ఈ నయవంచకులు నీ నుండి తప్పించుకుపోవటం నీవు చూస్తావు. 62. మరైతే, వారు తమ చేజేతులా కొనితెచ్చుకున్న ఆపద వారిపై వచ్చిపడినపుడు ఏమవుతుంది? ఆ సమయంలో వారు నీ వద్దకు ప్రమాణాలు చేస్తూ వచ్చి, 'దేవుని తోడు! మేము కేవలం పరోపకారం చేసే, సంఘీభావం ఏర్పరిచే ఉద్దేశంతోనే అలా చేశాం' అనంటారు. 63. వారి హృదయాలలో ఉన్న దాని గురించి దైవానికి తెలుసు. కనుక నీవు వారిని ఉపేక్షించు. కాకపోతే బోధపరుస్తూ ఉండు. వారి మనసులలో నాటుకుపోయే విధంగా వారితో మాట్లాడు.

64. మేము ఏ ప్రవక్తను పంపినా దైవాజ్ఞననుసరించి వారు అతనికి విధేయత చూపాలనే పంపాము. వారు తమ స్వయానికి అన్యాయం చేసుకున్నప్పుడు, వారు గనక నీ దగ్గరకు వచ్చి, క్షమాపణకై దైవాన్ని వేడుకుని ఉంటే, దైవప్రవక్త కూడా వారి క్షమాపణకై ప్రార్థించి ఉంటే, నిశ్చయంగా వారు దైవాన్ని క్షమాశీలిగా, కరుణాసాగరునిగా పొంది ఉండేవారు. 65. కనుక నీ ప్రభువు తోడు! వారు తమ మధ్యగల తగాదాలపై నిన్ను న్యాయనిర్ణేతగా అంగీకరించనంత వరకూ, నీవు ఇచ్చిన తీర్పుపై తమ మనసులలో ఎలాంటి సంకోచానికి తావీయకుండా, దానిని హృదయ పూర్వకంగా శిరసావహించనంత వరకూ వారు విశ్వాసులు కాజాలరు. 66. ఒకవేళ మేము గనక 'మీలో మీరు కొట్టుకు చావండి' లేదా 'మీ ఇండ్ల నుండి వెళ్ళిపోండి' అని వారిని ఆదేశించి ఉంటే, వారిలో అతి కొద్దిమంది

మాత్రమే ఆజ్ఞాపాలన చేసి ఉండేవారు. దీనికి బదులు వారు తమకు ఆజ్ఞాపించబడిన విధంగా ఆచరించి ఉంటే, అది వారి పాలిట శ్రేయస్కరం అయి ఉండేది. విశ్వాసంలో అది వారికి స్థిరత్వాన్ని ఇచ్చి ఉండేది.
67. అప్పుడు మేము మా వద్ద నుండి వారికి గొప్ప ప్రతిఫలం ప్రసాదించే వారము. 68. ఇంకా – వారికి రుజుమార్గ దర్శనం చేయించేవారం.
69. ఎవడు దైవానికి, దైవప్రవక్తకు విధేయత చూపుతాడో, అతను దైవ కటాక్షం పొందినవారితో ఉంటాడు – అంటే ప్రవక్తలు, సత్యసంధులు, అమరవీరులు, సజ్జనులు. వారి సహచర్యం ఎంత మంచిది! 70. ఇది దేవుని తరఫు నుండి ప్రాప్తించే అనుగ్రహం. (నిజం గ్రహించటానికి) దేవుని జ్ఞానం చాలు.

71. ఓ విశ్వాసులారా! ముందుగానే జాగ్రత్త పడండి. ఆ తరువాత వేర్వేరుగా గానీ, కలసికట్టుగా గానీ బయలుదేరండి. 72. మీలో జాప్యం చేసేవాడు కూడా ఉన్నాడు. పిదప ఏదయినా ఆపద వచ్చిపడితే, 'దేవుడు నాపై దయదలిచాడు. అందుకే నేను వారి వెంట లేను' అనంటాడు.
73. ఒకవేళ దేవుని అనుగ్రహం మీకేదయినా ప్రాప్తిస్తే, మీకూ – అతనికీ మధ్య ఎలాంటి ప్రేమబంధమే లేనట్లుగా మాట్లాడుతూ, 'అరెరె! నేను కూడా వారితో పాటే ఉంటే ఘనవిజయమే పొంది ఉండేవాడినే!' అంటాడు.
74. కాబట్టి పరలోకానికి బదులుగా ప్రాపంచిక జీవితాన్ని అమ్మివేసినవారు దైవమార్గంలో పోరాడాలి. దైవమార్గంలో పోరాడినవారు చంపబడినా లేదా విజయం సాధించినా మేమతనికి గొప్ప ప్రతిఫలం ప్రసాదిస్తాము.
75. అసలు మీకేమయింది? దైవమార్గంలో మీరెందుకు బలహీన స్త్రీ పురుషుల కోసం, పసిపిల్లల కోసం పోరాటం సలపటం లేదు? మరోవైపు వారు, 'ఓ ప్రభూ! దుర్మార్గులు ఉండే ఈ నగరం నుండి మమ్మి బయటికి తియ్యి. మా కొరకు నీ వద్ద నుండి ఒక రక్షకుణ్ణి నియమించు. మాకు అండగా నీ వద్ద నుండి ఒక సహాయకుణ్ణి ఏర్పాటు చెయ్యి' అని అర్థిస్తూ ఉన్నప్పటికీ (మీరు నిర్లిప్తంగా ఎందుకు ఉండిపోతున్నారు)? 76. విశ్వసించినవారు దైవమార్గంలో పోరాడుతారు. సత్యతిరస్కారులు షైతాను (తాగూత్) మార్గంలో పోరాడుతారు.

కాబట్టి మీరు షైతాను సావాసులతో పోరాడండి. నిశ్చయంగా షైతాను రణనీతి చాలా బలహీనమైనది.

77. 'మీ చేతుల్ని ఆపి ఉంచండి, నమాజును స్థాపించండి. జకాత్ ఇవ్వండి' అని ఆజ్ఞాపించబడిన వారిని నీవు చూడలేదా? ఇప్పుడు యుద్ధం చేయమని వారిని ఆదేశిస్తే జనులలోని ఒక వర్గం దైవానికి భయపడవలసిన రీతిలో జనులకు భయపడసాగింది. లేదా అంతకంటే ఎక్కువగానే! వారిలా అంటున్నారు : 'నీవు మాపై యుద్ధాన్ని ఎందుకు రుద్దావు? మరికొంత వ్యవధి మాకు ఎందుకు ఇవ్వలేదు?' వారితో ఇలా అను : 'ప్రాపంచిక లాభం బహు స్వల్పం. ధర్మపరాయణుడైన వ్యక్తికి పరలోకమే మేలైనది. మీకు అణువంత అన్యాయం కూడా జరగదు. 78. మీరెక్కడ ఉన్నాసరే, మీరు పటిష్టమయిన కోటలలో ఉన్నాసరే, మృత్యువు మిమ్మల్ని కబళిస్తుంది. ఒకవేళ వారికి గనక ఏదయినా మంచి జరిగితే, 'ఇది దేవుని తరఫు నుండి' అంటారు. అదే వారికేదయినా చెడు జరిగితే, 'ఇది నీ మూలంగానే వాటిల్లింది' అంటారు. వారికి చెప్పు : 'ఇదంతా దేవుని తరఫుననే జరుగుతుంది.' అసలు వారికేమయింది, వారు ఈ మాత్రం విషయాన్నీ అర్థం చేసుకోరేమిటి? 79. నీకు ఏ మేలు ఒనగూడినా అది దేవుని తరఫుననే. నీకు ఏ కీడు కలిగినా అది నీ మూలంగానే. (ఓ ప్రవక్తా!) మేము నిన్ను ప్రజల వద్దకు సందేశహరునిగా చేసి పంపాము. దీనికి దేవుని సాక్ష్యమే చాలు.

80. ప్రవక్తకు విధేయత చూపినవాడు దేవునికి విధేయత చూపినట్లే. మరెవడు వెనుతిరిగిపోయాడో అలాంటి వారిపై మేము నిన్ను కాపలాదారుగా చేసి పంపలేదు. 81. 'సరే, మేము విధేయతకు ఒప్పుకున్నాము' అని వారంటున్నారు. నీ దగ్గరి నుండి నిష్క్రమించిన తరువాత వారిలోని ఒక వర్గం, తాను చెప్పిన దానికి వ్యతిరేకంగా సంప్రతింపులు సాగిస్తుంది. దేవుడు వారి రహస్య మంతనాలను వ్రాసుకుంటున్నాడు. కనుక నీవు వారిని పట్టించుకోకు. దేవునిపైనే భారం మోపు. భారం మోపటానికి దేవుడు చాలు. 82. ఏమిటి, వారు ఖుర్ఆన్‌పై చింతన చేయరా? ఒకవేళ ఇది దేవుని నుండి గాక వేరొకరి తరఫు నుండి వచ్చి ఉంటే ఇందులో తీవ్రమయిన

విభేదం (వైరుధ్యం) కానవచ్చేది. 83. వారికేదయినా శాంతియుతమయిన లేదా భీతిగొలిపే విషయం అందినపుడు దానిని ఇట్టే వ్యాపింపజేస్తారు. ఒకవేళ వారు దానిని దైవప్రవక్త వద్దకుగానీ, తమలోని బాధ్యతాయుతులయిన వ్యక్తుల వరకు గానీ చేరవేస్తే, వారిలో విషయావగాహన కలవారు దాని వాస్తవికతను తెలుసుకునేవారు. మీపై దైవానుగ్రహం, ఆయన కారుణ్యం గనక లేకపోయినట్లయితే కొద్దిమంది తప్ప మీరంతా షైతాను వెంటపడేవారు.

84. కనుక నీవు దైవమార్గంలో పోరాడు. నీవు నీ స్వవిషయంలో తప్ప మరెవరి విషయంలోనూ బాధ్యుడవు కావు. అయితే నీవు విశ్వాసులను (దుష్టశిక్షణ, శిష్ట రక్షణ నిమిత్తం) ప్రేరేపిస్తూ ఉండు. త్వరలోనే దేవుడు అవిశ్వాసుల పీచాన్ని అణచవచ్చు. దేవుడు మహాశక్తిశాలి, చాలా కఠినంగా శిక్షించేవాడు. 85. ఎవరయినా ఒక మంచి విషయం కొరకు సిఫారసు చేస్తే, అందులో అతనికీ వాటా ఉంటుంది. మరెవరయినా దానికి వ్యతిరేకంగా మాట్లాడితే, అందులో అతనికీ భాగం ఉంటుంది. దేవుడు సమస్తాన్నీ పర్యవేక్షిస్తూ ఉన్నాడు. 86. ఎవరయినా మిమ్మల్ని దీవించినపుడు, మీరు కూడా వారిని అంతకంటే ఉత్తమరీతిలో దీవించండి. లేదా కనీసం అదేవిధంగానయినా స్పందించండి. నిశ్చయంగా దేవుడు ప్రతి దానికీ లెక్క తీసుకోనున్నాడు. 87. అల్లాహ్‌యే నిజ ఆరాధ్యదైవం. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేనేలేదు. ఆయన మీ అందరినీ ప్రళయదినాన సమావేశ పరుస్తాడు. అది రావటంలో సందేహానికి తావేలేదు. అల్లాహ్ మాటను మించిన నిజమయిన మాట మరెవరిది కాగలదు?

88. మరి మీకేమైపోయింది, కపటుల విషయంలో మీరెందుకు రెండు వర్గాలుగా విడిపోతున్నారు? వాస్తవానికి దేవుడు వారు మూటకట్టుకున్న దాని కారణంగా వారిని వెనక్కి మరల్చివేశాడు. ఏమిటి, దేవుడు అపమార్గం పట్టించిన వారిని మీరు సన్మార్గానికి తేదలుస్తున్నారా? దేవుడు దారి తప్పించిన వారి కోసం నీవు ఎన్నటికీ దారి కనుగొనలేవు. 89. వారు తిరస్కరించి నట్లుగానే మీరూ తిరస్కారులు కావాలని, వారూ మీరూ అంతా సమానులైపోవాలని వారు కోరుకుంటున్నారు. కాబట్టి వారు దైవమార్గంలో

హిజ్రత్ (ప్రస్థానం) చేయనంతవరకూ, వారిలో ఎవరినీ మీ మిత్రులుగా చేసుకోకండి. వారు గనక ఇందుకు అంగీకరించకపోతే, వారెక్కడ కనబడితే అక్కడ పట్టుకుని తుదముట్టించండి. వారిలో ఎవరినీ మీ స్నేహితునిగా, సహాయకునిగా చేసుకోకండి. 90. అయితే మీతో ఒడంబడిక జరిగి ఉన్న వారితో చేరిపోయిన వారికి దీని నుండి మినహాయింపు ఉంది. లేదా ఇటు మీతోనూ, అటు తమ వర్గం వారితోనూ యుద్ధం చేయటానికి మనసొప్పక మీ వద్దకు వచ్చేసిన వారికి కూడా దీని నుండి మినహాయింపు ఉంది. దేవుడే గనక కోరుకుని ఉంటే వారికి మీపై ప్రాబల్యం వొసగేవాడే. అప్పుడు వారూ మీతో పోరాడి ఉండేవారు. కనుక వారు మీ జోలికి రాకుండా ఉంటే, మీపై కయ్యానికి కాలుదువ్వకుండా, మీతో సంధికి ప్రయత్నిస్తూ ఉన్నట్లయితే, దేవుడు మీకున్నూ వారికి వ్యతిరేకంగా చర్య గైకొనేందుకు అనుమతిని ఇవ్వడు. 91. మరో రకం జనులు కూడా మీకు తారసపడతారు. వారు ఇటు మీతోనూ శాంతియుతంగా ఉండాలని, అటు తమ జాతి జనులతోనూ శాంతియుతంగా ఉండాలని కోరుకుంటారు. కాని ఉపద్రవం జనించినపుడు మాత్రం అందులో ఉరుకుతారు. వారు గనక మీ యెడల తటస్థంగా ఉండకపోతే, మీతో సంధికి యత్నించకపోతే, మీ నుండి తమ చేతులను ఆపి ఉంచకపోతే మీరు వారిని పట్టుకోండి. ఎక్కడ దొరికితే అక్కడే వారిని సంహరించండి. వారికి వ్యతిరేకంగా చర్య గైకొనేందుకు మేము మీకు స్పష్టమయిన ప్రమాణాన్ని ఇచ్చాము.

92. పొరపాటుగా తప్ప, ఒక విశ్వాసి మరో విశ్వాసిని చంపటం ఎంతమాత్రం తగదు. ఎవరయినా ఒక విశ్వాసిని పొరపాటుగా చంపినట్లయితే దానికి పరిహారంగా ఒక ముస్లిం బానిసను బానిసత్వం నుండి విడిపించాలి. హతుని వారసులకు రక్తశుల్కం ఇవ్వాలి. ఒకవేళ వారు దానిని మన్నించి వదలిపెడితే అది వేరే విషయం. అయితే ఆ ముస్లిం హతుడు మీ శత్రువర్గానికి చెందినవాడై ఉంటే, అట్టి పరిస్థితిలో ఒక విశ్వాసిని బానిసత్వం నుండి విడిపిస్తే సరిపోతుంది. ఒకవేళ అతను మీతో ఒడంబడిక జరిగి ఉన్న జాతికి చెందినవాడైనపుడు, అతని వారసులకు రక్తశుల్కం చెల్లించటంతో పాటు,

ఒక విశ్వాసికి బానిసత్వం నుండి స్వేచ్ఛను పొసగాలి. బానిసను విడిపించే స్థోమత లేనివాడు రెండు నెలల పాటు ఎడతెగకుండా ఉపవాసాలు పాటించాలి. ఇది దేవుని తరఫున నిర్ధారించబడిన పశ్చాత్తాప విధానం. దేవుడు జ్ఞాన సంపన్నుడు, వివేకసంపన్నుడు. 93. ఇక ఎవరయితే ఒక విశ్వాసిని ఉద్దేశ్యపూర్వకంగా చంపుతాడో అతనికి శిక్ష నరకం. అతనందులో ఎల్లకాలం ఉంటాడు. అతనిపై దేవుని ఆగ్రహం, ఆయన శాపం పడుతుంది. దేవుడు అతని కొరకు తీవ్రమయిన శిక్షను సిద్ధపరచి ఉంచాడు.

94. ఓ విశ్వాసులారా! మీరు దైవమార్గంలో పయనిస్తున్నప్పుడు ఆచితూచి వ్యవహరించండి. మీకు సలాం చేసిన వ్యక్తిని 'నీవు విశ్వాసివి కావు' అని అనెయ్యకండి. మీరు ప్రాపంచిక జీవితపు సామగ్రిని కోరుకునేటట్లయితే, దేవుని వద్ద పుష్కలంగా విజయ ధనాలున్నాయి. ఒకప్పుడు మీరూ ఇలాగే ఉండేవారు. తరువాత దేవుడు మిమ్మల్ని కటాక్షించాడు. కాబట్టి మీరు నిజానిజాలను తెలుసుకుని మసలుకోండి. నిశ్చయంగా దేవుడు మీ నిర్వాకాన్నంతటినీ కనిపెట్టుకునే ఉన్నాడు. 95. విశ్వాసులలో అకారణంగా (ఇంటిపట్టున) కూర్చుని ఉండిపోయేవారూ, దైవమార్గంలో తమ ధన ప్రాణాలకు తెగించి పోరాడేవారు ఎన్నటికీ సమానులు కాలేరు. ధన ప్రాణాలకు తెగించి పోరాడేవారి అంతస్తును దేవుడు కూర్చుని ఉండే వారికన్నా పెంచాడు. ఆ మాటకొస్తే దేవుడు ప్రతి ఒక్కరికీ మేలు చేస్తానని వాగ్దానం చేసినప్పటికీ గొప్ప ప్రతిఫలం దృష్ట్యా ధర్మయుద్ధం చేసే యోధులకు కూర్చుని ఉండేవారిపై ఆధిక్యతను ప్రసాదించాడు. 96. వారి కొరకు దేవుని తరఫున ఉన్నత స్థానాలు ఉన్నాయి. క్షమాపణ, కారుణ్యం ఉన్నాయి. దేవుడు క్షమా గుణం కలవాడు, కరుణాసాగరుడు.

97. తమ ఆత్మలకు అన్యాయం చేసుకుంటున్న వారి ప్రాణాలను దైవదూతలు వశపరచుకునేటప్పుడు వారిని ఇలా అడుగుతారు : 'మీరు ఏ స్థితిలో ఉండేవారు?' సమాధానంగా వారు, 'ధరిత్రిపై మేము నిస్సహాయులుగా ఉండేవారమ'ని అంటారు. అప్పుడు దైవదూతలు, 'ఏమిటి, మీరు వలసపోవటానికి దేవుని భూమి విశాలంగా లేదా?' అని అడుగుతారు.

నరకమే నివాస స్థలమయిన జనులు వీరు. అది మాచెడ్డ నివాసస్థలం. 98. అయితే నిజంగానే నిస్సహాయులై ఉన్న పురుషులు, స్త్రీలు, చిన్నపిల్లలు, తరుణోపాయం తోచక, దారీతెన్నూ కానక ఉండిపోయిన వారు (క్షంతవ్యులే). 99. దేవుడు అలాంటి వారిని మన్నించే ఆశ ఉంది. దేవుడు మన్నించేవాడు, క్షమాభిక్ష పెట్టేవాడు. 100. మరెవరయితే దైవమార్గంలో హిజ్రత్ చేస్తాడో (స్వస్థలం వదలిపోతాడో), అతను భూమిలో పెద్ద పెద్ద నివాస స్థలాలను, విస్తృతమయిన జీవిత ఒనరులను పొందుతాడు. తన స్వగృహం నుండి దేవుడు మరియు దైవప్రవక్త వైపునకు బయలుదేరిన వ్యక్తి మార్గం మధ్యలోనే మృత్యువాతన పడితే, అతని ప్రతిఫలం దైవసన్నిధిలో ఖరారైనట్లే. దేవుడు అమితంగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడు.

101. భువిలో ప్రయాణం చేస్తున్నప్పుడు మీరు నమాజును కుదించుకుంటే (ఖస్ర్ చేస్తే) అందులో తప్పేమీ లేదు. సత్యతిరస్కారులు మిమ్మల్ని బాధిస్తారనే భయం ఉన్నప్పుడు కూడా (అలా చేయవచ్చు). నిశ్చయంగా తిరస్కారులు మీ బద్ధవిరోధులే. 102. (ప్రవక్తా!) నీవు వారి మధ్యన ఉన్నప్పుడు (యుద్ధ సమయాన), వారికి నమాజ్ చేయించవలసివస్తే; వారిలోని ఒక వర్గం నీతోపాటు నిలబడాలి. వారు ఆయుధాలు ధరించి ఉండాలి. వారు సజ్దా చేయగానే నీ వద్ద నుండి వెనక్కి వెళ్ళిపోవాలి. అప్పటివరకూ నమాజ్ చేయని రెండవవర్గం వచ్చి నీతోపాటు నమాజ్ చేయాలి. వారు కూడా తమ ఆత్మ రక్షణా సామగ్రిని, ఆయుధాలను సమకూర్చుకుని అప్రమత్తంగా ఉండాలి. మీరు మీ ఆయుధాలు, రక్షణ సామగ్రి పట్ల అజాగ్రత్తకు లోనై ఉంటే, ఒక్కసారిగా మీపై విరుచుకుపడాలని తిరస్కారులు కోరుకుంటున్నారు. కాని వర్షం కారణంగా మీకు అసౌకర్యంగా ఉంటే లేదా మీరు వ్యాధిగ్రస్తులై ఉంటే ఆయుధాలను విడిచినా తప్పులేదు. అయినాసరే మీ జాగ్రత్తలో మీరుండటం మంచిది. నిశ్చయంగా దేవుడు తిరస్కారులకు అవమానకరమయిన యాతనను సిద్ధం చేసి ఉంచాడు. 103. ఇక మీరు నమాజును ముగించిన తరువాత నిలుచుని ఉన్నా, కూర్చుని ఉన్నా, మేను వాల్చి ఉన్నా దైవాన్ని స్మరిస్తూ ఉండండి. అయితే పరిస్థితులు

సద్దుమణిగిన తరువాత (నియమానుసారం) నమాజును నెలకొల్పండి. నిశ్చయంగా నమాజ్, విశ్వాసులపై నిర్ధారిత వేళలకు కట్టుబడి విధించబడిన విధ్యుక్త ధర్మం. 104. (శత్రు) జాతిని వెంబడించటంలో ధైర్యం వీడకండి. ఒకవేళ మీరు దుఃఖపూరితులై ఉన్నారనుకుంటే మీ మాదిరిగానే వారు కూడా దుఃఖపూరితులై ఉన్నారు. పైగా దేవుని నుండి వారు ఆశించని దానిని మీరు ఆశిస్తున్నారు. దేవుడు సర్వజ్ఞాని, వివేచనాపరుడు.

105. మేము ఈ గ్రంథాన్ని నీ వద్దకు సత్యంతో పాటు అవతరింపజేశాము – దేవుడు నీకు చూపిన విధంగా నీవు జనుల మధ్య తీర్పు ఇవ్వాలని! నమ్మకద్రోహుల పక్షాన వాదిగా నిలబడకు. 106. క్షమాపణకై దైవాన్ని వేడుకుంటూ ఉండు. నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, జాలి చూపేవాడు. 107. ఆత్మ ద్రోహానికి ఒడిగట్టే వారి పక్షాన నీవు వాదించకు. ద్రోహబుద్ధిగల వాడిని, పాపాత్ముణ్ణి దేవుడు ఇష్టపడడు. 108. వారు మనుషుల ముందు సిగ్గుపడుతున్నారు. దేవుని ముందు సిగ్గుపడటం లేదు. వాస్తవానికి వారు దేవుడు ఇష్టపడని విషయాలపై రహస్య మంతనాలు జరుపుతున్నప్పుడు ఆయన వారితోపాటే ఉంటాడు. దేవుడు వారి కార్యకలాపాలన్నింటినీ పరివేష్ఠించి ఉన్నాడు.

109. మీరు ప్రాపంచిక జీవితంలోనయితే వారి తరఫున వాదులాడారు. కాని ప్రళయదినాన దైవసమక్షంలో వారి తరఫున ఎవరు వాదిస్తారు? వారి తరఫున ఎవరు వకాల్తా పుచ్చుకుంటారు? 110. ఒకవేళ ఎవరయినా చెడు పనికి పాల్పడి లేదా తనకు తానే అన్యాయం చేసుకుని తరువాత దేవుణ్ణి క్షమాపణ కోరుకుంటే అతను దైవాన్ని క్షమాశీలునిగా, కృపాసాగరునిగా కనుగొంటాడు. 111. కాని మరెవడయినా పాపాన్ని మూటకట్టుకుంటే, అది అతని స్వయానికే చేటు తెస్తుంది. దేవుడు మహాజ్ఞాని, మహా వివేకి. 112. మరెవరయినా ఏదయినా తప్పుచేసి లేదా పాపానికి ఒడిగట్టి, తరువాత ఆ ఆరోపణను ఎవరో ఒక నిర్దోషిపై రుద్దితే అతడు పెద్ద అభాండాన్ని, స్పష్టమయిన పాపాన్ని తనపై మోపుకున్నవాడవుతాడు. 113. (ప్రవక్తా!) నీపైన గనక దైవానుగ్రహం, ఆయన కారుణ్యం లేకపోయి

నట్లయితే, వారిలోని ఒక వర్గం నిన్ను పెడత్రోవ పట్టించాలని కృతనిశ్చయంతో ఉంది. నిజానికి అది తనను తానే పెడత్రోవ పట్టించుకుంటుంది. వారు నీకు ఎలాంటి చెరుపు చేయలేరు. దేవుడు నీపై గ్రంథాన్నీ, వివేకాన్నీ అవతరింపజేశాడు. నీకు తెలియని వాటిని నీకు బోధపరిచాడు. నీపైన గల దైవానుగ్రహం చాలా గొప్పది.

114. వారు జరిపే ఎన్నో సమాలోచనలలో ఏ మేలూ ఉండదు. దానధర్మాలు చేయమని, లేదా మంచి చెయ్యమని లేదా ప్రజల మధ్య సత్సంబంధాల కోసం పాటుపడమని చెప్పేవాని రహస్య సమాలోచన మాత్రమే మేలుతో కూడుకున్నది. ఏ వ్యక్తి కేవలం దైవప్రసన్నత నిమిత్తం ఇలా చేస్తాడో అతనికి మేము గొప్ప ప్రతిఫలం ప్రసాదిస్తాము. 115. కాని ఎవరయినా మార్గదర్శనం స్పష్టమయిన తరువాత కూడా దైవప్రవక్తను ఎదిరించి, విశ్వాసుల మార్గాన్ని కాదని, మరో మార్గాన్ని అనుసరిస్తే, అతనిని మేము అతను మరలిన దిశలోనే నడిపిస్తాము. కడకు అతనిని నరకంలో పడవేస్తాము. అది పరమ దుర్భరమయిన నివాస స్థలం.

116. తనకు భాగస్వామ్యం కల్పించటాన్ని (షిర్క్ చేయటాన్ని) దేవుడు సుతరామూ క్షమించడు. ఇదొక్కటి తప్ప ఆయన తాను కోరినవారి ఇతర పాపాలను క్షమిస్తాడు. నిజ దైవానికి భాగస్వాముల్ని చేర్చినవాడు, దారి తప్పి బహుదూరం వెళ్ళిపోయినట్లే. 117. వారు అల్లాహ్‌ను వదలి స్త్రీ దేవతలను మొరపెట్టుకుంటున్నారు. తలబిరుసు అయిన షైతాన్‌ను పిలుస్తున్నారు. 118. కాగా; దేవుడు వాణ్ణి శపించి ఉన్నాడు. వాడు దేవునితో ఇలా చెప్పి ఉన్నాడు : 'నేను నీ దాసులలో నుండి ఒక నిర్ణీత భాగాన్ని సాధించి తీర్తాను. 119. నేను వారిని దారి మళ్ళిస్తాను. వారిలో ఆశలు నూరిపోస్తాను. పశువుల చెవులు చీల్చమని వారికి నేర్పుతాను. దాంతో వారు ఆ పని చేస్తారు. దైవిక నిర్మాణంలో మార్పులు చేయమని వారికి ప్రేరేపిస్తాను. వారు తదనుగుణంగా చేస్తారు.' ఎవరయితే నిజ దైవాన్ని కాదని షైతాన్‌ను తన స్నేహితునిగా చేసుకుంటాడో అతను నిలువునా నష్టపోయినట్లే. 120. వాడు వారికి కేవలం వాగ్దానాలు చేస్తాడు. వారిలో

ఆశలు రేపుతాడు. షైతాన్ చేసే వాగ్దానాలన్నీ మోసపూరితమైనవే. 121. అలాంటివారి నివాస స్థలం నరకమే. వారు దాన్నుండి విముక్తి పొందే దారి ఏదీ కనుగొనలేరు. 122. ఇక విశ్వసించి సత్కార్యాలు చేసినవారు; వారిని మేము క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశం కల్పిస్తాము. వారందులో కలకాలం ఉంటారు. దేవుని వాగ్దానం సత్యం. ఆడిన మాటను నిలుపుకోవటంలో అల్లాహ్ కన్నా సత్యసంధుడెవడు?

123. సాఫల్యమనేది మీ ఆశలు అభిలాషలపై గానీ, గ్రంథవహుల ఆకాంక్షలపైగానీ ఆధారభూతమై లేదు. చెడు చేసినవాడు ఎవడయినా సరే దాని ఫలితం అనుభవిస్తాడు. అతను దేవునికి ప్రతిగా తనను బలపరిచేవాణ్ణి గానీ, సహాయం చేసేవాణ్ణి గానీ పొందలేడు. 124. సదాచరణ చేసే వ్యక్తి – పురుషుడైనా, స్త్రీ అయినా – విశ్వసించినవారై ఉంటే, అలాంటివారు అవశ్యంగా స్వర్గంలో ప్రవేశిస్తారు. వారికి ఇసుమంత అన్యాయం కూడా జరగదు.

125. దేవుని వైపు ఏకోన్ముఖుడై, సదమరవర్తనుడై, ఏకాగ్రచిత్తుడైన ఇబ్రాహీమ్ విధానాన్ని అనుసరించేవాని ధర్మంకన్నా శ్రేష్ఠమయిన ధర్మం మరెవరిది కాగలదు? ఆ ఇబ్రాహీమ్‌ను దేవుడు తన ప్రియనేస్తంగా చేసుకున్నాడు. 126. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం అల్లాహ్‌దే. అల్లాహ్ ప్రతి దానినీ పరివేష్ఠించి ఉన్నాడు.

127. ప్రజలు నిన్ను స్త్రీల విషయమై ధర్మాదేశం ఏమిటి? అని అడుగుతున్నారు. వారికి చెప్పు : దేవుడు మీకు స్త్రీల విషయంలో ఆదేశాలను ఇస్తున్నాడు. ఇంకా – అనాథ స్త్రీల గురించి ఈ గ్రంథంలో ఉన్న సూక్తులు మీకు చదివి వినిపించబడుతున్నాయి. వారి కొరకు వ్రాయబడి ఉన్న దానిని మీరు ఇవ్వరు సరికదా వారిని మీ వివాహ బంధంలో తెచ్చుకోగోర్తున్నారు. బలహీనులైన బాలలకు సంబంధించిన ఆదేశాలు కూడా ఇవ్వబడ్డాయి. ఇంకా అనాథల పట్ల న్యాయంగా వ్యవహరించమని ఆదేశించబడింది. మీరు ఏ మంచి పని చేసినా నిశ్చయంగా దేవుడు దానిని తెలుసుకుంటాడు. 128. ఒకవేళ ఏ స్త్రీకయినా తన భర్తను గురించి, అతడు దుర్వ్యవహారం

చేస్తాడనో, ఉపేక్షిస్తాడనో భయం ఉంటే వారిరువురూ పరస్పరం ఒక అంగీకారానికి రావటంలో తప్పులేదు. అంగీకారమే శ్రేయస్కరం. అత్యాశ మానవ నైజంలో అంతర్లీనమై ఉంది. మీరు గనక ఉత్తమ రీతిలో వ్యవహరించి, భయభక్తులతో మసలుకున్నట్లయితే, మీ ఈ వ్యవహార సరళిని దేవుడు తప్పక తెలుసుకుంటాడు. 129. మీరు ఎంతగా కోరుకున్నప్పటికీ భార్యల మధ్య సమభావంతో మెలగటమన్నది మీ వల్ల కాని పని. కాబట్టి మీరు ఒకామె వైపు పూర్తిగా మొగ్గిపోయి, మరొకామెను అనిశ్చితస్థితిలో – వ్రేలాడుతున్నట్లుగా – వదలకండి. ఒకవేళ మీరు మీ వైఖరిని సంస్కరించుకుని, దైవభీతితో మసలుకుంటే నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, దయచూపే వాడు. 130. ఒకవేళ ఆ దంపతులు (మార్గాంతరం లేని స్థితిలో) విడిపోతే, దేవుడు తన విస్తృత భాగ్యంతో వారిలో ప్రతి ఒక్కరికీ మరొకరిపై ఆధారపడే అవసరం లేకుండా చేస్తాడు. అల్లాహ్ విశాల సంపన్నుడు, వివేక ధనుడు.

131. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం దేవునిదే. దైవానికి భయపడవలసినదిగా మేము మీకు పూర్వం గ్రంథం వొసగబడిన వారికీ, మీకూ ఆజ్ఞాపించాము. ఒకవేళ మీరు దీనిని అంగీకరించకపోతే, భూమ్యాకాశాలలో ఉన్న సమస్తానికి అధిపతి దేవుడు మాత్రమే. దేవుడు నిరపేక్షాపరుడు. సద్గుణ సంపన్నుడు. 132. భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ దేవునికే చెందుతాయి. నమ్ముకోవటానికి దేవుడు చాలు. 133. ఆయన గనక తలచుకుంటే మిమ్మల్ని తొలగించి ఓ ప్రజలారా! మీ స్థానంలో ఇతరుల్ని తీసుకువస్తాడు. ఇలా చేయగల శక్తిసామర్థ్యం ఆయనకు ఉంది. 134. ఎవరయితే కేవలం ప్రాపంచిక ప్రతిఫలాన్ని కోరుకుంటున్నాడో అతను దేవుని వద్ద ప్రాపంచిక ప్రతిఫలంతో పాటు పరలోక ప్రతిఫలం కూడా ఉందని తెలుసుకోవాలి. దేవుడు సర్వం వినేవాడు, సర్వాన్నీ గమనించేవాడు.

135. విశ్వసించిన ప్రజలారా! న్యాయానికి గట్టిగా నిలబడేవారు, దైవం కొరకు సాక్ష్యమిచ్చేవారు అవండి – ఒకవేళ అది మీ స్వయానికి, లేదా మీ తల్లిదండ్రులకు లేదా మీ బంధువులకు వ్యతిరేకంగా పరిణమిం చినాసరే. ఒకవేళ అతడు (ప్రత్యర్థి) ధనికుడయినా, పేదవాడైనా, దేవుడు

మీకన్నా అధికంగా వారిద్దరి యెడల శ్రేయోభిలాషి. కాబట్టి మీ మనోవాంఛల వెనుక పరుగెత్తి, న్యాయం నుండి వైదొలగకండి. ఒకవేళ మీరు సాక్ష్యాన్ని వక్రీకరించినా లేదా సాక్ష్యానికి విముఖత చూపినా, మీరు చేసేదంతా దైవానికి తెలుసు.

136. ఓ విశ్వాసులారా! దైవాన్నీ, దైవప్రవక్తను, దేవుడు తన ప్రవక్తపై అవతరింపజేసిన గ్రంథాన్ని, ఇంతకు పూర్వం అవతరింపజేసిన గ్రంథాన్ని విశ్వసించండి. ఎవడు దైవాన్ని, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను, అంతిమ దినాన్ని తిరస్కరించాడో, అతను మార్గం తప్పి, మార్గభ్రష్టతలో బహుదూరం వెళ్ళిపోయాడు. 137. ఎవరయితే విశ్వసించి మళ్లీ తిరస్కరించారో, మళ్లీ విశ్వసించి తిరిగి మళ్లీ తిరస్కరించారో, ఆ తర్వాత తిరస్కార వైఖరిపైనే పాతుకుపోయారో అలాంటి వారిని దేవుడు ఎట్టి పరిస్థితిలోనూ క్షమించడు. వారికి సన్మార్గం కూడా చూపడు. 138. కపటులకు వ్యధాభరితమయిన శిక్ష సిద్ధంగా ఉందన్న శుభవార్తను వినిపించు. 139. వారు విశ్వాసులను వదలి తిరస్కారుల్ని తమ స్నేహితులుగా చేసుకుంటున్నారు. ఏమిటి, వారు వాళ్ల దగ్గర గౌరవాన్ని వెతుకుతున్నారా? గౌరవమంతా దైవానికే చెందుతుంది.

140. దేవుడు ఇదివరకే తన గ్రంథంలో ఆజ్ఞను అవతరింపజేశాడు – మీరెప్పుడయినా దైవ సూచనలను తిరస్కరించే, పరిహాసమాడే మాటలు విన్నప్పుడు, వారు ఆ విషయాన్ని వదలి మరో విషయంపై మాట్లాడనంత వరకూ మీరు వారితో కలసి కూర్చోకండి. అన్యధా మీరు కూడా వారిలాంటి వారుగానే పరిగణించబడతారు. దేవుడు కపటులను, సత్యతిరస్కారులను నరకంలో ఒకచోట సమీకరించనున్నాడు. 141. ఆ కపటులు మీ పరిణామ స్వరూపం కొరకు నిరీక్షిస్తున్నారు. ఒకవేళ దేవుని తరఫున మీకేదన్నా విజయం వరిస్తే, 'ఏమిటి, మేము మీతో లేమా?' అంటారు. ఒకవేళ తిరస్కారులకు ఏదన్నా భాగం లభిస్తే, 'ఏమిటి, మీకు వ్యతిరేకంగా పోరాడే సామర్థ్యం మాకు లేదనుకున్నారా? అయినప్పటికీ మేము మిమ్మల్ని ముస్లింల బెడద

నుండి రక్షించాము' అనంటారు. దేవుడే మీరందరి మధ్య ప్రళయదినాన తీర్పు చేస్తాడు. దేవుడు ముమ్మాటికీ తిరస్కారులకు విశ్వాసులపై ప్రాబల్యం వహించే దారి ఇవ్వడు.

142. ఈ కపటులు దైవాన్ని మోసగిస్తున్నారు. వాస్తవానికి దేవుడే వారిని మోసంలో పడవేశాడు. వారు నమాజు కోసం నిలబడుతున్నప్పుడు మరీ బద్ధకంతో – జనులకు చూపే ఉద్దేశ్యంతో నిలబడతారు. బహుకొద్దిగానే దైవాన్ని స్మరిస్తారు. 143. వారు రెంటికీ (ఈమాన్‌కి – కుఫ్రుకి) మధ్య వ్రేలాడుతున్నారు. పూర్తిగా ఇటూ లేరు – అటూ లేరు. దేవుడే దారి తప్పించిన వానికై నీవు ఏ దారినీ కనుగొనలేవు. 144. ఓ విశ్వాసులారా! విశ్వసించిన వారిని కాదని సత్యతిరస్కారులను మీ సావాసులుగా చేసుకోకండి. ఏమిటి, మీకు వ్యతిరేకంగా మీరే స్పష్టమయిన ప్రమాణం దైవానికి అందజెయ్యదలుస్తున్నారా? 145. నిశ్చయంగా కపటులు నరకంలోని అన్నింటికన్నా అధమ శ్రేణిలో ఉంటారు. వారికి సహాయపడే వారెవరినీ నీవు కానలేవు. 146. అయితే వారిలో పశ్చాత్తాపపడి, తమను సంస్కరించుకుని, దేవుని ఆధారాన్ని గట్టిగా పట్టుకుని, తమ ధర్మాన్ని కేవలం దేవుని కొరకే ప్రత్యేకించుకున్నవారు – అలాంటివారు మాత్రం విశ్వాసులతోనే ఉంటారు. దేవుడు విశ్వాసులకు గొప్ప ప్రతిఫలం ఇస్తాడు. 147. మీరు కృతజ్ఞతా పూర్వకంగా మెలగి, విశ్వాస పంథాను అనుసరిస్తే దేవునికి మిమ్మల్ని శిక్షించాల్సిన పనేం పడింది? దేవుడు అమితంగా ఆదరించేవాడు, సర్వం తెలిసినవాడు. ◆ (6) 148. దేవుడు దుర్భాషలాడటాన్ని ఎంతమాత్రం ఇష్టపడడు – ఎవరిపైనయినా జులుం జరిగితే తప్ప. దేవుడు అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు. 149. మీరు మేలును వ్యక్తం చేసినా లేక దాచినా లేదా ఏదయినా చెడును మన్నించినా – దేవుడు మన్నించేవాడు, సర్వాధికారం కలవాడు. 150. నిశ్చయంగా ఎవరయితే దైవాన్ని, దైవప్రవక్తను తిరస్కరిస్తున్నారో, దైవం మరియు ఆయన ప్రవక్తల మధ్య భేదభావం చూపుతున్నారో, 'మేము కొందరిని విశ్వసిస్తాము, కొందరిని విశ్వసించము' అని అంటూ

దానికి మధ్యన మరో దారిని తీయగోరుతారో, 151. అలాంటివారే కరడుగట్టిన తిరస్కారులు. మేము తిరస్కారుల కొరకు అవమానకరమయిన యాతనను సిద్ధంగా ఉంచాము. 152. మరెవరయితే దైవాన్ని, దైవప్రవక్త లందరినీ విశ్వసించి, వారి మధ్య ఎలాంటి విచక్షణ చూపకుండా ఉంటారో – అలాంటి వారికి దేవుడు వారి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు, దేవుడు క్షమాశీలి, దయాశీలి.

153. ఆకాశం నుండి తమపై ఒక గ్రంథాన్ని అవతరింపజేయమని గ్రంథవహులు నిన్ను అడుగుతున్నారు. వారు మూసాను ఇంతకంటే పెద్ద వస్తువే కోరి ఉన్నారు. 'దేవుణ్ణి మా ఎదుటే ప్రత్యక్షపరచు' అని వారన్నారు. వారి ఈ అతివాదం మూలంగా వారిపై పిడుగుపడింది. తరువాత వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలు వచ్చాయి. అయినాసరే వారు ఆవు దూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. మేము ఈ చేష్టను కూడా మన్నించాము. ఇంకా మూసాకు మేము స్పష్టమయిన ప్రమాణాన్ని ప్రసాదించాము. 154. మేము వారిపైకి తూరు పర్వతాన్ని లేపాము – వారిచేత ప్రమాణం చేయించటానికి. 'తలదించుకుని ముఖద్వారంలో ప్రవేశించండి' అని మేము వారిని ఆదేశించాము. 'సబ్త్ (శనివారం) విషయంలో హద్దు మీరకండి' అని కూడా మేము వారికి నిర్దేశించాము. ఈ నేపథ్యంలో మేము వారి నుండి గట్టి వాగ్దానం తీసుకున్నాము.

155. కాని వారు వాగ్దానభంగం చేశారు. దైవ సూచనలను త్రోసిపుచ్చారు. దైవప్రవక్తలను అన్యాయంగా హత్య చేశారు. ఇంకా 'మా హృదయాలు ముకుళితమై ఉన్నాయి' అని చెప్పారు. ఈ కారణంగానే వారికి ఈ శాస్తి జరిగింది. వాస్తవమేమిటంటే దేవుడు వారి తిరస్కార వైఖరి కారణంగా వారి హృదయాలకు సీలు వేశాడు. అందువల్ల వారు బహు స్వల్పంగానే విశ్వసిస్తారు. 156. వారి తిరస్కారం వల్ల, వారు మర్యమ్‌పై తీవ్రమయిన అపవాదు మోపటం వల్ల, 157. 'మేము మర్యమ్ కుమారుడగు ఈసాను, దైవప్రవక్తను హత్య చేశాము' అని వారు చెప్పటం వల్ల (వారు శిక్షకు

పాత్రులయ్యారు). వాస్తవానికి వారు అతన్ని చంపనూ లేదు, శిలువపైకి ఎక్కించనూ లేదు. పైగా ఆ వ్యవహారం వారికి సందేహాస్పదం చేయబడింది. ఈ విషయమై విభేదించినవారు కూడా ఇందులో సంశయానికి లోనై ఉన్నారు. దీని గురించిన ఎలాంటి జ్ఞానం వారికి లేదు. వారు కేవలం ఊహలను అనుసరిస్తున్నారు. నిశ్చయంగా వారు అతనిని చంపలేదు. 158. పైగా దేవుడు అతనిని తన వైపునకు లేపుకున్నాడు. దేవుడు మహాశక్తిమంతుడు, వివేక సంపన్నుడు.

159. గ్రంథం కల ప్రజలలో ఏ ఒక్కడూ అతని (క్రీస్తు) మరణానికి ముందు అతనిని విశ్వసించకుండా ఉండడు. ప్రళయదినాన అతను వారిపై సాక్షిగా ఉంటాడు. 160. యూదుల దుర్వర్తన కారణంగా మేము వారికి ధర్మసమ్మతంగా ఉన్న ఎన్నో పవిత్ర వస్తువులను నిషేధించాము. ఇంకా వారు దైవమార్గంలో ఎక్కువగా అవరోధాలు సృష్టించటం వల్లనూ, 161. వారు తమ కొరకు నిషేధించబడిన వడ్డీని పుచ్చుకోవటం వల్లనూ, ప్రజల సొత్తును అధర్మంగా స్వాహా చేయటం వల్లనూ (వారికి ఈ శాస్తి జరిగింది). వారిలోని తిరస్కారుల కొరకు మేము బాధాకరమయిన శిక్షను సిద్ధం చేసి ఉంచాము. 162. అయితే వారిలో లోతైన జ్ఞానం కలవారు, విశ్వసించినవారు నీపై అవతరింపజెయ్యబడిన దానిని నీకు పూర్వం అవతరింపజెయ్యబడిన దానిని విశ్వసిస్తారు. వారు నమాజ్‌ను సక్రమంగా పాటిస్తారు. జకాత్ ఇస్తారు. దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసించేవారై ఉంటారు. అలాంటివారికి మేము తప్పకుండా గొప్ప ప్రతిఫలం ప్రసాదిస్తాము.

163. మేము నూహ్ వైపు, అతని తరువాతి ప్రవక్తల వైపు పంపినట్లే నీ వైపునకు కూడా దివ్యవాణి (వహీ)ని పంపాము. ఇంకా మేము ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాఖ్, యాఖూబ్, యాఖూబ్ సంతానం, ఈసా, అయ్యూబ్, యూనుస్, హారూన్, సులైమాన్‌ల వైపునకు దివ్యవాణి (వహీ) పంపి ఉన్నాము. ఇంకా మేము దావూదుకు జబూర్ వొసగాము. 164. మేము పంపిన ప్రవక్తలలో కొందరి స్థితిగతులను ఇదివరకే నీకు వినిపించాము. మరికొందరు

ప్రవక్తల వృత్తాంతాలను నీకు వినిపించలేదు. ఇక మూసా విషయానికి వస్తే, దేవుడు అతనితో సంభాషించాడు. 165. దేవుడు తన ప్రవక్తలను శుభవార్తల్ని వినిపించేవారుగా, భయపెట్టేవారుగా చేసి పంపాడు. ఈ ప్రవక్తల తరువాత ప్రజల వద్ద దైవానికి వ్యతిరేకంగా వాదించటానికి ఏ ఆధారమూ మిగలకూడదని. దేవుడు తిరుగులేనివాడు, వివేచనాపరుడు.

166. దేవుడు ఈ గ్రంథం ద్వారా నీపై అవతరింపజేసినదంతా, తన జ్ఞానంతో అవతరింపజేశానని సాక్ష్యమిస్తున్నాడు. దైవదూతలు కూడా దీనికి సాక్షులుగా ఉన్నారు. అసలు సాక్షిగా దేవుడు చాలు. 167. నిశ్చయంగా – ఎవరు సత్యతిరస్కారానికి పాల్పడి, దైవమార్గం నుండి (ఇతరులను కూడా) నిరోధించారో వారు దారి తప్పి అపమార్గంలో బహుదూరం వెళ్ళిపోయారు. 168. నిశ్చయంగా – ఎవరు తిరస్కారానికి ఒడిగట్టి, దౌర్జన్యం చేస్తారో, వారిని దేవుడు సుతరామూ క్షమించడు. వారికి మార్గం కూడా చూపడు – 169. నరక బాట తప్ప. వారందులో శాశ్వతంగా ఉండిపోతారు. ఇలా చేయటం దేవునికి చాలా తేలిక. 170. ప్రజలారా! ప్రవక్త మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి సత్యం తీసుకువచ్చాడు. కనుక విశ్వసించండి. అది మీకే మేలు. ఒకవేళ మీరు త్రోసిపుచ్చితే భూమ్యాకాశాలలో ఉన్నదంతా దైవానికే చెందుతుంది. దేవుడు జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు.

171. గ్రంథం కల ప్రజలారా! మీ ధర్మంలో మీరు అతిశయిల్లకండి. దేవుని గురించి సత్యం తప్ప మరో మాటను అనకండి. మర్యమ్ కుమారుడగు ఈసా మసీహ్ (ఏసుక్రీస్తు) దైవప్రవక్త, ఆయన వాక్కు మాత్రమే. దానిని ఆయన మర్యమ్ వైపు పంపాడు. ఇంకా – ఆయన తరఫు నుండి ఒక ఆత్మ. కనుక మీరు దైవాన్ని, ఆయన ప్రవక్తలను విశ్వసించండి. 'దేవుళ్ళు ముగ్గురు' అని అనకండి. (దీనిని) మానుకోండి. ఇదే మీ కొరకు శ్రేయస్కరం. ఆరాధ్య దైవమైతే ఒక్కడైన అల్లాహ్‌యే. ఆయనకు సంతానం ఉంది అనే విషయానికి ఆయన అతీతుడు, పవిత్రుడు. ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న సమస్తం ఆయనదే. కార్య సాధకునిగా అల్లాహ్ చాలు. 172. తానొక దైవదాసుడు

కావటంపై మసీహ్ (ఏసుక్రీస్తు) చిన్నబుచ్చుకోలేదు. దైవ సామీప్యం పొందిన దూతలు కూడా దీనిని అగౌరవంగా తలపోయలేదు. దైవదాస్యం చేయటాన్ని తలవంపుగా భావించి, గర్వాతిశయం ప్రదర్శించేవారిని దేవుడు అవశ్యంగా తన సమక్షంలో సమావేశపరుస్తాడు. 173. మరెవరు విశ్వసించి, సదాచరణ చేశారో, వారికి వారి పూర్తి ప్రతిఫలం ఇస్తాడు. తన అనుగ్రహం నుండి మరింతగా వొసగుతాడు. మరెవరయితే దైవ దాస్యాన్ని నామోషీగా భావించి, అహంకారం ప్రదర్శించారో, వారిని బాధాకరమయిన యాతనకు గురి చేస్తాడు. వారు దేవునికి ప్రతిగా తమను ఆదుకునే ఏ స్నేహితుణ్ణిగానీ, సహాయకుణ్ణిగానీ పొందలేరు.

174. ప్రజలారా! మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి ఒక స్పష్టమయిన నిదర్శనం వచ్చేసింది. మేము మీ వైపునకు చాలా స్పష్టమయిన జ్యోతిని అవతరింపజేశాము. 175. కనుక దేవుని యందు విశ్వాసం కలిగి, ఆయన ఆధారాన్ని గట్టిగా పట్టుకున్నవారిని ఆయన తప్పకుండా తన కారుణ్యంలో, అనుగ్రహంలో ప్రవేశింపజేస్తాడు. వారికి తన వైపు వచ్చే రుజుమార్గం చూపుతాడు. 176. వారు నిన్ను ('కలాలా' గురించి) ధర్మాదేశం ఏమిటని అడుగుతున్నారు. వారికి చెప్పు : దేవుడు 'కలాలా' (సోదరుడు, సోదరి తప్ప మరో వారసుడు లేని వ్యక్తి) గురించి మీకు ఇలా ఆజ్ఞాపిస్తున్నాడు. ఎవరయినా ఒక వ్యక్తి చనిపోతే, అతనికి సంతానం లేకుంటే, అతనికి ఒక సోదరి మాత్రమే ఉంటే, అతను వదలిన ఆస్తిలో ఆమెకు సగభాగం ఉంటుంది. ఒకవేళ సంతానంలేని సోదరి మరణిస్తే ఆమె సోదరుడు ఆమె ఆస్తికి వారసుడవుతాడు. ఒకవేళ మృతునికి ఇద్దరు సోదరీలు ఉంటే; అతను వదలిపోయిన మొత్తం ఆస్తిలో మూడింట రెండు వంతులకు వారు వారసులవుతారు. ఒకవేళ అనేకమంది సోదరసోదరీమణులుంటే ఒక పురుషునికి ఇద్దరు స్త్రీల వాటాకు సమానంగా లభిస్తుంది. మీరు దారి తప్పకుండా ఉండేటందుకు దేవుడు మీకు (ఈ ధర్మాదేశాలను) విపులీక రిస్తున్నాడు. దేవుడు ప్రతిదీ క్షుణ్ణంగా తెలిసినవాడు.

# 5. అల్ మాఇద (ఆహార పళ్ళెం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. విశ్వసించిన ప్రజలారా! ఒప్పందాలను పూర్తిగా నెరవేర్చండి. మీ కొరకు పశు కోవకు చెందిన జంతువులన్నీ ధర్మసమ్మతం (హలాల్) గావించబడ్డాయి – ముస్ముందు ప్రస్తావించబడేవి తప్ప. అయితే ఇహ్రామ్ దీక్ష బూని ఉన్నప్పుడు వేటాడటాన్ని ధర్మసమ్మతంగా భావించకండి. దేవుడు తాను కోరిన దానిని ఆజ్ఞాపిస్తాడు.

2. ఓ విశ్వాసులారా! దైవ చిహ్నాలనుగానీ, పవిత్ర (నిషిద్ధ) మాసాలనుగానీ అగౌరవపరచకండి. (పుణ్యక్షేత్ర పరిధిలో) ఖుర్బానీ పశువుల జోలికి పోవటం గానీ, మొక్కుబడికి సూచనగా మెడలలో పట్టాలున్న జంతువులపై దాడిచేయటంగానీ చేయకండి. తమ ప్రభువు అనుగ్రహాన్ని, ఆయన ప్రసన్నతను అన్వేషిస్తూ పవిత్ర గృహం వైపు బయలుదేరిన వారిని బాధించకండి. అయితే మీరు ఇహ్రామ్ దీక్ష నుండి బయటపడిన తరువాత వేటాడవచ్చు. ఏదయినా ఒక వర్గం మిమ్మల్ని పవిత్ర ఆరాధనాలయం (మస్జిదె హరామ్) నుండి అడ్డుకుందన్న కక్ష మిమ్మల్ని వారిపై అత్యాచారానికి పాల్పడేలా చేయరాదు సుమా! సత్కార్యం, దైవభక్తి లాంటి పనులలో మీరు సహకరించు కోండి. పాపం, అత్యాచారం వంటి పనులలో ఎంతమాత్రం సహకరించవద్దు. దైవానికి భయపడండి. నిశ్చయంగా దేవుడు కఠినంగా దండించేవాడు.

3. మీ కొరకు నిషేధించబడ్డాయి : మృత జంతువు, పందిమాంసం, దేవుని పేరున గాక వేరొకరి పేరిట జిబహ్ చేయబడిన పశువు, గొంతు పిసకటం వల్ల చచ్చిపోయినది, లేదా గాయం వల్ల చచ్చిపోయినది లేదా పైనుండి పడటం వల్ల మరణించినది లేదా కొమ్ము తగిలిన కారణంగా ప్రాణం విడిచినది లేదా క్రూరమృగం చీల్చి తిన్నది. అయితే బ్రతికి ఉండగా మీరు జిబహ్ చేసినది మాత్రం నిషిద్ధం కాదు – ఇంకా దైవేతర పీఠాల

దగ్గర బలి ఇచ్చినది కూడా నిషిద్ధమే. ఇంకా బాణాల ద్వారా అదృష్టాన్ని పరీక్షించుకోవటం కూడా అధర్మమే. ఇది పాపకార్యం. నేడు సత్య తిరస్కారులు మీ ధర్మావలంబన మూలంగా హతాశులయ్యారు. కనుక మీరు వారికి భయపడకండి, నాకు మాత్రమే భయపడండి. ఈ రోజు నేను మీ కొరకు మీ ధర్మాన్ని పూర్తి చేశాను. మీపై నా అనుగ్రహాన్ని కూడా పూర్తిగావించాను. ఇంకా మీ కోసం ఇస్లాంను జీవన ధర్మంగా సమ్మతించాను. అయితే ఎవరయినా ఆకలి బాధకు తట్టుకోలేక, పాపానికి పాల్పడే ఉద్దేశం లేకుండా – వాటిలో దేన్నయినా తింటే (అతని పాలిట) దేవుడు క్షమాశీలుడు, దయాకరుడు.

4. తమ కొరకు ధర్మ సమ్మతం (హలాల్) గావించబడినవి ఏవి? అని వారు నిన్ను అడుగుతున్నారు. వారికి చెప్పు : పరిశుద్ధమయిన వస్తువులన్నీ మీకు ధర్మసమ్మతం చెయ్యబడ్డాయి. మీరు శిక్షణ ఇచ్చిన వేటాడే జంతువులు – దేవుడు మీకు నేర్పిన జ్ఞానం ఆధారంగా మీరు వాటికి శిక్షణ ఇచ్చి ఉంటే – అవి మీ కొరకు వేటాడి పట్టుకున్న జంతువులను కూడా మీరు తినవచ్చు. అయితే వాటిమీద దైవనామం స్మరించండి. దైవానికి భయపడండి. నిశ్చయంగా దేవుడు శీఘ్రంగా లెక్క తీసుకోనున్నాడు. 5. ఈ రోజు పరిశుద్ధ వస్తువులన్నీ మీకు ధర్మసమ్మతం (హలాల్) గా నిర్ణయించబడ్డాయి. గ్రంథం వొసగబడిన వారి భోజనం మీకు, మీ భోజనం వారికి హలాల్. విశ్వాసులలోని శీలవతులు, మీకు పూర్వం గ్రంథం వొసగబడిన వారిలోని శీలవతులు కూడా మీకు ధర్మసమ్మతమే. అయితే మీరు వారికి వారి మహర్ చెల్లించి, వివాహం ద్వారా వారికి రక్షణ కల్పించాలి. అంతేగాని విచ్చలవిడిగా కామక్రీడలకు పాల్పడటమో, చాటుమాటుగా సరససల్లాపాలు సాగించటమో చేయరాదు. ఎవడయితే విశ్వాసాన్ని తిరస్కరిస్తాడో అతను చేసుకున్న కర్మలన్నీ వృధా అయిపోతాయి. అతను పరలోకంలో ఘోరంగా నష్టపోతాడు.

6. విశ్వాసులారా! మీరు నమాజు కొరకు లేచినపుడు మీ ముఖాలను, మోచేతుల సమేతంగా మీ రెండు చేతులను కడుక్కోండి. మీ తలల మసహ్

చేయండి. చీలమండల సమేతంగా మీ కాళ్లను కడగండి. ఒకవేళ మీరు లైంగిక అశుద్ధావస్థకు గురై ఉంటే స్నానం చేయండి. ఒకవేళ మీరు వ్యాధిగ్రస్తులైతే లేదా ప్రయాణంలో ఉంటే లేదా మీలో ఎవరయినా కాలకృత్యాలు తీర్చుకుని వస్తే లేదా మీరు భార్యతో సమాగమం జరిపి ఉంటే – అట్టి పరిస్థితిలో మీకు నీరు లభ్యం కాకపోతే పరిశుభ్రమయిన మన్నుతో 'తయమ్ముమ్' చేసుకోండి. మీ ముఖాలను, చేతులను దాంతో తడుముకోండి. మిమ్మల్ని ఇబ్బందుల పాలు చేయాలని దేవుడు కోరుకోవటం లేదు. మిమ్మల్ని పరిశుద్ధపరచాలన్నది, మీపై తన వరాన్ని పరిపూర్తి గావించాలన్నది ఆయన అభిలాష – తద్వారా మీరు కృతజ్ఞులవుతారని.

7. మీపై దేవుడు కురిపించిన వరాన్ని జ్ఞాపకం చేసుకోండి. ఆయన మీ నుండి తీసుకున్న వాగ్దానాన్ని కూడా స్మరించుకోండి. అప్పుడు మీరు, 'మేము విన్నాము, శిరసావహించాము' అని చెప్పారు. దైవానికి భయపడండి. నిశ్చయంగా దేవుడు అంతర్యాల్లోని రహస్యాలను సయితం ఎరిగినవాడు.
8. విశ్వసించిన వారలారా! దేవుని కోసం (నీతికి) నిలబడేవారు, న్యాయానికి సాక్ష్యమిచ్చేవారు అవండి. ఏదయినా ఒక వర్గంతో ఉన్న శత్రుత్వం మిమ్మల్ని వారిపై అన్యాయానికి పురికొల్పరాదు సుమా! న్యాయం చెయ్యండి. అది దైవభక్తికి సన్నిహితమైనది. దైవానికి భయపడండి. నిశ్చయంగా మీరు చేసే పనులన్నీ దైవానికి ఎరుకే. 9. విశ్వసించి, సదాచరణ చేసే వారికి క్షమాపణతో పాటు మహత్తర ప్రతిఫలం ఉంటుందని దేవుడు వాగ్దానం చేశాడు.
10. మరెవరు సత్యాన్ని తిరస్కరించారో, మా సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చారో – అలాంటివారే నరకవాసులు. 11. ఓ విశ్వాసులారా! దేవుడు మీకు చేసిన ఉపకారాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. అప్పుడు ఒక వర్గం మీపై చేయి చేసుకోవాలని అనుకుంది. అయితే దేవుడు వారి చేతులు మీపై లేవకుండా ఆపాడు. దైవానికి భయపడండి. విశ్వాసులు నమ్ముకోవలసింది దైవాన్నే.

12. దేవుడు ఇస్రాయీల్ సంతతి వారి చేత గట్టి (విధేయతా) ప్రతిజ్ఞ

చేయించాడు. మేము వారిలో నుండి పన్నెండుమంది పర్యవేక్షకుల్ని నియమించాము. దేవుడిలా అన్నాడు : 'నేను మీకు అండగా ఉన్నాను. మీరు గనక నమాజును స్థాపిస్తే, జకాత్ చెల్లిస్తే, నా ప్రవక్తలను విశ్వసించి, వారికి ఆదరువుగా నిలిస్తే, దేవునికి మంచి రుణం ఇస్తే, నేను మీ పాపాలను మీ నుండి అవశ్యంగా దూరం చేస్తాను. క్రింద సెలయేరులు పారే స్వర్గవనాలలో మిమ్మల్ని ప్రవేశింపజేస్తాను. ఇక దీని తరువాత కూడా మీలో ఎవరయినా తిరస్కార వైఖరికి ఒడిగడితే, అతను రాచబాట నుండి తప్పిపోయినట్లే.' 13. కాని తరువాత వారు తాము చేసిన బాసను నిలుపుకోలేదు. ఈ కారణంగా మేము వారిని శపించాము. వారి హృదయా లను కఠినం చేసేశాము. వారు దైవవాక్కును దాని స్థానం నుండి తొలగించి సందర్భరహితం చేసేస్తారు. వారికి చేసిన ఉపదేశంలోని ఓ పెద్ద భాగాన్ని వారు మరచిపోయారు. వారు నిత్యం ఏదో ఒక విద్రోహానికి పాల్పడుతున్న సమాచారం నీకు అందుతూనే ఉంటుంది – వారిలో కొద్దిమంది మాత్రమే ఇలాంటి చేష్టలకు దూరంగా ఉన్నారు. వారిని మన్నించు. వారిని ఉపేక్షించు. నిశ్చయంగా దేవుడు సదాచార ధనులను ప్రేమిస్తాడు.

14. 'మేము నసారాలము (క్రైస్తవులము)' అని అంటున్న వారిచేత కూడా మేము వాగ్దానం తీసుకున్నాము. కాని వారు కూడా తమకు చేయబడిన హితోపదేశంలోని అత్యధిక భాగాన్ని మరచిపోయారు. మరి మేము ప్రళయదినం వరకూ, వారి మధ్య శత్రుత్వం, వైషమ్యం పొందుపరిచాము. కడకు దేవుడు వారికి వారు కల్పిస్తూ ఉన్నదంతా తెలియపరుస్తాడు.

15. గ్రంథం కల ప్రజలారా! మీ వద్దకు మా ప్రవక్త విచ్చేశాడు. మీరు కప్పిపుచ్చుతూ ఉన్న దైవగ్రంథంలోని ఎన్నో విషయాలను అతను మీకు విడమరచి చెబుతున్నాడు. మరెన్నో విషయాలను మన్నిస్తున్నాడు. నిశ్చయంగా మీ వద్దకు దేవుని తరఫు నుండి ఒక జ్యోతి, ప్రస్ఫుటమయిన గ్రంథం వచ్చేసింది. 16. దాని ద్వారా దేవుడు, తన ప్రసన్నతను ఆశించేవారికి శాంతిమార్గాలను చూపుతాడు. ఇంకా తన అనుజ్ఞతో వారిని కారుచీకట్ల

నుండి వెలికితీసి వెలుగు వైపునకు తీసుకువస్తున్నాడు. రుజుమార్గం వైపునకు వారికి దర్శకత్వం వహిస్తున్నాడు. 17. నిశ్చయంగా దేవుడే మర్యమ్ కుమారుడైన మసీహ్ (ఏసుక్రీస్తు) అని అన్నవారు సత్య తిరస్కారానికి పాల్పడ్డారు. వారికి చెప్పు : దేవుడే గనక మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను, అతని తల్లిని, భూమండలంలో ఉన్న వారందరినీ నాశనం చేయగోరితే, ఆయన్ని ఈ సంకల్పం నుండి ఆపగల శక్తి ఎవరికుంది? ఆకాశాలలోనూ, భూమిలోనూ, వాటిమధ్య నున్న సమస్త వస్తువులపై సర్వసత్తాధికారం దైవానికే చెందుతుంది. ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు. దేవునికి ప్రతి వస్తువుపై సర్వాధిపత్యం ఉంది.

18. 'మేము దేవుని కుమారులము, ఆయనకు ప్రీతిపాత్రులము' అని యూదులూ, క్రైస్తవులు అంటారు. వారిని అడుగు : 'మరైతే ఆయన మీ పాపాలకుగాను మిమ్మల్ని ఎందుకు శిక్షిస్తున్నాడు? అది కాదు. అసలు విషయమేమంటే; మీరు కూడా ఆయనచే సృష్టించబడిన జీవుల్లాగా సామాన్యజనులు. ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు, తాను కోరిన వారిని శిక్షిస్తాడు. భూమ్యాకాశాల, వాటి మధ్యనున్న సమస్తానికి సామ్రాజ్యాధిపతి దేవుడే. ఆయన వద్దకే (అందరూ) మరలవలసి ఉంది. 19. గ్రంథవహులారా! మీ వద్దకు మా ప్రవక్త వచ్చాడు. అతను మీకు అన్నీ విడమరచి చెబుతున్నాడు. ప్రవక్తల ఆగమనంలో ఓ సుదీర్ఘ విరామం తరువాత (ఇది మేలి మలుపు). 'మా వద్దకు శుభవార్త వినిపించేవాడు, హెచ్చరిక చేసేవాడు ఎవడూ రాలేదే!' అని మీరు అనకుండా ఉండాలని (మేమీ మహత్తర ఏర్పాటు చేశాము). ఇదిగో, శుభవార్తను అందజేసేవాడు, సావధానపరచేవాడు ఇప్పుడు మీ వద్దకు విచ్చేశాడు. దేవుడు ప్రతిదీ చేయగల దిట్ట.

20. మూసా తన జాతి జనులతో ఇలా చెప్పిన సందర్భాన్ని మననం చేసుకోండి! 'ఓ నా జాతి వారలారా! దేవుడు మీకు చేసిన మహోపకారాన్ని జ్ఞాపకం చేసుకోండి. ఆయన మీలో ప్రవక్తల్ని ప్రభవింపజేశాడు. మిమ్మల్ని రాజులుగా చేశాడు. లోకవాసులలో ఎవరికీ ప్రసాదించని దానిని మీకు

ప్రసాదించాడు. 21. నా జాతి జనులారా! దేవుడు మీకు రాసిపెట్టిన ఈ పవిత్ర భూభాగంలో ప్రవేశించండి. వెనుతిరగకండి. వెనక్కి మరలి వచ్చారంటే మీరే నష్టపోతారు.' 22. సమాధానంగా వారిలా అన్నారు : 'మూసా! అక్కడ పరాక్రమశాలురైన జనులున్నారు. వారు అక్కణ్ణుంచి తొలగిపోనంత వరకూ మేము అందులో ప్రవేశించేది లేదు. వారు గనక అక్కడి నుంచి నిష్క్రమిస్తే అప్పుడు మేము ప్రవేశించగలము.' 23. వారిలో దైవానికి భయపడే ఇద్దరు మగధీరులున్నారు. వారిరువురినీ దేవుడు కటాక్షించాడు. వారిలా అన్నారు: 'మీరు వారిపై మెరుపుదాడి చేసి, నగర ముఖద్వారంలో జొరబడితే చాలు, గెలుపు మీదే అవుతుంది. మీరు గనక విశ్వసించినవారైతే దేవుణ్ణే నమ్ముకోండి.' 24. వారిలా అన్నారు : 'ఓ మూసా! వారు అక్కడ ఉన్నంత వరకూ మేము వెళ్ళలేము. కావాలంటే నువ్వూ, నీ ప్రభువూ పోయి పోరాడండి. మేమిక్కడే కూర్చుని ఉంటాము.'

25. అప్పుడు మూసా ఇలా విన్నవించుకున్నాడు : 'నా ప్రభూ! స్వయంగా నేనూ, నా సోదరుడు తప్ప వేరెవరూ నా అదుపాజ్ఞలలో లేరు. కనుక నీవు మాకూ – ఈ అవిధేయ జనులకు మధ్య వేర్పాటు చెయ్యి.' 26. అప్పుడు దేవుడిలా సెలవిచ్చాడు : "ఇక ఈ ప్రదేశం వీరికి నలభై ఏండ్ల వరకూ నిషేధించబడింది. వీళ్లు భువిపై నిరాశ్రయులై తిరుగుతుంటారు. కనుక నీవు ఈ అవిధేయ జనులపై విచారపడకు."

27. వీరికి ఆదమ్ కుమారులిద్దరి (హాబీల్, ఖాబీల్) యదార్థ గాథను వినిపించు. వారిరువురూ బలిదానాన్ని సమర్పించుకోగా, వారిలో ఒకరి బలిదానం స్వీకరించబడింది. రెండవవాని బలిదానం స్వీకరించబడలేదు. దాంతో రెండవ అతను, 'నేను నిన్ను చంపేస్తాన'న్నాడు. దానికి సమాధానంగా అతనిలా అన్నాడు : 'దేవుడు భక్తిపరుల సేవలనే స్వీకరిస్తాడు. 28. ఒకవేళ నువ్వు నన్ను చంపటానికి చెయ్యి ఎత్తినా, నేను మాత్రం నిన్ను చంపటానికి చెయ్యి ఎత్తను. నేను సర్వలోక ప్రభువు అయిన దైవానికి భయపడుతున్నాను. 29. నా పాపాన్నీ, నీ పాపాన్ని కూడా నువ్వే ఎత్తుకుని, నువ్వు నరకవాసులలో చేరిపోవాలని నేను భావిస్తున్నాను. దుర్మార్గులకు తగిన శాస్తి ఇదే.'

30. తరువాత అతని మనసు తన సోదరుని హత్యకే ప్రేరేపించింది. అంతే. అతను అతనిని చంపేసి, నష్టపోయినవారిలో చేరిపోయాడు. 31. తరువాత దేవుడు ఒక కాకిని పంపాడు. అది నేలను త్రవ్వసాగింది – తన సోదరుని శవాన్ని ఎలా (భూమిలో) మరుగుపరచాలో అతనికి చూపించ టానికి! (అది చూసిన) అతను, 'అయ్యో! నా పరిస్థితి ఎంత దయనీయం. నా సోదరుని శవాన్ని మరుగుపరిచే విషయంలో ఈ కాకి లాంటివాణ్ణి కూడా కాలేకపోయానే!' అన్నాడు. ఆ తరువాత అతను సిగ్గుతో కుమిలి పోయాడు.

32. ఈ కారణంగానే మేము ఇస్రాయీల్ సంతతి వారి కొరకు ఈ ఫర్మానాను వ్రాసిపెట్టాము : 'ఒక మనిషిని హత్య చేసినందుకో లేదా భువిలో కల్లోలాన్ని రేకెత్తించినందుకో గాక ఎవరయినా ఒక వ్యక్తిని (అన్యాయంగా) చంపితే, అతను సమస్త మానవాళిని చంపినట్లే. మరెవడయితే ఒక ప్రాణాన్ని కాపాడాడో అతను సమస్త జనులను కాపాడినట్లే.' మా ప్రవక్తలు వీరి వద్దకు ఎన్నో స్పష్టమయిన ఆదేశాలను తీసుకు వచ్చారు. అయినప్పటికీ వీరిలోని అధికులు భువిలో అత్యాచారాలు జరుపుతున్నారు. 33. దేవునితో, దైవప్రవక్తతో పోరాడే వారికి, భువిలో అరాచకం సృష్టించటానికి ఎగబడేవారికి శిక్ష ఇదే : వారిని సంహరించాలి లేదా వారిని శిలువనెక్కించాలి లేదా వారి కాళ్ళు చేతులు ప్రతికూల దిశలో నరకాలి లేదా వారిని వారి దేశం నుండి బహిష్కరించాలి. ఇది ప్రపంచంలో వారికి లభించే పరాభవం. పరలోకంలో నయితే వారికి మహా ఘోరమయిన యాతన ఉంటుంది. 34. అయితే మీరు అదుపులోకి తీసుకోకముందే ఎవరయినా పశ్చాత్తాపపడితే తెలుసు కోండి! నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు.

35. విశ్వసించిన ప్రజలారా! దేవునికి భయపడండి. ఆయన సాన్నిధ్యాన్ని అన్వేషించండి. ఆయన మార్గంలో సాధన చేయండి – మీరు సాఫల్యం పొందవచ్చు. 36. నిశ్చయంగా తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారి వద్ద భూమిలో ఉన్న వస్తుసంపద అంతా ఉన్నా, మరి అంతకు అంత ఉన్నా, ఆ మొత్తం వస్తు సంపదను వారు పరిహారంగా ప్రళయదినపు శిక్ష నుండి

తప్పించుకోవటానికి ఇవ్వగోరినా, అది వారి నుండి స్వీకరించబడదు. వారికొరకు వ్యధాభరితమయిన శిక్ష సిద్ధంగా ఉంటుంది. 37. వారు నరకాగ్ని నుండి బయటపడాలనుకుంటారు. కాని దాన్నుండి బయటపడలేరు. వారిని ఎన్నడూ వీడని శిక్ష ఉంటుంది. 38. దొంగతనం చేసిన పురుషుడు, దొంగతనం చేసిన స్త్రీ – ఇద్దరి చేతినీ ఖండించండి. ఇది వారికి తగిన శాస్తి. దేవుని తరఫున గుణపాఠంతో కూడుకున్న శిక్ష. దేవుడు తిరుగులేనివాడు, వివేచనాపరుడు. 39. మరెవడు అన్యాయానికి ఒడిగట్టిన మీదట పశ్చాత్తాపపడతాడో, తన వైఖరిని సరిదిద్దుకుంటాడో, అటువంటి వాని వైపు దేవుడు దయతో మరలుతాడు. నిశ్చయంగా దేవుడు క్షమాశీలుడు, కరుణాసాగరుడు. 40. ఏమిటి, భూమ్యాకాశాల సార్వభౌమత్వానికి అధిపతి అల్లాహ్‌యేనన్న సంగతి నీకు తెలీదా? ఆయన తాను కోరిన వారిని శిక్షించగలడు. తాను కోరినవారిని క్షమించగలడు. దేవుడు అన్నింటిపై తిరుగులేని అధికారం కలవాడు.

41. ఓ ప్రవక్తా! అవిశ్వాస పంథాలో దూకుడు ప్రదర్శిస్తున్న వారిని చూసి నీవు దిగులు చెందకు. 'మేము విశ్వసించాము' అని వారు తమ నోటితో చెప్పినాసరే లేదా వారు యూదులయినాసరే వారి హృదయాలు మాత్రం విశ్వసించలేదు. వారు అసత్యాలను శ్రద్ధతో వింటారు. ఇంకా నీ వద్దకు రాని వారికోసం (సమాచారం సేకరించేందుకు) వింటారు. వారు దైవ వాక్కును దాని సందర్భం (స్థానం) నుండి తొలగించి, తారుమారు చేస్తారు. ప్రజలతో, 'మీకు ఆజ్ఞ ఈ విధంగా లభిస్తే ఒప్పుకోండి. ఆదేశం ఈ విధంగా లభించకపోతేమటుకు, దానిపట్ల జాగ్రత్తపడండి' అంటారు. దేవుడు ఉపద్రవానికి గురి చేయదలచిన వానిని అతని వ్యవహారంలో నీవు దైవానికి ప్రతిగా ఏమీ చేయజాలవు. ఇలాంటివారి హృదయాలనే దేవుడు పరిశుద్ధపరచదలచలేదు. వారికి ప్రపంచంలో పరాభవం ఎదురుకానున్నది. పరలోకంలోనూ వారికి మహా ఘోరమైన యాతన ఉంటుంది.

42. వారు వినేది అబద్ధం. వారు తినేది అధర్మం. ఒకవేళ వారు నీ

వద్దకు (వ్యాజ్యాలు తీసుకు) వస్తే, వారి మధ్య తీర్పు చెప్పినా, చెప్పకపోయినా అది నీ ఇష్టం. ఒకవేళ నువ్వు దాటవేసినా వారు నీకెలాంటి అపకారం చెయ్యలేరు. ఒకవేళ తీర్పు చెప్పాలనుకుంటే వారి మధ్య న్యాయబద్ధంగా తీర్పు చెప్పు. నిశ్చయంగా దేవుడు న్యాయశీలురను ప్రేమిస్తాడు. 43. అసలు వారు నిన్నెలా న్యాయనిర్ణేతగా చేసుకుంటారు? నిజానికి వారివద్ద తౌరాతు ఉంది. అందులో దైవాదేశాలు పొందుపరచబడి ఉన్నాయి. (విచిత్రమేమిటంటే) ఆ తర్వాత కూడా వారు దాన్నుండి మరలిపోతున్నారు. వారసలు విశ్వాసులే కారు.

44. మేము తౌరాతును అవతరింపజేశాము. అందులో మార్గదర్శ నమూ ఉంది, జ్యోతీ ఉంది. దాని ననుసరించే దైవ విధేయులయిన ప్రవక్తలు యూదుల మధ్య తీర్పులు చేసేవారు. వారి ధర్మ భిక్షువులు, విద్వాంసులు కూడా తదనుగుణంగానే వ్యవహరించేవారు. ఎందుకంటే వారు దైవ గ్రంథానికి పరిరక్షకులుగా నియమితులయ్యారు. దానికి వారు సాక్షులు కూడా. కాబట్టి మీరు మనుషులకు భయపడకండి. మీరు నాకు భయపడండి. నా వచనాలను అల్పమయిన మూల్యానికి అమ్మకండి. ఎవరు దేవుడు అవతరింపజేసిన దాని ప్రకారం తీర్పు చెయ్యరో అలాంటివారే సత్య తిరస్కారులు. 45. మేము తౌరాతు గ్రంథంలో వారి కొరకు లిఖించిన శాసనం ఇది : ప్రాణానికి బదులు ప్రాణం, కంటికి బదులు కన్ను, ముక్కుకు బదులు ముక్కు, చెవికి బదులు చెవి, పంటికి బదులు పన్ను, గాయాలకు బదులు వాటికి సమానమయిన ప్రతీకారం. మరెవరయినా మన్నించి (దానంగా) వదలిపెడితే, అది అతని పాలిట పాపపరిహారం (కఫ్ఫారా) అవుతుంది. ఎవరు దేవుడు అవతరింపజేసిన శాసనానికనుగుణంగా తీర్పు ఇవ్వరో – అలాంటివారే దుర్వర్తనులు. 46. వారి తర్వాత మేము వారి అడుగుజాడలలోనే నడిచే మర్యమ్ కుమారుడైన ఈసాను పంపాము. అతను తనకు పూర్వం ఉన్న తౌరాతు గ్రంథాన్ని ధ్రువపరిచేవాడు. మేమతనికి ఇన్జీల్ని ఇచ్చాము. అందులో నిర్దేశిక నియమాలు, జ్యోతీ ఉండినవి. అది తనకు పూర్వం ఉన్న

తౌరాతు గ్రంథాన్ని ధ్రువపరిచేది. ఇంకా అది మార్గదర్శినిగా, భయభక్తులు కలవారికి నిలువెల్లా హితోపదేశంగా ఉండేది.

47. ఇన్జీలు గ్రంథం కలవారు కూడా, దేవుడు ఇన్జీలులో అవతరింపజేసిన దానికనుగుణంగానే తీర్పు ఇవ్వాలి. ఎవరు దేవుడు అవతరింపజేసిన దానికనుగుణంగా తీర్పు ఇవ్వరో – అలాంటివారే అవిధేయులు.

48. మేము ఈ గ్రంథాన్ని నీవైపు సత్యంతోపాటే పంపాము. ఇది తనకు పూర్వం ఉన్న గ్రంథాన్ని ధ్రువపరిచేదిగా, అందలి అంశాలను పరిరక్షించేదిగా ఉంది. కనుక నీవు వారి పరస్పర వివాదాలపై దేవుడు అవతరింపజేసిన దాని ప్రకారమే తీర్పు ఇవ్వు. నీ వద్దకు వచ్చిన సత్యాన్ని వీడి, వారి మనోవాంఛలను అనుసరించకు. మేము మీలోని ప్రతి ఒక్కరికీ ఒక శాసనాంగాన్ని, ఒక విధానాన్ని నిర్ధారించాము. దేవుడే గనక తలచుకుంటే మిమ్మల్ని అందరినీ ఒకే సముదాయంగా చేసి ఉండేవారు. అయితే తాను ఇచ్చి ఉన్న ఆజ్ఞలలో మిమ్మల్ని పరీక్షించాలన్నది ఆయన అభిమతం. కనుక మీరు సత్కార్యాల వైపు శరవేగంతో దూసుకుపోండి. ఎట్టకేలకు మీరంతా దేవుని వైపునకు మరలిపోవలసి ఉంది. తరువాత ఆయన మీరు విభేదించుకున్న దాని గురించి మీకు తెలియపరుస్తాడు.

49. (ఓ ముహమ్మద్!) దేవుడు అవతరింపజేసిన దానికనుగుణంగానే నీవు వారి మధ్య తీర్పు ఇవ్వు. వారి ఆకాంక్షలను అనుసరించకు. వారి విషయంలో జాగ్రత్త సుమా! దేవుడు నీపై అవతరింపజేసిన ఏదేని ఆజ్ఞ విషయంలో వారు నిన్ను ప్రక్కకు మళ్లించకుండా చూసుకో. ఒకవేళ వారుగనక వెనుతిరిగిపోతే, వారి కొన్ని పాపాల మూలంగా దేవుడు వారిని శిక్షించ దలిచాడని తెలుసుకో. నిశ్చయంగా ప్రజాబాహుళ్యంలో అత్యధికులు అవిధేయులే అయి ఉంటారు. 50. ఏమిటీ, వారు అజ్ఞానపు తీర్పును కోరుకుంటున్నారా? నమ్మి నడుచుకునే జనుల కోసం దేవుని తీర్పుకన్నా ఉత్తమ తీర్పు మరెవరిది కాగలదు?

51. ఓ విశ్వాసులారా! యూదులను, నసారాలను మీ స్నేహితులుగా చేసుకోకండి. వారు తమలో తామే – ఒండొకరికి – స్నేహితులు. మీలో ఎవరయినా వారితో స్నేహం చేస్తే, అతను కూడా వారిలోని ఒకడుగానే భావించబడతాడు. నిశ్చయంగా దేవుడు దుర్మార్గ జనులకు సన్మార్గ దర్శనం చేయడు.

52. హృదయాలలో కాపట్య రోగం ఉన్నవారు, వారి వైపే పరుగెత్తటం నీవు గమనిస్తావు. 'మేము ఏదయినా ఆపదలో చిక్కుకు పోతామేమోనన్న భయం మాకుంది' అని వారంటున్నారు. దేవుడు విజయం ప్రసాదించటమో లేదా తన తరఫు నుండి ఏదయినా ప్రత్యేక విషయాన్ని వ్యక్తపరచటమో సంభవిస్తే, వీళ్లు తమ ఆంతర్యాల్లో దాచి ఉంచిన కపట నీతిపై సిగ్గుతో కుంచించుకుపోతారు. 53. ఆ సమయంలో విశ్వసించిన వారు ఇలా అంటారు: 'ఏమిటి, మేము మీతోపాటే ఉన్నామండీ! అని దేవునిపై గట్టిగా ప్రమాణాలు చేసి నమ్మబలికిన వారు వీరేనా?' – వారి కర్మలన్నీ వృథా అయిపోయాయి. వారు ఘోరంగా నష్టపోయారు.

54. విశ్వసించిన ప్రజలారా! మీలో ఎవడయినా సరే తన ధర్మం నుండి తిరిగిపోతే, దేవుడు త్వరలోనే మరో జాతిని తీసుకువస్తాడు. వారు దైవానికి ప్రీతిపాత్రులై ఉంటారు. దేవుడు వారికి ప్రియతముడై ఉంటాడు. వారు విశ్వాసుల యెడల మృదు స్వభావులై, అవిశ్వాసుల పాలిట కఠినులై ఉంటారు. వారు దైవమార్గంలో నిరంతర సాధన చేస్తారు. నిందించేవారి నిందలకు వారు ఎంతమాత్రం భయపడరు. ఇది దైవానుగ్రహం. దీనిని ఆయన తాను తలచుకున్న వారికి ప్రదానం చేస్తాడు. దేవుడు విశాల సంపన్నుడు, సర్వం తెలిసినవాడు. 55. మీకు నమ్మదగ్గ నేస్తాలు దేవుడు, ఆయన ప్రవక్త మరియు విశ్వసించినవారే – వారు నమాజును నెలకొల్పు తారు. జకాత్‌ను చెల్లిస్తారు. దైవసన్నిధిలో వినమ్రతతో వంగుతారు. 56. ఎవడు దైవాన్ని, ఆయన ప్రవక్తను, విశ్వసించిన వారిని తన స్నేహితులుగా చేసుకుంటాడో (అతను ఒక విషయం తెలుసుకోవాలి) – నిశ్చయంగా దేవుని పక్షమే గెలుస్తుంది.

57. ఓ విశ్వాసులారా! మీకు పూర్వం గ్రంథం వొసగబడిన వారిలో మీ ధర్మాన్ని పరిహసించి, ఆట వస్తువుగా చేసుకునేవారిని, తిరస్కారులనూ మీ స్నేహితులుగా చేసుకోకండి. మీరు విశ్వాసులే అయితే దేవునికి భయపడుతూ ఉండండి. 58. మీరు నమాజు కొరకు పిలుపు ఇచ్చినపుడు వారు దానిని ఎగతాళి చేస్తారు. నవ్వులాటగా తీసుకుంటారు. దీనికి కారణం వారు బుద్ధిమాలినవారు కావటమే. 59. వారితో అను : 'గ్రంథవహులారా! మేము దైవాన్ని, మా వైపు అవతరింపజేయబడిన దానిని, మాకు పూర్వం అవతరించిన దానిని విశ్వసిస్తున్నామన్న నెపంతోనే, అటు మీలోని అత్యధికులు అవిధేయులుగా ఉన్నారన్న కారణంతోనే మీరు మాపై కినుక వహించారా?' 60. ఇలా అను : 'పరిణామం రీత్యా దైవసన్నిధిలో దీనికన్నా నికృష్టమైనదేదో నేను మీకు తెలుపనా? వారే దైవశాపానికి, దైవాగ్రహానికి గురైనవారు. వారిలో కొందరు కోతులుగా, పందులుగా చెయ్యబడ్డారు. వారు షైతాన్‌ను పూజించారు. ఇలాంటివారి స్థానం అధమాతి అధమం. వారు రాచబాట నుండి తప్పి బహుదూరం వెళ్ళిపోయారు.

61. వారు మీ వద్దకు వచ్చినప్పుడు, 'మేము విశ్వసించిన వారమే' అనంటారు. నిజానికి వారు తిరస్కార స్థితిలోనే వచ్చారు. తిరస్కారులుగానే వెళ్ళారు. వారు దాస్తున్న దానిని దేవుడు బాగా ఎరుగు. 62. వారిలో చాలామందిని నీవు చూస్తావు; వారు పాపం, అన్యాయం వైపు పరుగులు తీస్తారు. అధర్మమయిన సొమ్ము తినటానికి ఎగబడతారు. వారు చేస్తున్న ఈ పనులు ఎంత నీచమయినవి! 63. వారు ఇలాంటి పాపపు మాటలు అనకుండా, అధర్మమైన సొమ్ము తినకుండా వారి ఆధ్యాత్మిక గురువులు, పండితులు వారిని ఎందుకు ఆపరు? వారి ఈ కల్పనలు ఎంత ఘోరమైనవి!?

64. 'దేవుని చేతులు నిర్బంధమై ఉన్నాయి' అని యూదులు అంటున్నారు. వారి చేతులే నిర్బంధమవుగాక! వారి ఈ ప్రేలాపనకుగాను వారు శాపగ్రస్తులవుగాక! వాస్తవానికి దేవుని రెండు చేతులూ బహు విశాలంగా ఉన్నాయి. ఆయన తాను కోరిన విధంగా ఖర్చుపెడతాడు. నీ ప్రభువు

తరఫు నుండి నీపై అవతరించిన దివ్య సందేశం వారిలోని చాలామంది తలబిరుసుతనాన్ని, తిరస్కారాన్నే వృద్ధిచేస్తోంది. (తత్కారణంగా) మేము వారి మధ్యన ప్రళయదినం వరకూ శత్రుత్వాన్నీ, విద్వేషాన్నీ పాదుగొల్పాము. వారెప్పుడు యుద్ధ జ్వాలలను రేపినా, దేవుడు దాన్ని ఆర్పివేస్తుంటాడు. వారు భువిలో అరాచకాన్ని, అస్థిరతను వ్యాపింపజేయటంలో నిమగ్నులై ఉన్నారు. కాగా; దేవుడు అరాచకవాదులను ఎంతమాత్రం ఇష్టపడడు.

65. ఒకవేళ గ్రంథం కల ప్రజలు విశ్వసించి, దైవభీతితో మసలుకునే మాటైతే, మేము తప్పకుండా వారి చెడులను వారి నుండి దూరం చేసేవారము. ఇంకా వారిని అనుగ్రహాలతో నిండిన స్వర్గంలో ప్రవేశింపజేసేవారము.
66. వారు గనక తౌరాతును, ఇన్జీలును, ఇంకా తమ ప్రభువు తరఫు నుండి అవతరింపజేయబడిన దానిని నెలకొల్పి ఉంటే; వారు తమ పైనుండీ, తమ పాదాల క్రింది నుండి (పుష్కలంగా జీవనోపాధిని) తినేవారు. వారిలో కొందరు సన్మార్గగాములు కూడా ఉన్నారు. కాని వారిలో అధికులు దుష్కర్మలకు పాల్పడేవారే.

67. ఓ ప్రవక్తా! నీ ప్రభువు తరఫు నుండి నీపై అవతరించిన దాన్నంతటినీ (జనులకు) చేరవెయ్యి. నువ్వు గనక అలా చేయకపోతే, నీవు దైవ సందేశాన్ని అందజేయనట్లే. దేవుడు నిన్ను జనుల (కీడు) నుండి కాపాడుతాడు. నిశ్చయంగా దేవుడు తిరస్కార జనులకు మార్గం చూపడు.

68. వారికి చెప్పు : గ్రంథం కల ప్రజలారా! మీరు తౌరాతునూ, ఇన్జీలునూ, మీ ప్రభువు తరఫు నుండి మీపై అవతరించిన దానిని స్థాపించనంత వరకూ మీకంటూ ఒక ప్రాతిపదిక లేనట్లే, నీ ప్రభువు తరఫున నీ వద్దకు పంపబడినది, వారిలోని అనేకుల తలబిరుసుతనాన్ని, తిరస్కారాన్ని మరింత పెంచుతుంది. కనుక నీవు ఈ తిరస్కార జనుల స్థితిపై విచారపడకు.
69. నిశ్చయంగా విశ్వసించిన వారయినా, యూదులయినా, సాబియీ లయినా, క్రైస్తవులయినా – వారిలో ఎవరయినాసరే దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించి, సత్కార్యాలు చేసినట్లయితే వారికెలాంటి భయంగానీ, చింతగానీ ఉండదు.

70. మేము ఇస్రాయీల్ సంతతివారి నుండి గట్టి వాగ్దానం తీసుకున్నాము. ఇంకా – వారివద్దకు ఎంతోమంది ప్రవక్తలను పంపాము. అయితే ఏ ప్రవక్త అయినా వారి మనసుకు నచ్చని ఆజ్ఞను వారివద్దకు తీసుకువచ్చినప్పుడు, వారు ప్రవక్తలలో కొందరిని అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. కొందరిని హతమార్చారు. 71. అయినా తమకేమీ నష్టం జరగదని తలపోశారు. అందువల్ల వారు గ్రుడ్డివారు, చెవిటివారు అయిపోయారు. తరువాత దేవుడు వారి వైపు దయతో మరలాడు. అయిన ప్పటికీ వారిలో చాలామంది గ్రుడ్డివారు, చెవిటివారుగానే ప్రవర్తించారు. వారి చేష్టలను దేవుడు గమనిస్తూనే ఉన్నాడు.

72. మర్యమ్ కుమారుడైన మసీహ్ (ఏసుక్రీస్తు)యే దేవుడు అని అన్నవారు ఖచ్చితంగా తిరస్కారానికి ఒడిగట్టారు. నిజానికి మసీహ్, 'ఇస్రాయీల్ సంతతి వారలారా! దైవాన్నే ఆరాధించండి. ఆయనే నాకూ ప్రభువు, మీకూ ప్రభువు' అని ఉపదేశించాడు. ఎవడు దైవానికి ఇతరులను సాటి కల్పిస్తాడో, అతనికి దేవుడు స్వర్గాన్ని నిషేధించాడు. అతని నివాసం నరకాగ్ని. దుర్మార్గులకు సహాయపడే వాడెవడూ ఉండడు. 73. 'దేవుడు ముగ్గురిలో మూడవవాడు' అని అన్నవారు ముమ్మాటికీ తిరస్కారానికి ఒడిగట్టారు. వాస్తవానికి ఒక్కడైన నిజ ఆరాధ్య దైవం తప్ప మరో దేవుడు లేడు. వారు గనక ఇలా పలకటం మానుకోకపోతే, వారిలోని సత్య తిరస్కారులను వ్యధాభరితమయిన శిక్ష చుట్టుకుంటుంది. 74. వీరు దైవ సమక్షంలో ఎందుకు పశ్చాత్తాపపడరు? క్షమాపణ ఎందుకు కోరుకోరు? దేవుడు క్షమాశీలుడు, దయామయుడు కదా! 75. మర్యమ్ కుమారుడైన మసీహ్ (క్రీస్తు) ఒక ప్రవక్త మాత్రమే. అతనికి పూర్వం కూడా ఎంతోమంది ప్రవక్తలు గతించారు. అతని తల్లి సత్యసంధురాలయిన స్త్రీ. వారిరువురూ అన్నం తినేవారు. చూడు! మేము ఏ విధంగా వీరి ముందు సూచనలను విశదీకరిస్తున్నామో. మరి చూడు! వారెటు తిరిగిపోతున్నారో. 76. వారితో అను : 'ఏమిటి, మీరు నిజదైవాన్ని కాదని మీకు నష్టంగానీ, లాభంగానీ

కలిగించలేని దానిని పూజిస్తారా? సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు దేవుడు మాత్రమే.

77. వారికి చెప్పు : ఓ గ్రంథవహులారా! మీరు మీ ధర్మం విషయంలో - అన్యాయంగా - అతిశయిల్లకండి. పూర్వం తాము స్వయంగా మార్గం తప్పటమే గాక, మరెందరినో మార్గభ్రష్టుల్ని చేసి, రాచబాటను వీడిపోయిన వారి ఊహలను అనుసరించకండి.

78. ఇస్రాయీల్ సంతతివారిలోని సత్య తిరస్కారులను దావూదు నోట, మర్యమ్ కుమారుడయిన ఈసా నోట శపించటం జరిగింది. ఎందుకంటే వారు ఆజ్ఞోల్లంఘనకు పాల్పడేవారు. హద్దుమీరి పోయేవారు.
79. వారు, తాము చేసే చెడు పనుల నుండి ఒండొకరిని ఆపేవారు కారు.
వారి చేష్ట మాచెడ్డది. 80. వారిలో అనేకులు సత్య తిరస్కారులతో స్నేహం
చేయటం నీవు చూస్తావు. వారు తమ కొరకు ముందుగా చేసి పంపుకున్నది
ఎంత చెడ్డది!? వారిపై దైవాగ్రహం పడుగాక! వారు ఎల్లకాలం యాతనలో
మ్రగ్గుతూ ఉంటారు. 81. వారు నిజంగా దైవాన్ని, దైవప్రవక్తను, ఆయన
వైపు అవతరించిన దానిని విశ్వసించేవారేఅయితే వారు సత్య తిరస్కారులను స్నేహితులుగా చేసుకునేవారే కాదు. కాని వారిలో అనేకులు అవిధేయతకు ఒడిగట్టేవారే.

82. విశ్వాసుల పట్ల విరోధంలో నీవు యూదులను, బహుదైవా రాధకులను అందరికన్నా ఎక్కువ కఠినులుగా కనుగొంటావు. ఇక విశ్వాసుల పట్ల మైత్రి విషయానికి వస్తే; తమను 'నసారా' (క్రైస్తవులు)గా ప్రకటించుకునే వారిని నీవు అందరికన్నా ఎక్కువ సన్నిహితులుగా కనుగొంటావు. ఇలా ఎందుకంటే వారిలో విద్వాంసులు, సన్యాసులు ఉన్నారు. అదీగాక వారు
గర్విష్టులై ఉండరు. ◆ (7) 83. దైవప్రవక్తపై అవతరించిన దానిని వారు
విన్నప్పుడు, సత్యాన్ని గ్రహించిన కారణంగా వారి కళ్ళ నుండి కన్నీరొలకటం నీవు చూస్తావు. వారు అప్రయత్నంగా ఇలా అంటారు : 'మా ప్రభూ! మేము విశ్వసించాము. కనుక మా పేర్లను (సత్య) సాక్ష్యమిచ్చేవారిలో వ్రాసుకో.

84. మేము అల్లాహ్‌ను, మా వద్దకు వచ్చిన సత్యాన్ని విశ్వసించకపోవటానికి ఇక మా వద్ద కారణమేముందనీ? మా ప్రభువు మమ్మల్ని సజ్జనులలో చేరుస్తాడన్న ఆశ మాకుంది.' 85. వారి ఈ మాటకు ప్రతిఫలంగా దేవుడు వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలను అనుగ్రహిస్తాడు. వాటిలో వారు ఎల్లకాలం ఉంటారు. సదాచరణ చేసేవారికి లభించే ప్రతిఫలం ఇదే. 86. ఇకపోతే సత్యతిరస్కారానికి ఒడిగట్టి, మా సూచనలను త్రోసిపుచ్చినవారు – ఇలాంటివారే నరకవాసులు.

87. విశ్వసించిన ప్రజలారా! దేవుడు మీ కోసం ధర్మసమ్మతం (హలాల్) చేసిన పరిశుద్ధమయిన వస్తువులను మీ అంతట మీరుగా నిషేధించుకోకండి. హద్దుమీరకండి. నిశ్చయంగా దేవుడు హద్దుమీరే వారిని ఇష్టపడడు. 88. దేవుడు మీకు ప్రసాదించిన ధర్మసమ్మతమయిన, పరిశుద్ధమయిన వాటిలో నుండి తినండి. మీరు విశ్వసించిన దేవుని యెడల భయభక్తులు కలిగి ఉండండి. 89. మీరు చేసే అర్థంలేని (అనాలోచిత) ప్రమాణాల గురించి దేవుడు మిమ్మల్ని నిలదీయడు. అయితే మీరు దృఢపరచిన ప్రమాణాల గురించి మాత్రం ఆయన మిమ్మల్ని తప్పకుండా నిలదీస్తాడు. ఇలాంటి ప్రమాణాలను భంగపరిస్తే గనక మీరు మీ ఇంటివారికి పెట్టే సగటు అన్నంలాంటిదే పదిమంది నిరుపేదలకు అన్నం పెట్టాలి. లేదా వారికి బట్టలు పెట్టాలి లేదా ఒక బానిసను విడుదల చేయాలి. ఇవేవీ చేయలేనివారు మూడు దినాల పాటు ఉపవాసం ఉండాలి. మీరు ప్రమాణాలు చేసి (భంగపరచి)నప్పుడు, చెల్లించుకోవలసిన ప్రమాణ పరిహారమిది. మీ ప్రమాణాలను కాపాడుకోండి. ఈ విధంగా దేవుడు తన ఆదేశాలను మీకు విపులీకరిస్తున్నాడు – మీరు కృతజ్ఞతలర్పిస్తారని.

90. ఓ విశ్వాసులారా! మద్యం, జూదం, దైవేతర పీఠాలు, బాణాల ద్వారా అదృష్టాన్ని పరీక్షించుకోవటం – ఇవన్నీ దుర్గంధభరితమయిన పైశాచిక పనులు. కనుక వాటికి దూరంగా ఉండండి – కృతార్థులవుతారు. 91. మద్యం, జూదాల ద్వారా మీ మధ్య విరోధాన్ని, వైషమ్యాన్ని నాటాలని,

మిమ్మల్ని దైవధ్యానం నుండి, నమాజ్ నుండి నిరోధించాలని షైతాన్ కోరుకుంటున్నాడు. మరైతే మీరు వీటిని మానుకుంటారా? 92. దేవునికి విధేయత చూపండి, దైవప్రవక్తకు విధేయులై ఉండండి. (చెడులను) విడనాడండి. ఒకవేళ మీరు విముఖత చూపేటట్లయితే, మా ప్రవక్త బాధ్యతల్లా విషయాన్ని విడమరచి చెప్పటం వరకేనని తెలుసుకోండి. 93. ఎవరయితే విశ్వసించి, సదాచరణ చేశారో, వారు పూర్వం తిన్నదాని గురించి అభిశంసించటం జరగదు. అయితే వారు ఇకమీదట భయభక్తులతో మెలగాలి, విశ్వసించి మంచిపనులు చేయాలి. ఆపైన కూడా దైవభీతిపరులుగా, విశ్వాసులుగా రాణించాలి. దరిమిలా ధర్మపరాయణులుగా, సదాచార సంపన్నులుగా నెగ్గుకురావాలి – దేవుడు సదమరవర్తనులను అమితంగా ఇష్టపడతాడు.

94. ఓ విశ్వాసులారా! దేవుడు మీ చేతులకు, మీ బల్లెములకు ఎదురుగా ఉన్న వేట ద్వారా మిమ్మల్ని పరీక్షకు లోను చేస్తాడు – తద్వారా తనను చూడకుండానే భయపడేవారెవరో తెలుసుకోవటానికి. ఇక దీని తరువాత కూడా అతిక్రమించేవానికి బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 95. విశ్వాసులారా! మీరు ఇహ్రామ్ దీక్షబూని ఉన్నప్పుడు వేట జంతువులను చంపకండి. మీలో ఎవరయినా తెలిసి కూడా ఇలా చేసినట్లయితే, అతను చంపిన జంతువుకు బదులుగా అటువంటి జంతువునే (పరిహారంగా) సమర్పించుకోవాలి. దానిని మీలోని ఇద్దరు న్యాయశీలురు నిర్ణయించాలి. ఈ నజరానాను కాబాకు చేర్చాలి. లేదా దానికి పరిహారంగా కొంతమంది పేదలకు అన్నం పెట్టాలి లేదా దానికి సమానంగా ఉపవాసాలు ఉండాలి – తాను చేసిన తప్పిదానికి శిక్షను చవిచూసేందుకు ఇది విధించబడింది. గతంలో జరిగిన దానిని దేవుడు మన్నించాడు. ఎవరయినా మళ్లీ అదే చేష్టకు పాల్పడితే దేవుడు అతనిపై ప్రతీకారం తీర్చుకుంటాడు. దేవుడు అన్నింటిపై ఆధిపత్యం గలవాడు, ప్రతీకారం తీర్చుకునేవాడూను.

96. మీ కొరకు సముద్రపు వేట, దాన్ని తినటం ధర్మసమ్మతం

(హలాల్) చేయబడింది. మీ ప్రయోజనార్థం, మీ పయన బృందాల కోసం కూడా. అయితే మీరు ఇహ్రామ్ దీక్షలో ఉన్నప్పుడు నేలపై చేసే వేట మాత్రం మీకు నిషిద్ధమే. దైవానికి భయపడండి. ఆయన వద్దకే మీరు హాజరుపరచ బడతారు. 97. పవిత్ర గృహమైన కాబాను దేవుడు ప్రజలు నిలదొక్కుకునే సాధనంగా చేశాడు. ఇంకా – పవిత్ర మాసాలను, ఖుర్బానీ పశువులను, మెడలలో పట్టాలు వేయబడిన పశువులను కూడా. ఇదంతా ఎందుకంటే; భూమ్యాకాశాలలో ఉన్నదంతా దైవానికి తెలుసనీ, ఆయనకు అన్ని విషయాల పరిజ్ఞానం ఉందన్న సంగతి మీరు తెలుసుకోవాలనీని. 98. తెలుసుకోండి! దేవుని శిక్ష చాలా కఠినమయినది. మరైతే దేవుడు అమితంగా క్షమించేవాడు, అపారంగా కనికరించేవాడు కూడా. 99. ప్రవక్త బాధ్యతల్లా సందేశాన్ని చేరవేయటమే. మీరు వ్యక్తపరిచేది, గోప్యంగా ఉంచేదీ – అంతా దేవునికి తెలుసు. 100. వారికి చెప్పు : అశుద్ధమయినది, పరిశుద్ధమయినది (రెండూ) ఎన్నటికీ సమానం కాలేవు – అశుద్ధమయిన వస్తువులు పుష్కలంగా ఉండటం నీకు బాగా అనిపించినప్పటికీ! కనుక ఓ విజ్ఞులారా! దైవానికి భయపడండి. తద్వారా మీరు సాఫల్యం పొందే అవకాశం ఉంది.

101. విశ్వసించిన ప్రజలారా! బహిర్గతం చేస్తే మీకు సయితం బాధ కలిగించే విషయాలను గురించి ప్రశ్నించకండి. అయితే ఖుర్ఆన్ అవతరించే సమయంలో గనక మీరు వాటికి సంబంధించిన ప్రశ్నలు వేస్తే, అవి మీకు విశదీకరించబడతాయి. దేవుడు (లోగడ జరిగిన) వాటిని మన్నించాడు. దేవుడు క్షమాశీలుడు, సహనశీలుడు. 102. మీకు పూర్వం కూడా ఒక వర్గం వారు ఇలాంటి (అధిక) ప్రశ్నలే వేశారు. తరువాత వారే వాటిని తిరస్కరించారు. 103. దేవుడు బహీరా, సాయిబా, వసీలా, హామ్ (వంటి విగ్రహాల పేర జంతువులను వదలిపెట్టటం)ను విధించలేదు. కాని తిరస్కారానికి పాల్పడినవారే దేవునికి అసత్యాలను ఆపాదిస్తున్నారు. వారిలో అనేకులు వివేకవంతులు కారు. 104. 'దేవుడు అవతరింపజేసిన దాని వైపునకు, దైవప్రవక్త వైపునకు రండి' అని వారితో అనబడినప్పుడు, 'మా

పెద్దలు అవలంబిస్తూ ఉండగా మేము చూసినదే మాకు చాలు' అని వారంటారు. ఏమిటి, వారి పెద్దలు ఏమీ ఎరుగని వారైనప్పటికీ, వారు సన్మార్గాన లేకపోయినప్పటికీ (వీరు వారినే ఆదర్శంగా తీసుకుంటారా)?
105. ఓ విశ్వాసులారా! మీరు మీ స్వయం గురించి ఆలోచించండి. మీరు గనక సన్మార్గాన ఉంటే, ఇతరులు మార్గభ్రష్టులవటం వల్ల మీకు వాటిల్లే నష్టం ఏమీ ఉండదు. ఎట్టకేలకు మీరంతా దేవుని వద్దకే మరలిపోవలసి ఉన్నది. అప్పుడాయన మీరేమేమి చేస్తూ ఉండేవారో తెలుపుతాడు.

106. ఓ విశ్వాసులారా! మీలో ఎవరికయినా మరణ ఘడియ ఆసన్నమై అతను వీలు ప్రకటించదలిస్తే, ఆ సమయంలో మీలోని ఇద్దరు న్యాయశీలురయిన వ్యక్తులు దానికి సాక్షులుగా ఉండాలి లేదా ఒకవేళ మీరు ప్రయాణంలో ఉండగా మీకు మరణ విపత్తు ఎదురయినట్లయితే, మీలోని అన్యులిద్దరిని కూడా సాక్షులుగా తీసుకోవచ్చు. ఒకవేళ మీకు వారి సాక్ష్యంపై ఏదన్నా సందేహం ఉంటే, ఆ సాక్షులిద్దరినీ నమాజ్ అనంతరం ఆపుకోండి. వారిద్దరూ దేవునిపై ప్రమాణం చేసి ఇలా చెప్పాలి : "మేము మూల్యానికి బదులుగా దీనిని (సాక్ష్యాన్ని) అమ్ముకునేవారం కాము – అతను మా సమీపబంధువు అయినాసరే. మేము దేవుని సాక్ష్యాన్ని దాచివుంచే వారమూ కాము. మేముగాని అలా చేస్తే పాపాత్ములలో చేరిపోతాము." 107. తరువాత వారిరువురూ హక్కు కాజేశారని తెలిస్తే, వారి స్థానంలో హక్కు కాజెయ్యబడిన వారిలోని ఇద్దరు వ్యక్తులు నిలబడి, దేవునిపై ప్రమాణం చేస్తూ, "మా సాక్ష్యం వారిద్దరి సాక్ష్యంకన్నా సత్యబద్ధమైనది. మేము ఎలాంటి ఉల్లంఘనకు పాల్పడలేదు. మేము గాని అలా చేసి ఉంటే దుర్మార్గుల్లో చేరిన వారమవుతాము" అని చెప్పాలి. 108. ప్రజలు సాక్ష్యం సరిగ్గా ఇవ్వటానికి అనువైన పద్ధతి ఇది. లేదా తమ ప్రమాణం ఎదుటివారి ప్రమాణాల తరువాత ఎక్కడ బెడిసికొడుతుందోనన్న భయమన్నా కనీసం వారికి ఉంటుంది. దేవునికి భయపడండి. (చెప్పింది శ్రద్ధగా) వినండి. అవిధేయ జనులకు దేవుడు మార్గదర్శనం చేయడు.

109. దేవుడు తన ప్రవక్తలందరినీ సమావేశపరచి, 'మీకు ఏం సమాధానం లభించింది?' అని అడిగిననాడు, 'మాకేమీ తెలీదు. గోప్యమైన విషయాలన్నీ తెలిసిన వాడవు నీవే' అని వారంటారు. 110. అప్పుడు దేవుడిలా అంటాడు : 'మర్యమ్ కుమారుడవైన ఈసా! నేను నీకూ, నీ మాతృశ్రీకి ప్రసాదించిన వరాన్ని జ్ఞాపకం చేసుకో. అప్పుడు పరిశుద్ధాత్మ ద్వారా నీకు తోడ్పడ్డాను. నీవు ఊయలలో ఉన్నప్పుడూను, పెద్దవాడివయిన తరువాతనూ జనులతో మాట్లాడేవాడివి. అప్పుడు నేను నీకు గ్రంథాన్ని, విజ్ఞతను, తౌరాతు, ఇన్జీలులను బోధపరిచాను. అప్పట్లో నీవు నా అనుజ్ఞతో మట్టితో పక్షిలాంటి ఆకారాన్ని రూపొందించి, అందులో ఊదేవాడివి. అది నా ఆజ్ఞతో పక్షి అయిపోయేది. ఇంకా – నీవు గ్రుడ్డివాడినీ, కుష్ఠురోగిని నా ఆజ్ఞానుసారం నయం చేసే వాడివి. ఇంకా నీవు అప్పుడు నా ఆనతితో మృతులను తీసి నిలబెట్టేవాడివి. నీవు ఇస్రాయీల్ సంతతి వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలతో వచ్చినప్పుడు, వారిలోని సత్యతిరస్కారులు, 'ఇది పచ్చి మాయాజాలం తప్ప మరేమీ కాదు' అని అన్నారు. ఆ సమయంలో నేనే వారిని నీ జోలికి రాకుండా ఆపాను.

111. 'నన్నూ, నా ప్రవక్తను విశ్వసించండి' అని నేను హవారీల ఆంతర్యాలలో ప్రేరణ కలగజేసినపుడు, 'మేము విశ్వసించాము, మేము విధేయులమయ్యాము అన్న విషయానికి నీవే సాక్షివి' అని వారన్నారు. 112. హవారీలు, 'మర్యమ్ కుమారుడవైన ఈసా! నీ ప్రభువు మా కొరకు ఆకాశం నుండి ఆహారపళ్ళెము దించగలడా?' అని అడిగినపుడు, 'మీరు గనక విశ్వసించిన వారేఅయితే దైవానికి భయపడండి' అని ఈసా చెప్పాడు. 113. దానికి వారు, 'ఆ పళ్ళెము నుండి మేము ఆహారం తినాలని, తద్వారా మా మనసులు కుదుటపడాలని మేము కోరుకుంటున్నాము. నీవు మాకు చెప్పినదంతా నిజమని గ్రహించి, దానికి మేము సాక్షులుగా ఉండాలన్నదే మా అభిలాష' అని వారన్నారు. 114. మర్యమ్ కుమారుడయిన ఈసా (క్రీస్తు) ఇలా ప్రార్థించాడు, 'ఓ దేవా! మా ప్రభువా! నీవు ఆకాశం నుండి మాపై ఆహారంతో నిండిన పళ్ళాన్ని దింపు. అది మా పూర్వీకులకు, తరువాతి

వారికీ పండుగ కాగలగాలి. నీ తరఫున అదొక సూచనగా ఉండాలి. మాకు జీవనోపాధిని ప్రసాదించు. నీవు మాత్రమే అత్యుత్తమ ఉపాధి ప్రదాతవు.' 115. దేవుడిలా సెలవిచ్చాడు : 'నేను దానిని తప్పకుండా మీ కొరకు దించుతాను. ఆ తరువాత మీలో ఎవడయినా తిరస్కార వైఖరికి ఒడిగడితే గనక ప్రపంచంలో ఎవరికీ విధించనటువంటి శిక్షను అతనికి విధిస్తాను.'

116. "మర్యమ్ కుమారుడవైన ఓ ఈసా! నీవుగాని ప్రజలతో, 'దేవుణ్ణి గాకుండా నన్నూ, నా తల్లిని కూడా పూజనీయులుగా చేసుకోండి అని చెప్పావా?' అని దేవుడు అడిగినప్పుడు అతను (ఈసా) ఇలా విన్నవించు కుంటాడు : 'నీవు పరమ పవిత్రుడవు. ఏ మాటను అనే అధికారం నాకు లేదో దానిని అనటం నాకు తగని పని. ఒకవేళ నేనలా అని ఉంటే అది నీకు తప్పక తెలుస్తుంది. నా మనసులో ఏముందో నీకు తెలుసు. కాని నీలో ఏముందో నాకు తెలియదు. నిశ్చయంగా నీవు గోప్యంగా ఉన్న విషయాలన్నింటినీ ఎరిగినవాడవు. 117. నీవు నాకు ఆజ్ఞాపించిన విషయం తప్ప మరొకటి నేను వారితో అనలేదు. అదేమంటే; 'దైవదాస్యమే చేయండి. ఆయన నాకూ ప్రభువే, మీకూ ప్రభువే' అన్నది. నేను వారి మధ్యన ఉన్నంత వరకే వాళ్లపై సాక్షిగా ఉన్నాను. నీవు నన్ను లేపుకున్న తరువాత నీవే వారిపై పర్యవేక్షకునిగా ఉన్నావు. నీవు ప్రతి విషయానికీ సాక్షిగా ఉండేవాడవు. 118. నీవు గనక వారిని శిక్షిస్తే వారు నీ దాసులే. ఒకవేళ నీవు వారిని క్షమిస్తే నిశ్చయంగా నీవు సర్వశక్తిమంతుడవు, యుక్తిపరుడవు.' 119. దేవుడు ఈ విధంగా సెలవిస్తాడు : 'ఈ రోజు సత్యసంధులకు వారి సత్యసంధతే ఉపయోగపడుతుంది. వారి కోసం క్రింద కాలువలు ప్రవహించే స్వర్గ వనాలున్నాయి. వారందులో కలకాలం శాశ్వతంగా ఉంటారు. దేవుడు వారి పట్ల ప్రసన్నుడయ్యాడు. వారు దేవుని పట్ల సంతుష్టులయ్యారు. ఇదే మహత్తర సాఫల్యం. 120. భూమ్యాకాశాలపై, ఇంకా వాటిలో ఉన్న వాటన్నింటిపై సర్వసత్తాధికారం దేవునికే చెందుతుంది. ఆయనకు అన్నింటిపై సర్వాధిపత్యం ఉంది.

# 6. అల్ అన్ ఆమ్ (పశువులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భూమ్యాకాశాలను సృష్టించి, చీకట్లను వెలుగును కూడా చేసిన దైవానికే సర్వస్తోత్రములు. అయినప్పటికీ సత్య తిరస్కారులు తమ ప్రభువుకు సహవర్తులను కల్పిస్తున్నారు. 2. ఆయనే మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. తరువాత మీ కొరకు ఒక గడువును నిర్ధారించాడు. నిర్ధారిత గడువు ఆయన జ్ఞానపరిధిలోనే ఉంది. అయినప్పటికీ మీరు సందేహిస్తున్నారు. 3. ఆ ఒక్క దేవుడే ఆకాశాలలోనూ, భూమిపైన కూడా ఉన్నాడు. మీరు దాచేదీ, వెల్లడించేది – అంతా ఆయనకు తెలుసు. మీరేమి ఆర్జిస్తున్నారో కూడా ఆయనకు ఎరుకే.

4. వారి ప్రభువు సూచనలలో నుండి ఏ సూచన వారి వద్దకు వచ్చినా, వారు దానిపట్ల విముఖత చూపేవారు. 5. ఇప్పుడు వారి వద్దకు వచ్చిన సత్యాన్ని కూడా వారు అసత్యమంటూ త్రోసిపుచ్చుతున్నారు. కాబట్టి వారు ఎగతాళి చేసే విషయానికి సంబంధించిన అసలు సమాచారం త్వరలోనే వారికి చేరుతుంది. 6. ఏమిటి, మేము వారికి పూర్వం ఎన్ని తరాలను తుదముట్టించామో వారు చూడలేదా? మేము మీకు సయితం ఇవ్వనంతటి స్థిరత్వాన్ని భువిలో వారికి ఇచ్చాము. మేము వారిపై ఆకాశం నుండి ధారాపాతంగా వర్షం కురిపించాము. వారి దిగువన ప్రవహించే నదీనదాలను ఏర్పాటు చేశాము. కాని వారి దురాగతాల కారణంగా మేము వారిని తుదముట్టించాము. వారి తరువాత వేరితర సముదాయాలను ప్రభవింపజేశాము.

7. ఒకవేళ మేము కాగితంపై లిఖించబడి ఉన్న గ్రంథాన్ని నీపై అవతరింపజేసినా, వారు దానిని తమ స్వహస్తాలతో తాకి చూసుకున్నా, తిరస్కరించినవారు 'ఇది పచ్చి మాయాజాలం తప్ప మరేమీ కాదు' అనే అంటారు. 8. 'ఇతని కొరకు ఒక దైవదూతను ఎందుకు దించటం జరగలేదు?'

అని వారంటున్నారు. మేమే గనక దైవదూతను దించి ఉంటే, ఈ పాటికి వ్యవహారం తేలిపోయి ఉండేది. వారికి ఎలాంటి గడువు ఇవ్వబడేది కాదు. 9. ఒకవేళ మేము ఏ దైవదూతనయినా ప్రవక్తను చేసి పంపినా, అతనిని కూడా మానవాకారంలోనే పంపి ఉండేవారము. ఈ విధంగా వీరిని ప్రస్తుతం వీరు లోనై ఉన్న సంశయంలోనే పడవేసేవారము. 10. నీకు పూర్వం కూడా అనేకమంది ప్రవక్తలను పరిహసించటం జరిగింది. వారిలో ఎవరెవరు పరిహసించారో వారిని, వారు పరిహసించినదే చుట్టుముట్టింది. 11. వారికి చెప్పు : 'భువిలో సంచరించి సత్యాన్ని త్రోసిపుచ్చిన వారి పర్యవసానం ఏమయిందో చూడండి.'

12. వారిని అడుగు : 'భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఎవరిది?' అను : 'సమస్తం అల్లాహ్‌దే'. కనికరించటాన్ని ఆయన తనపై విధిగా వ్రాసుకున్నాడు. ఆయన మిమ్మల్ని ప్రళయదినాన తప్పకుండా సమావేశ పరుస్తాడు. ఇందులో సందేహమే లేదు. తమను తాము నష్టంలో పడవేసు కున్నవారు మాత్రమే దీనిని నమ్మరు. 13. రాత్రివేళ విశ్రమించేది, పగటిపూట స్థిరపడేదంతా ఆయనదే. ఆయన సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 14. వారిని అడుగు : 'ఏమిటి, భూమ్యాకాశాల సృష్టికర్త అయిన ఆ దైవాన్ని కాదని నేను ఇతరులను సహాయకులుగా చేసుకోవాలా? ఆయనే అందరికీ తినిపిస్తున్నాడు. ఆయనకు ఎవరూ తినిపించటం లేదు.' వారికి చెప్పు : 'అందరికన్నా ముందు నేను ముస్లింను కావాలని, షిర్క్ చేసేవారిలో చేరకూడదని నేను ఆజ్ఞాపించబడ్డాను.' 15. ఇలా అను : 'నేనే గనక నా ప్రభువును ఎదిరించినట్లయితే, ఒక మహా దినమున శిక్షను అనుభవించవలసి ఉంటుందని భయపడుతున్నాను.' 16. ఏ వ్యక్తి నుండి ఆ రోజు శిక్ష తొలగించబడుతుందో, అతనిని దేవుడు అపారంగా కరుణించినట్లే. ఇదే స్పష్టమయిన సాఫల్యం.

17. ఒకవేళ దేవుడు నీకు ఏదయినా ఆవేదనకు గురిచేస్తే, దానిని దూరం చేసేవాడు ఆయన తప్ప మరొకడు లేదు. ఒకవేళ ఆయన నీకేదయినా

మేలు చేకూర్చినట్లయితే, ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు. 18. ఆయన తన దాసులపై తిరుగులేని అధికారం కలవాడు. ఆయన వివేచనాపరుడు, అందరినీ కనిపెట్టుకుని ఉన్నవాడు. 19. వారిని అడుగు : 'అందరికన్నా గొప్ప సాక్షి ఎవరు?' చెప్పు : **అల్లాహ్** – ఆయన నాకూ మీకూ మధ్య సాక్షి. ఈ ఖుర్ఆన్ నా వద్దకు వహీ (దివ్యవాణి) ద్వారా పంపబడింది – దీనిద్వారా నేను మిమ్మల్నీ, ఇంకా ఈ ఖుర్ఆన్ ఎవరెవరికి చేరుతుందో వారందరినీ సావధానపరచాలని. ఏమిటి, అల్లాహ్‌తో పాటు ఇంకా ఇతర దైవాలు కూడా ఉన్నాయని మీరు నిజంగా సాక్ష్యమివ్వగలరా? చెప్పు : 'నేనైతే ఇలాంటి సాక్ష్యం ఇవ్వలేను.' ఇలా అను : 'ఆయనైతే ఒకే ఆరాధ్యదేవుడు. మీరు చేసే బహుదైవోపాసన (షిర్క్)తో నాకెలాంటి సంబంధం లేదు.'

20. మేము గ్రంథం ప్రసాదించినవారు, తమ కన్న కొడుకులను గుర్తుపట్టినట్లే అతనిని గుర్తుపడతారు. తమను తాము నష్టానికి గురిచేసుకున్న వారే అతనిని నమ్మరు. 21. దైవానికి అసత్యాలను ఆపాదించే వానికంటే లేదా దైవ సూచనలను త్రోసిపుచ్చే వానికంటే దుర్మార్గుడు మరెవడు కాగలడు? నిశ్చయంగా దుర్మార్గులకు సాఫల్య భాగ్యం ప్రాప్తించదు. 22. వారందరినీ మేము సమీకరించిన రోజున, షిర్క్‌కు పాల్పడిన వారినుద్దేశించి, 'మీరు మీ దైవాలని ధీమాగా ప్రకటించుకున్న ఆ భాగస్వాములు ఎక్కడున్నారు?' అని అడుగుతాము. 23. అప్పుడు వారి వద్ద ఏ మోసపూరితమైన సాకూ మిగిలి ఉండదు. కాని వారిలా అంటారు : 'మా ప్రభువైన దేవుని తోడు! మేము బహుదైవారాధన చేయలేదు.' 24. చూడండి! వారెలా అబద్ధం చెప్పారో! వారి కాల్పనిక విషయాలన్నీ వారి నుండి మటుమాయమైపోయాయి.

25. వారిలో మరి కొందరున్నారు, వారు చెవియొగ్గి నీ మాట వింటున్నట్లు అభినయం చేస్తారు. మేము వారి హృదయాలపై తెరవేసేశాము. తత్కారణంగా వారు దానిని అర్థం చేసుకోలేరు. వారి చెవులలో భారం ఉంది. వారు నిదర్శనాలన్నింటినీ చూసినాసరే విశ్వసించబోరు. చివరికి వారు నీ దగ్గరికి, నీతో తర్జనభర్జన చేయటానికి వచ్చినపుడు, వారిలో

తిరస్కారానికి ఒడిగట్టినవారు, 'ఇవి పూర్వీకుల కట్టుకథలు తప్ప మరేమీ కావు' అని తీర్మానించుకుంటారు. 26. వారు (దీని నుండి) జనులను ఆపటమేగాక, వారు సయితం దీనికి దూరంగా ఉంటారు. ఈ విధంగా వారు తమను తామే నాశనం చేసుకుంటున్నారు. కాని వారికి ఆ ధ్యాసే లేదు. 27. వారిని అగ్నిపై నిలబెట్టబడిన సమయంలో నీవు వారిని చూస్తే (ఎంత బాగుంటుంది!) అప్పుడు వారిలా అంటారు : 'మేము మళ్లీ వెనక్కి పంపబడితే ఎంత బాగుండేది? అదే గనక జరిగితే మేము మా ప్రభువు సూచనలను త్రోసిపుచ్చబోము. మేము విశ్వసించినవారిలో చేరిపోతాము.' 28. అదీ సంగతి. దీనికి పూర్వం వారు కప్పిపుచ్చిన విషయం ఇప్పుడు బట్టబయలైపోయింది. ఒకవేళ వారు తిరిగి పంపబడినా, చేయరాదని చెప్పినవన్నీ మళ్లీ చేస్తారు. వారు పచ్చి అబద్ధాలకోరులు.

29. వారంటారు : 'జీవితమంటే అసలు ఈ ప్రాపంచిక జీవితమే. మళ్లీ మేము లేపబడటం అనేది జరగదు.' 30. వారు తమ ప్రభువు సమక్షంలో నిలబెట్టబడినప్పటి వారి పరిస్థితిని నీవు చూస్తే ఎంత బాగుండు! 'ఇది సత్యం కాదా?' అని ఆయన వారిని అడిగినపుడు, 'అవును. మా ప్రభువు తోడుగా ఇది సత్యమే' అని వారు బదులిస్తారు. 'అలాగైతే మీరు పాల్పడిన తిరస్కారానికి బదులుగా శిక్షను రుచిచూడండి' అని దేవుడంటాడు. 31. దైవాన్ని కలుసుకోవలసి ఉందనే విషయాన్ని త్రోసిపుచ్చిన వారు ఖచ్చితంగా నష్టపోయారు. కడకు ఆ ఘడియ అకస్మాత్తుగా వచ్చిపడినపుడు, 'అయ్యో! మా దురవస్థ. ఈ విషయంలో మేము ఎలాంటి తప్పు చేశాం!' అంటారు. ఆ సమయంలో వారు తమ బరువులను తమ వీపులపై మోస్తూ ఉంటారు. చూడండి! వారు మోసే ఆ బరువు ఎంత చెడ్డది!? 32. ప్రాపంచిక జీవితమైతే ఒక ఆట, వినోదం లాంటిది. భయభక్తులు కలవారికి పరలోక నిలయమే మేలైనది. ఏమిటి, మీరు ఆ మాత్రం తెలివిని ఉపయోగించరా?

33. వారు చెప్పే మాటల వల్ల నీకు దుఃఖం కలుగుతుందన్న సంగతి మాకు తెలుసు. అసలు వారు ధిక్కరిస్తున్నది నిన్ను కాదు, ఆ దౌర్జన్యపరులు

దైవ సూచనలను తిరస్కరిస్తున్నారు. 34. నీకు పూర్వం కూడా ప్రవక్తలను ధిక్కరించటం జరిగింది. అయితే వారు ఈ ధిక్కార వైఖరిపై, తమకు పెట్టబడిన బాధలపై ఓపిక పట్టారు. కడకు వారికి సహాయం అందింది. దైవ వాక్కులను మార్చగల శక్తి ఎవరికీ లేదు. గత ప్రవక్తలకు సంబంధించిన కొన్ని వార్తలు నీకు అందే ఉంటాయి. 35. ఒకవేళ వారి వైముఖ్య ధోరణి నీకు సహించరానిదైతే, నీకు శక్తి ఉంటే భూమిలో ఏదయినా సొరంగం వెతుక్కో లేదా ఆకాశానికి నిచ్చెన వేసి, వారి కోసం ఏదయినా సూచనను తేగలిగితే తెచ్చుకో. దేవుడే గనక తలిస్తే వారందరినీ సన్మార్గంపై ఏకం చేసేవాడే. కనుక (ఓ ప్రవక్తా!) నీవు అజ్ఞానుల్లోని వాడివి అవకు. 36. వినేవారు మాత్రమే అంగీకరిస్తారు. ఇక మృతుల విషయానికివస్తే, దేవుడే వారిని లేపుతాడు. తరువాత వారంతా ఆయన వైపునకు మరలించబడతారు.

37. ప్రవక్తపై అతని ప్రభువు తరఫు నుండి ఏదయినా సూచన ఎందుకు అవతరించలేదు? అని వారడుగుతున్నారు. వారికి చెప్పు : 'దేవుడు ఏ సూచన అయినాసరే దించగల సమర్థుడే.' కాని వారిలోని అధికులు తెలియనివారు. 38. నేలపై నడిచే (ప్రాకే) జంతువుగానీ, తన రెక్కలతో గాలిలో ఎగిరే పక్షిగానీ - అవన్నీ మీలాంటి జీవరాశులే. మేము దేనినీ వ్రాయకుండా వదలలేదు. తరువాత అంతా తమ ప్రభువు వద్దకే సమీకరించబడతారు. 39. మా సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చేవారు బధిరులు, మూగవారు. వారు అంధకారంలో మ్రగ్గుతున్నారు. దేవుడు తాను కోరిన వానిని అపమార్గం పట్టిస్తాడు, తాను కోరిన వానిని రుజుమార్గంపై నడిపిస్తాడు.

40. వారిని అడుగు : 'చూడండి! దేవుని తరఫున మీపైన ఏదయినా విపత్తు వచ్చిపడితే లేదా ప్రళయ ఘడియే ఆసన్నమైతే అప్పుడు మీరు అల్లాహ్‌ను కాదని వేరెవరినయినా మొరపెట్టుకుంటారా? మీరు సత్యసంధులే అయితే (నిజం) చెప్పండి. 41. పైగా మీరు ఆయననే మొరపెట్టుకుంటారు. ఏ విపత్తు గురించి మీరు ఆయనను మొరపెట్టుకున్నారో దానిని ఆయన

తలచుకుంటే మీ నుండి తొలగిస్తాడు. ఆ సమయంలో మీరు భాగస్వాములుగా ఎంచిన వారందరినీ మరచిపోతారు.

42. నీకు పూర్వం ఎన్నో జాతుల వద్దకు మేము ప్రవక్తలను పంపాము. మరి మేము వారిని ఇబ్బందులకు, బాధలకు గురిచేశాము – వారు మా సమక్షంలో తమ దీనావస్థను వ్యక్తపరచాలని. 43. కాని మా తరఫున వారిపై కష్టాలు వచ్చి పడినపుడు, వారు మా సన్నిధిలో దీనంగా ఎందుకు విన్నవించుకోలేదు? పైపెచ్చు వారి హృదయాలు కఠినమైపోయాయి. షైతాన్ వారి ఆచరణను వారి దృష్టికి అందమైనదిగా చిత్రీకరించేవాడు. 44. తమకు చేయబడిన ఉపదేశాన్ని వారు విస్మరించినపుడు, వారి కొరకు మేము సకల (సిరిసంపదల) ద్వారాలు తెరచివేశాము. కడకు తమకు ప్రసాదించబడిన దానిపై వారు ఉబ్బితబ్బిబ్బవుతుండగా, అకస్మాత్తుగా మేము వారిని పట్టుకున్నాము. దాంతో వారు హతాశులయ్యారు. 45. అంతే. దుర్మార్గంలో చెలరేగిపోయిన వారి వేరు త్రెంచివేయబడింది. సర్వస్తోత్రములు సకల చరాచర లోకేశ్వరుడైన అల్లాహ్‌కే శోభాయమానం.

46. వారికి చెప్పు : 'చూడండి! దేవుడే గనక మీ వినికిడిని, మీ కంటిచూపును మీ నుండి లాక్కుంటే, మీ హృదయాలపై ముద్రవేసేస్తే, ఆ నిజ దైవం తప్ప వీటిని మీకు తిరిగి ఇచ్చే దేవుడెవడు?' చూడు! మేము రకరకాలుగా సూచనలను ఎలా వారికి విశదీకరిస్తున్నామో! అయినప్పటికీ వారు లక్ష్యపెట్టడం లేదు. 47. వారిని అడుగు : 'చూడండి! ఒకవేళ దేవుని శిక్ష మీపై అమాంతం విరుచుకుపడినా లేదా ముందస్తు హెచ్చరికతో వచ్చినా ముష్కర మూక తప్ప ఎవరు నాశనమవుతారు? 48. ప్రవక్తలను మేము శుభవార్తను వినిపించేవారుగానో, హెచ్చరించేవారుగానో మాత్రమే పంపాము. కనుక ఎవరు విశ్వసించి, తమను సంస్కరించుకుంటారో, వారికెలాంటి భీతిగానీ, జంకుగానీ ఉండదు. 49. మరెవరయితే మా సూచనలను బూటకమంటూ కొట్టివేశారో వారిని శిక్ష చుట్టుకుంటుంది. ఎందుకంటే వారు అవిధేయతకు ఒడిగట్టారు. 50. వారితో అను : 'నా వద్ద దేవుని

నిధులున్నాయనిగానీ, నాకు అగోచర విషయాలు తెలుసు అని గానీ నేను మీతో అనటం లేదు. నేను దైవదూతనని కూడా చెప్పటం లేదు. అయితే నా వద్దకు వచ్చిన దివ్యవాణి (వహీ)ని మాత్రమే నేను అనుసరిస్తాను.' వారిని అడుగు : 'గుడ్డివాడూ, కళ్లున్నవాడూ – ఇద్దరూ సమానులేనా? ఏమిటి, మీరు యోచించరా?'

51. ఎవరయితే తమ ప్రభువు వద్ద సమావేశపరచబడతామని, అప్పుడు దేవుడు తప్ప తమను ఆదుకునే రక్షకుడుగానీ, సిఫారసు చేసేవాడు గానీ ఉండడని భావించి భయపడతారో వారికి నీవు ఈ దివ్యవాణి (వహీ) ద్వారా హెచ్చరించు. బహుశా వారు దైవానికి భయపడవచ్చు. 52. (ఓ ప్రవక్తా!) తమ ప్రభువును ఉదయం, సాయంత్రం ప్రార్థిస్తూ, ఆయన ప్రసన్నతను చూరగొనేందుకు తహతహలాడే వారిని నీ నుండి దూరం చేసుకోకు. ఎందుకంటే వారి లెక్కలోని ఏ వస్తువు బాధ్యత కూడా నీపైన లేదు. నీ లెక్కలోని ఏ వస్తువు బాధ్యత కూడా వారిపైన లేదు – నీవు వారిని నీ నుండి దూరం చేసుకుని అన్యాయస్థుల్లో చేరటానికి! 53. ఈ విధంగా మేము వారిలో కొందరిని మరికొందరి ద్వారా పరీక్షించాము – 'ఏమిటి, మన మధ్యన దేవుడు కటాక్షించినది వీళ్లనేనా!?' అని వారు ఎద్దేవా చేయటానికి. ఏమిటి, కృతజ్ఞతాభావం గల వారెవరో దేవునికి తెలియదా?

54. మా సూక్తులను విశ్వసించినవారు నీ దగ్గరకు వచ్చినపుడు, 'మీకు శాంతి కలుగుగాక! మీ ప్రభువు దయాదాక్షిణ్యాలు చూపటాన్ని తనపై వ్రాసిపెట్టుకున్నాడు. మీలో ఎవరయినా తెలియని స్థితిలో ఏదయినా తప్పుచేసి, తరువాత పశ్చాత్తాపపడితే, తన నడవడికను చక్కదిద్దుకుంటే నిశ్చయంగా ఆయన క్షమిస్తాడు, దయచూపుతాడు' అని చెప్పు. 55. ఈ విధంగా మేము మా సూచనలను విడమరచి చెబుతాము – తద్వారా అపరాధుల పంథా ఎటువంటిదో తేటతెల్లం కావాలని!

56. వారికి చెప్పు : 'నిజ దైవాన్ని కాదని మీరు మొరపెట్టుకునే వాటి నుండి నన్ను వారించటం జరిగింది.' ఇలా అను : 'నేను మీ కోరికలను

అనుసరించలేను. ఒకవేళ నేనలా చేశానంటే మార్గభ్రష్టుణ్ణి అవుతాను. అప్పుడు నేను సన్మార్గగాములలో ఉండను.' 57. ఇలా చెప్పు : 'నేను నా ప్రభువు తరఫున ఒక స్పష్టమయిన ప్రమాణంపై ఉన్నాను. మీరేమో దీనిని అసత్యమంటూ త్రోసిపుచ్చారు. మీరు దేనికోసం ఆత్రం చేస్తున్నారో, అది నా దగ్గర లేదు. నిర్ణయాధికారం దేవునికి మాత్రమే ఉంది. ఆయనే యదార్థాన్ని విశదీకరిస్తాడు. ఆయనే అత్యుత్తమ తీర్పరి.' 58. చెప్పు : 'మీరు తొందర పెడుతున్నది నా అదుపాజ్ఞలలో ఉండి ఉంటే మీకూ – నాకూ మధ్య వ్యవహార నిర్ణయం జరిగిపోయి ఉండేది. దుర్మార్గుల సంగతి దేవుడు బాగా ఎరుగు.' 59. అగోచర విషయాల బీగాలు ఆయన వద్దనే ఉన్నాయి. ఆయనకు తప్ప వాటి గురించి ఇతరులెవరికీ తెలీదు. భూమిలోనూ, సముద్రంలోనూ ఉన్న వాటి గురించి ఆయనకు తెలుసు. చెట్టు నుండి రాలే ఏ ఆకు కూడా ఆయనకు తెలియకుండా లేదు. భూమిలోని చీకటి పొరలలో పడే ఏ గింజ కూడా – అది తడిగాని, పొడిగాని – అన్నీ ఒక స్పష్టమయిన గ్రంథంలో నమోదై ఉన్నాయి.

60. ఆయనే రాత్రి పూట మిమ్మల్ని మరణావస్థకు లోను చేస్తాడు. పగటిపూట మీరేం చేస్తారో తెలిసినవాడు. మళ్లీ ఆయనే మిమ్మల్ని లేపుతాడు – నిర్ధారిత గడువు పూర్తి కావటానికి. తరువాత ఆయన వైపునకే మీరు మరలవలసి ఉంది. అప్పుడు మీరు చేస్తూ ఉండినదంతా ఆయన మీకు ఎరుకపరుస్తాడు. 61. ఆయన తన దాసులపై పూర్తి అధికారం కలవాడు. ఆయన మీపై పర్యవేక్షకులను నియమించి పంపిస్తాడు. చివరికి మీలో ఎవరికయినా మరణ సమయం ఆసన్నమైనపుడు, మేము పంపిన దూతలు అతని ప్రాణాలు తీసుకుంటారు. వారు కర్తవ్య నిర్వహణలో ఏ లోటూ చేయరు. 62. తరువాత అందరూ తమ నిజ స్వామి అయిన దేవుని వైపునకు రప్పించబడతారు. వినండి! నిర్ణయాధికారమంతా ఆయనదే. ఆయన శీఘ్రంగా లెక్క తీసుకోనున్నాడు.

63. వారిని అడుగు : 'భూమిపైన, సముద్రంపైన అలముకున్న

చీకట్ల నుండి మిమ్మల్ని రక్షించేవాడెవడు? దేవుడే గనక మమ్మల్ని ఈ గండం నుండి గట్టెక్కిస్తే, మేము ఆయనకు కృతజ్ఞులమై ఉంటాము అని కడు దీనంగా మీరు మొరపెట్టుకునేది, లోలోపలే విలపిస్తూ విన్నవించుకునేది ఎవరిని?' 64. దేవుడే మిమ్మల్ని ఈ గండం నుండీ, అన్ని రకాల కడగండ్ల నుండీ విముక్తిని ప్రసాదిస్తున్నాడు. ఆనక మీరేమో దైవత్వంలో భాగస్వాముల్ని చేరుస్తున్నారు. 65. వారికి చెప్పు : 'ఏదైనా విపత్తును మీపై నుండి పంపటానికయినా లేదా మీ కాళ్ళ క్రింది నుండి పెల్లుబికేలా చేయడానికయినా లేదా మిమ్మల్ని వర్గాలుగా ముఠాలుగా విభజించి ఒకరికి ఇంకొకరి తడాఖాను చవిచూపించ డానికయినా దేవుడు సమర్థుడే.' చూడు! వారు అర్థం చేసుకునేటందుకు మేము వివిధ కోణాల నుండి సూచనలను ఎలా విశదీకరిస్తున్నామో! 66. ఇది సత్యమైనప్పటికీ నీ జాతివారు దీనిని అసత్యమంటూ త్రోసిపుచ్చారు. వారితో అను : 'నేను మీపై కావలివాణ్ణి కాను.' 67. ప్రతి వార్తకూ ఒక సమయం నిర్ధారితమై ఉంది. త్వరలోనే మీరు దీనిని తెలుసుకుంటారు.

68. (ఓ ప్రవక్తా!) మా సూక్తులలో తప్పులెన్నువారిని నీవు చూసి నపుడు, వారి నుండి తొలగిపో – వారు ఆ విషయాన్ని వదలి ఇతర విషయాలపై మాట్లాడనంత వరకూ (వారి వద్దకు వెళ్ళకు). ఒకవేళ షైతాన్ నిన్ను మరపునకు గురిచేసినట్లయితే, జ్ఞాపకం వచ్చిన మీదట ఆ దుర్వర్తనుల వద్ద కూర్చోకు. 69. దైవభీతిగల వారిపై వీరి (ఈ దుర్వర్తనుల) లెక్కలోని ఏ విషయం బాధ్యతా లేదు. కాకపోతే హితబోధ చేస్తూ ఉండాలి. బహుశా వారూ భయపడవచ్చు. 70. ఎవరు తమ ధర్మాన్ని ఆటగా, తమాషాగా చేసుకున్నారో, ఎవరిని ప్రాపంచిక జీవితం మోసపుచ్చిందో అలాంటి వారిని వదలివెయ్యి. కాకపోతే ఖుర్ఆన్ ద్వారా వారికి బోధపరుస్తూ ఉండు – తద్వారా ఏ వ్యక్తి అయినా తన స్వయంకృతాలలో చిక్కుబడకుండా ఉంటాడేమో! ఆ చిక్కుబడటం కూడా ఎంత సంక్లిష్టంగానంటే, దేవుని పట్టు నుండి రక్షించే ఏ సహాయకుడూ, ఏ సిఫారసు చేసేవాడూ అతనికి లభించడు, అతను ప్రపంచంలో ఉన్నదంతా పరిహారంగా ఇచ్చినా అది స్వీకరించబడదు.

ఇలాంటివారే తమ సముపార్జనలో చిక్కుబడి ఉన్నారు. వీరి కొరకు త్రాగటానికి మరిగే నీరు ఉంటుంది. వ్యధాభరితమయిన శిక్ష ఉంటుంది. ఎందుకంటే వారు సత్యాన్ని తిరస్కరించేవారు.

71. వారిని అడుగు : 'మేము నిజదైవాన్ని వదలి, మాకు లాభాన్నిగాని, నష్టాన్ని గాని కలిగించలేని వాటిని మేము మొరపెట్టుకోవాలా? దేవుడు మాకు సన్మార్గం చూపిన తరువాత మేము మా కాలి మడమలపై వెనక్కి తిరిగిపోవాలా? షైతానులు ఎడారిలో పెడత్రోవ పట్టించగా, దిక్కుతోచక ఆందోళనతో తచ్చాడుతూ ఉన్నవానిలా, అతని స్నేహితులు "మా వద్దకు రా" అని అతనిని సన్మార్గం వైపు పిలుస్తూ ఉన్నప్పటికీ పట్టించుకోని వానిలా మేమూ కావాలా?' ఇలా అను : నిశ్చయంగా మార్గదర్శకత్వమంటే అది దైవమార్గదర్శకత్వమే. మేము సకల లోకాల ప్రభువైన దైవానికే విధేయులమై ఉండాలని మాకు ఆజ్ఞాపించటం జరిగింది. 72. ఇంకా; నమాజును స్థాపించండి, దైవానికి భయపడండి, ఆయన వైపునకే మీరంతా సమీకరించ బడతారని (ఆదేశించబడింది). 73. ఆయనే భూమ్యాకాశాలను సత్యబద్ధంగా సృష్టించినవాడు. ఏ రోజున ఆయన 'అయిపో' అని అంటాడో అప్పుడది అయిపోతుంది. ఆయన మాట సత్యం. శంఖం ఊదబడిన నాడు రాజ్యాధి కారం ఆయనదే. ఆయన గోప్యంగా ఉన్నదానినీ, బహిర్గతంగా ఉన్నదానినీ ఎరిగినవాడు. ఆయన వివేకవంతుడు, కడు అప్రమత్తుడు.

74. ఇబ్రాహీమ్ తన తండ్రి ఆజర్‌తో, 'ఏమిటి, నీవు విగ్రహాలను ఆరాధిస్తావా? నేను నిన్నూ, నీ జాతి వారిని స్పష్టమయిన మార్గభ్రష్టత్వంలో పడి ఉండటం చూస్తున్నాను' అని చెప్పినప్పుడు (జరిగిన సంఘటన కూడా స్మరించుకోదగినదే). 75. ఇదేవిధంగా మేము ఇబ్రాహీముకు భూమ్యాకాశాల పాలనా వ్యవస్థను చూపాము – అతనికి దృఢ నమ్మకం కలగాలని. 76. తరువాత రాత్రి చీకటి అతనిపై ఆవరించినపుడు, అతనొక నక్షత్రాన్ని చూసి 'ఇది నా ప్రభువు' అన్నాడు. తరువాత అది అస్తమించగానే, 'అస్తమించే వాటిని నేను ప్రేమించను' అన్నాడు.

77. తరువాత చంద్రుడు ప్రకాశించటం చూసి 'ఇదిగో, ఇదే నా ప్రభువు' అన్నాడు. తరువాత అది కూడా అస్తమించటంతో 'నా ప్రభువే గనక నాకు మార్గదర్శకత్వం వహించకపోతే నేను మార్గవిహీన జనులలో చేరిపోయే వాణ్ణి' అని చెప్పాడు. 78. తరువాత అతను దేదీప్యమానమయిన సూర్యుణ్ణి చూసినపుడు, 'ఇదీ నా ప్రభువు. ఇది అన్నింటికంటే పెద్దది' అన్నాడు. కాని అది కూడా అస్తమించేసరికి, అతను తన జాతివారితో ఇలా అన్నాడు : 'నా జాతి వారలారా! మీరు దైవానికి కల్పించే భాగస్వామ్యాలన్నింటితో నేను తెగత్రెంపులు చేసుకుంటున్నాను. 79. నేను పూర్తి ఏకాగ్రతతో నా ముఖాన్ని భూమ్యాకాశాలను సృష్టించిన వాని వైపునకు మరల్చుకున్నాను. నేను బహు దైవారాధకులలోని వాణ్ణి కాను.'

80. ఇబ్రాహీమ్ జాతివారు అతనితో వాదులాటకు దిగారు. అతనిలా అన్నాడు : 'ఏమిటి, మీరు దేవుని విషయంలో నాతో వాదులాడుతున్నారా? వాస్తవానికి నాకు సన్మార్గం చూపినవాడు ఆయనే. మీరు నిజ దైవానికి భాగస్వాములుగా కల్పించే వారికి (వాటికి) నేను భయపడను. అయితే నా ప్రభువు కోరుకున్నది మాత్రమే జరుగుతుంది. నా ప్రభువు పరిజ్ఞానం ప్రతి దానినీ ఆవరించి ఉంది. ఏమిటి, మీరు తేరుకోరా? 81. మీరు దైవానికి సాటి కల్పించుకున్న వాటికి అసలు నేనెందుకు భయపడాలి? దేవుడు మీకు ఏ ప్రమాణమూ అందజెయ్యకపోయినప్పటికీ, మీరు ఆయనకు సాటి కల్పిస్తూ కూడా భయపడటం లేదయ్యే. ఇక ఇప్పుడు ఈ రెండు పక్షాలలో నిశ్చింత స్థితికి ఎక్కువ హక్కుదారులెవరో తెలిస్తే మీరే చెప్పండి. 82. ఎవరయితే విశ్వసించారో, తమ విశ్వాసాన్ని దుర్వర్తనతో కలుషితం చేయలేదో – అలాంటి వారే నిర్భయంగా, నిశ్చింతగా ఉండదగినవారు. వారే సన్మార్గాన ఉన్నవారు. 83. ఇదీ మా ప్రమాణం. దీనిని మేము ఇబ్రాహీమ్‌కు, అతని జాతివారికి వ్యతిరేకంగా ఇచ్చాము. (ఈ విధంగా) మేము కోరిన వారికి పదోన్నతిని అనుగ్రహిస్తాము. నిశ్చయంగా నీ ప్రభువు వివేకధనుడు, జ్ఞాన సంపన్నుడు.

84. ఇంకా మేము ఇబ్రాహీమ్‌కు ఇస్‌హాఖును, యాఖూబును ప్రసాదించాము – ప్రతి ఒక్కరికీ మేము మార్గదర్శకత్వం వహించాము. అంతకు మునుపు నూహ్‌కు కూడా మేము మార్గదర్శనం చేసి ఉన్నాము. ఇంకా అతని సంతతిలో నుండి దావూద్, సులైమాన్, అయ్యూబ్, యూసుఫ్, మూసా, హారూనులకు కూడా (మార్గదర్శకత్వం వహించాము). సదాచార సంపన్నులకు మేము ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తూ ఉంటాము.
85. జకరియ్యా, యహ్యా, ఈసా, ఇల్యాస్‌లను కూడా మేము కటాక్షించాము. వారిలోని ప్రతి ఒక్కడూ సాత్వికుడే. 86. ఇస్మాయీల్, అల్ యస్‌అ, యూనుస్, లూత్‌లను కూడా మేము అనుగ్రహించాము – వీరిలో ప్రతి ఒక్కరికీ మేము సమకాలీన లోకవాసులపై ఆధిక్యతను ప్రసాదించాము.
87. ఇంకా – వీరి పితామహుల్ని, వీరి సంతానాన్ని, వీరి సహోదరుల్లో కొందరిని కూడా మేము కటాక్షించాము. వారిని (మా సేవ కొరకు) ఎన్నుకున్నాము. వారందరికీ రుజుమార్గం వైపునకు దర్శకత్వం వహించాము.
88. ఇదీ దైవ మార్గదర్శకత్వం. ఆయన తన దాసులలో తాను కోరిన వారికి దానిని అనుగ్రహిస్తాడు. ఒకవేళ వారు గనక దైవత్వంలో భాగస్వామ్యానికి ఒడిగట్టి ఉంటే, వారు చేసుకున్నదంతా వ్యర్థమైపోయి ఉండేది. 89. మేము గ్రంథాన్నీ, యుక్తినీ, దైవదౌత్యాన్నీ ప్రసాదించినది వీరికే. ఒకవేళ ఈ (మక్కా) జనులు దీనిని గనక నిరాకరిస్తున్నట్లయితే, దానిని ఎన్నటికీ నిరాకరించని వారిని మేము నియుక్తం చేసి ఉన్నాము.
90. వారే దేవుడు మార్గదర్శన భాగ్యం ప్రసాదించినవారు. కనుక నీవు కూడా వారి మార్గాన్నే అనుసరించు. వారితో చెప్పు : 'దీనికి గాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నీ అపేక్షించటం లేదు. ఇది లోకవాసులందరికీ వర్తించే హితబోధన.'

91. 'దేవుడు ఏ మానవమాత్రునికీ ఏదీ అవతరింపజేయలేదు' అని పలికినప్పుడు, వారు దేవుని గురించి తప్పుడు అంచనా వేశారు. వారిని అడుగు : 'మూసా తీసుకువచ్చిన గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు?

అది జ్యోతిగా, జనులకు మార్గదర్శకంగా ఉండేది. దానిని మీరు వేర్వేరు కాగితాలుగా (విభజించి) పెట్టారు. వాటిలోని కొన్ని విషయాలను వ్యక్త పరుస్తారు, మరెన్నింటినో దాచిపెడుతున్నారు. దానిద్వారా మీకుగానీ, మీ తాతముత్తాతలకు గానీ తెలియని ఎన్నో విషయాలు నేర్పటం జరిగింది.' వారికి చెప్పు : 'దేవుడే దానిని అవతరింపజేశాడు.' ఆ తరువాత వారిని వారి తిరకాసు వాదనల్లోనే పడి ఆడుకునేలా వదలివెయ్యి. 92. ఈ గ్రంథం కూడా మేము అవతరింపజేసినదే. శుభదాయకమైనది. దానికి పూర్వం ఉన్న వాటిని ధ్రువపరిచేది – తద్వారా నీవు పల్లెల తల్లి (మక్కా) వాసులను, దాని పరిసరాలలో నివసించే వారిని సావధానపరచాలని. పరలోకాన్ని నమ్మేవారే దీనిని విశ్వసిస్తారు. వారు నమాజును కాపాడుకునే వారై ఉంటారు.

93. దేవునిపై అసత్యాన్ని కల్పించేవాడి కంటే, తనకు దివ్య వాణి (వహీ) అనేది ఏదీ అవతరించకపోయినప్పటికీ, 'నాపై వహీ అవతరించింది' అని బొంకేవాడికంటే, దేవుడు అవతరింపజేసినటువంటిదే నేనూ అవతరింప జేయగలను అని అనేవాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? ఈ దుర్మార్గులు మృత్యువు కాఠిన్యంలో కొట్టుమిట్టాడుతున్నప్పుడు, దైవదూతలు చేతులు చాచి, 'ఇక మీ ప్రాణాలు బయటికి తీయండి. మీరు దేవునికి అసత్యాలను ఆపాదించినందుకు, ఆయన వచనాల పట్ల అహంకారం ప్రదర్శించినందుకు శాస్తిగా ఈ రోజు మీకు పరాభవంతో కూడిన శిక్ష విధించబడుతుంది' అని అంటూ ఉండగా నీవు చూడగలిగితే ఎంత బాగుండేది! 94. మేము తొలిసారి మిమ్మల్ని ఒంటరిగా పుట్టించినట్లే, మీరిప్పుడు మా వద్దకు ఒక్కొక్కరుగా వచ్చేశారు. మేము మీకు ప్రసాదించిన వస్తుసామగ్రినంతటినీ మీ వెనకే వదిలేసి వచ్చారు. ఇప్పుడు మీ వెంట మీ సిఫారసుదారులను కూడా మేము చూడటం లేదు. మీ పనులు చేసిపెట్టడంలో వారి పాత్ర కూడా ఉందని వారి గురించి మీరు తలపోసేవారు. మీ మధ్యగల సంబంధాలన్నీ తెగిపోయాయి. వేటిని చూసుకుని మీరు ధీమాతో ఉండేవారో అవన్నీ మీ నుండి నిష్క్రమించాయి.

95. నిశ్చయంగా విత్తనాన్ని, టెంకను చీల్చేవాడు దేవుడే. ఆయన ప్రాణమున్న దానిని ప్రాణం లేని దాని నుండి తీస్తాడు. ప్రాణం లేని దానిని ప్రాణమున్న దాని నుండి తీస్తాడు. ఆయనే మీ ఆరాధ్య దేవుడు. మరలాంటప్పుడు మీరు ఎటు తప్పిపోతున్నారు? 96. ఉదయాన్ని వెలికితీసేది ఆయనే. ఆయనే రాత్రిని ప్రశాంత సమయంగా చేశాడు. సూర్యచంద్రులను లెక్క ప్రకారం ఉంచాడు. ఇదంతా ఆ అపారశక్తిమంతుడు, అనంత జ్ఞానసంపన్నుడు నిర్ధారించిన వ్యవస్థ. 97. ఆయనే మీ కొరకు నక్షత్రాలను ఏర్పరచాడు – వాటిద్వారా మీరు భూసముద్రాల చీకట్లలో మార్గం తెలుసుకుంటారని. తెలుసుకోగోరిన జనుల కొరకు మేము మా సూచనలను ఈ విధంగా విపులీకరించాము.

98. ఆయనే మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. తరువాత ప్రతి ఒక్కరికీ ఆగి ఉండే స్థలం ఒకటుంది. అప్పగించబడే స్థలం కూడా ఒకటుంది. అర్థం చేసుకోగల జనులకు మేము మా సూచనలను స్పష్టంగా విడమరచి చెప్పాము. 99. ఆయనే ఆకాశం నుండి వర్షం కురిపించాడు. మరి దాని ద్వారా మేమే అన్ని రకాల మొక్కలను మొలకెత్తించాము. వాటి నుండి పచ్చని శాఖోపశాఖలను వెలికి తీశాము. తద్వారా మేము ఒకదానిపై ఒకటి దట్టంగా పేరుకుని ఉన్న ఆహార ధాన్యాలను పండించాము. ఖర్జూర చెట్ల నుండి, వాటి పాళీల నుండి క్రిందికి వ్రేలాడే పండ్ల గెలలు, ద్రాక్ష తోటలు, ఆలివ్, దానిమ్మ తోటలు ఉత్పన్నం చేశాము. వాటిలో కొన్ని పరస్పరం పోలి ఉంటాయి. కొన్ని వేర్వేరుగా కూడా ఉంటాయి. ఆ చెట్లకు కాసిన కాయలు పెద్దవి అవుతున్నప్పుడు, పండుతున్నప్పుడు శ్రద్ధగా గమనించండి. విశ్వాస మాధుర్యాన్ని ఆస్వాదించదలచిన వారికి ఇందులో పలు సూచనలున్నాయి.

100. వారు జిన్నాతులను దైవానికి భాగస్వాములుగా ఖరారు చేసుకున్నారు. వాస్తవానికి వారిని సృష్టించినది కూడా దేవుడే. వారు జ్ఞానంతో నిమిత్తం లేకుండానే ఆయనకు కొడుకుల్నీ, కూతుళ్ళనీ కల్పించుకున్నారు.

వీళ్లు చెప్పే కాల్పనిక విషయాల నుండి ఆయన పవిత్రుడు, ఉన్నతుడు. 101. భూమ్యాకాశాలను ఆవిష్కరించినవాడు ఆయనే. ఆయనకంటూ ఒక సహధర్మచారిణి లేనప్పుడు ఆయనకు కొడుకు ఎలా ఉంటాడు? ప్రతి దానినీ ఆయనే సృష్టించాడు. ఆయన ప్రతి ఒక్కదానిని గురించి క్షుణ్ణంగా తెలిసినవాడు. 102. ఈయనే అల్లాహ్! మీ ప్రభువు. ఆయన తప్ప మరో దేవుడు లేడు. ఆయనే అన్నింటినీ సృష్టించినవాడు. కనుక ఆయన్నే ఆరాధించండి. మరాయనే అన్నింటి కార్యసాధకుడు. 103. చూపులు ఆయన్ని అందుకోలేవు. కాని ఆయన చూపులను అందుకుంటాడు. ఆయన కడు సూక్ష్మగ్రాహి. సమస్త సమాచారం ఉన్నవాడు. 104. నిశ్చయంగా మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి సత్యాన్ని దర్శించే నిదర్శనాలు వచ్చేశాయి. కనుక వాటిని తన కళ్లతో వీక్షించినవాడు తన స్వయానికే లాభం చేకూర్చుకుంటాడు. గుడ్డిగా వ్యవహరించినవాడు తన స్వయానికే నష్టం కలిగించుకుంటాడు. నేను మీపై పర్యవేక్షకుణ్ణి కాను.

105. ఈ విధంగా మేము మా సూచనలను పలు విధాలుగా వివరిస్తూ ఉంటాము - నీవు ఎక్కడో చదివి వచ్చావని వారు అనాలని. ఇంకా తెలుసుకోగోరిన వారికి విషయాన్ని స్పష్టపరచాలని. 106. నీవు మాత్రం నీ ప్రభువు తరఫున నీపై అవతరించిన దివ్యవాణి (వహీ)ని అనుసరిస్తూ ఉండు. ఆయన తప్ప మరో దేవుడు లేడు. బహుదైవోపాసకులను పట్టించుకోకు. 107. దేవుడే గనక తలచుకుంటే వారిని షిర్క్‌కు ఒడిగట్టకుండా చేసేవాడే. మేము నిన్ను వారిపై కావలివానిగా నియమించలేదు. నువ్వు వారి నిర్వాకానికి బాధ్యుడవు కూడా కావు. 108. అల్లాహ్‌ను కాదని వారు ఎవరెవరినయితే మొరపెట్టుకుంటున్నారో, వారిని మీరు దూషించకండి. ఎందుకంటే వారు మరింతగా హద్దుమీరిపోయి, అజ్ఞానం మూలంగా అల్లాహ్‌ను దూషించవచ్చు. ఈ విధంగా మేము అన్ని సముదాయాల వారి దృష్టిలో వారి పనులను అందమైనవిగా చేశాము. తరువాత వారంతా తమ ప్రభువు వైపునకే మరలవలసి ఉంది. అప్పుడు వారు చేసుకున్నదంతా ఆయన వారికి తెలుపుతాడు.

109. వీళ్లు దేవునిపై గట్టిగా ప్రమాణం చేసి, తమ వద్దకు ఏదయినా సూచనవస్తే, దానిని తప్పకుండా విశ్వసిస్తామని అంటారు. వారికి చెప్పు : 'సూచనలైతే దేవుని వద్దనే ఉన్నాయి.' నీకేంతెలుసు? ఒకవేళ సూచనలు వచ్చినా వారు విశ్వసించే రకం కాదు. 110. తొలిసారి ఏ విధంగానయితే వీరు వాటిని విశ్వసించలేదో అదేవిధంగా మేము వారి హృదయాలను, వారి చూపులను మళ్లిస్తాము. ఇంకా మేము వారిని వారి తలబిరుసుతనంలో తచ్చాడుతూ ఉండేలా వదలిపెడతాము. ◆ (8) 111. ఒకవేళ మేము వారిపై దైవదూతలను దింపినా, మృతులు వారితో మాట్లాడినా, లోకంలోని సమస్త వస్తువులను వారి ముందు ప్రోగుచేసిపెట్టినా అప్పటికీ వారు విశ్వసించేవారు కాదు – దైవచిత్తమయితే తప్ప! అయితే వారిలో అనేకులు మూర్ఖంగా మాట్లాడతారు.

112. ఇదే విధంగా మేము దుష్ట మనుషులను, దుష్ట షైతానులను ప్రతి ప్రవక్తకూ శత్రువులుగా చేశాము. వారు ఒండొకరిని మోసపుచ్చే ఉద్దేశంతో రమ్యమయిన మాటలతో ప్రేరేపించుకుంటూ ఉంటారు. నీ ప్రభువే గనక తలచుకుంటే వారలా చేసి ఉండేవారు కాదు. వారిని వారి కాల్పనిక విషయాలలో పడి ఉండేలా వదలిపెట్టు. 113. పరలోకాన్ని విశ్వసించని వారి హృదయాలు దాని వైపునకే మొగ్గాలని, దానిపైనే వారు మోజుపడాలని, తాము సంపాదించుకుంటున్న చెడులను సంపాదించుకోవాలని ఈ విధంగా వారిని వదిలిపెట్టడం జరిగింది.

114. ఏమిటి, నేను దైవాన్ని కాదని మరో న్యాయాధికారిని వెతుక్కోవాలా? యదార్థానికి ఆయన ఒక సవివరమయిన గ్రంథాన్ని మీ వద్దకు అవతరింపజేశాడు. ఎవరికయితే మేము పూర్వం గ్రంథం వొసగి ఉన్నామో వారికి తెలుసు – ఈ గ్రంథం నీ ప్రభువు తరఫు నుండి సత్య సమేతంగా అవతరించిందని. కనుక నీవు శంకించేవారిలో చేరకు. 115. నిజం దృష్ట్యాగానీ, న్యాయం రీత్యాగాని నీ ప్రభువు వాక్కు పరిపూర్ణమైనది. ఆయన వాక్కును మార్చగల వాడెవడూ లేడు. ఆయన సర్వం వినేవాడు, సర్వం

తెలిసినవాడు. 116. (ఓ ప్రవక్తా!) ప్రపంచంలో నివసించే జనులలో అనేకులు చెప్పినట్లుగా నువ్వు అనుసరించినట్లయితే, వారు నిన్ను దైవమార్గం నుండి తప్పిస్తారు. వారు కేవలం అనుమానాలను అనుసరిస్తారు. అంచనాల జగతిలో విహరిస్తూ ఉంటారు. 117. నిశ్చయంగా నీ ప్రభువుకు తన మార్గం నుండి తప్పిపోయే వారి గురించి తెలుసు. సన్మార్గం పొందినవారెవరో కూడా ఆయనకు బాగా తెలుసు.

118. కనుక మీరు దైవ వచనాలను విశ్వసించేవారయితే అల్లాహ్ పేరు ఉచ్చరించబడిన పశువు మాంసాన్ని తినండి. 119. అల్లాహ్ పేరు ఉచ్చరించబడిన పశువు మాంసాన్ని మీరు తినకపోవటానికి కారణమేమిటి? వాస్తవానికి దేవుడు మీ కొరకు నిషేధించిన వస్తువులన్నింటి వివరాలు ఇదివరకే మీకు తెలిపి ఉన్నాడు – గత్యంతరం లేని పరిస్థితిలో మీరు వాటిని తినవలసివస్తే తప్ప. యదార్థమేమిటంటే చాలామంది జ్ఞానంతో నిమిత్తం లేకుండానే, కేవలం తమ ఆకాంక్షల ఆధారంగా పెడత్రోవ పట్టిస్తూ ఉంటారు. నిశ్చయంగా నియమోల్లంఘనకు పాల్పడే వారి గురించి నీ ప్రభువుకు బాగా తెలుసు. 120. మీరు పాపం యొక్క బాహ్యాన్ని, దాని లోపలి దానిని కూడా విడనాడండి. పాపాన్ని సముపార్జిస్తున్నవారికి, శీఘ్రంగానే వారు చేసుకున్న దాని ప్రతిఫలం లభిస్తుంది. 121. అల్లాహ్ పేరు ఉచ్చరించబడని పశువు మాంసాన్ని తినకండి. నిశ్చయంగా ఇది పాపం. మీతో వితండవాదనకు దిగమని షైతానులు తమ అనుంగు అనుచరులకు నూరిపోస్తుంటారు. మీరుగాని వారిని అనుసరించారంటే మీరు కూడా బహుదైవారాధకుల్లోని వారవుతారు.

122. మృతుడుగా ఉన్న ఒక వ్యక్తికి మేము జీవన దానం చేసి, అతనికొక జ్యోతిని ప్రసాదించాము. దాని వెలుగులో అతను ప్రజల మధ్య సాగిపోతున్నాడు. ఇలాంటి వ్యక్తి, చీకట్లలో పడి వాటి నుండి ఎన్నటికీ బయటపడలేని వానితో సమానుడవుతాడా? ఇదేవిధంగా సత్య తిరస్కారుల దృష్టిలో వారి కర్మలు రమ్యమయినవిగా చేయబడ్డాయి. 123. ఇంకా

ఇదేవిధంగా మేము ప్రతి పట్టణంలోనూ పాపాత్ముల సర్దారులను ఉంచాము. అక్కడ వారు పన్నాగాలు పన్నటానికి. వాస్తవానికి వారు పన్నే పన్నాగాలు వారికే వ్యతిరేకంగా పరిణమిస్తాయి. కాని వారికి ఆ ధ్యాసే లేదు. 124. వారి వద్దకు ఏదయినా సూచన వచ్చినప్పుడు, 'దైవప్రవక్తలకు ఇవ్వబడినదే మాకూ ఇవ్వబడనంత వరకూ మేము నమ్మబోము' అని అంటారు. తన సందేశాన్ని ఎవరికి ప్రదానం చేయాలో దేవునికే బాగా తెలుసు. అపరాధులయిన వారికి దైవసన్నిధిలో పరాభవం తప్పదు, కఠిన యాతన కూడా. ఎందుకంటే వారు కుయుక్తులకు పాల్పడేవారు.

125. దేవుడు సన్మార్గం చూపదలచిన వాని ఆంతర్యాన్ని ఇస్లాం కొరకు విప్పారజేస్తాడు. అపమార్గాన వదలివేయదలచిన వాని ఆంతర్యాన్ని కుంచింపజేస్తాడు. (ఇస్లాం ప్రస్తావన రాగానే) అతనికి ఆకాశానికి ఎక్కిపోతున్నంత కష్టంగా తోస్తుంది. ఈ విధంగా దేవుడు విశ్వసించని వారిపై మాలిన్యాన్ని వేస్తాడు. 126. ఇదీ నీ ప్రభువు మార్గం – తిన్ననిది. పరిశీలించేవారి కొరకు మేము మా సూచనలను ప్రస్ఫుటం చేశాము. 127. వారి కోసం వారి ప్రభువు వద్ద ప్రశాంత నిలయం ఉంది. వారి సదాచరణ మూలంగా దేవుడు వారికి రక్షకుడుగా ఉంటాడు.

128. దేవుడు వారందరినీ సమీకరించిననాడు, 'ఓ జిన్నాతు వర్గీయులారా! మీరు మనుషుల్లోని చాలామందిని తీసేసుకున్నారు' అని అంటాడు. అప్పుడు వారి సహవాసులైన మనుషులు ఇలా అంటారు : 'ఓ మా ప్రభూ! మాలోని ప్రతి ఒక్కరు ఇంకొకరిని బాగా వాడుకున్నారు. కడకు నీవు మా కొరకు నిర్ధారించిన ఘడియకు చేరుకున్నాము.' దేవుడంటాడు : 'ఇక అగ్నే మీ నివాసం. మీరు ఎల్లకాలం ఇందులోనే ఉంటారు.' దేవుడు మరేదయినా తలిస్తే అది వేరే విషయం. నిశ్చయంగా మీ ప్రభువు వివేచనాపరుడు, జ్ఞానవంతుడు. 129. ఈ విధంగా మేము దుర్వర్తనులను – వారు సముపార్జించిన దురాగతాల కారణంగా – ఒండొకరికి సహవాసులుగా చేస్తాము. 130. ఓ జిన్నులు, మానవుల వర్గీయులారా!

చెప్పండి, మీకు నా వచనాలను వినిపించే, ఈ రోజు గురించి భయపెట్టే ప్రవక్తలు మీ వద్దకు స్వయంగా మీలో నుండే రాలేదా?' వారు సమాధాన మిస్తారు, 'మాకు వ్యతిరేకంగా మేమే సాక్షులము.' ప్రాపంచిక జీవితం వారిని మభ్యపెట్టింది. నిశ్చయంగా మేము తిరస్కరించామంటూ వారు తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యం పలుకుతారు. 131. ఇలా ఎందుకంటే; బస్తీలలో నివసించే జనులు సత్యం గురించి తెలియని స్థితిలో ఉండగా – వారి దుర్వర్తన కారణంగా – వారిని తుదముట్టించటం నీ ప్రభువు విధానం కాదు.

132. ప్రతి వ్యక్తి శ్రేణి అతని ఆచరణనుబట్టి ఉంటుంది. నీ ప్రభువు జనుల ఆచరణల పట్ల అజాగ్రత్తగా లేడు. 133. నీ ప్రభువు నిరపేక్షాపరుడు. కరుణించేవాడు. ఆయన గనక తలచుకుంటే – వేరొక తరం నుండి మిమ్మల్ని ప్రభవింపజేసినట్లే – మీ అందరినీ తొలగించి మీ తదనంతరం తాను కోరిన వారిని మీ స్థానంలో తేగలడు. 134. మీకు వాగ్దానం చేయబడుతున్నది వచ్చి తీరుతుంది. మీరు దేవుణ్ణి అశక్తుణ్ణి చేయలేరు. 135. వారితో అను : 'నా జాతివారలారా! మీరు మీ స్థానాన ఆచరిస్తూ ఉండండి. నేనూ ఆచరిస్తూ ఉన్నాను. పరిణామం దృష్ట్యా ఎవరి ఆచరణ మేలైనదో శీఘ్రంగానే మీరు తెలుసుకుంటారు. నిశ్చయంగా దుర్వర్తనులు ఎన్నటికీ సఫలీకృతులు కారు.'

136. దేవుడు పండించిన పంట పొలాలలో నుండి, పశువులలో నుండి వీరు కొంత దేవుని వాటాగా నిర్ధారించారు. 'ఇది దేవుని వాటా. ఇదేమో మా భాగస్వాములది' అని ధీమాగా చెబుతారు. తరువాత వారి భాగస్వాముల పేర ఉన్న వాటా ఎలాగూ దైవానికి చేరదు. కాని దేవునికి కేటాయించబడిన భాగం మాత్రం వారి భాగస్వాముల (దేవతల) పద్దులో చేరిపోతుంది. వారి ఈ తీర్పు ఎంత చెడ్డది!? 137. ఈ విధంగా ఎంతోమంది బహుదైవారాధకుల దృష్టిలో వారి భాగస్వాములు, వారి సంతాన హత్యను ఆకర్షణీయమైనదిగా చేసిపెట్టారు – తద్వారా వారిని వినాశానికి గురిచెయ్యటానికి, వారి మతధర్మాన్ని వారికి సందేహాస్పదం చేయటానికి. దేవుడు కోరుకుంటే వారు ఆ విధంగా చేసి ఉండేవారు కాదు. కనుక వారిని వారి అభూత కల్పనలలోనే కొట్టుమిట్టాడుతూ ఉండేలా వదలిపెట్టు.

138. 'ఈ పశువులు, ఈ వ్యవసాయోత్పత్తులు నిషిద్ధం. మేము కోరినవారు తప్ప వేరెవరూ వాటిని తినలేరు' అని కూడా అంటున్నారు. ఇవన్నీ తమకు తాముగా చేసుకున్న తీర్మానాలే. ఫలానా పశువులపై స్వారీచేయటం నిషిద్ధం అనబడింది. మరికొన్ని పశువులపై వారు దైవనామాన్ని స్మరించరు. ఇవన్నీ వారు దేవునిపై కల్పించిన అసత్యాలే. వారి ఈ అసత్య కల్పనకు గాను దేవుడు శీఘ్రంగానే తగిన ప్రతిఫలం ఇస్తాడు. 139. ఇంకా ఇలా అంటున్నారు : 'ఫలానా పశువుల కడుపులలో (బ్రతికి) ఉన్నది మా పురుషులకే ప్రత్యేకం. అది మా స్త్రీలకు నిషిద్ధం. ఒకవేళ అది చనిపోయినదైతే అందులో అందరూ భాగస్థులే. వారి ఈ ప్రేలాపనకుగాను దేవుడు శీఘ్రంగానే శిక్ష విధిస్తాడు. నిశ్చయంగా దేవుడు వివేకసంపన్నుడు, జ్ఞాన ధనుడు. 140. తమ సంతానాన్ని మూర్ఖత్వం వల్లనూ, అజ్ఞానం వల్లనూ హత్యచేసిన వారు ఘోరమైన నష్టంలో పడిపోయారు. వారు దేవునికి అసత్యాలను అంటగడుతూ, ఆయన వారికి ప్రసాదించిన జీవనోపాధిని నిషేధించు కున్నారు. ముమ్మాటికీ వారు మార్గం తప్పారు. ఇక వారు సన్మార్గం పొందరు.

141. ఆయనే రకరకాల తోటలను ఉత్పన్నం చేశాడు. వాటిలో కొన్ని తడికలపై ఎక్కించబడతాయి, మరికొన్ని ఎక్కించబడవు. ఇంకా ఖర్జూర వృక్షాలను, పంట పొలాలను సృజించాడు. వాటి ద్వారా లభ్యమయ్యే ఆహార పదార్థాలు విభిన్నం. ఇంకా ఆలివ్, దానిమ్మ వృక్షాలు – వాటిలో పరస్పరం పోలినవీ ఉంటాయి, విభిన్నమైనవీ ఉంటాయి. ఈ ఉత్పాదనలు పండినప్పుడు వాటిని తినండి. పంటకోసిన నాడు దేవుని హక్కును అవశ్యంగా చెల్లించండి. దుబారా ఖర్చుచేయకండి. దుబారాగా ఖర్చుపెట్టేవారిని దేవుడు ఇష్టపడడు. 142. ఆయన పశువులలో బరువును మోసేవాటినీ సృష్టించాడు, నేలకు అతుక్కుని ఉండేవాటినీ సృష్టించాడు. దేవుడు మీకు ప్రసాదించిన జీవనో పాధిలో నుండి తినండి. షైతాన్ అడుగులకు మడుగులొత్తకండి. నిశ్చయంగా వాడు మీకు బద్ధ విరోధి.

143. దేవుడు ఎనిమిది జతలను పుట్టించాడు – గొఱ్ఱెలలో రెండు

రకాలు, మేకలలో రెండు రకాలు. వారిని అడుగు : దేవుడు నిషేధించినది రెండు మగవాటినా? రెండు ఆడవాటినా? లేక ఆ గొఱ్ఱెల, మేకల కడుపులలో ఉన్నవాటినా? మీరు చెబుతున్నది నిజమే అయితే నాకు ప్రామాణిక ఆధారాలతో సహా తెలుపండి. 144. అలాగే ఒంటెలలో రెండు రకాలు, ఆవులలో రెండు రకాలున్నాయి. వారిని అడుగు : దేవుడు నిషేధించినది రెండు మగవాటినా? రెండు ఆడవాటినా? లేక ఆ ఆడ ఒంటెల, ఆవుల కడుపులలో ఉన్న పిల్లలనా? ఏమిటి, దేవుడు మీకు దీని గురించి ఆదేశించినపుడు మీరుగాని అక్కడ ఉన్నారా? జ్ఞానంతో నిమిత్తం లేకుండానే జనులను పెడదారి పట్టించే ఉద్దేశంతో దైవానికి అసత్యాలను అంటగట్టే వానికంటే దుర్మార్గుడు ఎవడుంటాడు? నిశ్చయంగా దేవుడు దుర్మార్గ జనులకు మార్గదర్శకత్వం వహించడు. 145. వారితో అను : 'నాకు అందజేయబడిన దివ్యవాణి (వహీ)లో, తినేవారి కోసం నిషిద్ధమయినదేదీ కనిపించటం లేదు – ఇవి తప్ప. అది మృత జంతువు (ముర్దార్) లేదా ప్రవహింపజేయబడిన రక్తం లేదా పంది మాంసం – అది పరమ అశుద్ధమయినది గనక – లేదా అధర్మమయిన కారణంగా దైవేతరుల పేరు ఉచ్చరించి కోయబడిన జంతువు. ఒకవేళ ఏ వ్యక్తి అయినా ఆకలి బాధకు తట్టుకోలేక, మోతాదుకు మించకుండా, పాపానికి పాల్పడే ఉద్దేశం లేకుండా (కొద్దిగా తింటే) నీ ప్రభువు క్షమాశీలుడు, కృపాసాగరుడు.

146. యూదులకు మేము గోళ్ళు గల జంతువులన్నింటినీ నిషేధించాము. ఆవు క్రొవ్వునూ, మేక క్రొవ్వును కూడా నిషేధించాము. అయితే వాటి వీపులకు, ప్రేగులకు, ఎముకలకు అంటుకొని ఉన్న దానిని మాత్రం మినహాయించాము. వారి దుష్ట పోకడ కారణంగా మేము వారికి ఈ శిక్ష విధించాము. మేము చెప్పేది ముమ్మాటికీ నిజం. 147. ఒకవేళ ఇప్పటికీ వారు నిన్ను అసత్యవాదిగా చిత్రీకరిస్తే, వారికి చెప్పేయ్ : 'మీ ప్రభువు సువిశాలమైన కారుణ్యం కలవాడు. ఆయన శిక్ష అపరాధ జనుల నుండి తొలగటం అసంభవం.

148. బహుదైవోపాసనకు ఒడిగట్టిన వారిలా అంటారు : 'దేవుడే గనక తలచుకుని ఉంటే మేముగానీ, మా తండ్రీతాతలుగాని షిర్క్ చేసి ఉండేవారం కాము. ఏ వస్తువునూ నిషిద్ధం (హరామ్)గా చేసుకునేవారం కాము.' వీరికి పూర్వం గడచిన వారు కూడా ఇలాగే ధిక్కార వైఖరిని అవలంబించారు. చివరికి వారు మా యాతనను చవిచూశారు. వారిని అడుగు : 'మీ వద్ద ఏదయినా జ్ఞానాధారం ఉందా? ఉంటే సమర్పించండి. మీరు కేవలం అనుమానాన్ని అనుసరిస్తున్నారు. అంచనాలపై పొద్దుపుచ్చు తున్నారు. 149. ఇలా అను : తుది వాదన అల్లాహ్‌దే. ఆయన గనక కోరితే మీ అందరికీ సన్మార్గం ప్రసాదించేవాడే. 150. వారితో అను: 'దేవుడు ఈ వస్తువులను నిషేధించాడని సాక్ష్యం పలికే మీ సాక్షులను తీసుకు రండి.' ఒకవేళ వారు అసత్య సాక్ష్యం పలికితే, నీవు మటుకు వారితో పాటే సాక్ష్యమివ్వకు. మా సూచనలను అబద్ధమంటూ త్రోసిపుచ్చిన వారి, పరలోకాన్ని నమ్మనివారి, ఇతరులను తమ ప్రభువుకు సమానులుగా నిలబెట్టినవారి కాంక్షలను అనుసరించకు.

151. వారికి చెప్పు : 'రండి ..... మీ ప్రభువు మీకు నిషేధించినవేవో నేను మీకు వినిపిస్తాను – దైవానికి సహవర్తులుగా ఎవరినీ కల్పించకండి. తల్లిదండ్రుల యెడల ఉత్తమ రీతిలో వ్యవహరించండి. మీ సంతానాన్ని దారిద్ర్య భయంతో హత్యచేయకండి. మేము మీకూ ఉపాధిని ఇస్తున్నాము, వారికీ ఇస్తాము. సిగ్గుమాలిన పనుల దరిదాపులకు కూడా పోకండి – అవి బహిర్గతమైనవైనా, గోప్యమైనవైనా. ధర్మబద్ధంగా తప్ప దేవుడు పవిత్రమైనదిగా (నిషిద్ధమైనదిగా) చేసిన ఏ ప్రాణినీ హతమార్చకండి – మీరు బుద్ధిగా మసలుకుంటారని దేవుడు మీకు గట్టిగా ఆదేశిస్తున్నాడు.

152. సమంజసమయిన రీతిలో తప్ప, తండ్రిలేని బిడ్డల ఆస్తి జోలికి పోకండి. అదైనా (అనాథలు) యుక్త వయస్సుకు చేరుకునేవరకే. కొలతలు, తూనికలలో పూర్తిగా న్యాయాన్ని పాటించండి. మేము ఏ వ్యక్తిపైన కూడా శక్తికి మించిన భారం మోపము. ఏదయినా చెప్పవలసి వచ్చినపుడు

న్యాయసమ్మతంగా చెప్పండి – వ్యవహారం మీ సమీప బంధువుదయినా సరే. దేవునితో చేసిన బాసను నెరవేర్చండి. మీరు విజ్ఞతతో వ్యవహరిస్తారని దేవుడు మీకీవిధంగా నిర్దేశిస్తున్నాడు. 153. ఇంకా (ఆయన నిర్దేశన ఇది) 'ఇదే నా రుజుమార్గం. కాబట్టి మీరు దీనినే అనుసరించండి. (అడ్డ)దారుల్లో పోకండి. అవి మిమ్మల్ని ఆయన మార్గం నుండి వేరు చేస్తాయి. మీరు జాగ్రత్తగా మసలుకుంటారని ఆయన మీకు చేసిన తాకీదు ఇది.'

154. తరువాత మేము మూసాకు గ్రంథాన్ని ఇచ్చాము – సదాచరణ చేసేవారిపై మా అనుగ్రహాన్ని పూర్తి చేయటానికి, ఇంకా ప్రతి విషయం సవివరంగా ఉండేది, మార్గదర్శకత్వం, కారుణ్యం – తద్వారా వారు తమ ప్రభువును కలుసుకోవటం పట్ల దృఢ విశ్వాసం కలిగి ఉంటారని. 155. ఇంకా ఇదేవిధంగా మేము ఈ గ్రంథాన్నీ (ఖుర్ఆన్ను) అవతరింపజేశాము – శుభప్రదమయిన గ్రంథం. కనుక మీరు దీనిని అనుసరించండి. దైవానికి భయపడండి – తద్వారా మీరు కరుణించబడవచ్చు. 156. 'గ్రంథమైతే మాకు పూర్వం రెండు వర్గాల (యూదులు, క్రైస్తవులు)కు ఇవ్వబడింది. వారు ఏం చదివేవారో, ఏం చదివించేవారో మాకేమీ తెలియదు' అని మీరు అనకుండా ఉండేటందుకే ఈ ఏర్పాటు చేయబడింది. 157. లేదా 'మాపైనే గనక గ్రంథం అవతరింపజేయబడి ఉంటే మేము వారికన్నా బాగా సన్మార్గాన నడిచి ఉండేవారము' అని అంటారేమోనని (ఇలా చేశాము). ఇదిగో, మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి ప్రకాశమానమయిన నిదర్శనం, మార్గదర్శకత్వం, కారుణ్యం వచ్చేసింది. ఇక దీని తరువాత కూడా దైవ సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చే వానికంటే, వాటి నుండి ముఖం త్రిప్పుకునే వాని కంటే దుర్మార్గుడు ఎవడు? మా సూచనల పట్ల విముఖత చూపేవారికి వారి ఈ వైముఖ్య ధోరణి కారణంగా దుర్భరమయిన యాతనకు గురిచేస్తాము. 158. ఇంతకీ వారు దేని కోసం నిరీక్షిస్తున్నారు? తమ వద్దకు దైవదూతలు రావాలనో లేదా నీ ప్రభువే ప్రత్యక్షమవ్వాలనో లేదా నీ ప్రభువు సూచనలలో ఏదయినా సూచన ప్రస్ఫుటం కావాలనో వారు ఎదురు చూస్తున్నారా? నీ ప్రభువు చూపే సూచనలలోని ఏదయినా సూచన

ప్రస్ఫుటమయిన నాడు, అంతకు ముందే విశ్వసించకుండా ఉండిన ఏ వ్యక్తి విశ్వాసం లేదా విశ్వసించి కూడా ఏ సత్కార్యమూ చేయనివాని విశ్వాసం అతనికెలాంటి ప్రయోజనం చేకూర్చదు. ఇలా అను : 'మీరూ ఎదురు చూడండి. మేమూ ఎదురు చూస్తున్నాము.'

159. నిశ్చయంగా ఎవరయితే తమ ధర్మంలో చీలికలు తీసుకువచ్చి, వేర్వేరు ముఠాలుగా విడిపోయారో వారితో నీకెలాంటి సంబంధం లేదు. వాళ్ళ వ్యవహారం దైవాధీనం. వారు చేసుకున్న దానిని గురించి ఆయనే వారికి తెలుపుతాడు. 160. సత్కార్యం చేసి వచ్చిన వానికి పదిరెట్ల ప్రతిఫలం లభిస్తుంది. దుష్కార్యంతో వచ్చిన వానికి దానికి సమానమయిన ప్రతిఫలం (మాత్రమే) లభిస్తుంది. వారికెలాంటి అన్యాయం జరుగదు.

161. వారికి చెప్పు : 'నిశ్చయంగా నా ప్రభువు నాకు రుజుమార్గం వైపు దర్శకత్వం వహించాడు. సరైన ధర్మం, ఇబ్రాహీమ్ విధానం వైపునకు – ఆయన ఏకోన్ముఖుడు, ఆయన బహుదైవారాధకులలోని వాడు కాడు.' 162. ఇలా చెప్పు : 'నా నమాజ్, నా త్యాగం, నా జీవనం, నా మరణం – సర్వలోక ప్రభువైన దేవుని కొరకే. 163. ఆయనకు భాగస్వామి అంటూ ఎవడూ లేడు. నాకు లభించిన ఆజ్ఞ ఇదే. విధేయతా భావంతో తలవంచే వారిలో నేను తొలివాడను.' 164. వారిని అడుగు : 'దేవుడు సమస్తానికీ పాలకుడు, పోషకుడు అయినప్పుడు, నేను ఆయన్ని కాదని వేరొక ప్రభువును దేవులాడుకోవాలా? ప్రతి వ్యక్తీ తాను సముపార్జించుకున్నదే పొందుతాడు. బరువును మోసేవాడెవడూ వేరొకని బరువును మోయడు. కడకు మీరంతా మీ ప్రభువు వైపునకే మరలవలసి ఉంది. అప్పుడు ఆయన మీరు విభేదించుకుంటున్న విషయంలోని వాస్తవికతను మీకు తెలియపరుస్తాడు.' 165. ఆయనే మిమ్మల్ని భువిలో ఒకరి తరువాత ఒకరి వారసులుగా చేశాడు. మీలో కొందరికి మరికొందరిపై ఉన్నతిని ప్రసాదించాడు – తాను ప్రసాదించిన దానిలో మిమ్మల్ని పరీక్షించాలని. నిశ్చయంగా నీ ప్రభువు శిక్షించటంలో శీఘ్రగామి. నిశ్చయంగా ఆయన క్షమాభిక్ష పెట్టేవాడు, దయదలిచేవాడు కూడా.

# 7. అల్ ఆరాఫ్ (ఎత్తయిన ప్రదేశం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్, లామ్, మీమ్, సాద్. 2. ఇది నీ వైపునకు అవతరింపజెయ్యబడిన గ్రంథం. కాబట్టి దీని గురించి నీ మనసులో ఎలాంటి తటపటాయింపు కలగరాదు – దీనిద్వారా నీవు జనులను సావధానపరచాలని (ఇది పంపబడింది). విశ్వసించిన వారికి ఇది జ్ఞాపిక. 3. మీ ప్రభువు తరఫున మీ వైపునకు అవతరింపజేయబడిన దానిని అనుసరించండి. ఆయన తప్ప వేరితర సంరక్షకులను అనుసరించకండి. మీరు హితబోధను గ్రహించేది బహు స్వల్పం. 4. మేము ఎన్నో జనావాసాలను తుదముట్టించాము. వారిపై మా విపత్తు రాత్రివేళనో, మధ్యాహ్నం పూట వారు విశ్రాంతి తీసుకుంటున్నప్పుడో వచ్చిపడింది. 5. మా ఆపద వారిపై వచ్చిపడినప్పుడు, 'నిజంగానే మేము దుర్మార్గులం' అనే మాట తప్ప వారు మరొకటి అనలేదు. 6. ప్రవక్తలు పంపబడిన వారిని మేము తప్పకుండా ప్రశ్నించవలసి ఉంది. ప్రవక్తలను కూడా మేము తప్పక ప్రశ్నించవలసి ఉంది. 7. తరువాత మేము వారి ముందు పూర్తి ఎరుకతో అంతా వివరిస్తాము. ఎందుకంటే మేము ఎప్పుడూ, ఎక్కడా లేకుండా లేము. 8. ఆ రోజు సత్యం మాత్రమే బరువైనదై ఉంటుంది. కనుక ఎవరి తూకాలు బరువైనవై ఉంటాయో, వారే సఫలీకృతులుగా నిలుస్తారు. 9. మరెవరి తూకాలు తేలికగా ఉంటాయో – అలాంటి వారే తమను నష్టానికి గురిచేసుకున్నవారు. ఎందుకంటే వారు మా సూచనల పట్ల అన్యాయంగా ప్రవర్తించేవారు.

10. మేము మీకు భువిలో చోటు కల్పించాము. ఇంకా అందులో మీకు జీవన సామగ్రిని సమకూర్చాము. కాని మీరు కృతజ్ఞులవటమనేది బహు స్వల్పం. 11. వాస్తవానికి మేము మిమ్మల్ని సృష్టించాము. మరి మేమే మీ రూపురేఖలను తీర్చిదిద్దాము. తరువాత ఆదమ్‌కు సజ్దా చెయ్యండని దైవదూతలకు చెప్పాము. వారంతా సజ్దా చేశారు – ఒక్క ఇబ్లీసు తప్ప.

వాడొక్కడే సజ్దా చేసే వారిలో చేరలేదు. 12. దేవుడు అతనిని 'నేను నిన్ను ఆదేశించినప్పటికీ, సజ్దా చేయకుండా ఏ విషయం నిన్ను ఆపింది?' అని ప్రశ్నిస్తే, 'నేను అతనికంటే శ్రేష్ఠుడను. నీవు నన్ను అగ్నితో సృష్టించావు. అతన్నేమో మట్టితో సృష్టించావు' అని ఇబ్లీసు బదులిచ్చాడు. 13. 'అలా అనుకుంటే ఇక్కణ్ణుంచి దిగిపో. ఇక్కడ ఉండి గర్వపడే అధికారం నీకెంతమాత్రం లేదు. పో ఇక్కడి నుండి. నిశ్చయంగా నువ్వు తుచ్ఛుడవు' అని దేవుడు సెలవిచ్చాడు 14. ఇబ్లీసు నివేదించుకున్నాడు : 'అలాగయితే అందరూ తిరిగి లేపబడే దినం వరకూ నాకు వ్యవధి ఇవ్వు.' 15. దేవుడు సెలవిచ్చాడు : 'నీకు వ్యవధి ఇవ్వబడింది.' 16. ఇబ్లీసు అన్నాడు : 'చిత్తం, నీవు నన్ను దారి తప్పించావు గనక నేను కూడా జనుల కోసం నీ రుజు మార్గంపై పొంచి ఉంటాను. 17. తరువాత వారి ముందునుంచీ, వెనుక నుంచీ, వారి కుడివైపు నుంచీ, ఎడమ వైపు నుంచీ వారిపై దాడి జరుపుతాను. నీవు వారిలో అత్యధికుల్ని కృతజ్ఞులుగా పొందవు.' 18. సెలవీయబడింది: 'పో, ఇక్కణ్ణుంచి. నీచుడవై, ధూర్తుడవై. వారిలో ఎవడు నిన్ను అనుసరించినా, నేను మీ అందరితో నరకాన్ని నింపుతాను.'

19. 'ఓ ఆదమ్! నువ్వూ, నీ భార్య స్వర్గంలో ఉండండి. కోరిన చోటు నుండి తినండి. కాని ఆ చెట్టు దగ్గరకు మాత్రం పోవద్దు. పోయారంటే, మీరు దుర్వర్తనుల్లో చేరిపోతారు.' 20. తరువాత షైతాన్ వారిరువురినీ కవ్వించాడు – ఒండొకరికి కనబడకుండా చేయబడిన వారి మర్మాంగాలు బహిర్గతం చేయటానికి. వాడు వారిద్దరితో ఇలా అన్నాడు : 'మీరిద్దరూ దైవదూతలు అయిపోతారేమోనని లేదా మీరు అమరజీవులై పోతారేమోనని మాత్రమే మీ ప్రభువు మిమ్మల్ని ఆ చెట్టు నుండి ఆపాడు! 21. వాడు ఒట్టేసుకుని మరీ చెప్పాడు, 'నేను మీ శ్రేయోభిలాషిని' అని.

22. మొత్తానికి తన మాయోపాయంతో వారిని లొంగదీసుకున్నాడు. తరువాత వారిద్దరూ ఆ చెట్టు ఫలం రుచి చూడగానే వారి మర్మాంగాలు ఒండొకరి ముందు బహిర్గతమైపోయాయి. వారు తోటలోని ఆకులతో తమను

కప్పుకోసాగారు. అప్పుడు వారి ప్రభువు వారిని పిలిచి, 'ఆ చెట్టు వద్దకు పోవద్దని అన్నానా? షైతాన్ మీ బద్ధ విరోధి అని కూడా చెప్పానా లేదా?' అన్నాడు. 23. వారిలా విన్నవించుకున్నారు : 'మా ప్రభూ! మేము మా స్వయానికి తీరని అన్యాయం చేసుకున్నాము. ఇప్పుడు నీవు గనక మమ్మల్ని క్షమించకపోతే, మమ్మల్ని కనికరించకపోతే, మేము తీవ్ర నష్టానికి గురవు తాము.' 24. దేవుడు సెలవిచ్చాడు :'దిగిపోండి. మీరు పరస్పరం శత్రువులు. మీరు ఒక నిర్ణీత వ్యవధి వరకు భువిలోనే ఉండి, లబ్ది పొందవలసి ఉంటుంది.' 25. ఇంకా ఇలా సెలవిచ్చాడు : 'మీరు అందులోనే బ్రతకాలి. అందులోనే చావాలి. అందులో నుండే మీరు వెలికి తీయబడతారు.'

26. ఓ ఆదం సంతానమా! మీ శరీరంలోని లజ్జాకరమయిన భాగాలను కప్పటానికి, మీ ఒంటికి శోభాయమానంగా కూడా ఉండటానికి మేము మీపై దుస్తులను అవతరింపజేశాము. అయితే భయభక్తులు ఉట్టిపడే దుస్తులు ఇంతకన్నా మేలైనవి. ఇవి దైవ సూచనలలోనివి – జనుల గుణపాఠం నిమిత్తం. 27. ఓ ఆదం సంతతి వారలారా! షైతాన్ మీ మాతాపితలను మరులుగొల్పి, వారి వలువలను విప్పించి, వారి మర్మాంగాలను వారికి చూపి, వారిని స్వర్గం నుండి బయటికి తీయించినట్లే, వాడు మిమ్మల్ని పెడత్రోవ పట్టించకూడదు సుమా! వాడూ, వాడి ముష్కరమూక మీరు కానలేని చోటు నుండి మిమ్మల్ని చూస్తున్నారు. మేము షైతానులకు విశ్వసించని వారితో స్నేహబంధం ఏర్పరచాము.

28. వారేదయినా నీతిమాలిన పని చేసినప్పుడు, 'మేము మా పెద్దలను ఇలాగే చేస్తుండగా చూశాము. దేవుడే మాకు ఈ మేరకు ఆజ్ఞాపించాడు' అని అంటారు. వారికి చెప్పు : 'దేవుడు ఎన్నటికీ లజ్జావిహీన మయిన పనుల గురించి ఆజ్ఞాపించడు. ఏమిటి, మీకు తెలియని దానిని దైవానికి అంటగడుతున్నారా?' 29. ఇలా అను : 'నా ప్రభువైతే న్యాయం గురించి ఆదేశించాడు. ఇంకా ప్రతి నమాజు సమయంలో మీ అభిముఖాన్ని సరైన దిశలో ఉంచాలని, మీ ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకించుకుని ఆయన్నే

మొరపెట్టుకోవాలని ఆయన ఆజ్ఞాపించాడు. ఆయన మిమ్మల్ని మొదటిసారి పుట్టించినట్లే, మీరు మలిసారి కూడా పుట్టించబడతారు. 30. ఒక వర్గానికి ఆయన మార్గదర్శకత్వం వహించాడు. మరో వర్గంపై మార్గభ్రష్టత రూఢీ అయింది. ఎందుకంటే వారు దైవాన్ని కాదని షైతానులను తమ సావాసులుగా చేసుకున్నారు. అయినప్పటికీ తాము సన్మార్గాన ఉన్నామని వారు తలపోస్తున్నారు.

31. 'ఓ ఆదం సంతానమా! ప్రతి ఆరాధన సమయంలో మీ వస్త్రాలంకరణ పట్ల శ్రద్ధ వహించండి. తినండి, త్రాగండి. కాని మితిమీరకండి. నిశ్చయంగా మితిమీరే వారిని దేవుడు ఇష్టపడడు.' 32. వారిని అడుగు : 'దేవుడు తన దాసుల కొరకు సృజించిన అలంకరణను, పరిశుద్ధమయిన ఆహార వస్తువులను నిషేధించినదెవరు?' వారితో అను : 'అవి ప్రాపంచిక జీవితంలోనూ విశ్వసించిన వారికి ఉన్నాయి. ప్రళయదినాన అయితే అవి వారికి మాత్రమే ప్రత్యేకం. ఈ విధంగా మేము తెలుసుకోగోరిన వారికి మా సూచనలను విశదీకరిస్తూ ఉంటాము.' 33. చెప్పు : 'నా ప్రభువు నిషేధించినవైతే ఇవి : లజ్జావిహీనమయిన పనులు – అవి బహిరంగంగా జరిగేవి గానివ్వండి, గుట్టుచప్పుడు కాకుండా జరిగేవి గానివ్వండి. పాపిష్టి పనులు, అన్యాయంగా ఒకరిని వేధించటం. ఇంకా దేవుడు ఏ ప్రమాణాన్నీ అవతరింపజెయ్యక పోయినప్పటికీ ఇతరుల్ని ఆయనకు భాగస్వాములుగా పరిగణించటం. దేని గురించయినా మీకు తెలీకపోయినప్పటికీ దానిని మీరు దైవానికి ఆపాదించటం.'

34. ప్రతి సముదాయానికి ఒక గడువు నిర్ధారితమై ఉంది. తరువాత ఆ గడువు వచ్చేసినపుడు, అది ఒక్క క్షణం వెనక్కి జరగటం గానీ, ముందుకు జరగటం గానీ సంభవం కాదు. 35. ఓ ఆదం సంతానమా! ఒకవేళ మీ వద్దకు మీలో నుండే నా వచనాలను వినిపించే ప్రవక్తలు వచ్చినపుడు, ఎవడు భయభక్తుల వైఖరిని అవలంబించి, స్వీయ సంస్కరణ చేసుకుంటాడో – అలాంటి వారికి ఎలాంటి భీతి ఉండదు. వారు దుఃఖితులై ఉండరు.

36. మరెవరయితే మా వచనాలను అబద్ధాలుగా చిత్రీకరించారో, వాటిపట్ల అహంకారం ప్రదర్శించారో – అలాంటివారే నరకవాసులు. వారందులో శాశ్వతంగా ఉంటారు. 37. దైవానికి అబద్ధాలను ఆపాదించేవానికంటే లేదా ఆయన సూచనలను అబద్ధంగా చిత్రీకరించేవానికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? అలాంటివారి జాతకంలో వ్రాసిపెట్టిన భాగం వారికి లభించి తీరుతుంది. కడకు మేము పంపిన దూతలు వారి ప్రాణాలు తీసుకోవటానికి వారి వద్దకు వచ్చినపుడు, 'దైవాన్ని కాదని మీరు మొరపెట్టుకునే వారు ఎక్కడున్నారు?' అని అడుగుతారు. 'వారంతా మమ్మల్ని విడిచి ఎటో వెళ్ళిపోయారు' అని వారు సమాధానమిస్తారు. వారు తమకు వ్యతిరేకంగా తామే సాక్ష్యం పలుకుతూ, తాము సత్య తిరస్కారానికి ఒడిగట్టామని అంటారు.

38. దేవుడంటాడు : 'మీకు పూర్వం గతించిన జిన్నాతుల, మనుషుల సమూహాలు పోయి చేరిన ఆ నరకాగ్నిలోనికే మీరూ పోండి.' ప్రతి గుంపు నరకాగ్నికి ఆహుతి అవుతున్నప్పుడు, అది తన సహవాస గుంపుకు శాపనార్థాలు పెడుతుంది. కడకు వారంతా అందులో గుమిగూడినప్పుడు, తరువాత వారు తమ పూర్వీకులను గురించి, 'మహా ప్రభూ! అసలు మమ్మల్ని అపమార్గం పట్టించింది వాళ్ళే. కాబట్టి నీవు వారిని రెట్టింపు నరకాగ్ని యాతనకు గురిచేయి' అని ఫిర్యాదు చేస్తారు. అప్పుడు దేవుడు, 'అందరికీ రెట్టింపు యాతనే ఉంటుంది. కాని అది మీకు తెలియదు' అంటాడు. 39. వారిలోని మొదటివారు చివరి వారి నుద్దేశించి ఇలా అంటారు : 'మీకు మాపై ఎలాంటి ఆధిక్యత లభించలేదు. కనుక మీరు సముపార్జించుకున్న దానికి బదులుగా యాతనను రుచి చూడండి.'

40. నిశ్చయంగా ఎవరు మా సూచనలను అసత్యాలంటూ కొట్టివేసి, వాటిపట్ల దురహంకారం ప్రదర్శించారో వారికోసం ఆకాశ ద్వారాలు తెరువబడవు. సూది రంధ్రంలో నుండి ఒంటె దూరిపోవటం సంభవం కానంత వరకూ ఇది జరగని పని. నేరస్తులకు మేము ఇచ్చే ప్రతిఫలం ఇలాగే ఉంటుంది. 41. ఇక నరకమే వారి పరుపు, నరకమే వారి దుప్పటి అయి

ఉంటుంది. దుర్మార్గుల కొరకు మా వద్ద ఇలాంటి ప్రతిఫలమే ఉంటుంది. 42. మరెవరయితే విశ్వసించి, సదాచరణ చేశారో – మేము ప్రతి వ్యక్తిపైనా అతని శక్తికి తగిన బరువే మోపుతాము – అలాంటివారే స్వర్గవాసులు. వారందులో కలకాలం ఉంటారు. 43. వారి ఆంతర్యాలలో ఏ కాస్త కల్మషం ఉన్నా దానిని మేము తీసివేస్తాము. వారికి దిగువన సెలయేరులు ప్రవహిస్తూ ఉంటాయి. వారిలా అంటారు : 'మమ్మల్ని ఇక్కడి వరకూ చేర్చిన దైవానికే సర్వస్తోత్రములు. దేవుడే గనక మాకు మార్గదర్శకత్వం వహించి ఉండకపోతే, మేము సన్మార్గం పొంది ఉండేవాళ్ళం కాము. నిశ్చయంగా మా ప్రభువు తరఫు సందేశహరులు సత్యం తీసుకువచ్చారు.' అప్పుడు పిలుపు వినవస్తుంది: 'ఇదిగో, స్వర్గం. మీరు చేసుకున్న కర్మలకు బదులుగా మీరు దీనికి వారసులయ్యారు.'

44. ఆ తరువాత స్వర్గవాసులు నరకవాసులను కేకవేసి అంటారు : 'మా ప్రభువు మాకు చేసిన వాగ్దానాన్ని మేము సత్యమైనదిగా పొందాము. మరి మీరు కూడా మీ ప్రభువు వాగ్దానాన్ని సత్యంగా పొందారా?' దానికి వారు 'అవున'ంటారు. అప్పుడు ప్రకటించే వాడొకడు వారి మధ్యన ఇలా ప్రకటిస్తాడు :'దుర్మార్గులపై దేవుని శాపం పడుగాక!' 45. వారు దైవమార్గం నుండి (ప్రజలను) అడ్డుకునేవారు. అందులో వక్రతను అన్వేషించేవారు. ఇంకా వారు పరలోకాన్ని త్రోసిపుచ్చేవారు.

46. ఆ ఇరువర్గాల మధ్య ఒక అడ్డు (గోడ) ఉంటుంది. ఎత్తయిన ప్రదేశం (ఆరాఫ్)పై కొంతమంది ఉంటారు. వారు ప్రతి ఒక్కరినీ వారి ఆనవాళ్ళనుబట్టి గుర్తుపడతారు. వారు స్వర్గవాసులను పిలుస్తూ, 'మీకు శాంతి కలుగుగాక! (సలామున్ అలైకుమ్)' అంటారు. వారింకా స్వర్గంలో ప్రవేశించలేదుగాని, దానిని ఆశించే అభ్యర్థులై ఉంటారు. 47. నరకవాసులపై వారి దృష్టి మరల్చబడినప్పుడు, 'మా ప్రభూ! మమ్మల్ని ఈ దుర్మార్గ జనులలో చేర్చకు' అని ప్రార్థిస్తుంటారు. 48. ఇంకా ఆరాఫ్ వారు, అనేకమంది నరకవాసులను వారి ఆనవాళ్ళ ఆధారంగా కేకవేసి, 'మీరు కూడగట్టిన

ముఠాలు గానీ, మీ బడాయి పోకడగానీ మీకు పనికి రాలేదే! 49. ఎలాంటి దైవ కారుణ్యమూ లభించదని మీరు ఒట్టేసుకుని మరీ చెబుతూ ఉండేది వీరి గురించే కదూ! (ఇప్పుడు వారికి ఎలాంటి స్వాగత సత్కారాలు లభిస్తున్నాయో మీరే చూడండి!) "స్వర్గంలో ప్రవేశించండి. ఇక మీకు ఎలాంటి భయం ఉండదు. దుఃఖమూ ఉండదు."

50. నరకవాసులు స్వర్గవాసులను కేకవేసి, 'మాపైన కాస్త నీరయినా పడవెయ్యండి లేదా దేవుడు మీకు ఆహారంగా ప్రసాదించిన దానిలో నుండైనా కొద్దిగా ఇటు విసరండి' అని ప్రాధేయపడతారు. వారిలా అంటారు : 'దేవుడు ఈ రెండింటిని కూడా సత్య తిరస్కారుల కోసం నిషేధించాడు.' 51. వారు తమ మతధర్మాన్ని ఒక ఆటగా, వినోద వస్తువుగా చేసుకున్నారు. ప్రాపంచిక జీవితం వారిని మభ్యపెట్టింది. కనుక వారు ఈనాటి సమావేశాన్ని మరచిపోయినట్లే, ఇంకా వారు మా సూచనలను తిరస్కరించినట్లే ఈ రోజు మేము వీళ్ళను మరచిపోతాము.

52. మేము వారి వద్దకు ఒక గ్రంథాన్ని తీసుకువచ్చాము. దానిని మేము జ్ఞానం ఆధారంగా సవివరమయినదిగా చేశాము. విశ్వసించిన వారి కొరకు దానిని మార్గదర్శనంగా, కారుణ్యంగా కూడా చేశాము. 53. మరైతే ఇప్పుడు వారు, దాని విషయం సుస్పష్టం కావాలనేనా నిరీక్షిస్తున్నది? ఏ రోజున ఆ విషయం పొడసూపుతుందో, దానిపట్ల అలసత్వం ప్రదర్శించిన వారు ఇలా అంటారు : 'నిశ్చయంగా మా ప్రభువు యొక్క సందేశహరులు సత్యం తీసుకువచ్చారు. ఇక ఇప్పుడు మా కొరకు సిఫారసు చెయ్యడానికి సిఫారసుదారులు ఎవరయినా ఉన్నారా? లేదా మమ్మల్ని మళ్లీ వెనక్కి పంపించటమయినా జరుగుతుందా – మేము పూర్వం ఆచరించిన దానికి భిన్నంగా ఆచరించటానికి?' యదార్థమేమిటంటే వీళ్లు తమను తాము నష్టానికి గురిచేసుకున్నారు. వీళ్లు కల్పించుకున్నదంతా వీళ్ల నుండి మటుమాయమై పోయింది.

54. నిశ్చయంగా భూమ్యాకాశాలను ఆరు రోజులలో సృష్టించిన

అల్లాహ్‌యే మీ ప్రభువు. తరువాత ఆయన అర్ష్ (సింహాసనం)పై ఆసీనుడయ్యాడు. ఆయనే రాత్రిని పగటిపై కప్పివేస్తాడు. పగలు దానిని వెంబడించుకుంటూ వస్తుంది. ఆయనే సూర్యచంద్రులను, నక్షత్రాలను సృష్టించాడు. అవన్నీ ఆయన ఆజ్ఞకు లోబడి ఉన్నాయి. గుర్తుంచుకోండి! సృష్టించటంగానీ, శాసించటం గాని ఆయనకే చెల్లు. నిఖిల జగతికి స్వామి అయిన అల్లాహ్ ఎంతో శుభకరుడు. 55. మీ ప్రభువును వేడుకోండి – కడు దీనంగా విలపిస్తూనూ, గోప్యంగానూ. నిశ్చయంగా ఆయన హద్దులను అతిక్రమించేవారిని ఇష్టపడడు. 56. భువిలో సంస్కరణ జరిగిన మీదట అరాచకాన్ని సృష్టించకండి. ఆయన్నే మొరపెట్టుకోండి–భయంతోనూ, ఆశ తోనూ. నిశ్చయంగా దైవకారుణ్యం సదమరవర్తనులకు సమీపంలోనే ఉంది.

57. తన కారుణ్యానికి ముందుగా గాలులను శుభవార్త సూచనగా పంపేవాడు ఆయనే. తరువాత అవి బరువైన మేఘాలను ఎత్తుకున్నప్పుడు, మేము వాటిని నిర్జీవంగా ఉన్న ప్రదేశం వైపునకు నెడతాము. తద్వారా వర్షం కురిపిస్తాము. ఆ తరువాత అన్ని రకాల పండ్లను ఉత్పన్నం చేస్తాము. ఇదేవిధంగా మేము మృతులను కూడా వెలికితీస్తాము – మీరు గుణపాఠం గ్రహిస్తారని (మీకు ఇదంతా విపులీకరిస్తున్నాము). 58. సారవంతమైనభూమి తన ప్రభువు అనుజ్ఞతో మంచి దిగుబడినే ఇస్తుంది. నిస్సారమైన నేల నుండి వచ్చే దిగుబడి చాలా తక్కువగానే ఉంటుంది. ఈ విధంగా మేము కృతజ్ఞత చూపే జనులకు మా సూచనలను పలు కోణాల నుండి విశదపరుస్తూ ఉంటాము.

59. మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపాము. అతనిలా అన్నాడు : 'ఓ నా జాతి వారలారా! దైవాన్ని ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరో దేవుడు లేడు. ఒక మహా దినమున మీపై విరుచుకుపడే ఆపద గురించి నేను భయపడుతున్నాను.' 60. దానికి అతని జాతి పెద్దలు, 'నీవు స్పష్టమయిన మార్గభ్రష్టతకు లోనై ఉన్నట్లు మేము చూస్తున్నాము' అన్నారు. 61. నూహ్ చెప్పాడు : 'నా జాతి సోదరులారా! నాలో ఎటువంటి

మార్గవిహీనతా లేదు. నేను సర్వలోక ప్రభువు తరఫున పంపబడిన సందేశహరుణ్ణి. 62. మీకు నా ప్రభువు సందేశాలను అందజేస్తున్నాను. మీ మేలును కోరుకుంటున్నాను. మీరెరుగని ఎన్నో విషయాలు నాకు దేవుని తరఫున తెలుస్తున్నాయి. 63. ఏమిటి, మిమ్మల్ని సావధానపరచటానికి, తద్వారా మీరు జాగ్రత్తపడటానికి, ఆపైన మీరు కరుణించబడటానికి, మీ ప్రభువు యొక్క జ్ఞాపికను స్వయంగా మీలో నుండే ఒక వ్యక్తి మీ వద్దకు తీసుకు రావటం మిమ్మల్ని ఆశ్చర్యానికి లోను చేసిందా?' 64. ఏమైనప్పటికీ వారతనిని అసత్యవాది అంటూ త్రోసిపుచ్చారు. తరువాత మేము నూహ్‌ను, అతనితో పాటు పడవలో ఉన్నవారిని కాపాడాము. మా సూచనలను అబద్ధంగా చిత్రీకరించిన వారందరినీ ముంచివేశాము. నిశ్చయంగా వారు మరీ గుడ్డి జనులు.

65. ఇంకా – ఆద్ వైపునకు మేము వారి సహోదరుడైన హూద్‌ను పంపాము. అతనిలా అన్నాడు : 'నా జాతి వారలారా! దైవాన్ని ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరో దైవం లేదు. ఏమిటి, మీరు భయపడరా?' 66. తిరస్కార వైఖరిని అవలంబించిన అతని జాతి సర్దారులు ఇలా అన్నారు: 'నీవు మాకు తెలివి తక్కువ దద్దమ్మలా కనిపిస్తున్నావు. పైగా నీవు అబద్ధం పలుకుతున్నావని మా అనుమానం.' 67. హూద్ ఇలా నచ్చజెప్పాడు : 'నా జాతి ప్రజలారా! నేను తెలివి తక్కువవాణ్ణి కాను. నేను లోకేశ్వరుని తరఫున పంపబడిన ప్రవక్తను. 68. మీకు నా ప్రభువు సందేశాలను చేరవేస్తున్నాను. మీరు నమ్మదగ్గ మీ శ్రేయోభిలాషిని. 69. ఏమిటి, మిమ్మల్ని సావధాన పరచటానికి స్వయంగా మీలో నుండే ఒక వ్యక్తి ద్వారా మీ వద్దకు మీ ప్రభువు తరఫున జ్ఞాపిక రావటం మిమ్మల్ని ఆశ్చర్యపరచిందా? జ్ఞాపకం చేసుకోండి! నూహ్ జాతి తరువాత ఆయన మిమ్మల్ని దానికి వారసులుగా చేశాడు. మీ దేహదారుఢ్యాన్ని ఇతోధికంగా పెంచాడు. కాబట్టి మీపైనగల దైవానుగ్రహాలను స్మరించుకుంటూ ఉండండి – తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు.'

70. హూద్ జాతివారు ఇలా అన్నారు : 'ఏమిటి, మేము ఒక్కగానొక్క అల్లాహ్‌నే ఆరాధించాలని, మా తాతముత్తాతలు పూజిస్తూ వచ్చిన వాటన్నింటినీ వదలిపెట్టాలని చెప్పటానికే నువ్వు మా వద్దకు వచ్చావా? నువ్వు చెప్పేదే నిజమైతే అస్తమానం నువ్వు మమ్మల్ని బెదిరిస్తున్న ఆ శిక్షను తీసుకు రా.' 71. హూద్ అన్నాడు : 'ఇక మీపైన మీ ప్రభువు శిక్ష, ఆయన ఆగ్రహం విరుచుకుపడినట్లే. ఏమిటి, మీరూ, మీ తాతముత్తాతలు పెట్టుకున్న ఆ పేర్ల విషయంలో మీరు నాతో వాదులాడుతారా? వాటికి సంబంధించి దేవుడు ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయలేదు. కనుక మీరూ నిరీక్షించండి. నేనూ మీతోపాటు నిరీక్షిస్తాను.' 72. తరువాత మేము అతనినీ, అతని వెంట ఉన్నవారిని మా దయానుగ్రహంతో కాపాడాము. మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించిన వారి వేరు త్రెంచేశాము. ఎందుకంటే వారు విశ్వసించే రకం కాదు.

73. ఇంకా – సమూద్ వైపునకు మేము వారి సోదరుడైన సాలిహ్‌ను పంపాము. అతనిలా అన్నాడు : 'నా జాతి వారలారా! దైవారాధన చేయండి. ఆయన తప్ప మీకు మరో ఆరాధ్య దైవం లేడు. మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి ఒక స్పష్టమయిన నిదర్శనం వచ్చేసింది. దేవుని ఈ ఆడ ఒంటె మీకొక సూచనగా ఉన్నది. దేవుని భూమిమీద మేస్తూ తిరిగేలా దానిని వదలిపెట్టండి. దురుద్దేశ్యంతో దాని జోలికి పోకండి. పోయారంటే బాధాకరమయిన శిక్ష మిమ్మల్ని చుట్టుకుంటుంది. 74. జ్ఞప్తికి తెచ్చుకోండి! ఆద్ జాతి తదనంతరం దేవుడు మిమ్మల్ని వారి వారసులుగా చేశాడు. భువిలో మీకు స్థిరత్వాన్ని ఇచ్చాడు. తత్ఫలితంగా మీరు దాని మైదానాలలో మేడలు నిర్మిస్తున్నారు. పర్వతాలను తొలచి నివాస గృహాలుగా చేసుకుంటున్నారు. కనుక మీరు దైవానుగ్రహాలను నెమరువేసుకుంటూ ఉండండి. భువిలో కల్లోల జనకుల మాదిరిగా స్వైరవిహారం చేయకండి.'

75. ఆ జాతిలోని గర్విష్ఠులైన ప్రముఖులు బలహీనవర్గంగా పరిగణించబడే విశ్వాసులనుద్దేశ్యించి, 'ఏమిటి, సాలిహ్ తన ప్రభువు తరఫున

పంపబడిన వాడేనన్న నమ్మకం మీకు ఉందా?' అని అడిగారు. దానికి వారు, 'ఆయనకు ఇచ్చి పంపబడిన దానిపై మాకు పూర్తి విశ్వాసం ఉంది' అని బదులిచ్చారు. 76. 'అయితే మీరు విశ్వసించిన దానిని మేము తిరస్కరిస్తున్నాం' అని ఆ దురహంకారులు చెప్పారు. 77. తరువాత వారు ఆ ఆడ ఒంటెను కోసివేశారు. తమ ప్రభువు ఆజ్ఞను ఖాతరు చేయలేదు. పైగా వారిలా అన్నారు : 'ఓ సాలిహ్! నీవు నిజంగా దైవప్రవక్తవే అయితే మాటిమాటికీ నీవు మమ్మల్ని భయపెడుతున్న ఆ శిక్షను తీసుకు రా.' 78. దాంతో వారిని భూకంపం కబళించింది. వారు తమ ఇండ్లలో బోర్లాపడిన వారు పడినట్లే ఉండిపోయారు. 79. సాలిహ్ ఈ విధంగా చెబుతూ ఆ బస్తీల నుండి వెళ్ళిపోయాడు : 'ఓ నా జాతి వారలారా! నేను మీకు నా ప్రభువు సందేశాన్ని చేరవేశాను. నేను మీ శ్రేయాన్ని అభిలషించాను. కాని శ్రేయోభిలాషుల పొడ మీకు గిట్టదాయె.'

80. మేము లూత్‌ను పంపాము. అతను తన జాతివారితో, 'మీకు పూర్వం లోకంలో ఎవరూ చేయని సిగ్గుమాలిన పనిని మీరు చేస్తున్నారేమిటి? 81. మీరు స్త్రీలను వదలి పురుషులతో మీ కామవాంఛను తీర్చుకుంటారా? మీరు మరీ బరితెగించిన జనంలా ఉన్నారు' అన్నాడు. 82. దానికి అతని జాతివారు ఇచ్చిన జవాబు ఇది తప్ప మరొకటి కాదు : 'వీళ్ళను మన బస్తీల నుండి వెళ్ళగొట్టండి. వీళ్ళు మహా శీలవంతులుగా చెలామణీ కాగోరు తున్నారు.' 83. తరువాత మేము లూత్‌ను, అతని పరివారం వారినీ రక్షించాము – అతని ఇల్లాలిని తప్ప. ఆవిడ వెనుక ఉండిపోయే వారి పంచన చేరింది. 84. మేము వారిపై రాళ్ళ వాన కురిపించాము. ఇక చూడు! అపరాధులకు ఏ గతి పట్టిందో!

85. ఇంకా – మద్‌యన్ వైపునకు మేము వారి సోదరుడైన షుఐబ్‌ను పంపాము. అతనిలా అన్నాడు : 'ఓ నా జాతి వారలారా! మీరు దైవాన్ని ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరో దేవుడు లేడు. మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి నిదర్శనం వచ్చేసింది. కనుక కొలతలు, తూనికలలో

సరిగ్గా (న్యాయంగా) వ్యవహరించండి. ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. భువిలో సంస్కరణ జరిగిన మీదట విచ్ఛిన్నాన్ని సృష్టించకండి. మీరు గనుక విశ్వాసులయితే ఇదే మీ పాలిట శ్రేయస్కరం. 86. (చూడండి!) విశ్వసించిన వారిని భయపెట్టి, వారిని దైవమార్గం నుండి అడ్డుకునే ఉద్దేశంతో, అందులో వక్రతను అన్వేషించే ఆలోచనతో రాకపోకల మార్గాలలో బైఠాయించకండి. జ్ఞాపకం చేసుకోండి! మీరు బహుకొద్దిమందే ఉండేవారు. దేవుడు మీ జన సంఖ్యను పెంచాడు. కల్లోల జనకులకు పట్టిన దుర్గతిని కూడా కాస్త చూడండి. 87. నేను ఏ సందేశంతో పంపబడ్డానో దానిని మీలోని ఒక వర్గం వారు విశ్వసించి, మరొక వర్గం వారు విశ్వసించకపోతే, దేవుడు మన మధ్య తీర్పు చేసేవరకూ ఓర్పు వహించండి. ఆయన తీర్పు చేసే వారందరిలోకీ ఉత్తముడు.

◆ (9) 88. గర్విష్ఠులైన ఆ జాతి నాయకులు ఇలా అన్నారు : 'ఓ షుఐబ్! మేము నిన్నూ, నీతోపాటు విశ్వసించిన వారిని మా పురము నుండి వెళ్లగొడ్తాము. లేదంటావా మీరంతా మా జీవన స్రవంతిలోకి తిరిగి వచ్చేయండి.' దానికి షుఐబ్ ఇలా అన్నాడు : 'ఏమిటి, మాకు ఎంతమాత్రం ఇష్టం లేకపోయినప్పటికీ (తిరిగి రావలసిందేనా)? 89. దేవుడు మాకు మీ జీవన స్రవంతి నుండి విముక్తిని ప్రసాదించిన మీదట కూడా మేము మళ్లీ అందులోనే కలిసిపోతే, మేము దైవానికి పెద్ద అసత్యాన్ని ఆపాదించిన వారమవుతాము. మేమింక అందులో తిరిగి విలీనమవటమనేది జరగని పని. మా ప్రభువైన దేవుడే తలిస్తే అది వేరే విషయం. మా ప్రభువు ప్రతి విషయాన్నీ తన పరిజ్ఞానంతో పరివేష్ఠించి ఉన్నాడు. మేము మా దైవాన్నే నమ్ముకున్నాము. ఓ మా ప్రభూ! మాకూ – మా జాతివారికీ మధ్య సత్యబద్ధంగా తీర్పు చెయ్యి. నీవు అత్యుత్తమ తీర్పరివి.' 90. అప్పుడు ఆ జాతికి చెందిన అవిశ్వాస నాయకులు, 'మీరు గనక షుఐబ్‌ను అనుసరించారంటే తీవ్రంగా నష్టపోతారు జాగ్రత్త!' అని హెచ్చరించారు. 91. తరువాత వారిని అకస్మాత్తుగా భూకంపం ముట్టడించింది. అంతే,

వారు తమ నివాస గృహాలలో బోర్లాపడి ఉండిపోయారు. 92. షుఐబ్‌ను అసత్యవాదిగా చిత్రీకరించిన వారు ఎన్నడూ ఆ పురములో నివసించనట్లే నామరూపాల్లేకుండా పోయారు. షుఐబ్‌ను త్రోసిపుచ్చినవారే నష్టపోయారు. 93. ఆ సమయంలో షుఐబ్, వారి నుండి ముఖం త్రిప్పుకుని వెళుతూ ఇలా అన్నాడు : 'ఓ నా జాతి వారలారా! నేనైతే మీకు నా ప్రభువు సందేశాలను చేరవేశాను. నేను మీ బాగోగులను కోరుకున్నాను. ఇక ఈ తిరస్కార జనం గురించి నేనెందుకు బాధపడాలి?'

94. మేము ఏ పురములో ప్రవక్తను పంపినా అక్కడి జనులను ఇక్కట్లకు, బాధలకు లోను చేశాము – వారు అణకువతో మెలగుతారని. 95. తరువాత వారి అభాగ్యాన్ని సౌభాగ్యంగా మార్చివేశాము. తుదకు వారు బాగా అభివృద్ధిచెందిన మీదట, 'కష్ట సుఖాలు (కలిమి లేములు) మా తాతముత్తాతలకు కూడా ఎదురయ్యాయిలెండి (ఇదేమన్నా కొత్త విషయమా?)' అన్నారు. ఆ తరువాత మేము వారిని అకస్మాత్తుగా పట్టుకున్నాము. దానిని గురించి వారు ఊహించి కూడా ఉండరు. 96. ఒకవేళ బస్తీలలోని వారు విశ్వసించి, భయభక్తులతో మెలగి ఉంటే మేము వారిపై భూమ్యాకాశాల శుభాలను తెరచేవారం. కాని వారు ధిక్కార వైఖరికి ఒడిగట్టారు. అందువల్ల మేము వారి సముపార్జనకు బదులుగా పట్టుకున్నాము. 97. మరైతే ఈ బస్తీల వారు రాత్రిపూట తాము నిద్రిస్తుండగా – ఎప్పుడయినా – మా శిక్ష విరుచుకుపడదని నిర్భయంగా ఉన్నారా? 98. లేదా పట్టపగలు తాము ఆటలాడుకుంటూ ఉండగా హటాత్తుగా మా ఆపద విరుచుకుపడదని ఈ బస్తీల ప్రజలు నిశ్చింతగా ఉన్నారా? 99. ఏమిటి, వీరు దేవుని వ్యూహరచన పట్ల నిర్భయులై పోయారా? నిలువునా మునిగిపోయే జనులు తప్ప వేరెవరూ దేవుని వ్యూహరచన పట్ల నిర్భయులై ఉండరు.

100. ఏమిటి, తమ పూర్వీకుల తరువాత భూమికి వారసులైన వారికి గుణపాఠం కలగలేదా? మేము గనక తలచుకుంటే వారి దురాగతాల కారణంగా వారిని పట్టుకుని శిక్షించగలం. మేము వారి హృదయాలపై

సీలు వేసేశాము. కనుక వారు వినలేరు. 101. ఇవీ ఆ బస్తీలు. వాటి స్థితిగతులు కొన్నింటిని మేము నీకు వివరిస్తున్నాము. వారి వద్దకు మా ప్రవక్తలు నిదర్శనాలు తీసుకుని వచ్చారు. కాని వారు మొదట ఒకసారి అసత్యమని త్రోసిపుచ్చిన తరువాత ఇక దానిని విశ్వసించటమనేది జరగలేదు. ఈ విధంగానే దేవుడు తిరస్కారుల హృదయాలపై ముద్రవేసేస్తాడు. 102. మేము వారిలో అత్యధికులను మాట నిలుపుకునేవారుగా పొందలేదు. ఇంకా – వారిలో అత్యధికులను మేము అవిధేయులుగానే కనుగొన్నాము.

103. ఇక వారి తరువాత మేము మూసాకు మా సూచనలను ఇచ్చి ఫిరౌన్ వద్దకు, అతని ఆస్థాన ప్రముఖుల వద్దకు పంపాము. కాని వారు మా సూచనల పట్ల అన్యాయంగా వ్యవహరించారు. మరైతే ఆ కల్లోల జనకుల అంతిమ పర్యవసానం ఏమయిందో చూడు! 104. మూసా ఇలా అన్నాడు: 'ఓ ఫిరౌన్! నేను లోకేశ్వరుని తరఫున పంపబడిన వాడను. 105. దేవుని పేర సత్యం తప్ప మరోమాట అనకుండా ఉండటమే నాకు శోభాయమానం. నేను మీ వద్దకు మీ ప్రభువు తరఫున స్పష్టమయిన నిదర్శనం తీసుకువచ్చాను. కనుక నీవు ఇస్రాయీల్ వంశీయులను నాతో పోనివ్వు. 106. ఫిరౌన్ అన్నాడు: 'నువ్వు చెప్పేదే నిజమైతే, నువ్వు గనక ఏదన్నా సూచనను తెచ్చివుంటే, దానిని చూపించు.' 107. అప్పుడు మూసా తన చేతికర్రను పడవేశాడు – అకస్మాత్తుగా అదొక సర్పం అయిపోయింది. 108. అతను తన చేతిని తీయగానే అది చూసేవారికి ధగధగా మెరిసిపోతున్నట్లు కనిపించింది. 109. ఫిరౌన్ జాతి నాయకులు అన్నారు : 'ఖచ్చితంగా ఇతగాడు ఆరితేరిన మాంత్రికుడే. 110. ఇతను మీ రాజ్యం నుండి మిమ్మల్ని వెళ్ళగొట్టాలనుకుంటున్నాడు. ఇప్పుడేం చేయాలో మీరే చెప్పండి.' 111. వారన్నారు : 'మూసాకు, అతని సోదరునికి కొంత గడువు ఇవ్వండి. ఈలోగా పట్టణాలకు భటులను పంపండి. 112.వారు నిపుణులైన మాంత్రికులందరినీ తీసుకువస్తారు.'

113. ఆ విధంగా మాంత్రికులు ఫిరౌన్ వద్దకు వచ్చి, 'మేము గెలిస్తే

మాకు పారితోషికం తప్పక లభిస్తుంది కదా!' అన్నారు. 114. ఫిరౌన్ అన్నాడు: 'అవును. నిశ్చయంగా మీరు నా సన్నిహితుల్లో చేర్తారు.' 115. మాంత్రికులు అడిగారు : 'ఓ మూసా! నువ్వయినా పడవెయ్యి. లేదా మేమైనా పడవేస్తాం.' 116. మూసా అన్నాడు : 'మీరే పడవెయ్యండి.' అప్పుడు వారు తమ మంత్రజాలాన్ని పడవేసి, జనులకు కనికట్టు చేశారు. వారిని భయకంపితుల్ని చేశారు. మొత్తానికి వారు మహా గారడి చేశారు. 117. అప్పుడు మేము మూసాకు 'నీ చేతి కర్రను పడవెయ్యి' అని ఆజ్ఞ పంపాము. అప్పుడది, వారి కనికట్టు విన్యాసాన్ని మ్రింగివేయసాగింది. 118. దాంతో సత్యం తేటతెల్లమయింది. వారు కల్పించినదంతా అసత్యమని తేలిపోయింది. 119. అంతే. వారు అక్కడే ఓడిపోయారు. పరాభవం పాలయ్యారు. 120. మాంత్రికులు మాత్రం సాష్టాంగపడిపోయారు. 121. వారు అప్రయత్నంగా ఇలా అన్నారు : 'మేము సకల లోకాల ప్రభువును విశ్వసించాము! 122. మూసా, హారూనుల ప్రభువును!'

123. ఫిరౌన్ ఇలా అన్నాడు : 'నా అనతి పొందకముందే మీరు మూసాను విశ్వసించారా? నిశ్చయంగా మీరంతా ఒక్కటై ఈ నగరవాసులను ఇక్కడి నుండి వెళ్ళగొట్టడానికి పన్నిన కుట్ర ఇది. దీని పరిణామం ఏమిటో మీరు శీఘ్రంగానే తెలుసుకుంటారు. 124. నేను మీ చేతుల్ని, కాళ్లను భిన్న దిశల నుండి నరికిస్తాను. ఆ తరువాత మీ అందరినీ శిలువ నెక్కిస్తాను.' 125. వారిలా బదులిచ్చారు : 'మేము మరలిపోవలసింది మా ప్రభువు వైపునకే. 126. ఇంతకీ నీవు మాకు శిక్ష ఎందుకు విధిస్తున్నట్లు? మా ప్రభువు సూచనలు మా సమక్షంలో వచ్చినప్పుడు, మేము వాటిని విశ్వసించినందుకేగా! మా ప్రభూ! మాపై ఓరిమిని పుష్కలంగా కురిపించు. మాకు ఇస్లాంపై మరణం వొసగు.'

127. ఫిరౌన్ జాతి నాయకులు ఇలా అన్నారు : 'ఏమిటి, నీవు మూసాను, అతని వర్గీయులను రాజ్యంలో అరాచకం సృష్టిస్తూ నిన్నూ, నీ దేవతలను విడిచి తిరిగేలా వదలిపెడతావా?' సమాధానంగా ఫిరౌన్ అన్నాడు:

'ఇకనుండి మేము వీళ్ళ మగ పిల్లలను చంపేస్తాము. వీళ్ల స్త్రీలను మాత్రం బ్రతికి ఉండనిస్తాము. వారిపై మాకు తిరుగులేని అధికారం ఉంది.' 128. మూసా తన జాతి వారితో అన్నాడు : 'దైవ సహాయం అర్థించండి. సహనం వహించండి. నిశ్చయంగా భూభాగం దేవునిది. ఆయన తన దాసుల్లో తాను కోరిన వారిని దానికి వారసులుగా చేస్తాడు. అంతిమ విజయం మాత్రం దైవానికి భయపడే వారిదే. 129. మూసా జాతి ప్రజలు ఇలా వాపోయారు: 'మేము నీ రాకకు పూర్వం కూడా వేధింపులకు గురయ్యాము. నీవు వచ్చిన తరువాత కూడా వేధించబడుతున్నాము.' మూసా వారిని ఇలా ఓదార్చాడు: 'త్వరలోనే మీ ప్రభువు మీ శత్రువులను తుదముట్టించి, వారికి బదులు మిమ్మల్ని ఈ భూమికి యజమానులుగా చేయవచ్చు. ఆ తరువాత మీ నిర్వహణ ఎలా ఉంటుందో ఆయన చూస్తాడు.'

130. మేము ఫిరౌనీయులను దుర్భిక్షానికి లోను చేశాము. వ్యవసాయోత్పత్తుల కొరతకు గురిచేశాము – ఆ విధంగానయినా వారు గుణపాఠం గ్రహిస్తారని. 131. కాని వారికి సుభిక్షం వచ్చినపుడు, 'ఇదంతా మా వల్లనే' అనేవారు. కాని వారిపై గడ్డుకాలం వచ్చినపుడు, 'ఇదంతా మూసా మరియు అతని సహచరుల దరిద్రమే'నంటూ వారిపై ఎగదోసేవారు. వినండి! వారి దరిద్రమేదో దేవుని వద్ద ఉంది. కాని వారిలో అనేకులకు ఆ సంగతి తెలీదు. 132. వారు మూసాతో ఇలా అన్నారు : 'మమ్మ ఆకట్టుకోవటానికి నీవు ఏ సూచనను తెచ్చినా, మేము నిన్ను నమ్మబోము.'

133. తరువాత మేము వారి పైకి తుఫాను పంపాము. మిడతల దండును వదిలాము. పేలు, కప్పలు, రక్తం ఇత్యాదివి ప్రబలినాయి. ఈ సూచనలన్నింటినీ వేర్వేరుగా చూపాము. అయినా వారు అహంకారమే ప్రదర్శించారు. వారసలు అపరాధ జనులు. 134. వారిపై ఏదన్నా విపత్తు వచ్చిపడినపుడు, 'ఓ మూసా! నీ ప్రభువు నీకు చేసి ఉన్న వాగ్దానాన్ని అనుసరించి మా కోసం కాస్త నీ ప్రభువును ప్రార్థించు. నీవు గనక ఈ విపత్తును మా నుండి తొలగిస్తే, మేము నిన్ను అవశ్యంగా విశ్వసిస్తాము.

బనీ ఇస్రాయీల్‌ను కూడా నీతో పోనిస్తాము' అనేవారు. 135. కాని ఎట్టి పరిస్థితిలోనూ వారు ఒక నిర్ణీత గడువుకు చేరుకోవలసిన ఆపదను మేము వారి నుండి తొలగించగానే వారు మాట తప్పేవారు.

136. తరువాత మేము వారిపై ప్రతీకారం తీర్చుకున్నాము. వారిని సముద్రంలో ముంచివేశాము. ఎందుకంటే వారు మా సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చేవారు. వాటిపట్ల నిర్లక్ష్యం వహించారు. 137. ఎవరయితే అత్యంత బలహీనులుగా పరిగణించబడేవారో, వారిని మేము శుభాలు పొందుపరచిన భూభాగపు తూర్పు పడమరలకు వారసులుగా చేశాము. ఆ విధంగా ఇస్రాయీల్ వంశీయులకు నీ ప్రభువు చేసిన ఉత్తమ వాగ్దానం వారు వహించిన ఓర్పు కారణంగా పూర్తయింది. మరోవైపు ఫిరౌన్, అతని జాతివారు చేసిన నిర్మాణాలను, వారి ఎత్తయిన కట్టడాలను మేము ధ్వంసం చేశాము.

138. మేము ఇస్రాయీల్ సంతతివారిని సముద్రానికి అవతలి వైపున చేర్చాము. తరువాత వారు విగ్రహాల పూజలో కూర్చుని ఉన్న ఒక సమూహం మీదుగా సాగిపోతున్నప్పుడు, 'ఓ మూసా! వీరికి ఉన్న దేవుళ్ళ లాంటిదే మాకూ ఒక దేవుణ్ణి (విగ్రహాన్ని) చేసిపెట్టవా?' అన్నారు. దానికి మూసా, 'మీరు మరీ మూర్ఖ జనులు. 139. వారు చేస్తున్నదంతా నాశనమయ్యేది. వారు పాల్పడే పని వ్యర్థమైనది' అన్నాడు. 140. అతనిలా అన్నాడు : 'ఏమిటి, అల్లాహ్‌ను కాదని నేను మీ కోసం మరో పూజనీయుణ్ణి వెతకాలా? నిజానికి ఆయన మీకు సమస్త లోకవాసులపై ప్రాధాన్యతను ఇచ్చాడు.' 141. మేము మిమ్మల్ని ఫిరౌన్ జనుల నుండి విముక్తిని ప్రసాదించినప్పుడు (ఏం జరిగిందో గుర్తుకు తెచ్చుకోండి). వారు మిమ్మల్ని దారుణంగా వేధించేవారు. మీ మగ పిల్లలను చంపేసి, మీ ఆడబిడ్డలను మాత్రం బ్రతికి ఉండనిచ్చేవారు. ఈ విషయంలో మీకు మీ ప్రభువు తరఫున కఠిన పరీక్ష ఉండేది.

142. మేము మూసాతో ముప్ఫయి రాత్రుల వాగ్దానం చేశాము.

అదనంగా మరో పది రాత్రులతో దానిని పూర్తి చేశాము. ఆ విధంగా అతని ప్రభువు పెట్టిన గడువు నలభై రాత్రులలో పూర్తయింది. మూసా తన సహోదరుడైన హారూనుతో ఇలా అన్నాడు : 'నా పరోక్షంలో నీవు నా జాతివారి మధ్య నా స్థానంలో పనిచెయ్యి. వీళ్ళను సంస్కరిస్తూ ఉండు. విచ్ఛిన్నకారుల మార్గాన్ని అనుసరించకు.' 143. మేము నిర్ధారించిన సమయానికి మూసా వచ్చినపుడు, అతని ప్రభువు అతనితో సంభాషించాడు. (తాదాత్మ్యం చెందిన మనసుతో మూసా) ఇలా అన్నాడు : 'నా ప్రభూ! నాకు నీ దర్శన భాగ్యం కలిగించు. నిన్ను చూసుకుంటాను.' సెలవీయబడింది : 'ఎట్టి పరిస్థితిలోనూ నీవు నన్ను చూడలేవు. అదిగో ఆ పర్వతం వంక చూడు. అది గనక తన స్థానంలో నిలదొక్కుకుంటే నువ్వు కూడా నన్ను చూడగలుగుతావు.' తరువాత అతని ప్రభువు ఆ పర్వతంపై తన తేజస్సును ప్రసరించగానే, అది దానిని తుత్తునియల్ని చేసేసింది. మూసా స్పృహతప్పి పడిపోయాడు. స్పృహలోకి వచ్చిన మీదట, 'ప్రభూ! నీవు పరిశుద్ధుడవు. నేను నీ వైపునకే మరలుతున్నాను. విశ్వసించేవారిలో నేను తొలి వాడనవుతాను' అని విన్నవించుకున్నాడు.

144. దేవుడు సెలవిచ్చాడు : 'ఓ మూసా! జనులపై నీకు ప్రాధాన్యతనిచ్చి నిన్ను ప్రవక్తగా ఎన్నుకున్నాను. నీతో సంభాషణ జరిపి నిన్ను సత్కరించాను. కనుక నేను ప్రసాదించిన దానిని గ్రహించు. కృతజ్ఞుడవై ఉండు.' 145. మేము అతని కొరకు పలకలపై సర్వవిధాల హితవులను, ప్రతి విభాగానికి సంబంధించిన వివరాలను వ్రాసి ఇచ్చాము. ఇలా తాకీదు చేశాము : 'వీటిని గట్టిగా పట్టుకో. వీటి ఉత్తమ భావాన్ని అనుసరించమని నీ జాతి వారిని ఆదేశించు. త్వరలోనే నేను మీకు పాపాత్ముల నివాసాన్ని చూపిస్తాను.'

146. నేను భువిలో అకారణంగా అహంకారం ప్రదర్శించే వారి దృష్టిని నా సూచనల నుండి మళ్ళిస్తాను. వారు అన్ని రకాల సూచనలను చూసినప్పటికీ విశ్వసించరు. సన్మార్గం వారికి కానవచ్చినా సరే దానిని వారు అవలంబించరు. కాని వారికి అపమార్గం కానవస్తే మాత్రం దానిని

అవలంబిస్తారు. ఎందువల్లనంటే వారు మా సూచనలను త్రోసిపుచ్చారు. వాటిపట్ల నిర్లక్ష్యం వహించారు. 147. ఎవరు మా సూచనలను, పరలోక సమావేశాన్ని అసత్యాలుగా చిత్రీకరించారో, వారి కర్మలన్నీ వ్యర్థమయి పోయాయి. ప్రతిఫలంగా వారు చేసుకున్నదిగాక వేరొకటి వారికి దొరుకునా?'

148. మూసా జాతివారు, అతను అటు వెళ్ళగానే ఇటు తమ నగలతో ఆవు దూడ లాంటి విగ్రహం తయారుచేశారు. అందులో నుండి ఎద్దు స్వరం వంటిది వెలువడేది. అది తమతో మాట్లాడటం గానీ, తమకు మార్గం చూపటం గానీ చేయజాలదని వారికి తెలియదా? అయినప్పటికీ వారు దానిని ఆరాధ్య దైవంగా చేసుకున్నారు. మొత్తానికి వారు ఘోర అన్యాయానికి ఒడిగట్టారు. 149. చివరకు వారు జరిగిన దానిపై సిగ్గుపడ్డారు. తాము దారి తప్పామన్న సంగతి గ్రహించిన మీదట ఇలా అన్నారు : 'మా ప్రభువే గనక ఇప్పుడు మమ్మల్ని కరుణించకపోతే, మమ్ము క్షమించకపోతే నిశ్చయంగా మేము ఘోరంగా నష్టపోతాము. 150. మూసా తన జాతి వారి వద్దకు ఆగ్రహంతో, ఆవేదనతో తిరిగి వచ్చినప్పుడు ఇలా అన్నాడు : 'మీరు నా పరోక్షంలో ఇంత దారుణంగా ప్రవర్తిస్తారా? ఏమిటి, మీ ప్రభువు ఆజ్ఞ రాక ముందే వేగిరపడతారా?' అతను పలకలను అక్కడ పడవేసి, తన సోదరుని జుట్టు పట్టుకుని తన వైపు లాగాడు. హారూన్ ఇలా అన్నాడు : 'ఓ నా మాతా పుత్రుడా! ఈ జనులు నన్ను లొంగదీసుకున్నారు. నన్ను చంపటానికి సిద్ధమయ్యారు. కనుక శత్రువులకు నా పరిస్థితిపై నవ్విపోయే అవకాశం కల్పించకు. నన్ను ఈ దుర్మార్గ జనుల సరసన చేర్చకు.' 151. మూసా ఇలా ప్రార్థించాడు : 'నా ప్రభూ! నన్నూ, నా సోదరుణ్ణి క్షమించు. మమ్మల్ని నీ కారుణ్యంలో చేర్చుకో. నీవు కరుణించేవారందరిలోకీ అధికంగా కరుణించేవాడవు.'

152. నిశ్చయంగా ఆవు దూడను ఆరాధ్య దైవంగా చేసుకున్నవారు తమ ప్రభువు ఆగ్రహానికి పాత్రులవుతారు. ప్రాపంచిక జీవితంలోనే వారికి పరాభవం ఎదురవుతుంది. అసత్యాన్ని కల్పించే వారిని మేము ఇలాగే

శిక్షిస్తాము. 153. ఇకపోతే దుష్కర్మలకు ఒడిగట్టినవారు; ఆ తరువాత వారు గనక పశ్చాత్తాపపడితే, విశ్వసిస్తే, నిశ్చయంగా నీ ప్రభువు దాని మీదట వారిని క్షమించేవాడు, కరుణించేవాడు.

154. మూసా కోపావేశం చల్లారిన తరువాత అతను ఆ పలకలను ఎత్తుకున్నాడు. వాటిలో వ్రాయబడి ఉన్న దానిలో తమ ప్రభువుకు భయపడేవారి కొరకు మార్గదర్శకత్వం, కారుణ్యం ఉండింది. 155. మేము నిర్ధారించిన సమయానికి హాజరయ్యేందుకు మూసా తన జాతి వారిలో నుండి డెబ్భయి మందిని ఎంపిక చేసుకున్నాడు. తరువాత వారిని భూకంపం కబళించినపుడు మూసా ఇలా నివేదించుకున్నాడు : 'ఓ ప్రభూ! నీవు గనక తలచుకుంటే ఇంతకు ముందే వారినీ, నన్నూ అంతమొందించి ఉండేవాడివి. మాలోని కొందరు మూర్ఖులు చేసిన పనికి శిక్షగా మమ్మల్ని తుదముట్టిస్తావా (ప్రభూ!). ఇది నిజానికి నీవు పెట్టిన పరీక్ష. దీనిద్వారా నీవు కోరిన వారిని అపమార్గం పట్టిస్తావు. నీవు కోరిన వారికి సన్మార్గం చూపగలవు. నీవే మా రక్షకుడవు. కనుక మమ్ము క్షమించు, మాపై దయజూపు. నీవు అందరికన్నా శ్రేష్ఠుడైన క్షమాశీలివి. 156. మా కొరకు ఈ ప్రపంచంలోనూ, పరలోకం లోనూ మేలును వ్రాసిపెట్టు. మేము నీ వైపునకే రుజువర్తనులమయ్యాము.' దేవుడు సెలవిచ్చాడు : 'నేను కోరిన వారికే శిక్ష విధిస్తాను. ఇక నా కరుణ విషయానికి వస్తే, అది ప్రతి వస్తువును ఆవరించి ఉంది. నేను దానిని భయభక్తులు గలవారికి, జకాత్ ఇచ్చేవారికి, మా సూచనలను విశ్వసించేవారికి వ్రాసిపెడతాను.'

157. ఈ సందేశహరుణ్ణి, నిరక్షరాసి అయిన ఈ ప్రవక్తను అనుసరిం చేవారు (ఈ కారుణ్యానికి అర్హులు). వారు ఈయన గురించి తమ వద్ద నున్న తౌరాతు, ఇన్జీలు గ్రంథాలలో వ్రాయబడి ఉన్నట్లు కనుగొంటారు. అతను వారికి మంచిని చెయ్యమని ఆజ్ఞాపిస్తాడు. చెడు నుండి నిరోధిస్తాడు. వారి కొరకు పరిశుద్ధమయిన వస్తువులను ధర్మసమ్మతంగా ఖరారు చేస్తాడు. అపరిశుద్ధమయిన వాటిని అధర్మంగా నిర్ధారిస్తాడు. వారిపై ఉన్న బరువులను

దించుతాడు. వారికి పెనవేసుకుని ఉన్న శృంఖలాలను త్రెంచుతాడు. కనుక ఎవరు అతనిని విశ్వసించి, అతనికి ఆదరువుగా నిలుస్తారో, అతనికి సహాయపడతారో, ఇంకా అతనితో పాటు అవతరింపజేయబడిన జ్యోతిని అనుసరిస్తారో – అలాంటివారే సాఫల్యం పొందుతారు.

158. వారికి చెప్పు : 'ప్రజలారా! నిశ్చయంగా నేను మీ అందరి వైపునకు పంపబడిన దైవ సందేశహరుడను. భూమ్యాకాశాల సామ్రాజ్యాధిపతి ఆయనే. ఆయన తప్ప మరో దేవుడు లేడు. ఆయనే జీవన్మరణాల ప్రదాత. కనుక దైవాన్ని, ఆయన సందేశహరుణ్ణి నిరక్షరాసి అయిన ఆయన ప్రవక్తను విశ్వసించండి. అతను (సయితం) దైవాన్ని, దైవవాక్కులను విశ్వసిస్తాడు. అతన్ని అనుసరించండి – తద్వారా మీరు సన్మార్గం పొందవచ్చు.
159. మూసా జాతిలో ఒక వర్గం వారున్నారు. వారు సత్యం ప్రకారం మార్గదర్శకత్వం వహిస్తారు. దాని కనుగుణంగానే న్యాయనిర్ణయాలు గైకొంటారు.

160. మేము వారిని పన్నెండు వంశాలుగా విభజించి, ఒక్కో వంశానికి ఓ ప్రత్యేక వర్గ స్థాయిని కల్పించాము. మూసా జాతివారు నీళ్లు కావాలని అడిగినప్పుడు, ఫలానా బండరాయి మీద లాఠీతో కొట్టమని సంకేతం పంపాము. అప్పుడు ఆ బండరాయి నుండి పన్నెండు ఊటలు చిమ్ముకొచ్చాయి. ప్రతి వర్గం వారు తాము నీరు త్రాగవలసిన స్థలాన్ని కనుగొన్నారు. మేము వారిపై మేఘాల ఛాయను కల్పించాము. వారిపై మన్న్ సల్వాలను (ఆహారంగా) దించాము. 'మేము మీకు ప్రసాదించిన పరిశుద్ధమైన వస్తువులను తినండి' (అన్నాము). తరువాత వారు మాకెట్టి అపకారం చెయ్యలేకపోయారు. వారు తమ ఆత్మలకే హాని చేకూర్చుకున్నారు.
161. 'మీరు ఈ పురములోకి వెళ్ళి నివసించండి. అక్కడ కోరిన చోటు నుండి తినండి. "మమ్మల్ని మన్నించు" అని ప్రార్థిస్తూ, వినమ్రులై ముఖద్వారం గుండా ప్రవేశించండి. మేము మీ పాపాలను క్షమిస్తాము. మేము సదాచార

సంపన్నులకు మరింత అధికంగా అనుగ్రహిస్తాము' అని చెప్పినపుడు (జరిగిందేమిటో జ్ఞాపకం చేసుకోండి)' 162. కాని దుర్మార్గులు తమకు ఆజ్ఞాపించబడిన దానిని మరో మాటతో మార్చివేశారు. తరువాత మేము వారిపై ఆకాశం నుండి విపత్తును పంపాము. ఎందుకంటే వారు దుర్మార్గానికి ఒడిగట్టేవారు.

163. సాగర తీరాన నివసించిన ఆ బస్తీవాసుల గురించి వారిని అడుగు. వారు శనివారం విషయంలో ఆజ్ఞోల్లంఘనకు ఒడిగట్టేవారు. (విచిత్రమేమిటంటే) ఆ శనివారం నాడే చేపలు నీటిపైకి వచ్చేవి. శనివారం కాని దినాలలో పైకి వచ్చేవి కావు. వారి అవిధేయతా వైఖరి కారణంగానే మేము వారిని ఈ విధంగా పరీక్షించేవారము. 164. వారిలోని ఒక వర్గం వారు (మరో వర్గం వారిని ఉద్దేశ్యించి) 'దేవుడు అంతమొందించబోతున్న వారికి లేదా కఠినంగా శిక్షించబోతున్న వారికి మీరెందుకు బోధపరుస్తారు?' అని చెప్పినపుడు, వారిలా అన్నారు : 'మీ ప్రభువు సమక్షంలో కనీసం సంజాయిషీ ఇచ్చుకోవటానికి ఇలా చేస్తున్నాము. ఒకవేళ వారు భయపడినా భయపడవచ్చు.'

165. తరువాత వారి జ్ఞాపకార్థం చేయబడిన ఉపదేశాన్ని వారు విస్మరించినపుడు, మేము చెడుల నుండి నిరోధించేవారిని రక్షించి, తమ ఆత్మలకు అన్యాయం చేసుకునే వారిని ఘోరమైన శిక్షగా పట్టుకున్నాము. ఎందుకంటే వారు అవిధేయతకు ఒడిగట్టేవారు. 166. మరి వారు తమకు వారించబడిన విషయంపై నిర్లక్ష్యంగా బరితెగించినపుడు 'మీరిక నీచమయిన కోతులుగా మారిపోండి' అన్నాము.

167. నీ ప్రభువు ఈ విధంగా ప్రకటించిన సందర్భం కూడా స్మరించుకోదగినదే; 'యూదులపై ప్రళయదినం వరకూ ఘోర యాతనకు గురిచేసే వారిని పంపిస్తూ ఉంటాను.' నిశ్చయంగా నీ ప్రభువు శిక్షించటంలో

శీఘ్రగామి. ఇంకా నిశ్చయంగా ఆయన క్షమించేవాడు, కనికరించేవాడూను. 168. మేము వారిని వర్గ తెగలుగా విభజించి భూమండలంలో చెల్లాచెదురు చేసేశాము. వారిలో కొందరు మంచివారైతే మరి కొందరు తద్భిన్నంగా ఉన్నారు. మేము వారిని మంచీ చెడు స్థితిగతుల ద్వారా పరీక్షించాము – బహుశా వారు దారికి వస్తారని.'

169. వారి తరువాతి తరాలలో అసమర్థులయిన వారు గ్రంథానికి వారసులయ్యారు. వారు ఎంతసేపటికీ ఇహలోక సామగ్రిని పోగు చేసుకోవటంలోనే ఉంటారు. పైగా 'మేము తప్పకుండా క్షమించబడతామ'ని అంటారు. అలాంటి సంపదే మళ్లీ వారి ముందుకు వచ్చినా మళ్లీ దానిని తీసేసుకుంటారు. ఏమిటి, అల్లాహ్ పేరుతో సత్యం తప్ప మరో మాట అనరాదని గ్రంథంలో వారిచేత ప్రమాణం చేయించబడలేదా? అందులో వ్రాసి ఉన్న దానిని వారు చదివారు కూడా. భయభక్తులు కలవారికి పరలోక నిలయమే మేలైనది. ఆ మాత్రం మీరు అర్థం చేసుకోలేరా? 170. ఎవరయితే దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకుంటారో, నమాజును స్థాపిస్తారో – నిశ్చయంగా ఇలాంటి సంస్కరణాభిలాషుల పుణ్యఫలాన్ని మేము వృథాచెయ్యము. 171. మేము పర్వతాన్ని వారిపైకి ఎత్తి – దానిని ఒక నీడగా చేసినప్పుడు, అది తమపైకి పడుతుందేమోనని వారు అనుమానించారు. 'మేము ప్రసాదించిన దానిని గట్టిగా పట్టుకోండి. అందులో ఉన్న దానిని బాగా గుర్తుంచుకోండి – తద్వారా మిమ్మల్ని మీరు రక్షించుకోవచ్చు' అని మేము వారికి తాకీదు చేశాము.

172. నీ ప్రభువు ఆదమ్ సంతతి వీపుల నుండి వారి సంతానాన్ని తీసి, స్వయంగా వారినే వారికి సాక్షులుగా పెట్టి 'నేను మీ ప్రభువును కానా?' అని అడిగినప్పుడు, 'అవును, దీనిని మేము అంగీకరిస్తున్నాము' అని వారన్నారు. ఇలా ఎందుకు అడగబడిందంటే, ప్రళయదినాన 'ఏమో! దీని గురించి మాకేమీ తెలియదు' అని మీరు అనకూడదని. 173. లేదా ఇలా అంటారేమోనని : 'మా తాతముత్తాతలు మొదటి నుండే –

బహుదైవారాధన చేసేవారు. మేము వారి సంతతి తరువాత పుట్టినవారము. దుర్వర్తనులు చేసిన పనికి నీవు మమ్ము శిక్షిస్తావా?' 174. ఈ విధంగా మేము మా సూచనలను విడమరచి చెబుతున్నాము - వారు రుజువర్తను లవుతారని.

175. మేము మా సూచనలను ప్రసాదించిన ఆ వ్యక్తి వృత్తాంతాన్ని వారికి చదివి వినిపించు. అయితే అతను వాటి నుండి పారిపోయాడు. అప్పుడు షైతాన్ అతని వెంట పడటంతో అతను దారి తప్పిన వారిలో చేరిపోయాడు. 176. మేమే గనక తలచుకుంటే ఆ సూచనల ద్వారా అతనిని ఉన్నతికి చేర్చి ఉండేవారం. కాని అతను మాత్రం నేలకే అతుక్కుపోయాడు, తన కోర్కెలనే అనుసరించసాగాడు. అతని ఉపమానం కుక్కలాంటిది. నీవు దానిపై బరువు మోపినా అది రొప్పుతూనే ఉంటుంది. దానిని దాని మానాన వదలిపెట్టినా రొప్పుతూనే ఉంటుంది. మా సూచనలను అసత్యాలని త్రోసిపుచ్చిన వారి ఉపమానం ఇలాంటిదే. కనుక నీవు ఈ గాథలను వారికి వినిపిస్తూ ఉండు - బహుశా వారు యోచన చేస్తారేమో! 177. మా సూచనలను త్రోసిపుచ్చినవారి ఉపమానం ఎంత చెడ్డది! వారు తమ స్వయానికే నష్టం చేకూర్చుకుంటూ ఉండిపోయారు. 178. దేవుడు ఎవరికి మార్గదర్శకత్వం వహిస్తాడో అతనే నిజానికి సన్మార్గం పొందుతాడు. మరెవరినయితే ఆయన మార్గభ్రష్టత్వంలో వదలివేస్తాడో - అలాంటివారే నష్టపోయిన వారు.

179. మేము మానవులు, జిన్నాతులలో ఎంతోమందిని నరకం కోసం పుట్టించాము. వారికి హృదయాలున్నప్పటికీ వాటితో వారు అర్థం చేసుకోరు. వారికి కళ్ళున్నప్పటికీ వాటితో వారు చూడరు. వారికి చెవులున్నప్పటికీ వాటితో వారు వినరు. వారు పశువుల్లాంటివారు. కాదు, వాటికన్నా మరీ హీనం. అలాంటివారే పరధ్యానానికి లోనైనవారు. 180. ఉత్తమ నామాలన్నీ అల్లాహ్‌కే చెందుతాయి. కాబట్టి వాటితోనే ఆయన్ని పిలవండి. ఆయన పేర్ల విషయంలో వక్రవైఖరిని అవలంబించేవారిని వదలిపెట్టండి. తాము చేసుకున్న దానిని

వారు అనుభవించి తీర్తారు. 181. మేము సృష్టించిన వారిలో ఒక వర్గం వారున్నారు. వారు సత్యం ప్రకారం జనులకు మార్గదర్శకత్వం వహిస్తారు. సత్యం ప్రకారమే న్యాయ నిర్ణయాలు గైకొంటారు. 182. మరెవరయితే మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించారో వారిని మేము అంచెల వారీగా, వారు ఊహించనయినా లేనిచోటు నుండి వారిపై ఉచ్చు బిగిస్తాము. 183. వారికి కొంత విడుపు ఇస్తున్నాము. నిశ్చయంగా నా ఎత్తుగడ చాలా గట్టిది.

184. ఏమిటి, తమ సహచరుని (ప్రవక్త)కి మతి చలించటం లాంటిది ఏమీ లేదన్న విషయం గురించి వారు ఆలోచించటం లేదా? అతనయితే స్పష్టంగా హెచ్చరించేవాడు మాత్రమే. 185. ఏమిటి, వారు భూమ్యాకాశాల పరిపాలనా వ్యవస్థపై దృష్టిని సారించలేదా? దేవుడు సృష్టించిన ఇతర వస్తువులను చూడటం లేదా? తమ జీవన వ్యవధి పూర్తి కావచ్చిందేమోనన్న ఆలోచన కూడా వారికి తట్టడం లేదా? ఇక ఈ విషయం తరువాత వారు విశ్వసించటానికి మరేముందనీ? 186. దేవుడే మార్గవిహీనతకు లోనుచేసిన వానికి, సన్మార్గం చూపేవాడెవడూ ఉండడు. దేవుడు వారిని వారి తలబిరుసు తనంలోనే తచ్చాడుతూ ఉండేలా వదలిపెడ్తాడు. 187. వారు నిన్ను ప్రళయం గురించి, 'ఇంతకీ అదెప్పుడు వస్తుంది?' అని ప్రశ్నిస్తున్నారు. వారికి చెప్పు : 'దాని జ్ఞానం మాత్రం నా ప్రభువు వద్దనే ఉంది. ఆ ఘడియ ఆసన్నమైనపుడు ఆయనే దానిని బహిర్గతం చేస్తాడు. అది భూమ్యాకాశాలలో బరువుగా పరిణమిస్తోంది. అది మీపై రావలసినప్పుడు అమాంతం వచ్చి పడుతుంది.' నీవు దాని పరిశోధన చేసి ఉన్నట్లే వారు నిన్ను ప్రశ్నిస్తున్నారు. చెప్పు : 'దాని జ్ఞానం దేవునికే పరిమితం. కాని అనేకులు ఈ విషయాన్ని ఎరుగరు.' 188. వారితో అను : 'నేను నా స్వయానికి లాభంగానీ, నష్టంగానీ చేకూర్చుకునే అధికారం నాకు లేదు. కాని దేవుడు తలచినది అవుతుంది. నాకే గనక గోప్యమయిన విషయాల పరిజ్ఞానం ఉండి ఉంటే, నేను నా

స్వంత విషయంలో ఎన్నో లాభాలు పొందేవాడిని. నాకెలాంటి నష్టం వాటిల్లేది కాదు. నేనయితే నమ్మినడుచుకునే జనులకు హెచ్చరిక చేసేవాణ్ణి, శుభవార్తలు వినిపించేవాణ్ణి మాత్రమే.'

189. ఆయనే మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. దాని నుండే దాని జతను కూడా చేశాడు – మీరు దాని వద్ద సుఖం పొందాలని. మరి పురుషుడు స్త్రీని కప్పివేసినప్పుడు ఆమె తేలికపాటి గర్భం దాల్చింది. తరువాత ఆమె దానిని మోసుకుంటూ తిరిగింది. తరువాత ఆ బరువు పెరిగినప్పుడు వారిరువురూ కలిసి తమ ప్రభువును వేడుకోసాగారు – 'నీవు గనక మాకు ఆరోగ్యవంతమైన బిడ్డను ప్రసాదిస్తే మేము నీకు కృతజ్ఞులమై ఉంటాము' అని. 190. కాని దేవుడు వారికి మంచి (ఆరోగ్యవంతమైన) బిడ్డను ప్రసాదించినపుడు, ఆయన ప్రసాదించిన దానిలో వారు ఇతరులను భాగస్వాములుగా పరిగణించసాగారు. వారు కల్పించే భాగస్వామ్యాలకు దేవుడు అతీతుడు, ఉన్నతుడు. 191. ఏమిటి, దేనినీ సృష్టించలేనివారినీ, తాము స్వయంగా సృష్టించబడిన వారిని వారు దైవానికి భాగస్వాములుగా నిలబెడుతున్నారా? 192. వారెవరికీ సహాయం చేయలేరు సరికదా తమకు తాము కూడా సహాయం చేసుకోలేరు. 193. ఒకవేళ మీరు వారిని దారికి రమ్మని పిలిస్తే, వారు మీ పిలుపును అనుసరించరు. మీరు వారికి పిలుపు ఇచ్చినా, మౌనంగా ఉండిపోయినా – రెండూ ఒక్కటే. 194. మీరు నిజ దైవాన్ని వదలి వేటిని పిలుస్తున్నారో అవన్నీ మీలాంటి దాసులే. మీరు వాటిని పిలుస్తూనే ఉండండి. వాటి గురించి మీ ఊహలు సరైనవే అయితే అవి మీకు సమాధానం ఇవ్వాలి మరి.

195. ఏమిటి, వారికి (వాటికి) కాళ్ళుగాని ఉన్నాయా వాటితో నడవటానికి? వాటికేమన్నా చేతులున్నాయా వాటితో పట్టుకోవటానికి? వాటికి కళ్ళున్నాయా వాటితో చూడగలగటానికి? వాటికేమన్నా చెవులున్నాయా వాటితో వినటానికి? వారితో అను : 'మీరు మీ భాగస్వాములను పిలుచు కోండి. తరువాత మీరంతా కలిసి నాకు వ్యతిరేకంగా వ్యూహరచనలు చేయండి. నాకు వ్యవధి కూడా ఇవ్వకండి. 196. నిశ్చయంగా దేవుడే నా

సంరక్షకుడు. ఆయనే గ్రంథాన్ని అవతరింపజేశాడు. సజ్జనులకు ఆయన అండగా ఉంటాడు. 197. ఆయన్ని వదలి మీరు మొరపెట్టుకుంటున్నవారు మీకు ఏ విధంగానూ సహాయపడలేరు. వారు తమకు తాము కూడా సహాయం చేసుకోలేరు. 198. ఒకవేళ మీరు వాటిని సన్మార్గం వైపు పిలిచినా అవి మీ మాట వినలేవు. అవి నీ వైపు చూస్తున్నట్లే నీకు కనిపిస్తుంది. కాని అవేమీ చూడలేవు.

199. మన్నింపుల వైఖరిని అవలంబించు. మంచిని ఆజ్ఞాపించు. మూర్ఖులను పట్టించుకోకు. 200. ఒకవేళ నీకు షైతాన్ తరఫున ఏదన్నా దుష్ప్రేరణ కలిగితే దేవుని శరణు వేడుకో. నిశ్చయంగా ఆయన అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు. 201. నిశ్చయంగా దైవభీతికలవారు, తమకు షైతాన్ తరఫున ఏదన్నా చెడు ప్రేరణ కలిగినప్పుడు వెంటనే తేరుకుంటారు. అప్పటికప్పుడే వారికి దిశానిర్దేశం అయిపోతుంది. 202. ఇకపోతే షైతాన్ సోదరులు; వారు వారిని మార్గవిహీనత వైపునకు లాక్కుపోతారు. అందులో వారు ఏ లోటూ చేయరు.

203. నీవు వారి ముందుకు ఏదయినా సూచన (మహిమ)ను తీసుకురాలేకపోయినప్పుడు, 'నీవు నీ తరఫునే ఏదన్నా ఎంపిక చేసుకోలేకపోయావా?' అని వారు అంటారు. వారికి చెప్పు : 'నా ప్రభువు తరఫున నాకు పంపబడిన దానినే నేను అనుసరిస్తాను. ఇవి మీ ప్రభువు వద్ద నుండి వచ్చే వివేకవంతమయిన విషయాలు. విశ్వసించే వారికి మార్గదర్శకం, కారుణ్యప్రదం. 204. ఖుర్ఆన్ పారాయణం జరుగుతున్నప్పుడు దానిని శ్రద్ధగా వినండి. నిశ్శబ్దంగా ఉండండి. అలా చేస్తే మీరూ కరుణకు నోచుకోవచ్చు. 205. ఉదయం, సాయంత్రం నీ ప్రభువును స్మరిస్తూ ఉండు – నీ మనసులోనే విలపిస్తూను, భయపడుతూను, మరీ బిగ్గరగా కాకుండా ఓ మోస్తరు శబ్దంతో! పరధ్యానానికి లోనైన వారిలో చేరకు. 206. నిశ్చయంగా నీ ప్రభువుకు సమీపంలో ఉన్నవారు ఆయన దాస్యం చేయటం పట్ల గర్వం వహించరు. ఆయన పవిత్రతను ప్రస్తుతిస్తూ ఆయనకు సాష్టాంగపడుతూ ఉంటారు.

# 8. అల్ అన్‌ఫాల్ (యుద్ధప్రాప్తి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. వారు నిన్ను యుద్ధప్రాప్తి (అన్‌ఫాల్) గురించి అడుగుతున్నారు. వారికి చెప్పు : 'యుద్ధప్రాప్తి దైవానికి, దైవప్రవక్తకు చెందినది. కనుక మీరు దైవానికి భయపడండి. మీ పరస్పర సంబంధాలను సరిదిద్దుకోండి. మీరు గనక విశ్వసించినవారే అయితే దైవానికి, దైవప్రవక్తకు విధేయులై ఉండండి.
2. నిజమయిన విశ్వాసులు ఎవరంటే; దైవప్రస్తావన రాగానే వారి హృదయాలు భీతితో కంపిస్తాయి. దైవ వచనాలు వారి సమక్షంలో పారాయణం చేయబడినప్పుడు, అవి వారి విశ్వాసాన్ని అధికం చేస్తాయి. వారు తమ ప్రభువుపై నమ్మకం కలిగి ఉంటారు. 3. వారు నమాజ్‌ను స్థాపిస్తారు. మేము వారికి ప్రసాదించిన దానిలో నుండి ఖర్చుచేస్తారు. 4. ఇలాంటి వారే సిసలయిన విశ్వాసులు. వారి కొరకు వారి ప్రభువు వద్ద ఉన్నత తరగతులున్నాయి. క్షమాపణ ఉంది. ఇంకా వారికి గౌరవప్రదమయిన జీవనోపాధి ఉంది.

5. (ఓ ప్రవక్తా!) నీ ప్రభువు నిన్ను సత్యబద్ధంగానే నీ ఇంటి నుండి బయటికి తీసుకువచ్చాడు – విశ్వాసులలోని ఒక వర్గానికి ఇది నచ్చలేదు.
6. ఈ సత్యం విషయంలో వారు నీతో వాదులాడసాగారు – వాస్తవానికి అది తేటతెల్లమైపోయినప్పటికీ, తమను మృత్యువు వైపునకు బలవంతంగా త్రోసుకుపోతున్నట్లే, దానిని తాము కళ్లారా తిలకిస్తున్నట్లే భావించారు.
7. ఆ రెండు సమూహాలలో ఏదో ఒకటి మీ చేతికి చిక్కుతుందని దేవుడు ఒక వైపు మీతో వాగ్దానం చేస్తుండగా, కనీసం ముల్లయినా గుచ్చుకోనిది మీకు తారసపడాలని మీరు కోరుకున్నారు. కాని దేవుని తలంపు మరో విధంగా ఉంది. ఆయన తన వాక్కు ద్వారా సత్యాన్ని సత్యంగా రూఢీ చేయాలని, సత్యతిరస్కారుల దుంప త్రెంచివేయాలని నిశ్చయించుకున్నాడు–

8 – తద్వారా సత్యం సత్యంగా, అసత్యం అసత్యంగా రుజువు కావలసిన ఆవశ్యకత ఎంతైనా ఉండింది – అపరాధులకు అది సహించరానిదయినా సరే.

9. మీరు మీ ప్రభువును ఎంతో ఆర్ద్రంగా సహాయం కొరకు నివేదించుకున్నప్పుడు, ఆయన మీ నివేదనకు స్పందిస్తూ, 'నేను మీ సహాయార్థం వెయ్యిమంది దైవదూతలను నిరాఘాటంగా పంపిస్తాన'న్నాడు. 10. ఇది మీకు శుభవార్త కాగలగాలని, తద్వారా మీకు గుండె నిబ్బరం కలగాలని దేవుడు ఇలా చేశాడు. దేవుని వద్ద నుండి లభించే సహాయమే అసలైన సహాయం. నిశ్చయంగా దేవుడు శక్తిమంతుడు, వివేకవంతుడు. 11. అప్పుడు మీరు స్థిమితంగా ఉండగలందులకు ఆయన తన తరఫు నుండి మీపై కునుకును ఆవహింపజేశాడు. ఆకాశం నుండి మీపై వర్షం కురిపించాడు – తద్వారా మిమ్మల్ని పరిశుద్ధపరచాలని, షైతాన్ మాలిన్యాన్ని మీ నుండి దూరం చేయాలని, మీ మనసులను కుదుటపరచాలని, మీ పాదాలకు స్థిరత్వాన్ని కలుగజేయాలనీని. 12. అప్పుడు నీ ప్రభువు దైవదూతలకు ఇచ్చిన సంకేతం ఇది : "నేను మీ వెంట ఉన్నాను. మీరు విశ్వాసుల్లో స్థయిర్యం నింపండి. నేను తిరస్కారుల గుండెల్లో దడ పుట్టిస్తాను. మీరు వారి మెడలపై యాత వేయండి. వారి కణుపులపై కొట్టండి. 13. ఎందువల్లనంటే వారు దైవాన్ని, దైవ సందేశహరుణ్ణి ఎదిరించారు. ఎవడు దైవాన్ని, దైవసందేశహరుణ్ణి ఎదిరించినా దేవుడు శిక్షించటంలో చాలా కఠినుడు. 14. కనుక ఇప్పుడు (శిక్షను) చవిచూడండి. సత్య తిరస్కారులకు నరక యాతన తథ్యమని తెలుసుకోండి.

15. ఓ విశ్వాసులారా! మీరు యుద్ధరంగంలో అవిశ్వాసులను మార్కొన్నప్పుడు వారికి వెన్నుచూపకండి. 16. ఎవరయినా – రణతంత్రపు టెత్తులతో వెనక్కి తగ్గటమో లేదా వేరొక సైనిక దళంలో చేరటానికో తప్ప – ఆ సందర్భంలో వెన్నుచూపి పారిపోయిన వాడు దైవాగ్రహానికి పాత్రుడవు తాడు. అతని నివాసస్థలం నరకం అవుతుంది. అది పరమ దుర్భరమయిన ఆశ్రయం.

17. వాస్తవానికి మీరు వారిని వధించలేదు, దేవుడే వారిని వధించాడు. నీవు వారిపై మన్ను విసిరినప్పుడు, విసిరింది నీవు కాదు, దేవుడు ఆ మన్ను విసిరాడు - తద్వారా విశ్వసించిన వారికి దేవుడు ఇతోధికంగా ఉపకారం చేయాలని. నిశ్చయంగా దేవుడు సర్వం వినేవాడు, సర్వం ఎరిగినవాడు. 18. ఇదైతే అయిపోయింది. ఇక అవిశ్వాసుల విషయానికివస్తే దేవుడు వారి పన్నాగాలన్నింటినీ నిర్వీర్యం చేసితీర్తాడు. 19. మీరు తీర్పును కోరుతున్నట్లయితే ఇదిగో, తీర్పు మీ ముంగిట వచ్చేసింది. ఇకనయినా మీరు (మీ దమన నీతిని) మానుకుంటే, అది మీకే మేలు. కాని మీరు మళ్లీ అలాగే చేశారంటే మేమూ అలాగే చేస్తాము. మీ కూటమి ఎంత పెద్దదయినా అది మీకు ఏ విధంగానూ పనికి రాదు. నిశ్చయంగా దేవుడు విశ్వాసులకు తోడుగా ఉన్నాడు.

20. ఓ విశ్వాసులారా! దైవానికి, ఆయన ప్రవక్తకు విధేయత చూపండి. అంతా వింటూ కూడా అతని నుండి మరలిపోకండి. 21. నిజానికి ఏమీ వినకపోయినప్పటికీ 'మేము విన్నాము' అని అనేవారిలా అవకండి. 22. నిశ్చయంగా దేవుని దృష్టిలో బుద్ధిని ఉపయోగించని చెవిటివారు, మూగజనులు అత్యంత హీనమైన జంతువుల్లాంటివారు. 23. ఒకవేళ వారిలో ఏ కాస్త మంచి ఉందనిపించినా దేవుడు వారిని తప్పకుండా వినేటట్లు చేసేవాడు. (ఆ సద్బుద్ధి వారిలో లేదు. కనుక) ఇప్పుడు ఒకవేళ వారికి వినిపించినా వారు ముఖం త్రిప్పుకుని పోతారు.

24. ఓ విశ్వసించిన వారలారా! దైవప్రవక్త మీకు జీవితాన్నిచ్చే విషయం వైపు పిలిచినప్పుడు మీరు దైవం మరియు దైవప్రవక్త పిలుపునకు సానుకూలంగా స్పందించండి. తెలుసుకోండి! దేవుడు మనిషికి - అతని మనసుకి మధ్య అడ్డుపడతాడు. మీరంతా ఆయన వద్దకే సమీకరించబడతారు. 25. మీరు ఆ ఉపద్రవానికి భయపడండి. అది మీలోని దుర్మార్గులకు మాత్రమే పరిమితం కాదు. దేవుడు చాలా కఠినంగా శిక్షించేవాడని తెలుసుకోండి.

26. జ్ఞాపకం చేసుకోండి! ఒకప్పుడు మీరు అల్పసంఖ్యలో ఉండేవారు.

రాజ్యంలో మరీ బలహీన వర్గంగా పరిగణించబడేవారు. ప్రజలు అకస్మాత్తుగా మీపై విరుచుకుపడతారేమోనని మీరు భీతిల్లుతూ ఉండేవారు. తరువాత దేవుడు మీకు నిలువ నీడ ఇచ్చాడు. తన తోడ్పాటుతో మిమ్మల్ని బలపరిచాడు. మీకు పరిశుద్ధమయిన వస్తువులను జీవనోపాధిగా ఇచ్చాడు – మీరు కృతజ్ఞులవుతారని! 27. ఓ విశ్వాసులారా! తెలిసీ దైవానికి, దైవప్రవక్తకు ద్రోహం చేయకండి. మీ అప్పగింతలలో కూడా నమ్మకద్రోహానికి పాల్పడకండి. 28. మీ సిరిసంపదలు, మీ పిల్లలు మీ పాలిట ఒక పరీక్ష అన్న సంగతిని తెలుసుకోండి. అల్లాహ్ వద్ద గొప్ప ప్రతిఫలం ఉందనే విషయాన్ని మరువకండి.

29. ఓ విశ్వాసులారా! మీరు గనక దైవానికి భయపడినట్లయితే, ఆయన మీకు మంచీ చెడుల విచక్షణా జ్ఞానాన్ని (గీటురాయిని) సమకూరుస్తాడు. మీ నుండి మీ చెడుగులను దూరం చేస్తాడు. మిమ్మల్ని క్షమిస్తాడు. దేవుడు గొప్ప అనుగ్రహశీలి. 30. (ఓ ప్రవక్తా!) సత్య తిరస్కారులు నీకు వ్యతిరేకంగా రహస్య పన్నాగాలు పన్నిన సందర్భం కూడా స్మరించదగినదే. నిన్ను నిర్బంధించాలా, లేదా నిన్ను హతమార్చాలా, లేదా నిన్ను దేశం నుండి వెళ్లగొట్టాలా అని వారు వ్యూహ రచన చేసుకుంటూ ఉండగా, దేవుడేమో తన వ్యూహాన్ని రచించుకుంటూ ఉన్నాడు. దేవుడు అత్యుత్తమ వ్యూహరచయిత.

31. వారి సమక్షంలో మా వచనాలు పఠించబడినప్పుడు 'మేము విన్నాములే. తలచుకుంటే మేమూ ఇలాంటి వాక్కు సమర్పించగలం. ఇవన్నీ పూర్వీకుల పుక్కిటి పురాణాలే' అంటారు. 32. వారు పలికిన ఈ మాట (కూడా మరువదగినది కాదు) : 'దేవా! ఇది నిజంగా నీ తరఫున వచ్చిన సత్యమే అయితే మా మీద ఆకాశం నుండి రాళ్ళ వాన కురిపించు లేదా ఏదయినా బాధాకరమయిన శిక్షను మాపైకి తీసుకు రా.' 33. (ఓ ప్రవక్తా!) వారి మధ్యన నీవు ఉన్నంత కాలం దేవుడు ఇలా చేయడమనేది అసంభవం. ఇంకా – వారు క్షమాపణ కొరకు ప్రార్థిస్తూ ఉండగా వారిపై శిక్షను తీసుకురావటం కూడా దేవుని విధానం కాదు. 34. మరైతే దేవుడు (ఇప్పుడు)

వారిని ఎందుకు శిక్షించకూడదు? వారు మస్జిదె హరామ్‌కు (పవిత్ర కాబా గృహానికి) ధర్మకర్తలు కాకపోయినప్పటికీ, వారు జనులను దాని నుండి ఆపుతున్నారు. వాస్తవానికి ధర్మపరాయణులు తప్ప వేరితరులు దాని ధర్మకర్తలు కాలేరు. కాని చాలామందికి ఈ విషయం తెలియదు. 35. దైవగృహం (కాబా) వద్ద వారి నమాజ్ ఈలలు వేయటం, చప్పట్లు కొట్టడం తప్ప మరొకటి కాదు. కనుక మీ తిరస్కార వైఖరికి శాస్తిగా ఇప్పుడు శిక్షను చవిచూడండి.

36. నిశ్చయంగా సత్య తిరస్కారులు దైవమార్గం నుండి జనులను ఆపటానికే తమ ధనాన్ని ఖర్చుపెడుతున్నారు. వారు ఖర్చుపెడుతూనే ఉంటారు. అయితే ఈ విఫల యత్నాలే వారిని కృంగదీస్తాయి. తరువాత వారు పరాజయం పాలవుతారు. తిరస్కారానికి ఒడిగట్టిన వారిని నరకం వైపు సమీకరించటం జరుగుతుంది 37 – దేవుడు పవిత్రమైన దానిని అపవిత్రం నుండి వేరుపరచటానికి! అపవిత్రాన్ని ఒకదానిపై ఒకటిగా పేర్చి, ఆ కుప్పను నరకంలో పడవెయ్యటానికి! ఇలాంటివారే ఘోరంగా నష్టపోయేవారు.

38. తిరస్కారులతో చెప్పు : 'వారు గనక తమ తిరస్కార ధోరణిని మానుకుంటే, గతంలో వారివల్ల జరిగినదంతా క్షమించబడుతుంది. కాని వారు మళ్లీ అదే పనిచేస్తే, పూర్వీకుల పట్ల మా వ్యవహారం ఎలా ఉందో విదితమే.' 39. పీడన (ఫిత్నా) సమసిపోనంత వరకూ, ధర్మం పూర్తిగా దైవానిదే కానంత వరకూ వారితో పోరాడండి. తరువాత వారు గనక దారికివస్తే దేవుడు వారి ఆచరణా విధానాన్ని చూస్తాడు. 40. ఒకవేళ వారు లక్ష్యపెట్టకపోతే, దేవుడు మీ రక్షకుడని తెలుసుకోండి. ఎంత మంచి రక్షకుడాయన! ఎంత మంచి సహాయకుడాయన!

◆ (10) 41. తెలుసుకోండి! 'యుద్ధప్రాప్తి'గా మీకు ఏది లభించినా సరే, అందులో అయిదవ భాగం (ఖుముస్) దైవానికి, దైవప్రవక్తకు (ప్రవక్త) సమీప బంధువులకు, అనాథలకు, నిరుపేదలకు, బాటసారులకు చెందుతుంది. మీరు దైవాన్ని, నిర్ణయాత్మకమయిన దినాన మేము మా దాసుని

(ముహమ్మద్) పైన అవతరింపజేసిన దానిని విశ్వసించే వారే అయితే (మీరు దీనిని శిరసావహించాలి). ఆ దినాన రెండు సమూహాలు మార్కొన్నాయి. దేవుడు ప్రతిదీ చేయగల దిట్ట.

42. మీరు లోయకు సమీప అంచున ఉన్నప్పుడు, వారు దూరపు అంచున ఉన్నారు. (అవిశ్వాసుల వర్తక) బిడారు మాత్రం మీ దిగువ వైపున (తీరప్రాంతాన) ఉంది. ఒకవేళ మీరునూ, వారున్నూ (యుద్ధానికి) ముందుగానే సమయం నిర్ధారించుకునేట్లయితే, ఆ నిర్ధారణ గురించి మీలో తప్పకుండా విభేదం ఏర్పడేది. అయితే జరగవలసి ఉన్న దానిని జరిపించాలని, అంతమయ్యేవాడు స్పష్టమయిన నిదర్శనంపై అంతం కావాలని, జీవితం పొందవలసిన వాడు స్పష్టమయిన నిదర్శనంతోనే జీవించాలని దేవుడు తన ప్రణాళికను అమలుపరిచాడు. నిశ్చయంగా దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 43. దేవుడు నీ కలలో వారి సంఖ్యను తగ్గించి చూపాడు. ఒకవేళ ఆయన వారిని ఎక్కువ సంఖ్యలో చూపి ఉంటే మీరంతా ధైర్యం వీడి, ఈ వ్యవహారంలో పరస్పరం గొడవపడేవారు. కాని దేవుడు మిమ్మల్ని రక్షించాడు. నిశ్చయంగా ఆయన ఆంతర్యాల్లోని రహస్యాలను సయితం ఎరిగినవాడు. 44. కాగల కార్యాన్ని నెరవేర్చేందుకు దేవుడు మీరు పరస్పరం తలపడిన తరుణంలో వారిని మీ కళ్లకు తగ్గించి చూపాడు, మిమ్మల్ని వారి కళ్లకు తగ్గించి చూపాడు. కడకు సమస్త వ్యవహారాలు దేవుని వైపునకే మరల్చబడతాయి.

45. ఓ విశ్వాసులారా! మీరు ఏ వర్గాన్నయినా మార్కొన్నప్పుడు నిలకడ చూపండి. దైవాన్ని అత్యధికంగా స్మరించండి – తద్వారా మీరు విజయం సాధించవచ్చు. 46. దైవానికి, దైవప్రవక్తకు విధేయత చూపండి. పరస్పరం తగాదా పడకండి. తగాదాలకు తావిచ్చారంటే మీ శ్రేణుల్లో బలహీనత పొడసూపుతుంది. మీ ప్రభంజనం మందగిస్తుంది. ఓర్పు వహించండి. నిశ్చయంగా దేవుడు ఓర్పు వహించేవారికి తోడుగా ఉన్నాడు.

47. తమ నివాస గృహాల నుండి నిక్కుతూ, జనుల ముందు డాబును ప్రదర్శిస్తూ బయలుదేరిన వారివలే అవకండి. దైవమార్గంలో అడ్డంకులు సృష్టించటం వారి వైఖరి. నిజానికి వారి చేష్టలన్నింటినీ దేవుడు దిగ్బంధం చేసి ఉంచాడు.

48. అప్పుడు షైతాన్ వారికి వారి పనులను అందమైనవిగా చిత్రీకరించాడు. వాడిలా అన్నాడు : 'ఈ రోజు జనులలో ఎవడూ మిమ్మల్ని నిలువరించలేడు. మీకు అండగా నేనున్నాను కదా!' కాని తీరా ఆ ఇరువర్గాల వారు ముఖాముఖి అయినప్పుడు, వాడు తన మడిమలపై వెనుతిరిగి పోయాడు. 'ఇక మీతో నాకెలాంటి పొత్తు లేదు. మీరు చూడని దానిని నేను చూస్తున్నాను. నాకు దేవుని పట్ల భయమేస్తోంది. దేవుడు చాలా కఠినంగా శిక్షించేవాడు' అన్నాడు. 49. ఆ సమయంలో వంచనా శిల్ప నిష్ణాతులు, హృదయాలలో రోగం ఉన్నవారు ఇలా అన్నారు : 'వీళ్ళను వీళ్ళ ధర్మం (దీన్) మోసపుచ్చింది.' మరెవరయినా దైవాన్నే నమ్ముకుంటే, నిస్సందేహంగా దేవుడు గొప్ప శక్తిమంతుడు, వివేకవంతుడు.

50. (ఓ ప్రవక్తా!) దైవదూతలు ఈ తిరస్కారుల ప్రాణాలను వశపర్చుకుంటున్నప్పుడు నీవు చూడగలిగితే ఎంత బాగుండేది! వారు వారి చెంపలపై, నడుములపై వాయిస్తూ, ఇలా అంటారు : 'ఇక మండే అగ్ని యాతనను రుచి చూడండి. 51. ఇది మీరు స్వయంగా మీ చేజేతులా చేసి పంపుకున్న కర్మల ప్రతిఫలం. దేవుడు మాత్రం ఎట్టి పరిస్థితిలోనూ తన దాసులకు అన్యాయం చేసేవాడు కాడు.' 52. వీళ్ల వ్యవహారం కూడా అచ్చం ఫిరౌనీయుల, వారి పూర్వీకుల మాదిరిగానే ఉంది. వారు కూడా దైవ సూచనలను తిరస్కరించారు. దేవుడు వారి పాపాల కారణంగా వారిని పట్టుకున్నాడు. నిశ్చయంగా దేవుడు మహాబలుడు. శిక్షించటంలో మహా కఠినుడు. 53. ఈ విధంగా ఎందుకు జరిగిందంటే, దేవుడు ఏ జాతివారికయినా వర ప్రసాదాన్ని ఇచ్చినపుడు, ఆ జాతివారు స్వయంగా తమ స్థితిని మార్చుకోనంత

వరకూ దేవుడు దానిని మార్చడు. నిశ్చయంగా దేవుడు అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు. 54. వీళ్ల వ్యవహారం కూడా అచ్చం ఫిరౌనీయుల, వారి పూర్వీకుల మాదిరిగానే ఉంది. వారు కూడా తమ ప్రభువు సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చారు. అందువల్ల మేము వారి పాపాలకు గాను వారిని అంతమొందించాము. ఇంకా మేము ఫిరౌనీయులను ముంచివేశాము. వారంతా దుర్మార్గులే.

55. నిశ్చయంగా దేవుని దృష్టిలో జీవరాశులలో కెల్లా అత్యంత నీచమయినవారు సత్యాన్ని త్రోసిపుచ్చేవారే. వారింక విశ్వసించరు. 56. (ప్రవక్తా!) ఇక నీవు ఒప్పందం చేసుకున్నవారు ; తరువాత వారు ప్రతిసారీ ఒప్పందాన్ని భంగపరుస్తారు. వారికి బొత్తిగా భయం లేదు. 57. వారు గనక రణరంగంలో నీకు ఎదురుపడితే, వారి వెనుక ఉన్నవారు సయితం చూసి పలాయనం చిత్తగించేలా వారిని దండించు – ఆ విధంగా నయినా వారికి గుణపాఠం కలగవచ్చు. 58. ఒకవేళ ఏ జాతి వారయినా వాగ్దాన భంగానికి పాల్పడతారన్న అనుమానం నీకుంటే – ఉభయ వర్గాల వారు సమాన స్థితిలో ఉండేలా – వారి ఒడంబడికను వారి వైపు విసిరికొట్టు. నిశ్చయంగా దేవుడు వెన్నుపోటు పొడిచేవారిని ఇష్టపడడు.

59. సత్యతిరస్కారులు, తాము పారిపోగలమని భావించరాదు. వారు ఎన్నటికీ దేవుణ్ణి లొంగదీసుకోలేరు. 60. మీరు వారిని ఎదుర్కొనేందుకు శాయశక్తులా మీ బలాన్ని సమకూర్చుకోండి. ప్రత్యేకంగా పోషించిన గుర్రాలను సిద్ధంగా ఉంచండి. తద్వారా దైవవిరోధులలో, మీ విరోధులలో, మీకు తెలియకుండా దైవానికి మాత్రమే తెలిసివున్న ఇతర విరోధులలో కూడా భయం ఉండటానికి. మీరు దైవమార్గంలో ఏం ఖర్చుచేసినా అది మీకు పూర్తిగా ఇవ్వబడుతుంది. మీకెలాంటి అన్యాయం జరగదు. 61. ఒకవేళ వారు సంధికి మొగ్గుచూపితే, నీవు కూడా దానికి సుముఖత చూపు. దేవునిపై భారం మోపు. నిశ్చయంగా ఆయన అంతా వినేవాడు. అన్నీ తెలిసినవాడు. 62. ఒకవేళ వారు నిన్ను మోసగించదలిస్తే, నీకు దేవుడే చాలు. ఆయనే

తన తోడ్పాటు ద్వారా, విశ్వాసుల ద్వారా నిన్ను బలోపేతం చేశాడు. 63. ఇంకా వారి హృదయాలను కలిపాడు. ఒకవేళ నీవు భూమండలంలో ఉన్నదంతా ఖర్చుచేసినా వారి హృదయాలను కలపలేకపోయేవాడివి. అయితే దేవుడు వారిమధ్య ఐకమత్యాన్ని సృజించాడు. నిశ్చయంగా ఆయన (తన ప్రణాళికా రచనలో) తిరుగులేనివాడు, వివేకవంతుడు.

64. ఓ ప్రవక్తా! నీకు అల్లాహ్‌యే చాలు. ఇంకా నీ వెంట ఉన్న విశ్వాసులు (చాలు). 65. ఓ ప్రవక్తా! విశ్వాసులను ధర్మయుద్ధానికై ప్రేరేపించు. మీలో గనక ఇరవైమంది ధైర్యస్థయిర్యాలు కలవారుంటే వారు రెండొందల మందిని ఓడిస్తారు. ఒకవేళ మీరు వందమంది ఉంటే వెయ్యిమంది తిరస్కారులపై ప్రాబల్యం వహిస్తారు. ఎందుకంటే వారు అవగాహన లోపించిన జనులు. 66. ఇప్పుడు దేవుడు మీపై గల ఒత్తిడిని తగ్గించాడు. మీలో కొంత బలహీనత ఉన్న విషయాన్ని ఆయన పసిగట్టాడు. కనుక ఇప్పుడు మీలో వందమంది ధైర్యస్థయిర్యాలు గలవారుంటే, వారు రెండొందల మందిని జయించగలరు. ఒకవేళ వెయ్యిమంది ఉంటే వారు దైవాజ్ఞానుసారం రెండువేల మందిని జయిస్తారు. దేవుడు సహన స్థయిర్యాలు గల వారికి తోడుగా ఉంటాడు.

67. రాజ్యంలో రక్తపాతంతో కూడిన యుద్ధం జరగనంత వరకూ యుద్ధఖైదీలను తన వద్ద ఉంచుకోవటం ఏ ప్రవక్తకూ శోభించదు. మీరు ప్రాపంచిక సాధన సంపత్తులపై మోజుపడుతున్నారు. కాని దేవుడు (మీ కోసం) పరలోకాన్ని కోరుకుంటున్నాడు. దేవుడు అపార శక్తిమంతుడు, వివేకవంతుడు. 68. ఒకవేళ దేవుని తరఫున ముందునుండే ఒకటి లిఖించబడి ఉండకపోతే, మీరు అవలంబించిన దానికిగాను, మీకు కఠిన శిక్ష విధించబడేది. 69. కాబట్టి (యుద్ధప్రాప్తిగా) ఇప్పుడు మీరు సాధించుకున్న సొమ్మును తినండి. అది మీకు ధర్మసమ్మతం, పరిశుద్ధం. దైవానికి భయపడండి. నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు.

70. ఓ ప్రవక్తా! నీ చేతికి చిక్కిన ఖైదీలతో ఇలా అను : 'దేవుడు మీ మనసులలో ఏదన్నా మంచి ఉన్నట్లు గమనిస్తే మీ వద్ద నుండి పుచ్చుకున్న దానికన్నా మేలైనదే ఆయన మీకు ఇస్తాడు. మిమ్మల్ని క్షమిస్తాడు. దేవుడు క్షమాశీలుడు, దయాశీలుడు. 71. ఒకవేళ వారు నీకు నమ్మక ద్రోహం చేసినట్లయితే, గతంలో వారు దేవుని పట్ల కూడా ద్రోహం తలపెట్టి ఉన్నారు. దానికి శాస్తిగానే దేవుడు వారిని నీ చెప్పుచేతల్లో ఉంచాడు. దేవుడు జ్ఞాన సంపన్నుడు, వివేకధనుడు.

72. నిశ్చయంగా విశ్వసించి, వలసపోయినవారు, తమ ధన ప్రాణాలతో పోరాడినవారు, వారికి ఆశ్రయమిచ్చి సహాయపడినవారు – వారంతా పరస్పరం స్నేహితులు. కాని ఎవరయితే విశ్వసించినప్పటికీ వలసపోలేదో, వారు తమ స్వస్థలాలను వదలి మీ వద్దకు రానంతవరకూ వారితో మీకెలాంటి స్నేహబంధం ఉండదు. అయితే ధార్మిక వ్యవహారంలో వారెప్పుడు మీ సహాయం కోరినా మీరు వారికి తప్పనిసరిగా సహాయం చేయాలి. కాని మీతో ఒడంబడిక చేసుకుని ఉన్న వారికి వ్యతిరేకంగా మాత్రం సహాయపడకూడదు. మీ కార్యకలాపాలన్నింటినీ దేవుడు చూస్తూనే ఉన్నాడు. 73. సత్యతిరస్కారులు ఒండొకరికి స్నేహితులు. మీరు కూడా ఇలాగే వ్యవహరించకపోతే భువిలో ఉపద్రవం జనిస్తుంది. పెద్ద కల్లోలమే ప్రబలుతుంది.

74. ఎవరు విశ్వసించి హిజ్రత్ చేశారో, దైవమార్గంలో పోరాటం సాగించారో, మరెవరయితే (ముహాజిర్లకు) ఆశ్రయమిచ్చి ఆదుకున్నారో – ఇలాంటివారే నిజమయిన విశ్వాసులు. వారికి క్షమాభిక్షతో పాటు, గౌరవ ప్రదమయిన జీవనోపాధి కూడా ఉంటుంది. 75. మరెవరయితే తరువాతి కాలంలో విశ్వసించి, హిజ్రత్ చేశారో, మీతో కలసి పోరాడారో – వారూ మీలోని వారే. కాని దైవగ్రంథం ప్రకారం రక్త సంబంధీకులు పరస్పరం ఎక్కువ హక్కుదారులు. నిశ్చయంగా దైవానికి ప్రతిదీ తెలుసు.

# 9. అత్ తౌబా (పశ్చాత్తాపం)

1. మీరు ఒడంబడిక చేసుకున్న బహుదైవోపాసకులతో ఇకమీదట ఎలాంటి పొత్తు ఉండబోదని దేవుని తరఫున, దైవప్రవక్త తరఫున స్పష్టంగా ప్రకటించబడుతోంది. 2. కనుక మీరు రాజ్యంలో నాలుగు మాసాల వరకూ నిరాటంకంగా తిరుగాడండి. తెలుసుకోండి! మీరు దేవుణ్ణి అశక్తుణ్ణి చేయలేరు. దేవుడు సత్యతిరస్కారులను పరాభవం పాల్జేస్తాడు. 3. దేవుని తరఫున, దైవప్రవక్త తరఫున పెద్ద హజ్జ్ దినాన ప్రజలకు ఇందుమూలంగా ప్రకటించ బడునదేమనగా; దేవుడు మరియు దైవప్రవక్త బహు దైవారాధకుల రక్షణకు బాధ్యత వహించరు. మీరు గనక పశ్చాత్తాపపడితే అది మీకే మంచిది. ఒకవేళ మీరు పెడసరి వైఖరిని అవలంబిస్తే మీరు దేవుణ్ణి లొంగదీసుకోలేరన్న సంగతిని తెలుసుకోండి. (ప్రవక్తా!) సత్య తిరస్కారులకు బాధాకరమయిన యాతన ఉందనే శుభవార్తను వినిపించు. 4. అయితే మీతో ఒడంబడిక చేసుకున్న బహుదైవారాధకులు గనక మీకు ఎలాంటి హాని కలిగించకుండా, మీకు వ్యతిరేకంగా ఎవరికీ తోడ్పడకుండా ఉంటే వారి ఒడంబడికను వ్యవధి పూర్తయ్యేవరకూ కొనసాగించండి. నిశ్చయంగా దేవుడు భక్తి పరాయణులను ప్రేమిస్తాడు.

5. ఇక నిషిద్ధ మాసాలు గడచిన తరువాత ముష్రిక్కులు ఎక్కడ కనబడితే అక్కడే సంహరించండి. ఎక్కడ తారసపడితే అక్కడే వారిని పట్టుకోండి. వారిని ముట్టడించండి. ప్రతి చోటా వారి కోసం మాటేసి కూర్చోండి. తరువాత వారు గనక పశ్చాత్తాపపడితే, నమాజ్‌ను స్థాపిస్తే, జకాత్‌ని చెల్లిస్తే వారి దారిన వారిని పోనివ్వండి. దేవుడు క్షమాశీలి, దయాశీలి. 6. ఒకవేళ బహుదైవారాధకులలోని ఏ వ్యక్తి అయినా నీ శరణు కోరితే, అతను దైవవాక్కును వినగలందులకు అతనికి ఆశ్రయం కల్పించు. ఆ తర్వాత అతన్ని సురక్షితంగా అతని గమ్యస్థానానికి చేర్చాలి. ఎందుకంటే వారు తెలియని వారు.

7. దేవునితోనూ, దైవప్రవక్తతోనూ బహుదైవారాధకులకు ఒప్పందం ఏమిటి? అది ఏ విధంగా సమంజసం? కాకపోతే మస్జిదె హరామ్ వద్ద మీతో ఒప్పందం జరిగి ఉన్నవారు, మీతో సజావుగా వ్యవహరించినంత వరకూ మీరూ వారితో సజావుగానే వ్యవహరించండి. నిశ్చయంగా దేవుడు దైవభీతిపరులను ఇష్టపడతాడు. 8. అసలు వారితో పొత్తు ఎలా కుదురు తుంది? వారికి మీపై ఏ కాస్త అదుపు అజమాయిషీ లభించినా వారు మీ పట్ల ఎలాంటి బంధుత్వ సంబంధాన్నీ గౌరవించరు. ఒప్పంద మర్యాదను కూడా ఖాతరు చేయరు. వారు మూజువాణిగా మిమ్మల్ని సంతృప్తపరచదలుస్తున్నారు. కాని వారి హృదయాలు మాత్రం సమ్మతించటం లేదు. వారిలో అత్యధికులు వాగ్దాన భంగానికి ఒడిగట్టేవారే. 9. వారు దైవ వాక్యాలను అత్యల్పమయిన మూల్యానికి అమ్ముకున్నారు. దైవమార్గం నుండి (జనులను) అడ్డుకుంటారు. వారి నిర్వాకం చాలా చెడ్డది. 10. ఏ విశ్వాసి వ్యవహారంలోనయినా వారు బంధుత్వాన్నిగానీ, ఒడంబడికను గానీ ఖాతరు చేయరు. వీరు బరితెగించినవారు. 11. వారు గనక పశ్చాత్తాపపడితే, నమాజును స్థాపిస్తే, జకాత్ చెల్లిస్తే వారు మీ ధార్మిక సోదరులవుతారు. తెలుసుకోగల జనులకు మేము మా నియమాలను ఇలాగే విడమరచి చెబుతాము.

12. ఒకవేళ వారు ఒడంబడిక జరిగిన మీదట తమ ప్రమాణాలను భంగపరిస్తే, మీ ధర్మంలో తప్పులెన్నితే అవిశ్వాస నాయకులతో యుద్ధం చేయండి. ఇక వారి ప్రమాణాలకు ఏ విలువా ఉండదు (బుద్ధి చెప్పిన మీదటే) బహుశా వారు దారికి రావచ్చు. 13. ఏమిటి, ఆడిన మాటను తప్పిన వారితో, ప్రవక్తను రాజ్యం నుండి వెళ్ళగొట్టే దుస్సాహసానికి ఒడిగట్టిన వారితో మీరు పోరాడరా? మొదటిసారి మీపై కయ్యానికి కాలు దువ్వింది కూడా వారే కదా! ఏమిటి, వారంటే మీకు భయమా? నిజానికి మీరు భయపడవలసింది దైవానికే. మీరు గనక విశ్వాసులయితే (ఈ యదార్థాన్ని గ్రహించండి). 14. వారితో యుద్ధం చేయండి. దేవుడు మీ చేతుల మీదుగా

వారిని శిక్షిస్తాడు. వారిని పరాభవం పాల్జేస్తాడు. వారికి వ్యతిరేకంగా మీకు సహాయం చేస్తాడు. విశ్వాసుల గుండెలను చల్లబరుస్తాడు. 15. వారి హృదయాల్లోని క్రోధాగ్నిని ఆర్పుతాడు. దేవుడు తాను కోరినవానికి పశ్చాత్తాపం చెందే భాగ్యం ప్రసాదిస్తాడు. దేవుడు మహా జ్ఞాని, మహా వివేకి.

16. ఏమిటి, మిమ్మల్ని ఇట్టే వదలివేయటం జరుగుతుందని భావిస్తున్నారా? వాస్తవానికి మీలో సిసలయిన యోధులెవరో, దైవాన్ని, దైవప్రవక్తను, తోటి విశ్వాసులను తప్ప మరెవరినీ తమ ప్రాణమిత్రులుగా చేసుకోని వారెవరో దేవుడు ఇంకా పరీక్షించనే లేదు. మీరు చేసేదంతా దేవుడు కనిపెట్టుకునే ఉన్నాడు.

17. బహుదైవారాధకులు తమ తిరస్కార వైఖరికి తాము స్వయంగా సాక్షులుగా ఉన్నప్పుడు దేవుని మస్జిదుల నిర్వహణా బాధ్యతను చేపట్టే అర్హత వారికి ఎంతమాత్రం లేదు. వారి కర్మలన్నీ వ్యర్థమైపోయాయి. వారు ఎల్లకాలం నరకాగ్నిలో ఉంటారు. 18. దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించి, నమాజును స్థాపించి, జకాత్‌ను చెల్లించి, దైవానికి తప్ప వేరితరులకు భయపడకుండా ఉండేవారు మాత్రమే దేవుని మస్జిదుల నిర్వహణకు తగినవారు – ఇలాంటివారే సన్మార్గగాములవుతారని ఆశించవచ్చు. 19. ఏమిటి, మీరు హజ్జ్ యాత్రీకులకు నీరు త్రాపటాన్ని, మస్జిదె హరామ్ నిర్వహణా సేవలు చేయటాన్ని, దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించి, దైవమార్గంలో పోరాడేవానితో సమానంగా పరిగణిస్తున్నారా? దేవుని దృష్టిలో వీరిరువురూ సమానులు కారు. దేవుడు దుర్మార్గులకు సన్మార్గం చూపడు. 20. విశ్వసించి, దైవమార్గంలో ప్రస్థానం (హిజ్రత్) చేసి, దైవమార్గంలో తమ ధనప్రాణాలకు ఒడ్డి పోరాడిన వారికి దేవుని వద్ద గొప్ప అంతస్తు ఉంది. ఇలాంటివారే సఫలీకృతులు. 21. వారి ప్రభువు వారికి తన కారుణ్యం, ప్రసన్నత, శాశ్వత అనుగ్రహాలతో కూడిన స్వర్గవనాల శుభవార్తను అందజేస్తున్నాడు. 22. వాటిలో వారు కలకాలం ఉంటారు. నిశ్చయంగా దేవుని వద్ద గొప్ప ప్రతిఫలం ఉంది.

23. విశ్వసించిన ఓ ప్రజలారా! మీ పెద్దలు, మీ సహోదరులు గనక విశ్వాసానికి బదులు అవిశ్వాసాన్ని ప్రియతమంగా భావిస్తున్నట్లయితే వారిని మీ స్నేహితులుగా చేసుకోకండి. మీలో ఎవరయినా వారిని గనక స్నేహితులుగా చేసుకుంటే, అలాంటివారే దుర్వర్తనులు. 24. వారికి చెప్పు: "ఒకవేళ మీ తండ్రులు, మీ కుమారులు, మీ సహోదరులు, మీ భార్యలు, మీ దగ్గరి బంధువులు, మీరు సంపాదించిన మీ ఆస్తిపాస్తులు, కుంటుపడుతుం దేమోనని మీరు భయపడుతున్న మీ వర్తకం, మీరు ఇష్టపడే మీ లోగిళ్ళు – ఇవన్నీ మీకు దేవుడు, దైవప్రవక్త, దైవమార్గంలో సలిపే పోరాటం కంటే ప్రియతమమైనవైతే, దేవుడు తన తీర్పును పంపేవరకు నిరీక్షించండి. దేవుడు అవిధేయ జనులకు మార్గదర్శకత్వం వహించడు.

25. నిశ్చయంగా దేవుడు పలు సందర్భాలలో మీకు సహాయం చేసి ఉన్నాడు – హునైన్ (సంగ్రామం జరిగిన) దినాన మీరు మీ అధిక సంఖ్యను చూసుకుని మితిమీరిన ధీమాతో ఉన్నప్పుడు కూడా. కాని మీ అధిక సంఖ్య మీకేవిధంగానూ పనికి రాలేదు. భూమి ఎంతో విశాలంగా ఉండి కూడా మీ కొరకు ఇరుకైపోయింది. మీరు వెన్నుచూపి లగెత్తారు. 26. ఆ తరువాత దేవుడు తన ప్రవక్తపై, విశ్వాసులపై తన తరఫున ప్రశాంత స్థితిని నెలకొల్పాడు. మీకు కానరాని సేనా వాహినిని దింపాడు. ఆ విధంగా దేవుడు సత్య తిరస్కారులను శిక్షించాడు. తిరస్కారులకు తగిన శాస్తి ఇదేను. 27. ఆ తరువాత దేవుడు తాను కోరిన వారికి పశ్చాత్తాపపడే సద్బుద్ధిని వొసగుతాడు. దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు. 28. ఓ విశ్వాసులారా! నిశ్చయంగా బహు దైవోపాసకులు అపరిశుద్ధులు. కనుక వారు ఈ ఏడాది తరువాత మస్జిదె హరామ్ దరిదాపుల్లోకి కూడా రాకూడదు. ఒకవేళ మీకు దారిద్ర్యం చుట్టుకుంటుందేమోనన్న భయం ఉంటే, దైవం తలిస్తే ఆయన తన అనుగ్రహంతో మిమ్మల్ని స్థితిమంతుల్ని చేస్తాడు. నిశ్చయంగా దేవుడు అన్నీ తెలిసినవాడు, వివేక సంపన్నుడు.

29. గ్రంథం ప్రసాదించబడిన వారిలో ఎవరయితే దైవాన్ని, అంతిమ

దినాన్ని విశ్వసించరో, దైవం మరియు దైవ సందేశహరుడు నిషిద్ధం (హరామ్) గా ఖరారు చేసిన వాటిని నిషిద్ధంగా పరిగణించరో, ఇంకా సత్యధర్మాన్ని తమ జీవన ధర్మంగా అంగీకరించరో – వారు తమ స్వహస్తాలతో జిజ్యాను చెల్లించి, మీకు లోబడి ఉండనంత వరకూ వారితో యుద్ధం చేయండి.
30. 'ఉజైర్ దేవుని కుమారుడ'ని యూదులు అంటారు. 'మసీహ్ (క్రీస్తు) దేవకుమారుడ'ని క్రైస్తవులు అంటారు. ఇవి వారి నోటి మాటలే. తమ పూర్వీకులయిన సత్య తిరస్కారులు పలికిన మాటలనే వీళ్ళూ అనుకరిస్తున్నారు. దేవుడు వారిని నాశనం చెయ్య! వారెటు తచ్చాడుతున్నారు?
31. వారు నిజ దైవాన్ని కాదని తమ పండితులను, సన్యాసులను తమ ప్రభువులుగా చేసుకున్నారు – మర్యమ్ కుమారుడైన మసీహ్‌ను కూడా. వాస్తవానికి వారికి ఒక్కడైన దైవాన్ని మాత్రమే ఆరాధించమని ఆదేశించటం జరిగింది. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. వారు కల్పించే భాగస్వామ్యాల నుండి ఆయన పరమ పవిత్రుడు.

32. వారు దేవుని జ్యోతిని తమ నోటితో ఊది ఆర్పివేయాలను కుంటున్నారు. కాని దేవుడు తన జ్యోతిని పరిపూర్ణం చేయనంత వరకు ఊరుకోడు – సత్య తిరస్కారులకు అది ఎంతగా సహించరానిదయినా సరే.
33. ఆయనే తన సందేశహరునికి మార్గదర్శకత్వాన్ని, సత్యధర్మాన్ని ఇచ్చి పంపాడు – దానిని ఇతర మత ధర్మాలన్నింటిపై పై చేయిగా చేయటానికి. ఇది బహు దైవారాధకులకు జీర్ణం కాకపోయినా సరే!

34. ఓ విశ్వాసులారా! గ్రంథవహుల్లోని ఎందరో పండితులు, మతాచార్యులు అక్రమ పద్ధతిలో ప్రజల సొమ్మును స్వాహా చేస్తున్నారు. ప్రజలను దైవమార్గం నుండి ఆపుతున్నారు. ఎవరయితే వెండీ బంగారాలను ప్రోగుచేసి ఉంచుతారో, వాటిని దైవమార్గంలో ఖర్చుచేయరో, వారికి వ్యధాభరితమయిన శిక్ష కలదనే శుభవార్తను అందజెయ్యి. 35. ఆ రోజు ఆ సొమ్ముపైన నరకాగ్ని రాజేయబడుతుంది. దాంతో వారి నొసళ్ళపై, పార్శ్వాలపై, వీపులపై వాతలు వేయబడతాయి. 'మీరు మీ కోసం కూడబెట్టు

కున్నదే ఇది. మీరు కూడబెడుతూ వచ్చిన దానిని ఇప్పుడు రుచి చూడండి' అని వారితో అనబడుతుంది.

36. నిశ్చయంగా నెలల లెక్క దేవుని దృష్టిలో – దైవగ్రంథంలో – పన్నెండు నెలలే. ఆయన భూమ్యాకాశాలను సృష్టించిన నాటి నుండీ ఈ లెక్క ఇలాగే ఉంది. వీటిలో నాలుగు నెలలు నిషిద్ధమయినవి (పవిత్రమైనవి). ఇదే స్థిరమయిన సంవిధానం. కాబట్టి మీరు వీటిలో మీ ఆత్మలకు అన్యాయం చేసుకోకండి. బహుదైవారాధకులంతా ఒక్కటై మీతో ఎలా పోరాడుతున్నారో అలాగే మీరు కూడా వారితో పోరాడండి. దేవుడు భక్తిపరులకు తోడుగా ఉన్నాడని తెలుసుకోండి. 37. నెలలను ఇష్టమొచ్చినట్లు (వెనక్కీ, ముందుకీ) జరపటం తిరస్కార వైఖరిలో మరో అదనపు వెకిలి చేష్ట. దీనివల్ల తిరస్కారులు మరింతగా భ్రష్టుపట్టే ప్రమాదం ఉంది. వారు ఒక్కో సంవత్సరం నిషిద్ధ మాసాన్ని ధర్మసమ్మతం చేసేసుకుంటారు. ఒక్కో సంవత్సరం దానిని నిషిద్ధంగా ఖరారు చేసుకుంటారు. ఈ విధంగా దేవుడు నిషేధించిన వాటి లెక్కను పూర్తి చేసుకుని, మరో వైపు ఆయన నిషేధించిన వాటిని ధర్మసమ్మతంగా కూడా చేసుకోవాలని వారిలా చేస్తారు. వారి దురాగతాలు వారికి అందమైనవిగా చేయబడ్డాయి. దేవుడు తిరస్కార జనులకు మార్గదర్శకత్వం వహించడు.

38. ఓ విశ్వాసులారా! మీకేమైపోయింది? 'దైవమార్గంలో బయలు దేరండి' అని మీతో అన్నప్పుడు మీరు నేలకు అతుక్కుపోతారేమిటి? ఏమిటి, మీరు పరలోకానికి బదులు ప్రాపంచిక జీవితంతోనే సంతృప్తి చెందారా? పరలోకంతో పోల్చుకున్నప్పుడు ప్రాపంచిక జీవిత సామగ్రి బహు స్వల్పం. 39. మీరు గనక బయలుదేరకపోతే దేవుడు మిమ్మల్ని బాధాకరమయిన శిక్షకు గురిచేస్తాడు. మీ స్థానంలో ఆయన మరో జాతిని తీసుకువస్తాడు. మీరు దైవానికి ఎలాంటి కీడు కలిగించలేరు. దేవుడు ఏదయినాసరే చేయగల దిట్ట. 40. మీరు గనక దైవప్రవక్తకు సహాయం చేయకపోతే (ఒక విషయం గుర్తుంచుకోండి), తిరస్కారులు అతనిని వెళ్ళగొట్టినపుడు దేవుడు ఖుద్దుగా

అతనికి సహాయపడ్డాడు. అతను వారిద్దరిలో రెండవవాడు మాత్రమే. వారిరువురూ గుహలో ఉన్నప్పుడు, అతను తన సహచరునితో, 'దుఃఖించకు. అల్లాహ్ మనకు తోడుగా ఉన్నాడు' అని ఓదార్చుతున్నప్పుడు – అల్లాహ్ యే అతనిపై తన తరఫున ప్రశాంతతను అవతరింపజేశాడు. మీకు కానరాని సైన్యాలతో అతనికి తోడ్పడ్డాడు. ఆ విధంగా దేవుడు సత్యతిరస్కారుల వాక్కును అవనతం చేశాడు. దైవవాక్కు మాత్రమే ఉన్నతికి చేరుకుంది. దేవుడు అపార శక్తిమంతుడు, వివేక సంపన్నుడు.

41. తేలిగ్గా అయినాసరే బరువుగా అయినాసరే బయల్దేరండి. మీ ధన ప్రాణాలతో దైవమార్గంలో పోరాడండి. మీరు గనక తెలుసుకోగలిగితే ఇదే మీ కొరకు మేలైనది. 42. ఒకవేళ తొందరగా లాభం చేకూరి, ప్రయాణం తేలిగ్గా ఉంటుందనుకుంటే వారు తప్పకుండా నీ వెంట వచ్చేవారే. కాని ఈ మజిలీ వారికి కష్టంగా తోచింది. ఇప్పుడు వారు దేవునిపై ప్రమాణం చేసి 'మా వల్ల వీలుపడితే మేము తప్పకుండా మీ వెంట వచ్చేవారం' అని చెబుతారు. వారు తమను తాము వినాశానికి లోను చేసుకుంటున్నారు. వారు చెప్పేది అబద్ధం అన్న సంగతి దైవానికి తెలుసు.

43. (ఓ ప్రవక్తా!) దేవుడు నిన్ను క్షమించుగాక! నిజం చెప్పేవారెవరో, అబద్ధాలకోరులెవరో నీ సమక్షంలో రూఢీ అవకుండానే నీవు వారికి అనుమతిని ఎందుకు ప్రదానం చేసినట్టు? 44. ఎవరయితే దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసిస్తారో, వారెన్నడూ తమ ధన ప్రాణాలతో పోరాడటం నుండి తప్పించుకునేందుకు అభ్యర్థించుకోరు. భక్తిపరాయణుల గురించి దైవానికి బాగా తెలుసు. 45. దైవాన్ని, అంతిమదినాన్ని విశ్వసించని వారు మాత్రమే నీ నుండి సెలవు కోర్తారు. వారి హృదయాలు సంశయానికి లోనై ఉన్నాయి. ఆ సంశయంలోనే వారు ఊగిసలాడుతున్నారు. 46. వారే గనక బయలుదేరాలనుకుంటే తప్పకుండా వీలైన ప్రయాణ సన్నాహాలు చేసుకునేవారే. కాని వారు బయలుదేరటాన్ని దేవుడే ఇష్టపడలేదు. అందుకే

వారిలో స్తబ్ధతను ఆవరింపజేశాడు. 'కూర్చుని ఉండేవాళ్ళతో మీరూ కూర్చొని ఉండండి' అని వారితో అనబడింది.

47. ఒకవేళ వారు మీతో బయల్దేరివచ్చినా మీలో విచ్ఛిన్నాన్ని పెంచటం తప్ప మరొకటి చేసేవారు కాదు. వారు మీ మధ్య కలతలు రేపేందుకు పాదరసంలా పారుతారు. మీలో వారి చెప్పుడు మాటలు వినేవారు కూడా ఉన్నారు. దుర్మార్గుల గురించి దేవునికి బాగా తెలుసు. 48. వారు గతంలోనూ ఉపద్రవానికి యత్నించి ఉన్నారు. నీ పథకాలను తలక్రిందులు చేస్తూ వచ్చారు. ఎట్టకేలకు సత్యం వచ్చేసింది. దైవాజ్ఞే ఆధిపత్యం వహించింది – అది వారికి మింగుడు పడకపోయినప్పటికీ.

49. 'మాకు సెలవు ఇవ్వండి. మమ్మల్ని పరీక్షకు లోను చెయ్యకండి' అని అనేవారు కూడా వారిలో ఉన్నారు. వినండి! వారెలాగూ పరీక్షకు లోనయ్యారు. సత్య తిరస్కారులను నరకం ముట్టడించటం తథ్యం. 50. నీకేదన్నా మంచి జరిగితే అది వారిని బాధిస్తుంది. ఒకవేళ నీకేదన్నా ఆపద ఎదురయితే, 'మేము ముందుగా జాగ్రత్తపడ్డాము కాబట్టి సరిపోయింది' అని హర్షాతిరేకంతో మరలుతారు. 51. వారికి చెప్పు : 'దేవుడు మాకు వ్రాసిపెట్టి ఉన్నదే మాకు ఎదురవుతుంది. ఆయనే మా సంరక్షకుడు. విశ్వాసులు ఆయన్నే నమ్ముకోవాలి.' 52. ఇలా అను : 'మీరు మా విషయంలో రెండు మేళ్లలో ఏదో ఒక మేలు కోసం నిరీక్షిస్తున్నారు. కాని మేము మీ విషయంలో ఒకే ఒక్క విషయం కొరకు నిరీక్షిస్తున్నాము – దేవుడు తన తరఫున మీపై శిక్షను పంపిస్తాడా లేక మా చేతుల మీదుగా శిక్షిస్తాడా అన్నదే. కనుక మీరూ నిరీక్షించండి. మీతో పాటుగా మేమూ నిరీక్షిస్తూ ఉంటాము.'

53. వారితో అను : 'మీరు ఇష్టపూర్వకంగా ఖర్చుపెట్టినా, అయిష్టంగా ఖర్చుపెట్టినా అది మీ నుండి స్వీకరించబడదు. నిశ్చయంగా మీరు అవిధేయజనులు. 54. వారి ఖర్చు స్వీకారయోగ్యం కాకపోవటానికి ప్రధాన కారణమేమంటే వారు దైవాన్ని, దైవప్రవక్తను తిరస్కరించారు. వారు నమాజుకు

వచ్చినా మరీ బద్ధకంతో వస్తారు. (దైవమార్గంలో) ఖర్చుపెట్టినా అయిష్టంగానే ఖర్చుపెడతారు. 55. మీరు వారి సిరిసంపదలకు, వారి సంతానానికి ఏమాత్రం ప్రాధాన్యత ఇవ్వకండి. వాటి ద్వారా ఈ ప్రాపంచిక జీవితంలోనే వారిని శిక్షించాలని, వారి ప్రాణాలుపోయినా అవిశ్వాస స్థితిలోనే పోవాలని దేవుడు కోరుకుంటున్నాడు. 56. తాము మీలోని వారమేనని వారు దేవునిపై ప్రమాణం చేసి మరీ చెబుతారు. కాని వాస్తవానికి వారు మీలోని వారు కారు. కాకపోతే మీరంటే వారికి భయముంది, అంతే. 57. ఒకవేళ వారికి ఏదయినా తల దాచుకునే చోటు దొరికితే లేదా ఏదయినా గుహ లేదా తలదూర్చి కూర్చునే స్థలం దొరికితే లగెత్తుకు వెళ్ళి అందులో దాక్కుంటారు.

58. దానధర్మాల పంపకం విషయంలో నిన్ను ఎత్తిపొడిచే వారు కూడా వారిలో కొందరున్నారు. అందులో నుండి వారికి ఇస్తే సంతోషిస్తారు. ఇవ్వకపోతే కినుక వహిస్తారు. 59. దైవం మరియు దైవప్రవక్త వారికి ఇచ్చిన దాంతో వారు సంతృప్తి చెంది, 'మాకు దేవుడే చాలు. దేవుడు తన అనుగ్రహంతో మాకు మరింతగా ప్రసాదిస్తాడు. ఆయన ప్రవక్త కూడా మాకు ఇస్తాడు. మేము దేవుని వైపునకే మొగ్గుతున్నామ'ని వారు అని ఉంటే ఎంత బాగుండేది! 60. దానాలు (జకాత్ సొమ్ములు) కేవలం వీరికి మాత్రమే చెందాలి : నిరుపేదలు, అగత్యపరులు, జకాత్ వసూళ్ళ నిమిత్తం నియమితులైన కార్యకర్తలు, మనసులను జయించవలసి ఉన్నవారు, బానిసత్వం నుండి విముక్తి పొందవలసి ఉన్నవారు, అప్పుల భారం క్రింద నలిగిపోతున్నవారు, దైవమార్గం కొరకు, బాటసారుల సహాయార్థం. ఇది దేవుని తరఫున నిర్ధారించబడిన విధి. దేవుడు జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు.

61. దైవప్రవక్తకు మనస్తాపం కలిగించేవారు కూడా వారిలో కొందరున్నారు. 'ఈయన గారు చెప్పుడు మాటలు వింటాడ'ని వారంటారు. వారికి చెప్పు : 'అతను ఏది విన్నా అది మీ శ్రేయం కొరకే అయి ఉంటుంది. అతను దైవాన్ని విశ్వసిస్తాడు. విశ్వసించిన వారిపై నమ్మకం ఉంచుతాడు. మీలోని విశ్వాసుల పాలిట అతను కారుణ్యమూర్తి. మరెవరయితే దైవప్రవక్తకు

మనస్తాపం కలిగిస్తారో వారికి బాధాకరమయిన శిక్ష ఉంటుంది.' 62. వారు మిమ్మల్ని సంతోషపరచటానికి మీ సమక్షంలో అదేపనిగా దేవుని మీద ప్రమాణాలు చేస్తారు. వారు నిజమయిన విశ్వాసులే అయితే వారి ఈ సంతోషపరిచే యత్నాలకు దైవం, దైవసందేశహరులే ఎక్కువ హక్కుదారులు. 63. ఎవడు దైవాన్ని, దైవప్రవక్తను ఎదిరించినా అతని కొరకు నరకాగ్ని సిద్ధంగా ఉంటుందని, అందులో అతను శాశ్వతంగా పడి ఉంటాడని వారికి తెలియదా? ఇది అత్యంత ఘోరమయిన అవమానం. 64. తమ హృదయాలలో ఉన్న రహస్యాలను బట్టబయలుచేసే సూరా ఏదయినా విశ్వాసులపై అవతరిస్తుందేమోనని కపటులు భయపడిపోతున్నారు. వారికి చెప్పు : 'మీరు పరిహసిస్తూనే ఉండండి. మీరు దేని గురించి భయపడుతున్నారో దానిని దేవుడు ఎలాగూ బహిర్గతం చేస్తాడు. 65. ఏమిటిదంతా? అని నీవు వారిని ప్రశ్నిస్తే, 'ఏదో వేళాకోళానికి, నవ్వులాటకు అలా అన్నామ'ని అంటారు. వారితో అను : 'ఏమిటి, మీరు దేవునితో, దైవవచనాలతో, ఆయన ప్రవక్తతో పరిహాసమాడుతున్నారా? 66. కుంటిసాకులు చెప్పకండి. మీరు విశ్వసించిన మీదట తిరస్కార వైఖరికి ఒడిగట్టారు. మేము మీలోని ఒక వర్గం వారిని మన్నించి వదలిపెట్టినా, మరోవర్గం వారిని తప్పక శిక్షిస్తాము. ఎందుకంటే వారు నేరస్తులు.'

67. కపటులైన పురుషులు, కపటులైన స్త్రీలు – అందరూ ఒకే తరహాకు చెందినవారు. వారు చెడులు చెయ్యమని ఆదేశిస్తారు. మంచి నుండి వారిస్తారు. తమ చేతులను బంధించి ఉంచుకుంటారు. వారు దైవాన్ని మరచిపోయారు. అందువల్ల దేవుడు కూడా వీళ్ళను విస్మరించాడు. నిశ్చయంగా కపటులు అవిధేయతలో బాగా ముదిరిపోయారు. 68. కపటులైన పురుషులతో, కపటులైన స్త్రీలతో, సత్య తిరస్కారులతో దేవుడు నరకాగ్ని వాగ్దానం చేశాడు. వారందులో సదా ఉంటారు. వారికదే చాలు. వారిపై దేవుని అభిశాపం ఉంది. స్థిరంగా ఉండే యాతన వారిని చుట్టుకుంటుంది. 69. మీ పరిస్థితి కూడా అచ్చం మీ పూర్వీకులలాగే ఉంది.

వారు మీకన్నా ఎక్కువ బలవంతులు. సిరిసంతానాదులలో మిమ్మల్ని మించిపోయినవారే. వారు తమ వంతు లబ్ధిని పొందారు. మీ పూర్వీకులు తమ వంతు సుఖాలను జుర్రుకున్నట్లే మీరు కూడా మీ వంతు సుఖాన్ని జుర్రుకున్నారు. వారేవిధమయిన పిడివాదన చేసేవారో మీరూ అదేవిధమయిన పిడివాదన చేశారు. ఇలాంటివారి కర్మలు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ వ్యర్థమై పోయాయి. ఇలాంటివారే నష్టపోయేవారలు. 70. ఏమిటి, తమకు పూర్వం గతించిన జాతుల సమాచారం వారికి చేరలేదా? – నూహ్, ఆద్, సమూద్ జాతులు, ఇబ్రాహీమ్ జాతివారి, మద్‌యన్ వారి, తలక్రిందులుగా చేయబడిన బస్తీల వారి (వృత్తాంతం వారికి అందలేదా?) వారివద్దకు వారి ప్రవక్తలు నిదర్శనాలతో సహా వచ్చారు. దేవుడు వారికెలాంటి అన్యాయం చేయలేదు. కాని వారే తమ ఆత్మలకు అన్యాయం చేసుకుంటూ ఉండేవారు.

71. విశ్వాసులైన పురుషులు, విశ్వాసులైన స్త్రీలు ఒకరికొకరు సహాయకులు. వారు మంచిని గురించి ఆజ్ఞాపిస్తారు. చెడు నుండి నిరోధిస్తారు. నమాజును స్థాపిస్తారు. జకాత్ చెల్లిస్తూ ఉంటారు. దైవానికి, దైవప్రవక్తకు విధేయులై ఉంటారు. దేవుడు తన దయాదాక్షిణ్యాలను వర్షింపజేసేది ఇలాంటివారిపైనే. నిశ్చయంగా దేవుడు సర్వశక్తిమంతుడు, వివేకవంతుడు. 72. దేవుడు విశ్వసించిన పురుషులకు, విశ్వసించిన స్త్రీలకు క్రింద సెలయేరులు ప్రవహించే స్వర్గవనాల వాగ్దానం చేశాడు. వాటిలో వారు శాశ్వతంగా ఉంటారు. ఇంకా శాశ్వతంగా ఉండే ఆ ఉద్యాన వనాలలో నిర్మలమైన నివాస గృహాల వాగ్దానం కూడా ఉంది. వీటన్నింటికంటే గొప్పదైన దైవ ప్రసన్నత ప్రాప్తమవుతుంది. ఇదే మహా గొప్ప సాఫల్యం.

73. ఓ ప్రవక్తా! సత్య తిరస్కారులతో, కపట విశ్వాసులతో పోరాడు. వారిపట్ల కఠినంగా వ్యవహరించు. వారి నివాస స్థలం నరకం. అది అత్యంత చెడ్డ స్థలం. 74. తాము ఆ విధంగా అనలేదని వారు దేవునిపై ప్రమాణం చేస్తున్నారు. వాస్తవానికి వారు అవిశ్వాసంతో కూడిన మాట అన్నారు. వారు ఇస్లాం స్వీకరించిన మీదట తిరస్కారానికి పాల్పడ్డారు. వారు కోరుకున్నది

వారికి దక్కలేదు. దేవుడు, ఆయన ప్రవక్త తన అనుగ్రహంతో వారిని సుసంపన్నుల్ని చేసినందుకేనా ఈ 'ప్రతిఫలం'? వారు గనక పశ్చాత్తాపపడితే అది వారికే శ్రేయస్కరం. ఒకవేళ వారు లక్ష్యపెట్టకపోతే దేవుడు ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వారిని బాధాకరమయిన శిక్షకు లోను చేస్తాడు. భువిలో వారిని ఆదుకునే నాథుడుగానీ, సహాయకుడుగానీ ఎవడూ ఉండడు.

75. వారిలో (కపట విశ్వాసులలో) మరికొందరున్నారు – 'దేవుడే గనక తన అనుగ్రహంతో మాకు ప్రసాదిస్తే మేము ఉదారంగా దానధర్మాలు చేస్తాము. సజ్జనుల మాదిరిగా ఉంటాము' అని వారు దేవునితో వాగ్దానం చేశారు. 76. కాని దేవుడు తన అనుగ్రహంతో వారికి కలిమిని ప్రసాదించి నపుడు వారు పిసినారితనం చూపారు. చాలా నిర్లక్ష్యంగా తమ వాగ్దానం నుండి తిరిగిపోయారు. 77. ఫలితంగా దేవుడు వారి హృదయాలలో కపట బుద్ధిని నాటాడు. వారు దైవాన్ని కలుసుకునే దినం వరకూ అది వారిలో తిష్ఠవేసి ఉంటుంది. వారు దేవునితో చేసిన వాగ్దానాన్ని నెరవేర్చని కారణంగానూ, అబద్ధాలు చెప్పినందువల్లనూ వారికి ఈ దురవస్థ పట్టింది. 78. ఏమిటి, దేవునికి వారి లోపాయికారి వ్యవహారాలన్నీ, వారి రహస్య మంతనాలన్నీ తెలుసు అన్న సంగతి వారికి తెలీదా? నిశ్చయంగా దేవుడు అగోచర విషయాలన్నీ ఎరిగినవాడు. 79. వారు మనస్ఫూర్తిగా దానధర్మాలు చేసే విశ్వాసులను ఎత్తిపొడుస్తున్నారు. తాము చెమటోడ్చి సంపాదించిన దానితో సంతృప్తి చెందే స్వాభిమానులను వారు పరిహసిస్తున్నారు. దేవుడు ఈ పరిహాసకులను పరిహసిస్తున్నాడు. వారికి వ్యధాభరితమయిన యాతన తథ్యం. 80. (ఓ ప్రవక్తా!) నీవు వారి క్షమాపణపై ప్రార్థించినా, ప్రార్థించక పోయినా, వారి క్షమాపణ కోసం నీవు డెబ్బయిసార్లు ప్రార్థించినా దేవుడు వారిని క్షమించడు. ఎందుకంటే వారు దైవాన్ని, ఆయన ప్రవక్తను తిరస్కరించారు. దేవుడు అవిధేయ జనులకు మార్గదర్శకత్వం వహించడు.

81. వెనుక ఉండిపోయినవారు, దైవప్రవక్త వెనుక కూర్చుని ఉండే అవకాశం దొరికినందుకు సంబరపడిపోయారు. దైవమార్గంలో తమ

ధనప్రాణాలతో పోరాడటం వారికి సుతరామూ ఇష్టం లేదు. పైగా వారు 'ఇంత తీవ్రమైన వేసవిలో వెళ్ళకండి' అంటూ ఉచిత సలహాలు ఇచ్చారు. వారికి చెప్పు : "నరకాగ్ని దీనికంటే ఎక్కువ వేడిగా ఉంటుంది." వారు దీనిని అర్థం చేసుకుంటే ఎంత బావుండేది! 82. కాబట్టి ఇప్పుడు వారు సముపార్జించిన దానికిగాను తక్కువగా నవ్వాలి. ఎక్కువగా ఏడ్వాలి. 83. ఒకవేళ దేవుడు నిన్ను వీరిలోని ఏ వర్గం వారి వద్దకయినా వాపసు తీసుకువస్తే, అప్పుడు వారు గనక యుద్ధానికి వెళ్ళటానికి నీ అనుమతి కోరితే, వారితో ఇలా చెప్పేసేయ్ : 'మీరు ఇక నా వెంట ఎప్పటికీ రాకూడదు. నాతో కలసి శత్రువుతో పోరాడనూ రాదు. మీరు మొదటిసారి కూడా కూర్చుని ఉండటానికే ఇష్టపడ్డారు. ఇప్పుడు కూడా మీరు వెనుక ఉండేవారితోనే కూర్చుని ఉండండి.' 84. వారిలో ఎవరు మరణించినా నీవు వారి అంత్యక్రియల నమాజ్ చెయ్యకు. వారి సమాధి వద్ద నిలబడకు. ఎందుకంటే వారు దైవాన్ని, దైవప్రవక్తను తిరస్కరించినవారు. అవిధేయులుగా ఉన్న స్థితిలోనే వారు మరణించారు.

85. వారి సిరిసంపదలు, వారి సంతానం నిన్ను ఆశ్చర్యానికి లోను చెయ్యరాదు. దేవుడు వీటిద్వారా ఈ ప్రపంచంలోనే శిక్షించాలని, వారు సత్యతిరస్కారులుగా ఉన్న స్థితిలోనే వారి ప్రాణాలు పోవాలని అభిలషిస్తు న్నాడు. 86. 'దైవాన్ని విశ్వసించండి. ఆయన ప్రవక్తతో కలిసి పోరాటం సలపండి' అని ప్రేరేపించే అధ్యాయం ఏదయినా అవతరించినపుడు వారిలోని స్థితిమంతులు నీ దగ్గరకు వచ్చి అనుమతి కోర్తారు. 'ఇక్కడ ఆగి ఉండేవారితో పాటే మమ్మల్ని ఆగి ఉండేలా విడిచిపెట్టు' అంటారు. 87. వెనుక ఉండిపోయే ఆడవారితో పాటే వారు ఉండిపోవటానికి ఇష్టపడ్డారు. వారి హృదయాలపై సీలు వేయబడింది. ఇక వారేమీ అర్థం చేసుకోలేరు. 88. కాని ప్రవక్తను, అతనితో పాటే విశ్వసించిన వారిని చూడండి – వారు తమ ధన ప్రాణాలతో పోరాడారు. ఇలాంటివారే సదాచరణ గలవారు. సాఫల్యం పొందేది కూడా వారే. 89. దేవుడు వారి కోసం క్రింద సెలయేరులు ప్రవహించే స్వర్గవనాలను సిద్ధంగా ఉంచాడు. వాటిలో వారు కలకాలం కళకళలాడుతూ ఉంటారు. ఇదే మహా గొప్ప సాఫల్యం.

90. పల్లెటూరి అరబ్బుల్లో నుండి కూడా కుంటిసాకులు చెప్పేవారు వచ్చి సెలవు ఇవ్వమని కోరారు. దేవునితో, దైవప్రవక్తతో అబద్ధం చెప్పినవారు ఎలాగూ కూర్చుండిపోయారు. వారిలో తిరస్కార వైఖరికి పాల్పడిన వారికి బాధాకరమయిన శిక్ష చుట్టుకోవటం ఖాయం. 91. ఇకపోతే బలహీనులు, రోగగ్రస్తులు, ఖర్చుపెట్టడానికి ఏమీ లేనివారు – వారు గనక దైవం యెడల, దైవప్రవక్త యెడల శ్రేయోభిలాషులై ఉంటే అలాంటివారు నిందార్హులు కారు. సదాచార సంపన్నులపై ఆరోపణకు తావు ఉండదు. దేవుడు క్షమాశీలుడు, కరుణాసాగరుడు. 92. నీ దగ్గరకు వచ్చి తమకు వాహనాలు సమకూర్చమని ప్రాధేయపడేవారిపై కూడా అభిశంసకు ఎలాంటి ఆస్కారం లేదు. 'మీకు ఇచ్చి పంపటానికి నా వద్ద వాహనమేదీ లేద'ని నీవు వారితో అన్నప్పుడు, అయ్యో! మేము ఏదన్నా త్యాగం చేయటానికి మా వద్ద ఏమీలేదే! అన్న బాధతో వారు కంట తడి పెట్టుకుని వెనుతిరిగిపోతారు. 93. అన్నీ ఉండి కూడా అనుమతిని కోరేవారు మాత్రమే అసలు నిందార్హులు. వెనుక ఉండిపోయే ఆడంగులతో ఉండిపోవటానికే వారు ఇష్టపడ్డారు. దేవుడు వారి హృదయాలకు సీలు వేశాడు. ఇక వారు తెలుసుకోరు.

◆ (11) 94. మీరు (యుద్ధం నుండి) వారివద్దకు తిరిగి వచ్చినపుడు వారు మీ సమక్షంలో సాకుల చిట్టా విప్పుతారు. వారికి చెప్పు : "సాకులు కట్టిపెట్టండి. మీ మాటలను మేము నమ్మబోము. నిశ్చయంగా దేవుడు మీ లోగుట్టునంతా మాకు ఎరుకపరిచాడు. ఇక మీదట దైవం మరియు దైవప్రవక్త మీ ప్రవర్తనను గమనిస్తూ ఉంటారు. ఆ తరువాత మీరంతా గోచర అగోచర విషయాలను ఎరిగినవాని వైపునకు మరలించబడతారు. మీరు చేసినదంతా అప్పుడు ఆయన మీకు తెలియపరుస్తాడు.' 95. మీరు తిరిగి వచ్చినపుడు వారు మీ సమక్షంలో దేవునిపై ప్రమాణం చేస్తారు – మీరు వారి యెడల మన్నింపుల వైఖరిని అవలంబించాలని! మొత్తానికి మీరు వారి పట్ల చూసీ చూడనట్లుగానే వ్యవహరించండి. వారు పరమ చెండాలురు. వారు సముపార్జించిన దాని ఫలితంగా నరకమే వారి నివాసం. 96. మిమ్మల్ని ప్రసన్నుల్ని చేసుకునేందుకు వారు మీ సమక్షంలో ప్రమాణాలు చేస్తారు.

ఒకవేళ మీరు వారి పట్ల ప్రసన్నులయినా దేవుడు మాత్రం అవిధేయజనుల పట్ల సుతరామూ ప్రసన్నుడవడు.

97. పల్లెటూరి బైతులు అవిశ్వాసంలో, కపటత్వంలో కరడు గట్టినవారు. దేవుడు తన ప్రవక్తపై అవతరింపజేసిన దాని పరిధికి వారు వెలుపల ఉండటం ఒకందుకు మంచిదే. దేవుడు గొప్ప జ్ఞాని, మహా వివేకి.
98. ఈ పల్లెటూరి బైతులలో కొందరున్నారు. దైవమార్గంలో తాము చేస్తున్న ఖర్చును వారొక జరిమానాగా భావిస్తున్నారు. మీపై గడ్డుకాలం ఎప్పుడొస్తుందా? అని వారు ఎదురు చూస్తున్నారు. గడ్డుకాలం వారిపైనే వ్రేలాడుతూ ఉంది. దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు.
99. ఈ పల్లె జనులలో దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసించేవారు కూడా ఉన్నారు. తాము దైవమార్గంలో చేస్తున్న ఖర్చును వారు దైవ సాన్నిహిత్యానికి, దైవప్రవక్త దీవెనలకు సాధనంగా తలపోస్తున్నారు. నిశ్చయంగా అది వారి పాలిట సామీప్య సాధనమే. దేవుడు ఎలాగూ వారిని తన కారుణ్యంలో ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కనికరించేవాడు.

100. ముహాజిర్లలో, అన్సార్లలో విశ్వాస భాగ్యాన్ని ఆస్వాదించటంలో ముందంజవేసిన ప్రథమశ్రేణి ధన్య జీవులు, చిత్తశుద్ధితో వారిని అనుసరించిన వారు – దేవుడు వారి యెడల ప్రసన్నుడయ్యాడు. వారు దేవుని యెడల సంతుష్టులయ్యారు. దేవుడు వారి కొరకు క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలను సిద్ధం చేసి ఉంచాడు. వారందులో సదా – శాశ్వతంగా – ఉంటారు. ఇదే గొప్ప సాఫల్యం. 101. మీ చుట్టు ప్రక్కల ఉన్న పల్లెటూరి జనులలో కొందరు కపటులు (మునాఫిక్‌లు) ఉన్నారు. మదీనా వాసులలో కూడా కొందరు కపటులు ఉన్నారు. వారు కాపట్యంపై పాతుకుపోయారు. వాళ్ళ సంగతి నీకు తెలియదు. మాకు వాళ్ళ సంగతి బాగా తెలుసు. మేము వారికి రెట్టింపు శిక్ష విధిస్తాము. తరువాత వారు వ్యథాభరితమయిన శిక్ష వైపునకు తరలించబడతారు.

102. తమ తప్పులను ఒప్పుకున్న వారు మరి కొందరున్నారు. వారి కర్మలు మిశ్రమమైనవి – కొన్ని సత్కర్మలు. మరికొన్ని దుష్కర్మలు.

దేవుడు వారి వైపు దయాభావంతో మరలే అవకాశం ఉంది. నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు. 103. నీవు వారి సంపదల నుండి సదఖా తీసుకుని, తద్వారా వారిని పరిశుద్ధపరచు. వారి జీవితాలను తీర్చిదిద్దు. వారి కోసం ప్రార్థించు. నిశ్చయంగా నీ ప్రార్థన వారికి సుఖశాంతులనిస్తుంది. దేవుడు అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు. 104. ఏమిటి, దేవుడే తన దాసుల పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడని, ఆయనే వారి దానధర్మాలకు ఆమోద ముద్రవేస్తాడని వారికి తెలియదా? 105. వారితో అను : "ఆచరించి చూపండి. దేవుడు, దైవప్రవక్త, విశ్వాసులు మీ ఆచరణలను గమనిస్తూ ఉన్నారు. దరిమిలా మీరు గోచర అగోచర విషయాలన్నింటినీ ఎరిగిన వాని వైపునకు మరలించబడతారు. మీరేమేమి చేస్తూ ఉండేవారో ఆయన మీకు తెలియపరుస్తాడు. 106. మరి కొంతమంది ఉన్నారు – వారి వ్యవహారం దైవాజ్ఞ వచ్చేవరకూ నిలిపివేయబడింది. ఆయన వారిని శిక్షించనూవచ్చు లేదా క్షమించి వదలిపెట్టనూవచ్చు. దేవుడు జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు.

107. వారిలో (ఆ వంచకులలో) మరికొందరున్నారు; వారు (ముస్లిం సముదాయానికి) నష్టం కలిగించటానికి, అవిశ్వాసానికి ఒడిగట్టడానికి, విశ్వాసులలో చీలిక తీసుకురావటానికి, ముందునుంచే దేవునితో, దైవప్రవక్తతో పోరాడే వానికి ఆశ్రయం కల్పించటానికి వారు ఒక మస్జిద్‌ని నిర్మించారు. మేము మేలు కోరి ఇలా చేశామని వారు ప్రమాణాలు చేస్తారు. వారు అబద్ధాలకోరులన్న విషయానికి దేవుడే సాక్షి. 108. నీవు ఆ కట్టడంలో ఎన్నడూ నిలబడకు. అయితే తొలినాటి నుండే దైవభీతి ప్రాతిపదికపై నిర్మించబడిన మస్జిద్ నీవు నిలబడటానికి అన్నివిధాలా తగినది. పరిశుద్ధతను ఇష్టపడేవారు అందులో ఉన్నారు. పరిశుద్ధతను అవలంబించే వారంటే దేవునికి ఎంతో ఇష్టం. 109. తన కట్టడ పునాదిని దైవభీతి, దైవప్రసన్నతలపై ఉంచినవాడు ఉత్తముడా? లేక తన కట్టడ పునాదిని కూలిపోవటానికి సిద్ధంగా ఉన్న పర్వత కనుమ అంచున ఉంచినవాడు ఉత్తముడా? ఆ తరువాత అది అతన్ని తీసుకుని నరకాగ్నిలో కూలిపోయింది. దేవుడు దుర్మార్గ జనులకు సన్మార్గం చూపడు. 110. వారు నిర్మించిన ఆ కట్టడం ఎల్లకాలం వారి

మనసులను మథనపడేలా చేస్తూనే ఉంటుంది. ఒకవేళ వారి హృదయాలు పగిలి తునాతునకలైపోతే అది వేరే విషయం. దేవుడు సర్వజ్ఞాని, మహా వివేకి.

111. నిశ్చయంగా దేవుడు విశ్వాసుల నుండి వారి ధన ప్రాణాలను స్వర్గానికి బదులుగా కొనుగోలు చేశాడు. వారు దైవమార్గంలో పోరాడుతారు. చంపుతారు, చంపబడతారు. ఇది దేవుని తరఫున ఉన్న సత్య వాగ్దానం – తౌరాతులోనూ, ఇంజీలులోనూ, ఖుర్‌ఆన్‌లోనూ. వాగ్దానాన్ని నెరవేర్చటంలో దైవాన్ని మించిన వాడెవడు? కాబట్టి మీరు దేవునితో చేసిన ఈ వ్యవహారానికి గాను సంతోషపడండి. ఇదే ఆ గొప్ప విజయం. 112. వారు పశ్చాత్తాపం చెందేవారై ఉంటారు. ఆరాధనలు చేసేవారై ఉంటారు. దైవస్తోత్రం చేసేవారు, దైవమార్గంలో సంచరించేవారై ఉంటారు. దైవసమక్షంలో వినమ్రులై వంగేవారు, సాష్టాంగపడేవారై ఉంటారు. మంచిని చెయ్యమని ఆదేశించేవారు, చెడుల నుండి నిరోధించేవారై ఉంటారు. దేవుని హద్దులను కాపాడే వారై ఉంటారు. (ఓ ప్రవక్తా! ఇలాంటి) విశ్వాసులకు శుభవార్తను వినిపించు.

113. బహుదైవారాధకులు సమీప బంధువులయినాసరే – వారు నరకానికి పోయేవారన్న విషయం స్పష్టం అయిపోయిన మీదట, వారి క్షమాభిక్షకై దైవాన్ని ప్రార్థించటం దైవప్రవక్తకుగానీ, విశ్వాసులకుగానీ ఎంతమాత్రం శోభించదు. 114. ఇబ్రాహీమ్ తన తండ్రి క్షమాపణకై ప్రార్థించా డంటే అతను తండ్రికిచ్చిన మాటకు కట్టుబడి అలా చేశాడు. అయితే తన తండ్రి దైవవిరోధి అన్న సంగతి రూఢీ అయిన తరువాత అతనితో తెగతెంపులు చేసుకున్నాడు. నిశ్చయంగా ఇబ్రాహీమ్ మృదు మనస్కుడు, సహనశీలుడు. 115. నిశ్చయంగా దేవుడు ఏ జాతివారికయినా మార్గదర్శకత్వం వహించిన తరువాత, వారు జాగ్రత్తపడవలసిన విషయాలను వారికి కూలంకషంగా వివరించనంతవరకూ, వారిని మార్గవిహీనతకు లోను చెయ్యడు. నిశ్చయంగా దేవుడు ప్రతి విషయం తెలిసినవాడు. 116. నిశ్చయంగా భూమ్యాకాశాలలో దేవుని సార్వభౌమత్వమే ఉంది. ఆయనే జీవనదానం చేస్తున్నాడు. ఆయనే చంపుతున్నాడు. ఆ దేవుడు తప్ప మీకు మరో స్నేహితుడు గానీ, సహాయకుడు గానీ లేడు.

117. నిశ్చయంగా దేవుడు తన ప్రవక్త వైపునకు, కష్టకాలంలో తన ప్రవక్తను వెన్నంటి ఉన్న ముహాజిర్ల, అన్సార్ల వైపునకు దయతో మరలాడు. తరువాత వారిలో కొందరి హృదయాలు వక్రతవైపు మొగ్గటానికి సిద్ధంగా ఉన్నప్పుడు కూడా దేవుడు వారిపై దయదలిచాడు. నిశ్చయంగా దేవుడు కనికరం కలవాడు, కృపాసాగరుడు. 118. ఏ ముగ్గురి వ్యవహారం ప్రక్కన పెట్టబడిందో వారిపై కూడా ఆయన దయతో మరలాడు. భూమి ఎంతో విశాలంగా ఉండి కూడా వారికి ఇరుకైపోయింది. స్వయంగా వారి ప్రాణాలే వారికి బరువైపోయాయి. అలాంటి పరిస్థితిలో దేవుని పట్టునుండి తమను కాపాడుకోవటానికి దేవుని శరణు వేడటం తప్ప మార్గాంతరం లేదని వారు అర్థం చేసుకున్నారు. అప్పుడు దేవుడు వారి వైపు దయతో మరలాడు – వారు ఆయన వైపు పశ్చాత్తాపంతో మరలగలందులకు. నిశ్చయంగా దేవుడు పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడు, దయ చూపేవాడూను.

119. ఓ విశ్వాసులారా! దైవానికి భయపడండి. సత్యవంతులకు చేదోడు వాదోడుగా ఉండండి. 120. దైవప్రవక్తను విడిచిపెట్టి వెనుక కూర్చుండిపోవటం, తమ ప్రాణాలను అతని (ప్రవక్త) ప్రాణం కన్నా మిన్నగా ఎంచటం మదీనా వాసులకుగానీ, చుట్టుప్రక్కల ఉండే పల్లెటూరి బైతులకు గానీ శోభాయమానం కాదు. ఎందుకంటే దైవమార్గంలో వారికి దప్పికగొన్నా, అలసట కలిగినా, ఆకలిగొన్నా, సత్య తిరస్కారులలో దడ పుట్టించేలా కదము తొక్కినా – ఎందు కాలిడినా – శత్రువుల నుండి వారు (యుద్ధప్రాప్తిగా) ఏ వస్తువును కొల్లగొట్టినా – ఇలా ఒక్కొక్కదానికి ఒక్కో సత్కార్యం వారి పేర లిఖించబడుతుంది. నిశ్చయంగా దేవుడు సదమరవర్తనుల సదాచరణను వృధా కానివ్వడు. 121. వారు (దైవమార్గంలో) చిన్న ఖర్చుచేసినా, పెద్ద ఖర్చుచేసినా, వారు ఏ మైదానాన్ని దాటిపోయినా – అదంతా వారి పేర వ్రాయబడుతుంది – దేవుడు వారి సదాచరణకుగాను అత్యుత్తమ ప్రతిఫలం ఇవ్వటానికి.

122. విశ్వాసులంతా కట్టకట్టుకుని (యుద్ధానికి) బయలుదేరటం సాధ్యం కాదు. కనుక వారి ప్రతి వర్గం నుండి కొంతమంది బయలుదేరి,

ధర్మావగాహనను పెంపొందించుకుని, తిరిగి వెళ్ళి తమ వర్గం వారికి భయబోధ చేయాల్సింది. అలాచేస్తే బహుశా వారు కూడా ధర్మ నిష్ఠను అలవరచుకునేవారు. కాని అలా ఎందుకు జరగలేదు?

123. ఓ విశ్వాసులారా! మీ సమీపంలో ఉన్న సత్య తిరస్కారులతో పోరాడండి. వారు మీలోని పరాక్రమాన్ని తెలుసుకోవాలి. దేవుడు భక్తికలవారికి తోడుగా ఉంటాడని తెలుసుకోండి. 124. ఏదైనా సూరా అవతరించినపుడు వారిలోని (కపటులలోని) కొందరు, "ఇంతకీ ఇది మీలోని ఎవరి విశ్వాసాన్ని అధికం చేసింది?" అని ఎద్దేవా చేస్తారు. వాస్తవానికి అది విశ్వసించినవారి విశ్వాసాన్ని అధికం చేసింది. దానికి వారు సంతోషిస్తున్నారు. 125. మరెవరి హృదయాలలో (కాపట్య) రోగం ఉందో, అది వారిలోని మాలిన్యంపై మరింత మాలిన్యాన్ని పేర్చింది. వారు చచ్చేదాకా సత్య తిరస్కారులుగానే ఉంటారు. 126. ఏమిటి, వారు ప్రతి సంవత్సరం ఒకసారో, రెండుసార్లో పరీక్షించ బడటాన్ని గమనించటం లేదా? అయినా వారు పశ్చాత్తాపపడటం గానీ, గుణపాఠం నేర్చుకోవటంగానీ చేయటం లేదు. 127. ఏదైనా సూరా అవతరింపజేయబడినపుడు వారు ఒకరినొకరు చూసుకుంటారు–ఎవడయినా తమను చూడటం లేదు కదా! అన్నది దాని అంతరార్థమై ఉంటుంది. ఆ తరువాత అక్కణ్ణుంచి మెల్లగా జారుకుంటారు. దేవుడు వారి హృదయాలను త్రిప్పివేశాడు. ఎందుకంటే వారు అర్థం చేసుకునే జనులు కారు.

128. మీ వద్దకు ఒక ప్రవక్త విచ్చేశాడు. అతను స్వయంగా మీలోనివాడే. మీరు నష్టానికి లోనవటం అతన్ని తీవ్రంగా బాధిస్తుంది. అతను మీ మేలును తీవ్రంగా కాంక్షిస్తున్నాడు. విశ్వాసుల పాలిట అతను అమిత వాత్సల్యం కలవాడు, కారుణ్యమూర్తి. 129. అప్పటికీ వారు గనక విముఖత చూపితే వారితో ఇలా అను : "నాకు అల్లాహ్ చాలు. ఆయన తప్ప మరో దేవుడు లేడు. నేను ఆయన్నే నమ్ముకున్నాను. ఆయనే మహోన్నత సింహాసనానికి (అర్ష్‌కు) అధిపతి.

# 10. యూనుస్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ రా. ఇవి వివేకవంతమైన గ్రంథసూక్తులు. 2. ఏమిటీ, మేము మానవులలో నుండే ఒక వ్యక్తికి దివ్య సంకేతం ఇచ్చి జనులను హెచ్చరించమని, విశ్వసించిన వారికి వారి ప్రభువు వద్ద సిసలయిన ఉన్నత స్థానం ఉందన్న శుభవార్తను వినిపించమని చెప్పటం వారికి ఆశ్చర్యం కలిగించిందా? 'ఖచ్చితంగా ఇతగాడు మాంత్రికుడే' అని తిరస్కారులన్నారు.

3. నిశ్చయంగా మీ ప్రభువు అల్లాహ్‌యే. ఆయన ఆరు దినాల (యుగాల)లో భూమ్యాకాశాలను సృష్టించాడు. తరువాత ఆయన అర్ష్ (సింహాసనం) పై స్థిరపడ్డాడు. ఆయనే వ్యవహారాల నిర్వాహకుడు. ఆయన ఆనతి లేకుండా (ఆయన సమ్ముఖంలో) సిఫారసు చేయగలవాడు ఎవడూ లేడు. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. కనుక మీరు ఆయననే సేవించండి. ఏమిటి, మీరు ఆలోచించరా? 4. ఆయన వైపునకే మీరంతా మరలిపోవలసి ఉంది. దేవుని ఈ వాగ్దానం సత్యం. ఆయనే పుట్టుకను ఆరంభిస్తాడు. మరోసారి కూడా ఆయనే పుట్టిస్తాడు – విశ్వసించి, సదాచరణ చేసిన వారికి న్యాయ సమ్మతంగా ప్రతిఫలం ఇవ్వటానికి. తిరస్కరించిన వారికి, వారి తిరస్కారానికి బదులుగా మరిగే నీరు, వ్యథాభరితమయిన యాతన ఉంటుంది.

5. ఆయనే సూర్యుణ్ణి ప్రకాశమానంగా, చంద్రుణ్ణి కాంతిమంతంగా చేశాడు. చంద్రుని మజిలీలను నిర్ధారించాడు – మీరు సంవత్సరాల గణనను, లెక్కను తెలుసుకోవటానికి! అల్లాహ్ ఇదంతా లక్ష్యరహితంగా చేయలేదు. బుద్ధిజీవుల కొరకు ఆయన తన సూచనలను విశదీకరిస్తున్నాడు. 6. నిశ్చయంగా రేయింబవళ్ళ మార్పులో, భూమ్యాకాశాలలో దేవుడు సృష్టించిన వాటన్నింటిలో భయభక్తులు గల జనులకు పలు సూచనలున్నాయి.

7. ఎవరయితే మాతో సమావేశమవటాన్ని ఆశించటం లేదో,

ప్రాపంచిక జీవితంతోనే సంతుష్టులైపోయారో, మరెవరయితే మా సూచనల పట్ల నిర్లక్ష్యం వహించారో, 8. ఇలాంటి వారి నివాస స్థానం వారి సముపార్జన కారణంగా నరకం అవుతుంది. 9. నిశ్చయంగా ఎవరయితే విశ్వసించి, సదాచరణ చేశారో, వారి విశ్వాసం మూలంగా వారి ప్రభువు వారికి మార్గదర్శనం చేస్తాడు – అనుగ్రహాలతో నిండిన స్వర్గవనాలలోకి! వాటి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. 10. 'అల్లాహ్! నీవు పరమ పవిత్రుడవు' అన్న పలుకు అందులో ఎల్లెడలా మార్మోగుతూ ఉంటుంది. వారు పరస్పరం కలుసుకున్నప్పుడల్లా 'మీకు శాంతి కలుగుగాక!' అనే వాక్కుతో అభివాదం చేసుకుంటారు. 'సర్వలోక ప్రభువైన అల్లాహ్‌కే స్తోత్రాలు' అనేది వారి తుది పలుకు అయి ఉంటుంది.

11. ప్రజలకు మేలును కలిగించటంలో వేగిరపడినట్లే దేవుడు వారికి కీడును కలిగించటంలో కూడా వేగిరపడితే వారి గడువు ఎప్పుడో పూర్తయి పోయి ఉండేది. అయితే మేము, మాతో సమావేశమవటం పట్ల ఆశాభావం లేనివారికి, వారి తలబిరుసుతనంలో తచ్చాడుతూ ఉండేలా వదలిపెడు తున్నాము. 12. మనిషి పరిస్థితి ఎటువంటిదంటే, అతనికేదయినా బాధ కలిగినప్పుడు నిలుచుని ఉన్నా, కూర్చుని ఉన్నా, పరుండినా మమ్మల్ని మొరపెట్టుకుంటూనే ఉంటాడు. తరువాత మేము అతని బాధను అతన్నుండి తొలగించగానే, తనకు ఎదురయిన ఏ ఆపద సమయంలోనూ అసలు మమ్మల్ని మొరపెట్టుకోనే లేదన్నట్లుగా వ్యవహరిస్తాడు. ఈ విధంగా బరితెగించిపోయే వారికి వారి చేష్టలు ఇంపైనవిగా చేయబడ్డాయి.

13. మేము మీకు పూర్వం ఎన్నో తరాల వారిని, వారి దౌర్జన్య వైఖరి మూలంగా తుదముట్టించాము. వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చారు. అయినా వారు విశ్వసించిన వారు కాలేదు. మేము అపరాధ జనులకు ఇలాంటి ప్రతిఫలాన్నే ఇస్తాము. 14. మరి మేము వారి తర్వాత మిమ్మల్ని రాజ్యంలో వారసులుగా చేశాము – మీ నిర్వాకం ఎలా ఉంటుందో చూద్దామని.

15. వారికి మా స్పష్టమయిన ఆయతులను చదివి వినిపించినపుడు, మమ్మల్ని కలుసుకోవటంపై నమ్మకం లేనివారు, 'దీనికి బదులు మరో ఖుర్‌ఆన్ తీసుకు రాలేదా? ఇందులో మార్పులయినా చెయ్యి' అనంటారు. వారికి చెప్పు : 'నా మనసుకు తోచిన విధంగా ఇందులో మార్పులు చేయటం నా పని కాదు. నా వద్దకు పంపబడిన దివ్యవాణి (వహీ)ని యధాతథంగా అనుసరించటం వరకే నా పని. నేను గనక నా ప్రభువు ఆజ్ఞను ఎదిరిస్తే ఒక మహా (గడ్డు) దినాన పడే శిక్షకు నేను భయపడుతున్నాను.' 16. వారితో అను : ఒకవేళ దైవేచ్ఛ అదే అయివుంటే నేను దీనిని మీకు వినిపించటంగానీ, దేవుడు దీనిని గురించి మీకు తెలియపరచటంగానీ జరిగి ఉండేదే కాదు. ఇంతకుముందు నేను మీ మధ్య ఒక వయోకాలం గడిపి ఉన్నాను. అయినా మీరు బుద్ధిని ఉపయోగించరా? 17. దైవానికి అసత్యాన్ని ఆపాదించేవానికన్నా, ఆయన వచనాలను అసత్యాలని త్రోసిపుచ్చేవానికన్నా దుర్మార్గుడు ఎవడుంటాడు? నిశ్చయంగా నేరస్తులకు ఎన్నటికీ సాఫల్యం ప్రాప్తించదు.

18. వారు నిజ దైవాన్ని కాదని తమకు నష్టాన్నిగానీ, లాభాన్నిగానీ కలిగించలేని వాటిని పూజిస్తున్నారు. పైపెచ్చు, 'వీరు దైవసన్నిధిలో మాకు సిఫారసు చేస్తార'ని అంటున్నారు. వారిని అడుగు : 'ఏమిటీ, ఆకాశాలలో, భూమిలో దైవానికి తెలియనటువంటి సమాచారాన్ని మీరు ఆయనకు తెలుపగోరుతున్నారా?' వారు కల్పించే భాగస్వామ్యాలకు (షిర్క్ చేష్టలకు) ఆయన పవిత్రుడు, ఉన్నతుడు. 19. మానవులంతా (ఆదిలో) ఒకే సముదాయంగా ఉండేవారు. తరువాత వారు విభేదించుకున్నారు. ఒకవేళ నీ ప్రభువు తరఫున ముందుగానే ఒక విషయం ఖరారై ఉండకపోతే వారు విభేదించుకుంటున్న విషయమై ఎప్పుడో తీర్పు జరిగిపోయి ఉండేది.

20. ప్రవక్తపై అతని ప్రభువు తరఫు నుండి ఏదయినా సూచన ఎందుకు అవతరింపజేయబడలేదు? అని వారంటున్నారు. వారికి చెప్పు : 'అగోచర విషయాలు అల్లాహ్‌కే పరిమితం, కనుక మీరూ నిరీక్షించండి.

మీతో పాటు నేను కూడా నిరీక్షిస్తాను.' 21. కష్టాలు ఎదురయిన తరువాత మేము ప్రజలకు మా కారుణ్యం రుచిని చూపించినపుడు, వారు వెంటనే మా సూచనల విషయంలో జిత్తులు వేయటం మొదలెడతారు. వారికి చెప్పు: 'ఎత్తులు వేయటంలో దేవుడు అందరికన్నా వడిగలవాడు. నిశ్చయంగా మా దూతలు మీ జిత్తులన్నింటినీ వ్రాసుకుంటున్నారు.'

22. ఆయనే మిమ్మల్ని భూమిలోనూ, సముద్రంలోనూ సైరు చేయిస్తున్నాడు. మీరు ఓడలలో పయనమైనప్పుడు, ఓడలు జనులను మోసుకుంటూ సానుకూలమయిన పవనాలలో సాగిపోతూ ఉన్నప్పుడు (ఆ చల్లని గాలులకు) జనులు ఆనంద డోలికల్లో తేలియాడుతూ ఉంటారు. అప్పుడు అకస్మాత్తుగా గాలి ఉధృతమవుతుంది. అన్ని వైపుల నుండీ వారిపై కెరటాలు ఎగిసిపడుతుంటాయి. తాము (సముద్ర కెరటాల మధ్య దారుణంగా) చిక్కుకుపోయామని వారు భావిస్తుంటారు. ఆ క్షణంలో వారు తమ ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని ఇలా మొరపెట్టుకుంటారు : '(ఓ అల్లాహ్!) నీవు గనక ఈ గండం నుండి మమ్మల్ని గట్టెక్కిస్తే మేము నీకు కృతజ్ఞులమై ఉంటాము.' 23. తరువాత ఆయన వారిని ఆ విపత్తు నుండి రక్షించగానే వారు భువిలో అకారణంగా తిరుగుబాటు చేస్తారు. మానవులారా! మీ ఈ తిరుగుబాటు వైఖరి మీకే వ్యతిరేకంగా పరిణమిస్తుంది. (కొన్నాళ్ళపాటు) ప్రాపంచిక జీవితపు లబ్ది పొందండి. ఆ తరువాత మీరు మా వైపునకే మరలి రావలసి ఉన్నది. అప్పుడు మీరు చేసినదంతా మేము మీకు తెలియపరుస్తాము.

24. ప్రాపంచిక జీవితపు ఉపమానం నీరు వంటిది. దానిని మేము ఆకాశం నుండి కురిపించాము. తత్ఫలితంగా మనుషులకు, పశువులకు తినటానికి ఉపయోగపడే మొక్కలు భూమిలో బాగా మొలకెత్తాయి. కడకు ఆ భూమి సస్యశ్యామలంగా ముస్తాబై, అందాలు చిందుతున్నప్పుడు, ఇక ఈ పంట మా చేతికి చిక్కినట్లేనని భూమి యజమానులు అనుకుంటూ ఉంటారు. అప్పుడు అకస్మాత్తుగా దానిపై మా తరపున రాత్రి పూటనో,

పగటి పూటనో మా ఆజ్ఞ (విపత్తు) విరుచుకుపడుతుంది. అంతే! మేము దానిని కోతకోసిన చేను మాదిరిగా – అసలు నిన్న అక్కడ ఏమీ లేనట్లుగా – చేసివేశాము. ఈ విధంగా మేము ఆలోచించేవారి కొరకు మా సూచనలను విపులీకరిస్తున్నాము.

25. దేవుడు శాంతి నిలయం వైపు పిలుస్తున్నాడు. ఆయన తాను కోరిన వారికి రుజుమార్గం వైపు దర్శకత్వం వహిస్తాడు. 26. మేలు చేసిన వారికి చేసుకున్నంత మేలు, ఇంకా అధికంగా కూడా (మేలు) లభిస్తుంది. వారి ముఖారవిందాలపై నలుపుగానీ, పరాభవం గానీ ఆవరించదు. వారే స్వర్గవాసులు. వారందులో సదా ఉంటారు. 27. మరెవరయినా చెడులను సముపార్జిస్తే వారి చెడులకు సమానంగా ప్రతిఫలం ఉంటుంది. అవమానం వారిని క్రమ్ముకుని ఉంటుంది. దేవుని పట్టు నుండి వారిని రక్షించేవాడెవడూ ఉండడు. ఒకవిధంగా వారి ముఖాలు చీకటి రాత్రి దొంతరలతో కప్పబడినట్లుగా ఉంటాయి. వారే నరకవాసులు. వారందులో ఎల్లకాలం పడి ఉంటారు.

28. మేము వారందరినీ సమావేశపరిచే రోజున షిర్క్ చేసే వారితో అంటాము : "ఆగండి మీరూ, మీరు సాటి కల్పించిన వారున్నూ." ఆ తరువాత మేము వారి మధ్య వేర్పాటు చేస్తాము. వారు కల్పించిన భాగస్వాములు వారినుద్దేశించి, 'మీరు మమ్మల్ని ఆరాధించలేదు కదా! 29. మన మధ్య సాక్షిగా దేవుడే చాలు. మీరు మమ్మల్ని ఆరాధించిన సంగతి మాకస్సలు తెలీదు' అంటారు. 30. అప్పుడు ప్రతి వ్యక్తీ తాను ముందుగా చేసి పంపుకున్న కర్మలకు లోనవుతాడు. జనులు తమ నిజ రక్షకుడయిన దేవుని వైపునకు మరలించబడతారు. వారు కల్పించుకున్న అసత్యాలన్నీ వారి నుండి నిష్క్రమిస్తూ ఉంటాయి.

31. వారిని అడుగు : 'మీకు ఆకాశం నుండి, భూమి నుండి జీవనోపాధిని ప్రసాదించేవాడెవడు? మీ చెవులపై, కళ్లపై అదుపు అధికారం ఎవరికుంది? ప్రాణం లేని దాన్నుండి ప్రాణమున్న దానిని, ప్రాణమున్న

దాని నుండి ప్రాణం లేని దానిని వెలికి తీసేవాడెవడు? సమస్త వ్యవహారాల నిర్వహణకర్త ఎవరు?' **"అల్లాహ్‌యే"** అని వారు వెంటనే సమాధానమిస్తారు. 'మరైతే మీరు (ఆయనకు) భయపడరా?' అని వారిని అడుగు. 32. ఆ అల్లాహ్‌యే మీ నిజపాలకుడు. సత్యదర్శనం అయిన తరువాత మార్గభ్రష్టత తప్ప మరేముంటుంది? మరి మీరు (సత్యాన్ని వదలి) ఎటు కొట్టుకు పోతున్నారు? 33. ఇదేవిధంగా వారు విశ్వసించేవారు కారన్న నీ ప్రభువు వాక్కు పొగరుబోతుల విషయంలో సత్యమని రూఢీ అయింది.

34. వారితో అను : 'మీరు కల్పించుకున్న భాగస్వాములలో తొలిసారి సృష్టించినవాడు, మలిసారి కూడా దానిని పునరావృతం చేసేవాడు ఎవడయినా ఉన్నాడా?' ఇలా అను : అల్లాహ్‌యే తొలిసారి సృష్టిస్తాడు. మలిసారి సృష్టించేవాడు కూడా ఆయనే. మరి మీరు ఎటు తిరిగిపోతున్నారు? 35. వారిని అడుగు : 'మీ భాగస్వాములలో సత్యం వైపు మార్గదర్శకత్వం వహించే వాడెవడయినా ఉన్నాడా?' చెప్పు : 'అల్లాహ్‌యే సత్యం వైపునకు మార్గదర్శకత్వం వహిస్తాడు. అలాంటప్పుడు సత్యం వైపు దర్శకత్వం వహించేవాడు అనుసరణీయుడా? లేక మార్గదర్శకత్వం వహిస్తేనే తప్ప స్వయంగా సన్మార్గం పొందలేనివాడా? మీకేమైపోయింది? మీరు ఎలాంటి నిర్ణయాలు గైకొంటున్నారు?' 36. వారిలో అధికులు కేవలం అనుమానాలను అనుసరిస్తున్నారు? సత్యం విషయంలో అనుమానం ఏ విధంగానూ నిలువజాలదు. వారి చేష్టలన్నీ దైవానికి ఎరుకే.

37. ఈ ఖుర్‌ఆన్ దేవుడు తప్ప మరొకరి ద్వారా చేయతరం కాదు. పైగా ఇది తనకు పూర్వం ఉన్న భవిష్యవాణులను సత్యమని ధృవపరిచేది. గ్రంథానికి విపులీకరణ వంటిది. ఇది లోకేశ్వరుని తరఫున ఉందన్న విషయంలో మీమాంసకు తావే లేదు. 38. ఏమిటీ, 'ఇతనే (ప్రవక్తే) దీనిని కల్పించుకున్నాడ'ని వారంటున్నారా? వారికి చెప్పు : 'మీరు దీనిని పోలిన ఒక్క సూరానయినా (రచించి) తీసుకురండి. మీరు గనక సత్యవంతులే అయితే అల్లాహ్ తప్ప ఎవరెవరిని పిలుచుకుంటారో పిలుచుకోండి.'

39. పైగా, వారు తమ జ్ఞాన పరిధిలో లేని విషయాన్ని, తమపై తేటతెల్లం కాని యదార్థాన్ని అసత్యమని త్రోసిపుచ్చుతున్నారు. వీరికి పూర్వం గడచినవారు కూడా ఇలాగే త్రోసిపుచ్చారు. మరి దుర్మార్గులకు పట్టిన దుర్గతి ఎటువంటిదో చూడు!

40. వారిలో కొందరు ఖుర్‌ఆన్‌ను విశ్వసించేవారూ ఉన్నారు. విశ్వసించని వారు కూడా ఉన్నారు. విచ్ఛిన్నకారులెవరో నీ ప్రభువుకు బాగా తెలుసు. 41. ఒకవేళ వారు నిన్ను అసత్యవాదిగా చిత్రీకరిస్తే, వారికి ఇలా చెప్పేయి : 'నా కర్మలు నాకు. మీ కర్మలు మీకు. నా కర్మల బాధ్యత మీపై లేదు. మీ కర్మల బాధ్యత నాపై లేదు.' 42. వారిలో నీ మాటలను చెవియొగ్గి వినేవారు కూడా కొందరున్నారు. ఏమిటి, బొత్తిగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించని చెవిటివారికి నీవు వినిపిస్తావా? 43. వారిలో మరికొంద రున్నారు. వారు నిన్ను ఆసక్తితో గమనిస్తూ ఉంటారు. (కాని అది వారి నటన మాత్రమే). మరైతే నీవు కానరాని అంధులకు మార్గం చూపగలవా? 44. దేవుడు తన జనులకు రవంత అన్యాయం కూడా చేయడు. కాని జనులే తమ ఆత్మలపై అన్యాయానికి ఒడిగడుతున్నారు.

45. దేవుడు వారిని సమావేశపరిచే రోజున, దినములో ఒక గడియ కాలం కన్నా ఎక్కువ సేపు ప్రపంచంలో గడపలేదని వారికి అనిపిస్తుంది. వారు పరస్పరం గుర్తుపడతారు. దేవునితో సమావేశమవటాన్ని త్రోసిపుచ్చిన వారు ముమ్మాటికీ నష్టపోయారు. వారు సన్మార్గానికి రాలేదు. 46. మేము వారికి వాగ్దానం చేసిన దానిలో ఏ కాస్త భాగాన్ని నీకు చూపించినా లేక (అంతకుముందే) నీకు మరణ మొసగినా – వారు మరలి రావలసింది మాత్రం మా వద్దకే కదా! ఇక వారి చేష్టలన్నింటికీ దేవుడు సాక్షిగా ఉన్నాడు. 47. ప్రతి సముదాయానికీ ఒక ప్రవక్త ఉన్నాడు. వారి ప్రవక్త వారి వద్దకు వచ్చేసినపుడు వారి మధ్య న్యాయబద్ధంగా తీర్పు చేయబడుతుంది. వారికెలాంటి అన్యాయం జరగదు.

48. 'ఇంతకీ ఆ వాగ్దానం ఎప్పుడు పూర్తవుతుందో! మీరు సత్యసంధులే

అయితే (చెప్పండి)!' అని వారంటున్నారు. 49. వారితో అను : 'దైవచిత్త మయితే తప్ప నేను నా స్వయానికి కూడా ఎలాంటి మంచీ చెడులు చేసుకోలేను. ప్రతి సముదాయానికి ఒక గడియ ఉంది. ఆ గడియ వచ్చేసినపుడు అది ఒక్క క్షణం వెనకా ముందూ అవదు. 50. వారిని అడుగు: 'చెప్పండి! దైవశిక్ష మీపై రాత్రికి రాత్రే విరుచుకుపడినా లేదా పగటివేళ వచ్చిపడినా దానికంటే ముందు అపరాధులు ఏం చేసుకుంటారట!? 51. ఏమిటి, అది సంభవించినపుడే దానిని నమ్ముతారా? ఇప్పుడా ఒప్పుకునేది? దీనికోసం మహా ఆత్రం చేశారు కదా!' 52. తర్వాత దుర్వర్తనులతో ఇలా అనబడుతుంది : 'ఇప్పుడు శాశ్వతంగా ఉండే శిక్షను రుచి చూడండి. మీరు సముపార్జించుకున్న దాని ప్రతిఫలం తప్ప వేరొకటి మీకు దొరుకునా?'

53. 'ఇది నిజమేనా?' అని వారు నిన్ను అడుగుతున్నారు. వారికి చెప్పు : 'అవును. నా ప్రభువు తోడుగా! ఇది నిజం. దానిని నిలువరించే శక్తి మీలో లేదు.' 54. తన ఆత్మకు అన్యాయం చేసుకున్న ప్రతి వ్యక్తీ తన వద్ద భూమి నిండిపోయేంత ధనం ఉన్నా, దాన్నంతటినీ పరిహారంగా ఇచ్చి తాను మాత్రం విముక్తి పొందాలనుకుంటాడు. వారు ఆ శిక్షను చూసుకున్నప్పుడు తమ మనసులోనే పశ్చాత్తాపపడతారు. దరిమిలా వారి మధ్య న్యాయసమ్మతంగా తీర్పు చేయబడుతుంది. వారికెట్టి అన్యాయం జరగదు. 55. గుర్తుంచుకోండి! భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం అల్లాహ్‌దే. వినండి! దేవుని వాగ్దానం సత్యం. కాని చాలామంది దీనిని తెలుసుకోరు. 56. ప్రాణం పోసేవాడు, ప్రాణాలు తీసేవాడు ఆయనే. ఆయన వైపునకే మీరంతా మరలించబడతారు.

57. ప్రజలారా! మీ వద్దకు మీ ప్రభువు తరఫు నుండి హితోపదేశం వచ్చేసింది. ఆంతర్యాలలో తిష్ఠవేసిన వాటికి (వ్యాధులకు) అది నివారిణి (షిఫా). విశ్వసించిన వారికి మార్గదర్శనం, కారుణ్యం. 58. వారితో అను : 'ఇది దైవానుగ్రహం. దైవ కారుణ్యం. ఇందుకు గాను ప్రజలు సంబరపడాలి.

వారు కూడబెట్టే దానికంటే ఇది ఎంతో మేలైనది.' 59. వారిని అడుగు : 'మీరే చెప్పండి – దేవుడు మీ కోసం అవతరింపజేసిన జీవనోపాధిలో నుండి మీరంతట మీరే కొన్నింటిని అధర్మంగానూ, కొన్నింటిని ధర్మసమ్మతంగానూ ఖరారు చేసుకున్నారు (ఇది ధర్మమేనా)?' వారిని అడుగు : 'ఏమిటి, ఈ మేరకు దేవుడు గాని మీకు ఆజ్ఞాపించాడా? లేక మీకుగా మీరే దేవునికి అసత్యాన్ని ఆపాదిస్తున్నారా? 60. దైవానికి అసత్యాన్ని ఆపాదించేవారు ప్రళయదినం గురించి ఏమనుకుంటున్నారు? నిశ్చయంగా దేవుడు జనుల యెడల గొప్ప అనుగ్రహశీలి. కాని చాలామంది కృతజ్ఞతాపూర్వకంగా మసలుకోరు.

61. (ప్రవక్తా!) నీవు ఏ స్థితిలో ఉన్నా, ఖుర్‌ఆన్‌లోని ఏ భాగాన్ని నీవు పఠించినా, (ప్రజలారా!) మీరు ఏ పనిలో నిమగ్నులై ఉన్నా, మేము మీపై సాక్షిగా ఉంటాము – భూమ్యాకాశాలలో ఉన్న అణువంత వస్తువు అయినా – దానికంటే చిన్నదయినాసరే, దానికంటే పెద్దదయినా సరే – నీ ప్రభువు నుండి దాగి లేదు. అదొక స్పష్టమయిన గ్రంథంలో నమోదై ఉంది. 62. వినండి! దేవునికి ప్రియతములైన వారికి ఎలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు. 63. వారు విశ్వాసులై, భయభక్తులు కలవారై ఉంటారు. 64. వారికి ఇహలోక జీవితంలోనూ, పరలోక జీవితంలోనూ శుభవార్త కలదు. దేవుని మాటల్లో ఎలాంటి పరివర్తన ఉండదు. ఇదే అసలు గొప్ప విజయం. 65. (ఓ ప్రవక్తా!) వారి మాటలకు నీవు ఆవేదన చెందకు. నిశ్చయంగా సర్వాధిపత్యం దైవానికే చెందుతుంది. ఆయన సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు.

66. వినండి! భూమ్యాకాశాలలో ఉన్నదంతా దైవానికే చెందుతుంది. నిజ దైవాన్ని కాదని తాము కల్పించుకున్న సహవర్తులను పిలిచేవారు దేనిని అనుసరిస్తున్నారో తెలుసా? వారు వట్టి అనుమానాన్ని అనుసరిస్తున్నారు. వారు కేవలం ఊహాస్త్రాలను సంధిస్తున్నారు. 67. ఆయనే మీ కొరకు రాత్రిని చేశాడు – తద్వారా మీకు సౌఖ్యమబ్బాలని. ఇంకా, పగటిని ప్రకాశమానంగా చేశాడు. నిశ్చయంగా ఇందులో వినగల జనులకు సూచనలున్నాయి.

68. 'దేవుడు (తన కొరకు) కొడుకును చేసుకున్నాడ'ని వారంటున్నారు. ఆయన పరమ పవిత్రుడు. నిరపేక్షాపరుడు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం ఆయనదే. దీనికి సంబంధించిన ఏ ఆధారమూ మీ దగ్గరలేదు. ఏమిటి, దైవానికి సంబంధించి మీకు తెలియని విషయాన్ని అంటగడుతున్నారా? 69. వారికి చెప్పు : 'నిశ్చయంగా దైవానికి అసత్యాలను అంటగట్టేవారు కృతార్థులు కాలేరు. 70. వీళ్ళ కొరకు ప్రపంచంలో కొద్దిపాటి లబ్ది మాత్రమే ఉంది. తరువాత మా వైపునకే వారు మరల వలసి ఉంది. మరి మేము వారికి వారి తిరస్కారానికి బదులుగా కఠిన శిక్షను రుచి చూపిస్తాము.

71. వారికి నూహ్ సమాచారాన్ని వినిపించు. అతను తన జాతి వారితో ఇలా అన్నాడు : 'ఓ నా జాతి ప్రజలారా! నేను మీ మధ్యన నిలబడి, దైవవాక్యాల ద్వారా మీకు బోధపరచటం మీకు సహించరానిదిగా ఉంటే, నేను మాత్రం దైవాన్నే నమ్ముకున్నాను. మీరందరూ ఒక నిర్ణయానికి రండి. మీ సహవర్తులను కూడా వెంటబెట్టుకోండి. మీకు మీ ఏకాభిప్రాయంలో ఎలాంటి సంశయానికి తావుండకూడదు. ఆ తరువాత మీరు నాకు వ్యతిరేకంగా ఏం చేసుకుంటారో చేసుకోండి. నాకు వ్యవధి ఇవ్వనవసరమూ లేదు. 72. మీరు గనక విముఖత చూపేటట్లయితే, నేను మీనుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగలేదు. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌ది. విధేయత చూపేవారిలో ఒకడిని కావాలని మాత్రమే నేను ఆజ్ఞాపించబడ్డాను.' 73. అయినా వారతన్ని అసత్యవాది అంటూ త్రోసిపుచ్చారు. అందువల్ల మేము నూహునూ, అతనితో పాటు నావలో ఉన్నవారినీ రక్షించాము. వారిని వారసులుగా చేశాము. మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించిన వారిని ముంచివేశాము. చూశావుగా! హెచ్చరించబడిన వారి పర్యవసానం ఏమయిందో!

74. మరి నూహ్ తరువాత కూడా మేము ఎందరో ప్రవక్తలను వారి జాతుల వైపు పంపాము. వారు వారి వద్దకు చాలా స్పష్టమయిన నిదర్శనాలను తీసుకువచ్చారు. కాని వారు తొలుత అబద్ధమంటూ త్రోసిపుచ్చిన

దానిని మళ్లీ విశ్వసించటమంటూ జరగలేదు. ఇదే విధంగా మేము బరితెగించిన వారి హృదయాలపై ముద్ర వేసేశాము.

75. ఇక మేము వారి తరువాత మూసా హారూనులను ఫిరౌను వద్దకు, అతని సర్దారుల వద్దకు మా సూచనలను ఇచ్చి పంపాము. కాని వారు గర్వం ప్రదర్శించారు. వారసలు అపరాధ జనులు. 76. తరువాత మా తరఫు నుండి వారి వద్దకు సత్యం చేరినపుడు 'ముమ్మాటికీ ఇది మంత్రజాలమే' అని వారన్నారు. 77. మూసా ఇలా అన్నాడు : 'ఏమిటి, మీ వద్దకు వచ్చిన సత్యాన్ని మంత్రజాలమంటారా? ఇది మంత్రజాలమా? యదార్థానికి మాంత్రికులు ఎన్నటికీ కృతకృత్యులు కాలేరు.' 78. వారిలా అన్నారు : 'ఏమిటి, మా పూర్వీకులు అవలంబిస్తూ ఉండగా చూసిన మార్గం నుండి మమ్మల్ని మళ్లించటానికేనా మీరిద్దరూ మా వద్దకు వచ్చినది? ఏమిటి, ఈ రాజ్యంలో మీ పెత్తనమే నడవాలనుకుంటున్నారా? మేమెన్నటికీ మీరిరువురి మాటను నమ్మబోము.'

79. ఫిరౌన్ అన్నాడు : 'జాలవిద్యలో నిష్ణాతులైన వారందరినీ నా దగ్గరకు తీసుకు రండి.' 80. మాంత్రికులు వచ్చిన తరువాత మూసా వారితో, 'మీరు ప్రయోగించేవేవో ప్రయోగించండి' అన్నాడు. 81. మాంత్రికులు తమ జాల విద్యను ప్రయోగించగానే మూసా ఇలా అన్నాడు : 'మీరు తెచ్చినదంతా కనికట్టు మాత్రమే. నిశ్చయంగా దేవుడు దానిని మటుమాయం చేస్తాడు. ఎట్టి పరిస్థితిలోనూ దేవుడు అరాచకవాదుల కార్యాలను చక్కబరచడు. 82. దేవుడు తన అనుజ్ఞతో సత్యాన్ని సత్యంగా రూఢీ చేస్తాడు – నేరస్తులకు అది మింగుడు పడకపోయినా సరే!' 83. ఇక మూసాను అతని జాతివారిలో కొద్దిమంది యువకులు తప్ప ఎవరూ విశ్వసించలేదు – ఫిరౌను భయం వల్ల, స్వయంగా తమ జాతిలోని ప్రముఖుల భయం వల్ల – వారు తమను వేధిస్తారేమోనని! అసలే ఫిరౌను రాజ్యంలో అధికార మదాంధుడు, దానికి తోడు బరితెగించినవాడు. 84. మూసా ఇలా అన్నాడు : 'నా జాతి ప్రజలారా! మీరు నిజంగా దైవాన్ని నమ్మేవారే అయితే, చిత్తశుద్ధిగల దైవవిధేయులే

అయితే మీరు ఆయనపైనే భారం మోపండి.' 85. దానికి సమాధానంగా వారిలా అన్నారు : 'మేము అల్లాహ్‌పైనే భారం మోపాము. మా ప్రభూ! మమ్మల్ని దుర్మార్గ జనుల చేత పరీక్షించకు. 86. నీ కృపతో మమ్మల్ని తిరస్కార జనుల చెర నుండి విముక్తిని ప్రసాదించు.'

87. మేము మూసాకు, అతని సోదరునికి సంకేతం పంపాము – 'మీ జాతి వారి కొరకు ఈజిప్టులో కొన్ని గృహాలను ప్రత్యేకించుకోండి. ఆ గృహాలను మీ ఖిబ్లాగా చేసుకోండి. నమాజును స్థాపించండి. విశ్వసించిన వారికి శుభవార్తను వినిపించు.'

88. మూసా ఇలా విన్నవించుకున్నాడు : 'మా ప్రభూ! నీవు ఫిరౌనుకు, అతని సర్దారులకు ప్రాపంచిక జీవితంలో అందమైన స్థాయిని, ఐశ్వర్యాన్ని ప్రసాదించావు. ప్రభూ! వారు జనులను నీ మార్గం నుండి తప్పించటానికే ఇలా చేశావా!? మా ప్రభూ! వారి సిరిసంపదలను నాశనం చెయ్యి. బాధాకరమయిన శిక్షను చూసేవరకూ వారు విశ్వసించకుండా ఉండేలా వారి హృదయాలను కఠినంగానే ఉంచు.' 89. సెలవీయబడింది : 'మీరిద్దరి ప్రార్థన ఆమోదించబడింది. కనుక మీరిరువురూ (మీ కార్యక్రమంపై) నిలకడగా ఉండండి. అజ్ఞానులైన వారి మార్గాన్ని అనుసరించకండి.'

90. మేము ఇస్రాయీల్ సంతతి వారిని సముద్రం దాటించాము. వారిపై దౌర్జన్యం చేసి, కక్ష తీర్చుకోవాలన్న ఉద్దేశంతో ఫిరౌను, అతని సైనికులు వెంబడించారు–చివరకు ఫిరౌన్ మునిగిపోతున్నప్పుడు, "ఇస్రాయీల్ వంశీయులు నమ్ముకున్న దేవుడు తప్ప మరో ఆరాధ్య దైవం లేదని నమ్ముతున్నాను. ఇంకా నేను ఆయన విధేయులలో (ముస్లింలలో) చేరుతున్నాను' అన్నాడు. 91. 'ఇప్పుడా నమ్మేది? ఇంతకు ముందైతే తలబిరుసుగా చెలరేగిపోతూ, అరాచకవాదిగా వ్యవహరించావు కదా! 92. అందుకే ఈ రోజు మేము నీ పార్థివ శరీరాన్ని నీ భావితరాల వారికి ఒక సూచనగా భద్రపరుస్తాము' – యదార్థమేమిటంటే జనులలో అనేకులు మా సూచనల పట్ల అలసత్వం ప్రదర్శిస్తారు.

93. మేము ఇస్రాయీల్ సంతతివారికి చక్కని నివాస స్థలాన్ని ఇచ్చాము. తినటానికి పరిశుద్ధమయిన ఆహార వస్తువులను ప్రసాదించాము. కాని (విచిత్రమేమిటంటే) వారివద్దకు జ్ఞానజ్యోతి వచ్చిన మీదటే వారిలో విభేదాలు పొడసూపాయి. నిశ్చయంగా నీ ప్రభువు ప్రళయదినాన వారు విభేదించుకునే విషయమై వారి మధ్య తీర్పు చేస్తాడు. 94. మేము నీపై అవతరింపజేసిన దానిపై ఒకవేళ నీకేదన్నా సందేహముంటే, నీకు పూర్వం వచ్చిన గ్రంథాన్ని పారాయణం చేస్తున్న వారిని అడిగి తెలుసుకో. వాస్తవానికి నీ ప్రభువు తరఫు నుండి నీ వద్దకు సత్యం వచ్చేసింది. కాబట్టి నీవు శంకించేవారిలో చేరకు. 95. దైవ సూచనలను అసత్యాలంటూ కొట్టివేసిన వారిలో నీవు చేరకు. ఒకవేళ నీవలా చేశావంటే నష్టపోయినవారిలో ఒకడివవుతావు.

96. నిశ్చయంగా ఎవరి విషయంలో నీ ప్రభువు వాక్కు పూర్తయిందో, వారు ఇక విశ్వసించబోరు – 97 – వారి వద్దకు సూచనలన్నీ వచ్చేసినాసరే – వారు వ్యధాభరితమయిన యాతనను చూసుకోనంత వరకూ (అంగీక రించరు). 98. విశ్వాస ప్రకటన చేసేవారి విశ్వాసం – ఒక్క యూనుస్ జాతి వారికి తప్ప వేరితర బస్తీల వారికి లాభదాయకం కాలేకపోయింది. వారు విశ్వసించినందువల్ల మేము వారి నుండి ప్రాపంచిక జీవితంలో అవమానకరమయిన శిక్షను తొలగించాము. ఒక నిర్ణీత గడువు వరకు వారికి ప్రయోజనం పొందే అవకాశం ఇచ్చాము.

99. నీ ప్రభువే గనక కోరుకుంటే భూమండలంపై ఉన్న జనులంతా విశ్వసించేవారే. మరైతే (ఓ ప్రవక్తా!) నీవు ప్రజలను విశ్వాసులవ్వమని బలవంతం చేస్తావా ఏమి? 100. ఏ వ్యక్తి అయినాసరే దైవాజ్ఞ కానంత వరకూ విశ్వసించటమనేది అసంభవం. వివేచనతో వ్యవహరించని వారిపై దేవుడు మాలిన్యాన్ని పడవేస్తాడు.

101. (ఓ ప్రవక్తా!) వారికి చెప్పు : 'ఆకాశాలలో, భూమిలో ఉన్నవాటిని కాస్త చూడండి. అసలు విషయం ఏమిటంటే విశ్వసించని

జనులకు సూచనలుగానీ, హెచ్చరికలుగానీ ఏమాత్రం లాభం చేకూర్చవు. 102. వారు తమకు పూర్వం గడచిన వారికి ఎదురయిన రోజుల కొరకు ఎదురుచూస్తున్నారు. వారితో అను : 'మీరూ నిరీక్షించండి. నేను కూడా మీతో పాటే నిరీక్షిస్తూ ఉంటాను.' 103. తరువాత మేము మా ప్రవక్తలను, విశ్వసించిన వారిని కాపాడుకుంటాము. ఇదేవిధంగా విశ్వాసులను కాపాడ వలసిన బాధ్యత మాపై ఉంది.

104. వారికి చెప్పు : ప్రజలారా! నా ధర్మం పట్ల మీకు సందేహం ఉంటే (వినండి!) నిజదైవాన్ని కాదని మీరు పూజించేవాటిని నేనెన్నటికీ పూజించను. మీ మరణం ఎవరి స్వాధీనంలో ఉందో ఆ దైవాన్ని మాత్రమే నేను ఆరాధిస్తాను. విశ్వాసులలో ఒకడుగా ఉండాలని మాత్రమే నేను ఆజ్ఞాపించబడ్డాను. 105. ఇంకా ఏకాగ్రతతో ధర్మం వైపునకు అభిముఖం కావాలని, ముష్రిక్కులలో చేరకూడదని (నాకు ఆదేశించబడింది). 106. నిజదైవాన్ని వదలి నీకు లాభంగానీ, నష్టంగానీ కలిగించలేని వారిని మొరపెట్టుకోకు. ఒకవేళ నీవు గనక అలా చేశావంటే నిశ్చయంగా నీవు దుర్వర్తనులలో చేరిపోతావు (అని నాకు సూచించబడింది). 107. ఒకవేళ దేవుడు నిన్ను ఏదైనా బాధకు లోనుచేస్తే, ఆయన తప్ప దానిని దూరం చేసే వాడెవడూ లేడు. ఒకవేళ ఆయన మీకేదయినా మేలు చేయదలిస్తే, ఆయన అనుగ్రహాన్ని అడ్డుకోగలిగే వాడు కూడా ఎవ్వడూ లేడు. ఆయన తన అనుగ్రహాన్ని తన దాసులలో తాను కోరినవారికి ఇస్తాడు. ఆయన క్షమించేవాడు, కరుణించేవాడు.

108. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'ప్రజలారా! మీ ప్రభువు తరఫు నుండి మీ వద్దకు సత్యం వచ్చేసింది. కాబట్టి ఇప్పుడు సన్మార్గాన్ని అవలంబించినవాడు తన మేలు కోసమే అవలంబిస్తాడు. మరెవడయితే మార్గభ్రష్టుడవుతాడో దాని దుష్పరిణామానికి అతనే బాధ్యుడు. నేను మీపై పర్యవేక్షకుణ్ణి మాత్రం కాను. 109. (ప్రవక్తా!) నీకు పంపబడే దివ్యవాణి (వహీ)ని నీవు అనుసరించు. దేవుని తీర్పు వచ్చే వరకూ ఓర్పు వహించు. ఆయన అత్యుత్తమమైన తీర్పును ఇచ్చేవాడు.

# 11. హూద్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ రా. ఇది ఒక గ్రంథం. దీని సూక్తులు తొలుత నిర్దిష్టమైనవి. తరువాత అవి యుక్తిపరుడు, సర్వం తెలిసినవాని తరఫు నుండి విశదీకరించబడ్డాయి. 2. మీరు నిజదైవాన్ని తప్ప వేరితరులను ఆరాధించకండి. నేను మిమ్మల్ని ఆయన తరఫున హెచ్చరించేవాడను, శుభవార్తలు వినిపించేవాడను (అని అందులో తెలుపబడింది). 3. (ఇంకా ఏమనబడిందంటే) మీరు మీ తరఫున మీ ప్రభువును క్షమాపణకై అర్థించండి. ఆయన వైపునకు మరలి రండి. ఆయన మీకు ఒక నిర్ణీత కాలం వరకు బాగా లబ్ది పొందే అవకాశం ఇస్తాడు. ఎక్కువ పొందే అర్హత ఉన్న వారికి తన తరఫున ఎక్కువగానే ప్రసాదిస్తాడు. ఒకవేళ మీరు మరలిపోతే ఒకానొక మహా దినమున మీపై పడే శిక్ష గురించి నేను భయపడుతున్నాను. 4. మీరంతా దేవుని వైపునకే మరలవలసి ఉంది. ఆయన సర్వసత్తాధికారి.

5. చూశావా! వారు ఆయన నుండి దాక్కుందామని తమ రొమ్ములను ఎలా మరల్చుకుంటున్నారో! జాగ్రత్త! వారు తమ వస్త్రాలతో తమను తాము కప్పుకున్నప్పుడు కూడా వారు దాచేదీ, బహిర్గతం చేసేది – అంతా ఆయనకు తెలుసు. నిశ్చయంగా ఆయన ఆంతర్యాల్లో ఉన్న విషయాలను సయితం ఎరిగినవాడు. ◆ (12) 6. నేలపై నడిచే ఏ జీవీ తన జీవనోపాధికై దేవునిపై ఆధారపడకుండా లేదు. అది ఎక్కడ ఆగి ఉంటుందో, ఎక్కడ అప్పగించబడు తుందో ఆయనకు తెలుసు – అంతా ఒక స్పష్టమయిన గ్రంథంలో ఉంది.

7. ఆయనే ఆకాశాలనూ, భూమినీ ఆరు రోజులలో సృష్టించాడు. ఆయన సింహాసనం నీటిపైన ఉండేది. మీలో ఉత్తమంగా ఆచరించే వారెవరో పరీక్షించటానికే ఆయన ఈ సృష్టిని మొదలెట్టాడు. 'మరణానంతరం మీరు మళ్లీ లేపబడతార'ని నీవు గనక అంటే 'ఇది మాయాజాలం తప్ప మరేమీ

కాదు' అని సత్యతిరస్కారులంటారు. 8. ఒకవేళ వారికి పడవలసిన శిక్షను మేము కొంతకాలం పాటు వాయిదా వేస్తే, 'ఇంతకూ దానిని ఆపి ఉంచిందేమిటి?' అని వారు ఎద్దేవా చేస్తారు. జాగ్రత్త! అది వారిపై వచ్చిపడిన నాడు, దానిని మరలించటం సంభవం కాదు. వారు పరిహసిస్తూ ఉండినదే వారిని ముట్టడిస్తుంది.

9. ఒకవేళ మేము మనిషికి మా కారుణ్యంతో సత్కరించి, ఆ తరువాత అతనిని దానికి దూరం చేసినట్లయితే అతను నిరాశ చెందుతాడు, కృతఘ్నుడవుతాడు. 10. అతనికి కలిగిన ఏదయినా కష్టం తరువాత మేమతనికి మా అనుగ్రహాన్ని రుచిచూపిస్తే, 'ఇక నా దరిద్రమంతా వదలినట్లే' అంటాడు. అసలు విషయమేమిటంటే మానవుడు కాస్తంత దానికే ఉబ్బిపోయి, బీరాలుపోయేవాడు. 11. అయితే సహనం వహిస్తూ, సదాచరణ చేసేవారు మాత్రం అలాంటి వారు కారు – ఇలాంటి వారికొరకు మన్నింపుతో పాటు గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

12. (ఓ ప్రవక్తా!) నీ వైపునకు పంపబడిన దివ్యవాణిలో దేన్నయినా నీవు వదలివెయ్యటం జరగరాదు. 'ఇతనిపై ఏదయినా నిధి ఎందుకు దింపబడలేదు?' లేదా 'ఇతని వెంట దైవదూత ఎవరయినా ఎందుకు రాలేదు?' అని వారు చెప్పే మాటలకు నీ మనస్సు చివుక్కుమంటుందేమో! (అలా జరగరాదు) నీవు హెచ్చరించేవాడవు మాత్రమే. ప్రతి దానికీ బాధ్యుడు దేవుడు మాత్రమే. 13. ప్రవక్త స్వయంగా ఈ గ్రంథాన్ని కల్పించుకున్నాడని వారంటున్నారా? వారికి చెప్పేయ్ : 'మీరు కూడా ఇలాంటి పది సూరాలు రచించి తీసుకురండి. దైవాన్ని వదలి ఎవరెవరిని పిలుచుకుంటారో పిలుచుకోండి. మీరు సత్యవంతులే అయితే (ఈ సవాలును స్వీకరించండి)'. 14. ఒకవేళ వారు, మీరు చెప్పినట్లు చేయలేకపోతే, ఇది దివ్య జ్ఞానంతోనే అవతరించిందని, ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేదని తెలుసుకోండి. మరైతే మీరు ఇప్పటికయినా ఆజ్ఞాపాలన చేస్తారా?

15. ఎవరయితే ప్రాపంచిక జీవితాన్ని, దాని అందాలను జుర్రుకోవాలని పరితపిస్తారో, వారి కర్మల ఫలాన్ని మేము ప్రపంచంలోనే వారికి ఇచ్చేస్తాము. అందులో మేము వారికి ఏ లోటూ రానివ్వము. 16. ఇలాంటి వారికి పరలోకంలో నరకాగ్ని తప్ప మరొకటి లభించదు. వారు ప్రపంచంలో నిర్మించుకున్నదంతా (పరలోకంలో) సర్వనాశనమయి పోయింది. వారు సముపార్జించినదంతా వ్యర్థమైపోయింది.

17. ఒక వ్యక్తి తన ప్రభువు తరఫు నుండి ఒక నిదర్శనంపై ఉన్నాడు. ఆ తరువాత దేవుని తరఫున అతని వద్దకు ఒక సాక్ష్యం కూడా వచ్చేసింది. అంతకుముందు నుండే మూసా గ్రంథం (కూడా) మార్గదర్శకంగా, కారుణ్యంగా అతని వద్ద ఉంది - ఇలాంటివారే దీనిని (ఖుర్ఆన్ను) విశ్వసిస్తారు. (మానవ) సముదాయాలలో ఎవరయినా దీనిని కాదంటే, వారి వాగ్దాన స్థలం నరకాగ్నే. కనుక నీవు దీని విషయంలో ఎలాంటి సంశయానికి లోనవకు. ఇది నీ ప్రభువు తరఫు నుండి (వచ్చిన) సత్యం. కాని చాలామంది నమ్మరు.

18. దేవునిపై అసత్యాన్ని కల్పించే వానికంటే దౌర్జన్యపరుడు ఎవడుంటాడు? ఇలాంటివారు తమ ప్రభువు సమ్ముఖంలో హాజరు పరచబడతారు. 'వీళ్ళే తమ ప్రభువుపై అసత్యాన్ని కల్పించినవాళ్ళు' అని సాక్ష్యమిచ్చే వారంటారు. వినండి! దౌర్జన్యపరులపై దేవుని అభిశాపం పడుతుంది. 19. వారు దైవమార్గం నుండి ప్రజలను అడ్డుకుంటారు. అందులో వక్రతను అన్వేషిస్తారు. అలాంటివారే పరలోకాన్ని తిరస్కరించేవారై ఉంటారు. 20. భువిలో దైవాన్ని అశక్తుణ్ణి చేయటం వారి తరం కాదు. దైవానికి వ్యతిరేకంగా వారిని ఆదుకోగల సంరక్షకులు కూడా లేరు. వారికి రెండింతల శిక్ష పడుతుంది. వారు వినలేరు, కానలేరు. 21. వారే తమ స్వయానికి నష్టం చేకూర్చుకున్నవారు. వారు కల్పించుకున్నదంతా వారి నుండి నిష్క్రమించింది. 22. పరలోకంలో అందరికన్నా ఎక్కువగా నష్టపోయేది వీరే అనటంలో ఎలాంటి సందేహం లేదు.

23. నిశ్చయంగా ఎవరు విశ్వసించి, సదాచరణ చేసి, తమ ప్రభువు సమక్షంలో వినమ్రులై ఉన్నారో – ఇలాంటివారే స్వర్గవాసులు. వారందులో కలకాలం ఉంటారు. 24. ఈ ఇరువర్గాల దృష్టాంతం ఇలా ఉంది : ఒకడు గుడ్డివాడు, చెవిటివాడు. మరొకడు చూడగలుగుతాడు, వినగలుగుతాడు. ఏమిటి, వారిరువురూ సమానులు కాగలరా? మీరు ఆలోచించరా? 25. మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపాము. (అతనిలా అన్నాడు) 'నేను మిమ్మల్ని చాలా స్పష్టంగా సావధానపరిచేవాడను. 26. మీరు అల్లాహ్‌ను తప్ప వేరితరులను ఆరాధించకండి. నేను మీ విషయంలో ఒక బాధాకర దినపు శిక్ష గురించి భయపడుతున్నాను. 27. సత్యతిరస్కారులయిన అతని జాతి నాయకులు ఇలా అన్నారు : 'మా దృష్టిలో నువ్వు కూడా మాలాంటి ఒక సామాన్య మనిషివే. మాలోని వెనుకబడిన వర్గాలవారు, మందమతి గల వారు తప్ప వేరెవరూ నిన్ను అనుసరిస్తున్నట్లు మాకు కనిపించటం లేదు. మాపై నీకు ఏదన్నా ఆధిక్యత ఉన్నట్లు కూడా మాకు కానరావటం లేదు. పైగా మేము మీ అందరినీ అసత్యవాదులని భావిస్తున్నాము. 28. నూహ్ ఇలా అన్నాడు : 'నా జాతి వారలారా! నేనే గనక నా ప్రభువు తరఫు నుండి ఒక స్పష్టమయిన నిదర్శనంపై ఉంటే, ఆయన తన వద్ద నుండి ఓ ప్రత్యేక కారుణ్యాన్ని కూడా పంపి ఉంటే, కాని అది మీకు కానరాకపోతే, అట్టి పరిస్థితిలో మీకు సహించకపోయినప్పటికీ బలవంతంగా దానిని మేము మీ మీద ఎలా రుద్దగలం? 29. నా జాతి ప్రజలారా! దీనికి గాను నేను మీ నుండి ఎలాంటి ధనాన్ని అడగటం లేదు. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌ది. ఎట్టి పరిస్థితిలోనూ నేను విశ్వసించిన వారిని నా నుండి దూరం చేసుకోలేను. వారు తమ ప్రభువును కలుసుకోవలసిన వారే. కాని ఎటొచ్చీ మీరే మూర్ఖజనంలా కనిపిస్తున్నారు. 30. నా జాతి వారలారా! నేను గనక వీళ్ళను (విశ్వసించిన ఈ పేద ప్రజలను) దూరం చేసుకున్నట్లయితే, దైవానికి ప్రతిగా నాకు సహాయపడే వాడెవడు? ఏమిటి, మీరు గుణపాఠం గ్రహించరా? 31. నా వద్ద దేవుని నిధులున్నాయని గానీ, నాకు అగోచర సమాచారం ఉందని గానీ నేను మీతో అనటం లేదు. నేను దైవదూతనని

కూడా అనటం లేదు. మీ దృష్టిలో అల్పులుగా కనిపిస్తున్న వారికి దేవుడు ఏ మేలూ చెయ్యడని కూడా నేను అనజాలను. వారి ఆంతర్యాలలో ఏముందో దైవానికి బాగా తెలుసు. ఒకవేళ నేను అలా అంటే నేనే దుర్వర్తనుణ్ణి అవుతాను.'

32. వారిలా అన్నారు : 'ఓ నూహ్! నువ్వు మాతో వాదించావు. చాలా ఎక్కువే వాదించావు. నీవు చెప్పేది నిజమయితే నీవు మమ్మల్ని దేని గురించి భయపెడుతున్నావో, దానిని తీసుకు రా.' 33. నూహ్ అన్నాడు : 'దేవుడు తలచుకుంటే దానిని మీపైకి తప్పకుండా తీసుకువస్తాడు. మీరు ఆయన అదుపాజ్ఞల పరిధిని దాటిపోలేరు. 34. మిమ్మల్ని అపమార్గాన వదలివెయ్యాలన్నదే దేవుని అభిమతమై ఉంటే, నేను మీకు ఎంతగా ఉపదేశించినా, నా ఉపదేశం మీకు లాభదాయకం కాజాలదు. ఆయనే మీ ప్రభువు. ఆయన వైపునకే మీరంతా మరలవలసి ఉంది.'

35. ఏమిటి, ప్రవక్త స్వయంగా దీనిని (ఖుర్ఆన్‌ను) కల్పించు కున్నాడని వారంటున్నారా? వారితో అను : 'ఒకవేళ నేనే దీనిని కల్పించుకుని ఉంటే నా నేరం నామీదే పడుతుంది. మీరు ఒడిగట్టే నేరాలకు నేను బాధ్యుణ్ణి కాను.'

36. నూహ్‌కు ఈ సంకేతం ఇవ్వబడింది : 'ఇక నీ జాతిలో (ఇంత వరకూ) విశ్వసించిన వారు తప్ప వేరెవరూ విశ్వసించబోరు. కాబట్టి వారి చేష్టలపై నీవు దుఃఖించవలదు. 37. మా సమక్షంలోనే, మా ఆదేశానుసారం నీవు ఓడను నిర్మించుకో. దుర్మార్గుల పక్షాన నాకు విజ్ఞాపన చేసుకోకు. ముమ్మాటికీ వారు ముంచివేయబడతారు.' 38. నూహ్ ఓడ నిర్మించుకో సాగాడు. అతని జాతికి చెందిన ఏ నాయకుడయినా అతని వద్ద నుండి సాగిపోతున్నప్పుడు, అతన్ని ఎగతాళి చేసేవాడు. దానికి నూహ్ ఇలా అనేవాడు: 'ఇప్పుడు మీరు మమ్మల్ని చూసి నవ్వుతున్నారు. (చూస్తూ ఉండండి) మేము కూడా మీ స్థితిపై నవ్వుతాము. 39. తనను పరాభవానికి లోనుచేసే శిక్ష ఎవరిపై విరుచుకుపడుతుందో, శాశ్వతమయిన శిక్ష కూడా ఎవరిపై వస్తుందో మీకు అతి త్వరలోనే తెలిసిపోతుంది.' 40. కడకు మా ఆజ్ఞ

వచ్చేసింది. ఉప్పెన ఉప్పొంగినపుడు మేము నూహ్‌తో ఇలా అన్నాము : 'అన్ని రకాల జంతువుల్లో నుండి ఒక్కొక్క జతను ఓడలో ఎక్కించుకో. నీ పరివారాన్ని కూడా తీసుకో. విశ్వసించిన వారిని కూడా నీ వెంటబెట్టుకో. అయితే ముందుగానే (శిక్ష) ఖరారయిన వారిని మాత్రం వదిలేయ్‌' – నిజానికి నూహ్‌తో పాటు విశ్వసించిన వారు చాలా కొద్దిమంది మాత్రమే. 41. నూహ్‌ ఇలా అన్నాడు : ఓడలోకి ఎక్కండి. దైవనామంతోనే దీని పయనం, దీని ఆగటం కూడా. నిశ్చయంగా నా ప్రభువు క్షమాశీలుడు, దయాకరుడు. 42. పర్వతాల్లాంటి అలల మధ్య ఓడ వారిని తీసుకుని పయనించసాగింది. తన నుండి వేరైపోయిన తన కుమారుణ్ణి ఉద్దేశ్యించి నూహ్‌, 'ఒరేయ్‌ నా చిట్టి తండ్రీ! మాతోపాటే వచ్చేసేయ్‌. తిరస్కారుల వెంట వెళ్ళకు' అన్నాడు. 43. అతనిలా అన్నాడు : '(ఫరవాలేదు) నేను ఏదన్నా పర్వతాన్ని ఆశ్రయిస్తాను. అది నన్ను జలప్రళయం నుండి రక్షిస్తుంది.' దానికి నూహ్‌, 'ఈ రోజు దైవాజ్ఞ నుండి రక్షించేవాడెవడూ లేడురా! ఆయన దయదలచిన వాడు మాత్రమే రక్షించబడతాడురా!' అన్నాడు. అప్పుడు వారిద్దరి మధ్యన ఒక కెరటం ఉవ్వెత్తున ఎగిసిపడింది. అంతే. అతను కూడా ముంపునకు గురయిన వారిలో ఒకడయ్యాడు. 44. ఈ విధంగా సెలవీయ బడింది : 'ఓ ధరణీ! నీ నీళ్ళను మ్రింగివెయ్యి. ఓ ఆకాశమా! శాంతించు.' అప్పుడు నీరు ఇంకిపోయింది. వ్యవహార నిర్ణయం జరిగిపోయింది. ఓడ జూదీ పర్వతంపై ఆగిపోయింది. 'దుర్మార్గ జనం దూరమవుగాక!' అని సెలవీయబడింది.

45. అప్పుడు నూహ్‌ తన ప్రభువును మొరపెట్టుకుంటూ ఇలా అన్నాడు : 'ప్రభూ! నా పుత్రరత్నం కూడా నా పరివారంలోని వాడేకదా! నిశ్చయంగా నీ వాగ్దానం సత్యమైనది. నీవు అందరికన్నా గొప్ప పరిపాలకుడవు.' 46. దేవుడిలా సెలవిచ్చాడు : 'నూహ్‌! వాడు నీ పరివారంలోని వాడు కాడు. వాడొక దుర్వర్తనుడు. కాబట్టి నీకు తెలియని దాని గురించి నన్ను అడగకు. నీవు మూర్ఖుల్లో ఒకడివి కారాదని తాకీదు చేస్తున్నాను.' 47. నూహ్‌ ఇలా నివేదించుకున్నాడు : 'ప్రభూ! నాకు తెలియని

దాని గురించి నిన్ను నివేదించుకోవటం నుండి నీ శరణు వేడుతున్నాను. ఇప్పుడు నీవు గనక నన్ను క్షమించకపోతే, నన్ను కరుణించకపోతే నేను సర్వనాశనమైపోతాను.'

48. ఈ విధంగా సెలవీయబడింది : 'నూహ్! మా తరఫు నుండి సురక్షితంగా దిగండి. నీపైన, నీ వెంట ఉన్న వారిపైన మా తరఫున శుభాలు! వీరి ద్వారా ఉనికిలోకి వచ్చే సముదాయాలకు కూడా మేము మా అనుగ్రహ భాగ్యాన్ని ఇస్తాము. ఆ తరువాతి వారిని మా తరఫున బాధాకరమయిన శిక్ష కబళిస్తుంది.' 49. (ఓ ప్రవక్తా!) ఇవి అగోచర సమాచారాలు. వీటిని మేము నీకు దివ్యవాణి (వహీ) ద్వారా తెలియపరుస్తున్నాము. ఇంతకు మునుపు నీకుగానీ, నీ జాతి వారికి గానీ వీటి గురించి ఏమీ తెలియదు. కనుక నీవు ఓపిక పట్టు. నిశ్చయంగా అంతిమ ఫలితం దైవభీతిపరుల పక్షాన ఉంటుంది.

50. ఇంకా ఆద్ జాతి వైపునకు మేము వారి సహోదరుడయిన హూద్‌ను పంపాము. అతనిలా అన్నాడు : 'ఓ నా జాతి జనులారా! దైవారాధన చేయండి. ఆయన తప్ప మీకు మరో ఆరాధ్య దైవం లేదు. మీరు కేవలం అబద్ధాలను అల్లుకుంటున్నారు. 51. నా జాతి వారలారా! ఇందుకుగాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అపేక్షించటం లేదు. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత నా సృష్టికర్తపైనే ఉంది. ఏమిటి, మీరు అర్థం చేసుకోరా!? 52. నా జాతి ప్రజలారా! క్షమించమని మీ ప్రభువును వేడుకోండి. ఆయన వైపునకే మరలండి. ఆయన మీపై పుష్కలంగా వర్షం కురిపిస్తాడు. మీకున్న శక్తికి మరింత శక్తిని సమకూరుస్తాడు. మీరు అపరాధులై విముఖత చూపకండి.'

53. వారిలా సమాధానమిచ్చారు : 'ఓ హూద్! నీవు మా వద్దకు స్పష్టమయిన నిదర్శనమేదీ తీసుకు రాలేదు. నీవు మాటలు చెప్పినంత మాత్రాన మేము మా ఆరాధ్య దేవతలను వదులుకోవటం, నిన్ను విశ్వసించటం అనేది జరగని పని. 54. మేము అనేదొక్కటే – మా దేవతలలో ఎవరో ఒకరి దెబ్బ నీ మీద పడింది.' హూద్ ఇలా అన్నాడు : 'మీరు నిలబెట్టే సహవర్తులతో

నాకెట్టి సంబంధం లేదు. దీనికి నేను అల్లాహ్‌ను సాక్షిగా పెడుతున్నాను. మీరు కూడా సాక్షులుగా ఉండండి. 55. మీరంతా కలసి నాకు వ్యతిరేకంగా పన్నాగాలు పన్నండి. నాకు గడువు ఇవ్వవలసిన అవసరమూ లేదు. 56. నేను మటుకు దైవాన్నే నమ్ముకున్నాను. ఆయన నాకూ ప్రభువే, మీకూ ప్రభువే. ఏ జీవి లలాట కురులయినా అతని పట్టు నుండి దూరంగా లేవు. నిశ్చయంగా నా ప్రభువు రుజుమార్గాన ఉన్నాడు.

57. ఒకవేళ మీరు విముఖులై పోదలిస్తే, మీ వైపునకు నాకిచ్చి పంపబడిన సందేశాన్ని నేను చేరవేశాను. నా ప్రభువు మీ స్థానంలో, మీకు బదులు మరొకరిని వారసులుగా తెస్తాడు. మీరు ఆయనకు ఎలాంటి హాని కలిగించలేరు. నిశ్చయంగా నా ప్రభువు ప్రతిదానిపై పర్యవేక్షకునిగా ఉన్నాడు.' 58. మరి మా ఆజ్ఞ వచ్చేసినపుడు మేము హూద్‌ను, అతనితో పాటే విశ్వసించిన వారిని మా కారుణ్యంతో కాపాడాము. మేము వారిని ఘోర విపత్తు నుండి రక్షించాము. 59. ఇదీ ఆద్ వారి సంగతి. వీరు తమ ప్రభువు సూచనలను నిరాకరించారు. ఆయన సందేశహరులను ఎదిరించారు. ప్రతి తలబిరుసు మరియు బద్ధవిరోధిని అనుసరించారు. 60. ఈ ప్రపంచంలోనూ వారిని శాపం వెంటాడేలా చేయబడింది. ప్రళయదినాన కూడా (అదే జరుగుతుంది). వినండి! ఆద్ వారు తమ ప్రభువును తిరస్కరించారు. వినండి! హూద్ జాతివారైన ఆద్ జనులు దూరాన విసిరివేయబడ్డారు.

61. సమూదు వైపునకు మేము వారి సహోదరుడైన సాలెహ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు : 'నా జాతి జనులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరో ఆరాధ్య దైవం లేదు. ఆయనే మిమ్మల్ని నేల నుండి ప్రభవింపజేశాడు. అందులోనే మిమ్మల్ని వసింపజేశాడు. కాబట్టి (మీ తప్పుల) క్షమాపణకై ఆయన్నే వేడుకోండి. ఆయన వైపునకే పశ్చాత్తాపభావంతో మరలండి. నిశ్చయంగా నా ప్రభువు చాలా సమీపంలోనే ఉన్నాడు. (విన్నపాలను) స్వీకరిస్తాడు.' 62. వారిలా అన్నారు : 'ఓ సాలిహ్!

ఇంతకు ముందు మేము నీపై ఎన్నో ఆశలు పెట్టుకున్నాము. ఏమిటి, మా తండ్రులు తాతలు పూజించిన వాటిని పూజించకుండా నువ్వు మమ్మల్ని ఆపుతావా? నువ్వు ఏ విషయం వైపునకు మమ్మల్ని పిలుస్తున్నావో, దాని గురించి మాకు తీవ్రమయిన సంశయం ఏర్పడింది. మేము సందిగ్ధంలో పడిపోయాము.' 63. అతనిలా అన్నాడు : 'నా జాతి వారలారా! మీరే చెప్పండి. నేనే గనక నా ప్రభువు తరఫు నుండి స్పష్టమయిన నిదర్శనంపై ఉంటే, ఆయన తన వద్ద నుండి నాకు కారుణ్యం ప్రసాదించి ఉండగా నేను ఆదేశాన్ని ఎదిరిస్తే నన్ను ఆయన బారినుండి కాపాడేవాడెవడు? మీరు నాకు మరింత నష్టం కలిగించటం తప్ప మరేవిధంగానూ తోడ్పడలేరు.

64. 'నా జాతి ప్రజలారా! దేవుని ఈ ఆడ ఒంటె మీకొక సూచనగా ఉంది. అది దేవుని భూమిలో నిరాటంకంగా మేస్తూ తిరిగేలా వదలిపెట్టండి. దానికెలాంటి హాని కలిగించకండి. అన్యథా శీఘ్రంగానే మిమ్మల్ని ఆపద చుట్టుకుంటుంది.' 65. అయినప్పటికీ వారు దాని కాళ్లను నరికివేశారు. అప్పుడు సాలిహ్ వారితో ఇలా అన్నాడు : 'మూడు రోజుల పాటు మీ ఇండ్లలోనే ఉండి జీవితాన్ని అనుభవించండి. ఇదొక వాగ్దానం. ఇది అబద్ధం కానేరదు. 66. తరువాత మా ఆజ్ఞ రాగానే మేము మా కారుణ్యంతో సాలిహ్‌ను, అతనితో పాటు విశ్వసించిన వారిని ఆ దినపు పరాభవం నుండి రక్షించాము. నిశ్చయంగా నీ ప్రభువే మహాబలుడు, సర్వాధికుడు. 67. మరెవరయితే దౌర్జన్యానికి ఒడిగట్టారో వారిని ఒక భయంకరమయిన కేక కబళించింది. దాంతో వారు తెల్లవారేసరికల్లా తమ నివాస గృహాలలో బోర్లాపడిపోయారు – 68 – అసలు వాటిలో వారెన్నడూ నివసించనే లేదన్నట్లుగా! వినండి! సమూదు వారు తమ ప్రభువును తిరస్కరించారు. వినండి! సమూదు వారు దూరాన విసిరివేయబడ్డారు.

69. ఇబ్రాహీమ్ వద్దకు మా దూతలు శుభవార్త మోసుకువచ్చారు. వారతనిని ఉద్దేశ్యించి, 'నీకు శాంతి కలుగుగాక!' అన్నారు. 'మీపైన కూడా శాంతి కలుగుగాక!' అని ఇబ్రాహీమ్ బదులిచ్చాడు. ఇట్టే, ఆలస్యం కాకుండానే

అతను వేయించిన దూడను తీసుకువచ్చాడు. 70. అయితే వారి చేతులు ఆ భోజనాన్ని ముట్టకపోవటంతో అతను సంకోచానికి లోనయ్యాడు. లోలోపలే భయపడిపోయాడు. అప్పుడు వారు, 'భయపడకు. మేము లూత్ జాతి వైపు పంపబడిన వారము' అన్నారు. 71. అక్కడ నిలబడి ఉన్న అతని భార్య నవ్వసాగింది. అప్పుడు మేము ఆమెకు ఇస్హాఖ్‌ను గురించి, ఇస్హాఖ్ తరువాత యాఖూబ్‌ను గురించి శుభవార్త వినిపించాము. 72. ఆమె ఇలా అన్నది : 'అయ్యో, నా దౌర్భాగ్యం! నాకిప్పుడు పిల్లాడా! నేనా వృద్ధురాలిని. నా భర్త కూడా ముసలివాడే. ఇది చాలా విచిత్రంగా ఉందే!' 73. దైవదూతలు ఇలా సమాధానమిచ్చారు : 'ఏమిటి, నీవు దైవాజ్ఞపైనే అచ్చెరువొందుతున్నావా అమ్మా! ఇబ్రాహీము కుటుంబీకులారా! మీపై దైవకారుణ్యం, శుభాలు ఉన్నాయి. నిశ్చయంగా దేవుడు అత్యంత ప్రశంసనీయుడు, ఘనాఘనుడు.'

74. ఇబ్రాహీములోని భయాందోళన దూరమై, అతనికి శుభవార్త లభించిన తరువాత, అతను మాతో లూత్ జాతి గురించి వాదించటం మొదలెట్టాడు. 75. నిశ్చయంగా ఇబ్రాహీమ్ ఎంతో సౌమ్యుడు, మృదు మనస్కుడు, మా వైపునకు మరలేవాడు. 76. 'ఇబ్రాహీమ్! దానిని వదలిపెట్టు. నీ ప్రభువు ఆదేశం వచ్చేసింది. మళ్ళించతరం కాని శిక్ష వారిపై రానున్నది' (అని దైవదూతలు అతనికి స్పష్టం చేశారు).

77. మా దూతలు లూత్ వద్దకు చేరుకున్నప్పుడు అతను కలవరం చెందాడు. వారి రాకవల్ల అతని మనసు కుంచించుకుపోయింది. 'ఇది మహా గడ్డు దినం' అన్నాడు. 78. అతని జాతి ప్రజలు అతని దగ్గరకు పరుగులు తీస్తూ వచ్చారు. వారు మొదటి నుండే ముదనష్టపు పనికి అలవాటుపడినవారు. లూత్ ఇలా అన్నాడు : 'నా జాతి వారలారా! వీరు నా కుమార్తెలు. వీరు మీ కొరకు ఎక్కువ పరిశుద్ధలు. కనుక మీరు దైవానికి భయపడండి. నన్ను నా అతిథుల ముందు అవమానించకండి. ఏమిటి, మీలో ఒక్కడైనా మంచివాడు లేడా?' 79. వారిలా అన్నారు : 'నీ కూతుళ్ళతో

మాకు పనిలేదన్న సంగతి నీకు బాగా తెలుసు. మేము కోరేదేమిటో కూడా నీకు తెలుసు.'

80. లూత్ ఇలా అన్నాడు : 'మిమ్మల్ని ప్రతిఘటించే శక్తి నా వద్ద ఉంటే ఎంత బాగుండేది! లేదా నేను ఏదయినా పటిష్ఠమయిన ఆశ్రయం పొందగలిగి ఉంటే ఎంత బాగుండేది!' 81. దైవదూతలు ఇలా అన్నారు : 'ఓ లూత్! మేము నీ ప్రభువు తరఫున పంపబడినవారము. వాళ్లు సుతరామూ నీ జోలికి రాలేరు. కనుక నీవు నీ వారిని తీసుకుని, కొంత రాత్రి ఉండగానే వెళ్ళిపో. మీలో ఎవ్వరూ వెనుతిరిగి చూడకూడదు. అయితే నీ భార్య మాత్రం (మీ వెంట రాకూడదు. ఎందుకంటే) వీళ్ళందరికీ పట్టే గతే ఆవిడకూ పట్టనున్నది. వీరి వినాశానికి ప్రభాత సమయం నిర్థారించబడింది. ఏమిటి, ప్రభాత సమయం దగ్గరలోనే లేదా?' 82. తరువాత మా ఉత్తర్వు రాగానే మేము ఆ జనావాసాన్ని తలక్రిందులుగా చేసి, దానిపై కంకరరాళ్లను ఎడతెగకుండా కురిపించాము. 83. అవి నీ ప్రభువు వద్ద గుర్తు వేయబడిన రాళ్లు. ఆ జనావాసం ఈ దుర్మార్గులకు మరీ అంత దూరాన కూడా లేదు.

84. ఇంకా, మేము మద్‌యన్ వారి వైపునకు వారి సహోదరుడయిన షుఐబ్‌ను పంపాము. అతనిలా అన్నాడు : నా జాతి ప్రజలారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీ ఆరాధ్యుడు ఎవడూ లేడు. కొలతలు, తూనికలలో తగ్గింపునకు పాల్పడకండి. ప్రస్తుతం నేను మిమ్మల్ని మంచి స్థితిలో చూస్తున్నాను. అయితే నేను మిమ్మల్ని దిగ్బంధం చేసే దినపు శిక్ష గురించి భయపడుతున్నాను. 85. నా జాతి వారలారా! కొలతలు, తూనికలలో న్యాయసమ్మతంగా వ్యవహరించండి. ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. ధరణిలో కల్లోలాన్ని వ్యాపింపజేయకండి. 86. మీరు గనక విశ్వసించిన వారయితే, దైవప్రసాదితమయిన దానిలో మిగిలినదే, మీ కొరకు మేలైనది. నేను మీపై పర్యవేక్షకుణ్ణి కాను.

87. వారిలా అన్నారు : 'ఓ షుఐబ్! నీ నమాజు ఆజ్ఞాపించేది ఇదేనా?

మా పెద్దలు పూజిస్తూ వచ్చిన దైవాలను మేము వదలిపెట్టాలని లేదా మా సొమ్ములను మా ఇష్ట ప్రకారం ఖర్చుపెట్టడం మానుకోవాలని అది నీకు బోధిస్తోందా? ఎటొచ్చీ, నీవు ఒక్కడివే బుద్ధిమంతుడవు, సద్వర్తనుడవులా ఉన్నావే!?'

88. షుఐబ్ ఇలా అన్నాడు : 'ఓ నా జాతి జనులారా! నేను నా ప్రభువు తరఫున ఒక స్పష్టమయిన నిదర్శనాన్ని పొంది ఉండగా, ఆయన నాకు అత్యుత్తమమయిన జీవనోపాధిని కూడా ఇచ్చి ఉండగా, మిమ్మల్ని మానుకోమని చెబుతున్న పనులనే నేను స్వయంగా చేయదలచుకోలేదు. నేను శాయశక్తులా మీ దిద్దుబాటుకు యత్నిస్తున్నాను. నాకు దేవుని తరఫుననే సద్బుద్ధి లభిస్తుంది. నేను ఆయన్నే నమ్ముకున్నాను. ఆయన వైపునకే మరలుతున్నాను. 89. నా జాతి వారలారా! నాకు వ్యతిరేకంగా మీరు చూపుతున్న మంకుతనం, కడకు మిమ్మల్ని కూడా నూహ్ జాతివారిపై లేదా హూద్ జాతివారిపై లేదా సాలిహ్ జాతివారిపై విరుచుకుపడిన శిక్షకే లోను చేస్తుందేమో! మరి లూత్ జాతివారయితే మీకు ఎంతో దూరాన కూడా లేరు. 90. మీరు మీ ప్రభువు సన్నిధిలో క్షమాపణ కోరుకోండి. పశ్చాత్తాపభావంతో ఆయన వైపునకు మరలండి. నిశ్చయంగా నా ప్రభువు దయామయుడు, ప్రేమమయుడు.

91. సమాధానంగా వారిలా అన్నారు : 'నీవు చెప్పేదానిలో అధికాంశం మాకు బోధపడటం లేదు. చూస్తుంటే నీవు మాలో మరీ బలహీనునిలా కనిపిస్తున్నావు. నీ వర్గీయులే గనక లేకుంటే, నిన్ను ఎప్పుడో రాళ్ళు రువ్వి అంతమొందించేవాళ్ళం. నీవు పెద్ద మొనగాడివి ఏమీ కావు.' 92. షుఐబ్ ఇలా అన్నాడు : 'నా జాతి వారలారా! నా వర్గీయులు మీ దృష్టిలో దేవునికంటే ఎక్కువ శక్తిమంతులా? మీరు దైవాన్నే వెనక్కి నెట్టేశారు! నిశ్చయంగా మీరు చేసేదంతా నా ప్రభువు నియంత్రణలోనే ఉంది. 93. నా జాతి సోదరులారా! మీరు మీ విధానాన్ని అనుసరించి ఆచరించండి.

నేను నా విధానాన్ని అనుసరించి ఆచరిస్తూ ఉంటాను. పరాభవం పాల్జేసే శిక్ష ఎవరిపై విరుచుకుపడుతుందో, అబద్ధాలకోరు ఎవరో మీకు శీఘ్రంగానే తెలిసిపోతుంది. మీరూ వేచి ఉండండి. నేనూ మీతోపాటే వేచి ఉంటాను.'

94. తీరా మా ఆజ్ఞా సమయం ఆసన్నమయినపుడు మేము షుఐబ్‌ను, అతనితో పాటే విశ్వసించిన వారిని, మా కారుణ్యంతో కాపాడుకున్నాము. అన్యాయానికి ఒడిగట్టిన వారిని భయంకరమయిన కేక కబళించింది. అంతే! వారంతా తమ ఇండ్లలోనే బొక్కబోర్లాపడిపోయారు. 95. – వారెన్నడూ అక్కడ నివసించనే లేదన్నట్లుగా! వినండి! సమూదు వారు విసిరివేయబడినట్లే మద్‌యన్ వారు కూడా విసిరివేయబడ్డారు.

96. ఇంకా, మేము మూసాకు మా సూచనలను, స్పష్టమయిన ప్రమాణాన్ని ఇచ్చి పంపాము. 97. ఫిరౌన్ వద్దకు, అతని నాయకుల వద్దకు. అయితే వారు మాత్రం ఫిరౌన్ ఆదేశాలనే పాటించారు. చూడబోతే ఫిరౌన్ ఆదేశమేదీ సజావుగా లేదు. 98. ప్రళయదినాన అతను తన జాతి జనులకు ముందుండి మరీ వారిని నరకాగ్నికి చేరుస్తాడు. వారు చేరుకునే ఆ స్థలం ఎంత చెడ్డది!? 99. ఈ లోకంలోనూ వారిని శాపం వెంటాడింది. ప్రళయదినాన కూడా (అదే జరగనున్నది). వారికి దొరికిన ఆ బహుమానం ఎంత చెడ్డది!?

100. ఇవీ ఆ బస్తీలకు సంబంధించిన కొన్ని సమాచారాలు. వీటిని మేము నీకు వినిపిస్తున్నాము. వాటిలో కొన్ని బస్తీలు ఇప్పటికీ నిలిచి ఉన్నాయి. మరికొన్ని పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. 101. మేము వారికెలాంటి అన్యాయం చేయలేదు. పైగా వారే తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నారు. మరి నీ ప్రభువు ఆజ్ఞ వచ్చేసినపుడు, నిజ దైవాన్ని కాదని వారు మొరపెట్టుకునే చిల్లర దేవుళ్ళు వారికేవిధంగానూ ఉపయోగపడలేదు. అవి వారి పాలిట వినాశం తప్ప దేనినీ వృద్ధి చేయలేదు.

102. బస్తీలను వారి దుర్మార్గాలకు గాను పట్టుకున్నప్పుడు నీ ప్రభువు పట్టు ఇలాగే ఉంటుంది. నిశ్చయంగా ఆయన పట్టు వ్యధాభరితంగా,

కఠినంగా ఉంటుంది. 103. పరలోక శిక్షకు భయపడేవారికి ఇందులో సూచన ఉంది. అది మానవులంతా సమీకరించబడే రోజు! జనులంతా హాజరుపరచబడే రోజు!! 104. మేము దానిని (ఆ రోజును) నిర్ధారితమై ఉన్న ఒక వ్యవధి కొరకు వాయిదా వేస్తున్నాము. 105. ఆ రోజు ఆసన్నమయినపుడు, దేవుని అనుజ్ఞలేకుండా ఏ ప్రాణీ మాట్లాడజాలదు. వారిలో కొందరు దౌర్భాగ్యులుంటే, మరికొందరు సౌభాగ్యవంతులుంటారు.

106. దౌర్భాగ్యులయిన వారు నరకాగ్నిలో ఉంటారు. వారక్కడ అరుస్తూ, పెడబొబ్బలు పెడుతూ ఉంటారు. 107. భూమ్యాకాశాలు నెలకొని ఉన్నంత కాలం వారందులోనే పడి ఉంటారు – నీ ప్రభువు మరేదన్నా తలిస్తే తప్ప! నిశ్చయంగా నీ ప్రభువు తాను కోరినది చేస్తాడు. 108. సౌభాగ్యవంతులు భూమ్యాకాశాలున్నంత వరకూ స్వర్గంలోనే ఉంటారు – అయితే నీ ప్రభువు మరేదయినా తలిస్తే తప్ప! అది ఎన్నటికీ తరగని ప్రసాదం! 109. కనుక (ఓ ప్రవక్తా!) వారు పూజించే వాటి విషయంలో నీవు ఎన్నడూ శంకకు లోనుకాకు. మేము వారి వాటాను ఏమాత్రం తగ్గించకుండా వారికి ఇస్తాము.

110. మేము మూసాకు గ్రంథం ప్రసాదించాము. దరిమిలా అందులో విభేదం పొడసూపింది. ఒకవేళ నీ ప్రభువు తరఫు నుండి ముందుగానే ఒక విషయం రాకుండా ఉంటే ఎప్పుడో వారి మధ్య తీర్పు జరిగిపోయేది. ఈ విషయంలో వారికి ఏర్పడిన సందేహం వారిని కుదుటపడనివ్వదు. 111. నిశ్చయంగా నీ ప్రభువు ప్రతి ఒక్కరికీ వారి కర్మల ఫలాన్ని పూర్తిగా ఇస్తాడు. మీ నిర్వాకమంతా ఆయనకు ఎరుకే.

112. కనుక (ఓ ప్రవక్తా!) నీవూ, పశ్చాత్తాపపడి నీ వెంట వచ్చిన నీ సహచరులూ నీకు ఆదేశించబడిన విధంగా స్థిరంగా ఉండండి. అవధులు మీరకండి. నిశ్చయంగా మీ ఆచరణను ఆయన చూస్తూ ఉన్నాడు. 113. అన్యాయానికి ఒడిగట్టిన వారి వైపు మొగ్గకండి. మొగ్గారో, నరకాగ్ని మిమ్మల్ని చుట్టుకుంటుంది. తరువాత దేవుడు తప్ప మిమ్మల్ని ఆదుకునే వాడెవడూ ఉండడు. మరి మీకు ఎక్కడా సహాయం లభించదు.

114. నమాజును స్థాపించండి–పగటి రెండు అంచులలోనూ, రాత్రి కొంత భాగంలోనూ! నిశ్చయంగా సత్కార్యాలు దుష్కార్యాలను దూరం చేస్తాయి. ఇది హితబోధను గ్రహించే వారికి ఒక హితోపదేశం. 115. సంయమనం పాటించు. దేవుడు సజ్జనుల ప్రతిఫలాన్ని వృధా కానివ్వడు.

116. మీకు పూర్వం గతించిన వారిలో, భువిలో కల్లోలం రేకెత్తించకుండా ఆపే సదాచార సంపన్నులు ఎందుకు లేకపోయారు? అలాంటి వారు (ఉన్నా) బహుకొద్దిమంది మాత్రమే ఉండేవారు. వారిని మేము వాళ్ళలో నుండి కాపాడుకున్నాము. దుర్మార్గులు మాత్రం తమకు లభించిన సుఖసౌఖ్యాలలో మునిగి ఉన్నారు. వారు నేరస్తులు. 117. బస్తీలలోని పౌరులు సంస్కరణాభిలాషులై ఉండగా, ఆ బస్తీలను అకారణంగా తుదముట్టించటం నీ ప్రభువు విధానం కానేకాదు.

118. నీ ప్రభువు గనక తలచుకుంటే, మానవులందరినీ ఒకే సముదాయంగా చేసి ఉండేవాడు. కాని వారి విధానాలు నిత్యం విభిన్నంగా ఉంటాయి. 119. – నీ ప్రభువు కారుణ్యానికి నోచుకున్నవారు మాత్రం వీటి నుండి సురక్షితంగా ఉంటారు. ఇందు నిమిత్తమే ఆయన వారిని పుట్టించాడు. ‘నేను నరకాన్ని జిన్నులు, మానవులతో కలిపి నింపుతాను’ అని చెప్పిన నీ ప్రభువు మాట ఈ విధంగా పూర్తయింది.

120. (ఓ ప్రవక్తా! ఈ విధంగా) మేము ప్రవక్తల స్థితిగతులలోని ప్రతి విషయం నీకు వినిపిస్తున్నాము – తద్వారా నీకు మనోనిబ్బరం కలగాలని! ఇందులో (ఈ సూరాలో) నీ వద్దకు సత్యం వచ్చింది. విశ్వసించిన వారికి ఇది హితోపదేశం, జ్ఞాపిక! 121. విశ్వసించని వారితో ఇలా చెప్పు : ‘మీకు తోచిన పద్ధతి ప్రకారం మీరు మీ పని చేసుకోండి. మేము మా పద్ధతి ప్రకారం చేసుకుంటూ ఉంటాము. 122. మీరూ నిరీక్షించండి. మేమూ నిరీక్షిస్తున్నాము. 123. భూమ్యాకాశాలలో నిక్షిప్తమై ఉన్న ప్రతి విషయం దేవుని వద్ద ఉంది. సమస్త వ్యవహారాలు ఆయన వద్దకే మరలించబడతాయి. కనుక మీరు ఆయన్నే ఆరాధించండి. ఆయనపైనే భారం మోపండి. మీరు చేసే పనుల గురించి నీ ప్రభువు పరధ్యానంలో లేడు.

# 12. యూసుఫ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ రా. ఇవి సుస్పష్టమయిన గ్రంథసూక్తులు.
2. మేము దీనిని అరబీ ఖుర్‌ఆన్‌గా చేసి అవతరింపజేశాము – మీరు అర్థం
చేసుకుంటారని! 3. మేము దివ్యవాణి (వహీ) ద్వారా నీ వద్దకు పంపిన ఈ
ఖుర్‌ఆన్ మూలముగా నీకు అత్యుత్తమమయిన గాథను వినిపిస్తున్నాము.
లోగడ దీని గురించి నీకు అసలేమీ తెలీదు.

4. యూసుఫ్ తన తండ్రితో, 'ఓ నాన్నా! నేను కలలో పదకొండు
నక్షత్రాలను, సూర్యచంద్రులను చూశాను. అవి నా సమక్షంలో ప్రణమిల్లటం
కూడా గమనించాను' అని చెప్పినప్పుడు, 5. అతని తండ్రి ఇలా అన్నాడు :
'నా చిట్టి తండ్రీ! నీవు ఈ స్వప్నం గురించి నీ సోదరులకు చెప్పకు. బహుశా
వారు నీకు వ్యతిరేకంగా ఏదన్నా పన్నాగం పన్నవచ్చు. నిశ్చయంగా షైతాన్
మానవునికి బద్ధ విరోధి. 6. ఇలాగే (జరుగుతుంది). నీ ప్రభువు నిన్ను
ఎన్నుకుంటాడు. విషయాల వాస్తవాల్లోకి వెళ్ళే విద్యను నీకు నేర్పుతాడు. నీ
పితామహులయిన ఇబ్రాహీమ్, ఇస్‌హాఖ్‌లపై తన అనుగ్రహభాగ్యాన్ని
పూర్తిచేసినట్లే నీపైన, యాఖూబ్ సంతతిపైన కూడా తన వరప్రసాదాన్ని
పరిపూర్తి చేస్తాడు. నిశ్చయంగా నీ ప్రభువు జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు.

7. యదార్థానికి యూసుఫ్‌లోనూ, అతని సోదరులలోనూ అడిగే
వారికి గొప్ప సూచనలున్నాయి. 8. అప్పుడు అతని సోదరులు పరస్పరం
ఇలా కూడబలుక్కున్నారు : 'వాస్తవానికి మనం ఒక జట్టుగా ఉన్నప్పటికీ,
మన తండ్రి గారికి యూసుఫ్‌పైనా, అతని తమ్మునిపైనే ఎక్కువ మమకారం
ఉంది. నిశ్చయంగా మన నాన్నగారి ధోరణిలో తప్పు ఉంది. 9. యూసుఫ్‌ను
చంపేయండి లేదా అతన్ని ఏదయినా దూర ప్రదేశంలో విసరివేయండి –
అలాగయినా మీ నాన్న శ్రద్ధాసక్తులు మీ వైపునకు మళ్లవచ్చు. ఆ తరువాత
మీరు సజ్జనులుగా రాణించాలి.' 10. వారిలో చెప్పేవాడొకడు ఇలా

చెప్పాడు : 'యూసుఫ్‌ను చంపకండి. ఒకవేళ మీరు ఏదన్నా చేయాలనే అనుకుంటే, అతన్ని ఏదయినా పాడుబడిన బావిలో పడవెయ్యండి. దారినపోయే బిడారు ఏదయినా అతన్ని తీసుకుపోతుంది.'

11. వారు తమ తండ్రితో ఇలా అన్నారు : 'నాన్నగారూ! యూసుఫ్ వ్యవహారంలో మీరు మమ్మల్ని బొత్తిగా నమ్మరేమిటి? వాస్తవానికి మేమతని శ్రేయోభిలాషులము. 12. రేపు అతనిని మాతో పాటు పంపించండి – (వన భోజనం) ఆరగిస్తాడు, ఆడుకుంటాడు. అతనిని కనిపెట్టుకుని ఉండే బాధ్యత మాది.' 13. తండ్రి ఇలా అన్నాడు : 'మీరతన్ని తీసుకువెళ్ళటం నన్ను చింతాగ్రస్తుణ్ణి చేస్తుంది. మీరు అతని విషయంలో ఏమరుపాటుకు గురై ఉన్నప్పుడు ఏదయినా తోడేలు వచ్చి, అతన్ని తినేస్తుందేమోనన్న భయం నాకుంది.' 14. వారిలా అన్నారు : మేము ఒక బలవత్తరమయిన జట్టుగా ఉండి కూడా, తోడేలు వచ్చి ఇతన్ని తినేస్తే, ఇక మేము వట్టి దద్దమ్మలమే అవుతాము.'

15. ఆ విధంగా వారు అతనిని తీసుకువెళ్ళి, ఒక పాడుబడిన బావిలో పడవేద్దామని నిర్ణయించుకున్నారు. అప్పుడు మేము యూసుఫ్‌కు 'వహీ' (దివ్యవాణి) పంపాము – 'నీవు వారిని ఈ దుశ్చేష్ట గురించి ఎత్తిచూపే సమయం వస్తుంది. అప్పుడు వారు నిన్ను గుర్తుపట్టరు.' 16. వాళ్లు సాయంత్రం తమ తండ్రి వద్దకు ఏడుస్తూ వచ్చారు. 17.'పితాశ్రీ! మేము పరుగుపోటీలో పడిపోయి, యూసుఫ్‌ను మా సామాను వద్దనే విడిచి పెట్టేశాము. అంతలోనే తోడేలు వచ్చి అతన్ని తినేసింది. మేము నిజం చెప్పినా మీరు మా మాటను నమ్మకపోవచ్చు.' 18. వారు యూసుఫ్ చొక్కాకు బూటకపు రక్తం అంటించి తెచ్చారు. వాళ్ళ తండ్రి ఇలా అన్నాడు : 'లేదు. మీ మనసు ఒక దారుణమయిన విషయాన్ని మీ కోసం కల్పించింది. ఇక ఓపిక పట్టడమే ఉత్తమం. మీరు కల్పించే విషయానికి సంబంధించి దైవసహాయాన్నే అర్థిస్తాను.'

19. ఒక బిడారు అటు వైపుగా వచ్చింది. వారు నీళ్లు తెచ్చే తమ మనిషిని పంపారు. అతను బావిలో చేద వేయగానే, (యూసుఫ్‌ను చూసి)

'శుభవార్త! ఇందులో ఒక బాలున్నాడ'ని అరిచాడు. వాళ్లు అతనిని వర్తక సామగ్రిగా భావించి, భద్రపరచుకున్నారు. వారు చేసేదంతా దైవానికి ఎరుకే. 20. వాళ్లు అతనిని కొద్దిపాటి మూల్యానికే, కొన్ని దిర్హములకే అమ్మివేశారు. ఈ విషయంలో వారు పెద్దగా ఆసక్తిని కనబరచలేదు.

21. ఈజిప్టు వాసులలో అతనిని కొనుగోలు చేసిన వ్యక్తి తన భార్యతో, 'ఇతన్ని బాగా చూసుకో. బహుశా ఇతను మనకు ప్రయోజకుడు కావచ్చు. లేదా మనం ఇతన్ని కొడుకుగానయినా చేసుకోవచ్చు' అన్నాడు. ఈ విధంగా మేము యూసుఫ్‌కు ఈ రాజ్యంలో చోటు కల్పించాము – విషయాల లోతుల్లోకి వెళ్ళే విద్యను నేర్పటానికి! తన కార్యాన్ని నెరవేర్చటంలో దేవుడు తిరుగులేనివాడు. కాని చాలామంది (దైవలీలను) తెలుసుకోలేరు. 22. అతను యుక్త వయస్సుకు చేరుకునేసరికి మేమతనికి నిర్ణయశక్తినీ, జ్ఞానాన్ని వొసగాము. సదాచరణ చేసే వారికి మేము ఇలాగే మంచి ప్రతిఫలం ప్రసాదిస్తూ ఉంటాము.

23. యూసుఫ్ ఏ స్త్రీ ఇంట ఉండేవాడో, ఆమె అతనిని కవ్వించటం మొదలెట్టింది. ఒకనాడు ఆమె తలుపులు మూసేసి, 'రా ... రా' అంటూ అతన్ని వివశుణ్ణి చేయజూసింది. యూసుఫ్ ఇలా అన్నాడు : 'దేవుని శరణు! ఆయన నా ప్రభువు. ఆయన నన్ను మంచి స్థితిలో ఉంచాడు. నిశ్చయంగా దుర్మార్గులు ఎన్నటికీ కృతకృత్యులు కాలేరు.' 24. ఆ స్త్రీ అతనిని మోహించింది. అతను కూడా ఆమెకు లొంగిపోయేవాడే – ఆ క్షణంలో అతను తన ప్రభువు నిదర్శనాన్ని చూసి ఉండకపోతే. మేమతని నుండి చెడుగును, నీతి బాహ్యతను దూరం చేయటానికి ఇలా జరిగింది. నిశ్చయంగా అతను మేము ఎన్నుకున్న ప్రత్యేక దాసుల్లోని వాడు.

25. వారిద్దరూ తలుపు వైపు పరుగెత్తారు. ఆ స్త్రీ యూసుఫ్ చొక్కాను వెనుక నుండి చింపివేసింది. వారిద్దరికీ తలుపు వద్ద ఆమె భర్త ఎదురుపడ్డాడు. ఆమె (తన భర్తతో) ఇలా చెప్పింది : 'నీ ఇల్లాలి పట్ల దురుద్దేశం కలవాడిని చెరసాలలో వేయటమో లేదా కఠినంగా శిక్షించటమో తప్ప మరే శిక్ష

కాగలదు?' 26. సంజాయిషీగా యూసుఫ్ ఇలా అన్నాడు : 'ఈవిడగారే నన్ను కవ్వించేందుకు యత్నించింది.' అప్పుడు ఆ స్త్రీ వంశీయుల్లోని ఒక వ్యక్తి సాక్ష్యమిస్తూ, 'ఒకవేళ ఇతని చొక్కా ముందు నుండి చిరిగి ఉంటే స్త్రీ చెప్పేది నిజం, ఇతను అబద్ధం చెబుతున్నాడు. 27. ఒకవేళ ఇతని చొక్కా వెనకాల నుండి చిరిగి ఉంటే స్త్రీ చెప్పేది అబద్ధం, ఇతను చెప్పేది నిజం.' 28. అతని చొక్కా వెనుక నుండి చిరిగి ఉండటాన్ని అజీజ్ గమనించి ఇలా అన్నాడు : 'ఖచ్చితంగా ఇది మీ ఆడవాళ్ళ కుయుక్తే. నిశ్చయంగా మీ కుయుక్తులు మహా ఘోరంగా ఉంటాయి. 29. యూసుఫ్! ఈ విషయాన్ని మన్నించు. ఓ స్త్రీ! నీవు నీ తప్పుకుగాను క్షమాపణ కోరుకో. ముమ్మాటికీ తప్పు నీదే.'

30. నగర స్త్రీలు పరస్పరం చెప్పుకోసాగారు : 'అజీజ్ భార్య తన యువ బానిస వెంటపడింది. ఆమె అతని ప్రేమలో మరీ పిచ్చిదైపోయింది. ఏమైనా మా దృష్టిలో ఆమె చేసేది శుద్ధ తప్పు.' 31. ఆమె వారి టక్కరి మాటలు విని (తట్టుకోలేకపోయింది), వారిని పిలువనంపింది. వారి కోసం ఓ సదనాన్ని ఏర్పాటు చేసింది. వారిలో ప్రతి ఒక్కరికీ ఒక్కో కత్తి ఇచ్చింది. (సరిగ్గా వారు పండ్లు కోసుకుంటున్నప్పుడు) యూసుఫ్‌ను ఉద్దేశించి, 'వారి ముందుకు రా' అని ఆజ్ఞాపించింది. ఆ స్త్రీలు అతనిని చూడగానే ఆశ్చర్య చకితులయ్యారు. వాళ్లు తమ చేతులను కోసేసుకున్నారు. 'హాషాలిల్లాహ్! ఇతను మనిషి కాడు, ఇతనెవరో గొప్ప దైవదూతే' అనసాగారు. 32. అప్పుడు (అజీజ్ భార్య) ఇలా చెప్పింది : 'అతనే ఇతను. మీరంతా నా గురించి ఏవేవో చెప్పుకుంటున్నది ఇతని గురించే. నేనితన్ని మోహించటానికి ప్రయత్నించిన సంగతి నిజమే. కాని ఇతను తప్పించుకున్నాడు. ఇతను గనక నేను చెప్పినట్లు నడుచుకోకపోతే, తప్పకుండా చెరసాల పాలై, అవమానితుడవుతాడు.' 33. యూసుఫ్ ఇలా ప్రార్థించాడు : 'నా ప్రభూ! నాకు ఆ కారాగారమే మిన్న, వీళ్ళు పిలిచే పాడు పనికి పాల్పడటం కన్నా. నీవు గనక వీళ్ల కుయుక్తులను నా నుండి తొలగించకపోతే, నేను వీళ్ల వలలో చిక్కుకునే ప్రమాదముంది. (అదే జరిగితే) నేను అజ్ఞానుల్లో ఒకడినైపోతాను.' 34. అతని ప్రభువు అతని ప్రార్థనను ఆమోదించాడు.

వాళ్ల మాయోపాయాన్ని అతన్నుండి తొలగించాడు. నిశ్చయంగా ఆయన (మొరలను) ఆలకించేవాడు, అన్నీ తెలిసినవాడు.

35. నిదర్శనాలన్నింటినీ చూసిన తర్వాత కొంతకాలం పాటు అతనిని కారాగారంలో ఉంచటమే నయమని వారికి (అధికారులకు) అనిపించింది.
36. కారాగారానికి అతనితో పాటే మరో ఇద్దరు యువకులు కూడా వచ్చారు. వారిలో ఒకతను (ఒకనాడు), 'నేను సారాయి పిండుతున్నట్లు కలగన్నాను' అన్నాడు. రెండవ వ్యక్తి, 'నేను నా తలపై రొట్టెలు మోస్తున్నట్లు కలలో చూశాను. వాటిని పక్షులు తింటున్నాయి'. 'మాకు ఈ కలల భావార్థం చెప్పండి. చూస్తుంటే మీరు పుణ్యపురుషునిలా కనిపిస్తున్నార'ని (వారిద్దరూ) అభ్యర్థించారు.

37. యూసుఫ్ ఇలా చెప్పాడు : 'ఇక్కడ మీకు ఇవ్వబడే భోజనం రాక ముందే నేను మీకు ఈ కలల నిగూఢార్థం చెబుతాను. ఇది నా ప్రభువు నాకు ప్రసాదించిన జ్ఞాన సంపదలోనిది. వాస్తవానికి నేను నిజ దైవాన్ని విశ్వసించనివారి, పరలోకాన్ని తిరస్కరించేవారి జీవన విధానాన్ని పరిత్యజించాను. 38. నేను నా పెద్దలయిన ఇబ్రాహీమ్, ఇస్‌హాఖ్, యాఖూబ్‌ల విధానాన్ని అనుసరించాను. అల్లాహ్‌కు సహవర్తులుగా వేటినయినాసరే కల్పించే హక్కు మనకు లేదు. మనపైనా, సమస్త మానవులపైనా గల దైవానుగ్రహమిది. కాని జనులలో చాలామంది కృతజ్ఞులుగా మసలుకోరు. 39. 'ఓ నా కారాగార సహచరులారా! విభిన్న ఆరాధ్య దైవాలు ఉండటం మంచిదా? లేక తిరుగులేని అధికారి అయిన అల్లాహ్ ఒక్కడే ఉండటం మంచిదా (మీరే చెప్పండి)? 40. ఆయనను కాదని మీరు వేటినయితే పూజిస్తున్నారో, అవి కొన్ని పేర్లు తప్ప మరేమీ కావు – అవి కూడా మీరూ, మీ పూర్వీకులు కల్పించుకున్నవే. దేవుడు వాటికి సంబంధించిన ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయలేదు. పరిపాలనాధికారం ఒక్క ఆ దైవానికే చెందుతుంది. తనను తప్ప వేరెవరినీ ఆరాధించరాదన్నదే ఆయన ఆదేశం. ఇదే సరయిన, స్థిరమయిన ధర్మం. కాని అనేకులు ఈ విషయాన్ని తెలుసుకోరు.

41. నా చెరసాల సహవాసులారా! మీలోని ఒకడు తన దొరగారికి (చక్రవర్తికి) సారా త్రాగిస్తాడు. మరొకరికి శిలువ వేయబడుతుంది. తరువాత పక్షులు అతని తలను పొడిచి తింటాయి. మీరు అడిగిన వ్యవహారంపై తీర్పు ఇదే.' 42. వారిరువురిలో విముక్తి పొందుతాడని భావించిన వ్యక్తినుద్దేశించి యూసుఫ్, 'నీ దొరగారి వద్ద నా గురించి ప్రస్తావించు' అన్నాడు. కాని షైతాన్ అతన్ని తన దొరగారి సమక్షంలో ప్రస్తావన తీసుకురాకుండా మరుపునకు లోనుచేశాడు. అందువల్ల అతను ఏండ్ల తరబడి కారాగారంలోనే ఉండిపోయాడు.

43. చక్రవర్తి ఇలా చెప్పాడు : 'నేనొక కల గన్నాను. ఏడు బలిసిన ఆవులున్నాయి. వాటిని ఏడు బక్కచిక్కిన ఆవులు తినివేస్తున్నాయి. ఏడు ధాన్యపు వెన్నులు పచ్చగా ఉండగా, మరో ఏడు ధాన్యపు వెన్నులు ఎండిపోయాయి. సభాసదులారా! మీరు కలల భావాన్వయం తెలిసిన వారయితే, నేను కన్న కలకు భావార్థం ఏమిటో చెప్పండి!' 44. 'ఇది ఊహాత్మకమయిన కల మాత్రమే. ఇలాంటి కలల భావార్థం మాకు తెలియదు' అని వారన్నారు.

45. అప్పుడు ఆ ఇద్దరు ఖైదీలలో (జైలు) నుండి విడుదల అయిన వ్యక్తికి, సుదీర్ఘకాలం తర్వాత (యూసుఫ్ విషయం) గుర్తుకు వచ్చింది. వెంటనే అతనిలా అన్నాడు : 'నేను మీకు దీని భావార్థం తెలుపుతాను. కాస్త నన్ను (యూసుఫ్ వద్దకు) వెళ్ళనివ్వండి.'

46. 'యూసుఫ్, సత్యసంధుడా! కాస్త నాకు ఈ స్వప్న సారాంశం వివరించవా! ఏడు బలిసిన ఆవులున్నాయి. వాటిని ఏడు బక్కచిక్కిన ఆవులు భక్షిస్తున్నాయి. ఏడు ధాన్యపు వెన్నులు పచ్చగా ఉంటే, మరో ఏడు ఎండిపోయి ఉన్నాయి. (నీవు గనక దీని అన్వయం తెలిపితే) నేను వారి వద్దకు వెళతాను – తద్వారా వారు విషయం తెలుసుకుంటారు' అని విన్నవించుకున్నాడు.

47. యూసుఫ్ వివరించాడు : 'మీరు ఏడేండ్లపాటు నిరాఘాటంగా సేద్యం చేస్తారు. పంట కోసిన పిదప మీరు తినటానికి అవసరమయిన

కొంత ధాన్యం తీసుకుని, మిగిలినదంతా కంకుల సమేతంగా భద్రపరచండి. 48. ఆ తర్వాతి ఏడేండ్లు మహా గడ్డుగా ఉంటాయి. ఆ దుర్భిక్ష సమయంలో మీరు ఇప్పుడు నిల్వచేసుకున్న ధాన్యాన్నంతా తినేస్తారు. కొద్దో గొప్పో మిగిలినా అది మీరు భద్రపరచుకున్నదే అయి ఉంటుంది. 49. అటు పిమ్మట ఒక సంవత్సరం వస్తుంది – ఆ ఏడు ప్రజల కొరకు వర్షాలు పుష్కలంగా కురుస్తాయి. అప్పుడు వారు (ద్రాక్ష) రసం పిండుతారు.'

50. 'అతనిని నా వద్దకు తీసుకు రండి' అని చక్రవర్తి ఆదేశించాడు. రాజదూత యూసుఫ్ వద్దకు వచ్చినపుడు అతనిలా అన్నాడు : 'నువ్వు నీ దొరగారి వద్దకే తిరిగి వెళ్లు. తమ చేతులు కోసుకున్న వనితల వ్యవహారం గురించి విచారించమని చెప్పు. నిశ్చయంగా నా ప్రభువుకు వారి కుయుక్తుల గురించి బాగా తెలుసు.' 51. చక్రవర్తి వారిని (ఆ స్త్రీలను) విచారిస్తూ, 'మీరు యూసుఫ్‌ను కవ్వించటానికి ప్రయత్నించినపుడు అసలేం జరిగింది?' అని అడగ్గా, దానికి వారంతా, 'హాషాలిల్లాహ్! మేమతనిలో ఏ దోషాన్నీ చూడలేదు' అన్నారు. అజీజు భార్య ఇలా అంది : 'ఇప్పుడు నిజం బయటపడింది. అతన్ని వివశుణ్ని చేయటానికి యత్నించింది నేనే. నిశ్చయంగా అతను సత్యవంతుడు.'

52. (యూసుఫ్ ఇలా అన్నాడు) 'నేనిలా విచారణ జరపమని ఎందుకన్నానంటే; (అజీజ్) పరోక్షంలో నేను ఎలాంటి నమ్మకద్రోహానికి పాల్పడలేదన్న సంగతి తెలిసిరావాలి. నిశ్చయంగా దేవుడు స్వామి ద్రోహం తలపెట్టేవారి ఎత్తుగడలను సాగనీయడు. ◆ (13) 53. నేను నా మనసు పవిత్రతను గురించి చాటుకోవటం లేదు. మనసైతే చెడులు చేయమనే ప్రేరేపిస్తూ ఉంటుంది. నా ప్రభువు కరుణించిన వారు మాత్రమే దీని నుండి సురక్షితంగా ఉండగలుగుతారు. నిశ్చయంగా నా ప్రభువు క్షమించేవాడు, కరుణించేవాడు.'

54. చక్రవర్తి ఇలా చెప్పాడు : 'అతనిని నా దగ్గరకు తీసుకు రండి. నేనతనిని నా ఆంతరంగిక సలహాదారుగా నియమించుకుంటాను.' యూసుఫ్ అతనితో సంప్రదింపులు జరిపిన పిమ్మట చక్రవర్తి ఇలా చెప్పాడు : 'ఈ

రోజు నుండి మీరు మా వద్ద ఆదరణీయులుగా, ఆంతరంగిక కార్యదర్శిగా ఉంటారు.' 55. యూసుఫ్ ఇలా అన్నాడు : 'నన్ను ఈ రాజ్యంలోని ఒనరులపై పర్యవేక్షకునిగా నియమించండి. నేను వాటిని కనిపెట్టుకుని ఉంటాను. ఆ పరిజ్ఞానం నాకుంది.' 56. ఈ విధంగా మేము యూసుఫ్‌కు రాజ్యంలో అధికారం ప్రసాదించాము. రాజ్యంలో తాను కోరిన చోట ఉండే సౌకర్యం కల్పించాము. ఈ విధంగా మేము కోరిన వారికి మా కారుణ్యభాగ్యం ఇస్తాము. సజ్జనుల ప్రతిఫలాన్ని మేము వృధా చేయము. 57. విశ్వసించి, భయభక్తుల వైఖరిని అవలంబించిన వారికి లభించే పరలోక ప్రతిఫలం ఇంతకన్నా శ్రేష్ఠమైనది. 58. యూసుఫ్ సోదరులు ఈజిప్టు వచ్చి, అతని ఎదుట హాజరయ్యారు. యూసుఫ్ వాళ్ళను గుర్తుపట్టాడు. కాని వారు యూసుఫ్‌ను గుర్తుపట్టలేదు. 59. అతను వారి సామానును సిద్ధపరచిన తరువాత, '(మరోసారి వచ్చేటప్పుడు) మీ సవతి సోదరుణ్ణి కూడా తీసుకురండి. నేను ఏ విధంగా ధాన్యం (పూర్తిగా) కొలిచి ఇస్తున్నానో, అతిథులకు ఎలా మర్యాద చేస్తున్నానో మీరు చూడటం లేదా? 60. మీరు గనక అతనిని తీసుకు రాకపోతే, నా దగ్గర మీకు ధాన్యం లభించదు. అసలు మీరు నా దగ్గరకు రానవసరం లేదు' అన్నాడు. 61. దానికి వారు, 'ఈ విషయమై మేము అతని తండ్రిని ఒప్పించటానికి కృషి చేస్తాము. ఎలాగయినా మేము ఈ పని చేయాల్సిందే' అన్నారు.

62. యూసుఫ్ తన కార్యకర్తలనుద్దేశ్యించి, 'వాళ్ళ ధనాన్ని వాళ్ల సామానులోనే పెట్టేయండి. వారు తమ ఇంటికి చేరుకున్నప్పుడు దానిని గమనించి, బహుశా మళ్లీ తిరిగి రావచ్చు' అన్నాడు. 63. వారు తమ తండ్రి వద్దకు తిరిగి వచ్చినపుడు, 'నాన్నగారూ! ఇకమీదట మనకు ధాన్యం ఇవ్వటంపై ఆంక్ష విధించబడింది. మేము ధాన్యం తెచ్చుకోవాలంటే మా తమ్ముణ్ణి (బిన్ యామీన్‌ను) మీరు మా వెంట పంపక తప్పదు. అతనికి రక్షకులుగా మేమున్నాము కదా!' అన్నారు. 64. యాఖూబ్ ఇలా చెప్పాడు: 'లోగడ ఇతని సోదరుని వ్యవహారంలో మిమ్మల్ని నమ్మినట్లే ఇతని వ్యవహారంలో కూడా మిమ్మల్ని నమ్మమంటారా? అసలు దేవుడే సర్వోత్తమ రక్షకుడు. ఆయనే అందరినీ మించిన కరుణాకరుడు.'

65. వారు తమ సామానును విప్పినపుడు, తమ సొమ్ము కూడా వాపసు చేయబడిన సంగతిని గమనించారు. వారిలా అన్నారు : 'నాన్నా! మనకు ఇంకేం కావాలి? మన సొమ్ము కూడా మనకు తిరిగి ఇచ్చేయబడింది. ఇప్పుడు మళ్లీ వెళ్ళి మన ఇంటివారలకు కావలసిన ఆహార ధాన్యాన్ని తెచ్చుకుంటాం. మా తమ్ముణ్ణి జాగ్రత్తగా చూసుకుంటాం. ఒక ఒంటె బరువు ధాన్యం అదనంగా కూడా తెచ్చుకుంటాం. ఇప్పుడు తెచ్చిన ధాన్యం తక్కువే.'
66. యాఖూబ్ ఇలా అన్నాడు : 'మీరతన్ని సురక్షితంగా నా దగ్గరకు తీసుకు వస్తామని దైవసాక్షిగా వాగ్దానం చేయనంత వరకూ నేనితన్ని మీతో పంపను. మీరంతా ముట్టడించబడితే అది వేరే విషయం.' వారంతా తండ్రి సమక్షంలో గట్టిగా మాటిచ్చినపుడు అతనిలా అన్నాడు : 'మనం ఆడిన మాటను దేవుడు కనిపెట్టుకునే ఉన్నాడు.'

67. యాఖూబ్ ఇలా అన్నాడు : 'నా కుమారులారా! మీరంతా ఒకే ముఖద్వారం గుండా (ఈజిప్టు నగరంలో) ప్రవేశించకండి. వేర్వేరు ద్వారాల గుండా వెళ్ళండి. నేను మిమ్మల్ని దైవ నిర్ణయం నుండి ఏ విధంగానూ రక్షించలేను. దైవాదేశం మాత్రమే చెల్లుబాటు అవుతుంది. నేను ఆయన్నే నమ్ముకున్నాను. నమ్ముకునే వారంతా ఆయన్నే నమ్ముకోవాలి.' 68. వారు తమ తండ్రి సూచించిన విధంగానే (ఈజిప్టు రాజ్యంలో) ప్రవేశించారు. దేవుడు నిర్ణయించిన దాని నుండి అతను వారిని ఏ విధంగానూ రక్షించలేడు. కాకపోతే యాఖూబ్ తన ఆంతర్యంలో రేకెత్తిన ఒక మాటను వ్యక్తపరిచాడంతే. నిశ్చయంగా అతను మేము ప్రసాదించిన జ్ఞానంతో జ్ఞాన సంపన్నుడయ్యాడు. అయితే చాలామంది (ఈ పరమార్థాన్ని) తెలుసుకోరు.

69. వారంతా యూసుఫ్ వద్దకు చేరుకున్నప్పుడు, యూసుఫ్ తన సోదరుణ్ణి (బిన్ యామీన్‌ను) తన దగ్గరే ఉంచుకుని, 'నేను నీ సోదరుణ్ణి. కాబట్టి ఇప్పటి వరకూ వారు చేస్తూ వచ్చిన దానిపై దుఃఖించకు' అన్నాడు. 70. మరి వారి సామానును సిద్ధం చేసిన మీదట, తన సోదరుని సామానులో నీరు త్రాగే గిన్నెను పెట్టించాడు. తరువాత ప్రకటించేవాడొకడు, 'ఓ బిడారు జనులారా! మీరు దొంగలు' అని ప్రకటించాడు. 71. వారు వాళ్ళ వైపు

తిరిగి, 'ఇంతకీ మీ వస్తువు ఏమయినా పోయిందా?' అని అడిగారు. 72. 'మా రాజ కొలమానం ఒకటి కనిపించటం లేదు. దానిని తెచ్చి ఇచ్చిన వారికి ఒక ఒంటె బరువు ధాన్యం బహుమానంగా లభిస్తుంది. ఆ బాధ్యత నాది' అని ఆ వ్యక్తి చెప్పాడు. 73. సమాధానంగా వారిలా అన్నారు : 'దైవసాక్షి! మీకు తెలుసు – మేము ఈ రాజ్యంలో అరాచకం సృష్టించటానికి రాలేదు. మేము దొంగలం కూడా కాము.' 74. 'ఒకవేళ మీరు అబద్ధం చెబుతున్నారని రుజువయితే, దొంగతనం చేసిన వాడికి శిక్ష ఏమిటి?' అని (రాజ భటులు) ప్రశ్నించారు. 75. 'ఎవడి సంచిలో ఆ కొలమానం దొరుకుతుందో అతనికే ఆ శిక్ష పడాలి. మేము దుర్మార్గులను ఇలాగే శిక్షిస్తాము' అని వారన్నారు. 76. అప్పుడు అతను తన తమ్ముని సామాను సోదా చేయకముందు, వారి సంచులను సోదా చేయటం మొదలెట్టాడు. ఆఖరికి తన తమ్ముని సామానులో నుండి ఆ కొలమానాన్ని బయటికి తీశాడు. ఈ విధంగా మేము యూసుఫ్‌కు ఉపాయాన్ని సూచించాము. అన్యథా అతను అక్కడి రాజధర్మం (శాసనం) ప్రకారం తన తమ్ముణ్ణి తన వద్ద ఆపుకోలేడు – దైవచిత్తమయితే తప్ప! (ఈ విధంగా) మేము తలచిన వారి అంతస్తులను పెంచుతాము. జ్ఞానులందరినీ మించిన జ్ఞాని ఒకడున్నాడు సుమా!

77. వారిలా అన్నారు : 'ఒకవేళ ఇతను దొంగతనం చేసినా ఆశ్చర్యపోనవసరం లేదు. లోగడ ఇతని అన్న కూడా దొంగతనానికి పాల్పడినవాడే.' వారి ఈ మాటను విని యూసుఫ్ లోలోపలే బాధను దిగమ్రింగాడు. దానిని వ్యక్తపరచలేదు. మనసులోనే ఇలా అ(నుకు)న్నాడు: 'ఎంతగా దిగజారిపోయారు మీరు! మీరు కల్పించి చెబుతున్న మాటలు దైవానికి ఎరుకే.' 78. తరువాత వారిలా అభ్యర్థించారు : 'ఓ అజీజ్! ఇతని తండ్రి చాలా ముసలివాడు. కాబట్టి మీరు ఇతని స్థానంలో మాలో ఎవరినయినా ఆపుకోండి (ఇతన్ని మాత్రం విడిచిపెట్టండి). మాకు తమరు మహా పురుషునిలా కానవస్తున్నారు.' 79. యూసుఫ్ ఇలా అన్నాడు : 'అల్లాహ్ శరణు! మరో వ్యక్తిని మేమెలా ఆపుకోగలం? ఎవరి వద్ద మా వస్తువు

దొరికిందో, అతన్నిగాక మరొకరిని నిర్బంధించినట్లయితే మేము అన్యాయానికి ఒడిగట్టిన వారవుతాము.'

80. వారీ వ్యవహారంలో సర్వవిధాలా నిరాశకు లోనయినపుడు, అక్కడి నుండి వేరై పరస్పరం సంప్రతించుకున్నారు. వారందరిలోకీ పెద్దవాడు, 'మీ తండ్రి మీచేత దేవుని పేరుతో గట్టిగా ప్రమాణం చేయించిన విషయం మీకు తెలియదా? గతంలో యూసుఫ్ వ్యవహారంలో మీరు పాల్పడిన దురంతం కూడా మీకెరుకే. కాబట్టి నాన్నగారు స్వయంగా అనుమతిని ప్రదానం చేయనంత వరకూ లేదా దేవుడే నా గురించి ఏదయినా నిర్ణయం చేయనంత వరకు నేనీ భూభాగం నుండి రానుగాక రాను. ఆయన అందరికన్నా గొప్ప తీర్పరి. 81. మీరు నాన్నగారి వద్దకు వెళ్ళి ఆయనతో ఇలా చెప్పండి : 'ఓ నాన్నా! మీ కుమారుడు దొంగతనం చేశాడు. మాకు తెలిసిన విషయమే మీతో చెబుతున్నాము. రహస్య విషయాలకు మేము పర్యవేక్షకులం కాము కదా! 82. కావాలంటే మేము విడిది చేసిన ఆ నగర ప్రజలను అడిగి తెలుసుకోండి. మేము కలిసివచ్చిన బిడారు జనులను కూడా దర్యాప్తు చేసుకోండి. మేము నిజం చెబుతున్నాము.'

83. తండ్రి ఇలా అన్నాడు : 'లేదు. మీరు మీ మనోకల్పిత విషయం చెబుతున్నారు. సరే కానివ్వండి. నేను ఉత్తమరీతిలో ఓర్పు వహిస్తాను. అల్లాహ్ వారందరినీ నా దగ్గరకు తీసుకువస్తాడని ఆశిస్తున్నాను. ఆయన అన్నీ తెలిసినవాడు, వివేకవంతుడు.' 84. తరువాత అతను వారందరి నుండీ ముఖం త్రిప్పుకుని, 'అయ్యో, యూసుఫ్!' అన్నాడు. దుఃఖంతో అతని కళ్ళు తెల్లగా పాలిపోయాయి. బాధను లోలోపలే దిగమ్రింగుతూ ఉండిపోయాడు. 85. (కొడుకులు) చెప్పేవారు : 'దేవుని తోడు! మీరు యూసుఫ్‌నే గుర్తుచేసుకుంటూ, కృశించిపోయేలా లేదా ప్రాణాలు కోల్పోయేలా ఉన్నారు.' 86. దానికతను, 'నేను నా దుఃఖాన్ని, నా ఆవేదనను కేవలం దైవానికే నివేదించుకుంటాను. దేవుని తరఫున మీకు తెలియని విషయాలు నాకు తెలుసు. 87. నా కుమారులారా! వెళ్ళి యూసుఫ్‌ను గురించి, అతని సోదరుని

గురించి ఆరా తీయండి. దైవకారుణ్యం పట్ల నిరాశ చెందకండి. సత్య తిర స్కారులు మాత్రమే ఆయన కారుణ్యం పట్ల నిరాశకు లోనవుతారు' అన్నాడు.

88. తరువాత వారంతా యూసుఫ్ దగ్గరకు వచ్చి ఇలా విజ్ఞప్తి చేశారు : 'ఓ అజీజ్! మేమూ, మా కుటుంబీకులము, అంతా కష్టాల పాలయ్యాము. కొద్దిపాటి మొత్తాన్ని మాత్రమే తెచ్చాము. మాకు పూర్తి ధాన్యం కొలవండి. మాకు ధర్మం కూడా చేయండి. దేవుడు దానధర్మాలు చేసేవారికి మంచి ప్రతిఫలం ప్రసాదిస్తాడు.' 89. అతనిలా అడిగాడు : 'మీరు అజ్ఞాన స్థితిలో యూసుఫ్ పట్ల, అతని తమ్ముని పట్ల ఎలా వ్యవహరించారో తెలుసా?' 90. దానికి వారు ఉలిక్కిపడి, 'ఏమిటి, నిజంగా నువ్వే యూసుఫువా?' అన్నారు. 'అవును. నేనే యూసుఫ్‌ను. ఇతనేమో నా తమ్ముడు. దేవుడు మమ్మల్ని కటాక్షించాడు. నిశ్చయంగా ఎవడు దైవభీతితో మసలు కుంటాడో, ఓర్పు వహిస్తాడో – అలాంటి సద్వర్తనుల ప్రతిఫలాన్ని దేవుడు వృధా పోనివ్వడు' అని అతను చెప్పాడు.

91. 'దేవుని తోడు! దేవుడు నీకు మాపై ఔన్నత్యాన్ని వొసగాడు. నిశ్చయంగా మేమే అపరాధులము' అని సోదరులు ఒప్పుకున్నారు. 92. యూసుఫ్ ఇలా అన్నాడు : 'ఈ రోజు మీపై ఎలాంటి నిందారోపణ లేదు. దేవుడు మిమ్మల్ని క్షమించుగాక! ఆయన అందరికన్నా ఎక్కువగా కరుణించేవాడు. 93. మీరు నా ఈ చొక్కాను తీసుకెళ్ళి, నాన్నగారి ముఖారవిందంపై వేయండి. ఆయనకు చూపు తిరిగి వస్తుంది. మీరు సపరివార సమేతంగా నా దగ్గరకు వచ్చేయండి.'

94. ఇటు బిడారు (ఈజిప్టు నుండి) బయలుదేరటమే ఆలస్యం, అటు (కన్‌ఆన్‌లో ఉన్న) తండ్రి ఇలా అనసాగాడు : 'ఈ ముసలాడికి మతి చలించిందని మీరు అనుకోనంటే ఒక మాటంటాను. నేను యూసుఫ్ పరిమళాన్ని ఆఘ్రాణిస్తున్నాను'. 95. 'దేవుని తోడు! ఇప్పటికీ మీరు ఆ పాత భ్రమల వలయంలోనే పడి ఉన్నారు' అని అక్కడున్న వారన్నారు. 96. తరువాత శుభవార్త అందించే వ్యక్తి రాగానే, ఆ చొక్కాను యాఖూబ్

ముఖం మీద వేశాడు. అంతే! అతని కంటిచూపు తిరిగి వచ్చేసింది. అతనిలా అన్నాడు : 'మీకు తెలియని విషయాలు నాకు దేవుని తరఫున తెలుస్తాయని నేను మీతో అనలేదా?' 97. యూసుఫ్ సోదరులు ఇలా విన్నవించుకున్నారు: 'నాన్నా! మా పాపాల క్షమాపణకై ప్రార్థించండి. అసలు మేమే అపరాధులము.' 98. 'మీ క్షమాపణకై నేను నా ప్రభువును తప్పక వేడుకుంటాను. నిశ్చయంగా ఆయన ఎంతగానో క్షమించేవాడు, కరుణించేవాడు.'

99. వారంతా యూసుఫ్ వద్దకు వచ్చినపుడు, యూసుఫ్ తన తల్లిదండ్రులను తన సమీపంలో కూర్చోబెట్టుకున్నాడు. 'ఈజిప్టులో ప్రవేశించండి. దైవచిత్తమయితే మీరు ఇక్కడ సుఖశాంతులతో ఉండగలరు' అన్నాడు. 100. అతను తన తల్లిదండ్రులను ఉన్నత పీఠాలపై కూర్చోబెట్టుకున్నాడు. అందరూ అతని గౌరవార్థం వినమ్రతతో అభివాదం చేశారు. అప్పుడు యూసుఫ్ ఇలా అన్నాడు : 'నాన్నగారూ! నేను లోగడ కన్న కలకు భావార్థం ఇదే. నా ప్రభువు దీనిని నిజం చేసి చూపాడు. నన్ను చెరసాల నుండి విడుదల చేసి ఆయన నాకు మహోపకారం చేశాడు. నాకూ – నా అన్నదమ్ములకు మధ్య షైతాన్ చిచ్చుపెట్టిన మీదట, ఆయన మిమ్మల్ని పల్లెసీమ నుండి ఇక్కడకు తీసుకువచ్చి మనందరినీ ఏకం చేశాడు. నిశ్చయంగా నా ప్రభువు తాను చేయదలచుకున్న దానిని గొప్ప ఉపాయంతో – యుక్తితో – చేస్తాడు. ఆయన జ్ఞాన ధనుడు, వివేక సంపన్నుడు.

101. 'ఓ నా ప్రభూ! నీవు నాకు పరిపాలనాధికారంలో భాగం ఇచ్చావు. నాకు విషయాలను అన్వయించే విద్యను నేర్పావు. ఓ భూమ్యాకాశాల సృష్టికర్తా! నీవే నా రక్షకుడవు – ఇహంలోనూ, పరంలోనూ! నీకు విధేయుడనై (ముస్లిమునై) ఉన్న స్థితిలోనే నాకు మరణమొసగు. ఇంకా నన్ను సజ్జనులలో చేర్చుకో.

102. (ఓ ప్రవక్తా!) ఇది అగోచర సమాచారాలలోనిది. దీనిని మేము నీకు దివ్యవాణి (వహీ) రూపంలో తెలియపరుస్తున్నాము. యూసుఫ్ సోదరులు కూడబలుక్కుని, కుట్రలు పన్నుతున్నప్పుడు నీవు అక్కడ లేవు కదా!

103. నీవు ఎంతగా పరితపించినా అనేకులు విశ్వసించరు. 104. ఇందుకుగాను నీవు వారి నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. ఇది సమస్త లోకాలకు హితోపదేశం తప్ప మరొకటి కాదు.

105. భూమ్యాకాశాలలో ఎన్నో సూచనలున్నాయి. వాటి మీదుగా జనులు సాగిపోతూ ఉంటారు. కాని వాటిని గురించి అస్సలు పట్టించుకోరు. 106. జనులలో చాలామంది దైవాన్ని విశ్వసిస్తూనే ఆయనకు భాగస్వాములుగా ఇతరులను నిలబెడుతున్నారు. 107. ఏమిటి, దైవశిక్షలో భాగంగా ఏదయినా విపత్తు తమపై వచ్చిపడదనీ లేదా తాము తెలియని స్థితిలో ఉన్నప్పుడు అకస్మాత్తుగా ప్రళయం రాదని వారు ధీమాగా ఉన్నారా? 108. వారికి చెప్పు : 'ఇది నా మార్గం. నా దార్శనికత ఆధారంగా నేను దేవుని వైపునకు పిలుస్తున్నాను. నా వెంట ఉన్న సహచరులు కూడా (అదే చేస్తున్నారు). దేవుడు పరమ పవిత్రుడు, బహుదైవారాధన చేసేవారితో నాకెట్టి సంబంధం లేదు.'

109. (ఓ ప్రవక్తా!) నీకు పూర్వం మేము వివిధ జనావాసాల నుండి పంపిన ప్రవక్తలంతా మానవులే. మేము వారి వద్దకు వహీ (దివ్యవాణి) పంపేవారము. ఏమిటి, వారు ధరణిలో సంచరించి, తమ పూర్వీకుల పర్యవసానం ఏమయిందో గమనించటం లేదా? అయితే దైవానికి భయపడేవారికి పరలోక నెలవు ఎంతో శ్రేష్ఠమైనది. మీరు ఆ మాత్రం అర్థం చేసుకోలేరా? 110. కడకు ప్రవక్తలు నిస్పృహకు లోనయి, తమతో అబద్ధం పలకబడిందని వారు తలపోసినపుడు, (అనూహ్యంగా) మా సహాయం వారికి అందింది. అప్పుడు మేము తలచిన వారికి విముక్తి లభించింది. అపరాధ జనుల నుండి మా శిక్ష తొలగిపోవటం అసంభవం.

111. వీరి గాథలలో విజ్ఞులకు గొప్ప గుణపాఠం ఉంది. ఇదేదో కాల్పనిక విషయం కాదు. పైగా ఇది (ఖుర్ఆన్) తనకు పూర్వం ఉన్న వాటికి ధ్రువీకరణ. ప్రతి విషయానికి కూలంకషమయిన వివరణ; విశ్వసించే జనులకు మార్గదర్శనం, కారుణ్యం.

# 13. అర్రాద్ (ఉరుము)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ మీమ్ రా. ఇవి దైవగ్రంథ వాక్యాలు. నీ ప్రభువు తరఫు నుండి నీపైన అవతరించినదంతా సత్యం. కాని చాలామంది నమ్మరు.
2. అల్లాహ్‌యే ఆకాశాలను మీకు కనిపించే స్తంభాలు లేకుండా అంతేసి ఎత్తున నిలిపి ఉంచినవాడు. తరువాత ఆయన తన అధికార పీఠాన్ని అలంకరించాడు. ఆయనే సూర్యచంద్రులను శాసననిబద్ధత కలిగి ఉండేలా చేశాడు – ప్రతిదీ ఒక్కో నిర్ధారిత వేళ ప్రకారం నడుస్తోంది. దేవుడే సమస్త వ్యవహారాలను నిర్వహిస్తున్నాడు. ఆయన తన సూచనలను స్పష్టంగా విడమరచి చెబుతున్నాడు – మీరు మీ ప్రభువును కలుసుకోవటంపై దృఢనమ్మకం కలిగి ఉండాలని.

3. ఆయనే భూమిని సువిశాలంగా పరచాడు. అందులో పర్వతాలను నెలకొల్పాడు. నదీనదాలను ప్రవహింపజేశాడు. అన్ని రకాల పండ్లు ఫలాల జతలను అందులో సృష్టించాడు. ఆయన రాత్రిని పగటిపై కప్పివేస్తాడు. నిశ్చయంగా ఇందులో చింతన చేసే వారికి సూచనలున్నాయి.

4. భూమిలో కూడా దగ్గర దగ్గరగానే పలు క్షేత్రాలున్నాయి. ద్రాక్ష తోటలు, పంట పొలాలున్నాయి. ఖర్జూర చెట్లున్నాయి. వాటిలో కొన్ని ఒంటిగా ఉంటే, మరికొన్ని జతగా ఉన్నాయి. వాటన్నింటికీ సరఫరా అయ్యే నీరు ఒక్కటే. అయితే మేము వాటిలో ఒకదానికి మరో దానిపై ప్రాధాన్యతను ఇస్తున్నాము. యోచన చేసేవారికి ఇందులో పలు సూచనలున్నాయి.

5. ఒకవేళ నీవు ఆశ్చర్యపడేవాడవైతే, వారి (అవిశ్వాసుల) ఈ పలుకు నిన్ను ఆశ్చర్యపరచాలి. వారిలా అంటారు : మేము (మరణించి) మట్టిగా మారిన తరువాత కూడా మళ్లీ సరికొత్తగా సృష్టించబడతామా? – అలాంటివారే తమ ప్రభువును నిరాకరించినవారు. అలాంటివారి మెడలలోనే

కంఠపాశాలు పడేవి. వారే నరకాగ్నివాసులు. వారందులో కలకాలం ఉంటారు.

6. వారు మేలుకు ముందే కీడు కొరకు తొందరపెడుతున్నారు. వాస్తవానికి వీరికి పూర్వం కూడా ఇలాంటి దృష్టాంతాలు గడచి ఉన్నాయి. ప్రజలు దుర్మార్గాలకు ఒడిగట్టినప్పటికీ నీ ప్రభువు క్షమించేవాడే. నిశ్చయంగా నీ ప్రభువు శిక్షించటంలో కూడా చాలా కఠినుడే.

7. సత్య తిరస్కారానికి పాల్పడినవారు, 'ఇతనిపై ఇతని ప్రభువు తరఫున ఏదయినా సూచన ఎందుకు అవతరించలేదు?' అని అంటున్నారు. (ప్రవక్తా!) నీవు సావధానపరిచేవాడవు మాత్రమే. ప్రతి జాతికీ ఒక మార్గదర్శకుడు ఉన్నాడు.

8. ప్రతి స్త్రీ గర్భంలో ఏముందో దైవానికి తెలుసు. గర్భాలలో పెరిగే తరిగే వాటిని కూడా ఆయన ఎరుగు. ఆయన వద్ద ప్రతి దానికీ ఒక పరిమాణం నిర్ధారితమై ఉంది. 9. ఆయన గోప్యంగా ఉన్నదానినీ, బహిర్గతమై ఉన్నదానినీ ఎరిగినవాడు; అందరికన్నా గొప్పవాడు, మహోన్నతుడు. 10. మీలో ఎవరయినా తన మాటను మెల్లగా పలికినా, బిగ్గరగా పలికినా, రాత్రి చీకటిలో దాగినదయినా, పగటి వెలుగులో నడిచేదయినా – దైవానికి అన్నీ సమానమే.

11. ప్రతి వ్యక్తికి ముందూ వెనుకా అతని కావలివాళ్ళు ఉన్నారు. వారు దైవాదేశానుసారం అతన్ని కనిపెట్టుకుని ఉంటారు. ఏ జాతి అయినా – మనస్ఫూర్తిగా – తనను తాను మార్చుకోనంత వరకూ దేవుడు కూడా దాని స్థితిని మార్చడు. దేవుడు ఏ జాతి వారినయినా ఏదేని ఒక విపత్తుకు లోను చేయదలిస్తే, అది వారిపై నుండి తొలగిపోయే ప్రసక్తే ఉండదు. దైవానికి వ్యతిరేకంగా వారికి తోడ్పడేవాడు కూడా ఎవడూ ఉండడు.

12. ఆయనే మీకు మెరుపు తీగను చూపిస్తున్నాడు – దానివల్ల మీలో భయం కలగటంతోపాటు ఆశలు కూడా చిగురిస్తాయి. మరాయనే నీటితో నిండిన బరువైన మేఘాలను లేపుతున్నాడు. 13. ఉరుముల గర్జన

సయితం ఆయన స్తోత్రంతో సహా ఆయన పవిత్రతను కొనియాడుతోంది. దైవదూతలు కూడా ఆయన పట్ల భయంతో (వణుకుతూ ఆయన్ని కీర్తిస్తూ ఉంటారు). ఆయన పిడుగులను పంపిస్తాడు. వాటిని తాను కోరిన వారిపై పడవేస్తుంటాడు. వారు దేవుని విషయంలో జగడమాడుతున్నారు. వాస్తవానికి ఆయన పట్టు చాలా గట్టిది.

14. ఆయన్ని మొరపెట్టుకోవటమే సత్యం. ఆయన్ని కాదని జనులు మొరపెట్టుకుంటున్న వారంతా వారి మొరను ఆలకించలేరు. వారిని మొరపెట్టుకోవటం అనేది ఒక వ్యక్తి నీళ్ళ వైపు తన రెండు చేతుల్నీ చాపి, అవి తన నోటి దాకా రావాలని ఆశించటం వంటిదే. అది అతని నోటిదాకా రానే రాదు. సత్యతిరస్కారుల మొరలన్నీ నిరర్థకమైనవే.

15. ఆకాశాలలో, భూమిలో ఉన్నవన్నీ – తమకు ఇష్టం ఉన్నా, ఇష్టం లేకపోయినా దైవానికే సాష్టాంగపడుతున్నాయి. వాటి నీడలు కూడా ఉదయం, సాయంత్రం ఆయనకు ప్రణమిల్లుతున్నాయి. 16. 'ఆకాశాలకు, భూమికి ప్రభువు ఎవరు?' అని వారిని అడుగు. **'అల్లాహ్‌యే'** అని చెప్పు. 'అయిననూ మీరు ఆయనను కాదని, తమ స్వయానికి సయితం లాభంగానీ, నష్టంగానీ చేకూర్చుకోలేని వాటిని మీ సహాయకులుగా చేసుకుంటున్నారా?' అని వారిని నిలదీసి అడుగు. ఇలా అడుగు : 'ఏమిటి, అంధుడు – కంటిచూపు ఉన్నవాడూ సమానులు కాగలరా? లేదా కారు చీకట్లూ – కాంతిరేఖలు సమానం కాగలవా? వారు దైవానికి సహవర్తులుగా నిలబెట్టుకున్నవారు దేవుడు సృష్టించిన విధంగా ఏదన్నా సృష్టించారా? ఆ తరువాత పుట్టుక విషయంలో వారికి సందేహం గాని కలిగిందా?' వారికి చెప్పు : 'అల్లాహ్‌యే అన్నింటినీ సృష్టించినవాడు. ఆయన ఒక్కడే, ఎల్లరిపై తిరుగులేని ఆధిక్యత కలవాడు.'

17. ఆయనే ఆకాశం నుండి నీళ్ళను కురిపించాడు. ఆ తరువాత కాలువలు, ఏరులు తమ తమ పరిమాణాన్నిబట్టి (నీటిని గ్రహించి) ప్రవహించాయి. అటుపిమ్మట ఉధృతమయిన వరద నీటిపై నురుగు

పేరుకుంది. జనులు ఆభరణాలను లేదా లోహపు పనిముట్లను తయారు చేయటానికి వస్తువులను అగ్నిలో కాల్చినపుడు కూడా ఇలాగే నురుగు పైకి వస్తుంది. ఈ విధంగా దేవుడు సత్యాసత్యాల ఉపమానాన్ని విశదీకరిస్తున్నాడు. మొత్తానికి నురుగు అంతా ఆవిరైపోతుంది. ప్రజాబాహుళ్యానికి పనికివచ్చే వస్తువు మాత్రం ధరిత్రిపై మిగిలి ఉంటుంది. ఇదేవిధంగా దేవుడు ఉదాహరణలను ఇస్తున్నాడు.

18. తమ ప్రభువు పిలుపునకు సకారాత్మకంగా స్పందించిన వారికి శుభం కలుగుతుంది. మరెవరయితే ఆయన పిలుపుకు నకారాత్మకంగా స్పందించారో, వారి వద్ద భూమిలో ఉన్న సంపదంతా ఉన్నా, దాంతోపాటు దానికి సమానంగా మరి అంత ఉన్నా, దాన్నంతటినీ వారు పరిహారంగా సమర్పించుకున్నా (చాలదు). వారి లెక్క బహు కఠినంగా ఉంటుంది. వారి నివాస స్థలం నరకమే. అది మా చెడ్డ నివాసం.

19. నీ ప్రభువు తరఫున నీపై అవతరింపజేయబడినదంతా సత్యమని తెలుసుకున్న వ్యక్తి గుడ్డివానితో సమానుడవుతాడా? విజ్ఞులైన వారే ఉపదేశాన్ని గ్రహిస్తారు.

20. (వారెలాంటివారంటే) వారు దేవునితో చేసిన వాగ్దానాన్ని నెరవేరుస్తారు. వాగ్దాన భంగానికి పాల్పడరు. 21. దేవుడు కలపమని ఆజ్ఞాపించిన సంబంధాలను కలుపుతారు. ఇంకా వారు తమ ప్రభువుకు భయపడుతూ ఉంటారు. కఠినంగా లెక్క తీసుకోబడుతుందేమోనని భీతిల్లుతూ ఉంటారు. 22. ఇంకా – వారు తమ ప్రభువు ప్రసన్నత నిమిత్తం ఓర్పు వహిస్తారు. నమాజును స్థాపిస్తారు. మేము ప్రసాదించిన జీవనోపాధిలో నుండి గోప్యంగానూ, బహిరంగంగానూ ఖర్చుచేస్తుంటారు. చెడును మంచితో నిర్మూలిస్తారు. ఇలాంటి వారి కోసమే పరలోక నెలవు. 23. శాశ్వతమైన ఉద్యానవనాలు, వాటిలో వారు ప్రవేశిస్తారు. వారి తాతముత్తాతలు, వారి భార్యలు, వారి సంతానంలో ఎవరెవరు సద్వర్తనులో వారు కూడా వారితోపాటే ఉంటారు. దైవదూతలు అన్ని ద్వారాల నుండి వారి వద్దకు వస్తారు.

24. ఇలా అంటారు : 'మీరు వహించిన సహనానికి బదులుగా మీకు శాంతి కలుగుగాక! ఎంత మంచిది ఈ పరలోక నెలవు!'

25. ఇకపోతే ఎవరు దేవుని ప్రమాణాన్ని దృఢపరచిన మీదట భంగపరుస్తారో, దేవుడు కలుపమని ఆజ్ఞాపించిన వాటిని (బంధుత్వ సంబంధాలను) త్రెంచుతారో, భువిలో కల్లోలాన్ని సృష్టిస్తారో అలాంటి వారు అభిశాపానికి పాత్రులు. వారికి (పరలోకంలో) అతి చెడ్డ నెలవు ఉంటుంది.

26. దేవుడు తాను కోరిన వారికి జీవనోపాధిని ఇతోధికంగా ఇస్తాడు, తాను కోరిన వారికి కుదిస్తాడు. వారు ప్రాపంచిక జీవితంపైనే సంబరపడు తున్నారు. వాస్తవానికి ప్రాపంచిక జీవితం పరలోకం ముందు అత్యల్పమయిన సామగ్రి తప్ప మరేమీ కాదు.

27. తిరస్కరించిన వారు ఇలా అంటారు : 'ఇతనిపై ఇతని ప్రభువు తరపు నుండి ఏదయినా సూచన ఎందుకు అవతరించలేదు?' (ఓ ప్రవక్తా!) ఇలా అను : 'దేవుడు తాను కోరిన వారిని అపమార్గం పట్టిస్తాడు. సంకల్ప శుద్ధితో తన వైపునకు మరలేవారికే ఆయన మార్గదర్శకత్వం వహిస్తాడు.'
28. విశ్వసించిన వారి హృదయాలు దైవస్మరణ వల్ల కుదుటపడతాయి. వినండి! దైవ స్మరణవల్ల హృదయాలకు నెమ్మది ప్రాప్తిస్తుంది. 29. ఎవరయితే
విశ్వసించి, సదాచరణ చేశారో వారికి శుభవార్త, మంచి నివాసస్థానం ఉంటుంది.

30. ఇదేవిధంగా మేము నిన్ను ఒక సముదాయంలో పంపాము – మేము నీవైపు పంపిన సందేశాన్ని నీవు వారికి వినిపించటానికి. నిజానికి దానికి పూర్వం కూడా ఎన్నో సముదాయాలు గతించాయి. వారు కరుణామయుడయిన దైవాన్ని తిరస్కరిస్తున్నారు. వారికి చెప్పు : 'ఆయనే నా ప్రభువు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేదు. నేను ఆయన్నే నమ్ముకున్నాను. ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.'

31. ఒకవేళ ఖుర్ఆన్ అవతరించి దాని ఒత్తిడి వల్ల పర్వతాలు చలించినా లేదా భూమి తునాతునకలయిపోయినా లేదా మృతులు

మాట్లాడసాగినా (తిరస్కారులు నమ్మబోరు). వాస్తవానికి అధికారమంతా దైవాధీనమై ఉంది. దేవుడే గనక తలచుకుంటే మానవులందరికీ సన్మార్గం చూపగలడు. విశ్వాసులు సంతృప్తి చెందటానికి ఇది చాలదా? సత్య తిరస్కారులపై – వారి చేష్టల కారణంగా ఏదో ఒక విపత్తు వచ్చిపడుతూనే ఉంటుంది. లేదా వారి వాడకు పమీపంలోనే అది అవతరిస్తూ ఉంటుంది. దేవుని వాగ్దానం సంభవించేవరకూ పరిస్థితి ఇలాగే ఉంటుంది. నిశ్చయంగా దేవుడు వాగ్దానానికి విరుద్ధంగా చేయడు. 32. (ప్రవక్తా!) నీకు పూర్వం కూడా ఎంతోమంది ప్రవక్తలను పరిహసించటం జరిగింది. నేను తిరస్కారులకు తగినంత వ్యవధి ఇచ్చాను. తరువాత వారిని (అమాంతం) పట్టుకున్నాను. మరైతే నా శిక్ష ఎలా ఉంది?

33. ఏమిటి, ప్రతి వ్యక్తి నుండి, అతను సముపార్జించిన దాని లెక్క తీసుకునేవాడూను (ఏ విషయంపైన కూడా ఏమాత్రం అధికారం లేనివాడూ సమానులవుతారా?) ప్రజలు దైవానికి సహవర్తులను కల్పించుకున్నారు. (ప్రవక్తా!) వారిని అడుగు : 'కాస్త వారి పేర్లేమిటో చెప్పండి! ఏమిటి, భువిలో దేవుడెరుగని సమాచారాన్ని మీరు ఆయనకు తెలియజేస్తున్నారా? లేక మీరు పైపై మాటలంటున్నారా? అసలు విషయం ఏమిటంటే తిరస్కారులకు వారి వంచన అందమైనదిగా చేయబడింది. వారు సన్మార్గం నుండి నిలువరించబడ్డారు. దేవుడు అపమార్గాన వదలివేసిన వారికి ఎవరూ సన్మార్గం చూపలేరు. 34. వారికి ప్రాపంచిక జీవితంలోనూ శిక్ష తప్పదు. పరలోకంలో విధించబడే శిక్ష మరీ తీవ్రంగా ఉంటుంది. వారిని దైవశిక్ష నుండి కాపాడే వాడెవడూ ఉండడు.

35. భయభక్తులు కలవారికి వాగ్దానం చేయబడిన స్వర్గపు ఉపమానం ఎటువంటిదంటే, దాని క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. దాని పండ్లు సదా ఉంటాయి. దాని నీడ శాశ్వతమైనది. దైవభీతి కలవారికి లభించే అంతిమ పరిణామం ఇది. ఇక సత్యతిరస్కారుల అంతిమ పరిణామం నరకాగ్నే. 36. ఎవరికయితే మేము గ్రంథం ప్రసాదించి ఉన్నామో, వారు నీపై అవతరించిన దానిపట్ల సంతోషంగా ఉన్నారు. వారిలో కొన్ని

కూటములకు చెందినవారు అందులోని కొన్ని భాగాలను నిరాకరిస్తారు. వారితో అను : 'అల్లాహ్‌నే ఆరాధించాలని, ఆయనకు భాగస్వాములను కల్పించరాదని నేను ఆజ్ఞాపించబడ్డాను. నేను ఆయన వైపునకే ఆహ్వానిస్తున్నాను. నేను మరలిపోవలసింది కూడా ఆయన వద్దకే.'
37. ఇదే విధంగా మేము దీనిని (ఖుర్ఆన్‌ను) ఒక శాసన స్థాయిలో, అరబీ భాషలో అవతరింపజేశాము. నీ వద్దకు (సత్య) జ్ఞానం వచ్చేసిన పిమ్మట కూడా ఒకవేళ నీవు వారి ఆకాంక్షలను అనుసరించావంటే, దేవునికి ప్రతిగా నీకు తోడ్పడేవాడుగానీ, రక్షించేవాడుగానీ ఎవడూ ఉండడు.

38. మేము నీకు పూర్వం ఎంతోమంది సందేశహరులను పంపి ఉన్నాము. మేము వారికి ఆలుబిడ్డలను కూడా వొసగాము. దేవుని ఆనతి లేకుండా ఏదయినా సూచనను తీసుకురావటమనేది ప్రవక్త వల్ల కాని పని.
ప్రతి వాగ్దానం లిఖించబడి ఉంది. 39. దేవుడు తాను కోరిన దానిని
చెరిపివేస్తాడు. తాను కోరిన దానిని ఉండనిస్తాడు. మాతృగ్రంథం ఆయన వద్దనే ఉన్నది.

40. (ప్రవక్తా!) మేము వారికి వాగ్దానం చేసి ఉన్న దానిలో కొంతభాగాన్ని మేము నీకు చూపించినా లేదా మేము నీకు మరణమొసగినా, (సందేశాన్ని) చేరవేయటం వరకే నీ పని. లెక్క తీసుకోవటం మా పని.
41. ఏమిటి, మేము (వారి) రాజ్యభాగాన్ని దాని అన్ని వైపుల నుండీ కుదించుకుంటూ రావటాన్ని వారు గమనించటం లేదా? దేవుడే తీర్పరి. ఆయన తీర్పును (ఆజ్ఞను) తొలగించటం ఎవరి తరం కాదు. ఆయన శీఘ్రంగా
లెక్క తీసుకుంటాడు. 42. వారి పూర్వీకులు కూడా ఎత్తుగడలు వేశారు.
అయితే ఎత్తుగడలన్నీ దైవాధీనమై ఉన్నాయి. ప్రతి ఒక్కడూ ఏమేమి సంపాదించుకుంటున్నాడో ఆయనకు తెలుసు. పరలోక నెలవు అసలు ఎవరి కోసం ఉందో సత్య తిరస్కారులు శీఘ్రంగానే తెలుసుకుంటారు.

43. 'నీవు దేవుని తరఫున పంపబడిన వాడవు కావు' అని తిరస్కారులు అంటున్నారు. వారితో అను : 'మీకూ – నాకూ మధ్య సాక్షిగా దేవుడే చాలు. గ్రంథజ్ఞానం కలవాని సాక్ష్యం కూడా సరిపోతుంది.

# 14. ఇబ్రాహీమ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ రా. ఇది ఒక గ్రంథం. దీనిని మేము నీ వైపు అవతరింపజేశాము – తద్వారా నీవు జనులను కటిక చీకట్ల నుండి వెలికి తీసి వెలుగులోకి తెస్తావని! వారి ప్రభువు ఆజ్ఞానుసారం శక్తిమాన్యుడు, స్తవనీయుడు అయిన దైవమార్గానికి తెస్తావని!! 2. ఆ దేవుని వైపునకు! భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం ఆయనదే. తిరస్కారులకు ఓ కఠినమయిన శిక్ష యొక్క వినాశం ఖాయం. 3. వారు పరలోకం కన్నా ప్రాపంచిక జీవితం పైనే మోజుపడుతున్నారు. దైవమార్గం నుండి (జనులను) ఆపుతున్నారు. అందులో వక్రతను వెతికిపట్టుకునే తాపత్రయంలో ఉన్నారు. వారు దారి తప్పి బహుదూరం వెళ్ళిపోయారు.

4. మేము ఏ ప్రవక్తను పంపినా, అతని జాతివారు మాట్లాడే భాషలోనే (సంభాషించేవానిగా) పంపాము – అతను విషయాన్ని వారికి విడమరచి చెప్పాలని. తరువాత దేవుడు తాను తలచిన వారిని అపమార్గాన వదలిపెడతాడు, తాను తలచిన వారికి మార్గదర్శనం చేస్తాడు. ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడు.

5. మేము మూసాకు మా సూచనలను ఇచ్చి పంపాము. 'నీ జాతి వారిని అంధకారాల నుండి వెలికితీసి వెలుగు వైపునకు తీసుకు రా. దేవుని (మహోపకారాల) దినాలను వారికి జ్ఞాపకం చెయ్యి' అని అతనిని ఆదేశించాము. నిశ్చయంగా వాటిలో సహనమూర్తులకు, కృతజ్ఞులకు గొప్ప సూచనలున్నాయి.

6. మూసా తన జాతివారితో ఈ విధంగా చెప్పినప్పటి సందర్భం కూడా చిరస్మరణీయమే. అతనిలా అన్నాడు : 'మీపైన గల దైవానుగ్రహాలను నెమరువేసుకోండి. ఆయన మిమ్మల్ని ఫిరౌన్ జనుల చెర నుండి విడిపించాడు.

వారు మిమ్మల్ని తీవ్రంగా వేధించేవారు. మీ కొడుకులను చంపేసి, మీ స్త్రీలను మాత్రం బ్రతికి ఉండనిచ్చేవారు. ఇందులో మీ ప్రభువు తరఫున మీకు మహా గడ్డు పరీక్ష ఉండింది.' 7. అప్పుడు మీ ప్రభువు మిమ్మల్ని ఈ విధంగా సావధానపరచాడు : 'మీరు గనక కృతజ్ఞులుగా రాణిస్తే నేను మీకు మరింత అధికంగా అనుగ్రహిస్తాను. కృతఘ్నతను కనబరిచారో, నిశ్చయంగా నా శిక్ష చాలా కఠినమయినదని తెలుసుకోండి.' 8. మూసా ఇలా అన్నాడు: 'ఒకవేళ మీరు తిరస్కరించినా, భూమండలంలో ఉన్నవారంతా తిరస్కారులుగా మారిపోయినా (దైవానికి వాటిల్లే నష్టం ఏమీ ఉండదు), దేవుడు నిరపేక్షా పరుడు, స్తవనీయుడు.'

9. ఏమిటి, మీకు పూర్వం గడచిన వారి సమాచారం మీకు చేరలేదా? అంటే, నూహ్, ఆద్, సమూద్ జాతులవారి, వారి తరువాత వచ్చిన వారి సమాచారం? వాళ్ళ గురించి దైవానికి తప్ప ఎవరికీ తెలీదు. వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చినపుడు, వారు తమ చేతులను తమ నోళ్ళపై పెట్టుకుని ఇలా అన్నారు : 'మీకు ఇచ్చి పంపబడిన దానిని మేము ఒప్పుకోము. మీరు దేని వైపునకు మమ్మల్ని పిలుస్తున్నారో దానికి సంబంధించి మేము తీవ్రమయిన సందేహానికి లోనయ్యాము.'

10. సమాధానంగా వారి ప్రవక్తలు ఇలా అన్నారు : 'ఏమిటి, భూమ్యాకాశాలకు ఉనికిని ప్రసాదించిన దేవుని గురించే మీకు సందేహం కలిగిందా? మీ పాపాలను క్షమించి, ఒక నిర్ణీత కాలం వరకు మీకు వ్యవధినిచ్చేందుకు ఆయన మిమ్మల్ని పిలుస్తున్నాడు.' దానికి వారిలా ప్రతిస్పందించారు : 'మీరూ మాలాంటి మానవులే. అంతకు మించి మరేమీ కాదు. మా తాతముత్తాతలు పూజిస్తూ వచ్చిన వాటి నుండి మీరు మమ్మల్ని ఆపాలనుకుంటున్నారా? అలాగైతే ఏదయినా స్పష్టమయిన ప్రమాణం తీసుకురండి.'

11. వారి ప్రవక్తలు వారికి ఇలా చెప్పారు : 'అవును. మేము కూడా మీలాంటి మనుషులమే. అయితే దేవుడు తన దాసులలో తాను కోరిన

వారిని ప్రత్యేకంగా అనుగ్రహిస్తాడు. దైవాజ్ఞ కానంత వరకూ మేము మీ వద్దకు ఏ ప్రమాణాన్నీ తేలేము. విశ్వసించినవారు ఎట్టి పరిస్థితిలోనూ దైవాన్నే నమ్ముకోవాలి. 12. మనం దైవాన్ని ఎందుకు నమ్ముకోకూడదు? వాస్తవానికి ఆయనే మనకు మన దారులను చూపాడు. ఇక మీరు గనక మమ్మల్ని బాధిస్తే, మేము ఓర్పు వహిస్తాము. నమ్ముకునేవారు సదా దైవాన్నే నమ్ముకోవాలి.'

13. తిరస్కరించినవారు తమ ప్రవక్తలతో ఇలా అన్నారు : 'మీరు మా జీవన స్రవంతిలోకి తిరిగివస్తే సరి. లేకుంటే మేము మా భూభాగం (రాజ్యం) నుండి వెళ్ళగొడ్తాము.' అప్పుడు ప్రవక్తల ప్రభువు వారికి 'వహీ' పంపుతూ, 'మేము ఈ దుర్మార్గుల్ని అంతమొందిస్తాము. 14. వారి తదనంతరం మిమ్మల్ని ఈ ధరిత్రిపై వసింపజేస్తాము. నా ఎదుట నిలబడి సమాధానం ఇచ్చుకోవలసి ఉందని భయపడే వానికి, నా హెచ్చరికకు భయపడేవానికి లభించే బహుమానమిది.'

15. వారు తీర్పును కోరారు. అప్పుడు ప్రతి తలబిరుసు, హఠము చేసేవాడు పరాభవం పాలయ్యాడు. 16. అతనికి ముందు నరకం ఉంది. త్రాగేందుకు అతనికి చీము నెత్తురు వంటి పానీయం ఇవ్వబడుతుంది. 17. దానిని అతను అతి కష్టమ్మీద ఒక్కొక్క గుక్క గొంతులో దింపుతాడు. నలువైపుల నుండీ అతనిపై మృత్యువు క్రమ్ముకుని ఉంటుంది. కాని అతను చావడు. అతని ముందు మరింత కఠిన యాతన సిద్ధంగా ఉంటుంది.

18. మరెవరయితే తిరస్కరించారో, వారి కర్మలను తుఫాను వచ్చిన నాడు పెనుగాలి ఎగురవేసిన బూడిదతో పోల్చవచ్చు. వారు తాము సంపాదించిన దానిలో నుండి దేనినీ పొందలేకపోయారు. బహుదూరపు అపమార్గం అంటే ఇదే. 19. ఏమిటీ, దేవుడు భూమ్యాకాశాలను ఎంతో సక్రమంగా, సజావుగా సృష్టించటాన్ని నీవు చూడటం లేదా? ఆయనే గనక తలచుకుంటే మిమ్మల్ని తొలగించి, మరో వినూత్న సృష్టిని తీసుకు రాగలడు. 20. ఈ విధంగా చేయటం దైవానికి ఏమాత్రం కష్టతరం కాదు.

21. అందరూ దైవ సమక్షంలో హాజరు పరచబడతారు. బలహీను లయినవారు పెద్దరికాన్ని చాటుకునే వారినుద్దేశించి ఇలా అంటారు : 'మేము (ఇహలోకంలో) మీ అనుయాయులుగా ఉన్నాము కదా! మరైతే ఇప్పుడు మీరు దైవశిక్షలో ఏ కాస్తయినా మా నుండి తొలగించగలరా?' సమాధానంగా ఆ బడా బాబులు అంటారు : 'దేవుడు మాకేదన్నా బయటపడే మార్గం చూపి ఉంటే, మేము కూడా మీకు మార్గం చూపేవారం. ఇప్పుడు మనం ఆందోళన చెందినా, ఓపిక పట్టినా – మనకు ఒక్కటే. మనకు ఇప్పుడు విముక్తి పొందే మార్గమేదీ లేదు.'

22. వ్యవహారంపై తీర్పు జరిగిన పిమ్మట షైతాన్ ఇలా అంటాడు : 'దేవుడు మీకు చేసిన వాగ్దానం నిజమయినది. నేను మాత్రం మీకు చేసిన వాగ్దానానికి విరుద్ధంగా ప్రవర్తించాను. అసలు నాకు మీపైన ఎలాంటి అదుపు అజమాయిషీ లేకుండింది. కాకపోతే నేను మీకు పిలుపు ఇచ్చాను. మీరు నా మాటల్లో పడిపోయారు. కాబట్టి (ఇప్పుడు) నన్ను నిందించకండి. మిమ్మల్ని మీరే నిందించుకోండి. నేనూ మీకు సాయం చేయలేను. మీరూ నాకు సాయం చేయలేరు. మీరు ఇంతకు ముందు నన్ను దైవత్వంలో భాగస్థునిగా నిలబెట్టా రన్న విషయంతో నాకెట్టి సంబంధం లేదు' – నిశ్చయంగా దుర్మార్గులకు వ్యధాభరితమయిన శిక్ష తప్పదు.

23. విశ్వసించి, సదాచరణ చేసిన వారు మాత్రం, దిగువన కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేయబడతారు. వాటిలో వారు తమ ప్రభువు ఆదేశానుసారం ఎల్లకాలం ఉంటారు. అందులో వారు పరస్పరం 'సలామ్' చేసుకుంటూ సమావేశమవుతుంటారు.

24. దేవుడు 'కలిమయె తయ్యిబా' (సద్వచనం)ను దేంతో పోల్చాడో మీరు చూడలేదా? అదొక పవిత్ర వృక్షం (మేలుజాతి వృక్షం) వంటిది. దాని వేరు భూమిలోపల బాగా పాదుకుని ఉంది. దాని కొమ్మలు అంబరాన్ని చుంబిస్తున్నాయి. 25. అది ఎల్లవేళలా తన ప్రభువు ఆజ్ఞతో ఫలాలనిస్తుంది.

జనులు ఉపదేశం గ్రహించగలందులకు దేవుడు ఈ విధంగా ఉపమానాలు ఇస్తుంటాడు. 26. కలిమయె ఖబీసా (దుష్ట వచనం) ఉపమానం దుష్టజాతి వృక్షం వంటిది. అది భూమి ఉపరితలం నుండే పెరికి వెయ్యబడుతుంది. దానికి స్థిరత్వం అంటూ ఉండదు.

27. దేవుడు విశ్వసించిన వారికి స్థిరమయిన వాక్కు ద్వారా ప్రాపంచిక జీవితంలోనూ, పరలోకంలోనూ నిలకడను ఇస్తాడు. దేవుడు దుర్వర్తనులను మాత్రం మార్గభ్రష్టుల్ని చేస్తాడు. దేవుడు తాను తలచిన దానిని చేసి తీరుతాడు.

28. దైవానుగ్రహానికి బదులుగా కృతఘ్నుతకు ఒడిగట్టిన వారిని, తమ జాతి వారిని వినాశకర కుహరం – నరకం – లోకి నెట్టివేసిన వారిని నీవు చూడలేదా? 29. వారు నరకంలో ప్రవేశిస్తారు. అది ఎంత దుర్భర మయిన నివాస స్థలం? 30. వారు జనులను దైవమార్గం నుండి తప్పించే ఉద్దేశంతో దైవానికి పోటీగా భాగస్వాములను నిలబెట్టుకున్నారు. వారికి చెప్పు : 'కొంతకాలం పాటు లబ్ది పొందండి. చివరకు మీ నివాసం నరకమే.'

31. (ప్రవక్తా!) క్రయవిక్రయాలు జరగని, స్నేహబంధం సయితం ఉపయోగపడని ఆ దినం రాకముందే నమాజును స్థాపించమని, మేము వారికి ప్రసాదించిన జీవనోపాధిలో నుండి గోప్యంగానూ, బహిరంగంగానూ ఖర్చుపెట్టమని విశ్వసించిన నా దాసులకు చెప్పేయ్.

32. అల్లాహ్ – ఆయనే ఆకాశాలనూ భూమినీ సృష్టించాడు. ఆకాశం నుండి వర్షపు నీటిని కురిపించి, తద్వారా మీ కోసం జీవనోపాధిగా పండ్లు ఫలాలను ఉత్పన్నం చేశాడు. నౌకను మీ నియంత్రణలో ఉంచాడు – ఆయన ఆదేశంతో అది సముద్రంలో నడవాలని. ఇంకా నదీనదాలను కూడా ఆయన మీకు వశపరిచాడు. 33. ఆయన సూర్యచంద్రులను మీ నియంత్రణలో ఉంచాడు. అవి నిరంతరం – ఒక నియమానుసారం – పరిభ్రమిస్తున్నాయి.

ఆయనే రేయింబవళ్ళను కూడా మీ స్వాధీనంలో ఉంచాడు. 34. ఇంకా మీరు అడిగిన ప్రతిదీ ఆయన మీకు ప్రసాదించాడు. ఒకవేళ మీరు దైవానుగ్రహాలను లెక్కించగోరితే లెక్కించలేరు. నిశ్చయంగా మానవుడు మహా అన్యాయపరుడు, చేసిన మేలును మరిచేవాడు.

35. ఇబ్రాహీమ్ ప్రార్థించినప్పటి ఆ సందర్భాన్ని కూడా జ్ఞాపకం చేసుకోండి – 'నా ప్రభూ! దీనిని (మక్కాను) శాంతి నగరంగా చెయ్యి. నన్నూ, నా సంతానాన్ని విగ్రహారాధన నుండి కాపాడు. 36. నా ప్రభూ! ఈ విగ్రహాలు ఎందరినో అపమార్గం పట్టించాయి. కనుక నన్ను అనుసరించిన వాడే నా వాడు. మరెవరయినా నా మాట వినకపోతే, నిశ్చయంగా నీవు క్షమించేవాడవు, కనికరించేవాడవు.

37. 'మా ప్రభూ! నేను నా సంతానాన్ని ఓ బంజరు లోయలో, నీ పవిత్ర గృహం వద్ద వసింపజేశాను. ఓ మా ప్రభూ! వారు నమాజ్‌ను స్థాపించాలనే ఇలా చేశాను. కాబట్టి నీవు ప్రజల హృదయాలను వారి వైపు మొగ్గేలా చెయ్యి. వారికి జీవనోపాధిగా పండ్లు ఫలాలను ప్రసాదించు – తద్వారా వారు కృతజ్ఞులుగా మసలుకోవచ్చు.

38. 'ప్రభూ! మేము దాచేదీ, వ్యక్తపరిచేదీ – అంతా నీకు ఎరుకే. భూమిలోగానీ, ఆకాశంలోగానీ దేవుని నుండి ఏ వస్తువూ దాగిలేదు. 39. వార్ధక్యంలో నాకు ఇస్మాయీల్, ఇస్‌హాఖ్‌లను ప్రసాదించిన దైవానికి కృతజ్ఞతలు. నిశ్చయంగా నా ప్రభువు మొరను ఆలకించేవాడు. 40. ఓ నా ప్రభూ! నన్ను నమాజ్ స్థాపించేవానిగా చెయ్యి. నా సంతానానికి కూడా (ఈ సద్బుద్ధిని వొసగు). ప్రభూ! నా ప్రార్థనను ఆమోదించు. 41. నా ప్రభూ! నన్ను, నా తల్లిదండ్రులను, సమస్త విశ్వాసులను జమాబందీలు నెలకొనే రోజున క్షమించు.'

42. (ప్రవక్తా!) ఈ దుర్మార్గుల చేష్టల పట్ల దేవుడు అలసత్వానికి లోనై ఉన్నాడని అనుకోకు. ఆయన వారికి ఆ రోజు వరకు వ్యవధిని

ఇస్తున్నాడు. ఆనాటి పరిస్థితి ఇలా ఉంటుంది : కనుగుడ్లు తేలిపోతుంటాయి. 43. వారు తలలు పైకెత్తి లగెత్తుతూ ఉంటారు. వారి చూపులు వారి వైపు తిరిగి రావు. వారి గుండెలు అదిరిపడుతుంటాయి.

44. (ప్రవక్తా!) శిక్ష వచ్చిపడే దినం గురించి నీవు ప్రజలను భయపెట్టు. ఆ సమయంలో దుర్మార్గులు, 'ప్రభూ! మాకు మరికాస్త గడువును ఇస్తే, మేము నీ పిలుపును అందుకుని, నీ ప్రవక్తలను అనుసరిస్తాము' అనంటారు. ఏమిటి, ఇంతకు ముందు ఒట్టువేసుకుని, మాకు పతనమనేదే లేదని చెప్పినది మీరు కాదా? 45. తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్న వారి ప్రదేశాలలోనే మీరు నివసించి ఉన్నారు. మేము వారిపట్ల ఎలా వ్యవహరించామో కూడా మీకు తెలిసినదే. ఉదాహరణలతో సహా మీకు బోధపరచి ఉన్నాము.' 46. వారు తమ కుట్రలన్నీ పన్నారు. వారి కుట్రలన్నీ దేవుని ముందున్నాయి. నిజానికి వారి కుట్రలు ఎంత దృఢమైనవంటే వాటి తాకిడికి కొండలు సయితం చలించిపోగలవు.

47. కనుక నీవు, దేవుడు తన ప్రవక్తలకు చేసిన వాగ్దానానికి విరుద్ధంగా చేస్తాడేమోనన్న అనుమానానికి లోనవకు. నిశ్చయంగా దేవుడు శక్తిమాన్యుడు, ప్రతీకారం తీర్చుకోగలవాడు. 48. ఏ రోజున ఈ భూమి మరో భూమితో మార్చివేయబడుతుందో, ఆకాశం సయితం మార్చివేయ బడుతుందో, అప్పుడందరూ తిరుగులేని ఏకేశ్వరుని ముందు హాజరవుతారు. 49. ఆ రోజు అపరాధులు సంకెళ్ళతో బంధింపబడి ఉండటం నీవు చూస్తావు. 50. వారి దుస్తులు తారు దుస్తులై ఉంటాయి. వారి ముఖాలపై అగ్ని అలుముకుని ఉంటుంది. 51. దేవుడు ప్రతి వ్యక్తికీ, అతను చేసుకున్న దాని ప్రతిఫలం ఇవ్వటానికే (ఈ వ్యవస్థ ఏర్పరచబడుతుంది). నిశ్చయంగా దేవుడు చాలా శీఘ్రంగా లెక్క తీసుకుంటాడు. 52. ఇది ప్రజలకు ఒక ప్రకటన – వారిని సావధానపరచాలన్నదే దీని ప్రధాన ఉద్దేశ్యం. ఆయన ఒక్కడే నిజ ఆరాధ్యదైవమని వారు తెలుసుకోవాలన్నదే దీని లక్ష్యం. విజ్ఞులైనవారు హితబోధను గ్రహించాలన్నదే దీని పరమార్థం.

# 15. అల్ హిజ్ర్ (రాళ్ళ సీమ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ లామ్ రా. ఇది దైవ గ్రంథం, సుబోధకమయిన ఖుర్‌ఆన్ సూక్తులు. ◆ (14) 2. తాము దైవవిధేయతకు తలఒగ్గి ఉంటే బావుండేదే! అని తిరస్కారులు కోరుకునే సమయం తప్పక వస్తుంది. 3. (ప్రవక్తా!) నీవు వాళ్ళను తింటూ, త్రాగుతూ, మజా చేస్తూ ఉండేలా, బూటకపు ఆశలు వారిని పరధ్యానానికి లోనుచేసేలా వదలిపెట్టు. ఆనక వారికే తెలిసివస్తుంది. 4. మేము ఏ జనావాసాన్ని తుదముట్టించినా దానికోసం ఒక నిర్ధారిత సమయం రాసిపెట్టబడి ఉండేది. 5. ఏ సముదాయమయినా తన నిర్ధారిత సమయానికి ముందుగానీ, వెనక్కిగానీ నెట్టబడదు.

6. వారు (అవిశ్వాసులు) ఇలా అంటున్నారు : 'జ్ఞాపిక అవతరించిన వాడా! నిజంగానే నీవు పిచ్చివాడివి. 7. ఒకవేళ నీవు చెబుతున్నది నిజమే అయివుంటే మా వద్దకు దైవదూతలను ఎందుకు తీసుకురావు?' 8. వ్యవహారాన్ని తేల్చే పక్షంలోనే మేము దైవదూతలను దింపుతాము. అప్పుడు ప్రజలకు గడువు ఇవ్వబడదు.

9. ఈ జ్ఞాపిక (ఖుర్‌ఆన్)ను మేమే అవతరింపజేశాము. మేమే దాని రక్షకులం.

10. మేము నీకు పూర్వం గతించిన వర్గాలలో కూడా ప్రవక్తలను పంపి ఉన్నాము. 11. వారి వద్దకు ఏ ప్రవక్త వచ్చినా వారతనిని పరిహసించకుండా వదలిపెట్టలేదు. 12. ఇదేవిధంగా మేము ఈ (పరిహసించే ధోరణిని) అపరాధుల మనోక్షేత్రంలో జొప్పించాము. 13. ఇక వారు దీనిని విశ్వసించరు. వారి పూర్వీకుల నుండే ఇది ఆనవాయితీగా వస్తోంది. 14. ఒకవేళ మేము వారి కోసం ఆకాశ ద్వారమేదయినా తెరచినా, దానిని వారు అధిరోహించినా సరే (వారు విశ్వసించబోరు). 15. 'మాపై ఏదో కనికట్టు చేయబడింది. పైగా మాకు చేతబడి చేయబడింది' అని అంటారు.

16. మేము గగన సీమలో బురుజులు నిర్మించాము. వీక్షించేవారి కొరకు వాటిని బాగా ముస్తాబు చేశాము. 17. శాపగ్రస్తుడయిన ప్రతి షైతాను బారి నుండి వాటిని సురక్షితంగా ఉంచాము. 18. ఒకవేళ చాటుమాటుగా ఏదయినా వినటానికి యత్నిస్తే ఒక జ్యోతిర్మయమయిన జ్వాల వాణ్ణి వెంటాడుతుంది.

19. మేము భూమిని సువిశాలంగా పరిచాము. అందులో పర్వతాలను ప్రతిష్ఠించాము. ఇంకా అందులో అన్ని రకాల వృక్షరాశుల్ని సరైన నిష్పత్తిలో మొలకెత్తించాము. 20. ఇంకా మేమందులో మీ కొరకు ఆర్థిక ఒనరులను పొందుపరిచాము. ఇంకా, మీరు జీవనోపాధిని సమకూర్చని వాటికి కూడా.

21. రాశులకొద్దీ ఖజానాలుగా లేని ఏ వస్తువూ మా వద్ద లేదు. మేము దానిని ఒక నిర్ణీత పరిమాణంలోనే దింపుతాము. 22. మేమే గాలులను ఫలవంతంగా చేసి నడిపిస్తాము. తరువాత మేము ఆకాశం నుండి వర్షం కురిపిస్తాము. మరి ఆ నీటితో మిమ్మల్ని తడుపుతాము. ఈ జలనిధిని పొందటం మీ వల్ల కాని పని.

23. నిశ్చయంగా మేమే బ్రతికిస్తాము, మేమే మరణమిస్తాము. మిగిలి ఉండేది కూడా మేమే. 24. మీకు పూర్వం గతించిన వారూ మాకు తెలుసు. మీ తరువాత రాబోయే వారు కూడా మాకు తెలుసు. 25. నిశ్చయంగా మీ ప్రభువు వారందరినీ సమీకరిస్తాడు. ఆయన వివేక సంపన్నుడు, జ్ఞానధనుడు.

26. మేము మనిషిని నానబెట్టిన మట్టి యొక్క ఎండిన గారతో సృష్టించాము. 27. అంతకు ముందు జిన్నులను మేము అగ్నిజ్వాలతో సృజించాము.

28. నీ ప్రభువు తన దూతలతో ఇలా చెప్పినప్పటి విషయం (జ్ఞాపకం చేసుకోండి) : 'నేను మానవుణ్ణి నాన్చిన మట్టిని ఎండబెట్టి, దాని గారతో సృజించబోతున్నాను. 29. నేనతనికి సంపూర్ణ స్వరూపమిచ్చి, అందులో నా

ఆత్మను ఊదినప్పుడు, మీరంతా అతని ముందు సాష్టాంగపడాలి.' 30. దైవదూతలందరూ సాష్టాంగపడ్డారు. 31. ఒక్క ఇబ్లీసు తప్ప! వాడు సాష్టాంగపడేవారి సరసన చేరటానికి నిరాకరించాడు. 32. 'ఓ ఇబ్లీస్! నీకేమయింది? నువ్వు సాష్టాంగపడే వారిలో ఎందుకు చేరలేదు?' అని దేవుడడిగితే, 33. ఇబ్లీసు ఇలా చెప్పాడు : 'నీవు కుళ్ళిన మట్టిని ఎండబెట్టి దాని గారతో చేసిన మనిషి ముందు సాష్టాంగపడటం నాకు తగదు.' 34. దేవుడన్నాడు : 'అలాగైతే పో ఇక్కణ్ణుంచి. ఎందుకంటే నువ్వు ధూత్కరించబడ్డావు. 35. నిశ్చయంగా నీపై తీర్పుదినం వరకూ శాపం ఉంటుంది.' 36. ఇబ్లీస్ ఇలా విజ్ఞప్తి చేశాడు : 'నా ప్రభూ! అందరూ తిరిగి లేపబడే దినం వరకూ నాకు గడువు ఇవ్వు.' 37. దేవుడిలా అన్నాడు : 'నీకు గడువు ఇవ్వబడింది. 38. ఆ నిర్ధారిత సమయం ఆసన్నమయ్యే దినం వరకూ.'

39. ఇబ్లీస్ ఇలా అన్నాడు : 'నీవు నన్ను మార్గభ్రష్టతకు లోనుచేసినట్లే నేను భువిలో మనుషుల కొరకు (అధర్మమైన వాటిని) అందమైనవిగా చిత్రీకరించి దారి తప్పిస్తాను – 40. వారిలో నీవు ప్రత్యేకించుకున్న నీ దాసులను తప్ప!'

41. దేవుడిలా సెలవిచ్చాడు : 'నా వరకూ చేర్చే రుజుమార్గం మాత్రం ఇదే. 42. నిశ్చయంగా నికార్సయిన నా దాసులపై నీ పెత్తనం నడవదు. నీ అడుగులకు మడుగులొత్తే మార్గవిహీనుల మీదే నీ పెత్తనం నడుస్తుంది. 43. వీరందరికీ నరక వాగ్దానం చేయబడుతోంది. 44. దానికి ఏడు ద్వారాలు ఉన్నాయి. ప్రతి ద్వారానికి వారిలోని వేర్వేరు విభాగాలు ప్రత్యేకించటం జరిగింది.'

45. నిశ్చయంగా భయభక్తులు కలవారు ఉద్యానవనాల, నీటి చెలమల మధ్యన ఉంటారు. 46. 'సురక్షితంగా, నిర్భయంగా వీటిలో ప్రవేశించండి' (అని వారితో అనబడుతుంది). 47. వారి ఆంతర్యాలలో ఏ కాస్త కల్మషం ఉన్నా మేము దానిని తొలగిస్తాము. అందరూ అన్నదమ్ముల్లా

ఉంటారు – ఎదురెదురుగా పీఠాలపై ఆసీనులై! 48. వారికి అక్కడ ఏ బాధా ఉండదు. అక్కణ్ణుంచి వారిని తీసివెయ్యటం కూడా జరగదు. 49. (ప్రవక్తా!) నా దాసులకు తెలియపరచు : 'నేను క్షమించేవాడను. కరుణించేవాడను. 50. నా శిక్ష కూడా వ్యధాభరితమయిన శిక్షే.'

51. వీరికి ఇబ్రాహీమ్ అతిథుల సంగతి కూడా తెలియపరచు. 52. వారు అతని దగ్గరకు వచ్చినపుడు, అతనికి సలామ్ చేశారు. 'మీ వల్ల మాకెందుకో భయమేస్తోంది' అని ఇబ్రాహీమ్ అన్నాడు. 53. 'భయపడకు. మేము నీకు జ్ఞానసంపన్నుడయిన ఒక బాలుని శుభవార్త ఇస్తున్నాము' అని వారన్నారు. 54. దానికి ఇబ్రాహీమ్, 'ఏమిటి, ఈ ముసలితనంలో మీరు నాకు సంతానం కలుగుతుందన్న శుభవార్తను వినిపిస్తున్నారా? మీరిచ్చే శుభవార్త ఎటువంటిదో (ఆలోచించారా)?' 55. దానికి వారిలా అన్నారు : 'మేము నీకు సత్యబద్ధమైన శుభవార్తనే అందజేస్తున్నాము. కనుక నీవు నిరాశ చెందిన వారిలో చేరకు.' 56. ఇబ్రాహీమ్ ఇలా చెప్పాడు : 'తమ ప్రభువు కారుణ్యం పట్ల మార్గభ్రష్టులు తప్ప మరెవరూ నిరాశ చెందరు.'

57. 'దేవుని తరఫున పంపబడిన దూతలారా! ఇంతకీ మీరు ఏ పని మీద వచ్చినట్టు?' అని అతను అడగగా, 58. వారిలా వివరించారు : 'మేమొక అపరాధ జనం వైపునకు పంపబడ్డాము. 59. అయితే లూత్ పరివార సభ్యులను మాత్రం మేము కాపాడతాము 60 – ఒక్క అతని అర్ధాంగిని తప్ప. ఆవిడ అపరాధ జనులకు అండగా నిలుస్తుందని మేము అంచనా వేస్తున్నాము.

61. తరువాత ఆ దైవదూతలు లూత్ కుటుంబీకుల వద్దకు వచ్చినపుడు, 62 'మీరు మాకు అపరిచిత వ్యక్తుల్లా కనిపిస్తున్నారే' అని వారు సందేహపడగా, 63. వారిలా అన్నారు : 'లేదు. వీరు దేని గురించి అనుమానిస్తున్నారో దానినే మేము మీ వద్దకు తీసుకువచ్చాము. 64. మేము మీ వద్దకు సత్యంతోనే వచ్చాము. మేము చెప్పేది నిజం. 65. కాబట్టి కాస్త

రాత్రి ఉండగానే నీ ఇంటివారితో సహా వెళ్ళిపో. నీవు వారి వెనుక నడవాలి. మీలో ఎవ్వరూ వెనక్కి తిరిగి చూడకూడదు. మిమ్మల్ని ఆదేశించిన చోటికే వెళ్ళండి. 66. 'తెల్లవారేసరికల్లా వాళ్ళ వేరు తెగిపోతుంద'ని మేము లూత్‌కు సూచించాము.

67. అంతలోనే ఆ పట్టణవాసులు సంబరపడుతూ వచ్చారు. 68. 'వీరు నా అతిథులు. కాబట్టి మీరు నా పరువు తీయకండి.

69. 'మీరు దైవానికి భయపడండి. నన్ను అవమానపరచకండి' అని లూత్ ప్రాధేయపడ్డాడు. 70. దానికి వారు, 'ఏమిటి, లోకులందరి బరువు బాధ్యతల్ని నీమీద వేసుకోవద్దని మేము నీకు చెప్పామా? లేదా?' అని మందలించారు. 71. లూత్ ఇలా నచ్చజెప్పాడు : 'మీరేదన్నా చేయదలచు కుంటే, ఇదిగో, నా కూతుళ్ళు ఉన్నారు.'

72. (ప్రవక్తా!) నీ ప్రాణం మీద ఒట్టు! ఆ సమయాన వారు తమ కైపులో తేలిపోతూ ఉన్నారు. 73. అందుకే పొద్దు పొడవగానే వారిని ఒక భయంకరమయిన గర్జన అమాంతం కబళించింది. 74. అంతే. మేము ఆ బస్తీని తల్లక్రిందులు చేసివేశాము. వారిపై కంకరరాళ్ళ వాన కురిపించాము. 75. నిశ్చయంగా ఇందులో విషయాన్ని పరికించేవారికి పలు సూచన లున్నాయి. 76. ప్రజలు రాకపోకలు సాగించే రహదారిలోనే ఆ పట్టణం ఉంది. 77. నిశ్చయంగా ఈ వృత్తాంతంలో విశ్వసించేవారికి గుణపాఠ సూచన ఉంది.

78. 'అయికా' వారు కూడా ఖచ్చితంగా దుర్మార్గులే. 79. అందుకే మేము వారిపై ప్రతీకారం తీర్చుకున్నాము. ఈ రెండు బస్తీలు కూడా ప్రధాన రహదారి మీదే ఉన్నాయి. 80. రాళ్లసీమ వారు (అస్హాబుల్ హిజ్ర్) కూడా ప్రవక్తలను అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. 81. మేము వారికి మా సూచనలను ప్రసాదించాము. అయినప్పటికీ వాటిపట్ల వారు విముఖత

ప్రదర్శించారు. 82. వారు పర్వతాలను తొలచి, వాటిలో నివాస గృహాలను నిర్మించుకునేవారు – సురక్షితంగా ఉండవచ్చని భావించి. 83. అయితే వారిని ప్రభాత సమయాన ఒక విస్ఫోటనం ముట్టడించింది. 84. అప్పుడు వారు సముపార్జించినదేదీ వారికి ఉపయోగపడలేదు.

85. మేము భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న వాటిని సత్యబద్ధంగానే సృష్టించాము. నిశ్చయంగా ప్రళయం సంభవించనున్నది. కనుక (ఓ ప్రవక్తా!) నీవు వారిని ఉత్తమ రీతిలో మన్నిస్తూ ఉండు. 86. నిశ్చయంగా నీ ప్రభువు సర్వసృష్టికి కర్త, సర్వజ్ఞాని.

87. మేము నీకు పదే పదే పునరావృతమవుతూ ఉండే సప్త సూక్తులను ప్రసాదించాము. ఇంకా మహోన్నతమయిన ఖుర్‌ఆన్‌ను కూడా వొసగాము. 88. వీరిలో విభిన్న జనులకు మేము ఇచ్చి ఉన్న ప్రాపంచిక సంపద వైపు నీవు కన్నెత్తి కూడా చూడకు. వారి పరిస్థితిపై ఆవేదన చెందకు. విశ్వసించిన వారి వైపు నీ వాత్సల్య భరితమయిన బాహువులను వంచు. 89. ఈ విధంగా అను : 'నేను స్పష్టంగా సావధానపరిచేవాడను.' 90. విభజనకారులపై కూడా మేము ఇదేవిధంగా అవతరింపజేశాము. 91. వారు తమ ఖుర్‌ఆన్‌ను ముక్కలు ముక్కలుగా చేసివేసినవారు. 92. కనుక నీ ప్రభువు తోడు! మేము వారందరినీ తప్పక ప్రశ్నిస్తాము – 93 – వారు వెలగబెట్టిన దానిని గురించి!

94. కాబట్టి నీకు ఆదేశించబడిన దానిని నీవు వారికి విడమరచి చెప్పు. బహుదైవారాధకులను పట్టించుకోకు. 95. నీ తరఫున పరిహాసించే వారి పని పట్టడానికి మేము చాలు. 96. అల్లాహ్‌తో పాటు ఇతరుల్ని కూడా దైవాలుగా చేర్చుకుంటున్నవారు అనతి కాలంలోనే (యదార్థం) తెలుసుకుంటారు. 97. వారు చెప్పే మాటలకు నీ మనసు నొచ్చుకుంటుందన్న సంగతి మాకు తెలుసు. 98. కనుక నీ ప్రభువు స్తోత్రంతో సహా ఆయన పవిత్రతను కొనియాడు. ప్రణమిల్లేవారిలో చేరిపో. 99. నిశ్చయమైనది నీ వద్దకు వచ్చేవరకూ నీ ప్రభువును సేవిస్తూ ఉండు.

# 16. అన్ నహ్ల్ (తేనెటీగ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. దైవ నిర్ణయం వచ్చేసింది. కాబట్టి దానికోసం ఆగమం చేయకండి. ఆయన పరమ పవిత్రుడు. వారు కల్పించే భాగస్వామ్యాలకు (షిర్క్‌కు) అతీతుడు, ఉన్నతుడు. 2. ఆయన తన దూతలను తన ఆజ్ఞ యొక్క 'ఆత్మ'తో పాటే, తన దాసులలో తాను కోరిన వారిపై అవతరింపజేస్తాడు (ఇలా సూచిస్తాడు) 'నేను తప్ప వేరెవరూ దాస్యానికి అర్హులు కారు. కనుక మీరు నాకు మాత్రమే భయపడండి' అని జనులను సావధానపరచండి.' 3. ఆయన ఆకాశాలను, భూమిని సత్యబద్ధంగా సృష్టించాడు. వారు కల్పించే షిర్క్ (భాగస్వామ్యాల)కు ఆయన అతీతుడు, ఉన్నతుడు.

4. ఆయన మనిషిని ఒక్కగానొక్క (వీర్యపు) బిందువుతో పుట్టించాడు. అయితే వాడు చూస్తుండగానే పచ్చి తగవులమారిగా తయారయ్యాడు. 5. ఆయనే పశువులను కూడా సృష్టించాడు. వాటిలో మీకు దుస్తులూ ఉన్నాయి, ఆహారమూ ఉంది, ఇతరత్రా ప్రయోజనాలు కూడా ఉన్నాయి. వాటిలో కొన్నింటిని మీరు తింటారు కూడా. 6. సాయం సమయాన మీరు వాటిని మేపుకుని వస్తున్నప్పుడునూ, ప్రొద్దున్నే మీరు వాటిని తోలుకు పోతున్నప్పుడునూ మీ కొరకు సౌందర్యం (కళ) ఉట్టిపడుతూ ఉంటుంది. 7. మీరెంతో ప్రయాసకు ఓర్చుకుంటేనేగాని చేరుకోలేని సుదూర ప్రాంతాలకు అవి మీ బరువులను మోసుకునిపోతుంటాయి. నిశ్చయంగా మీ ప్రభువు వాత్సల్యం కలవాడు, కరుణాసాగరుడు. 8. ఆయనే అశ్వాలను, కంచర గాడిదలను, గాడిదలను సృష్టించాడు – మీరు వాటిపై స్వారీ చేస్తారని. అవి మీకు శోభను కూడా ఇస్తాయి. ఇంకా, మీకు తెలియని ఎన్నో వస్తువులను ఆయన సృజిస్తున్నాడు.

9. దేవుని వరకు చేరేదే సన్మార్గం. కొన్ని మార్గాలు వంకరటింకరగా

కూడా ఉంటాయి. దేవుడే గనక తలచుకుంటే మీ అందరికీ మార్గదర్శకత్వం వహించేవాడే.

10. ఆయనే మీ కొరకు నింగి నుండి నీటిని కురిపించాడు – దానిని మీరూ త్రాగుతారు. తద్వారా మొలకెత్తే పచ్చికను మీరు మీ పశువులకు మేపుతారు. 11. దాంతోనే ఆయన మీ కొరకు పంటలను పండిస్తాడు. ఆలివ్, ఖర్జూరం, ద్రాక్ష, ఇంకా రకరకాల పండ్లను పండిస్తాడు. నిశ్చయంగా ఇందులో యోచన చేసే జనులకు సూచన ఉంది.

12. ఆయనే రేయింబవళ్ళనూ, సూర్యచంద్రులను మీ సేవలో నియుక్తం చేశాడు. నక్షత్రాలు కూడా ఆయన ఆజ్ఞకు బద్ధమై ఉన్నాయి. నిశ్చయంగా ఇందులో వివేచన గల జనులకు పలు సూచనలున్నాయి. 13. ఇంకా నేలలో మీ కొరకు వివిధ రకాల (రంగు రంగుల) వస్తువులను వ్యాపింపజేశాడు. గుణపాఠం నేర్చుకునే జనులకు ఇందులో సూచన ఉంది.

14. సముద్రాన్ని మీ సేవలో నిమగ్నం చేసినవాడు ఆయనే – మీరు అందులో నుండి (తీసిన) తాజా మాంసం తినటానికి! మీరు తొడిగే ఆభరణాలను అందులో నుండి వెలికి తీయటానికి!! ఇంకా మీరు ఓడలను చూస్తుంటారు. అవి దానిని చీల్చుకుంటూ ముందుకు సాగిపోతాయి – మీరు దైవానుగ్రహాన్ని అన్వేషించాలని, ఇంకా మీరు కృతజ్ఞులుగా మసలుకోవాలనీని.

15. భూమి మిమ్మల్ని తీసుకుని అటూ ఇటూ దొర్లిపోకుండా ఉండేందుకు ఆయన అందులో పర్వతాలను ప్రతిష్ఠించాడు. మీరు మార్గనిర్దేశన పొందే నిమిత్తం ఆయన భూమిలో కాలువలను, త్రోవలను ఏర్పరిచాడు. 16. ఇంకా ఎన్నో ఇతర చిహ్నాలు కూడా ఉన్నాయి. నక్షత్రాల ద్వారా కూడా ప్రజలు మార్గం కనుగొంటారు.

17. మరైతే సృష్టించేవాడు ఏమీ సృష్టించలేనివానితో సమానుడవుతాడా? ఏమిటి, మీరు ఆలోచించరా? 18. మీరు గనక దేవుని వరప్రసాదాలను లెక్కించదలిస్తే, మీరు లెక్కించలేరు. నిశ్చయంగా దేవుడు

అమితంగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడు. 19. మీరు గుట్టుగా ఉంచేవీ, బయటపెట్టేవీ – అన్నీ దైవానికి తెలుసు.

20. నిజదైవాన్ని కాదని జనులు మొరపెట్టుకునేవి ఏ వస్తువునూ సృష్టించలేవు. అవి స్వయంగా సృష్టించబడినవి. 21. అవి నిర్జీవమైనవి. వాటిలో ప్రాణం లేదు. వాటిని ఎప్పుడు తిరిగి లేపటం జరుగుతుందో ఖుద్దుగా వాటికే తెలీదు. 22. మీ దేవుడు ఒకే దేవుడు. కాని పరలోకాన్ని విశ్వసించని హృదయాలు దీనిని తిరస్కరిస్తున్నాయి. వారు గర్వాన్ని ప్రదర్శిస్తున్నారు. 23. వారు గోప్యంగా ఉంచేది, వెల్లడించేది – నిశ్చయంగా దేవునికి ఎరుకే. నిశ్చయంగా ఆయన గర్విష్టులను ప్రేమించడు.

24. 'మీ ప్రభువు అవతరింపజేసినది ఏమిటి?' అని వారిని (సత్యతిరస్కారులను) అడిగితే, 'పూర్వీకుల కట్టుకథలు' అని వారంటారు. 25. ఈ విధంగా పలికి వారు ప్రళయదినాన తమ బరువులను మోయటంతో పాటు, అజ్ఞానంతో తాము మార్గవిహీనుల్ని చేసిన వారి బరువులను కూడా మోయజూస్తున్నారు. గుర్తుంచుకోండి! వారు మోసే ఆ బరువు చాలా చెడ్డది.

26. వారికి పూర్వం గతించిన వారు కూడా పలు కుట్రలు పన్నారు. అయితే దేవుడు వారి కుట్రల కట్టడాలను పునాదులతో సహా పెళ్ళగించాడు. వాటి కప్పులు పై నుంచి కూలి వారి నెత్తిమీదనే పడ్డాయి. వారు ఊహించ శక్యం కాని వైపు నుండి శిక్ష వారిపై వచ్చిపడింది. 27. మరి ప్రళయదినాన కూడా దేవుడు వారిని పరాభవానికి లోను చేస్తాడు. ఇలా అడుగుతాడు : 'మీరు నిలబెట్టుకున్న నా భాగస్వాములు ఎక్కడున్నారు? వారికోసం మీరు దెబ్బలాడేవారు కదా!' అప్పుడు జ్ఞానమొసగబడిన వారిలా అంటారు : 'ఈ రోజు సత్య తిరస్కారులకు పరాభవం, యాతన తప్పదు.'

28. వారు (తిరస్కారులు) తమ ఆత్మలకు అన్యాయం చేసుకుని ఉన్న స్థితిలో దైవదూతలు వారి ఆత్మలను వశపరచుకుంటున్నప్పుడు, వారు పూర్తిగా ఆత్మ సమర్పణ చేసుకుని, 'మేము ఏ తప్పూ చేయలేద'ని అంటారు.

'చేయకపోవటమేమిటి? మీరు చేసినదంతా దైవానికి ఎరుకే. 29. ఇక నరక ద్వారాలలో ప్రవేశించండి. సదా అందులోనే ఉండండి.' గర్విష్ఠులకు లభించిన నివాస స్థానం ఎంత చెడ్డది!

30. భయభక్తులు కల వారినుద్దేశించి, 'మీ ప్రభువు ఏం అవతరింప జేశాడు?' అని అడిగినపుడు, 'మేలైన దానిని' అని వారన్నారు. ఎవరయితే మంచి చేశారో వారికి ఈ లోకంలో మంచి జరుగుతుంది. పరలోక నిలయం మరింత శ్రేష్ఠమైనది. భక్తిపరులకు లభించే ఈ నిలయం ఎంత చక్కనిది! 31. కలకాలం ఉండటానికి వారు ప్రవేశించే స్వర్గవనాల క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారు కోరినదల్లా వారికి ప్రాప్తమవుతుంది. భక్తిపరులకు దేవుడిచ్చే ప్రతిఫలం ఇలాగే ఉంటుంది. 32. వారు పరిశుద్ధులుగా ఉన్న స్థితిలో దైవదూతలు వారి ఆత్మలను వశపరచుకుంటారు. దైవదూతలు ఇలా అంటారు : 'మీకు శాంతి కలుగుగాక! మీరు చేసుకున్న కర్మలకు బదులుగా స్వర్గంలో ప్రవేశించండి.'

33. ఏమిటి, తమ వద్దకు దైవదూతలు వస్తారనో లేదా నీ ప్రభువు ఉత్తర్వు రావాలనో వారు ఎదురు చూస్తున్నారా? వీరి పూర్వీకులు కూడా ఇలాగే చేశారు. దేవుడు వారికెలాంటి అన్యాయం చేయలేదు. వారు తమకు తామే అన్యాయం చేసుకునేవారు. 34. వారి దురాగతాలకుగాను వారికి తగిన శాస్తి జరిగింది. వారు ఎగతాళి చేస్తూ వచ్చినదే వారిని కబళించింది.

35. షిర్కుకు ఒడిగట్టిన వారు ఇలా అంటారు : 'దేవుడే గనక కోరుకుని ఉంటే మేముగానీ, మా తాతముత్తాతలుగానీ ఆయన్ని తప్ప దేనినీ పూజించేవారం కాము. ఆయన (ఆజ్ఞ)ను కాదని మేము దేనినీ నిషిద్ధం (హరామ్)గా పరిగణించేవారం కాము.' వీరి పూర్వీకుల నిర్వాకం కూడా ఇలాగే ఉండేది. ప్రవక్తల బాధ్యతల్లా విషయాన్ని సుస్పష్టంగా చేరవేయటం తప్ప మరొకటి కాదు.

36. నిజానికి మేము ప్రతి సముదాయంలోనూ ఒక ప్రవక్తను పంపాము. 'దైవదాస్యమే చేయండి. తాగూత్‌కు దూరంగా ఉండండి' (అని

ప్రవక్త ద్వారా ప్రకటన చేయించాము). తరువాత వారిలో కొందరికి దేవుడు సన్మార్గం చూపగా, మరి కొందరు మార్గభ్రష్టులని తేలింది. కనుక భువిలో సంచరించి, సత్యాన్ని త్రోసిపుచ్చిన వారి పర్యవసానం ఏమయిందో గమనించండి! 37. (ప్రవక్తా!) ఒకవేళ వారికి మార్గదర్శకత్వం లభించాలని నీవు తీవ్రంగా కాంక్షించినా, దేవుడు మాత్రం తాను అపమార్గం పట్టించిన వానికి మార్గదర్శకత్వం వహించడు. వారికి తోడ్పడేవారు కూడా ఎవ్వరూ ఉండరు.

38. వీరు దేవుని మీద ఒట్టేసి చెబుతుంటారు – చాలా గట్టిగా ప్రమాణం చేసి, 'చనిపోయిన వానిని దేవుడు తిరిగి లేపడు' అని అంటుంటారు. ఎందుకు లేపడు? దేవుడు ఈ వాగ్దానాన్ని నెరవేర్చటం తన కొరకు అవశ్యం చేసుకున్నాడు. కాని చాలా మంది తెలుసుకోరు. 39 – వారు విభేదంలో పడి ఉన్న విషయాన్ని వారి ముందే విప్పటానికి, తాము అబద్ధీకులం అన్న సంగతి తిరస్కారులకు తెలిసిరావటానికి (ఈ పునరుత్థానం అనివార్యం). 40. మేము దేనినయినా చేయ సంకల్పించు కున్నప్పుడు, దానిని 'అయిపో' అనంటాము. అది అయిపోతుంది.

41. ఎవరయితే దౌర్జన్యాలను సహించిన తరువాత దైవమార్గంలో తమ స్వస్థలాలను విడిచిపోయారో (హిజ్రత్ చేశారో) మేము వారికి ప్రపంచంలోనే తప్పక మంచి నివాస స్థలాలను ఇస్తాము. పరలోకంలో వారికి ప్రాప్తించే ప్రతిఫలం మరింత గొప్పది. ఈ విషయాన్ని వారు తెలుసుకుంటే ఎంత బాగుండేది! 42. వారు (ఆ త్యాగధనులు) నిగ్రహం పాటించేవారు, అన్నింటికీ తమ ప్రభువుపైనే భారం మోపేవారు.

43. (ప్రవక్తా!) మేము నీకు పూర్వం కూడా మనుషులనే ప్రవక్తలుగా చేసి పంపాము. వారి వద్దకు మేము సందేశాన్ని (వహీని) పంపేవారము. ఒకవేళ మీకు తెలీకపోతే జ్ఞాపిక (గ్రంథం) కలిగిఉన్న వారిని అడిగి తెలుసుకోండి. 44. మేము వారిని (ఆ ప్రవక్తలను) స్పష్టమయిన నిదర్శనాలతో, గ్రంథాలతో సహా పంపాము. అలాగే మేము నీపైన కూడా

జ్ఞాపిక (ఖుర్ఆన్)ను అవతరింపజేశాము – మేము మానవుల కోసం పంపిన దానిని నీవు వారికి విపులీకరించటానికి, తద్వారా వారు ఆలోచించటానికి.

45. ఏమిటి, కుతంత్రాలు పన్నేవారు, దేవుడు తమను భూమిలో కూరుకుపోయేలా చేస్తాడేమోనని లేదా తాము ఊహించనయినాలేని చోటు నుండి తమపై శిక్ష వచ్చిపడుతుందేమోనని భయపడటం లేదా? 46. లేదా తాము తిరుగాడుతుండగా అకస్మాత్తుగా పట్టుకున్నా, వారు ఆయన్ని వివశుణ్ణి చేయలేరు. 47. లేదా వారిని భయోత్పాతానికి లోనుచేసి పట్టుకున్నా వారేమీ చేసుకోలేరు. అయితే నీ ప్రభువు వాత్సల్యం కలవాడు, కనికరం కలవాడు.

48. ఏమిటి, దేవుడు ఏ వస్తువును సృష్టించినా వాటి నీడలు కుడి వైపునకు, ఎడమ వైపునకు వాలటాన్ని, అవి దైవానికి ప్రణమిల్లటాన్ని వారు గమనించటం లేదా? అవన్నీ ఆయన సన్నిధిలో తమ దీనావస్థను, అణకువను చాటుకుంటున్నాయి. 49. నిశ్చయంగా ఆకాశాలలో, భూమిలో సంచరించే జీవరాశులన్నీ నిజదైవానికే ప్రణమిల్లుతున్నాయి. దైవదూతలు కూడా (సాష్టాంగపడుతున్నారు). వారు ఎంతమాత్రం గర్వాహంకారం ప్రదర్శించరు. 50. వారు తమపై నున్న ప్రభువు పట్ల భయభక్తులు కలిగి ఉంటారు. తమకు ఆజ్ఞాపించబడిన దానినే చేస్తారు.

51. దేవుడిలా సెలవిచ్చాడు : 'ఇద్దరు ఆరాధ్య దైవాలను చేసుకోకండి. ఆరాధ్య దైవం ఒక్కడే. కనుక మీరు నాకే భయపడండి.' 52. భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనదే. సర్వదా ఆయన ఆజ్ఞాపాలనే జరుగుతుంది. మరయితే మీరు ఆ నిజదైవాన్ని కాదని వేరెవరికో భయపడతారా?

53. మీ దగ్గర ఏ అనుగ్రహ భాగ్యమున్నా అది దేవుని తరఫు నుండి లభించినదే. మరి మీకు ఏ కష్టం కలిగినా మీరు ఆయనకే విన్నపాలు చేసుకుంటారు. 54. తరువాత ఆయన ఆ కష్టాన్ని మీ నుండి తొలగించినపుడు, మీలోని ఒక వర్గం వారు తమ ప్రభువుకు సాటి కల్పించటం మొదలెడతారు. 55. ఆ విధంగా వారు మేము ప్రసాదించిన వరాల పట్ల కృతఘ్నులవుతారు.

సరే, కొన్నాళ్ళపాటు మజాలు జుర్రుకోండి. అతిత్వరలో మీరే తెలుసుకుంటారు. 56. ఇంకా, వారు మేము ప్రసాదించిన వస్తువులలో నుండి ఒక భాగాన్ని తమకేమాత్రం తెలియని వారికి (బూటకపు దైవాలకు) కేటాయిస్తున్నారు. దైవసాక్షి! మీరు కల్పిస్తున్న అసత్యంపై మిమ్మల్ని తప్పకుండా ప్రశ్నించటం జరుగుతుంది.

57. వారు దేవుని కొరకు కూతుళ్ళను ఆపాదిస్తున్నారు. దీని నుండి ఆయన పరమ పవిత్రుడు. కాని వారు తమ కోసం మాత్రం తమ మనసు మెచ్చిన దానిని ప్రతిపాదించుకుంటున్నారు. 58. వారిలో ఎవరికయినా ఆడపిల్ల పుట్టిందన్న శుభవార్తను వినిపిస్తే, అతని ముఖం నల్లగా మారిపో తుంది. దానిని జీర్ణించుకోలేక లోలోపలే కుమిలిపోతుంటాడు. 59. తనకు ఇవ్వబడిన శుభవార్తను నామోషీగా భావించి, జనుల నుండి తప్పించుకు తిరుగుతుంటాడు. ఈ అవమానాన్ని భరిస్తూ ఆమెను ఉండనివ్వాలా లేక మట్టిలో పూడ్చిపెట్టాలా? అని సతమతమవుతుంటాడు. వారు గైకొంటున్న ఈ నిర్ణయం ఎంత నీచమయినది!? 60. పరలోకాన్ని నమ్మని వారికి ఇది బహుచెడ్డ ఉపమానం. దేవుని కొరకైతే అత్యున్నతమయిన ఉపమానా లున్నాయి. ఆయన మహాశక్తిమంతుడు, వివేకవంతుడు.

61. దేవుడే గనక జనుల అత్యాచారంపై తక్షణం నిలదీయటం మొదలెడితే ధరణిపై ఏ ప్రాణినీ వదలకపోవచ్చు. అయితే ఆయన ఒక నిర్ణీత సమయం వరకు జనులకు విడుపు ఇస్తుంటాడు. తరువాత వారి నిర్ణీత సమయం ఆసన్నమయినపుడు, వారు ఒక్క ఘడియకాలం కూడా అటూ ఇటూ కాలేరు.

62. వారు తమ స్వయం కొరకు ఇష్టపడని దానిని దేవుని కొరకు ప్రతిపాదిస్తారు. తమకు మంచి మాత్రమే జరుగుతుందని వారి నోళ్లు అబద్ధం చెబుతుంటాయి. వారికి నరకం తథ్యం అనటంలో సందేహానికి ఆస్కారమే లేదు. వారు అవశ్యంగా దానికి ఆహుతి అవుతారు.

63. దేవుని తోడు! (ఓ ముహమ్మద్!) మేము నీకు పూర్వం కూడా అనేక జాతుల వైపు ప్రవక్తలను పంపి ఉన్నాము. మరైతే షైతాన్ వారి చేష్టలను వారికి అందమైనవిగా చిత్రీకరించాడు. అందుకే వాడే నేటికీ వారి సహవాసిగా ఉన్నాడు. వారికి వ్యధాభరితమయిన శిక్ష ఖాయం. 64. వారు విభేదించుకునే విషయాలలోని వాస్తవికతను నీవు వారికి విపులీకరించాలని మేము ఈ గ్రంథాన్ని నీపై అవతరింపజేశాము. అది విశ్వసించే జనులకు మార్గదర్శిని, కారుణ్యవాహిని.

65. అల్లాహ్‌యే ఆకాశం నుండి నీటిని కురిపించాడు. తద్వారా భూమిని, అది మృతి చెందిన మీదట బ్రతికించాడు. నిశ్చయంగా ఇందులో వినగల వారికి సూచన ఉంది.

66. నిశ్చయంగా మీ కొరకు పశువుల్లోనూ గుణపాఠం ఉంది. మేము వాటి కడుపులలోని పేడకు – రక్తానికి మధ్య నుండి మీకు స్వచ్ఛమయిన పాలు త్రాపిస్తున్నాము. త్రాగేవారికి అది ఎంతో కమ్మనిది.

67. ఖర్జూరాలు, ద్రాక్షపండ్ల ద్వారా కూడా! మీరు వాటి ద్వారా మత్తు పానీయాలు కూడా తయారు చేసుకుంటారు. స్వాదిష్టమయిన ఆహార పదార్థాలు కూడా! నిశ్చయంగా ఇందులో విజ్ఞులయిన వారికి సూచన ఉంది.

68. నీ ప్రభువు తేనెటీగకు ఈ విధంగా 'వహీ' పంపాడు : 'కొండలలో, చెట్లలో, తడికెలు కట్టబడి ఉన్న స్థలాలలో నీ తుట్టెలను నిర్మించుకో. 69. తరువాత అన్ని రకాల పండ్ల రసాన్ని పీల్చు. నీ ప్రభువు సుగమం చేసిన మార్గాలలో సాగిపో.' దాని కడుపులో నుండి పానకం ఒకటి వెలువడు తుంది. దాని రంగులు కూడా విభిన్నంగా ఉంటాయి. అందులో ప్రజల కొరకు వ్యాధినివారణ ఉంది. చింతన చేసే జనులకు ఇందులో సూచన ఉంది.

70. దేవుడే మిమ్మల్ని సృష్టించాడు. తరువాత ఆయనే మీకు మరణ మొసగుతాడు. మీలో కొందరు అత్యంత నికృష్టమయిన వయస్సుకు చేర్చబడతారు. తెలిసి కూడా ఏమీ తెలియని వారుగా ఉంటారు. నిశ్చయంగా దేవుడు జ్ఞాన సంపన్నుడు, సర్వం చేయగల సమర్థుడు.

71. దేవుడు మీలో కొందరికి మరి కొందరిపై జీవనోపాధి విషయంలో ఆధిక్యతను ఇచ్చాడు. ఎవరికయితే ఈ ఆధిక్యత ఇవ్వబడిందో, వారు తమ ఉపాధిని తమ స్వాధీనంలో ఉన్న బానిసలకు, వాళ్లు కూడా తమతో సమానులయ్యేలా పంచి ఇవ్వరు కదా! మరలాంటప్పుడు వారు దైవానుగ్రహాలను అంగీకరించేందుకే వెనుకాడుతున్నారా?

72. దేవుడు మీ కొరకు స్వయంగా మీలో నుండే భార్యలను చేశాడు. మీ భార్యల ద్వారా మీకు కొడుకులను, మనవళ్ళను సృజించాడు. తినటానికి మీకు పరిశుద్ధమయిన ఆహారాన్ని ప్రసాదించాడు. మరలాంటప్పుడు వీరు మిథ్యనే నమ్ముకుంటున్నారా? దేవుని వరప్రసాదాలనే కాదంటున్నారా? 73. వారు నిజదైవాన్ని కాదని తమకు ఆకాశాల నుండిగానీ, భూమినుండి గానీ ఏ విధమయిన జీవనోపాధిని సమకూర్చలేని, ఎలాంటి అదుపు అజమాయిషీ లేని వాటిని పూజిస్తున్నారు. 74. కాబట్టి మీరు దేవుని కొరకు ఉపమానాలను ఇవ్వకండి. నిశ్చయంగా దైవానికి అంతా తెలుసు. మీకు తెలీదు.

75. దేవుడు ఇతరుల యాజమాన్యంలో ఉన్న ఒక కట్టుబానిస దృష్టాంతం ఇస్తున్నాడు. అతనికి ఏ అధికారమూ లేదు. కాగా; మరో వ్యక్తికి మేము మా వద్ద నుండి మంచి జీవనోపాధిని ఇచ్చి ఉన్నాము. అతను అందులో నుండి గోప్యంగానూ, బహిరంగంగానూ ఖర్చుపెడుతున్నాడు. వారిరువురూ సమానులేనా? సర్వస్తోత్రములు అల్లాహ్‌కే శోభాయమానం. అయితే వారిలో అత్యధికులు తెలుసుకోరు.

76. దేవుడు ఇద్దరు వ్యక్తుల మరో ఉపమానం కూడా వివరిస్తున్నాడు: వారిద్దరిలో ఒకడు మూగవాడు. దేనికీ పనికిరానివాడు. తన యజమానికి భారంగా తయారయ్యాడు. యజమాని అతనిని ఎక్కడికి పంపించినా, ఏ పనినీ చక్కబెట్టుకునిరాడు. రెండవ వ్యక్తి న్యాయం చెయ్యమని ఆదేశిస్తాడు. అతను రుజుమార్గాన కూడా ఉన్నాడు. చెప్పండి! అతను (మూగవాడు), ఇతనితో సమానుడవగలడా?

77. భూమ్యాకాశాలలోని సమస్త నిగూఢ విషయాల జ్ఞానం దైవానికే

ప్రత్యేకం. ప్రళయ వ్యవహారం కనురెప్ప వాల్చినంత సమయంలో లేదా అంతకన్నా వేగంగానే సంభవించవచ్చు. నిశ్చయంగా దేవుడు ప్రతిదీ చేయగల సమర్థుడు.

78. దేవుడు మిమ్మల్ని మీ మాతృగర్భాల నుండి వెలికి తీశాడు. మీకేమీ తెలియని పరిస్థితి అది. ఆయన మీకు చెవులు, కళ్ళు, హృదయాన్ని ఇచ్చాడు – మీరు కృతజ్ఞతాపూర్వకంగా మసలుకుంటారని.

79. ఏమిటి, గగనసీమలో నియంత్రించబడి ఉన్న పక్షులను వారు గమనించటం లేదా? దేవుడు మాత్రమే వాటిని ఆ స్థితిలో నిలిపి ఉంచాడు. నిశ్చయంగా ఇందులో విశ్వసించే జనులకు సూచనలున్నాయి. 80. దేవుడు మీ కొరకు మీ నివాస గృహాలను ప్రశాంత నిలయాలుగా చేశాడు. మీ కోసం జంతువుల చర్మాలను గుడారాలుగా చేశాడు. అవి మీకు ప్రయాణమైన నాడూ, బసచేసిన నాడు కూడా చాలా తేలిక (సౌకర్యం)గా ఉంటాయి. వాటి జూలుతోనూ, ఉన్నితోనూ, వెంట్రుకలతోనూ గృహ వస్తువులు, ప్రయోజనకరమయిన వస్తువులు కొంతకాలం పాటు పనికివచ్చేలా చేశాడు.

81. దేవుడు మీ కొరకు తాను సృష్టించిన వస్తువులతో నీడను కల్పించాడు. పర్వతాలలో మీరు ఆశ్రయం పొందే చోటు కల్పించాడు. మిమ్మల్ని వేడి నుండి కాపాడే దుస్తులను, పోరాట సమయంలో మిమ్మల్ని రక్షించే కవచాలను కూడా చేశాడు. ఈ విధంగా ఆయన – మీరు విధేయతా పూర్వకంగా మసలుకుంటారని – మీపై తన వరప్రసాదాలను పరిపూర్ణం గావిస్తున్నాడు.

82. ఇక వారు గనక విముఖత చూపితే, నీ కర్తవ్యమల్లా విషయాన్ని స్పష్టంగా అందజేయటం వరకే. 83. వారు దైవానుగ్రహాన్ని గుర్తించిన మీదట కూడా దానిని తిరస్కరిస్తారు. వారిలో అనేకులు ఉపకారాలను మరిచేవారే.

84. ఆ రోజున మేము ప్రతి సముదాయం నుండి ఒక సాక్షిని లేపుతాము. తరువాత అవిశ్వాసులకు సంజాయిషీ ఇచ్చుకునే అనుమతిగానీ,

పశ్చాత్తాపపడే అవకాశం గానీ ఇవ్వబడదు. 85. దుర్వర్తనులు శిక్షను చూసుకున్నప్పుడు, ఆ శిక్ష వారి కొరకు సడలించటంగానీ, వారికి గడువు ఇవ్వటం గానీ జరగదు.

86. బహుదైవారాధకులు, తాము నిలబెట్టుకున్న భాగస్వాములను చూసినపుడు, 'మహాప్రభూ! మేము నిన్ను వదిలేసి మొరపెట్టుకున్న భాగస్వాములు వీరే' అనంటారు. అప్పుడు ఆ భాగస్వాములు వారి వాదనను తిప్పికొడుతూ, 'మీరు చెప్పేది అబద్ధం' అంటారు. 87. ఆ రోజు వారు దైవ సమక్షంలో లొంగిపోతారు. వారి అభూత కల్పనలన్నీ వారి నుండి మటు మాయమైపోతాయి. 88. ఎవరయితే తిరస్కారానికి పాల్పడ్డారో, జనులను దైవమార్గం నుండి అడ్డుకున్నారో, వారు రేకెత్తించిన కల్లోలానికి శాస్తిగా మేము వారికి యాతనపై యాతనను విధిస్తాము. 89. ఏ రోజున మేము ప్రతి సముదాయంలోనూ – స్వయంగా వారిలో నుండే ఒక సాక్షిని నిలబెడతామో, అప్పుడు నిన్ను వారిపై సాక్షిగా తీసుకువస్తాము. మేము నీపై గ్రంథాన్ని అవతరింపజేశాము – ప్రతి విషయాన్నీ క్షుణ్ణంగా విశదీకరించటానికి. అది ఆజ్ఞాపాలన చేసేవారికి మార్గదర్శిని, కారుణ్య ప్రదాయిని, శుభవార్తావాహిని.

90. నిశ్చయంగా దేవుడు న్యాయం చెయ్యమని, మేలు చెయ్యమని, బంధువులకు (వారి హక్కును) ఇవ్వమని ఆజ్ఞాపిస్తున్నాడు. ఇంకా – దేవుడు నీతి బాహ్యత నుండి, చెడుల నుండి, దౌర్జన్యం నుండి ఆపుతున్నాడు. దేవుడు మీకు హితబోధ చేస్తున్నాడు – మీరు ఉపదేశం గ్రహిస్తారని.

91. మీరు పరస్పరం ఒడంబడిక చేసుకున్నప్పుడు దేవునితో చేసిన బాసను నెరవేర్చండి. ప్రమాణాలను దృఢపరచిన మీదట భంగపరచకండి. మీరు దైవాన్ని మీపై బాధ్యునిగా (జామీనుగా) కూడా చేసుకున్నారు. నిశ్చయంగా మీరు చేస్తున్నదంతా దైవానికి ఎరుకే. 92. ఎంతో శ్రమతో తాను వడికిన నూలును తానే స్వయంగా ముక్కలు ముక్కలుగా త్రెంచివేసిన స్త్రీ మాదిరిగా అయిపోకండి. మీలోని ఒక వర్గం వారు మరోవర్గం వారిని

మించిపోవాలని, మీ ప్రమాణాలను పరస్పర కలహాలకు సాధనంగా చేసుకుంటారు. అసలు విషయం ఏమిటంటే దీని మూలముగా దేవుడు మిమ్మల్ని పరీక్షిస్తున్నాడు. ప్రళయదినాన ఆయన, మీరు విభేదించుకుంటున్న విషయాల్లోని వాస్తవికతను బట్టబయలు చేస్తాడు.

93. దేవుడు తలచుకుంటే మీ అందరినీ ఒకే సముదాయంగా చేసి ఉండేవాడు. కాని ఆయన తాను కోరిన వారిని మార్గవిహీనుల్ని చేస్తాడు. తాను కోరిన వారికి మార్గదర్శకత్వం వహిస్తాడు. మీరు చేసిన దాని గురించి మీరు తప్పక ప్రశ్నించబడతారు.

94. మీరు మీ ప్రమాణాలను పరస్పర మోసానికి ఉపయోగించు కోకండి. అన్యథా నిలదొక్కుకున్న అడుగులు కాస్తా జారిపోయే ప్రమాదం ఉంది. తరువాత మీరు దైవమార్గం నుండి జనులను ఆపినందుకు శిక్షనూ చవిచూడవచ్చు. మీ పాలిట ఇది పెద్ద శిక్ష అయి ఉంటుంది. 95. దైవానికి చేసిన వాగ్దానాన్ని కొద్దిపాటి మూల్యానికి అమ్ముకోకండి. మీరు గనక తెలుసుకోగలిగితే, దేవుని వద్ద ఉన్నదే మీ కొరకు మేలైనది.

96. మీ వద్ద ఉన్నదంతా అయిపోతుంది. దేవుని వద్ద ఉన్నదే మిగిలి ఉంటుంది. ఓరిమిగల వారికి మేము, వారి సదాచరణకు గాను తప్పక మంచి ప్రతిఫలం ఇస్తాము. 97. ఏ వ్యక్తి సత్కార్యం చేసినా – అతను పురుషుడయినా, స్త్రీ అయినా – అతను గనక విశ్వసించి ఉంటే, మేమతనికి జీవనాన్ని – పవిత్ర జీవనిని – ప్రసాదిస్తాము. వారు చేసుకున్న సత్కర్మలకు గాను మేము వారికి అత్యుత్తమ ప్రతిఫలం ఇస్తాము.

98. (ప్రవక్తా!) నీవు ఖుర్ఆన్ పారాయణానికి ఉపక్రమించినపుడు, శాపగ్రస్తుడయిన షైతాన్ బారి నుండి దేవుని శరణు వేడుకో. 99. విశ్వసించి, తమ ప్రభువుపైనే భారం మోపిన వారిపై వాడి జోరు (పెత్తనం) సాగదు. 100. వాడితో సావాసం చేసి, దైవానికి భాగస్వాముల్ని కల్పించే వారిపై మాత్రమే వాడి జోరు సాగుతుంది.

101. మేము ఒక సూక్తి స్థానంలో మరో సూక్తిని మార్చినపుడు –

తాను అవతరింపజేసిందేమిటో అల్లాహ్‌కు బాగా తెలుసు. 'నీవు స్వయంగా దీనిని (ఈ ఖుర్‌ఆన్‌ను) కల్పించి తెచ్చావు' అని వారంటున్నారు. అసలు విషయం ఏమిటంటే వారిలో చాలామంది తెలియనివారు. 102. వారికి చెప్పు : 'దీనిని "పరిశుద్ధాత్మ" మీ ప్రభువు తరఫు నుండి సత్యసమేతంగా అవతరింపజేసింది – తద్వారా అది విశ్వసించిన వారికి స్థిరత్వాన్ని ఇవ్వటానికి, ఇంకా అది విధేయులయిన వారికి మార్గదర్శకం, శుభవార్త కాగలగటానికి.'

103. 'ఒకానొక మనిషి ఇతనికి నేర్పుతున్నాడ'ని వారు చెబుతున్న సంగతి మాకు తెలుసు. ఏ వ్యక్తిని వారు సూచిస్తున్నారో అతను అరబ్బేతరుడు (అజమీ), అరబీ భాష రానివాడు. కాగా; ఈ ఖుర్‌ఆన్ స్వచ్ఛమయిన అరబీలో ఉంది. 104. నిశ్చయంగా ఎవరయితే దైవసూక్తులను విశ్వసించరో, వారికి దేవుడు ఎన్నటికీ సన్మార్గం చూపడు. వారికి బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 105. దైవసూక్తులపై నమ్మకం లేని వారు మాత్రమే అబద్ధాలను కల్పిస్తారు. అలాంటివారే అసలు అబద్ధాలకోరులు.

106. విశ్వసించిన పిదప దైవాన్ని తిరస్కరించిన వ్యక్తి – బలాత్కారం వల్ల ఎవరయినా అవిశ్వాస వాక్కు పలికితే, ఆ క్షణంలో అతని మనస్సాక్షి విశ్వాసంపై స్థిరంగా ఉన్నట్లయితే (అతను క్షంతవ్యుడే) – కాని ఏ వ్యక్తి అయినా మనసారా తిరస్కారానికి ఒడిగడితే అలాంటి వారిపై దైవాగ్రహం విరుచుకుపడుతుంది. వారికి ఘోర యాతన తప్పదు. 107. ఇలా ఎందుకంటే వారు పరలోక జీవితంపై ప్రాపంచిక జీవితాన్నే ఇష్టపడ్డారు. దేవుడు తిరస్కార జనులకు సన్మార్గం చూపడు. 108. వారెలాంటివారంటే, దేవుడు వారి హృదయాలపై, వారి చెవులపై, వారి కళ్ళపై ముద్రవేసేశాడు. వారు పూర్తిగా పరధ్యానానికి లోనై ఉన్నారు. 109. ఖచ్చితంగా వారు పరలోకంలో నష్టపోయిన వారిలో ఉంటారు.

110. మరెవరయితే కఠిన పరీక్షకు లోనయిన తరువాత వలస పోయారు (హిజ్రత్ చేశారో), తరువాత నిరంతర పోరాటం సాగించారో, సహన స్థయిర్యాలను కనబరిచారో అలాంటి వారిని – ఈ విషయాలన్నింటి

తర్వాత – నీ ప్రభువు క్షమించేవాడు, కరుణించేవాడు. 111. ఆ రోజు ప్రతి వ్యక్తీ తన తరఫునే వాదిస్తూ వస్తాడు. ప్రతి వ్యక్తికీ అతను చేసుకున్నదాని ప్రతిఫలం పూర్తిగా ఇవ్వబడుతుంది. వారికి ఎలాంటి అన్యాయం జరగదు.

112. దేవుడు ఒక పట్టణవాసుల దృష్టాంతం వివరిస్తున్నాడు. వారు సురక్షితంగా, నిశ్చింతగా జీవితం గడిపేవారు. వారికి వారి జీవనోపాధి నలువైపుల నుండీ పుష్కలంగా లభించేది. కాని ఆ పట్టణ ప్రజలు దేవుని వరప్రసాదాల పట్ల కృతఘ్నతకు పాల్పడ్డారు. అందుకే దేవుడు వారి స్వయంకృతాల కారణంగా వారికి ఆకలి, భయాందోళనల రుచి చూపించాడు. 113. వారివద్దకు ఒక ప్రవక్త – ఖుద్దుగా వారిలో నుండే – వచ్చాడు. కాని వారతన్ని అసత్యవాదిగా చిత్రీకరించారు. మరి వారు దుర్మార్గంలో చెలరేగి పోతున్నప్పుడు శిక్ష వారిని అకస్మాత్తుగా కబళించింది.

114. మీరు నిజంగా దైవాన్ని ఆరాధించేవారే అయితే, దేవుడు మీకు ప్రసాదించిన ధర్మసమ్మతమయిన, పరిశుద్ధమయిన ఆహార పదార్థాలను తినండి. దైవానుగ్రహాల పట్ల కృతజ్ఞులై ఉండండి. 115. ఆయన మీ కొరకు నిషేధించినవి ఏవయినా ఉంటే అవి ఇవి : మృత జంతువు, రక్తం, పందిమాంసం, దైవేతర పేరు పలికి కోయబడిన జంతువు. మరెవరయినా గత్యంతరం లేని పరిస్థితిలో (ఆకలి బాధకు తాళలేక) – అయిష్టంగా, హద్దుమీరకుండా – కొద్దిగా తింటే నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, జాలి చూపేవాడు.

116. మీ నోళ్ళు కల్పించిన అబద్ధాల ఆధారంగా, 'ఇదేమో హలాల్, ఇది మాత్రం హరామ్' అంటూ దేవునికి అసత్యాలను ఆపాదించకండి. దేవునికి అసత్యాలను అంటగట్టేవారు కృతార్థులు కాలేరు. 117. వారు కొద్దిపాటి లబ్దిని పొందవచ్చు. కాని వారికి బాధాకరమయిన శిక్ష తథ్యం.

118. లోగడ మేము నీకు తెలిపి ఉన్న కొన్ని ఆహార వస్తువులను యూదుల కొరకు నిషేధించాము. మేము వారికెలాంటి అన్యాయం చేయలేదు. పైగా వారే తమ స్వయానికి అన్యాయం చేసుకున్నారు.

119. మరెవరయినా అజ్ఞానం కారణంగా చెడు చేసి, పిదప పశ్చాత్తాపపడి, స్వీయ సంస్కరణ చేసుకుంటే నీ ప్రభువు ఈ పశ్చాత్తాపం తరువాత వారిని క్షమించేవాడు, దయచూపేవాడు.

120. నిశ్చయంగా ఇబ్రాహీమ్ ఒక ప్రత్యేక సముదాయం వంటివాడు. దేవుని యెడల విధేయత గలవాడు; ఆయనయందే మనసును లగ్నం చేసినవాడు. అతను బహుదైవారాధకులలోని వాడు కాడు.
121. దైవానుగ్రహాలకు కృతజ్ఞతలు తెలుపుకునేవాడు; దేవుడతనిని ప్రత్యేకంగా ఎన్నుకున్నాడు. రుజుమార్గం వైపు అతనికి దర్శకత్వం వహించాడు.
122. ప్రపంచంలో కూడా మేమతనికి మేలు చేశాము. పరలోకంలో కూడా అతను సజ్జనుల సరసన ఉంటాడు. 123. ఆ తరువాత మేము (ఓ ముహమ్మద్!) నీ వద్దకు దివ్యవాణి (వహీ)ని పంపుతూ, 'ఏకాగ్రచిత్తుడయిన ఇబ్రాహీమ్ విధానాన్ని అనుసరించు. అతను షిర్క్ చేసే వారిలో చేరలేదు' అని తాకీదు చేశాము.

124. శనివారం విషయంలో విభేదించుకున్న వారిపైనే అది రుద్దబడింది. నిశ్చయంగా నీ ప్రభువు, వారు విభేదించుకుంటున్న విషయమై వారి మధ్యన తీర్పు చేస్తాడు.

125. నీ ప్రభువు మార్గం వైపునకు వివేకంతో, చక్కని ఉపదేశంతో పిలువు. అత్యుత్తమ రీతిలో వారితో వాదించు. నిశ్చయంగా నీ ప్రభువుకు తన మార్గం నుండి తప్పిపోయినవాడెవడో తెలుసు. సన్మార్గంపై నడిచే వారెవరో కూడా ఆయనకు బాగా తెలుసు.

126. ఒకవేళ మీరు ప్రతీకారం తీర్చుకోదలిస్తే మీకు జరిగిన అన్యాయానికి సమానంగా మాత్రమే తీర్చుకోవాలి. ఒకవేళ మీరు ఓర్పు వహిస్తే, ఓర్పు వహించేవారి పాలిట అది ఎంతో మేలైనది. 127. (ఓ ముహమ్మద్!) ఓర్పు వహించు. దేవుడిచ్చిన సద్బుద్ధి వల్లనే నీకు ఈ ఓరిమి అబ్బింది సుమా! వారి స్థితిపై ఆవేదన చెందకు. వారి కుతంత్రాలకుగాను మనస్తాపం చెందకు. 128. నిశ్చయంగా దేవుడు దైవభీతిపరులకు, సద్వర్తనులకు తోడుగా ఉన్నాడు.

# 17. అల్ ఇస్రా (రాత్రి ప్రయాణం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (15) 1. ఒక రాత్రి సమయాన తన దాసుణ్ణి మస్జిదె హరామ్ (పవిత్ర కాబా గృహం) నుండి దూరాన ఉన్న మస్జిద్ (మస్జిదె అక్సా) వరకు తీసుకు వెళ్ళినవాడు పరమ పవిత్రుడు. దాని పరిసరాలను మేము శుభవంతం చేశాము – మేమతనికి మా సూచనలు కొన్నింటిని చూపటానికి! నిశ్చయంగా ఆయన వినేవాడు, చూసేవాడు.

2. మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము. దానిని ఇస్రాయీల్ సంతతికి మార్గదర్శినిగా చేశాము. నన్ను తప్ప వేరెవరినీ కార్య సాధకునిగా చేసుకోరాదని (తాకీదు చేశాము). 3. మేము నూహ్‌తో పాటు ఓడలోకి ఎక్కించిన వారి సంతానమే మీరు. నిశ్చయంగా నూహ్ కృతజ్ఞతా శీలుడయిన దాసుడు.

4. 'మీరు (సిరియా) భూభాగంలో రెండుసార్లు విధ్వంసం సృష్టిస్తారని, అడ్డూ ఆపూ లేకుండా చెలరేగిపోతార'ని మేము ముందస్తుగానే ఇస్రాయీల్ సంతతివారికి గ్రంథంలో సావధానపర్చాము. 5. మరి వాటిలో తొలి వాగ్దాన సమయం ఆసన్నమైనపుడు, యుద్ధకాముకులయిన మా దాసులను మీపైకి వదిలాము. వారు మీ ఇండ్లలో జొరబడి (విధ్వంసకాండ సృష్టించి)నారు. ఆ వాగ్దానం ఆ విధంగా పూర్తయింది. 6. ఆ తరువాత మీ వంతును వారిపైకి మళ్ళించాము. సిరిసంపదలతో, సంతాన భాగ్యంతో మీకు సహాయపడ్డాము. మీ సంఖ్యాబలాన్ని అధికం చేశాము.

7. ఒకవేళ మీరేదన్నా మంచి చేసుకుంటే అది మీ స్వయానికే మంచిదవుతుంది. ఒకవేళ మీరేదన్నా చెడుచేస్తే అది కూడా మీకే చెందుతుంది. తరువాత రెండవ వాగ్దాన సమయం ఆసన్నమయినపుడు, మీ ముఖాలను వికృతం చేయటానికి, మొదటిసారి మస్జిద్ (బైతుల్ మక్దిస్)లో జొరబడినట్లే

వారు మరోసారి జోరబడటానికి, తమకు చేజిక్కిన ప్రతి దానినీ ధ్వంసం చేయటానికి మేము మరింతమందిని మీపైకి నియోగించాము. 8. అయినప్పటికీ (మీరు గనక రుజువర్తనులయినట్లయితే) మీ ప్రభువు మీపై కరుణించటం అసంభవం ఏమీ కాదు. కాని మీరు మళ్లీ అదే ధోరణిని అవలంబిస్తే, మా చర్య కూడా పునరావృతం అవుతుంది. మేము నరకాన్ని సత్యతిరస్కారుల కొరకు బందీఖానాగా చేశాము.

9. నిశ్చయంగా ఈ ఖుర్‌ఆన్ సవ్యమయిన మార్గం చూపుతుంది. సదాచరణ చేసే విశ్వాసులకు గొప్ప ప్రతిఫలం లభిస్తుందన్న శుభవార్తను ఇస్తుంది. 10. మరెవరయితే పరలోకాన్ని నమ్మరో వారి కోసం మేము బాధాకరమయిన యాతనను సిద్ధం చేసి పెట్టాము.

11. మానవుడు మేలును అర్థించవలసిన రీతిలో కీడును అర్థిస్తాడు (విచిత్రం కదూ!). నిజంగానే మానవునికి మహా తొందర! 12. మేము రేయింబవళ్ళను రెండు సూచనలుగా చేశాము. మరి మేము రాత్రి సూచనను మటుమాయం చేశాము, పగటి సూచనను దేదీప్యమానంగా చేశాము – తద్వారా మీరు మీ ప్రభువు అనుగ్రహాన్ని అన్వేషించటానికి! సంవత్సరాలను లెక్కించటానికి!! కాలగణన చేయటానికి!!! మేము ప్రతి దానిని క్షుణ్ణంగా వివరించాము.

13. మేము ప్రతి మనిషి విధి విధానాన్ని అతని మెడలోనే వ్రేలాడ దీశాము. ఇంకా మేము ప్రళయదినాన అతనికి సంబంధించిన ఒక పుస్తకాన్ని బయటికి తీస్తాము. దానిని అతను తెరచిన పుస్తకంగా పొందుతాడు. 14. 'చదువుకో నీ పుస్తకాన్ని. ఈ రోజు నీ లెక్క తీసుకోవటానికి నువ్వే సరిపోతావు' (అని అతనితో అనబడుతుంది). 15. సన్మార్గాన్ని అవలంబించే వ్యక్తి తన స్వయం కొరకే అవలంబిస్తాడు. అపమార్గాన పోయేవాడు తన నష్టానికే అపమార్గాన పోతాడు. బరువును మోసేవాడెవడూ మరొకరి బరువును మోయడు. మేము ఏ ప్రవక్తనయినా పంపనంత వరకూ (ఎవరినీ) శిక్షించబోము.

16. మేము ఏ జనావాసాన్నయినా సంహరించదలచినపుడు అక్కడి సంపన్నులకు (తొలుత) ఆదేశాలు పంపుతాము. వాటిని వారు నిర్లక్ష్యం చేసినపుడు, వారిపై చర్య అనివార్యమని రూఢీ అవుతుంది. ఆ తరువాత మేము ఆ జనావాసాన్ని సర్వనాశనం చేసివేస్తాము. 17. నూహ్ తరువాత మేము ఎన్నో తరాలను అంతమొందించాము. తన దాసుల పాపాలను తెలుసుకోవటానికి, చూసుకోవటానికి నీ ప్రభువు (ఒక్కడే) చాలు.

18. ఎవడయితే తొందరగా లభించే దానిని (ప్రపంచాన్ని) కాంక్షిస్తాడో అతనికి మేము అందులో నుండే ఇచ్చేస్తాము – మేము కోరిన వారికి కోరినంతగా ఇస్తాము. తరువాత మేము అతని కోసం నరకాన్ని నిర్ధారిస్తాము. అతను హీనుడై, దూషితుడై అందులో ప్రవేశిస్తాడు. 19. మరెవరయితే పరలోకాన్ని కోరుకున్నాడో, దాని కొరకు సాధన చేయవలసిన విధంగా చేశాడో, అతను గనక విశ్వాసి అయివుంటే – అలాంటి వారి సాధన ఆమోదించబడుతుంది.

20. మేము వారికీ, వీరికీ – ప్రతి ఒక్కరికీ నీ ప్రభువు ప్రసాదించిన దానిలో నుండి ఇస్తున్నాము. నీ ప్రభువు వరప్రసాదం ఏ ఒక్కరి నుండీ ఆపబడలేదు. 21. చూడండి! మేము వారిలోని ఒకరికి మరొకరిపై ఎలాంటి ఆధిక్యతను ఇచ్చామో! నిశ్చయంగా పరలోకం అంతస్తుల దృష్ట్యాగానీ, ఆధిక్యత రీత్యాగానీ ఇంతకన్నా గొప్పది.

22. నీవు అల్లాహ్‌తో పాటు వేరొకరిని ఆరాధ్య దైవంగా చేసుకోకు. అన్యథా నీవు దూషితుడవై, అశక్తుడవై ఉండిపోతావు. 23. నీ ప్రభువు నిర్ణయం చేసేశాడు : మీరు ఆయనను తప్ప వేరెవరినీ ఆరాధించకూడదు. తల్లిదండ్రుల యెడల ఉత్తమ రీతిలో వ్యవహరించండి. ఒకవేళ వారిలో ఏ ఒక్కరుగానీ, ఇద్దరుగానీ నీ ముందరే వృద్ధాప్యానికి చేరుకుంటే, వారిని విసుగ్గా 'ఛీ ఛీ' అనకు. కసురుకోకు. వారిని గౌరవాదరణలతో పలకరించు. 24. వారి ముందు వినమ్రతతో, మృదువుతో నీ బాహువులను అణచిపెట్టుకో.

ఈ విధంగా వేడుకుంటూ ఉండు : 'ప్రభూ! వీరిరువురూ నన్ను పసితనంలో ప్రేమతో సాకినట్లుగానే వీరిపై దయజూపు.' 25. మీ ఆంతర్యాలలో ఏముందో మీ ప్రభువుకు బాగా తెలుసు. మీరు గనక సద్వర్తనులుగా ఉంటే, ఆయన పశ్చాత్తాపం చెందే వారి యెడల క్షమాసాగరుడు.

26. బంధువులకు వారి హక్కును ఇవ్వు. బీదవానికి, బాటసారికి కూడాను. దుబారా ఖర్చు చేయకు. 27. నిశ్చయంగా దుబారా ఖర్చు చేసేవారు షైతాన్ సోదరులు. ఇక షైతాన్ విషయానికి వస్తే, వాడు తన ప్రభువు ఉపకారాన్ని మరచినవాడు. 28. నీవు ఆశిస్తున్న దైవకారుణ్యం కొరకు నీవు గనక నిరీక్షిస్తూ ఉన్నట్లయితే, అట్టి పరిస్థితిలో నీవు వారిని (బీదసాదలను, అవసరార్థులను) దాటవేయవలసి వస్తే, మృదువుగానే పోయి రమ్మని చెప్పు.

29. నీ చేతిని మెడకు కట్టి ఉంచుకోకు. అలా అని దానిని మరీ విచ్చలవిడిగా కూడా వదలిపెట్టకు. (ఇవి రెండూ అవాంఛనీయ ధోరణులే). దీనివల్ల నీవు నిందలపాలవుతావు. నిస్సహాయ స్థితికి లోనవుతావు. 30. నిశ్చయంగా నీ ప్రభువు తాను కోరిన వారికి ఇతోధికంగా ఉపాధిని ఇస్తాడు. తాను కోరిన వారికి కుదిస్తాడు. నిశ్చయంగా ఆయన తన దాసులను గురించి బాగా ఎరిగినవాడు, అంతా గమనిస్తున్నవాడు.

31. మీ సంతానాన్ని దారిద్ర్య భయంతో హతమార్చకండి. మేము వారికీ ఉపాధిని ఇస్తున్నాము, మీకూను. ముమ్మాటికీ వారి హత్య మహాపరాధం. 32. వ్యభిచారం దరిదాపులకు కూడా పోకండి. అదొక సిగ్గుమాలిన చేష్ట. బహుచెడ్డ మార్గం.

33. దేవుడు పవిత్రం గావించిన (నిషేధించిన) ఏ ప్రాణినీ చంపకండి – ధర్మబద్ధంగా తప్ప! ఎవరయినా అన్యాయంగా హత్య చేయబడితే, మేము అతని వారసునికి (ప్రతీకారం తీర్చుకునే) అధికారం ఇచ్చాము. అయితే అతను హత్య (ప్రతీకారం – ఖిసాస్ కోరే) విషయంలో హద్దు మీరకూడదు. నిశ్చయంగా అతనికి సహాయం అందజేయబడుతుంది.

34. మీరు అనాథ సొమ్మును సమీపించకండి – ఉత్తమ రీతిలో తప్ప! వారు యుక్త వయస్సుకు చేరుకునే వరకు (వారి సొమ్మును కాపాడండి). వాగ్దానానికి కట్టుబడి ఉండండి. నిశ్చయంగా వాగ్దానం విషయంలో ప్రశ్నించటం జరుగుతుంది. 35. కొలిచి ఇస్తున్నప్పుడు పూర్తిగా కొలిచి ఇవ్వండి. తూచి ఇస్తున్నప్పుడు సరయిన త్రాసుతో తూయండి. ఇదే మేలైనది. పరిణామ స్వరూపం దృష్ట్యా కూడా ఎంతో మంచిది.

36. నీకు తెలియని విషయం వెంటపడకు. నిశ్చయంగా చెవులు, కళ్ళు, హృదయం – వీటన్నింటి గురించి మనిషిని ప్రశ్నించటం జరుగుతుంది. 37. నేలపై నిక్కుతూ నడవకు. నీవు నేలను చీల్చనూలేవు, పర్వతాల ఎత్తుకు ఎదగనూ లేవు. 38. ఈ దుష్టచేష్టలన్నీ నీ ప్రభువు దృష్టిలో అసహ్యకర మయినవే.

39. ఇవన్నీ విజ్ఞతా వివేచనలతో కూడుకున్న విషయాలు. వీటిని నీ ప్రభువు దివ్యవాణి (వహీ) ద్వారా నీకు తెలియపరిచాడు. అల్లాహ్‌తో పాటు మరో ఆరాధ్య దైవాన్ని చేర్చుకోకు. అలా చేశావంటే నీవు దూషితుడవై, శుభాలకు దూరమై నరకాగ్నికి ఆహుతి చేయబడతావు.

40. ఏమిటి, మీ ప్రభువు మీ కోసం కుమారుల్ని ఎంపిక చేసి, తన కోసమేమో దైవదూతలను కూతుళ్ళుగా చేసుకున్నాడా? నిశ్చయంగా మీరు పలికే ఈ మాట దారుణమైనది. 41. మేము ఈ ఖుర్‌ఆన్‌లో విషయాన్ని పలు విధాలుగా విశదీకరించాము – తద్వారా వారు గుణపాఠం గ్రహిస్తారని. కాని వారి పలాయనవాదం మరింత ఎక్కువే అవుతోంది. 42. వారితో అను : వారు చెబుతున్నట్లుగా దేవునితో మరెందరో దేవుళ్లు కూడా ఉండి ఉంటే, వారు సింహాసనాధీశుని వద్దకు చేరే మార్గాన్ని ఈ పాటికి కనుగొనేవారే. 43. వారు పలికే ఈ మాటల నుండి దేవుడు పరమ పవిత్రుడు, మహోన్నతుడు. 44. సప్తాకాశాలు, భూమి, ఇంకా వాటిలో ఉన్న సమస్తం ఆయన పవిత్రతను కొనియాడుతున్నాయి. సృష్టితాలలో ఆయన స్తోత్రంతో పాటు, ఆయన పవిత్రతను శ్లాఘించని వస్తువంటూ ఏదీ లేదు. కాని మీరు

వాటి కీర్తనను అర్థం చేసుకోలేరు. నిశ్చయంగా ఆయన నెమ్మదస్తుడు, క్షమాగుణం కలవాడు.

45. (ప్రవక్తా!) నీవు ఖుర్ఆన్ పారాయణం చేస్తున్నప్పుడు మేము నీకూ – పరలోకాన్ని నమ్మని వారికీ మధ్య ఒక అగోచర తెరను అడ్డుగా ఏర్పరుస్తాము. 46. వారు అర్థం చేసుకోకుండా మేము వారి హృదయాలపై తెర వేసేస్తాము. వారి చెవులను మొద్దుబారజేస్తాము. నీవు ఖుర్ఆన్‌లో ఒక్కడైన నీ ప్రభువును ప్రస్తుతించినపుడు వారు ఓర్వలేనితనంతో వెన్నుచూపుతారు.

47. వారు నీ వైపు చెవియొగ్గి వింటున్నప్పుడు, ఎందుకు వింటారో మాకు తెలుసు. వారు పరస్పరం మంతనాలు సాగించినపుడు ఎందుకు అలా చేస్తారో కూడా మాకు తెలుసు. మీరంతా చేతబడికి లోనైఉన్న మనిషిని అనుసరిస్తున్నారని ఈ దుర్మార్గులు చెబుతున్నారు. 48. చూశావా! వారు నీ గురించి ఎలాంటి దృష్టాంతాలు ఇస్తున్నారో! వారసలు మార్గభ్రష్టులైపోయారు. ఇక వారు దారికి రావటమనేది సాధ్యం కాదు.

49. వారిలా అంటారు : 'ఏమిటి, మేము ఎముకలుగా, రేణువులుగా మారిపోయిన మీదట కూడా మేము మళ్లీ వినూత్నంగా సృష్టించబడతామా?' 50. వారికి చెప్పు : 'మీరు రాళ్ళయిపోయినా, ఇనుమయి పోయినా 51. లేదా మీ ఊహాజగత్తులో ఉన్న అంతకన్నా గట్టి వస్తువుగా మారినా (మీరు తిరిగి లేపబడటం మాత్రం తథ్యం).' 'మమ్మల్ని తిరిగి బ్రతికించే వాడెవడు?' అని కూడా వారడుగుతారు. 'మిమ్మల్ని తొలిసారి సృష్టించినవాడే' అని వారికి చెప్పు. అప్పుడు వారు తలలూపుతూ, 'ఇంతకీ అది ఎప్పుడు సంభవిస్తుందో?' అంటారు. వారికి సమాధానం ఇవ్వు : 'ఆ ఘడియ అతి సమీపంలో ఉన్నా ఆశ్చర్యం లేదు. 52. ఆ రోజు దేవుడు మిమ్మల్ని పిలవ గానే, మీరు ఆయన స్తోత్రం చేస్తూ వస్తారు. చాలా కొద్ది సమయం మాత్రమే (ప్రపంచంలో) ఉన్నట్లు మీరు తలపోస్తారు.'

53. (ప్రవక్తా!) నీవు నా దాసులతో చెప్పు; ఏం చెప్పినా మంచిమాటే

చెప్పాలని. నిశ్చయంగా షైతాన్ వారి మధ్య కలతలు రేపుతాడు. నిశ్చయంగా షైతాన్ మనిషికి బద్ధ విరోధి.

54. మీ గురించి మీ ప్రభువుకు బాగా తెలుసు. ఆయన గనక తలచుకుంటే మిమ్మల్ని కరుణించనూవచ్చు లేదా ఆయన కోరితే మిమ్మల్ని శిక్షించనూవచ్చు. మేము నిన్ను వారిపైన కావలివానిగా చేసి పంపలేదు కదా! 55. నీ ప్రభువు భూమ్యాకాశాలలో ఉన్న వారి గురించి బాగా ఎరుగు. మేము ప్రవక్తలలో కొందరికి మరి కొందరిపై ఆధిక్యతను ఇచ్చాము. ఇంకా మేము దావూదుకు జబూరు (గ్రంథం) వొసగాము.

56. వారికి చెప్పు : 'మీరు ఆ నిజదైవాన్ని కాదని ఎవరెవరిని ఆరాధ్య దైవాలుగా తలపోస్తున్నారో వారిని పిలిచి చూడండి! వారు మీ నుండి ఏదయినా గండాన్ని తొలగించటం గానీ, దానిని మార్చటం గానీ చేయలేరు. 57. వీరు ఎవరిని మొరపెట్టుకుంటున్నారో, వారు స్వయంగా తమ ప్రభువు సామీప్యాన్ని అన్వేషిస్తున్నారు – వారిలో ఎవరు ఎక్కువ (ప్రభువుకు) సమీపంలో ఉన్నారా! అని చూస్తున్నారు. వారు తమ ప్రభువు కారుణ్యాన్ని ఆశిస్తున్నారు. ఆయన శిక్షకు భయపడుతున్నారు. నిశ్చయంగా నీ ప్రభువు శిక్ష భయపడవలసినదే.

58. ప్రళయదినానికి ముందే మేము అంతమొందించని లేదా కఠిన శిక్షకు గురిచెయ్యకుండా ఉండని జనావాసం ఏదీ ఉండదు. ఈ విషయం గ్రంథంలో నమోదై ఉంది.

59. సూచనలు పంపకుండా మిమ్మల్ని వారించిన విషయం ఒక్కటే – అదేమిటంటే పూర్వీకులు వాటిని అసత్యమని త్రోసిపుచ్చారు. మేము సమూదు జాతి వారికి స్పష్టమయిన సూచనగా ఆడ ఒంటెను ఇచ్చాము. కాని వారు దానిపై అఘాయిత్యానికి పాల్పడ్డారు. మేము సూచనలను పంపేది హెచ్చరికగా మాత్రమే.

60. '(ప్రవక్తా!) నీ ప్రభువు జనులను చుట్టుముట్టి ఉన్నాడని మేము

నీతో చెప్పినప్పటి విషయం (మననం చేసుకో), ఇంకా మేము నీకు చూపిన ఆ దృశ్యం, కేవలం ప్రజలను పరీక్షించటానికే. ఖుర్‌ఆన్‌లో శపించబడిన ఆ వృక్ష వ్యవహారం కూడా అంతే. మేము వారిని హెచ్చరిస్తూనే పోతున్నాము. కాని రాను రాను వారి తలబిరుసుతనం మరింత అధికమవుతోంది.

61. 'ఆదమ్‌కు ప్రణమిల్లండి' అని మేము దైవదూతలతో అన్నప్పుడు వారంతా ప్రణమిల్లారు. కాని ఇబ్లీస్ మాత్రం నిరాకరించాడు. 'నీవు మట్టితో పుట్టించిన వాడికి నేను సాష్టాంగ ప్రణామం చేయాలా?' అన్నాడు.
62. వాడిలా చెప్పాడు : 'చూడు! ఏ వ్యక్తికయితే నీవు నాపై గౌరవమొసగావో, అతని వ్యవహారంలో నీవు నాకు ప్రళయదినం వరకూ గడువు ఇస్తే కొద్దిమందిని తప్ప ఇతని సంతానమంతటినీ నేను కబళిస్తాను.'

63. దేవుడిలా సెలవిచ్చాడు : 'పో. వారిలో ఎవరు నిన్ను అనుసరించినా, నరకం మీ అందరికోసం సంపూర్ణ ప్రతిఫలంగా ఉంటుంది.
64. వారిలో ఎవరెవరిపై నీ జోరు సాగుతుందో, నీ పిలుపుతో వారి అడుగులు తడబడేలా చేసుకో. నీ అశ్వదళంతో, పదాతి దళంతో వారిపై దండయాత్ర చెయ్యి. వారి సిరిసంపదలలో, వారి సంతానంలో భాగస్వామివి అవ్వు. వారికి వాగ్దానాలు చేసుకో. షైతాన్ వాగ్దానాలు మోసం తప్ప మరేమీ కావు.
65. నికార్సయిన నా దాసులపై మాత్రం నీ పెత్తనం సాగదు. కార్యం చక్కబెట్టడానికి నీ ప్రభువు ఒక్కడే చాలు.'

66. మీ కోసం సముద్రంలో ఓడల్ని నడిపేవాడే మీ ప్రభువు – మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించాలని. నిశ్చయంగా ఆయన మీ యెడల అపార కరుణామయుడు. 67. సముద్రంలో మీపై ఏదన్నా విపత్తు వచ్చిపడినపుడు, దేవుడు తప్ప మీరు మొరపెట్టుకునే వాటన్నింటినీ మీరు మరచిపోతారు. మరి ఆయన మిమ్మల్ని సురక్షితంగా తీరానికి చేర్చగానే మీరు విముఖత చూపుతారు. ఎంతయినా మానవుడు మహా కృతఘ్నుడు.

68. ఏమిటి, దేవుడు మిమ్మల్ని నేలవైపు తీసుకువచ్చిన మీదట

భూమిలో కూర్చివేయటం గురించి, మీపై రాళ్లు కురిపించే పెనుగాలిని పంపటం గురించి మీరు నిర్భయంగా ఉన్నారా? అప్పుడు మీరు ఏ రక్షకుణ్ణీ పొందలేరు. 69. లేదా ఆయన మిమ్మల్ని మరోసారి సముద్రంలోనికి తీసుకువెళ్ళి, మీపై భయంకరమయిన తుఫాను గాలిని పంపి, మీ తిరస్కార వైఖరి మూలంగా మిమ్మల్ని ముంచి వేయటంపై మీరు నిశ్చింతగా ఉన్నారా? అప్పుడు మీ తరఫున మమ్మ వెంటాడే వారెవరినీ మీరు కనుగొనలేరు.

70. మేము ఆదం సంతతికి గౌరవం ఇచ్చాము. మేము నేలపైనా, నీటిలోనూ పయనించే వాహనాలను ప్రసాదించాము. ఇంకా వారికి పరిశుద్ధమయిన వస్తువులను జీవనోపాధిగా సమకూర్చాము. ఇంకా మేము వారికి మా సృష్టితాలెన్నింటిపైననో ప్రాధాన్యతను వొసగాము.

71. ఆ రోజు మేము ప్రతి మానవ సముదాయాన్ని, దాని నాయకునితో సహా పిలుస్తాము. అప్పుడు కర్మల పత్రం కుడిచేతికి ఇవ్వబడినవారు, తమ కర్మల పత్రాన్ని చదువుకుంటారు. వారిపట్ల లేశమయినా అన్యాయం జరగదు. 72. ఈ లోకంలో గుడ్డివానిగా వ్యవహరించినవాడు, పరలోకంలో కూడా గుడ్డివాడుగానే ఉంటాడు. అతను మార్గానికి బహు దూరాన పడి ఉంటాడు.

73. (ప్రవక్తా!) నిన్ను ఉపద్రవానికి లోనుచేసి, మేము నీ వద్దకు పంపిన దివ్యవాణి నుండి నిన్ను మరల్చటానికి, తద్వారా నీ అంతట నీవు మా వైపు మరేదయినా తప్పుడు మాటను కల్పించాలని వారు సర్వవిధాలా ప్రయత్నించారు. నీవు గనక అలాచేసి ఉంటే, వారు నిన్ను నీ మిత్రునిగా చేసుకునేవారే. 74. మేము గనక నీకు సహన స్థయిర్యాలను ప్రసాదించి ఉండకపోతే, నీవు వారి వైపునకు ఎంతో కొంత మొగ్గిపోయేవాడివే. 75. అదే గనక జరిగివుంటే, మేము నీకు జీవన్మరణాల రెండింటి (రెట్టింపు) శిక్షను విధించేవారము. ఆ తరువాత నీవు మాకు వ్యతిరేకంగా ఏ సహాయ కుడినీ పొందగలిగేవాడవు కావు.

76. వీళ్లు ఈ భూభాగం నుండి నిన్ను వెళ్ళగొట్టే ఉద్దేశంతో నిన్ను నిలదొక్కుకోకుండా చేయదలిచారు. ఒకవేళ వారు తమ ప్రయత్నంలో కృతకృత్యులై ఉంటే, నీ తరువాత వారు కూడా బహుకొద్ది కాలమే (ఈ గడ్డపై) నిలువగలిగేవాళ్ళు. 77. ఇదీ మా విధానం. మేము నీకు పూర్వం పంపిన ప్రవక్తలందరి విషయంలో ఇలాగే జరిగింది. నీవు మా విధానంలో ఎలాంటి పరివర్తననూ కానలేవు.

78. నమాజును స్థాపించు – పొద్దువాలినప్పటి నుండి రాత్రి చీకటి క్రమ్ముకునేవరకు. ముఖ్యంగా ప్రాతఃకాల ఖుర్‌ఆన్ పారాయణం! నిశ్చయంగా ప్రాతఃకాల ఖుర్‌ఆన్ పారాయణం సాక్ష్యంగా ఉంటుంది.

79. రాత్రివేళ తహజ్జుద్‌ను ఆచరించు. ఇది నీ కొరకు అదనం. నీ ప్రభువు నిన్ను అత్యున్నతమయిన – ప్రశంసాత్మక – స్థానంపై నిలబెట్టే అవకాశం ఎంతైనా ఉంది.

80. ఇలా ప్రార్థించు : 'ప్రభూ! నన్ను ఎక్కడికి చేర్చినా సత్యంతోనే చేర్చు. ఎక్కడి నుంచి తీసినా సత్యంతోనే తియ్యి. ఇంకా నాకు నీ వద్ద నుండి సహాయకారిగా ఉండే శక్తిని ప్రసాదించు. 81. ఇలా అను : 'సత్యం వచ్చేసింది. అసత్యం సమసిపోయింది. అసత్యం ఎలాగూ సమసిపోవలసిందే.'

82. ఇంకా – మేము ఖుర్‌ఆన్‌లో నుండి అవతరింపజేసేది విశ్వాసుల కొరకు ఆరోగ్య ప్రదాయిని, కారుణ్యవాహిని. అయితే దుర్మార్గులకు దీనిద్వారా నష్టం కలగటం తప్ప మరెందులోనూ వృద్ధి జరగదు.

83. మేము మానవుణ్ణి కటాక్షించినపుడు అతను మా నుండి ముఖం త్రిప్పుకుంటాడు. వెనుతిరిగిపోతాడు. మరి తనకేదయినా చెడు జరిగినపుడు మాత్రం నిస్పృహకు లోనవుతాడు. 84. ఇలా చెప్పు : 'ప్రతి ఒక్కడూ తన పద్ధతి ప్రకారం ఆచరిస్తూ పోతున్నాడు. మరయితే ఎవడు ఎక్కువగా సరైన బాటలో ఉన్నాడనేది నీ ప్రభువుకే బాగా తెలుసు.'

85. వారు నిన్ను 'ఆత్మ' గురించి ప్రశ్నిస్తున్నారు. వారికి చెప్పు :

'ఆత్మ నా ప్రభువు ఆజ్ఞతోనే ఉంది. మీకు ఇవ్వబడిన జ్ఞానం బహు స్వల్పం.'

86. (ప్రవక్తా!) మేము గనక తలచుకుంటే దివ్యవాణి (వహీ) ద్వారా నీకు ప్రసాదించినదంతా తిరిగి వశపరచుకోగలం. తరువాత నీవు దానికోసం మాకు వ్యతిరేకంగా ఏ సహాయకుణ్ణీ పొందలేవు. 87. అయితే ఇదంతా కేవలం నీ ప్రభువు కృపవల్లనే లభించింది. నిశ్చయంగా నీపైన గల ఆయన అనుగ్రహం చాలా గొప్పది. 88. ఇలా చెప్పు : 'మానవులు, జిన్నులు ఏకమై ఇటువంటి ఖుర్ఆన్‌ను తీసుకురావటానికి ప్రయత్నించినా, ఇటువంటి దానిని తేలేరు. వారు పరస్పరం సహకరించుకున్నా ఇది వారి వల్ల కాదు.'

89. మేము ప్రజల కొరకు ఈ ఖుర్ఆనులో అన్ని రకాల విషయాలను పలు విధాలుగా వివరించాము. అయినప్పటికీ చాలామంది తిరస్కార వైఖరిపైనే ఉండిపోయారు. 90. వారిలా అన్నారు : 'నీవు నేల నుండి మా కొరకు ఒక చెలమను ప్రవహింపజేయనంత వరకూ మేము నిన్ను నమ్మబోము. 91. పోనీ, నీ దగ్గర ఖర్జూరం, ద్రాక్షతోట అయినా ఉండాలి. మరి నీవు ఆ తోట మధ్యలో అనేక పిల్లకాలువలను ప్రవహింపజేయాలి. 92. లేదా నీవు చెబుతూ వస్తున్నట్లుగా, ఆకాశాన్ని తుంచి మామీద ముక్కలు పడవెయ్యి. లేదా దేవుణ్ణి, దైవదూతల్ని దించి మా ఎదుట నిలబెట్టు. 93. లేదా నీ వద్ద ఏదయినా స్వర్ణగృహం ఉండాలి లేదా నీవు ఆకాశానికి ఎక్కిపోవాలి. అయినాసరే అక్కడి నుండి మేము చదవగలిగే ఒక గ్రంథ రాజాన్ని నీవు దించనంత వరకూ మేము నీ ఆరోహణను అంగీకరించము.' (ప్రవక్తా!) వారికి చెప్పు : 'నా ప్రభువు పరిశుద్ధుడు. నేను ఒక మానవమాత్రుణ్ణి, ప్రవక్తను మాత్రమే.'

94. జనుల వద్దకు మార్గదర్శకత్వం వచ్చేసినపుడు, దానిని విశ్వసించకుండా వారికి అవరోధంగా నిలిచిన విషయం ఒక్కటే – అదేమిటంటే, 'ఏమిటి, దేవుడు ఒక మానవమాత్రుణ్ణి ప్రవక్తగా ప్రభవింప జేశాడా?' అని వారు అనటమే. 95. వారికి చెప్పు : 'ఒకవేళ దైవదూతలు భూమ్మీద హాయిగా సంచరిస్తూ ఉండగలిగేటట్లయితే, మేము ఆకాశం నుండి

దైవదూతలనే ప్రవక్తలుగా దింపేవారము.’ 96. ఇలా అను : ‘మీకూ – నాకూ మధ్య సాక్ష్యంగా దేవుడే చాలు. నిశ్చయంగా ఆయన తన దాసుల స్థితిని బాగా ఎరిగినవాడు, అంతా గమనిస్తూ ఉన్నవాడు.

97. దేవుడు మార్గదర్శకత్వం వహించినవాడే సన్మార్గం పొందుతాడు. ఆయన ఎవరిని అపమార్గాన వదలిపెడతాడో, నీవు వారి కొరకు దేవుడు తప్ప మరో సహాయకుడిని పొందలేవు. మేము అలాంటి వారిని ప్రళయదినాన బోర్లాపడవేసి గుడ్డివారుగా, మూగవారుగా, చెవిటివారుగా సమీకరిస్తాము. వారి నివాసం నరకం అవుతుంది. దాని మంట తగ్గినప్పుడల్లా మేము దానిని మరింత ఉధృతం చేస్తాము. 98. ఇదీ వారి ప్రతిఫలం. ఎందుకంటే వారు మా సూచనలను తిరస్కరించారు. ‘మేము ఎముకలుగా, మట్టిగా అయిపోయిన మీదట కూడా మేము సరికొత్త సృష్టిగా లేపబడతామా?’ అని అనేవారు.

99. ఏమిటి, భూమ్యాకాశాలను సృష్టించిన దేవుడు తమలాంటి వారిని కూడా పుట్టించే దక్షత తప్పకుండా కలిగి ఉంటాడన్న విషయం వారికి తట్టలేదా? ఆయన వారి కొరకు ఒక సమయం నిర్ధారించి పెట్టాడు. అందులో ఎంతమాత్రం సందేహం లేదు. అయితే దీనిని సయితం దుర్మార్గులు తిరస్కరించకుండా ఉండలేదు.

100. వారికి చెప్పు : ఒకవేళ మీరు నా ప్రభువు కారుణ్య ఖజానాలకు అధిపతులై ఉంటే, అవి ఖర్చయిపోతాయేమోనన్న భయంతో తప్పకుండా మీ చేతిని ఆపి ఉంచేవారు. నిజంగానే మానవుడు మహా సంకుచిత స్వభావి.

101. మేము మూసాకు స్పష్టమయిన తొమ్మిది సూచనలు ఇచ్చాము. దాని గురించి నువ్వే బనీ ఇస్రాయీల్‌ని అడుగు. అతను వారివద్దకు వచ్చినప్పుడు ఫిరౌన్ ఇలా అన్నాడు : ‘మూసా! నిన్నెవరో చేతబడి చేసి ఉంటారని నా అనుమానం.’ 102. మూసా సమాధానం ఇచ్చాడు : ‘ఈ సూచనలను భూమ్యాకాశాల ప్రభువు మాత్రమే దింపాడన్న విషయం నీకు బాగా తెలుసు – కళ్లు తెరిపించటానికి! ఇక నీ విషయానికి వస్తే ఓ ఫిరౌన్! నీకు వినాశం తప్పదని నా అనుమానం.’ 103. తరువాత ఫిరౌన్ వారిని

ఆ భూభాగంలోనే నిలువ నీడ లేకుండా చేయాలని అనుకున్నప్పుడు మేము వాడినీ, వాడి వెంట ఉన్న వారందరినీ ముంచివేశాము. 104. మరి మేము ఇస్రాయీల్ వంశీయులతో ఇలా అన్నాము : 'మీరు ఈ గడ్డపై నివసించండి. తరువాత పరలోకపు వాగ్దాన సమయం ఆసన్నమైనపుడు, మేము మీ అందరినీ ఒకే చోట సమీకరిస్తాము!'

105. మేము ఖుర్ఆన్‌ను సత్యబద్ధంగా అవతరింపజేశాము. సత్యబద్ధంగానే అది అవతరించింది. మేము నిన్ను శుభవార్త వినిపించే వానిగా, సావధానపరిచే వానిగా మాత్రమే చేసి పంపాము. 106. మేము ఖుర్ఆన్‌ను కొద్దికొద్దిగా అవతరింపజేశాము – తద్వారా నీవు జనుల ముందు నింపాదిగా వినిపించాలని! ఇంకా మేము దానిని అంచెలవారీగా అవతరింప జేశాము.

107. వారికి చెప్పు : 'మీరు దీనిని విశ్వసించినా, విశ్వసించక పోయినా, దీనికి పూర్వం జ్ఞానం వొసగబడినవారి ముందు ఇది పఠించబడినపుడు, వారు తమ ముఖాలను నేలకు ఆనించి సాష్టాంగపడతారు. 108. వారిలా అంటారు : 'మా ప్రభువు పరిశుద్ధుడు. నిశ్చయంగా మా ప్రభువు వాగ్దానం నెరవేరుతుంది.' 109. వారు ముఖాలను నేలకానించి, రోదిస్తూ పడిపోతారు. వారిలోని వినమ్రతను ఖుర్ఆన్ మరింత అధికం చేస్తుంది.

110. ఇలా చెప్పు : 'అల్లాహ్ అని పిలిచినా, రహ్మాన్ అని పిలిచినా – ఏ పేరుతో పిలిచినా అత్యుత్తమమైన పేర్లన్నీ ఆయనవే. నీవు నీ నమాజ్‌ని మరీ బిగ్గరగానూ చేయకు, మరీ మెల్లగా కూడా చేయకు. ఈ రెంటికీ మధ్యస్థ విధానాన్ని అవలంబించు. 111. ఇంకా ఇలా పలుకు : 'ప్రశంసలన్నీ ఆ దైవానికే శోభిస్తాయి. ఆయన ఎవరినీ సంతానంగా చేసుకోలేదు. రాజరికంలో ఆయనకు భాగస్వాములు ఎవరూ లేరు. ఒకరి సహాయంపై ఆధారపడటానికి ఆయన అశక్తుడేమీ కాడు. కనుక నీవు ఆయన గొప్పదనాన్ని ఘనంగా కీర్తించు.'

# 18. అల్ కహ్ఫ్ (గుహ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. స్తోత్రం దైవానికే శోభాయమానం. ఆయనే తన దాసునిపై గ్రంథాన్ని అవతరింపజేశాడు. అందులో ఎలాంటి వక్రతనూ ఉంచలేదు.
2. నిర్దిష్టమైనదిగా ఉంచాడు - దేవుని తరపు నుండి కఠిన శిక్ష ఉందని హెచ్చరించాలని, సదాచరణ చేసే విశ్వాసులకు ఉత్తమ ప్రతిఫలం ఉందన్న శుభవార్తను వినిపించాలనీని! 3. అందులో వారు ఎల్లకాలం ఉంటారు.
4. దేవుడు ఎవరినో కొడుకుగా చేసుకున్నాడని పలికేవారిని హెచ్చరించాలని.
5. దాని గురించి వారికి గానీ, వారి తాతముత్తాతలకు గానీ అసలేమీ తెలియదు. వారి నోట వెలువడే ఈ మాట ఘోరమైనది. వారు చెప్పేది అబద్ధం తప్ప మరొకటి కాదు.

6. (ప్రవక్తా!) ఒకవేళ వారు ఈ విషయాన్ని విశ్వసించకపోతే, బహుశా నీవు వారి వెనకాల ఆవేదనతో నీ ప్రాణాలనే ధారబోసేలా ఉన్నావు.
7. ప్రజలలో ఎవరు సదాచరణ చేస్తారో పరీక్షించటానికి మేము భువిలో ఉన్న దానినంతటినీ భూమికి అలంకరణగా చేశాము. 8. కడకు మేము భూమిపై ఉన్న వాటినన్నింటినీ ఒక చదునైన మైదానంగా చేసేస్తాము.

9. ఏమిటి, నీవు గుహవారిని, శిలాఫలకం వారిని మా శక్తి సూచనలలో మహా వింత సూచనగా భావిస్తున్నావా? 10. ఆ నవ యువకులు గుహలో తలదాచుకుని, 'మా ప్రభూ! మాకు నీ వద్ద నుండి కారుణ్యాన్ని ప్రసాదించు. మా వ్యవహారాన్ని చక్కబరచు' అని ప్రార్థించినపుడు,
11. మేము గుహలో ఏండ్ల తరబడి వారి కర్ణపుటాలపై జోకొట్టి నిద్రపుచ్చాము.
12. తరువాత మేము వారిని లేపాము - ఆ ఇరువర్గాలలో ఎవరు తాము గడిపిన గడువును సరిగ్గా లెక్కిస్తారో తెలుసుకుందామని.

13. వారి అసలు గాథను మేము నీకు వినిపిస్తాము - కొందరు యువకులు వారు; తమ ప్రభువును విశ్వసించినవారు. వారి మార్గదర్శకత్వాన్ని

మేము వృద్ధిపరిచాము. 14. మేము వారి మనసులను కుదుటపరిచాము. వారు లేచి నిలబడినపుడు ఇలా ప్రకటించారు : 'భూమ్యాకాశాల ప్రభువే మా ప్రభువు. మేము ఆయన్ని తప్ప మరో ఆరాధ్య దైవాన్ని మొరపెట్టుకునేది లేదు. ఒకవేళ మేమలా చేస్తే ఎంతో అసమంజసమైన మాటను పలికిన వారమవుతాము. 15. మన జాతి వారు ఆయనను కాదని వేరితరులను ఆరాధ్య దైవాలుగా చేసుకున్నారు. అలాంటప్పుడు వారు స్పష్టమయిన ప్రమాణాన్ని ఎందుకు తీసుకురారు? అల్లాహ్‌పై అబద్ధాన్ని కల్పించే వానికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు?

16. మీరు వారినుండీ, దైవాన్ని కాదని వారు పూజించే వాటి నుండీ ఎలాగూ తెగత్రెంపులు చేసుకున్నారు కాబట్టి, పదండి గుహలో ఆశ్రయం పొందుదాం. మీ ప్రభువు మీపై తన కారుణ్యాన్ని విస్తరిల్లజేస్తాడు. మీ కార్యాచరణ కొరకు కావలసిన సౌకర్యాలను సమకూరుస్తాడు.'

17. సూర్యుడు ఉదయించినపుడు వారి గుహకు కుడి ప్రక్కనుండి పైకెక్కుతున్నట్లు, అస్తమించేటప్పుడు వారి ఎడమ ప్రక్కనుండి తప్పించుకు పోతున్నట్లు నీవు చూస్తావు. వారు మాత్రం గుహలోని విశాల స్థలంలో (నిద్రిస్తూ) ఉన్నారు. ఇది దైవ సూచనలలోనిది. దేవుడు మార్గదర్శకత్వం వహించిన వారికి మాత్రమే సన్మార్గం లభిస్తుంది. ఆయన మార్గభ్రష్టతకు లోనుచేసిన వానికి దారి చూపే ఏ సహాయకుణ్ణీ నీవు పొందలేవు.

18. నీవు వారిని చూస్తే, వారు మేల్కొని ఉన్నారని భావిస్తావు. నిజానికి వారు నిద్రలోనే ఉన్నారు. మేము వారిని కుడి ప్రక్కకు, ఎడమ ప్రక్కకు తిరిగి పడుకునేలా చేశాము. వారి కుక్క గుహ ముఖద్వారం వద్ద ముందు కాళ్ళు చాపి కూర్చుని ఉండేది. ఒకవేళ నీవు వారిని తొంగి చూసినట్లయితే, వెనుతిరిగి పారిపోయేందుకు సిద్ధమయ్యేవాడివి. వారిపట్ల నీలో భయోత్పాతం ఏర్పడేది.

19. అదేవిధంగా మేము వారిని మేల్కొలిపాము – వారు పరస్పరం

కుశల ప్రశ్నలు వేసుకోవాలని. వారిలో అడిగేవాడొకడు, 'మీరు ఎంతసేపు ఇక్కడ ఉండి ఉంటారు?' అని అడిగాడు. 'మనం మహా అంటే ఒక రోజో లేదా ఒక రోజుకన్నా తక్కువ సమయమో విడిదిచేసి ఉంటాం' అని వారు చెప్పారు. తరువాత వాళ్లే ఇలా చెప్పుకున్నారు : 'మీరిక్కడ ఎంతసేపు ఉన్నారన్న విషయం దైవానికే బాగా తెలుసు. అది సరేగాని, మనలో ఎవరినయినా ఈ వెండి నాణెం ఇచ్చి పట్టణానికి పంపించండి. అతను వెళ్ళి, పరిశుభ్రమయిన (పరిశుద్ధమయిన) భోజనం ఎక్కడ దొరుకుతుందో చూసి, అందులో నుండి మీ కోసం భోజనం కొనుక్కువస్తాడు. అతను చాకచక్యంగా వ్యవహరించాలి. మీరిక్కడ ఉన్న సంగతి ఎవరికీ తెలియనివ్వకూడదు. 20. ఒకవేళ వాళ్ళకు మీ ఆచూకీ తెలిసిందంటే, మిమ్మల్ని రాళ్ళతో కొట్టి చంపేస్తారు లేదా మిమ్మల్ని తమ జీవన ప్రవాహంలో కలుపుకుంటారు. అదే గనక జరిగిందంటే మీరెన్నటికీ కృతార్థులు కాలేరు.

21. ఈ విధంగా దైవ వాగ్దానం సత్యమని, ప్రళయ ఘడియ విషయంలో సందేహానికి తావేలేదని జనులు తెలుసుకోవాలని, మేము వారి గురించి ఆ ప్రజలకు తెలియపరిచాము. అప్పుడు జనులు వారి గురించి పరస్పరం ఘర్షణపడ్డారు. 'వారి గుహపై ఓ కట్టడం నిర్మించండి' అని కొందరు సూచించారు. వారి గురించి వారి ప్రభువుకు బాగా తెలుసు. వారి వ్యవహారంలో పైచేయిగా ఉన్నవారు 'మేము వారి గుహపై ఒక ఆరాధనాలయం నిర్మిస్తాము' అన్నారు.

22. 'వారు ముగ్గురు, నాల్గవది వారి కుక్క' అని కొందరంటారు. 'వారు అయిదుగురు, ఆరవది వారి కుక్క' అని మరి కొందరంటారు. వారివన్నీ నిరాధార ప్రేలాపనలే. 'వారు ఏడుగురు. ఎనిమిదవది వారి కుక్క' అని కొందరంటారు. వారికి చెప్పు : 'వారెంతమంది అన్నది నా ప్రభువుకు మాత్రమే బాగా తెలుసు. కొద్దిమందికి మాత్రమే వారి గురించి తెలుసు.' కనుక నీవు స్థూలంగా తప్ప ఆ విషయంలో (లోతుగా) వాదించకు. గుహ వారి గురించి అసలు వీళ్ళను విచారించకు.

23. ఏ పని విషయంలోనయినా 'ఇది రేపు చేస్తాను' అని అనకు. 24. 'దైవచిత్తమయితే చేస్తాను' (అని అను). నీవు మరచిపోయినప్పుడల్లా నీ ప్రభువును స్మరించుకో. 'నా ప్రభువు నాకు మేలుకు సంబంధించి ఇంతకన్నా దగ్గరి మార్గం చూపుతాడని ఆశిస్తున్నాను' అని చెప్పు.

25. వారు ఆ గుహలో మూడు వందల సంవత్సరాలు గడిపారు. (కొంతమంది లెక్క ప్రకారం) మరో తొమ్మిదేళ్ళు ఎక్కువయ్యాయి. 26. వారితో అను : వారు గడిపిన కాలం ఖచ్చితంగా ఎంత అన్నది దైవానికే తెలుసు. భూమ్యాకాశాలలో ఉన్న అగోచర విషయాలన్నీ ఆయన జ్ఞానపరిధిలో ఉన్నాయి. ఎంత చక్కని వాడు ఆ చూసేవాడు! ఆ వినేవాడు! దేవుడు తప్ప వారి సహాయకుడెవడూ లేడు. ఆయన తన విచక్షణాధికారంలో ఎవరినీ భాగస్వామిగా చేర్చుకోడు.

27. (ప్రవక్తా!) నీ ప్రభువు గ్రంథంలో నుండి నీపై 'వహీ'గా పంపబడే దానిని నీవు వారికి వినిపించు. దైవ వచనాలను మార్చటం ఎవరి తరం కాదు. ఆయన తప్ప మరే ఆశ్రయాన్నీ నీవు పొందలేవు. 28. ఉదయం, సాయంత్రం తమ ప్రభువును ప్రార్థిస్తూ, ఆయన ప్రసన్నతను అభిలషిస్తున్న వారి సహచర్యంతోనే నీ మనసును కుదుటపరచుకో. ప్రాపంచిక జీవితపు తళుకుబెళుకుల కోసం, నీ దృష్టిని వారి నుండి మరల్చుకోకు. ఎవడి హృదయాన్ని మేము మా స్మరణపట్ల పరధ్యానానికి లోనుచేశామో వాడి అడుగులకు మడుగులొత్తకు. వాడు తన మనోవాంఛల వెనుక పరుగెడు తున్నాడు. వాడి వ్యవహారం హద్దు మీరి పోయింది.

29. ఇలా చెప్పు : 'ఇది మీ ప్రభువు నుండి (వచ్చిన) సత్యం. కనుక ఇష్టమున్న వారు దీనిని విశ్వసించవచ్చు. ఇష్టంలేని వారు నిరాకరించవచ్చు. మేము దుర్మార్గుల కోసం అగ్నిని సిద్ధం చేసి ఉంచాము. దాని కీలలు వారిని ముట్టడిస్తాయి. వారు నీళ్ళ కోసం అభ్యర్థించినపుడు, నూనె మడ్డిలా ఉండే నీటితో వారి కోరిక తీర్చబడుతుంది. అది వారి ముఖాలను మాడ్చివేస్తుంది. ఎంత చెడ్డ నీరు అది! ఎంత దుర్భరమయిన విశ్రాంతి స్థలమది!!

30. నిశ్చయంగా ఎవరు విశ్వసించి, సదాచరణ చేశారో అలాంటి సదాచారుల ప్రతిఫలాన్ని మేము వృధా కానివ్వము, 31. అలాంటి వారికి కలకాలం ఉండే స్వర్గవనాలుంటాయి. వాటి క్రింద కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అక్కడ వారికి స్వర్ణ కంకణాలు తొడిగించబడతాయి. అక్కడ వారు లావణ్యమైన పట్టువస్త్రాలు, దళసరిగా ఉండే సుతిమెత్తని ఆకుపచ్చని పట్టువస్త్రాలు ధరించి ఉంటారు. ఎత్తయిన ఆసనాల మీద దిండ్లకు ఆనుకుని దర్జాగా ఆసీనులై ఉంటారు. ఎంత చక్కని విశ్రాంతి స్థలమది!

32. (ప్రవక్తా!) వారి ముందు ఒక ఉపమానం సమర్పించు. ఇద్దరు వ్యక్తులుండేవారు. వారిలో ఒకరికి మేము రెండు ద్రాక్ష తోటలు ప్రసాదించాము. వాటి చుట్టూ ఖర్జూర చెట్ల కంచెను సృష్టించాము. ఆ రెండింటి మధ్యన సేద్యపు భూమిని కూడా ఉంచాము. 33. రెండు తోటలూ బాగా పండాయి. అందులో ఏ లోటూ చేయలేదు. ఆ రెండు తోటల మధ్య మేము ఒక కాలువను కూడా ప్రవహింపజేశాము. 34. ఫలసాయం బాగా లభించినపుడు అతను తన సహవాసితో మాట్లాడుతూ, 'సిరిసంపదలలో నేను నిన్ను మించినవాడను. మంది మార్బలం (సంతానం) దృష్ట్యా కూడా నేనే బలవంతుడను' అన్నాడు. 35. అతను తన తోటలో ప్రవేశించాడు. తన ఆత్మపై అన్యాయానికి ఒడిగడుతూ ఇలా అన్నాడు : 'ఇది ఏ నాటికయినా నాశనమవుతుందని నేననుకోను. 36. ప్రళయ ఘడియ నెలకొంటుందన్న ఆశంక కూడా నాకు లేదు. ఒకవేళ నేను నా ప్రభువు వైపునకు మరలించబడినప్పటికీ, ఇంతకన్నా మంచి స్థానమే నాకు లభిస్తుంది.'

37. అతని స్నేహితుడు అతనితో సంభాషిస్తూ ఇలా అన్నాడు : '(మిత్రమా!) నిన్ను మట్టితో చేసి, తరువాత నీటి బిందువుతో సృష్టించి, దరిమిలా నిన్ను ఓ సంపూర్ణ మానవునిగా మలచిన వానినే త్రోసిపుచ్చుతున్నావా? 38. కాని, నా ప్రభువైతే ఆ అల్లాహ్యే. నేను మటుకు నా ప్రభువుకు సహవర్తులుగా ఎవరినీ కల్పించబోను. 39. నీవు నీ తోటలోనికి ప్రవేశించినపుడు, "దేవుడు తలచినదే అవుతుంది. ఆయన (చిత్తం) లేకుండా

ఎవరిలోనూ ఏ శక్తీ ఉండదు” అని ఎందుకు అనలేదు? సంపదలోనూ, సంతానంలోనూ నేను నీకన్నా అల్పుడినని నీవు భావిస్తున్నట్లయితే, 40. నా ప్రభువు నాకు, నీ తోటకన్నా మంచి తోటను ప్రసాదిస్తాడని ఆశిస్తున్నాను. నీ తోటపై ఆకాశం నుండి ఏదయినా ఆపదను పంపించవచ్చు. తత్కారణంగా అది చదునైన మైదానంగా మారిపోనూవచ్చు. 41. లేదా అందులోని నీరు ఇంకిపోవచ్చు. దానిని నీవు ఏ విధంగానూ తిరిగి పొందలేక పోవచ్చు.’

42. అతని పంటపై వైపరీత్యం రానే వచ్చింది. దానిపై అతను పెట్టిన పెట్టుబడి పట్ల చేతులు నులుముకుంటూ ఉండిపోయాడు. ఆ తోట దాని తడికెల మీద కుప్పకూలి పోయింది. అప్పుడు అతనిలా అన్నాడు : ‘అయ్యో! నేను నా ప్రభువుకు భాగస్వాములను కల్పించకుండా ఉంటే ఎంత బాగుండేది!’ 43. దేవుడు తప్ప అతనిని ఆదుకునే జట్టు ఏదీ అతని వద్ద లేకపోయింది. అతను కూడా స్వయంగా దానిని ప్రతిఘటించలేకపోయాడు. 44. ఇక్కడ అధికారమంతా సత్యవంతుడైన అల్లాహ్‌దే. ఆయన అత్యుత్తమ ప్రతిఫలం ఇచ్చేవాడు, అత్యుత్తమ పరిణామం కలవాడు.

45. వారికి ప్రాపంచిక జీవితపు ఉపమానాన్ని వినిపించు. అది మేము నింగి నుండి కురిపించిన వర్షపు నీరు లాంటిది. దాంతో భూమిపై దట్టంగా పచ్చిక మొలకెత్తింది. తరువాత అది పొట్టుపొట్టుగా మారిపోయింది. దానిని గాలులు ఎగరేసుకుపోతాయి. అల్లాహ్‌కు ప్రతిదానిపై తిరుగులేని అధికారముంది. 46. ఈ సిరిసంపదలు, సంతానం ప్రాపంచిక జీవితానికి అలంకారప్రాయమే. మిగిలి ఉండే సత్కార్యాలే నీ ప్రభువు సన్నిధిలో పుణ్యఫలం దృష్ట్యా మేలైనవి.

47. ఏ రోజున మేము పర్వతాలను నడిపిస్తామో, అప్పుడు నీవు భూమిని చదునైన మైదానంగా చూస్తావు. మేము వారందరినీ సమీకరిస్తాము. తరువాత వారిలో ఏ ఒక్కరినీ మేము వదలిపెట్టము. 48. జనులంతా నీ ప్రభువు సమక్షంలో బారులు తీరి నిలబడి ఉంటారు. ‘మేము మొదటిసారి

మిమ్మల్ని పుట్టించినట్లుగానే, మీరు మా వద్దకు వచ్చేశారు. మీ కొరకు వాగ్దాన సమయమేదీ నిర్ధారించలేదని మీరు తలపోశారు' (అని సెలవీయ బడుతుంది).

49. దస్త్రం సమర్పించబడుతుంది. అపరాధులు అందులో ఉన్న దానిని చూసుకుని భీతిల్లటం నీవు గమనిస్తావు. వారిలా అంటారు : 'అయ్యో! మా దౌర్భాగ్యం. ఎటువంటి పుస్తకం ఇది! ఇది ఏ చిన్న విషయాన్ని గానీ, పెద్ద విషయాన్ని గానీ నమోదు చేయకుండా వదల్లేదే!' తాము చేసుకున్నదంతా తమ ఎదుటే ఉండటం వారు గమనిస్తారు. నీ ప్రభువు ఏ ఒక్కడికీ అన్యాయం చేసేవాడు కాడు.

50. 'ఆదమ్‌కు ప్రణమిల్లండి' అని మేము దైవదూతలను పురమాయించినపుడు, వారంతా ప్రణమిల్లారు. కాని ఇబ్లీసు మాత్రం ప్రణమిల్లలేదు. వాడు జిన్నుల కోవకు చెందినవాడు. మొత్తానికి వాడు తన ప్రభువు ఆదేశాన్ని ఎదిరించాడు. మరైతే ఇప్పుడు మీరు వాణ్ణీ, వాడి సంతానాన్ని మీ స్నేహితులుగా చేసుకుంటారా? వాస్తవానికి వారంతా మీ బద్ధ శత్రువులే. ఈ దుర్మార్గులకు బహు చెడ్డ ప్రతిఫలం ఉంటుంది.

51. నేను భూమ్యాకాశాలను సృష్టిస్తున్న సమయంలో వారికి కబురంపలేదు. స్వయంగా వారిని సృష్టిస్తున్న వేళ కూడా పిలువలేదు. పెడదారి పట్టించే వారిని సహాయకులుగా చేసుకోవటం నా విధానం కాదు.

52. ఆ రోజున ఆయన వారినుద్దేశించి, 'మీరు నా సహవర్తులుగా భావించిన వారిని పిలవండి' అని ఆజ్ఞాపించినపుడు, వీరు వారిని పిలుస్తారు. కాని వారు వీరికి ఏ సమాధానమూ ఇవ్వరు. మేము వారిమధ్య (శత్రుత్వపు) అడ్డంకిని ఏర్పరుస్తాము. 53. అపరాధులు ఆ రోజు అగ్నిని చూసుకుని, తాము అందులో పడబోతున్నామని అర్థం చేసుకుంటారు. దాని నుండి తప్పించుకునే మార్గమేదీ వారికి కానరాదు.

54. మేము ఈ ఖుర్‌ఆనులో జనుల మార్గదర్శకత్వం కొరకు అన్ని రకాల ఉపమానాలను వివరించాము. కాని మానవుడు అందరికన్నా ఎక్కువ తగవులమారి.

55. ప్రజల వద్దకు మార్గదర్శకత్వం వచ్చేసిన తరువాత కూడా వారు విశ్వసించకుండా, తమ ప్రభువును క్షమాపణకై వేడుకోకుండా వారికి అవరోధంగా మారిన విషయమేమిటి? తమ పూర్వీకుల పట్ల జరిగినదే తమకూ జరగాలని లేదా శిక్ష తమ ఎదుటే వచ్చి నిలవాలని వారు నిరీక్షించటం తప్ప!

56. ప్రవక్తలను మేము కేవలం శుభవార్తలు వినిపించేవారుగా, భయపెట్టేవారుగా చేసి పంపుతాము. సత్య తిరస్కారులు మాత్రం మిథ్యా విషయాలను ఆసరాగా చేసుకుని వితండ వాదన చేస్తారు – తద్వారా సత్యాన్ని లొంగదీసుకోవాలన్నది వారి అభిమతం అయి ఉంటుంది. వారు నా సూచనలను, వారికి చేయబడిన హెచ్చరికల్ని వేళాకోళంగా తీసుకున్నారు. 57. ఒక వ్యక్తికి, అతని ప్రభువు సూచనల ఆధారంగా హితబోధ చేసినప్పటికీ, విముఖత చూపి, తన చేతులారా చేసుకున్న కర్మను మరచి పోయిన వానికన్నా దుర్మార్గుడు ఎవడుంటాడు? మేము వారి హృదయాలపైన ముసుగులు వేసేశాము. ఇక వారు దానిని (ఖుర్ఆన్ను) అర్థం చేసుకోలేరు. వారి చెవులు మొద్దుబారిపోయాయి. నీవు వారిని సన్మార్గం వైపు పిలిచి నప్పటికీ, వారు ఇక మార్గదర్శకత్వం పొందరు.

58. నీ ప్రభువు క్షమాశీలుడు, దయగలవాడు. ఆయన గనక, వారి సముపార్జనపై నిలదీయటం మొదలెడితే, తక్షణం వారిపై శిక్షను పంపి ఉండేవాడు. అయితే వారి కోసం ఓ సమయం నిర్ధారితమై ఉంది. దాన్నుండి తప్పించుకుపోయే చోటేదీ వారు కనుగొనలేరు. 59. ఇవీ ఆ జనావాసాలు! వారు దుర్మార్గానికి ఒడిగట్టినపుడు మేము వారిని అంతమొందించాము. మేము వారిని తుదముట్టించే సమయం కూడా నిర్ధారించి పెట్టాము.

60. మూసా తన శిష్యునితో ఈ విధంగా అన్నప్పటి సంగతి (కూడా చిరస్మరణీయమే) : 'నేను రెండు సాగరాల సంగమానికి చేరుకోనంత వరకూ నడుస్తూనే ఉంటాను లేదా ఏండ్ల తరబడి ప్రయాణించవలసి వచ్చినా ప్రయాణం ఆపను. 61. అయితే వారు సాగర సంగమ స్థలానికి చేరుకునేసరికి

తమ చేప సంగతి మరిచేపోయారు. ఆ చేప మాత్రం మెల్లగా సముద్రంలోకి దారి చేసుకుంది. 62. వారిరువురూ ముందుకుపోయిన తరువాత, మూసా తన శిష్యుని ఉద్దేశించి, 'మన భోజనం తీసుకు రా. ఈ ప్రయాణంలో మనం బాగా అలసిపోయాం' అన్నాడు.

63. శిష్యుడు ఇలా అన్నాడు : "చూశారా! ఎంత పనయిందో! మనం ఆ బండరాయి దగ్గర ఆగినపుడు, నేను చేప సంగతి మరచిపోయాను. ఈ సంగతి చెప్పకుండా షైతాన్ నన్ను మరపునకు గురిచేశాడు. చేప కడు విచిత్రంగా సముద్రంలోకి జారుకుంది.' 64. మూసా ఇలా అన్నాడు : 'అరెరె! మనం వెతుకుతున్న ప్రదేశం అదే కదా!' ఇక వారిద్దరూ తమ అడుగుజాడల ఆధారంగా వెనక్కి తిరిగి వచ్చారు. 65. అక్కడ వారు మా దాసులలో ఒక దాసుణ్ణి కనుగొన్నారు. మేమతనికి మా కారుణ్యం నుండి ప్రత్యేకంగా అనుగ్రహించి ఉన్నాము. మా వద్ద నుండి ఒక ప్రత్యేక విద్యను అతనికి నేర్పాము.

66. మూసా అతనితో, 'మీకు నేర్పబడిన విద్యను నేను మీ నుండి నేర్చుకునేందుకు కొంతకాలం పాటు మీ సహచర్యంలో ఉండనిస్తారా?' అన్నాడు. 67. 'మీరు నా వెంట ఉండి ఓర్పు వహించలేరు. 68. అయినా మీ జ్ఞాన పరిధిలో లేని దానిపై మీరెలా ఓర్పు వహించగలరు?' అని ఆయన సమాధానమిచ్చాడు. 69. దానికి మూసా, 'దైవచిత్తమయితే తమరు నన్ను సహనశీలునిగా పొందుతారు. ఏ విషయంలోనూ నేను మీ మాటను ఎదిరించను' అని విన్నవించుకున్నాడు. 70. 'మీరు నా వెంట రాదలిస్తే ఒక షరతు! నేను స్వయంగా వివరించనంత వరకూ ఏ విషయం గురించి కూడా నన్ను అడగకూడదు' అని ఆ సజ్జనుడు చెప్పాడు.

71. వారిరువురూ ముందుకు సాగిపోయారు. కడకు వారు ఒక పడవలో ఎక్కినపుడు, ఆ వ్యక్తి పడవలో రంధ్రం వేశాడు. మూసా ఇలా అన్నాడు : 'ఏమిటి, మీరు ఈ పడవలో ప్రయాణించే వారందరినీ ముంచివేయటానికేనా ఇందులో రంధ్రం వేశారు? ఏమయినా మీరు చేసిన

ఈ పని దారుణమైనది.' 72. 'మీరు నా వెంట ఉండి ఓపిక పట్టలేరని ముందే అన్నానా!' అని ఆ వ్యక్తి చెప్పాడు. 73. దానికి మూసా, 'నా మరుపుపై నన్ను నిలదీయకండి. నా వ్యవహారంలో కఠినంగా వ్యవహరించకండి' అని ప్రాధేయపడ్డాడు. 74. తరువాత వారుభయులూ కలిసి ముందుకు నడిచారు. చివరకు వారికి ఒక కుర్రవాడు ఎదురుపడ్డాడు. ఆ వ్యక్తి ఆ కుర్రవాణ్ణి చంపేశాడు. మూసా ఉండబట్టలేక, 'మీరు ఒక అమాయక ప్రాణాన్ని బలిగొన్నారేమిటి? ఆ అబ్బాయి ఎవరినీ చంపలేదు కదా! ఏమయినా మీ ఈ నిర్వాకం అసంబద్ధమైనది' అన్నాడు. ◆ (16) 75. ఆ దాసుడు ఇలా అన్నాడు : 'నా వెంట ఉండి సహనం వహించటం మీవల్ల కాదని నేను మీతో ముందే చెప్పలేదా!?' 76. మూసా ఇలా బ్రతిమాలాడు: 'ఇకమీదట గనక నేను మిమ్మల్ని ఏ విషయం గురించయినా ప్రశ్నిస్తే నన్ను మీ వెంట ఉంచకండి. నా సంజాయిషీలకు సంబంధించి ఇక మీరు ఆఖరి హద్దుకు చేరుకున్నట్లే.' 77. దరిమిలా వారిద్దరూ నడక సాగించారు. కడకు వారు ఒక ఊరికి చేరుకున్నప్పుడు, తమకు భోజనం సమకూర్చమని అక్కడి స్థానికులను కోరారు. కాని వారికి ఆతిథ్యం ఇవ్వటానికి అక్కడి వారు నిరాకరించారు. తరువాత అక్కడ వారికి కూలిపోవటానికి సిద్ధంగా ఉన్న ఒక గోడ కనిపించింది. ఆ వ్యక్తి ఆ గోడకు మరమ్మత్తు చేసి నిలబెట్టాడు. 'తమరు తలచుకుంటే ఈ పనికిగాను ప్రతిఫలం తీసుకోవచ్చుకదా!' అని మూసా అతనికి సూచించాడు. 78. ఆ వ్యక్తి ఇలా అన్నాడు : 'ఇక మీకూ – నాకూ మధ్య వేర్పాటు జరిగిపోయింది. మీరు ఓపిక పట్టలేకపోయిన ఆ (మూడు) విషయాల్లోని వాస్తవికతను నేను మీకు వివరిస్తాను.

79. పడవ విషయానికివస్తే, అది సముద్రంలో పని చేసుకునే కొంతమంది నిరుపేదలది. నేను ఆ పడవలో లోపం ఏర్పరచదలిచాను. ఎందుకంటే ఎదర ఒక రాజు ఉన్నాడు. అతను కనిపించిన ప్రతి పడవనూ బలవంతంగా లాక్కుంటాడు.

80. ఇక అబ్బాయి వ్యవహారమంటారా, అతని తల్లిదండ్రులు

విశ్వసనీయులు. ఆ అబ్బాయి పెద్దవాడై, తన తలబిరుసుతనంతో, తిరస్కార ధోరణితో వారిని వేధిస్తాడని మాకు భయమేసింది. 81. అందుకే వారి ప్రభువు వారికి, అతని స్థానంలో అతనికన్నా పరిశుద్ధుడయిన, మృదు స్వభావుడైన సంతానాన్ని ప్రసాదించాలని మేము అభిలషించాము.

82. ఇకపోతే ఆ గోడ సంగతి; అది ఆ బస్తీలోని ఇద్దరు అనాథ బాలురది. ఆ గోడ క్రింద, ఆ పిల్లల ఖజానా నిక్షిప్తమై ఉంది. ఆ అనాథల తండ్రేమో సజ్జనుడు. ఆ పసివాళ్ళిద్దరూ యుక్త వయస్సుకు చేరిన మీదట, తమ నిధిని తీసుకోవాలని మీ ప్రభువు కోరుకున్నాడు. ఇదంతా మీ ప్రభువు దయానుగ్రహంతోనే జరిగింది. నేను దీనిని నా స్వంత అభిప్రాయంతో చేయలేదు. ఇదీ మీరు సంయమనం పాటించలేకపోయిన విషయాలలోని వాస్తవికత!'

83. వారు నిన్ను జుల్‌ఖర్‌నైన్ గురించి ప్రశ్నిస్తున్నారు. వారికి చెప్పు: 'నేను అతని గురించి కొంత సమాచారం మీకు తెలియజేస్తాను.' 84. మేమతనికి భువిలో రాజ్యాధికారం ప్రసాదించాము. అన్ని రకాల సాధనాసంపత్తిని అతనికి సమకూర్చాము.

85. అతను ఒక దారిగుండా సాగిపోయాడు. 86. కడకు అతను సూర్యుడు అస్తమించే స్థలానికి చేరుకున్నాడు. సూర్యుడు బురద నీటిలో మునిగే దృశ్యాన్ని అతను తిలకించాడు. అక్కడే అతనికి ఓ జాతివారు తారసపడ్డారు. మేమిలా సెలవిచ్చాము : 'జుల్‌ఖర్‌నైన్! వీరిని శిక్షించదలచినా లేక వీరి యెడల సద్వ్యవహారం చేయదలచినా అది నీ ఇష్టం.' 87. దానికి అతను ఇలా అన్నాడు : 'వీరిలో దుర్మార్గానికి ఒడిగట్టే వానిని మేము తప్పకుండా శిక్షిస్తాము. తరువాత అతను తన ప్రభువు వద్దకు మరల్చ బడినపుడు, ఆయన అతనిని మరింత కఠినంగా శిక్షిస్తాడు. 88. మరెవరయితే విశ్వసించి, సదాచరణ చేస్తాడో అతని కొరకు మంచి ప్రతిఫలం ఉంటుంది. మేము కూడా అతని పట్ల సడలింపుల వైఖరినే అవలంబిస్తాము.'

89. తరువాత అతను మరో దిశలో సాగిపోయాడు. 90. చివరకు అతను సూర్యోదయం జరిగే ప్రదేశానికి చేరుకున్నప్పుడు, సూర్యుడు ఒక జాతిపై ఉదయించటం చూశాడు. వారికి సూర్యరశ్మి నుండి కాపాడుకునే ఎటువంటి ఏర్పాటునూ మేము చేయలేదు. 91. ఇదీ సంగతి! అయితే జుల్‌ఖర్‌నైన్ స్థితిగతులను మేము బాగా ఎరుగుదుము.

92. తరువాత అతను మరో జైత్రయాత్రకు సిద్ధమయ్యాడు. 93. కడకు అతను రెండు పర్వతాల మధ్య స్థలానికి చేరుకున్నప్పుడు, అక్కడ అతనికి ఓ (గిరిజన) జాతి కనిపించింది. ఏ మాటనూ అది అర్థం చేసుకోలేకపోతోంది. 94. వారిలా విన్నవించుకున్నారు : 'ఓ జుల్ఖర్‌నైన్! యాజూజ్ మాజూజ్‌లు మా రాజ్యంలో కల్లోలం సృష్టిస్తున్నారు. కాబట్టి మేము నీకు ఎంతోకొంత తహ్‌సీలు కట్టే మాటయితే నీవు వారికీ – మాకూ మధ్య ఒక అడ్డుగోడ నిర్మించగలవా?'

95. సమాధానంగా జుల్ఖర్‌నైన్ ఇలా అన్నాడు : 'నా ప్రభువు నాకు ప్రసాదించినదే చాలా ఎక్కువ. మీరు శ్రమదానం ద్వారా నాకు సహాయపడండి చాలు. నేను మీకూ – వారికీ మధ్య ఒక గోడ నిర్మిస్తాను. 96. మీరు ఇనుప పలకలు తెచ్చి నాకివ్వండి.' చివరకు అతను రెండు కొండల మధ్య గల సందును పూరించినపుడు, జనులనుద్దేశించి, నిప్పు మండించండని ఆజ్ఞాపించాడు. అగ్ని బాగా మండిన తరువాత, 'ఇక ఇప్పుడు కరిగిన రాగిని తీసుకురండి. దీనిమీద పోస్తాను' అన్నాడు. 97. ఇక యాజూజ్ మాజూజ్‌లు ఆ గోడ ఎక్కనూలేరు. దానికి రంధ్రం వేయనూలేరు. 98. జుల్‌ఖర్‌నైన్ ఇలా అన్నాడు : 'ఇది నా ప్రభువు కారుణ్యం. అయితే నా ప్రభువు వాగ్దాన సమయం ఆసన్నమయినపుడు, ఆయన దీనిని నేలమట్టం చేసేస్తాడు. నా ప్రభువు వాగ్దానం సత్యం.'

99. ఆనాడు మేము జనులను విడిచిపెడతాము. వారు అలల మాదిరిగా ఒకరింకొకరిలో చొచ్చుకుపోతారు. శంఖం ఊదబడుతుంది. అంతే, మేము వారందరినీ ఒకచోట ప్రోగుచేస్తాము. 100. ఆ రోజు మేము నరకాన్ని సత్య తిరస్కారుల ముందుకు తీసుకువస్తాము. 101. మా ఉపదేశం

విషయంలో వారి కళ్లపై పొరలు క్రమ్ముకుని ఉండేవి. అప్పుడు వారు ఏమీ వినటానికి సిద్ధపడేవారు కారు.

102. ఏమిటి, తిరస్కారానికి ఒడిగట్టినవారు, నన్ను కాదని, నా దాసులను తమ సంరక్షకులుగా చేసుకోవాలనుకుంటున్నారా? మేము తిరస్కారుల ఆతిథ్యానికి నరకాన్ని సిద్ధం చేసి ఉంచాము.

103. (ప్రవక్తా!) వారితో అను : 'తమ ఆచరణల దృష్ట్యా అందరికన్నా ఎక్కువ నష్టంలో ఉన్నవారెవరో నేను మీకు తెలుపనా? 104. ప్రాపంచిక జీవితంలో తమ కృషి అంతా వృధా అయినప్పటికీ, తాము చాలా మంచి పనులు చేస్తున్నామని తలపోస్తున్నవారు. 105. ఇలాంటివారే తమ ప్రభువు సూచనలను, ఆయన్ని కలుసుకోవటాన్ని త్రోసిపుచ్చినవారు. కనుక వారు చేసుకున్నదంతా వ్యర్థమైపోయింది. ప్రళయదినాన మేము వాటికి (వారి కర్మలకు) ఎలాంటి బరువును ఒసగము. 106. నరకమే వారి ప్రతిఫలం. ఎందుకంటే వారు సత్యాన్ని తిరస్కరించారు. నా సూచనలను, నా సందేశహరులను వేళాకోళం చేశారు.

107. నిశ్చయంగా ఎవరయితే విశ్వసించారో, సదాచరణ చేశారో, వారి ఆతిథ్యానికి 'ఫిర్‌దౌస్' వనాలు ఉంటాయి. 108. వారందులో కలకాలం ఉంటారు. వారక్కడి నుండి వెళ్ళటానికి సుతరామూ ఇష్టపడరు.

109. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'నా ప్రభువు నిదర్శనాలు వ్రాయటానికి సముద్రం సిరాగా మారినా, సముద్రం ఇంకిపోతుందేగాని నా ప్రభువు మాటలు మాత్రం తరగవు. ఒకవేళ అటువంటిదే, అంతే సిరాను మేము తెచ్చి సముద్రంలో కలిపినా అదీ సరిపోదు.'

110. వారికి చెప్పు : 'నేనూ మీలాంటి ఒక మానవమాత్రుణ్ణే. కాకపోతే నాకు దివ్యవాణి (వహీ) పంపబడుతుంది. మీ ఆరాధ్యదైవం ఒకే ఆరాధ్యదైవం. కనుక తన ప్రభువుతో సమావేశమవ్వాలని ఆశించేవాడు సదాచరణ చేయాలి. తన ప్రభువు దాస్యంలో వేరెవరినీ భాగస్వామిగా చేర్చరాదు.'

# 19. మర్యమ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కాఫ్ – హా – యా – ఐన్ – సాద్. 2. ఇది తన దాసుడగు జకరియ్యాపై నీ ప్రభువు దయచూపినప్పటి ప్రస్తావన. 3. అప్పుడతను తన ప్రభువును మెల్లని స్వరంతో మొరపెట్టుకున్నాడు :

4. జకరియ్యా ఇలా అభ్యర్థించుకున్నాడు : 'నా ప్రభూ! నా ఎముకలు సయితం ఉడిగిపోయాయి. వార్ధక్యం వల్ల నా తల పండిపోతోంది. ప్రభూ! నిన్ను ప్రార్థించి నేనెన్నడూ విఫలుణ్ణి కాలేదు. 5. నేను నా తదనంతరం నా బంధువుల (ఆగడాల) గురించి భయపడుతున్నాను. నా భార్యయేమో వంధ్యురాలు. కనుక (ఓ స్వామీ!) నాకు నీ వద్ద నుండి ఒక వారసుణ్ణి అనుగ్రహించు. 6. అతను నా స్థానాన్ని భర్తీ చేయగలగాలి. యాఖూబ్ సంతతికీ వారసుడు కాగలగాలి. నా ప్రభూ! అతన్ని నీ ప్రియతమునిగా చేసుకో.'

7. (ఈ విధంగా సమాధానం ఇవ్వబడింది) 'ఓ జకరియ్యా! మేము నీకు ఒక అబ్బాయి (పుడతాడని) శుభవార్తను ఇస్తున్నాము. అతని పేరు యహ్యా. లోగడ మేము ఈ పేరుగల వారెవరినీ చేయలేదు.' 8. అతనిలా విన్నవించుకున్నాడు : 'నాకు అబ్బాయి పుట్టడమేమిటి? నా భార్యయేమో గొడ్రాలు, నేనేమో వృద్ధాప్యపు చివరి అంచులకు చేరుకున్నానాయె.'

9. 'అలాగే జరుగుతుంది' అని సమాధానం లభించింది. నీ ప్రభువు ఇలా సెలవిస్తున్నాడు : 'ఇది నాకెంతో సులభమైన పని. నేనింతకు ముందు నిన్ను సృజించి ఉన్నాను. నిజానికి అప్పుడు నీకంటూ ఒక ఉనికే లేదు.' 10. జకరియ్యా ఇలా విన్నవించుకున్నాడు : 'నా ప్రభూ! నాకు ఏదయినా ఒక సూచనను నిర్ధారించు.' సెలవిచ్చాడు : 'నీకు సూచన ఏమిటంటే, నీవు ఆరోగ్యవంతుడిగా ఉండి కూడా మూడు రేయింబవళ్ళ వరకూ జనులతో మాట్లాడలేవు.' 11. తరువాత జకరియ్యా ప్రార్థనా గది నుండి వెడలి, జనుల

సమక్షంలోకి వచ్చాడు. ఉదయం సాయంత్రం దేవుని పవిత్రతను కొనియాడండి అని సైగతోనే వారికి బోధించాడు.

12. 'ఓ యహ్యా! గ్రంథాన్ని గట్టిగా పట్టుకో.' మేమతనికి బాల్యంలోనే ధర్మావగాహనను అనుగ్రహించాము. 13. ఇంకా, మా తరఫున అతనికి మృదు మనస్సును, పరిశుద్ధతను ప్రసాదించాము. అతను మహా సాత్వికుడు. 14. తన తల్లిదండ్రుల సేవ చేసేవాడు. అతను పొగరుబోతుగానీ, ధిక్కార స్వభావిగానీ కాడు. 15. అతను పుట్టిన రోజూ, అతను మరణించే రోజూ, అతను తిరిగి బ్రతికించి లేపబడే రోజూ అతనికి శాంతి కలుగుగాక!

16. (ప్రవక్తా!) గ్రంథంలోని మర్యమ్ వృత్తాంతాన్ని కూడా ప్రస్తావించు. అప్పుడామె తన వారి నుండి వేరై తూర్పు వైపున ఉన్న స్థలంలోకి వెళ్ళిపోయింది. 17. తరువాత ఆమె వారికి చాటుగా తెర కట్టుకుంది. అప్పుడు మేము ఆమె వద్దకు మా దూతను పంపాము. అతడు ఆమె సమక్షంలో సంపూర్ణ మానవాకారంలో ప్రత్యక్షమయ్యాడు. 18. మర్యమ్ ఇలా అంది : 'నువ్వు ఏమాత్రం దైవభీతిగల వాడవైనా, నేను నీ బారి నుండి కరుణామయుడయిన దేవుని శరణు వేడుతున్నాను.' 19. అతనిలా అన్నాడు: 'నేను నీ ప్రభువు తరఫున పంపబడిన వాడనమ్మా! నీకొక పరిశుద్ధుడయిన బాలుడిని ఇవ్వటానికి (పంపబడ్డాను)'. 20. మర్యమ్ ఇలా చెప్పింది : 'నాకు బాలుడు కలగటమేమిటి? నన్ను ఏ పురుషుడూ తాకనయినా లేదు కదా! నేను చెడు నడత గల స్త్రీనీ కానే!?' 21. దైవదూత చెప్పాడు : 'ఇలాగే జరుగుతుంది. ఇది తనకు చాలా తేలిక అని నీ ప్రభువు సెలవిస్తున్నాడు. మేమతనిని ప్రజల కొరకు సూచనగా, మా తరఫున కారుణ్యంగా చేయదలిచాము. ఇదొక నిర్ధారిత విషయం.'

22. తరువాత మర్యమ్ గర్భవతి అయింది. దానిని మోసుకుంటూ ఓ దూర ప్రదేశానికి వెళ్ళిపోయింది. 23. తరువాత పురిటి నొప్పులు ఆమెను ఓ ఖర్జూర చెట్టు వద్దకు చేర్చాయి. 'నేను దీనికి పూర్వమే చచ్చిపోయి ఉంటే ఎంత బాగుండేది! నేనొక మరుపుకు గురయిన వస్తువునైతే ఎంత బాగుండేది!' అంటూ విలపించింది.

24. దైవదూత మర్యమ్‌ను ఆమె దిగువ వైపు నుండి పిలుస్తూ ఇలా అన్నాడు : 'దుఃఖించకు. నీ ప్రభువు నీకు దిగువన ఒక చెలమను సృజించాడు. 25. నీవు ఖర్జూరపు కాండాన్ని నీ వైపు ఊపు. నీపైన పండిన ఖర్జూర పండ్లు రాల్తాయి. 26. ఇక నీవు తిను. త్రాగు. నీ కన్నులను చల్లబరచుకో. ఏ మనిషి అయినా నీకు కనబడితే, 'నేను కరుణామయునికై ఉపవాసవ్రతం పాటిస్తున్నాను. ఈ రోజు నేను ఎవరితోనూ మాట్లాడను' అని చెప్పు.

27. తరువాత ఆమె ఆ శిశువును ఎత్తుకుని తన జాతి జనుల వద్దకు వచ్చింది. వారిలా అన్నారు : 'ఓ మర్యమ్! నువ్వు ఓ పెద్ద తుఫానునే సృష్టించావు. 28. ఓ హారూన్ సోదరీ! నీ తండ్రి ఏ చెడుకూ పాల్పడలేదు. నీ తల్లి కూడా చెడు నడత గలది కాదే!'

29. తరువాత మర్యమ్ ఆ పసిపిల్లవాని వైపు సైగ చేసింది. 'ఒడిలో ఉన్న ఈ పసికందుతో మేమెలా మాట్లాడగలం?' అని వారన్నారు. 30. (పిల్లవాడు) పలికాడు : 'నేను దైవదాసుడను. ఆయన నాకు గ్రంథం వొసగాడు. నన్ను ప్రవక్తగా చేశాడు. 31. నేనెక్కడ ఉన్నాసరే నన్ను శుభవంతునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంత కాలం నమాజ్ చేయమని, జకాత్ ఇస్తూ ఉండమని నాకు తాకీదు చేశాడు. 32. నన్ను నా తల్లి సేవకునిగా చేశాడు. నన్ను దౌర్జన్యపరునిగానూ, కర్కశునిగానూ చేయలేదు. 33. నేను పుట్టిన రోజున, నేను మరణించే రోజున, నేను బ్రతికించి లేపబడే రోజున నాకు శాంతి ఒనగూడుతుంది!'

34. ఇదిగో, ఇతనే మర్యమ్ కుమారుడగు ఈసా. ప్రజలు వివాదానికి (సందిగ్ధానికి) లోనై ఉన్న సత్యవాక్కు ఇదే. 35. ఎవరినయినా కొడుకుగా చేసుకోవటం అనేది అల్లాహ్‌కు ఎంతమాత్రం శోభించదు. ఆయన పరమ పవిత్రుడు. ఆయన ఏ పనినయినా చేయాలని నిర్ణయించుకున్నప్పుడు 'అయిపో' అనంటాడు. అంతే, అది అయిపోతుంది.

36. నిశ్చయంగా అల్లాహ్ నాకూ ప్రభువే. మీకూ ప్రభువే. కనుక మీరు ఆయన్నే ఆరాధించండి. ఇదే రుజుమార్గం. 37. తరువాత వారి కూటములు పరస్పరం విభేదించుకున్నాయి. కనుక తిరస్కరించిన వారికి

ఒక మహా గడ్డుదినం ఎదురైనప్పుడు వినాశం తప్పదు. 38. వారు మా సమక్షంలో హాజరైన రోజు వారు బాగా వింటూ ఉంటారు. బాగా చూస్తూ ఉంటారు. కాని నేడు ఈ దుర్వర్తనులు స్పష్టమయిన మార్గభ్రష్టతకు లోనై ఉన్నారు.

39. (ప్రవక్తా!) సిగ్గుతో కుమిలిపోయే ఆ రోజును గురించి వీరికి భయపెట్టు. అప్పుడు వ్యవహారం తేల్చివేయబడుతుంది. ప్రస్తుతం వారు పరధ్యానంలో పడి ఉన్నారు. వారు విశ్వసించటానికి సిద్ధంగా లేరు. 40. నిశ్చయంగా మేమే భువికి, భువిపై నివసించే వారందరికీ వారసులవుతాము. జనులు మా వద్దకే మరల్చబడతారు.

41. ఇంకా ఈ గ్రంథంలో ఇబ్రాహీమ్‌ను గురించి ప్రస్తావించు. నిశ్చయంగా అతను సత్యవంతుడు, ప్రవక్త. 42. అతను తన తండ్రితో ఇలా అన్నప్పుడు (జరిగిందేమిటి?) : 'ఓ నాన్నా! మీరు వినలేని, కనలేని, మీకు ఏ విధంగానూ తోడ్పడలేని వాటిని ఎందుకు పూజిస్తున్నారు? 43. నాన్నా! మీ వద్ద లేని జ్ఞానం నా వద్దకు వచ్చింది. కనుక మీరు నా మాట వినండి. నేను మీకు సరైన మార్గం చూపుతాను. 44. నా తండ్రీ! షైతాన్‌ను పూజించకండి. నిశ్చయంగా షైతాన్ కరుణామయుడైన దేవునికి అవిధేయుడు. 45. ఓ నాన్నా! కరుణామయుడైన దేవుని శిక్ష ఏదయినా మిమ్మల్ని కబళిస్తుందేమోనని, మీరు షైతాన్ సావాసిగా మారిపోతారేమోనని నాకు భయంగా ఉంది.'

46. తండ్రి ఇలా అన్నాడు : 'ఏమిటి, నువ్వు నా దేవతల పట్లనే విముఖత చూపుతున్నావా ఇబ్రాహీమ్! నువ్వు గనక నీ ధోరణిని మానుకోకపోతే, నిన్ను రాళ్ళతో కొట్టి చంపేస్తాను. నువ్వు నన్ను శాశ్వతంగా విడిచిపో.' 47. (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు : '(సరే నాన్నా!) మీకు సలామ్. నేను మీ మన్నింపుకై నా ప్రభువును వేడుకుంటాను. నిశ్చయంగా ఆయన నాపై జాలి కలవాడు. 48. నేను మిమ్మల్నీ, అల్లాహ్‌ను కాదని మీరు మొరపెట్టుకునే వారిని కూడా విడిచిపోతున్నాను. నేను మటుకు నా ప్రభువునే వేడుకుంటాను. నా ప్రభువును వేడుకుని నిష్ఫలుణ్ణి కాబోనని నేను ఆశిస్తున్నాను.'

49. ఆ విధంగా అతను ఆ జనుల నుండి వేరైపోయాడు. అల్లాహ్‌ను కాదని వారు పూజించే వాటన్నింటి నుండి కూడా అతను తెగత్రెంపులు చేసుకున్నాడు. అప్పుడు మేమతనికి ఇస్‌హాఖ్, యాఖూబులను ప్రసాదించాము. వారిలో ప్రతి ఒక్కరినీ మేము ప్రవక్తగా చేశాము. 50. వారికి మా కారుణ్య భాగాన్ని ఇచ్చాము. వారి పేరు ప్రతిష్ఠలను ఇనుమడింపజేశాము. వారిని ఉన్నతికి చేర్చాము.

51. ఇంకా ఈ గ్రంథంలో మూసా విషయాన్ని కూడా ప్రస్తావించు. నిశ్చయంగా అతను ప్రత్యేకంగా ఎన్నుకోబడినవాడు. దైవ సందేశహరుడు, దైవప్రవక్త. 52. మేమతనిని తూరు పర్వతం కుడి వైపు నుండి పిలిచాము. అతనితో రహస్య సంభాషణ జరిపే నిమిత్తం దగ్గరకు చేర్చుకున్నాము. 53. ఇంకా – మా కారుణ్యంతో మేమతని సోదరుడు హారూన్‌ను కూడా ప్రవక్తగా చేసి అతనికి తోడుగా ఇచ్చాము.

54. ఇంకా ఈ గ్రంథంలో ఇస్మాయీల్ విషయాన్ని కూడా ప్రస్తావించు. అతను వాగ్దానపాలనలో సత్యసంధుడు. దైవ సందేశహరుడు, దైవప్రవక్త. 55. అతడు తన వారికి నమాజ్, జకాత్‌ల గురించి ఆదేశించే వాడు. తన ప్రభువు దృష్టిలో ఎంతో ప్రియతముడుగా ఉండేవాడు. 56. ఇంకా – గ్రంథంలో ఇద్రీస్ గురించి కూడా ప్రస్తావించు. నిశ్చయంగా అతను సత్యవంతుడు, దైవప్రవక్త. 57. మేమతనిని అత్యున్నత స్థాయికి చేర్చాము.

58. వారంతా అల్లాహ్ అనుగ్రహ భాగ్యానికి నోచుకున్న ప్రవక్తలు. వారు ఆదమ్ సంతతిలోనివారు, నూహుతో పాటు మేము ఓడలో ఎక్కించిన వారి సంతతికి చెందినవారు. ఇబ్రాహీమ్, ఇస్రాయీల్ (యాఖూబు) సంతతిలోని వారు. ఇంకా మేము సన్మార్గం చూపి, ఎంపిక చేసుకున్నవారు కూడా ఉన్నారు. వారి ముందు కరుణామయుడయిన దైవవాక్కులు వినిపించినపుడు, వారు సాష్టాంగపడి, విలపిస్తారు.

59. ఆ తరువాత వీరి స్థానంలో అసమర్థులయిన వారు వచ్చి నమాజులను కోల్పోయారు. కోర్కెల వెనుకపడ్డారు. కనుక అనతి కాలంలోనే

వారు తమ చెడుగును చూసుకుంటారు. 60. అయితే ఎవరు పశ్చాత్తాపపడి, విశ్వసించి, సత్కార్యాలు చేశారో – అలాంటివారే స్వర్గంలో ప్రవేశిస్తారు. వారి హక్కు ఏ కాస్త కూడా కాజేయబడదు.

61. వారి కొరకు శాశ్వతంగా ఉండే స్వర్గవనాలుంటాయి. వాటిని గురించి కరుణామయుడు తన దాసులతో గోప్యంగా వాగ్దానం చేసి ఉన్నాడు. ఆ వాగ్దానం ఖచ్చితంగా నెరవేరుతుంది. 62. అందులో వారు సలాం (శాంతి) పలుకు తప్ప వ్యర్థమయిన మాటలు ఏమీ వినరు. వారి జీవనోపాధి వారికి ఉదయం సాయంత్రం లభిస్తూ ఉంటుంది. 63. ఇదీ ఆ స్వర్గం. మా దాసులలో దైవభీతి కలవారిని మేము దానికి వారసులుగా చేస్తాము.

64. '(దైవదూతలం అయిన) మేము నీ ప్రభువు ఆదేశం లేకుండా దిగిరాము. మా ముందున్నదయినా, మా వెనుక ఉన్నదయినా, వాటి మధ్యనున్నదయినా – అంతా ఆయనదే. నీ ప్రభువు మరచిపోయేవాడు కాడు సుమా! 65. ఆకాశాలకు, భూమికి, వాటి మధ్య నున్న సమస్తానికి ఆయనే ప్రభువు. కనుక నీవు ఆయన్నే ఆరాధించు. ఆయన దాస్యంపైనే స్థిరంగా ఉండు. నీకు తెలిసినంత వరకు ఆయన గుణవిశేషాలు గలవాడు మరెవడయినా ఉన్నాడా?

66. 'నేను మరణించిన పిదప మళ్లీ బ్రతికించి వెలికి తీయబడతానా?' అని మనిషి అంటున్నాడు. 67. ఏమిటి, అతను అసలు ఏమీ లేనప్పుడే, అతన్ని పుట్టించామన్న సంగతి మనిషికి గుర్తుకు రావటం లేదా? 68. కనుక నీ ప్రభువు తోడు! మేము వారినీ, షైతానులను కూడా సమీకరిస్తాము. తరువాత వారిని నరకం చుట్టూ, మోకాళ్ళ మీద పడి ఉన్న స్థితిలో హాజరుపరుస్తాము.

69. పిదప మేము ప్రతి వర్గంలో నుంచి, కరుణామయునికి వ్యతిరేకంగా అందరికన్నా అధికంగా తలబిరుసుతనం ప్రదర్శించిన వారిని వేరు చేస్తాము. 70. నరకానికి ఆహుతి అవటానికి ఎక్కువ పాత్రులెవరో మాకు బాగా తెలుసు. 71. మీలో దాని గుండా (నరకం మీదుగా) సాగిపోనివారు ఎవ్వరూ ఉండరు. దీనిని నెరవేర్చవలసిన బాధ్యతను నీ

ప్రభువు అవశ్యంగా ఖరారు చేసుకున్నాడు. 72. తరువాత మేము భయభక్తులు కలవారిని కాపాడుకుంటాము. దుర్మార్గులను మాత్రం అందులోనే పడి ఉండేలా వదలివేస్తాము.

73. వారికి స్పష్టమయిన మా సూక్తులు వినిపించినపుడు సత్య తిరస్కారులు విశ్వసించిన వారితో 'ఇంతకీ ఈ ఉభయ వర్గాలలో ఏ వర్గం మెరుగైన స్థితిలో ఉంది? ఎవరి సమావేశం బావుంది?' అనంటారు. 74. వారికి పూర్వం మేము ఎన్నో జాతులను అంతమొందించాము. అవి వీళ్ళకన్నా ఎక్కువ సాధనసంపత్తి కలవి. వీళ్ళకన్నా ఎక్కువ ఆర్భాటం కలవి.

75. వారికి చెప్పు : 'అపమార్గానికి లోనై ఉన్నవానికి కరుణామయుడు వదులు ఇస్తూ పోతాడు. చివరకు వారు తమకు వాగ్దానం చేయబడే దానిని – శిక్షనో లేదా ప్రళయ ఘడియనో – చూసుకున్నప్పుడు ఎవరి స్థితి కడుహీనమయినదో, ఎవరి ముఠా బలహీనమయినదో తెలిసి వస్తుంది.'

76. (తద్భిన్నంగా) సన్మార్గానికి వచ్చినవారి మార్గదర్శనంలో దేవుడు సమృద్ధిని ప్రసాదిస్తాడు. మిగిలి ఉండే సదాచరణలే నీ ప్రభువు సన్నిధిలో – ప్రతిఫలం దృష్ట్యా – మేలైనవి. పరిణామం రీత్యా కూడా అవే అత్యుత్తమమైనవి.

77. (ప్రవక్తా!) మా సూచనలను తిరస్కరించిన ఆ వ్యక్తిని నీవు చూశావా? పైగా వాడు, 'నాకు సిరిసంపదలు, సంతానం తప్పక ఇవ్వబడతాయి' అని మితిమీరిన ధీమాతో చెబుతున్నాడు. 78. ఏమిటి, వాడుగాని అగోచరాల్లోకి తొంగి చూశాడా? లేదా వాడు కరుణామయుడయిన దేవుని వద్ద నుండి ఏదయినా హామీ పొందాడా? 79. ఎంతమాత్రం కాదు. వాడు బొంకేదంతా మేము వ్రాసుకుంటాము. వాడి శిక్షను మరింతగా పెంచుతాము. 80. వాడు ఏ ఏ వస్తువుల గురించి దావా చేస్తున్నాడో వాటికి మేము వారసులమవుతాము. వాడు మాత్రం ఒంటరిగానే మా సమక్షంలో హాజరవుతాడు.

81. వారు అల్లాహ్‌ను కాదని ఇతరులను – తమకు అండగా నిలుస్తారని భావించి, ఆరాధ్యులుగా చేసుకున్నారు. 82. అసంభవం! వారంతా

వీళ్ళ పూజా పునస్కారాలను త్రోసిపుచ్చుతారు. వీరికి వ్యతిరేకులు అయిపో తారు.

83. మేము సత్యతిరస్కారులపై షైతానులను వదలిపెట్టడాన్ని నీవు గమనించలేదా? అవి వారిని (అదేపనిగా) ఉసిగొల్పుతున్నాయి. 84. కనుక నీవు వారి విషయంలో తొందరపెట్టకు. మేము వారి గడువును లెక్కిస్తున్నాము. 85. ఆ రోజు మేము భయభక్తులు కలవారిని కరుణామయుని వైపునకు అతిథులుగా సమావేశపరుస్తాము. 86. అపరాధులను మాత్రం దప్పికగొన్న స్థితిలో నరకం వైపునకు తోలుకుపోతాము. 87. కరుణామయుని వద్ద అనుమతి పొందినవానికి తప్ప వేరెవరికీ సిఫారసు చేసే అధికారం ఉండదు.

88. కరుణామయుడు (అయిన దేవుడు) ఎవరినో కుమారునిగా చేసుకున్నాడని వారంటున్నారు. 89. మీరు కల్పించి తెచ్చిన ఈ మాట మహా ఘోరమయినది. 90. ఈ ఘోరానికి గాను త్వరలోనే మిన్ను విరిగి మీదపడవచ్చు. భూమి బ్రద్దలైపోవచ్చు. పర్వతాలు పగిలి క్రిందపడిపోవచ్చు. 91. కరుణామయునికి జనులు కొడుకును అంటగడుతున్న విషయం అటువంటిది మరి! 92. ఎవరినయినా కొడుకుగా చేసుకోవటం అనేది కరుణామయుని స్థాయికి ఎంతమాత్రం శోభించదు.

93. భూమ్యాకాశాలలో ఉన్న వారెవరయినా కరుణామయుని సన్నిధిలో దాసులుగా హాజరుకానున్న వారే. 94. ఆయన వద్ద వారందరి జమాబందీలు ఉన్నాయి. ఆయన వారందరినీ బాగా లెక్కపెట్టి ఉంచాడు. 95. వారిలోని ప్రతి ఒక్కడూ ప్రళయదినాన ఆయన సమక్షంలో ఒంటరిగానే వస్తాడు. 96. అయితే ఎవరు విశ్వసించి, సదాచరణ చేశారో వారి యెడల కరుణామయుడు ప్రేమను జనింపజేస్తాడు.

97. కనుక (ఓ ప్రవక్తా!) మేము ఈ ఖుర్‌ఆన్‌ను నీ భాషలో ఎందుకు సులభతరం చేశామంటే; నీవు భయభక్తులు కలవారికి శుభవార్త వినిపించాలని! వితండవాదన చేసే జనులను హెచ్చరించాలని!! 98. వీరికి పూర్వం మేము ఎన్నో జాతులను తుదముట్టించాము. వారిలో ఎవరినయినా నీవు చూస్తున్నావా? లేదా వారి సవ్వడి ఏదయినా వింటున్నావా?

# 20. తాహా

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. తా – హా. 2. మేమీ ఖుర్ఆన్ని నీవు కష్టాల్లో పడిపోవాలని అవతరింపజెయ్యలేదు. 3. భయపడే వానికి ఉపదేశంగా మాత్రమే (దీనిని అవతరింపజేశాము). 4. భూమిని, ఎత్తయిన ఆకాశాలను సృష్టించిన వాని తరఫున ఇది అవతరింపజేయబడింది. 5. ఆ అపార కరుణామయుడు విశ్వ అధికార పీఠం (అర్ష్)పై ఆసీనుడై ఉన్నాడు. 6. ఆకాశాలలో ఉన్నది, భూమిలో ఉన్నది, ఆ రెండింటి మధ్యన ఉన్నది, భూమి అడుగున ఉన్నది – అంతా ఆయనదే.

7. నీవు నీ మాటను బిగ్గరగా పలికినా సరే. ఆయనైతే మెల్లిగా చెప్పినా, అంతకన్నా గుట్టుగా చెప్పినా తెలుసుకుంటాడు. 8. ఆయన అల్లాహ్! ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేనేలేడు. అతి సుందరమైన పేర్లన్నీ ఆయనవే.

9. మూసా సమాచారం గాని నీకు అందిందా? 10. అతను ఒక మంటను చూసినపుడు తన ఇంటివారితో ఇలా అన్నాడు : 'ఆగండి! నేనొక అగ్ని జ్వాలను చూశాను. బహుశా నేను మీ కోసం ఒక నిప్పు కణికను తీసుకురాగలనేమో! లేదా ఆ మంట దగ్గర నేను మార్గం కనుగొనగలనేమో!'

11. తరువాత అతనక్కడికి చేరుకోగానే పిలుపు వినబడింది : 'ఓ మూసా! 12. నేనే నీ ప్రభువును. ఇక నీ పాదరక్షలు విడువు. ఎందుకంటే నీవిప్పుడు 'తువా' అనే పవిత్ర లోయలో ఉన్నావు. 13. నేను నిన్ను ఎన్నుకున్నాను. కనుక నీకు 'వహీ'గా అందజేయబడేదంతా విను. 14. నిశ్చయంగా నేనే అల్లాహ్ను. నేను తప్ప మరో దేవుడు లేడు. కనుక నీవు నన్నే ఆరాధించాలి. నా జ్ఞాపకార్థం నమాజ్ను స్థాపించు. 15. ప్రళయ ఘడియ తప్పక రానున్నది. నేను దానిని గోప్యంగా ఉంచదలిచాను – ప్రతి

వ్యక్తికీ తాను చేసుకున్న దాని ప్రతిఫలం లభించాలని! 16. కనుక దీనిని నమ్మకుండా, కేవలం తన కోర్కెలను అనుసరించేవాడు నిన్ను ఈ విషయం పట్ల పరధ్యానానికి లోనుచేయరాదు. అన్యథా నీవు వినాశానికి గురవుతావు.'

17. 'ఇంతకీ నీ చేతిలో ఉన్నదేమిటి ఓ మూసా?' 18. 'ఇది నా చేతికర్ర. దీనిని నేను ఊతంగా చేసుకుంటాను. దీంతో నా మేకల కొరకు ఆకులు రాల్చుతాను. దీనిని ఇతరత్రా పనుల కోసం కూడా ఉపయోగించు కుంటాను' అని అతను సమాధానమిచ్చాడు. 19. ఈ విధంగా సెలవీయబడింది : 'మూసా! దానిని క్రింద పడవెయ్యి.' 20. అతను దానిని పడవెయ్యగానే అకస్మాత్తుగా అదొక పరుగెత్తే పాము అయిపోయింది. 21. 'దానిని పట్టుకో. భయపడకు. మేము దానిని దాని పూర్వస్థితికి చేరుస్తాము' అని సెలవీయబడింది.

22. ఇక నీ చెయ్యి నీ చంకలో ఒత్తిపట్టుకో. అది ఎలాంటి లోపం లేకుండా మెరుస్తూ బయటికి వస్తుంది. ఇది (నీకు ఇవ్వబడిన) రెండవ మహిమ. 23. మా గొప్ప సూచనలలో కొన్నింటిని నీకు చూపాలని (ఈ విధంగా చేశాము). 24. నీవు ఫిరౌన్ వద్దకు వెళ్ళు. అతను మరీ బరితెగించి పోయాడు.'

25. మూసా ఇలా అభ్యర్థించాడు : 'నా ప్రభూ! నా ఆంతర్యాన్ని విప్పారజెయ్యి. 26. నా కార్యాన్ని నాకు సులభతరం చెయ్యి. 27. నా నాలుక ముడిని విప్పు – 28 – తద్వారా జనులు నేను చెప్పేది అర్థం చేసుకోవటానికి. 29. నా కుటుంబం నుంచి నా కొరకు ఒక సహాయకుణ్ణి నియమించు. 30. నా సోదరుడైన హారూన్‌ను (నియమించు). 31. అతన్ని నా వెన్నుదన్నుగా ఉంచు. 32. నా కార్యనిర్వహణలో అతన్ని భాగస్థునిగా చెయ్యి – 33 – తద్వారా మేమిద్దరం అత్యధికంగా నీ పవిత్రతను కొనియాడటానికి! 34. ఇతోధికంగా నిన్ను స్మరిస్తూ ఉండటానికి!! 35. నిశ్చయంగా నీవు మమ్మల్ని గమనిస్తూనే ఉంటావు.' 36. సెలవీయ బడింది : 'నీవు అడిగినవన్నీ నీకు ఇవ్వబడ్డాయి మూసా!'

37. 'మేము నీకు మరో ఉపకారం కూడా చేసి ఉన్నాము. 38. అప్పుడు మేము నీ మాతృశ్రీకి పంపవలసిన సంకేతాన్ని (వహీని) పంపాము. 39. అదేమిటంటే; ఈ పసివాణ్ణి ఓ పెట్టెలో పెట్టి, దానిని నదిలో వదలిపెట్టు. నది దానిని ఒడ్డుకు చేరుస్తుంది. దానిని ఒక వ్యక్తి తీసుకుంటాడు. అతను నాకూ శత్రువే, ఆ బాలునికీ శత్రువే (అని సూచించాము).' అప్పుడు నేను నా తరఫున నీపై ప్రత్యేకంగా ఒక ప్రేమను కురిపించాను – నీవు నా పర్యవేక్షణలో పెంచబడటానికి. 40. మరోవైపు నీ సహోదరి నడుచుకుంటూ వచ్చి, 'ఈ పిల్లవాణ్ణి చక్కగా సాకే ఒకామె ఉంది. ఆమె ఆచూకీ నేను మీకు తెలుపనా!' అంది. ఆ విధంగా మేము నిన్ను నీ తల్లి వద్దకు చేర్చాము – తద్వారా ఆమె కళ్ళకు చలువ లభించాలని, ఆమె దుఃఖించకుండా ఉండాలనీని. నీవు ఒక వ్యక్తిని హతమార్చావు. తరువాత మేము ఆ దుఃఖావేదన నుండి కూడా నీకు విముక్తిని కలిగించాము. మేము నిన్ను బాగా పరీక్షించాము. ఆ తరువాత నీవు అనేక సంవత్సరాల పాటు మద్యన్‌వాసుల మధ్య గడిపావు. మరి నీవిప్పుడు నిర్ధారిత సమయానికి ఇలా వచ్చావు మూసా.

41. నేను నిన్ను నా కార్యం కోసం ఎంపిక చేసుకున్నాను. 42. నువ్వూ, నీ సోదరుడూ నా సూచనలను తీసుకుని వెళ్ళండి. నా స్మరణ విషయంలో మటుకు బద్ధకం తగదు. 43. మీరిద్దరూ ఫిరౌను వద్దకు వెళ్ళండి. అతను మరీ హద్దుమీరి పోయాడు. 44. అయితే అతనితో మృదువుగా మాట్లాడాలి. బహుశా అతను ఉపదేశాన్ని గ్రహించవచ్చు లేదా భయపడవచ్చు.'

45. వారిరువురూ ఇలా విన్నవించుకున్నారు : 'మా ప్రభూ! అతను మాపై వేధింపులకు సిద్ధమవుతాడేమో లేక మాపై అఘాయిత్యానికి పాల్పడతాడేమోనని భయంగా ఉంది.' 46. సెలవిచ్చాడు : 'మీరేమీ భయపడకండి. నేను మీకు తోడుగా ఉన్నాను. అంతా వింటూ ఉన్నాను. చూస్తూ ఉన్నాను. 47. కనుక మీరిరువురూ అతని దగ్గరకు వెళ్ళి అనండి :

'మేమిద్దరం నీ ప్రభువు తరఫున పంపబడిన వారము. కనుక నీవు ఇస్రాయీల్ సంతతి వారిని మాతోపాటే వెళ్ళనివ్వు. వారిని వేధించకు. మేము నీ ప్రభువు వద్ద నుండి ఒక సూచనను కూడా తీసుకువచ్చాము. సన్మార్గాన్ని అనుసరించేవానికి శాంతి కలుగుతుంది. 48. దీనిని అసత్యంగా చిత్రీకరించి, వెనుతిరిగిపోయిన వానికి యాతన తప్పదని మాకు దివ్యవాణి ద్వారా తెలుపబడింది.'

49. 'ఇంతకీ మీరిరువురి ప్రభువు ఎవడయ్యా మూసా?' అని ఫిరౌన్ అడగ్గా, 50. 'ప్రతి వస్తువుకూ దాని రూపురేఖలను ప్రసాదించినవాడు, తరువాత దానికి మార్గం చూపినవాడే మా ప్రభువు' అని మూసా సమాధానమిచ్చాడు. 51. 'మరయితే పూర్వం గతించిన తరాల సంగతేమిటి?' అని ఫిరౌన్ మెలికపెట్టగా, 52. 'వారికి సంబంధించిన పరిజ్ఞానం నా ప్రభువు వద్ద ఒక గ్రంథంలో ఉంది. నా ప్రభువు పొరబడటంగానీ, మరచిపోవటంగానీ జరగదు' అని మూసా విశదపరిచాడు.

53. ఆయనే మీ కొరకు నేలను పరుపుగా చేశాడు. అందులో మీ కొరకు దారులను ఏర్పరిచాడు. ఆకాశం నుండి నీరు కురిపించాడు. తరువాత మేము దానిద్వారా రకరకాల వృక్షజాలను (పంటలను) ఉత్పన్నం చేశాము. 54. మీరూ తినండి, మీ పశువులను కూడా మేపండి. ఇందులో విజ్ఞులయిన వారికి పలు సూచనలున్నాయి.

55. ఇందులో నుండే మేము మిమ్మల్ని సృష్టించాము. ఇందులోనికే మిమ్మల్ని చేరుస్తాము. ఇందులో నుండే మేము మిమ్మల్ని మళ్లీ వెలికి తీస్తాము.

56. మేము ఫిరౌన్‌కు మా సూచనలన్నింటినీ చూపించాము. కాని అతను వాటిని అసత్యమంటూ కొట్టివేశాడు. నమ్మ నిరాకరించాడు. 57. అతనిలా అన్నాడు : 'నీవు నీ తాంత్రిక శక్తితో మా రాజ్యం నుండి మమ్మల్నే వెళ్ళగొట్టడానికి వచ్చావా మూసా!? 58. అలాగయితే నీకు పోటీగా మేము కూడా అటువంటి మాయాజాలాన్నే తీసుకువస్తాము. కనుక నువ్వు

మాకూ – నీకూ మధ్య వాగ్దాన (పోటీ) సమయం నిర్ధారించు. మేము దానిని దాటవేయము. నీవు కూడా దాటవేయకూడదు. ఈ పోటీ బహిరంగ ప్రదేశంలో జరగాలి.'

59. మూసా అన్నాడు : 'ఉత్సవ దినం మీ వాగ్దాన దినంగా నిర్ణయించబడింది. పొద్దెక్కేవరకూ జన సమీకరణ జరగాలి.' 60. ఫిరౌన్ అక్కడి నుండి మరలి, తన ఎత్తుగడలన్నీ సమకూర్చుకుని (పోటీకి) తిరిగి వచ్చాడు. 61. మూసా ఇలా అన్నాడు : 'మీ పాడుగాను. అల్లాహ్‌కు అసత్యాన్ని ఆపాదించకండి. ఆయన ఏదయినా ఆపద ద్వారా మిమ్మల్ని సర్వనాశనం చేసివేస్తాడు. అల్లాహ్‌పై అబద్ధాన్ని కల్పించిన వాడెవడయినాసరే, వాడు కృతార్థుడు కాలేడు.'

62. తరువాత ఈ వ్యవహారంలో వారి మధ్య (మాంత్రికుల మధ్య) విభేదం వచ్చింది. వారు పరస్పరం రహస్య మంతనాలు జరిపారు. 63. చివరకు ఇలా చెప్పారు : 'వీరిద్దరూ ఖచ్చితంగా మాంత్రికులే. వారు తమ మంత్రబలంతో మిమ్మల్ని రాజ్యం నుండి వెళ్ళగొట్టాలనుకుంటున్నారు. ఆదర్శప్రాయమయిన మీ విధానాన్ని నిర్మూలించగోరుతున్నారు. 64. అందుకే మీ ఎత్తుగడలన్నింటినీ కూడగట్టుకోండి. పిదప అందరూ కలసికట్టుగా రండి. ఈ రోజు ఆధిక్యత పొందినవాడిదే విజయం.'

65. 'మూసా! నువ్వయినా వెయ్యి లేదా మేమయినా వేస్తాము' అని మాంత్రికులు సవాలు విసరగా, 66. 'ముందు మీరే వెయ్యండి' అని మూసా చెప్పాడు. అంతే. అకస్మాత్తుగా వారి త్రాళ్ళు, వారి లాఠీలు వారి మంత్రబలం చేత పరుగెత్తుతున్నట్లు కనిపించాయి అతనికి. 67. మూసా తన మనసులోనే భయపడిపోయాడు. 68. మేమిలా అన్నాము : 'నీవు భయపడకు. ఖచ్చితంగా నీదే పైచేయి అవుతుంది. 69. నీ కుడి చేతిలో ఉన్నదానిని పడవెయ్యి. వారి కాల్పనిక విద్యను అది ఇట్టే మ్రింగివేస్తుంది. వారు కల్పించినదంతా మాంత్రికుని మోసం మాత్రమే. మాంత్రికుడు ఎన్నటికీ సఫలీకృతుడు కాలేడు – అతనెలా (ఆర్భాటంగా) వచ్చినా సరే!' 70. మాంత్రికులు

సాష్టాంగపడిపోయారు. 'మేము హారూన్, మూసాల ప్రభువును విశ్వసించాము' అని ఎలుగెత్తి ప్రకటించారు.

71. ఫిరౌన్ అన్నాడు : 'ఏమిటి, నేను మీకు ఆనతి ఇవ్వకముందే మీరతన్ని విశ్వసించారా? ఇప్పుడర్థమయింది. ఇతనే మీకు మంత్రవిద్యను నేర్పిన మీ నాయకుడు. ఇక చూసుకోండి. నేను మీ కాళ్ళుచేతుల్ని ఎదురెదురు ప్రక్కల నుంచి నరికిస్తాను. ఖర్జూరపు దుంగలపై మీకు శిలువ వేయిస్తాను. అప్పుడు గాని మీకు తెలిసిరాదు – మా ఇద్దరిలో ఎవరి శిక్ష ఎక్కువ కఠినమైనదో! దీర్ఘకాలికమైనదో!!'

72. మాంత్రికులు ఇలా పలికారు : 'మా వద్దకు వచ్చిన నిదర్శనాలపై, మమ్మల్ని సృష్టించిన వానిపై నీకు ప్రాధాన్యత ఇవ్వటం అనేది జరగని పని. నీకు చేతనయింది చేసుకో. నువ్వేం చేసుకున్నా ఈ ప్రాపంచిక జీవితం వరకే చేసుకోగలవు. 73. మేము మటుకు మా ప్రభువును విశ్వసించాము – ఆయన మా తప్పులను క్షమించాలని, నీవు మాచేత బలవంతంగా చేయించిన తాంత్రిక విద్యలను కూడా క్షమించాలని. అల్లాహ్‌యే శ్రేష్ఠుడు. మిగిలి ఉండేవాడు (నిత్యుడు).'

74. అపరాధిగా తన ప్రభువు సమక్షంలో హాజరయ్యేవానికి నరకమే గతి. అందులో అతను చావడు, బ్రతకడు. 75. మరెవరయితే తన ప్రభువు సన్నిధిలో విశ్వాసిగా హాజరవుతాడో, సదాచరణ కూడా చేసి ఉంటాడో – అలాంటి వారికి ఉన్నత స్థానాలు ఉంటాయి. 76. వారికొరకు చిరకాలం ఉండే ఉద్యానవనాలుంటాయి. వాటి క్రింద సెలయేరులు పారుతూ ఉంటాయి. వాటిలో వారు కలకాలం ఉంటారు. పరిశుద్ధతను అవలంబించే వ్యక్తికి లభించే ప్రతిఫలమిది.

77. మేము మూసాకు దివ్యవాణి ద్వారా సంకేతం పంపాము. రాత్రికి రాత్రే నా దాసులను తీసుకుని బయలుదేరు. వారి కోసం సముద్రంలో పొడి దారి ఏర్పరచుకో. ఎవరయినా వెంబడిస్తారేమోనని భయపడకు. మరేవిధమయిన భయాందోళన కూడా చెందనవసరం లేదు. 78. తరువాత

ఫిరౌన్ తన సైనికులతో వారిని వెంబడించాడు. అయితే సముద్ర జలం వాళ్ళను క్రమ్ముకోవలసిన విధంగానే క్రమ్ముకుంది. 79. ఫిరౌన్ తన జాతిని పెడత్రోవ పట్టించాడు. సరయిన దారి చూపలేదు.

80. ఓ ఇస్రాయీలు సంతతి వారలారా! మేము మిమ్మల్ని మీ శత్రువు బారి నుండి విముక్తిని ప్రసాదించాము. తూరు (పర్వతం) కుడి వైపున మీరు హాజరవటం గురించి సమయం నిర్ధారించాము. ఇంకా మేము మీపైన మన్న్ సల్వాలను దింపాము. 81. మేము ప్రసాదించిన పరిశుద్ధమయిన ఆహారాన్ని తినండి. ఈ విషయంలో తలబిరుసుతనం ప్రదర్శించకండి. అన్యథా మీపై నా ఆగ్రహం విరుచుకుపడుతుంది. నా ఆగ్రహం ఎవరిపైన పడినా అతను నాశనమైనట్లే. 82. అయితే పశ్చాత్తాపపడి, విశ్వసించి, సదాచరణ చేసి, సన్మార్గంపై స్థిరంగా ఉన్న వాని పాలిట మాత్రం నేను అమిత క్షమాశీలుడను.

83. 'నీవు నీ జాతి వారిని వదలి, ఇంత శీఘ్రంగా రావటానికి నిన్ను పురికొల్పిన విషయమేమిటి ఓ మూసా' (అని దేవుడు తూరు పర్వతంపై అడిగినప్పుడు) 84. మూసా ఇలా అన్నాడు : 'వాళ్ళూ నా వెనకే వస్తున్నారు. ఇక నా విషయానికి వస్తే, ఓ ప్రభూ! నీవు ప్రసన్నుడవు కావాలని నేను తొందరగా వచ్చేశాను.' 85. సెలవిచ్చాడు : 'మేము నీ జాతి వారిని, నీ వెనుక ఒక పరీక్షకు గురిచేశాము. వాళ్ళను సామిరీ భ్రష్టు పట్టించాడు.'

86. తరువాత మూసా ఆగ్రహోదగ్రుడై, దుఃఖవదనుడై తన జాతి వారి వైపునకు మరలాడు. అతనిలా అన్నాడు : 'నా జాతి జనులారా! ఏమిటి, మీ ప్రభువు మీకు ఒక మంచి వాగ్దానం చేయలేదా? ఏమిటి, మీపై మరీ అంత ఎక్కువ కాలం గడచిందా? లేదా మీరు మీపైన మీ ప్రభువు ఆగ్రహాన్నే కొనితెచ్చుకోవాలనుకున్నారా? అందుకే నాతో చేసిన వాగ్దానాన్ని భంగపరిచారా?'

87. వారిలా సంజాయిషీ ఇచ్చారు : 'మేము నీకు చేసిన వాగ్దానాన్ని మా అంతట మేముగా భంగపరచలేదు. జనుల ఆభరణాల (నగల) భారం

మా చేత మోయించటం జరిగింది. మేము వాటిని తీసి పారవేశాము. ఆ విధంగా సామిరీ వాటిని వాడుకున్నాడు. 88. తరువాత అతను వారికోసం ఆవుదూడ బొమ్మను చేసి తెచ్చాడు. అదొక విగ్రహం, అందులో నుండి ఎద్దులాంటి ధ్వని వచ్చేది. తరువాత వారంతా ఇలా అన్నారు : 'ఇదే మీ ఆరాధ్య దైవం. మూసా దైవం కూడా ఇదే. కాకపోతే మూసా దీనిని మరచిపోయాడు.' 89. ఏమిటి, అది ఏ మాటకూ సమాధానం ఇవ్వటంలేదని, వారికెలాంటి నష్టంగానీ, లాభంగానీ చేయజాలదన్న విషయాన్ని వారు గమనించటం లేదా?

90. నిజానికి హారూన్ వారితో ముందే చెప్పాడు : 'నా జాతి వారలారా! మీరు ఈ ఆవుదూడ మూలంగా భ్రమల వలయంలో చిక్కుకున్నారు. వాస్తవానికి మీ ప్రభువైతే కరుణామయుడైన దేవుడే. కనుక మీరు నన్ను అనుసరించండి. నేను చెప్పినట్లు వినండి.' 91. దానికి వారిలా అన్నారు : 'మూసా మా దగ్గరకు తిరిగి రానంత వరకూ మేము దీనినే పూజిస్తూ ఉంటాము.'

92. మూసా (తన సోదరునితో) ఇలా అన్నాడు : 'ఓ హారూన్! వారు పెడదారి పట్టిన సంగతిని నీవు గమనించినపుడు, 93. నా విధానాన్ని అనుసరించకుండా నిన్ను ఏ విషయం అడ్డుకుంది? ఏమిటి, నువ్వు కూడా నా ఆజ్ఞను ఎదిరించావా?' 94. హారూన్ ఇలా అన్నాడు : 'ఓ నా మాతా పుత్రుడా! నా గడ్డాన్ని పట్టుకోకు. నా తల జుత్తు పట్టి ఈడ్వకు. "బనీ ఇస్రాయీల్‌లో నీవు చీలిక తెచ్చావ్. నా మాటను లక్ష్యపెట్టలేద"ని నీవు నిలదీస్తావేమోనన్న భయంతోనే ఇలా ప్రవర్తించాను.'

95. మూసా అడిగాడు : 'మరి నీ సంగతేమిటి ఓ సామిరి?' 96. అతనిలా సమాధానమిచ్చాడు – 'ఇతరులకు కనిపించనిది నాకు కానవచ్చింది. అందుచేత నేను సందేశహరుని పాద చిహ్నాల నుండి గుప్పెడు మన్ను తీసుకుని, దానిని అందులో పడవేశాను. నా అంతరాత్మ కూడా నన్ను అలాగే ప్రబోధించింది.' 97. మూసా అన్నాడు : 'పో ఇక్కణ్ణుంచి.

ఇక జీవితాంతం నీకు శాస్తి ఏమిటంటే, “నన్ను ముట్టుకోవద్దు” అంటూ ఉంటావ్. నీ కొరకు మరో వాగ్దాన సమయం ఉంది. అది ఎట్టి పరిస్థితిలోనూ నీ నుండి తొలగిపోదు. ఇక నువ్వు ఏ దేవుణ్ణి అంటిపెట్టుకుని ఉన్నావో, దానికి పట్టే గతేమిటో చూడు. మేము దానిని కాల్చివేస్తాము. తరువాత దానిని సముద్రంలో పారేస్తాము.’ 98. మీ ఆరాధ్య దైవమైతే అల్లాహ్‌యే. ఆయన తప్ప మరో దేవుడు లేడు. ఆయన జ్ఞానం అన్నింటినీ పరివేష్ఠించి ఉంది.

99. (ప్రవక్తా!) ఈ విధంగా మేము నీకు పూర్వం గతించిన వారి స్థితిగతులను వినిపిస్తున్నాము. ఇంకా మేము నీకు మా వద్ద నుండి ఒక ఉపదేశాన్ని (జ్ఞాపికను) ప్రసాదించాము. 100. దీనిపట్ల విముఖత చూపిన వాడు ప్రళయదినాన భరించలేని భారాన్ని మోస్తాడు. 101. వారందులో సదా పడి ఉంటారు. ఆ బరువు ప్రళయదినాన వారి పాలిట కడు దుర్భరంగా ఉంటుంది. 102. ఆ రోజు శంఖం ఊదబడుతుంది. అపరాధులను మేము ఆనాడు సమీకరించినపుడు, భయంతో వారి కళ్లు నీలిరంగులో ఉంటాయి. 103. వారు పరస్పరం మెల్లగా చెప్పుకుంటూ ఉంటారు; కేవలం పది రోజులు (ప్రపంచంలో) గడిపి ఉంటామని. 104. వారు చెప్పుకునేదేమిటో మాకు బాగా తెలుసు. వారిలో అందరికన్నా ఎక్కువ తెలిసినవాడు, ‘మీరు కేవలం ఒక్క రోజే గడిపారు’ అనంటాడు.

105. వారు నిన్ను పర్వతాల గురించి ప్రశ్నిస్తున్నారు. వారికి చెప్పు: ‘నా ప్రభువు వాటిని ధూళిగా చేసి ఎగురవేస్తాడు. 106. తరువాత భూమిని చదునైన మైదానంగా చేసేస్తాడు. 107. అందులో మీరు ఎలాంటి వంకరను, మెరకను చూడరు. 108. ఆ రోజు అందరూ పిలిచేవానిని అనుసరిస్తారు. ఆ అనుసరణలో ఏమాత్రం పెడసరితనం ఉండదు. కరుణామయుని సమక్షంలో అందరి కంఠస్వరాలు అణగారి ఉంటాయి. మెల్లని సవ్వడి తప్ప ఏదీ నీవు వినలేవు.

109. ఆ రోజు సిఫారసు ఎలాంటి లాభం చేకూర్చదు - కరుణామయుడు అయిన దేవుడు ఎవరికయినా ఆనతిని ఇచ్చి, అతని సంజాయిషీని ఇష్టపడితే తప్ప! 110. ఆయన అందరి పూర్వోత్తర స్థితిగతులను గురించి తెలిసినవాడు. వారి పరిజ్ఞానం ఆయన జ్ఞానవిశేషాలను గురించి, ఊహించజాలదు. 111. అప్పుడు అందరి ముఖాలు ఆ నిత్య సజీవుని, లోక మూలాధారి అయిన వాని సమక్షంలో వినయంతో క్రిందికి వాలి ఉంటాయి. అన్యాయ భారాన్ని మోసుకువచ్చినవాడు విఫలుడవుతాడు. 112. మరెవరయితే సదాచరణ చేశాడో, అతను విశ్వాసి కూడా అయినట్ల యితే, అతనికి అన్యాయం జరుగుతుందనిగానీ, లోటు జరుగుతుందేమోనన్న భయంగానీ అక్కర లేదు.

113. (ప్రవక్తా!) ఇదేవిధంగా మేము ఖుర్‌ఆన్‌ను అరబీలో అవతరింపజేశాము. ఇందులో మేము పలు రకాల హెచ్చరికలు చేశాము - తద్వారా జనులు భయభక్తుల వైఖరిని అవలంబిస్తారని లేదా వారి అంతరంగాలలో ఆలోచనాత్మకమయిన విషయం నాటాలని! 114. కనుక అల్లాహ్‌యే మహోన్నతుడు; సిసలయిన సామ్రాట్టు. నీకు పంపబడిన వహీ (దివ్యవాణి) పూర్తిగా అందనంతవరకూ నీవు మాత్రం ఖుర్‌ఆన్‌ను గ్రహించటంలో తొందరపడకు. 'ప్రభూ! నాకు మరింత జ్ఞానాన్ని వొసగు' అని ప్రార్థించు.

115. ఇంతకు మునుపు మేము ఆదమ్‌కు ఒక ఆదేశం ఇచ్చి ఉన్నాము. కాని అతను మరచిపోయాడు. అతనిలో మాకు సంకల్పనిరతి కనిపించలేదు. 116. 'ఆదమ్‌కు సాష్టాంగపడండి' అని మేము దైవదూతలతో అన్నప్పుడు, వారంతా సాష్టాంగపడ్డారు - ఒక్క ఇబ్లీసు తప్ప! వాడు మాత్రం ఎదిరించాడు. 117. మరి మేము ఇలా అన్నాము : 'ఓ ఆదమ్! ఖచ్చితంగా వీడు నీకూ, నీ భార్యకూ బద్ధవిరోధి. వాడు మిమ్మల్ని స్వర్గం నుండి తీసివేయి స్తాడేమో జాగ్రత్త! అదే గనక జరిగితే నీవు కష్టాలపాలవుతావు.

118. ఇక్కడ మాత్రం నీకు (ఏ లోటూ ఉండదు). నీకు ఆకలి బాధా ఉండదు, నీవు నగ్నంగానూ ఉండవు. 119. ఇక్కడ నీకు దాహం వేయదు. నీకు ఎండ కూడా తగలదు.' 120. కాని షైతాన్ వారిని కవ్వించాడు. 'ఓ ఆదమ్! నేను నీకు అమరజీవితాన్ని, ఎన్నటికీ బలహీనపడని రాజరికాన్ని ఇచ్చే వృక్షమేదో చూపనా!?' అన్నాడు. 121. అంతే. వారిద్దరూ ఆ చెట్టు పండును తినేశారు. తత్ఫలితంగా వారిరువురి మర్మస్థానాలు ఒండొకరి ముందు బహిర్గతం అయిపోయాయి. ఇరువురూ స్వర్గంలోని ఆకులతో తమను కప్పుకోసాగారు. (ఆ విధంగా) ఆదమ్ తన ప్రభువు ఆజ్ఞను ఉల్లంఘించి, అపమార్గం పట్టాడు. 122. ఆ తరువాత అతని ప్రభువు అతన్ని కటాక్షించాడు. అతని పశ్చాత్తాపాన్ని ఆమోదించి, మార్గనిర్దేశన చేశాడు.

123. తరువాత ఇలా సెలవిచ్చాడు : "మీరిద్దరూ ఇక్కణ్ణుంచి దిగిపోండి. మీరు పరస్పరం (మానవుడు–షైతాన్) శత్రువులుగా ఉంటారు. ఇక మీదట నా తరఫు నుండి మీ వద్దకు మార్గదర్శకత్వం వస్తే, నా మార్గదర్శకత్వాన్ని అనుసరించేవాడు దారి తప్పడు, కష్టాల్లో పడడు. 124. మరెవడయితే నా హితబోధపట్ల విముఖత చూపుతాడో, అతని బ్రతుకు దుర్భరం అవుతుంది. ప్రళయదినాన మేమతన్ని గుడ్డివానిగా లేపుతాము. 125. అతను 'నా ప్రభూ! నీవు నన్ను గుడ్డివానిగా లేపావేమిటి? నాకు చూపు ఉండేది కదా!' అంటాడు. 126. సెలవీయబడుతుంది : 'ఇలాగే నీ వద్దకు మా సూచనలు వచ్చినపుడు నీవు వాటిని పట్టించుకోలేదు. అలాగే ఈనాడు నిన్ను పట్టించుకోవటం జరగదు. 127. హద్దుమీరిపోయేవారికి, తమ ప్రభువు సూచనలను నమ్మనివారికి మేము ఇలాంటి ప్రతిఫలమే ఇస్తాము. పరలోక శిక్ష ఇంతకన్నా కఠినమయినది, మిగిలి ఉండేది.

128. ఏమిటి, జనులకు దీనిద్వారా కూడా విషయం అర్థం కాలేదా? వీరికి పూర్వం మేము ఎన్నో తరాలను అంతమొందించాము. వీళ్లు ప్రస్తుతం

ఆ బస్తీలలో సంచరిస్తూ ఉన్నారు. నిశ్చయంగా ఇందులో విజ్ఞత గల వారికి ఎన్నో సూచనలున్నాయి. 129. నీ ప్రభువు తరఫున ముందుగానే ఒక విషయం ఖరారై ఉండకపోతే, ఒక నిర్ణీత గడువు ఇవ్వబడకుండా ఉంటే ఈ పాటికి వీళ్ళ వ్యవహారం తేల్చివేయబడేది. 130. కనుక (ఓ ప్రవక్తా!) వారు చెప్పేమాటలపై ఓర్పు వహించు. నీ ప్రభువును స్తుతించటంతోపాటు, ఆయన పవిత్రతను కూడా కీర్తించు – సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి ముందు. రాత్రివేళల్లో, పగటి అంచులలో కూడా ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉండు, తద్వారా నీకు తృప్తి లభించవచ్చు.

131. వారిలో కొన్ని వర్గాల వారికి మేము ఇచ్చి ఉన్న ప్రాపంచిక జీవిత వైభవాల వైపు కన్నెత్తి కూడా చూడకు. వారిని పరీక్షించటానికే మేము అవన్నీ వారికి ఇచ్చాము. నిజానికి నీ ప్రభువు యొక్క జీవనోపాధి మాత్రమే శ్రేష్ఠమయినది, మిగిలి ఉండేది. 132. నీ ఇంటివారలకు నమాజ్ గురించి ఆజ్ఞాపించు. నీవు సయితం దానికి కట్టుబడి ఉండు. మేము నీ నుండి ఎలాంటి ఉపాధినీ అడగటం లేదు. ఉపాధినయితే మేమే నీకు ఇస్తున్నాము. సత్పరిణామం భక్తిగల వారిదే.

133. 'ఈయనగారు తన ప్రభువు వద్ద నుండి ఏదయినా సూచనను ఎందుకు తీసుకు రాడు?' అని (అవిశ్వాస) జనులంటున్నారు. ఏమిటి, పూర్వగ్రంథాలలో ఉన్న నిదర్శనం వారికి చేరలేదా? 134. ఒకవేళ మేము వారిని, దానికి పూర్వమే ఏదయినా విపత్తు ద్వారా అంతమొందించినట్లయితే, 'మా ప్రభూ! నీవు మా వద్దకు ఒక ప్రవక్తను ఎందుకు పంపలేదు? మేము అవమానానికి, పరాభవానికి లోనుకాక మునుపే నీ సూచనలను అనుసరించే వారం కదా!' అని అనేవారు. 135. వారితో అను : 'అందరూ నిరీక్షిస్తున్నారు. మీరు కూడా నిరీక్షించండి. సన్మార్గాన ఉన్నదెవరో, మరెవరు గమ్యానికి చేరుకున్నారో ముమ్మందు మీరే తెలుసుకుంటారు.'

# 21. అల్ అంబియా (దైవ ప్రవక్తలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (17) 1. ప్రజలకు వారి లెక్కల సమయం దగ్గరపడింది. వారేమో పరధ్యానంలో పడి విముఖత చూపుతున్నారు. 2. వారివద్దకు వారి ప్రభువు తరఫు నుండి ఏ సరికొత్త హితబోధ వచ్చినా, దాన్ని వారు ఆషామాషీ గానే ఆలకిస్తారు. 3. వారి హృదయాలు ఏమరుపాటులో పడి ఉన్నాయి. దుర్మార్గులు పరస్పరం సమాలోచన జరుపుతూ, 'అవునూ, ఇతనూ మీలాంటి ఒక మానవమాత్రుడు కాడా? మరలాంటప్పుడు మీరు కళ్ళారా చూస్తూనే అతని మాయాజాలంలో ఎందుకు ఇరుక్కుపోతున్నారు?' అని అంటున్నారు. 4. ప్రవక్త చెప్పాడు : 'భూమ్యాకాశాలలో పలకబడిన ప్రతి మాటా నా ప్రభువుకు తెలుసు. ఆయన అంతా ఆలకించేవాడు, అన్నీ ఎరిగినవాడు.'

5. పైగా వారిలా అంటారు : 'ఇవన్నీ చెదరిన కలలు. పైగా వీటిని ఇతగాడు కల్పించుకున్నాడు. ఇంకా చెప్పాలంటే ఇతనొక కవిపుంగవుడు. (ఇతను నిజంగా దైవప్రవక్త అయినట్లయితే) మొదటి ప్రవక్తలు సూచనలతో సహా పంపబడినట్లే ఇతను కూడా మా వద్దకు ఏదయినా సూచనను తీసుకురావాలి.' 6. వీరికి పూర్వం మేము ఏ బస్తీ జనులను తుదముట్టించినా, వారు విశ్వసించనే లేదు. ఇప్పుడు వీళ్ళు మాత్రం విశ్వసిస్తారా?

7. నీకు పూర్వం కూడా మేము మానవులనే ప్రవక్తలుగా చేసి పంపాము. మేము వారి వద్దకు 'వహీ' (దివ్యవాణి) పంపేవారము. మీకు తెలీకపోతే గ్రంథవహులను అడిగి తెలుసుకోండి. 8. మేము ఆ ప్రవక్తలకు అన్నం తినకపోయినా తట్టుకోగలిగే శరీరాలను ఇవ్వలేదు. వారు (ఈ లోకంలో) శాశ్వతంగా ఉండేవారు కూడా కాదు. 9. తరువాత మేము వారికి చేసిన వాగ్దానాలన్నింటినీ నెరవేర్చాము. వారినీ, వారితో పాటు మేము కోరిన

వారందరినీ కాపాడుకున్నాము. బరితెగించిన వారిని మాత్రం తుదముట్టించాము.

10. మేము మీ వైపునకు ఒక గ్రంథాన్ని అవతరింపజేశాము. అందులో మీ ప్రస్తావనే ఉంది. అయినప్పటికీ మీరు అర్థం చేసుకోరా?
11. దురాగతాలకు ఒడిగట్టిన ఎన్నో జనావాసాలను మేము నలిపివేశాము.
వారి తరువాత వేరొక జాతిని ప్రభవింపజేశాము. 12. వారు మా ఆపద
రావటాన్ని పసిగట్టగానే అక్కడి నుండి పలాయనం చిత్తగించేందుకు
యత్నించారు. 13. 'పారిపోకండి. మీ విలాస సామగ్రి వైపునకే, మీ ఇండ్ల
వైపునకే మరలండి – మిమ్మల్ని నిలదీసి అడగవలసి ఉంది.' 14. అప్పుడు
వారిలా అన్నారు : 'అయ్యో! మా దౌర్భాగ్యం! నిశ్చయంగా మేమే
దుర్మార్గులము'. 15. వారలా అరుస్తూనే ఉన్నారు. కడకు మేము వారిని
కోత కోసిన చేను మాదిరిగా, ఆరిపోయిన అగ్ని మాదిరిగా చేసేశాము.

16. మేము భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న వాటిని ఏదో
క్రీడగా సృష్టించలేదు. 17. ఒకవేళ మేమేదన్నా క్రీడనే చేయాలనుకుంటే,
అదొక్కటే మా ఉద్దేశమై ఉంటే మా వద్ద నున్న దాంతోనే చేసుకునేవారం.
18. పైగా మేము సత్యాన్ని అసత్యంపై విసిరికొడతాము. అది దాని మాడు
బద్దలగొడుతుంది. చూస్తూ ఉండగానే అసత్యం నిష్క్రమిస్తుంది. ఇకపోతే
మీరు కల్పిస్తున్న విషయాలకుగాను మీకు మూడటం ఖాయం.

19. భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఆయనవే. ఆయన వద్ద నున్నవారు
(దైవదూతలు) ఆయన దాస్యం పట్ల తలబిరుసుతనమూ ప్రదర్శించరు.
బద్ధకమూ వహించరు. 20. వారు అహోరాత్రులు ఆయన్ని స్మరిస్తారు.
వారు అలుపెరుగనివారు.

21. ఏమిటి, వారు భువిలో నుండి ఎవరినయితే ఆరాధ్య దైవాలుగా
చేసుకున్నారో, వారుగాని ఎవరినయినా బ్రతికిస్తారా? 22. ఒకవేళ ఈ

రెండింటిలో (భూమ్యాకాశాలలో) అల్లాహ్ తప్ప వేరితర దేవుళ్ళు ఉండి ఉంటే సర్వత్రా అల్లకల్లోలం జరిగి ఉండేది. కనుక సింహాసనాధిపతి అయిన అల్లాహ్ వారు కల్పించే మాటలకు అతీతుడు, పరిశుద్ధుడు. 23. ఆయన ఏం చేసినా ప్రశ్నించబడడు. కాని వారు మాత్రం ప్రశ్నించబడతారు.

24. ఏమిటి, వారు నిజదైవాన్ని వదలి వేరితర దేవుళ్ళను చేసుకున్నారా? (ప్రవక్తా!) వీరిని అడుగు : 'దానికి సంబంధించిన ఆధారం తీసుకు రండి. నా వెంటనున్న వారి విషయమూ ఇదే. నా పూర్వీకుల విషయం కూడా ఇదే. కాని వారిలో అనేకులు సత్యాన్ని ఎరుగరు. అందుకే వారు విముఖులయ్యారు. 25. మేము నీకు పూర్వం ఏ ప్రవక్తను పంపినా, 'నేను తప్ప మరో ఆరాధ్యదైవం లేదు. కనుక మీరంతా నన్నే ఆరాధించండి' అనే సందేశాన్ని (వహీ) ఇచ్చి పంపాము.

26. 'కరుణామయుడు సంతానాన్ని చేసుకున్నాడు' అని వారంటున్నారు. దీనికి ఆయన (అతీతుడు), పరిశుద్ధుడు, పైగా వారంతా (దైవదూతలంతా) గౌరవనీయులయిన దైవదాసులు. 27. వారు ఆయన సమక్షంలో ముందంజవేసి మాట్లాడరు. ఆయన ఆదేశానుసారమే వారు మసలుకుంటారు. 28. వారికి ముందు ఏమున్నదో, వారికి వెనుక ఏమున్నదో కూడా ఆయనకు ఎరుకే. దేవుడు ఎవరి విషయంలోనయినా సిఫారసు వినడానికి సమ్మతిస్తేనే తప్ప, వారు ఎవరి కోసమూ సిఫారసు చేయరు. వారు ఆయన భయం వల్ల భయకంపితులై ఉంటారు. 29. వారిలో (దైవ దూతలలో) ఎవరయినాసరే, 'ఆయన గాక నేనూ దైవాన్నే' అని అంటే, అలాంటి వానిని మేము నరక యాతనకు గురిచేస్తాము. మేము దుర్మార్గులను ఇలాగే శిక్షిస్తాము.

30. ఏమిటి, భూమ్యాకాశాలు రెండూ మూసుకుపోయి ఉండగా మేము వాటిని తెరచిన వైనాన్ని సత్య తిరస్కారులు గమనించరా? మేము

నీటి ద్వారా ప్రతి జీవ పదార్థాన్ని చేశాము. అయినప్పటికీ వారు నమ్మరా?

31. మేము భూమిలో పర్వతాలను ప్రతిష్ఠించాము – వారిని తీసుకుని అది ఒరిగిపోకుండా ఉండాలని. ఇంకా మేమందులో విశాలమైన రహదారులను ఏర్పరచాము – జనులు తమ మార్గం కనుగొనాలని.
32. ఇంకా మేము ఆకాశాన్ని ఒక సురక్షితమయిన కప్పుగా చేశాము. కాగా; వీరేమో దాని సూచనల పట్ల ధ్యాస కనబరచటం లేదు. 33. ఇంకా – ఆయనే రేయింబవళ్ళను, సూర్య చంద్రులను నిర్మించాడు. అవన్నీ ఒక్కో కక్ష్యలో తేలియాడుతూ ఉన్నాయి.

34. (ప్రవక్తా!) నీకు పూర్వం కూడా మేము ఏ మానవ మాత్రునికీ శాశ్వత జీవితం ప్రసాదించలేదు. మరైతే నీవు మరణిస్తే, వారు మాత్రం శాశ్వతంగా ఉంటారా? 35. ప్రతి ప్రాణీ మృత్యువు రుచి చూడవలసిందే. మేము మిమ్మల్ని మంచీ చెడుల స్థితిగతులకు లోనుచేసి పరీక్షిస్తూ ఉంటాము. కడకు మీరంతా మా వైపునకే మరలించబడతారు.

36. సత్య తిరస్కారులు నిన్ను చూసినప్పుడు, వారంతా నిన్ను నవ్వులాటగా తీసుకుంటారు. 'మీ ఆరాధ్య దైవాలను గురించి ప్రస్తావించేది ఈయనగారేనా?' అంటారు. మరి చూడబోతే కరుణామయుని సంస్మరణను తిరస్కరిస్తున్నది స్వయంగా వారే.

37. మానవుడు తొందరపాటు జీవిగా సృష్టించబడ్డాడు. నేను శీఘ్రంగానే మీకు నా సూచనలను చూపెడతాను. కనుక నన్ను తొందర పెట్టవద్దు. 38. మీరు చెప్పేదే నిజమయితే ఈ వాగ్దానం ఎప్పుడు నెరవేరుతుంది?' అని ఈ జనులు అడుగుతున్నారు. 39. అయ్యో, ఈ సత్య తిరస్కారులకు ఆ సమయం గురించి తెలిసి ఉంటే ఎంత బాగుండేది! అప్పుడు వారు అగ్నిని తమ ముందు నుండిగానీ, తమ వెనుక నుండిగానీ ఆపలేరు. వారికి సహాయం కూడా అందదు. 40. పైగా అది అమాంతం వారిపై

వచ్చిపడుతుంది. అది వారిని తేరుకోకుండా చేస్తుంది. తరువాత వారు దానిని ప్రతిఘటించనూలేరు. వారికి వ్యవధి కూడా ఇవ్వబడదు. 41. నీకు పూర్వం కూడా దైవప్రవక్తలను పరిహసించటం జరిగింది. అయితే వారిలో ఎవరయితే పరిహసించారో, వారు తాము పరిహసించిన దాని ఉచ్చులోనే పడిపోయారు.

42. వారిని అడుగు : '(చెప్పండి!) కరుణామయుని పట్టు నుండి పగలూ రేయి మిమ్మల్ని రక్షించగల వాడెవడు? అసలు విషయం ఏమిటంటే, వారు తమ ప్రభువు సంస్మరణ నుండి విముఖులవుతున్నారు. 43. ఏమిటి, మాకు వ్యతిరేకంగా వీరికి అండగా నిలబడే దైవాలు ఏమయినా ఉన్నాయా? అవి ఖుద్దుగా తమను కాపాడుకునే శక్తిని కలిగిలేవు. మాకు ప్రతిగా వారికి సాయం చేసేవాడు కూడా ఎవడూ లేడు.

44. అసలు విషయం ఏమిటంటే మేము వారికి, వారి తాతముత్తాతలకు ప్రాపంచిక సంపత్తిని పుష్కలంగా ఇచ్చాము. కడకు ఆ స్థితిలోనే వారి సుదీర్ఘ కాలం గడచిపోయింది. ఏమిటి, మేము భూమిని దాని దిశలన్నింటి నుండి కుదించుకుంటూ రావటాన్ని వారు గమనించటం లేదా? ఇంత జరిగినా వీళ్ళే ప్రాబల్యం వహిస్తారటనా?

45. వారితో చెప్పు : 'నేనైతే వహీ (దివ్యవాణి) ఆధారంగా మిమ్మల్ని సావధానపరచే వాడను మాత్రమే.' బధిరులను ఎంతగా సావధానపరచినా వారు ఆ పిలుపును వినరు. 46. ఒకవేళ నీ ప్రభువు శిక్ష వారికి ఏమాత్రం సోకినా, వెంటనే పెడబొబ్బలు పెడుతూ, 'అయ్యో మా పాడుగాను. నిజంగా మేమే దుర్వర్తనులం' అంటారు.

47. ప్రళయదినాన మేము న్యాయంగా తూచే త్రాసును పెడతాము. ఏ ప్రాణికీ ఆవగింజంత అన్యాయం కూడా జరగదు. ఒకవేళ ఎవరి ఆచరణ అయినా ఆవగింజకు సమానంగా ఉన్నా దానిని మేము సమర్పిస్తాము. లెక్క తీసుకోవటానికి మేమే చాలు.

48. మేము మూసా హారూనులకు గీటురాయిని, జ్యోతిని, జ్ఞాపిక (హితబోధ)ను ప్రసాదించి ఉన్నాము – భక్తిపరుల (శ్రేయం) కొరకు. 49. వారు చూడకుండానే తమ ప్రభువుకు భయపడతారు. ప్రళయ ఘడియను తలచుకుని భీతిల్లుతారు. 50. ఇదొక శుభప్రదమైన జ్ఞాపిక. దీనిని మేము అవతరింపజేశాము. మరైతే దీనిని మీరు నిరాకరిస్తున్నారా?

51. అంతకు ముందు మేము ఇబ్రాహీముకు అతని పథ నిర్దేశం చేశాము. అతని గురించి మాకు బాగా తెలుసు. 52. అతను తన తండ్రితో, తన జాతివారితో, 'ఇంతకీ మీరు కొలుస్తూ కూర్చున్న ఈ విగ్రహాల వాస్తవికత ఏమిటి?' అని అడిగినప్పుడు, 53. 'మా తండ్రీ, తాతలు వీటిని పూజిస్తూ ఉండటం మేము గమనించాము' అని వారన్నారు. 54. 'నిశ్చయంగా మీ తండ్రీ తాతలు స్పష్టమయిన మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నార'ని ఇబ్రాహీమ్ చెప్పగా,

55. 'నీవు మా వద్దకు ఏదయినా సత్యం తెచ్చావా? లేక వేళాకోళంగా మాట్లాడుతున్నావా?' అని వారు అడిగారు. 56. ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు: 'భూమ్యాకాశాలకు ప్రభువైన వాడే మీ ప్రభువు. వాటిని సృష్టించినది కూడా ఆయనే. ఈ మేరకు సాక్ష్యమిచ్చే వారిలో నేనూ ఒకణ్ణి. 57. దైవసాక్షి! మీరు తిరిగి వెళ్ళాక, మీ విగ్రహాల సంగతి చూసుకుంటాను.' 58. అంతే, వాటిని అతను తునాతునకలు చేసేశాడు. వాటిలో ఒక పెద్ద విగ్రహం జోలికి మాత్రం పోలేదు – వారంతా దాని వైపు మరలాలని!

59. (వారంతా వచ్చి ఇలా) అన్నారు : 'మా దేవుళ్ళ పట్ల అపచారానికి పాల్పడినదెవరు? వాడెవడో పరమ దుర్మార్గుడే అయి ఉంటాడు.' 60. కొంతమంది ఇలా చెప్పారు : 'ఇబ్రాహీమ్ అనబడే ఒక నవ యువకుడు వీటిని గురించి ప్రస్తావించటం మేము విన్నాము.' 61. వారన్నారు : 'అతన్ని జనులందరి సమక్షంలో హాజరుపరచండి – వాళ్ళూ చూస్తారు.' 62. 'ఓ

ఇబ్రాహీమ్! మా దేవుళ్ళ పట్ల ఈ విధంగా ప్రవర్తించినది నువ్వేనా!?' అని వారు అడిగినప్పుడు, 63. 'ఆహా! వీళ్ళ ఈ పెద్దాయనే ఇలా చేశాడు. అవి చెప్పగలిగితే, వాటినే అడిగిచూడండి' అన్నాడు ఇబ్రాహీమ్.

64. తరువాత వారు లోలోపలే ఆలోచించుకున్నారు. దాని మీదట పరస్పరం ఇలా చెప్పుకున్నారు : 'నిజానికి మీరే దుర్మార్గులు'. 65. దరిమిలా తమ తలలు వంచుకున్నారు. 'ఇబ్రాహీమ్! ఇవి మాట్లాడలేవన్న విషయం నీకు తెలుసు కదా!' అన్నారు. 66. ఇబ్రాహీమ్ ఇలా చెప్పాడు : 'ఏమిటి, మీరు నిజదైవాన్ని వదలి మీకు లాభంగానీ, నష్టంగానీ కలిగించలేని వాటిని పూజిస్తారా? 67. ఛీత్కారం మీపైనా, అల్లాహ్‌ను కాదని మీరు పూజించే వాటిపైనా. మీరు ఆ మాత్రం గ్రహించరా?'

68. వారంతా ఇలా అన్నారు : 'ఇతన్ని అగ్నికి ఆహుతి చేయండి. మీరేదన్నా చేయాలనే అనుకుంటే మీ దేవుళ్ళకు సహాయకులుగా నిలబడండి.' 69. మేమిలా సెలవిచ్చాము – 'ఓ అగ్నీ! ఇబ్రాహీమ్ యెడల చల్లగా, సురక్షితంగా మారిపో'. 70 వారు అతనికి అపకారం తలపెట్టారు. అయితే మేము వాళ్ళ ప్రయత్నాన్ని వమ్ము చేశాము.

71. మేము అతన్నీ, లూత్‌నూ కాపాడి, లోకవాసుల పాలిట శుభప్రదం గావించిన భూభాగం వైపు వారిరువురినీ పంపాము. 72. మేమతనికి ఇస్‌హాఖ్‌ను ప్రసాదించాము. అదనంగా యాఖూబ్‌ను కూడా అనుగ్రహించాము. వారందరినీ మేము సజ్జనులుగా చేశాము. 73. మేము వారిని పేష్వాలు (నాయకులు) గా చేశాము. మా ఆదేశానుసారం వారు (జనులకు) మార్గదర్శకత్వం వహించేవారు. మేము వారికి సత్కార్యాలు చేయమని, నమాజును స్థాపించమని, జకాత్ చెల్లించమని ఆదేశం పంపాము. వారంతా మా ఆరాధనకు కట్టుబడినవారు.

74. లూత్‌కు మేము యుక్తిని, జ్ఞానాన్ని ప్రసాదించాము. పాడుపనులు చేసే బస్తీవాసుల నుండి అతనికి విమోచనం కల్పించాము. నిశ్చయంగా వారు పరమ నీచులు, అవిధేయ జనులు. 75. మేమతనిని మా కారుణ్యంలో చేర్చుకున్నాము. నిశ్చయంగా అతను సజ్జనుల కోవకు చెందినవాడు.

76. అంతకుముందు నూహ్ మమ్మ మొరపెట్టుకున్నప్పుడు, మేమతని ప్రార్థనను ఆమోదించాము. మేము అతనినీ, అతని పరివార జనులను ఘోర కలి నుండి కాపాడాము. 77. మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించిన జనులకు ప్రతిగా మేమతనికి సహాయపడ్డాము. నిశ్చయంగా వారు మహా దుష్టజనులు. అందుకే మేము వారందరినీ ముంచివేశాము.

78. దావూదు, సులైమానులు ఒక చేను వ్యాజ్యంపై తీర్పు ఇస్తూ ఉన్నప్పుడు (వారికి మేము తోడ్పడ్డాము), ఆ చేనులో కొందరి మేకలు రాత్రివేళ పడ్డాయి. అప్పుడు వారి తీర్పును మేము చూస్తూ ఉన్నాము. 79. మేము సులైమానుకు విషయావగాహనను ఇచ్చాము. ఆ మాటకొస్తే మేము వారిరువురికి కూడా యుక్తినీ, జ్ఞానాన్ని ప్రసాదించాము. ఇంకా మేము పర్వతాలు, పక్షులు కూడా దావూదు స్వాధీనంలో ఉండేలా చేశాము. అవి అతనితో కలిసి (దేవుని) పవిత్రతను కొనియాడేవి. ఇదంతా మేమే చేశాము. 80. ఇంకా మేమతనికి – మీ కొరకు యుద్ధ కవచం నిర్మించే విద్యను నేర్పాము – తద్వారా కదన రంగంలో మిమ్మల్ని సురక్షితంగా ఉంచటానికి. మరయితే మీరు కృతజ్ఞులయ్యారా?

81. ఇంకా మేము సులైమాన్‌కు వేగంగా వీచే గాలులను లోబరిచాము. అవి అతని ఆదేశానుసారం మేము శుభాలు పొందుపరచిన భూభాగం వైపు పయనించేవి. ప్రతిదీ మాకు తెలుసు. 82. షైతానులలో కూడా కొందరిని మేము అతని అదుపాజ్ఞలలో ఉంచాము. అవి అతని

కోసం నీట మునిగేవి. అది గాకుండా వేరితర పనులు కూడా చేసిపెట్టేవి. వాటిని మేము నియంత్రిస్తూ ఉండేవారము.

83. అయ్యూబు తన ప్రభువును మొరపెట్టుకున్నప్పుడు (కూడా మేము అతనికి తోడ్పడ్డాము) – అతనిలా వేడుకున్నాడు : 'నాకు వ్యాధి సోకింది. నీవు కరుణించేవారందరిలోకీ అధికంగా కరుణించేవాడివి.' 84. మేము అతని ప్రార్థనను ఆమోదించాము. అతని బాధను (జబ్బును) దూరం చేశాము. మేమతనికి అతని పరివారమంతటినీ (తిరిగి) ప్రసాదించాము. దాంతోపాటు మరి అంత అధికంగా కూడా అనుగ్రహించాము. ఆరాధనా తత్పరత గలవారికి మా తరఫున కారుణ్యంగా, హితోపదేశంగా!

85. ఇస్మాయిల్, ఇద్రీస్, జుల్‌కిఫ్ల్ (లను కూడా జ్ఞాపకం చేసుకోండి). వీరంతా సహనమూర్తులే. 86. మేము వీరందరినీ మా కారుణ్యంలో చేర్చుకున్నాము. నిశ్చయంగా వారంతా సదాచార సంపన్నులు.

87. చేపవానికి కూడా (యూనుస్‌కు కూడా తోడ్పడ్డాము). ఆ సమయంలో అతను తన జాతి వారిపై కినుక వహించి, వెళ్ళిపోయాడు. మేము పట్టుకోబోమని అతను తలపోశాడు. తరువాత అతను గాఢాంధ కారంలో నుండి ఇలా వేడుకున్నాడు : 'నీవు తప్ప మరో ఆరాధ్య దైవం లేనేలేడు. నీవు పరమ పవిత్రుడవు. ముమ్మాటికీ నేనే దోషిని.' 88. మరి మేమతని ప్రార్థనను స్వీకరించాము. ఆవేదన నుండి అతనికి విముక్తిని ప్రసాదించాము. విశ్వాసులను మేము ఇలాగే ఆదుకుంటూ ఉంటాము.

89. జకరియ్యాకు కూడా (తోడ్పడ్డాము). 'నా ప్రభూ! నన్ను ఒంటరివానిగా వదలకు. నీవే అసలు అత్యుత్తమ వారసుడవు' అని అతను తన ప్రభువును వేడుకున్నప్పుడు, 90. మేము అతని వేడుకోలును అంగీకరించి, అతనికి యహ్యాను ప్రసాదించాము. అతని కొరకు అతని

భార్యను బాగుచేశాము. వారు సత్కార్యాలలో దూసుకుపోయేవారు. ఆశతోనూ, భీతితోనూ మమ్మల్ని ప్రార్థించేవారు. మా సమక్షంలో తమ అణకువను అభివ్యక్తం చేసేవారు.

91. తన శీలాన్ని కాపాడుకున్న ఆ మానినీమణి (కి కూడా మేము ఆదరువుగా నిలిచాము), మేము ఆమెలోకి మా ఆత్మను ఊదాము. ఇంకా ఆమెను, ఆమె పుత్రరత్నాన్ని ప్రపంచవాసుల కొరకు ఒక సూచనగా చేశాము.

92. యదార్థానికి మీ ఈ సముదాయం ఒకే సముదాయం. నేనే మీ ప్రభువును. కనుక మీరు నన్నే ఆరాధించండి. 93. వారు తమ ధర్మాన్ని తమలోనే ముక్కలు ముక్కలుగా చేసుకున్నారు. అందరూ మా వద్దకు రావలసినవారే. 94. కనుక సదాచరణ చేసిన వ్యక్తి, అతను గనక విశ్వాసి (మోమిన్) అయివుంటే, అతని కృషికి విలువ ఇవ్వకపోవటం అంటూ ఉండదు. మేము దానిని వ్రాసిపెడుతున్నాము.

95. ఏ బస్తీవారినయినా మేము తుదముట్టించాలని నిర్ధారించా మంటే, ఇక వారు రుజువర్తనులవ్వటమనేది అసంభవం. 96. చివరకు యాజూజ్ మాజూజ్‌లు విడుదల చేయబడినపుడు, వారు ప్రతి ఎత్తయిన ప్రదేశం నుండి బయల్పడతారు. 97. సత్య వాగ్దానం సమీపించినపుడు, అకస్మాత్తుగా తిరస్కారుల కనుగుడ్లు తేలిపోతూ ఉంటాయి. (వారిలా అంటారు) : 'అయ్యో! మా దౌర్భాగ్యం. మేము దీని గురించి పరధ్యానంలో పడి ఉన్నాం. పైగా మేమే దుర్వర్తనులము.'

98. నిశ్చయంగా మీరూ, దైవాన్ని కాదని మీరు పూజించేవారు – అందరూ నరకానికి ఇంధనమే. మీరంతా అందులోకి పోవలసిన వారే. 99. వారు నిజంగానే దైవాలై ఉంటే వారు దానికి ఆహుతి అయ్యేవారే కాదు. ఇక వారందరూ అందులో శాశ్వతంగా పడి ఉండాల్సిందే. 100. వారందులో అరుస్తూ ఉంటారు. అందులో వారికి ఏమీ వినిపించదు.

101. ఇక ఎవరికయితే మేలు జరగాలని మా తరఫున ముందుగానే నిర్ణయమై పోయిందో, వారు దీనికి దూరంగా ఉంచబడతారు. 102. వారు దీని (నరకం) చిరు సవ్వడి కూడా వినరు. వారు తమ మనసు మెచ్చిన వస్తువుల మధ్య కలకాలం ఉంటారు. 103. కలవరం సృష్టించే ఘడియ కూడా వారిని ఆవేదనకు లోను చేయదు. దైవదూతలు వారిని స్వాగతిస్తూ, 'ఇదే మీకు వాగ్దానం చేయబడిన ఆ రోజు' అంటారు.

104. ఆ రోజు మేము పత్రాల గొట్టంలో పుటలు చుట్టినట్లుగా ఆకాశాన్ని చుట్టిపెడతాము. తొలుత మేము సృష్టిని మొదలుపెట్టినట్లే దానిని పునరావృతం చేస్తాము. ఈ వాగ్దానాన్ని నెరవేర్చవలసిన బాధ్యత మాపైన ఉంది. దానిని మేము ఎట్టి పరిస్థితిలోనూ చేసితీర్తాము. 105. జబూర్‌లో మేము హితబోధ అనంతరం వ్రాసిపెట్టాము – సజ్జనులయిన మా దాసులే భూమికి వారసులవుతారని. 106. దైవదాస్య భావం తొణికిసలాడే జనులకు ఇందులో గొప్ప సమాచారం ఉంది.

107. (ప్రవక్తా!) మేము నిన్ను లోకవాసుల కోసం కారుణ్యంగా చేసి పంపాము. 108. వారితో ఇలా అను : 'నా వద్దకు వచ్చే సందేశం (వహీ) ఏమిటంటే; మీ ఆరాధ్యదైవం ఒకే దైవం. ఇకనయినా మీరు విధేయులవుతారా?' 109. ఒకవేళ వారు విముఖత చూపితే ఇలా చెప్పేయ్: 'నేనయితే మిమ్మల్ని చాలా స్పష్టంగా సావధానపరిచాను. ఇక మీతో వాగ్దానం చేయబడుతున్న విషయం సమీపంలోనే ఉందో లేక దూరాన ఉందో నేనెరుగను. 110. నిశ్చయంగా ఆయన బహిర్గతమయిన మాటనూ ఎరుగు, మీరు గోప్యంగా ఉంచే మాటనూ ఎరుగు. 111. బహుశా అది మీ పాలిట పరీక్ష కావచ్చు, లబ్ది పొందేందుకు ఇవ్వబడిన వ్యవధీ కావచ్చు – నాకైతే తెలియదు.' 112. (ఆఖరికి ప్రవక్త) ఇలా విన్నవించుకున్నాడు : 'ఓ నా ప్రభూ! సత్య (ధర్మ) బద్ధంగా తీర్పు చెయ్యి. మా ప్రభువు కరుణామయుడు. మీరు కల్పించే మాటలకు ప్రతిగా మేము ఆయన సహాయాన్నే అర్థిస్తున్నాము.'

# 22. అల్ హజ్జ్ (హజ్జ్ యాత్ర)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. నిశ్చయంగా ప్రళయ ప్రకంపనం మహా భయంకరమైనది. 2. ఆ రోజు మీరు చూస్తారు – పాలిచ్చే ప్రతి తల్లీ పాలు త్రాగే పసిబిడ్డను మరచిపోతుంది. గర్భవతి తన గర్భాన్ని పడవేస్తుంది. ప్రజలు నీకు మైకంలో ఉన్నట్లు కనిపిస్తారు. నిజానికి వారు మైకంలో ఉండరు. కాని దైవ శిక్షే అంత తీవ్రంగా ఉంటుంది. 3. జనులలోని ఒకడు విషయ పరిజ్ఞానం లేకున్నప్పటికీ దేవుని విషయంలో వాదులాడతాడు. వాడు తలబిరుసు అయిన ప్రతి షైతానును అనుసరిస్తాడు. 4. వాడి గురించి ఏమని వ్రాసిపెట్టబడిందంటే; వాణ్ణి ఎవడు సావాసిగా చేసుకున్నా, వాడతనిని మార్గవిహీనుణ్ణి చేసేస్తాడు. అతనికి నరక యాతన వైపు దారి చూపుతాడు.

5. మానవులారా! తిరిగి బ్రతికించబడే విషయంలో మీకు ఏదన్నా సంశయం ఉంటే, (ఒక విషయం తెలుసుకోండి!) మేము మిమ్మల్ని మట్టితో పుట్టించాము. తరువాత వీర్య బిందువుతో, ఆ తరువాత ఘనీభవించిన రక్తంతో, అటుపిమ్మట మాంసపు ముద్దతో – రూపుదిద్దుకున్నదీ, రూపరహితమైనదీను – మీకు స్పష్టంగా తెలియపరుద్దామని. మరి మేము కోరిన దానిని, ఒక నిర్ధారిత గడువు వరకు మాతృగర్భాలలో ఆపి ఉంచుతున్నాము. దరిమిలా మేము మిమ్మల్ని శిశువు రూపంలో బయటికి తెస్తున్నాము – మరి మీరు పూర్తి యౌవనానికి చేరుకోవాలని. మీలోని ఒకరు (వృద్ధాప్యానికి) ముందే మరణిస్తారు. మరొకరు మరీ వృద్ధాప్యానికి చేర్చబడతారు – తెలిసిన మీదట కూడా ఏమీ తెలియని వారవుతారు. భూమి ఎండిపోయి ఉండటం నీవు చూస్తావు. తరువాత మేము దానిపై నీరు కురిపించగానే అది పులకిస్తుంది. ఉబికి వస్తుంది. రకరకాల ఆహ్లాదకరమయిన

మొక్కలను మొలకెత్తిస్తుంది. 6. ఇలా ఎందుకు జరుగుతుందంటే దేవుడే సత్యం గనక! ఆయన ప్రాణం లేని వాటిలో ప్రాణం పోస్తాడు గనక!! ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు. 7. ఇంకా ఏమిటంటే, ప్రళయం వస్తుంది. అందులో సందేహానికి తావేలేదు. దేవుడు గోరీలలో ఉన్నవారిని లేపుతాడు.

8. జ్ఞానంతో, మార్గదర్శకత్వంతో, జ్యోతిర్మయమైన గ్రంథంతో నిమిత్తం లేకుండానే దేవుని విషయంలో వితండవాదనకు దిగేవాడు కూడా ప్రజా బాహుళ్యంలో ఉన్నాడు. 9. గర్వంతో ప్రక్కకు తిరుగుతూ ... దైవమార్గం నుండి (జనులను) తప్పించాలనుకుంటాడు. వాడికి ప్రపంచంలోనూ పరాభవం తప్పదు. పరలోకంలోనయితే మేమతనికి దహించే అగ్ని యాతనను రుచి చూపిస్తాము. 10. ఇది నీ చేతులు చేసి పంపుకున్న దాని ఫలితం. దేవుడు మాత్రం తన దాసులకు అన్యాయం చేసేవాడు కాడు.

11. జనులలో ఇంకొకడి పరిస్థితి ఎటువంటిదంటే, అతను ఒడ్డున ఉండి దైవారాధన చేస్తుంటాడు. తనకు లాభం కలిగితే ఆరాధన విషయంలో స్థిరంగా ఉంటాడు. ఏదయినా పరీక్ష ఎదురయితే మాత్రం వెనక్కి మరలిపోతాడు. అతను ప్రపంచాన్నీ కోల్పోయాడు, పరలోకాన్ని కూడా. ఇదే స్పష్టమయిన నష్టమంటే.

12. అతను దైవాన్ని కాదని తనకు లాభంగానీ, నష్టంగానీ కలిగించలేని వాటిని మొరపెట్టుకుంటున్నాడు. మార్గభ్రష్టత్వానికి పరాకాష్ఠ అంటే ఇదే. 13. అతను ఎటువంటి దానిని మొరపెట్టుకుంటున్నాడంటే దాని నష్టం, దాని లాభంకన్నా ముందే వాటిల్లుతుంది. అతని ఈ సంరక్షకుడు ఎంత చెడ్డవాడు! అతని సావాసి ఎంత చెడ్డవాడు!! 14. నిశ్చయంగా దేవుడు విశ్వసించి, సదాచరణ చేసిన వారిని క్రింద సెలయేరులు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా దేవుడు కోరిన దానిని చేసి తీర్తాడు.

15. ఏ వ్యక్తి అయితే దేవుడు తనకు ప్రపంచంలోగానీ, పరలోకంలో

గానీ సహాయపడదని తలపోస్తాడో, అతను ఒక త్రాడు సహాయంతో ఆకాశానికి ఎక్కాలి. ఆ తరువాత దానిని కోసివేయాలి. ఈ ఉపాయం ద్వారానయినా అతని ఆగ్రహం చల్లారుతుందేమో చూసుకోవాలి. 16. ఈ విధంగా మేము ఖుర్ఆన్‌ను చాలా స్పష్టమయిన సూచనలతో అవతరింపజేశాము. నిశ్చయంగా దేవుడు తాను కోరిన వారికి సన్మార్గం చూపుతాడు.

17. నిశ్చయంగా ఎవరయితే విశ్వసించారో, మరెవరయితే యూదత్వాన్ని అవలంబించారో, సాబియీలుగా, క్రైస్తవులుగా, మజూసీలుగా ఉన్నారో, ఇంకా ఎవరయితే బహుదైవారాధనను అనుసరించారో – వారందరి మధ్య దేవుడు ప్రళయదినాన తీర్పు చేస్తాడు. నిశ్చయంగా దేవుడు ప్రతిదానికీ సాక్షిగా ఉన్నాడు.

18. ఏమిటీ, ఆకాశాలలో, భూమిలో ఉన్నవన్నీ దైవ సమక్షంలో సాష్టాంగపడటాన్ని నీవు చూడటం లేదా? ఇంకా సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పర్వతాలు, వృక్షాలు, పశువులు, మరెంతోమంది మనుషులు కూడా (సాష్టాంగపడటం జరుగుతోంది). మరెందరిపైనో శిక్ష రూఢీ అయింది. దేవుడే అవమానించిన వానికి గౌరవమిచ్చేవాడెవడూ ఉండడు. నిశ్చయంగా దేవుడు కోరినదల్లా చేస్తాడు.

19. ఇవీ ఆ ఇరువర్గాలు (విశ్వాసులు – అవిశ్వాసులు), అవి తమ ప్రభువు వ్యవహారాన్ని తీసుకుని ఘర్షణకు దిగాయి. కనుక సత్యాన్ని తిరస్కరించిన వారి కొరకు అగ్ని వస్త్రాలు కుట్టించబడతాయి. వారి తలల మీద నుంచి మరిగే నీరు కుమ్మరించబడుతుంది. 20. దాంతో వారి కడుపులలో ఉన్నవి సయితం కరిగిపోతాయి; చర్మాలు కూడా. 21. అక్కడ వారి కొరకు ఇనుప సుత్తులు ఉంటాయి. 22. వారెప్పుడు దుఃఖావేదనతో అక్కడి నుండి బయటపడదలిచినా, మళ్లీ అందులోనికే నెట్టివేయబడతారు. 'కాలే యాతనను రుచి చూస్తూ ఉండండి' (అని వారితో అనబడుతుంది).

23. నిశ్చయంగా ఎవరు విశ్వసించి, సత్కార్యాలు చేశారో దేవుడు

వారికి, దిగువ కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశం కల్పిస్తాడు. అక్కడ వారు స్వర్ణ కంకణాలు, ముత్యాలతో సత్కరించబడతారు. వారు ధరించే వస్త్రాలు పట్టు వస్త్రాలై ఉంటాయి. 24. ఇంకా వారికి పవిత్రమైన మాటలు పలికే సూచనలివ్వబడ్డాయి. స్తవనీయుడయిన దేవుని మార్గం వైపునకు వారికి దర్శకత్వం లభించి ఉంటుంది.

25. నిశ్చయంగా ఎవరయితే తిరస్కార వైఖరికి ఒడిగట్టి, దైవమార్గం నుండి, మానవులందరి కోసం మేము నిర్మించిన మస్జిదె హరామ్ (పవిత్ర కాబా గృహం) – అందులో స్థానిక పౌరులు, బయటి నుండి వచ్చేవారు సమానులే – నుండి కూడా అడ్డుకుంటున్నారో, ఇంకా ఎవరయితే అందులో అధర్మంగా దౌర్జన్యంతో కూడిన విధానాన్ని అవలంబిస్తున్నారో, వారికి మేము బాధాకరమయిన శిక్షను చవిచూపిస్తాము.

26. మేము ఇబ్రాహీమ్‌కు కాబా గృహ స్థలాన్ని చూపినపుడు (చేసిన తాకీదు ఇది) : 'నాకు సహవర్తులుగా ఎవరినీ ఎంచరాదు. నా గృహాన్ని ప్రదక్షిణ చేసేవారి కొరకు, నిలబడే వారి కొరకు, వంగే వారి కొరకు, ప్రణమిల్లే వారికొరకు పవిత్రం (పరిశుద్ధం)గా ఉంచాలి.

27. ఇంకా – హజ్జ్ యాత్రకై ప్రజల మధ్య ప్రకటన చెయ్యి. వారు పాదయాత్ర ద్వారానూ, బక్కచిక్కిన ఒంటెలపై స్వారీ అయి, దూర తీరాల నుండి నీ వద్దకు వస్తారు. 28 – తద్వారా వారు తమకు ప్రయోజనం కలిగించే స్థలాలకు చేరటానికి! నిర్ధారితమై ఉన్న కొన్ని దినాలలో దేవుడు ప్రసాదించిన జంతువులపై ఆయన నామం స్మరించటానికి!! తరువాత వాటిని మీరూ తినండి. కష్టాల్లో ఉన్న వారికీ తినిపించండి. 29. అనంతరం వారు తమ మురికిని దూరం చేసుకోవాలి. తమ మొక్కుబడులు నెరవేర్చుకోవాలి. ఇంకా ఆ ప్రాచీన గృహం (బైతుల్లాహ్) ప్రదక్షిణ చేసుకోవాలి.

30. ఇది పూర్తియింది. ఎవడయినా దేవుని నిషేధాజ్ఞలను గౌరవిస్తే అది, అతని పాలిట అతని ప్రభువు సన్నిధిలో ఎంతో శుభంగా పరిణమిస్తుంది.

మీకు చదివి వినిపించబడిన పశువులు తప్ప మిగిలినవన్నీ మీకు ధర్మసమ్మతం (హలాల్) చేయబడ్డాయి. కాబట్టి మీరు విగ్రహాల మాలిన్యానికి దూరంగా ఉండండి. వాస్తవ విరుద్ధమయిన మాటలకు కూడా దూరంగా ఉండండి.

31. ఏకాగ్రతతో దేవుని వైపునకే మరలండి. ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ (దేనినీ) కల్పించకండి. దైవానికి సాటి కల్పించేవాడు ఒక విధంగా ఆకాశం నుండి క్రిందపడిపోయిన వానితో సమానం. ఇప్పుడతన్ని గ్రద్దలైనా తన్నుకుపోతాయి లేదా గాలులైనా అతన్ని ఎగరేసుకుపోయి దూరస్థలంలో పడవేస్తాయి.

32. ఈ విషయం పూర్తయింది. ఇక ఎవడయినా దైవ చిహ్నాలను గౌరవిస్తున్నాడంటే, ఖచ్చితంగా అది హృదయాలలో ఉన్న భయభక్తులకు దర్పణమే. 33. మీరు వాటి ద్వారా ఒక నియమిత కాలం వరకు లబ్ధిపొందాలి. తరువాత వాటిని ఖుర్బానీ నిమిత్తం ప్రాచీన గృహం వైపునకు తోలుకుపోవాలి.

34. మేము ప్రతి సముదాయానికి ఖుర్బానీ ఇవ్వటాన్ని నిర్ధారించి ఉన్నాము – తద్వారా వారు దైవ ప్రసాదితమయిన పశువులపై దైవనామం స్మరించాలని! మరి మీ ఆరాధ్య దేవుడు ఒకే దేవుడు. కనుక మీరు ఆయనకే అంకితమవండి. (ప్రవక్తా!) వినయ వినమ్రతలు గలవారికి శుభవార్తను వినిపించు. 35. వారి పరిస్థితి ఎటువంటిదంటే; దైవప్రస్తావన రాగానే వారి హృదయాలు భయంతో కంపిస్తాయి. తమపై ఏ ఆపద వచ్చినా వారు సహనం వహిస్తారు. నమాజు వ్యవస్థకు కట్టుబడి ఉంటారు. మేము వారికి ప్రసాదించిన ఉపాధిలో నుండి ఖర్చుచేస్తూ ఉంటారు.

36. ఇంకా ఖుర్బానీ ఒంటెలను మేము మీ కోసం దైవ చిహ్నాలుగా చేశాము. వాటిలో మీకు మేలున్నది. కనుక వాటిని నిలబెట్టి, వాటిపై దైవనామం స్మరించండి. అవి ప్రక్కకు ఒరిగినమీదట వాటిని మీరూ తినండి. నోరు విప్పి అడగని, అవసరార్థులకూ, అడిగేవారికి కూడా తినిపించండి. ఈ విధంగా మేము ఈ జంతువులను మీకు స్వాధీనపర్చాము – మీరు

కృతజ్ఞులవుతారని! 37. దేవునికి వాటి మాంసం గానీ, వాటి రక్తంగానీ చేరదు. మీ భక్తి మాత్రమే దైవానికి చేరుతుంది. ఈ విధంగా దేవుడు వాటిని మీ అధీనంలో ఉంచాడు – తద్వారా మీరు దేవుని మార్గదర్శకత్వానికి గాను ఆయన ఘనతను కీర్తించాలని! (ప్రవక్తా!) సంకల్పశుద్ధితో సత్కార్యం చేసే వారికి శుభవార్తను వినిపించు.

38. నిశ్చయంగా దేవుడు విశ్వసించిన వారికి అండగా నిలుస్తాడు. నిశ్చయంగా దేవుడు నమ్మక ద్రోహులను, మేలును మరచిన వారిని ఇష్టపడడు. 39. కయ్యానికి కాలుదువ్విన వారితో యుద్ధం చేయటానికి అనుమతి ప్రదానం చేయబడింది. ఎందుకంటే వారిపై జులుం జరిగింది. నిశ్చయంగా దేవుడు వారికి సహాయం చేయగల సమర్థుడు. 40. వారు తమ ఇండ్ల నుండి అకారణంగా వెళ్లగొట్టబడ్డారు – కేవలం 'అల్లాహ్ మా ప్రభువు' అని అన్నంతమాత్రానికే! దేవుడే గనక ప్రజలలో కొందరిని మరికొందరి ద్వారా తొలగిస్తూ ఉండకపోతే ఆశ్రమాలు, చర్చీలు, ప్రార్థనాలయాలు, అల్లాహ్ నామం అత్యధికంగా స్మరించబడే మస్జిదులు నేలమట్టం చేయబడేవే. తనకు సహాయపడేవారికి అల్లాహ్ తప్పక సహాయపడతాడు. నిశ్చయంగా అల్లాహ్ బలశాలి, తిరుగులేని ఆధిక్యం కలవాడు.

41. వారెలాంటి వారంటే, మేము గనక వారికి భువిలో సుస్థిరతను ప్రసాదిస్తే వారు నమాజును స్థాపిస్తారు. జకాత్‌ను చెల్లిస్తారు. మంచిని చెయ్యమని ఆదేశిస్తారు. చెడు నుండి వారిస్తారు. సమస్త వ్యవహారాల పరిణామం దైవాధీనమై ఉంది.

42. ఒకవేళ వారు నిన్ను అసత్యవాదివంటూ త్రోసిపుచ్చినట్లయితే వారికి పూర్వం నూహ్, ఆద్, సమూద్ జాతుల వారు కూడా త్రోసిపుచ్చినవారే. 43. ఇబ్రాహీమ్ జాతివారు, లూత్ జాతివారు 44. మద్‌యన్ వాసులు కూడా ధిక్కరించారు. మూసా కూడా అసత్యవాదిగా చిత్రీకరించబడ్డాడు. మరి నేను తిరస్కారులకు కొంత విడుపు ఇచ్చాను. తరువాత నేను వారిని పట్టుకున్నాను. మరి నా పట్టు ఎంత కఠినంగా ఉంది!?

45. ఈ విధంగా మేము ఎన్నో జనపదాలను అంతమొందించాము. ఎందుకంటే అవి దుర్మార్గానికి ఒడిగట్టాయి. ఇప్పుడు ఆ బస్తీలు తమ కప్పులపై తల్లక్రిందులుగా పడి ఉన్నాయి. ఎన్నో బావులు పాడుబడి ఉన్నాయి. మరెన్నో మేడలు నిర్మానుష్యంగా ఉన్నాయి. 46. ఏమిటి, వారు భువిలో సంచరించలేదా? (ఒకవేళ సంచరించి, పరిశీలించి ఉంటే) వారి హృదయాలు వాటిని గ్రహించగలిగేవి. లేదా వారి చెవులు తద్వారా వినగలిగేవి. ఎందుకంటే కళ్లు గుడ్డివై ఉండవు. అయితే రొమ్ములలో ఉన్న హృదయాలు గుడ్డివై ఉంటాయి.

47. వారు నిన్ను శిక్ష కోసం తొందరపెడుతున్నారు. దేవుడు ఎట్టి పరిస్థితిలోనూ తన వాగ్దానానికి విరుద్ధంగా చేయడు. అయితే నీ ప్రభువు దృష్టిలో ఒక రోజంటే మీ లెక్క ప్రకారం వెయ్యేండ్లకు సమానం. 48. ఎన్నో జనావాసాలకు నేను వదులు ఇచ్చాను. అవి దౌర్జన్యం చేసేవి. తరువాత నేను వాటిని పట్టుకున్నాను. మరలిరావలసింది మాత్రం నా వద్దకే.

49. వారికి చెప్పు : 'ప్రజలారా! నేను స్పష్టంగా భయపెట్టేవాడను మాత్రమే.' 50. కాబట్టి విశ్వసించి, సత్కార్యాలు చేసిన వారికి క్షమాపణ ఉంది, గౌరవప్రదమైన జీవనోపాధి ఉంది. 51. మరెవరయితే మా సూచనలను పరాభవం పాల్జేసేందుకు పరుగులు తీస్తున్నారో, అలాంటివారే నరకవాసులు.

52. (ఓ ముహమ్మద్!) మేము నీకు పూర్వం ఏ సందేశహరుణ్ణి, ఏ ప్రవక్తను పంపినా, అతను ఏదన్నా పఠించినప్పుడల్లా షైతాన్ అతని పఠనంలో ఏదో ఒకటి కలుషితం చేసేవాడు. తరువాత దేవుడు షైతాన్ కాలుష్యాన్ని చెరిపివేసేవాడు. ఆ తరువాత దేవుడు తన సూక్తులను దృఢపరిచేవాడు. దేవుడు జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు. 53. ఎవరి హృదయాలలో రోగం ఉందో, మరెవరి హృదయాలు కఠినంగా ఉన్నాయో వారిని షైతాన్ కలుషితం చేసిన దాని ద్వారా పరీక్షించటానికి ఇలా జరిగింది. దుర్మార్గులైన వారు వ్యతిరేకతలో బహుదూరం వెళ్ళిపోయారు. 54. జ్ఞానం వొసగబడినవారు,

ఇది నీ ప్రభువు తరఫు నుండి ఉందన్న విషయాన్ని తెలుసుకుని, దానిని విశ్వసించాలని! వారి హృదయాలు ఆయన సమక్షంలో మెత్తబడాలని!! దేవుడు విశ్వసించే వారికి తప్పకుండా రుజుమార్గం చూపుతాడు.

55. తిరస్కరించేవారు ఎల్లకాలం దాని విషయంలో సంశయంలోనే పడి ఉంటారు. కడకు వారిపై అకస్మాత్తుగా ప్రళయఘడియ వచ్చిపడుతుంది. లేదా ఒక దుర్దినపు శిక్ష వచ్చిపడుతుంది. 56. ఆ రోజు సర్వ సత్తాధికారం దేవునిదే అయి ఉంటుంది. ఆయన వారి మధ్య తీర్పు చేస్తాడు. కనుక విశ్వసించి, సత్కార్యాలు చేసినవారు అనుగ్రహ భాగ్యాలతో నిండిన స్వర్గ వనాలలో ఉంటారు. 57. మరెవరయితే తిరస్కారానికి పాల్పడి, మా సూక్తుల (సూచనల)ను అసత్యాలుగా చిత్రీకరించారో వారికి అవమానభరితమైన శిక్ష ఉంటుంది.

58. మరెవరు దైవమార్గంలో తమ స్వస్థలాలను వదలిపెట్టారో, తరువాత చంపబడ్డారో లేదా చనిపోయారో – వారికి అల్లాహ్ అవశ్యంగా అత్యుత్తమమయిన ఉపాధిని ప్రసాదిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్‌యే శ్రేష్ఠమైన ఉపాధి ప్రదాత. 59. వారు ఇష్టపడే చోటికి ఆయన వారిని చేరుస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞాని, సహనశీలుడు.

60. ఇది అయిపోయింది. తనను బాధించిన దానికి తగినట్లుగా ప్రతీకారం తీర్చుకున్న వ్యక్తిపై మళ్లీ అత్యాచారం జరిగితే దేవుడు అతనికి తప్పక తోడ్పడతాడు. నిశ్చయంగా దేవుడు మన్నించి వదలిపెట్టేవాడు, క్షమాభిక్ష పెట్టేవాడు.

61. ఇలా ఎందుకంటే దేవుడు రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేస్తాడు. పగటిని రాత్రిలోనికి ప్రవేశింపజేస్తాడు. నిశ్చయంగా దేవుడు సర్వం వినేవాడు, సర్వం చూస్తున్నవాడు. 62. ఇలా ఎందుకంటే దేవుడే సత్యం గనక, దైవాన్ని వదలి వారు మొరపెట్టుకునేవన్నీ అసత్యం గనక. నిశ్చయంగా దేవుడే సర్వోన్నతుడు, అందరికన్నా గొప్పవాడు.

63. దేవుడు ఆకాశం నుండి నీటిని కురిపించటాన్ని మీరు చూడటం

లేదా? తరువాత భూమి సస్యశ్యామలం అయింది. నిశ్చయంగా దేవుడు సునిశిత దృష్టి కలవాడు. అన్నీ ఎరిగినవాడు. 64. భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనదే. నిశ్చయంగా దేవుడు నిరపేక్షాపరుడు, స్తుతించ దగినవాడు.

65. భూమిలో ఉన్న వస్తువులన్నింటినీ దేవుడు ఏ విధంగా మీకు ఉపయుక్తంగా చేశాడో మీరు గమనించటం లేదా? ఓడను కూడా! అదీ ఆయన ఆదేశానుసారమే సముద్రంలో నడుస్తుంది. ఇంకా ఆయనే నింగిని నేలపై పడిపోకుండా నిలిపి ఉంచాడు – అయితే ఆయన ఆజ్ఞ అయినప్పుడు అది నిలవదు. నిశ్చయంగా దేవుడు ప్రజల యెడల మృదు స్వభావి, కరుణాకరుడు. 66. మీకు జీవన దానం ఇచ్చిన వాడాయనే. తరువాత ఆయనే మీకు మరణమొసగుతాడు. ఆయనే మిమ్మల్ని తిరిగి బ్రతికిస్తాడు. నిశ్చయంగా మానవుడు మేలును మరిచేవాడు.

67. మేము ప్రతి సముదాయానికీ ఒక రీతిని నిర్ధారించాము. వారు దానిని అవలంబించేవారు. కాబట్టి వారు ఈ వ్యవహారంలో నీతో తగాదా పడకూడదు. నీవు మాత్రం నీ ప్రభువు వైపు పిలుస్తూ ఉండు. నిశ్చయంగా నీవు సరైన మార్గాన ఉన్నావు. 68. ఒకవేళ వారు నీతో గొడవపడితే వారికి చెప్పేయ్ : 'మీరు చేసేదంతా దైవానికి తెలుసు. 69. దేవుడు ప్రళయదినాన మీరు విభేదించుకునే విషయంపై మీ మధ్య తీర్పు ఇస్తాడు.' 70. ఏమిటి, భూమ్యాకాశాలలోని ప్రతి వస్తువు గురించి దైవానికి తెలుసు అన్న సంగతి నీకు తెలియదా? సమస్తం ఒక గ్రంథంలో ఉంది. నిశ్చయంగా ఇది దైవానికి చాలా తేలిక.

71. వారు నిజదైవాన్ని కాదని, ఆయన ఏ ప్రమాణాన్నీ అవతరింపజేయని వాటిని పూజిస్తున్నారు. పోనీ, వాటి గురించి వారివద్ద ఏదన్నా జ్ఞానాధారం ఉందా అంటే అదీ లేదాయె. దుర్మార్గులకు సహాయపడేవాడెవడూ ఉండడు. 72. వారికి స్పష్టమయిన మా సూక్తులను చదివి వినిపించినపుడు, సత్య తిరస్కారుల ముఖాలపై నీకు అసహన సూచనలు కనిపిస్తాయి. మా సూక్తులను వినిపించేవారిపై వారు

విరుచుకుపడటానికి సిద్ధంగా ఉన్నారా! అనిపిస్తుంది. (ప్రవక్తా!) వారికి చెప్పు: 'దీనికన్నా ఘోరమయిన విషయమేమిటో నేను మీకు తెలుపనా? అదే అగ్ని. తిరస్కారులకు దేవుడు దాని గురించి వాగ్దానం చేసి ఉన్నాడు. అదెంతో చెడ్డ గమ్యస్థానం.

73. ప్రజలారా! ఒక ఉపమానం ఇవ్వబడుతోంది. శ్రద్ధగా వినండి. మీరు దైవాన్ని కాదని ఎవరిని మొరపెట్టుకుంటున్నారో వారంతా ఏకమై ఒక ఈగనయినా సృష్టించలేరు. ఒకవేళ ఈగ వారి నుండి దేనినయినా లాక్కుపోతే, వారు ఆ వస్తువును దాని నుండి విడిపించుకోనూలేరు. సహాయం అర్థించేవారూ బలహీనులే, సహాయం అర్థించబడేవారు కూడా బలహీనులే. 74. వారు దేవుని విలువను గుర్తించవలసిన విధంగా గుర్తించలేదు. నిశ్చయంగా దేవుడు మహాబలుడు, ఆధిపత్యం కలవాడు. 75. దేవుడు దైవదూతలలో నుండి, మానవులలో నుండి కూడా తన సందేశ వాహకులను ఎన్నుకుంటాడు. నిశ్చయంగా దేవుడు అంతా వినేవాడు, అంతా గమనించేవాడూను. 76. వారికి ముందు ఏమున్నదో, వారి వెనుక ఏముందో ఆయనకు తెలుసు. సమస్త వ్యవహారాలు దేవుని వైపునకే మరల్చబడతాయి.

77. ఓ విశ్వాసులారా! రుకూ సజ్దాలు చేయండి. మీ ప్రభువును ఆరాధించండి. మేలుతో కూడిన పనులు చేస్తూ ఉండండి – తద్వారా మీరు సాఫల్యం పొందే అవకాశం ఉంది. 78. దైవమార్గంలో సాధన చేయవలసిన విధంగా సాధన చేయండి. ఆయనే మిమ్మల్ని (తన కార్యం కొరకు) ఎన్నుకున్నాడు. ధర్మావలంబన విషయంలో ఆయన మిమ్మల్ని ఏ విధంగానూ ఇబ్బందుల పాల్జేయలేదు. మీ పితామహుడైన ఇబ్రాహీం ధర్మం (పై నిలబడండి), ఆయనే మీకు 'ముస్లింలు (విధేయులు)' అని నామకరణం చేశాడు. ఇంతకు ముందూ, ఈ ఖుర్ఆన్‌లో కూడా (మీ పేరు ఇదే) – తద్వారా ప్రవక్త మీపై సాక్షిగా ఉండాలని! మీరేమో మానవాళికి సాక్షులుగా ఉండాలని!! అందుకే నమాజును స్థాపించండి. జకాత్‌ను ఇస్తూ ఉండండి. అల్లాహ్‌ను దృఢంగా ఆశ్రయించండి. ఆయనే మీ యజమాని. ఎంత మంచి యజమాని! ఎంత మంచి సహాయకుడు!!

# 23. అల్ మూ'మినూన్ (విశ్వాసులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (18) 1. నిస్సందేహంగా విశ్వసించినవారు సఫలీకృతుల య్యారు. 2. వారు తమ నమాజులలో అణకువ కలిగి ఉంటారు. 3. ఇంకా, వారు వ్యర్థ విషయాల పట్ల అనాసక్తత చూపుతారు. 4. ఇంకా, వారు జకాత్ చెల్లిస్తూ ఉంటారు. 5. ఇంకా, వారు తమ మర్మస్థానాలను కాపాడుకునే వారై ఉంటారు. 6. కాని తమ అర్ధాంగుల నుండి, (షరీయతు ప్రకారం) తమ యాజమాన్యంలోకి వచ్చిన వనితల నుండి కాపాడుకోకపోయినప్పటికీ వారు నిందార్హులు కారు. 7. అయితే ఎవరయినా ఇంతకు మించి కూడా ఆశిస్తే – అలాంటివారే అవధులు మీరిన వారవుతారు. 8. ఇంకా, వారు తమ అప్పగింతల, వాగ్దానాల విషయంలో కడు అప్రమత్తంగా వ్యవహరిస్తారు. 9. ఇంకా, వారు తమ నమాజులను కాపాడుకుంటారు. 10 – ఇలాంటి వారే వారసులు కానున్నారు. 11. వారు ఫిర్‌దౌస్ (అనే స్వర్గవనాల) వారసత్వం పొందుతారు. వారందులో సదా ఉంటారు.

12. మేము మానవుణ్ణి మట్టి సారంతో సృష్టించాము. 13. తరువాత మేమతన్ని నీటి (వీర్య) బిందువు రూపంలో ఒక సురక్షిత స్థానంలో ఉంచాము. 14. తరువాత మేమా నీటి బిందువును (ఒంటిని అంటిపెట్టుకుని ఉండే) జిగట పదార్థంగా చేశాము. తరువాత దానిని మాంసపు ముద్దగా చేశాము. తరువాత ఆ మాంసపు ముద్దలో ఎముకలను సృజించాము. దరిమిలా ఆ ఎముకలపై మాంసం ఎక్కించాము. ఆపైన మేము దానిని సరికొత్త సృష్టిగా ఆవిష్కరించాము. కనుక అల్లాహ్ ఎంతో శుభప్రదమైనవాడు. అత్యుత్తమ సృష్టికర్త. 15. ఆ తరువాత మీరు తప్పక మరణించవలసి ఉంది. 16. పిమ్మట మీరు ప్రళయదినాన అవశ్యంగా లేపబడతారు.

17. మేము మీపైన ఏడు గగన మార్గాలు (సప్తాకాశాలు)

నిర్మించాము. మేము సృష్టితాల విషయంలో ప్రమత్తతకు లోనవలేదు. 18. మేము ఆకాశం నుండి ఒక లెక్క ప్రకారం వర్షపు నీటిని కురిపించాము. తరువాత మేము దానిని భూమిలో నిలిపి ఉంచాము. దానిని వెనక్కి తీసుకునే సామర్థ్యం కూడా మాకుంది. 19. తరువాత దానితో మేము మీ కోసం ఖర్జూర తోటలను, ద్రాక్షతోటలను పండించాము. మీ కొరకు వాటిలో పండ్లు పుష్కలంగా ఉన్నాయి. వాటిని మీరు తింటున్నారు. 20. సినాయ్ పర్వత శ్రేణి నుండి వెలికివచ్చే వృక్షాన్ని కూడా మేమే సృష్టించాము. అది నూనెను తీసుకుని మొలకెత్తుతుంది. తినేవారికి కూరగా కూడా ఉపయోగపడుతుంది. 21. మీ కొరకు పశువులలోనూ గుణపాఠం ఉంది. మేము మీకు వాటి కడుపులలో ఉన్న పదార్థం నుండి త్రాపుతున్నాము. మీ కొరకు వాటిలో మరెన్నో ప్రయోజనాలు కూడా ఉన్నాయి. మీరు వాటిని తింటారు కూడాను. 22. మీరు వాటిపై స్వారీ చేస్తారు. ఓడలపై కూర్చుని ప్రయాణం చేస్తారు.

23. మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపాము. అతనిలా అన్నాడు : 'నా జాతి జనులారా! మీరు దైవారాధన చేయండి. ఆయన తప్ప మీకు మరో దేవుడు లేడు. ఏమిటి, మీరు భయపడరా?' 24. అతని జాతిలో తిరస్కారానికి ఒడిగట్టిన సర్దారులు ఇలా అన్నారు : 'ఈయనా మీలాంటి ఒక మనిషే కదా! ఈయన మీపై పెత్తందారుగా చెలామణీ కావాలనుకుంటున్నాడు. దేవుడే గనక తలచుకుంటే దైవదూతలను పంపి ఉండేవాడు. మేమిలాంటి విషయాన్ని మా పూర్వీకుల ద్వారా ఎన్నడూ వినలేదు. 25. ఇతనొక పిచ్చిపట్టిన వ్యక్తి. కాబట్టి కొన్నాళ్ళపాటు ఇతని విషయంలో నిరీక్షించండి.'

26. నూహ్ ఇలా నివేదించుకున్నాడు : 'నా ప్రభూ! నీవు నాకు తోడ్పడు. వీళ్లు నన్ను అసత్యవాది' అని ధిక్కరించారు. 27. అందువల్ల మేమతనికి వహీ పంపాము – "నీవు నా పర్యవేక్షణలో మా నిర్దేశానుసారం ఓడ నిర్మించుకో. మరి మా ఆజ్ఞ వచ్చేసినపుడు, భూమిలో నుండి నీరు

పెల్లుబికినప్పుడు, అన్ని రకాల జంతువుల్లో నుంచి ఒక్కో జత చొప్పున తీసుకుని (ఓడలో) పయనం సాగించు. నీ ఇంటి వారలను కూడా ఎక్కించుకో. అయితే వారిలో ఎవరి గురించి ముందుగానే నిర్ణయమైపోయిందో వారిని వదిలేయ్. అన్యాయానికి ఒడిగట్టిన వారిని గురించి మాత్రం నాతో మాట్లాడకు. ఖచ్చితంగా వారు మునిగిపోయేవారే!

28. నువ్వూ, నీ వెంట ఉన్నవారంతా ఓడలో ఎక్కిన మీదట ఇలా ప్రార్థించు : 'దుర్మార్గ జనుల బారి నుండి మమ్మల్ని రక్షించిన దైవానికే కృతజ్ఞతలు.' 29. ఇంకా ఇలా వేడుకో : 'నా ప్రభూ! శుభప్రదమైన రీతిలో నన్ను దించు. నీవే అత్యుత్తమంగా దించేవాడవు." 30. నిశ్చయంగా ఇందులో సూచనలున్నాయి. నిశ్చయంగా మేము దాసులను పరీక్షిస్తూ ఉంటాము.

31. వారి తదనంతరం మేము మరో తరాన్ని ప్రభవింపజేశాము. తరువాత వారి వద్దకు స్వయంగా వారిలో నుండే ఒక ప్రవక్తను పంపాము. (అతని సందేశం కూడా ఇదే), 'మీరు మీ నిజ దైవాన్నే సేవించండి. ఆయన తప్ప మీకు మరో ఆరాధ్య దైవం లేదు. ఏమి, మీరు భయపడరా?' 33. (సమాధానంగా) తిరస్కారులు, పరలోకంలో సమావేశమవటాన్ని త్రోసిపుచ్చినవారు, ప్రాపంచిక జీవితంలో మేము సుఖ విలాసాలను ప్రసాదించినటువంటి అతని జాతి నాయకులు ఇలా అన్నారు : 'ఇతనూ మీలాంటి ఓ సామాన్య మానవుడే. మీరు తినేదే ఇతనూ తింటున్నాడు. మీరు త్రాగేదే ఇతనూ త్రాగుతున్నాడు. 34. మీలాంటి ఒక మనిషి చెప్పినట్లుగా మీరు గనక మసలుకున్నారంటే, మీరు నష్టపోవటం ఖాయం.'

35. ఏమిటి, మీరు మరణించి, మట్టిగా, ఎముకలుగా మారిపోయిన మీదట కూడా, మళ్లీ మీరు వెలికి తీయబడతారని ఈ వ్యక్తి అంటున్నాడా? 36. అసంభవం. మీకు చేయబడే ఈ వాగ్దానం నెరవేరటమనేది అసంభవం. 37. జీవితమంటే ప్రస్తుతమున్న ఈ ప్రాపంచిక జీవితమే. మనం ఇక్కడే చస్తాము, ఇక్కడే బ్రతుకుతాము. మనం మళ్లీ తిరిగి లేపబడటం అనేది

ఉండదు. 38. ఇక ఈ వ్యక్తి విషయానికివస్తే, ఇతను దైవానికి అసత్యాన్ని ఆపాదిస్తున్నాడు. మేము ఇతన్ని నమ్మబోము.'

39. ప్రవక్త ఇలా వేడుకున్నాడు : 'నా ప్రభూ! వీళ్ళ ధిక్కార వైఖరికి ప్రతిగా నాకు సహాయపడు.' 40. సెలవీయబడింది : 'తమ వైఖరిపై వీళ్ళు బాధపడే సమయం శీఘ్రంగానే వస్తుంది.' 41. ఎట్టకేలకు సత్యబద్ధంగానే వారిని ఒక భయంకరమయిన కేక కబళించింది. తరువాత మేము వాళ్ళను చెత్తాచెదారంగా చేసేశాము. దుర్మార్గ జనులు దూరమవుగాక!

42. మరి వారి అనంతరం మేము ఎన్నో తరాలను పుట్టించాము. 43. ఏ సముదాయం కూడా తన వాగ్దాన సమయానికి ముందుకు పోవటంగానీ, దానికి వెనుక ఉండటం గానీ జరగలేదు. 44. తరువాత మేము నిరాఘాటంగా మా ప్రవక్తలను పంపాము. ఎప్పుడు, ఏ సముదాయం వద్దకు దాని ప్రవక్త వచ్చినా, వారు అతనిని అబద్ధీకుడంటూ త్రోసిపుచ్చారు. అందుకే మేము ఒకరి తరువాత ఒకరిని తుదముట్టించి, వారిని 'జరిగిన కథలు'గా చేసివేశాము. కనుక నమ్మినడుచుకోని జనులు దూరమవుగాక!

45. తరువాత మేము మూసాను, అతని సోదరుడైన హారూనును పంపాము – మా సూచనలతో, స్పష్టమయిన ప్రమాణంతో సహా! 46. ఫిరౌన్ మరియు అతని ఆస్థాన ప్రముఖుల వద్దకు (పంపాము). కాని వారు అహంకారం ప్రదర్శించారు. అసలే వారు గర్విష్ఠులు. 47. వారిలా అన్నారు : 'ఏమిటి, మా లాంటి ఇద్దరు మానవమాత్రులను మేము నమ్మి నడుచుకోవాలా? వాస్తవానికి వీళ్ళ జాతివారు మా వద్ద కట్టుబానిసలుగా ఉన్నారు.' 48. ఆ విధంగా వారు వారిరువురినీ అబద్ధీకులుగా చిత్రీకరించి, తరువాత అంతమొందించబడ్డారు. 49. మేము మూసాకు గ్రంథం ప్రసాదించాము – తద్వారా వారు మార్గదర్శకత్వం పొందాలని!

50. మేము మర్యమ్ కుమారుణ్ణి, అతని తల్లిని ఒక సూచనగా చేశాము. ఇంకా మేము వారిద్దరికీ ఓ ఎత్తయిన ప్రదేశంలో నివాసం

కల్పించాము. అదెంతో ప్రశాంత స్థలం. అక్కడ నీటి ఊట ఒకటి ఉండేది.

51. ఓ ప్రవక్తలారా! పరిశుద్ధమయిన వస్తువులను తినండి. సదాచరణ చేయండి. మీరు ఆచరించేదంతా మాకు తెలుసు. 52. మీ ఈ ధర్మం ఒకే ధర్మం. నేను మీ ప్రభువును. కనుక మీరు నాకు భయపడండి.

53. తరువాత జనులు పరస్పరం (విభేదించుకుని) తమ ధర్మాన్ని ముక్కచెక్కలు చేసుకున్నారు. తరువాత ప్రతి వర్గం వారు తమ వద్ద ఉన్నదానిపైన్నే సంతుష్టులయ్యారు. 54. కాబట్టి వారిని వారి భ్రమలోనే కొంతకాలం పాటు పడి ఉండనివ్వు. 55. ఇంతకీ వారేమనుకుంటున్నారు? మేము వారికి విరివిగా సిరిసంపదలను, సంతానాన్ని ఇస్తుండటం చూసి, 56. మేము వారికి లబ్ది చేకూరుస్తామని వారు భావిస్తున్నారా? అసలు వారు విషయాన్ని అర్థం చేసుకునే రకం కాదు.

57. నిశ్చయంగా ఎవరయితే తమ ప్రభువు పట్ల గల భయంతో భీతిల్లుతూ ఉంటారో, 58 మరెవరయితే తమ ప్రభువు సూచనలను నమ్ముతారో, 59 మరెవరయితే తమ ప్రభువుకు సహవర్తులుగా ఎవరినీ చేర్చకుండా ఉంటారో, 60 ఇంకా (దైవమార్గంలో) ఇవ్వగలిగినది ఇస్తూ కూడా, తాము తమ ప్రభువు వద్దకు మరలి పోవలసి ఉందనే ఆలోచనతో ఎవరి హృదయాలు వణుకుతూ ఉంటాయో 61 – ఇలాంటివారే సత్కార్యాల మార్గంలో ముందుకు దూసుకుపోయేవారు. వారు వాటిని నిర్వర్తించటంలో అందరికన్నా ముందు ఉంటారు. 62. మేము ఎవరిపైన కూడా అతని శక్తికి మించిన బరువును వేయము. మా వద్ద సత్యం పలికే గ్రంథమొకటి ఉంది. వారికెలాంటి అన్యాయం జరుగదు.

63. పైగా వారి హృదయాలే దానిపట్ల అజాగ్రత్తకు లోనై ఉన్నాయి. ఇవిగాక వారు చేసే మరికొన్ని దుశ్చేష్టలు కూడా ఉన్నాయి. 64. చివరకు మేము వారిలోని శ్రీమంతులను శిక్షించటానికి పట్టుకున్నప్పుడు, వారు

ఆర్తనాదాలు చేస్తారు. 65. 'ఈ రోజు ఫిర్యాదు చేయవలసిన అవసరం లేదు. ఇప్పుడు మా తరఫున మీకెలాంటి సహాయం లభించదు. 66. మీకు నా వచనాలు వినిపించబడినపుడు, మీరు వీపు త్రిప్పుకుని పారిపోయేవారు. 67. వాటిపట్ల గర్వం ప్రదర్శిస్తూ! కథ చెప్పేవానిని విడిచిపోయినట్లుగా!!'

68. మరయితే వారు ఈ వాక్కుపై యోచన చేయలేదా? లేక తమ పూర్వీకుల వద్దకు రాని విషయం వారివద్దకు వచ్చినందుకు తటపటాయిస్తున్నారా? 69. లేక తమ ప్రవక్తను గుర్తుపట్టకపోవటం చేత వారతన్ని తృణీకరిస్తున్నారా? 70. లేక అతనికి ఉన్మాదం ఆవహించిందని అంటున్నారా? వాస్తవానికి అతను వారి వద్దకు సత్యం తీసుకుని వచ్చాడు. కాని వారిలో అనేకులకు సత్యమంటేనే గిట్టదు. 71. సత్యమే గనక వారి మనోరథాన్ని ఈడేర్చేవిధంగా ఉంటే భూమ్యాకాశాలు, వాటి మధ్య నున్నవన్నీ విచ్ఛిన్నమైపోయేవి. మేమైతే వారి వద్దకు వారి జ్ఞాపిక (ఉపదేశము)ను పంపాము. కాని వారు మాత్రం తమ జ్ఞాపిక పట్ల విముఖులవుతున్నారు.

72. (ప్రవక్తా!) నువ్వేమైనా వారి నుండి పారితోషికం అడుగుతున్నావా? నీ ప్రభువు ఇచ్చే పారితోషికమే నీ కొరకు ఎంతో మేలైనది. ఆయన అత్యుత్తమ ఉపాధి ప్రదాత. 73. నిశ్చయంగా నీవు వారిని రుజుమార్గం వైపునకు పిలుస్తున్నావు. 74. అయితే పరలోకంపై విశ్వాసం లేనివారు మార్గం నుండి వైదొలగిపోయారు.

75. ఒకవేళ మేము వారిపై జాలి చూపినా, వారికి కలిగే బాధలను దూరం చేసినాసరే వారు మార్గవిహీనులై తమ తలబిరుసుతనంలో మునిగి ఉంటారు. 76. మేము వారిని శిక్షించేందుకు పట్టుకున్నాము. అయినా వారు తమ ప్రభువు ముందు లొంగటంగానీ, తమ అశక్తతను అభివ్యక్తం చేయటంగానీ జరగలేదు. 77. చివరికి మేము వారిపై కఠిన శిక్షా ద్వారాన్ని తెరచివేసినపుడు దిగ్భ్రాంతికి లోనవుతారు.

78. ఆయనే మీకు చెవులు, కళ్ళు, హృదయాలను ఇచ్చినవాడు.

అయినా మీరు కృతజ్ఞతలు తెలుపుకునేది బహు తక్కువ. 79. ఆయనే మిమ్మల్ని అవనిలో వ్యాపింపజేశాడు. ఎట్టకేలకు మీరు ఆయన వద్దకే సమీకరించ బడతారు. 80. జీవన్మరణాల ప్రదాత కూడా ఆయనే. రేయింబవళ్ళలో వచ్చే మార్పు కూడా ఆయన అధీనంలోనే ఉంది. మరయితే మీరు అర్థం చేసుకోరా?

81. అంతచేసీ వీరు తమ పూర్వీకులు చెప్పినమాటే చెప్పారు. 82. ఇలా అన్నారు : 'ఏమిటి, మేము చచ్చి, మట్టై, ఎముకలైనాక కూడా మళ్లీ లేపబడతామా? 83. ఇలాంటి వాగ్దానమే మాకూ, మా తాతముత్తాతలకు కూడా చేయబడింది. ఇవి పాతకాలపు కట్టుకథలు తప్ప మరేమీ కావు.'

84. (ప్రవక్తా!) వారిని అడుగు : 'ఈ భూమి, అందులో ఉన్న సమస్తం ఎవరిదో మీకు తెలిస్తే (చెప్పండి)? 85. **'అల్లాహ్‌దే'** అని వారంటారు. 'మరయితే మీరు ఆలోచించరా?' అని అడుగు. 86. వారిని ఇలా అడుగు: 'సప్తాకాశాలకు యజమాని ఎవరు? మహోన్నతమైన అధికార పీఠానికి (అర్ష్‌కు) అధిపతి ఎవరు?' 87. **'అల్లాహ్‌యే'** అని వారంటారు. 'మరలాం టప్పుడు మీరు భయభక్తులతో ఎందుకు వ్యవహరించరు?' అని వారిని నిలదీసి అడుగు. 88. ఇలా అడుగు : 'ప్రతి వస్తువుకు సంబంధించిన అధికారం హస్తగతమై ఉన్న వాడెవడు? శరణు ఇచ్చేవాడెవడు? ఎవరికి వ్యతిరేకంగా ఎలాంటి శరణు లభించదో ఆయన ఎవరు? మీకు తెలిస్తే చెప్పండి?' 89. **'ఇవన్నీ అల్లాహ్‌కే స్వంతం'** అని వారంటారు. వారితో చెప్పు:'మరలాంటప్పుడు మీరు ఎటువైపు నుండి వశీకరణకు గురవుతున్నారు?'

90. నిజానికి మేము వారివద్దకు సత్యాన్ని తీసుకువచ్చాము. కాని వారే అసలు అబద్ధాలకోరులు. 91. అల్లాహ్ ఎవరినీ కుమారునిగా చేసుకోలేదు. ఆయనతో పాటు మరో ఆరాధ్య దైవం కూడా లేదు. ఒకవేళ అలాంటిదేదయినా ఉండి ఉంటే ప్రతి దేవుడూ తాను సృష్టించిన వాటిని తీసుకుని వేరైపోయేవాడు. ఆధిపత్యం కోసం ఒకడింకొకడిపై దండెత్తి

వచ్చేవాడు. వారు కల్పించే వాటికి అల్లాహ్ అతీతుడు, పరిశుద్ధుడు. 92. ఆయన నిగూఢమై ఉన్న దానిని, బహిర్గతమై ఉన్నదానినీ ఎరిగినవాడు. వారు కల్పించే సాటి (షిర్క్)కి ఆయన అతీతుడు, చాలా ఉన్నతుడు.

93. (ప్రవక్తా!) ఇలా అర్థించు : 'నా ప్రభూ! వీరికి (సత్యతిరస్కారులకు) చేయబడుతున్న వాగ్దానాన్ని నీవు నాకు గనక చూపితే, 94. ఓ ప్రభూ! నన్ను దుర్మార్గ జనులలో మాత్రం చేర్చకు.' 95. దేని గురించి మేము వారికి వాగ్దానం చేస్తున్నామో, దానిని మేము నీకు చూపగల సమర్థులం.

96. నీవు చెడును అత్యుత్తమమైన రీతిలో దూరం చెయ్యి. వారు కల్పించేదంతా మాకు బాగా తెలుసు. 97. ఇలా అను : 'ఓ నా ప్రభూ! పైశాచిక శక్తుల దుష్ప్రేరణల నుండి నేను నీ శరణు వేడుతున్నాను. 98. నా ప్రభూ! అవి నా దరి చేరటం నుండి కూడా నీ శరణు కోరుతున్నాను.'

99. కడకు వారిలో ఎవరికయినా మరణం ఆసన్నమైనపుడు, అతనిలా అంటాడు : 'ఓ ప్రభూ! నన్ను వాపసు పంపించు. 100 – నేను వదలి వచ్చిన వాటిద్వారా ఏమయినా సత్కార్యాలు చేసుకోవటానికి.' అసంభవం. అది అతను పలికే ఒక (వట్టి) మాట మాత్రమే. వారు తిరిగి లేపబడే రోజు వరకూ వారి ముందర ఒక అడ్డు తెర ఉంటుంది. 101. ఎప్పుడయితే శంఖం ఊదబడుతుందో, ఆ రోజు వారి మధ్య ఎలాంటి బంధుత్వం ఉండదు. ఒండొకరి (మంచీ చెబ్బరలను) విచారించటం కూడా జరగదు. 102. ఎవరి త్రాసు పళ్ళెం బరువుగా ఉంటుందో – అలాంటి వారే సాఫల్యం పొందుతారు. 103. మరెవరి త్రాసు పళ్ళెం తేలికగా ఉంటుందో – అలాంటివారే తమ స్వయానికి నష్టం చేసుకున్న వారవుతారు. వారు నరకంలో శాశ్వతంగా ఉంటారు. 104. వారి ముఖాలను అగ్ని మాడ్చివేస్తూ ఉంటుంది. వారందులో అందవికారులవుతుంటారు.

105. 'ఏమిటి, నా వచనాలు మీకు చదివి వినిపించబడలేదా? అయినప్పటికీ మీరు వాటిని అసత్యమంటూ త్రోసిపుచ్చేవారు.' 106. వారంటారు : 'మహాప్రభూ! మా దౌర్భాగ్యం మమ్మల్ని ఆవహించింది.

మేము భ్రష్టుపట్టిన జనంగా ఉండిపోయాం. 107. మా ప్రభూ! మమ్మల్ని దీన్నుండి బయటికి తియ్యి. ఒకవేళ మేము మళ్లీ అలాగే చేస్తే, ముమ్మాటికీ మేము దుర్మార్గులమే అవుతాము.' 108. దేవుడంటాడు : 'దూరమవండి. ఇందులోనే పడి ఉండండి. నాతో మాట్లాడవద్దు.'

109. నా దాసులలో ఒక వర్గం వారు ఇలా వేడుకునేవారు : 'మా ప్రభూ! మేము విశ్వసించాము. కనుక నీవు మమ్మల్ని క్షమించు. మాపై దయజూపు. నీవు దయజూపే వారిలోకెల్లా అత్యుత్తముడవు.' 110. కాని మీరు మాత్రం వారిని నవ్వులాటగా తీసుకున్నారు. అస్తమానం మీరు వారి వెంటపడి మమ్మల్నే మరచిపొయ్యారు. అయినా మీరు వేళాకోళంలోనే పడి ఉన్నారు. 111. ఈ రోజు నేను వారికి, వారి సంయమనానికి గాను తగిన ప్రతిఫలం ఇచ్చాను. నిశ్చయంగా వారే విజేతలు.

112. ఈ విధంగా సెలవీయబడుతుంది : 'సరేగాని, మీరు భువిపై ఎన్నేండ్లు ఉండి ఉంటారు?' 113. వారంటారు : 'మేము ఒక రోజో లేక ఒక రోజుకన్నా తక్కువ సమయమో ఉండి ఉంటాం. కావాలంటే లెక్కపెట్టేవారిని అడగండి.' 114. సెలవీయబడుతుంది : 'మీరు తక్కువ సమయమే ఉన్నారు. ఈ విషయాన్ని మీరు (ముందే) తెలుసుకుంటే ఎంత బాగుండేది!'

115. ఏమిటి, మేము మిమ్మల్ని లక్ష్యరహితంగా (ఆషామాషీగా) పుట్టించామని, మా వైపునకు మరలిరావటమనేది జరగదని మీరు భావించారా? 116. మహోన్నతుడు అల్లాహ్. నిజసార్వభౌముడు. ఆయన తప్ప మరో దేవుడు లేనే లేడు. గౌరవ పీఠానికి అధిపతి ఆయన. 117. ఎవడయినా, తన వద్ద ఏ ఆధారమూ లేకపోయినాసరే అల్లాహ్‌తో పాటు వేరొక దైవాన్ని మొరపెట్టుకుంటే, అతని లెక్క అతని ప్రభువు వద్ద ఉంది. నిశ్చయంగా సత్యతిరస్కారులు కృతార్థులు కాలేరు. 118. (ప్రవక్తా!) ఈ విధంగా పలుకు : 'ఓ నా ప్రభూ! నన్ను క్షమించు. నన్ను కరుణించు. నీవు అత్యుత్తమంగా కరుణించేవాడవు.'

# 24. అన్ నూర్ (కాంతి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. మేము అవతరింపజేసిన ఒక సూరా ఇది. దీనిని మేమే విధించాము. ఇందులో మేము సుస్పష్టమయిన ఆయతులను (ఆదేశాలను) అవతరింపజేశాము – మీరు వాటిని జ్ఞాపకముంచుకుంటారని! 2. వ్యభిచారిణి అయిన స్త్రీ, వ్యభిచారి అయిన పురుషుడు – ఇద్దరిలో ప్రతి ఒక్కరికీ నూరేసి కొరడా దెబ్బలు కొట్టండి. మీరు దేవుని యందు, అంతిమ దినమునందు విశ్వాసం గల వారే అయితే దైవధర్మం విషయంలో (దైవాజ్ఞను అమలుపరిచే విషయంలో) కనికరం పనికిరాదు. వారిరువురినీ శిక్షించే సమయంలో ముస్లింలలోని ఒక వర్గం అక్కడ ఉండాలి. 3. వ్యభిచారి అయిన పురుషుడు వ్యభిచారిణి అయిన స్త్రీని లేదా ముష్రిక్కు వనితను తప్ప మరొకరిని వివాహమాడలేడు. అదేవిధంగా వ్యభిచారం చేసే స్త్రీ వ్యభిచారి అయిన మగవాడిని లేదా ముష్రిక్కు మగవాడిని మాత్రమే మనువాడగలదు. ఇది విశ్వాసుల కొరకు నిషేధించబడింది.

4. ఎవరయినా శీలవతులైన మహిళలపై అపనిందను మోపి, (దానికి సంబంధించిన) నలుగురు సాక్షుల్ని తేలేకపోతే, వారికి ఎనభై కొరడా దెబ్బలు కొట్టండి. వారి సాక్ష్యాన్ని ఎన్నటికీ స్వీకరించకండి. ఇలాంటివారే అవిధేయులు. 5. అయితే దీని తరువాత ఎవరయినా పశ్చాత్తాపపడి, తమ ప్రవర్తనను సరిదిద్దుకుంటే నిశ్చయంగా దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు.

6. ఎవరయినా తమ భార్యలపై అపనిందను మోపి, దానికి సంబంధించి అతని దగ్గర స్వయంగా తాను తప్ప మరెవరూ సాక్షులుగా లేనపుడు, ఆ వ్యక్తి సాక్ష్యమివ్వవలసిన పద్ధతి ఏమిటంటే; అతను నాలుగుసార్లు దేవుని మీద ప్రమాణం చేసి, తాను నిజం చెబుతున్నానని అనాలి. 7. అయిదవసారి – తాను చెప్పేది అబద్ధమైనట్లయితే తనపై దేవుని శాపం పడుగాక! అనాలి. 8. ఇక ఆ స్త్రీ నుంచి శిక్ష తొలగిపోయే మార్గం ఏమిటంటే;

ఆమె నాలుగుసార్లు దేవుని మీద ప్రమాణం చేసి, అతను అబద్ధం చెబుతున్నాడని అనాలి. 9. అయిదవసారి, అతను గనక తన ఆరోపణలో సత్యవంతుడైనట్లయితే, తనపై దేవుని ఆగ్రహం విరుచుకుపడుగాక! అనాలి. 10. మీపైనే గనక దైవానుగ్రహం, ఆయన దయ లేకున్నట్లయితే (మీరు ఇరుక్కుపోయేవారే). దేవుడు మాత్రం పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడు, వివేక సంపన్నుడు.

11. నిశ్చయంగా ఈ అపనిందను మోపినది కూడా మీలోని ఒక ముఠాయే. మీరు దీనిని మీ పాలిట కీడుగా తలపోయకండి. పైగా ఇది మీ పాలిట శ్రేయస్కరమైనది. వారిలో ప్రతి ఒక్కరికీ, వారు సముపార్జించిన పాప ఫలం లభిస్తుంది. వారిలో పెద్ద వాటా పొందినవాడికి ఘోరమైన శిక్ష పడుతుంది.

12. మీరు దీని గురించి విన్నప్పుడు ముస్లిములైన పురుషులు, ముస్లిములైన స్త్రీలు ఒండొకరి గురించి సదభిప్రాయంతో, 'ఇది పచ్చి అభాండమే' అని ఎందుకు అనలేదు? 13. ఆ వ్యవహారంపై వారు నలుగురు సాక్షుల్ని ఎందుకు తేలేదు? వారు సాక్షుల్ని తేలేకపోయినపుడు – వారే దైవ సమక్షంలో అబద్ధాలకోరులయ్యారు.

14. ఇహపరాలలో మీపైన దైవానుగ్రహం, ఆయన దయ లేకుండి నట్లయితే, ఏ మాయమాటల్లో మీరు పడిపోయారో దానికిగాను మీపై పెద్ద ఆపదే విరుచుకుపడేది. 15. అప్పుడు మీరు దానిని మీ నోటిమాటగా వ్యాపింపజేశారు. మీకు ఏమాత్రం తెలియని దానిని మీ నోటితో చిలువలు పలువలుగా చెప్పుకున్నారు. మీరు దానిని చాలా చిన్న విషయం అనుకున్నారు. కాని దేవుని దృష్టిలో అది చాలా పెద్ద విషయం. 16. మీరు దానిని గురించి విన్నప్పుడు, 'ఇలాంటి మాట నోటితో చెప్పటం మనకు ఎంతమాత్రం శోభించదు. (దేవా!) నీవు పరమ పవిత్రుడవు. ఇదైతే పెద్ద అభాండమే' అని ఎందుకు అనలేదు? 17. మీరు విశ్వాసులే అయితే ఇక మీదట ఎన్నడూ ఇలా చేయరాదని దేవుడు మీకు బోధపరుస్తున్నాడు. 18. దేవుడు మీకు

తన ఆదేశాలను విశదపరుస్తున్నాడు. దేవుడు మహా జ్ఞాని, వివేకవంతుడు.

19. ఎవరయితే ముస్లిములలో నీతిబాహ్యత సర్వసామాన్యం కావాలని కోరుకుంటున్నారో, వారికి ఇహపరాలలో వ్యధాభరితమయిన శిక్ష ఉంటుంది. దైవానికి అంతా తెలుసు, మీకు తెలియదు. 20. మీపైన దైవానుగ్రహం, ఆయన కృప లేకుండినట్లయితే (ఘోరమైన నష్టమే జరిగిపోయేది). అయితే దేవుడు మృదువుగా వ్యవహరించేవాడు, కనికరం కలవాడూను.

21. ఓ విశ్వాసులారా! మీరు షైతాన్ పాద చిహ్నాలలో నడవకండి. ఎవడు షైతాన్ పాద చిహ్నాలను అనుసరిస్తాడో, అతనిని షైతాన్ నీతిబాహ్యత వైపునకు, చెడు పని వైపునకే పురికొల్పుతాడు. మీపైనే గనక దైవానుగ్రహం, ఆయన కృప లేకున్నట్లయితే, మీలో ఏ ఒక్కడూ పవిత్రుడుగా మిగిలి ఉండేవాడు కాడు. అయితే దేవుడు తాను కోరినవారిని పరిశుద్ధపరుస్తాడు. దేవుడు సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు.

22. మీలోని సంపన్నులు, ఆస్తీఅంతస్తులు కలవారు తమ బంధువులకు, నిరుపేదలకు, దైవమార్గంలో వలసపోయిన వారికి 'ఇవ్వబోము (ఆర్థిక సాయం చేయము)' అని ఒట్టేసుకోరాదు. పైగా వారిని క్షమించాలి. వారిపట్ల సడలింపుల వైఖరిని అవలంబించాలి. ఏమిటి, దేవుడు మిమ్మల్ని క్షమించటాన్ని మీరు ఇష్టపడరా? దేవుడు మాత్రం క్షమాశీలి, దయాశీలి.

23. నిశ్చయంగా ఎవరయితే శీలవతులు, అభంశుభం తెలియని అతివలు, విశ్వసించిన వనితలపై అభాండం మోపుతారో వారు ప్రపంచంలోనూ, పరలోకంలోనూ శపించబడ్డారు. వారికి మహా ఘోరమైన యాతన కలదు. 24. ఆ రోజు వారి నోళ్ళు వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయి. వారి చేతులు, వారి కాళ్ళు సయితం వారు చేసిన పనులను గురించి చెబుతాయి. 25. ఆ రోజు దేవుడు వారికి తగిన ప్రతిఫలం ఇస్తాడు – దేవుడే సత్యమని, గుట్టును విప్పేవాడని వారు తెలుసుకుంటారు.

26. చెడిపోయిన ఆడవారు చెడిపోయిన మగవారికి తగినవారు.

చెడిపోయిన మగవారు చెడిపోయిన ఆడ వారికి తగినవారు. పవిత్ర స్త్రీలు పవిత్ర పురుషులకు తగినవారు, పవిత్ర పురుషులు పవిత్ర స్త్రీలకు తగినవారు. వారు (కపటులు) పలికే మాటలతో వీరికెలాంటి సంబంధం లేదు. వీరికి మన్నింపు ఉంది. గౌరవప్రదమైన ఉపాధి ఉంది.

27. విశ్వసించిన వారలారా! మీరు మీ ఇండ్లలోకి తప్ప ఇతరుల ఇండ్లలోకి – వారి అనుమతి పొందనంతవరకూ, ఆ ఇంటివారికి 'సలామ్' చేయనంతవరకూ – ప్రవేశించకండి. ఇదే మీ కొరకు మేలైనది. దీనిని మీరు గుర్తుంచుకుంటారని ఆశించబడుతోంది. 28. ఒకవేళ మీకక్కడ ఎవరూ కనిపించకపోతే మీకు అనుమతి లభించనంత వరకూ అందులోనికి (ఆ ఇంటిలోనికి) వెళ్ళవద్దు. తిరిగి వెళ్ళమని ఒకవేళ మీతో అనబడితే (సంస్కారవంతుల మాదిరిగా) తిరిగి వెళ్ళిపోండి. అదే మీ కొరకు శ్రేయోదాయకమైనది. మీరు చేసేదంతా దైవానికి తెలుసు. 29. ఎవరూ నివసించని ఇండ్లలో – మీకు చెందిన ఉపయోగకరమయిన వస్తువు ఏదయినా అక్కడ ఉన్నప్పుడు – ప్రవేశించటంలో తప్పులేదు. మీరు వ్యక్తపరచేది, దాచేది అంతా దేవునికి తెలుసు.

30. (ప్రవక్తా!) విశ్వసించిన పురుషులతో, వారు తమ దృష్టిని కాస్త క్రిందికి ఉంచమని, తమ మర్మస్థానాలను రక్షించుకోమని చెప్పు. ఇదే వారికొరకు పరిశుద్ధమైనది. నిశ్చయంగా వారు చేసేదంతా దైవానికి తెలుసు.

31. (ప్రవక్తా!) విశ్వసించిన వనితలతో కూడా – వారు తమ చూపులను కాస్త క్రిందికి ఉంచాలని, తమ మర్మ స్థానాలను కాపాడుకోవాలని, బహిర్గతమై ఉండేది తప్ప, తమ అలంకరణను బహిర్గతం చెయ్యరాదని, తమ వోణీని తమ వక్షస్థలంపై కప్పి ఉంచాలని, తమ అందచందాలను తమ భర్తలు లేదా తమ తండ్రులు లేదా తమ భర్తల తండ్రులు లేదా తమ కుమారులు లేదా తమ భర్తల కుమారులు లేదా తమ సోదరులు లేదా తమ సోదరుల కుమారులు లేదా తమ అక్కాచెల్లెళ్ళ కొడుకులు లేదా తమతోటి స్త్రీలు లేదా తమ యాజమాన్యంలో ఉన్న బానిస స్త్రీ పురుషులు లేదా ఇతరత్రా

ఉద్దేశాలు లేకుండా తమకు లోబడి ఉంటున్న పురుషులు లేదా స్త్రీల గుప్తజ్ఞానం గురించి ఇంకా ఏమీ తెలియని బాలురు – వీరు తప్ప వేరితరుల ముందు బహిర్గతం చేయరాదని చెప్పు. గోప్యంగా ఉన్న తమ సింగారం గురించి ఇతరులకు తెలిసిపోయేవిధంగా వారు తమ కాళ్ళను నేలపై కొడుతూ నడవరాదని కూడా చెప్పు. ఓ విశ్వాసులారా! మీరంతా కలసి దేవుని వైపునకు పశ్చాత్తాపభావంతో మరలండి – తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు.

32. మీలో అవివాహితులుగా ఉన్న వారి వివాహం జరిపించండి. ఇంకా మీ బానిస పురుషులలో, బానిస స్త్రీలలో వివాహానికి యోగ్యులైన వారి వివాహం కూడా జరిపించండి. ఒకవేళ వారు పేదవారై ఉంటే, దేవుడు తన అనుగ్రహంతో వారిని ధనవంతుల్ని చేస్తాడు. దేవుడు విశాల సంపన్నుడు, సర్వం తెలిసినవాడు. 33. నికాహ్ చేసుకునే స్తోమతలేనివారు, దేవుడు తన అనుగ్రహంతో వారికి కలిమిని ప్రసాదించే వరకూ ఇంద్రియ నిగ్రహాన్ని అలవరచుకోవాలి. మీ బానిసలలో ఎవరయినా (మీకు నిర్ణీత ధనం ఇచ్చి లేదా మీ సేవలు చేసి) మీతో విడుదలకు సంబంధించిన లిఖిత పూర్వక ఒప్పందం (ముకాతబత్) చేసుకోదలిస్తే – వారిలో మీకు ఆ దక్షత కనిపించినట్లయితే – వారికి వ్రాతపత్రం వ్రాసి ఇవ్వండి. దేవుడు మీకు ప్రసాదించిన ధనంలో నుండి వారికీ కొంత ఇవ్వండి. మీ బానిస స్త్రీలు సౌశీల్యవతులుగా ఉండదలచినపుడు, వారిని పడుపువృత్తికై బలవంత పెట్టకండి. కేవలం మీ ప్రాపంచిక స్వలాభాల కోసం వాళ్ళపై ఒత్తిడి తీసుకు రావటం ధర్మం కాదు. ఒకవేళ ఎవరయినా వారిని (ఈ తార్పుడు చేష్టకై) బలవంతం చేస్తే, ఈ బలాత్కారం తరువాత దేవుడు (ఆ అభాగినులను) క్షమించేవాడు, కనికరించేవాడు. 34. నిశ్చయంగా మేము మీ వైపునకు స్పష్టమయిన సూచనలను అవతరింపజేశాము. మీకు పూర్వం గడచిన వారి ఉపమానాలను కూడా ఇచ్చాము. భయభక్తులు గల వారికి హితబోధ కూడా చేశాము.

35. అల్లాహ్ ఆకాశాలకు, భూమికి కాంతి. ఆయన కాంతిని గూటిలో ఉన్న దీపంతో పోల్చవచ్చు. ఆ దీపం ఒక గాజు చిమ్నీలో ఉంది. ఆ గాజు

ఉజ్వలమయిన నక్షత్రం మాదిరిగా ఉంది. అదొక శుభవంతమైన జైతూన్ వృక్షపు నూనెతో వెలిగించబడుతోంది. అది తూర్పుకుగానీ, పడమరకు గానీ చెందినది కాదు. దాని నూనె అగ్గి లేకుండానే – దానంతట అదే – ప్రజ్వలమవుతుంది. కాంతిపై కాంతి! అల్లాహ్ తాను కోరిన వారికి తన కాంతి వైపునకు మార్గదర్శకత్వం వహిస్తాడు. అల్లాహ్ జనుల కొరకు ఉదాహరణలను ఇస్తున్నాడు. అల్లాహ్‌కు ప్రతిదీ క్షుణ్ణంగా తెలుసు.

36. ఏ గృహాల ఔన్నత్యాన్ని పెంచాలని, వేటిలో తన నామ స్మరణ జరగాలని అల్లాహ్ ఆదేశించాడో వాటిలో (వారు) ఉదయం, సాయంత్రం అల్లాహ్‌ను ధ్యానిస్తూ ఉంటారు. 37. వారిని వారి వర్తకంగానీ, క్రయవిక్రయాలుగానీ దైవనామస్మరణ నుండి ఏమార్చలేవు. నమాజును స్థాపించటం నుండి, జకాత్‌ను చెల్లించటం నుండి కూడా అవి విస్మరణకు గురిచెయ్యలేవు. ఏ రోజున హృదయాలు, కనుగుడ్లు తలక్రిందులైపోతాయో దానికి వారు భయపడుతూ ఉంటారు. 38. వారి మంచి పనులకు గాను దేవుడు వారికి మంచి ప్రతిఫలం ఇవ్వటానికి! తన అనుగ్రహంతో వారికి మరింతగా వొసగటానికి!! దేవుడు తాను కోరిన వారికి లెక్కలేనంత ఉపాధిని ఇస్తాడు.

39. మరెవరయితే తిరస్కరించారో వారి కర్మలు చదునైన ప్రదేశంలో నిగనిగలాడే ఒయాసిస్సు లాంటివి. దప్పిక గొన్నవాడు చూసి దానిని నీరుగా భావిస్తాడు. తీరా దానిని సమీపించినపుడు అక్కడ ఏమీ ఉండదు. అతనక్కడ దైవాన్ని కనుగొంటాడు. ఆయన అక్కడికక్కడే అతని లెక్కను తేల్చివేస్తాడు. లెక్క తేల్చటంలో దేవుడు వడిగలవాడు. 40. లేదా (వారి కర్మల ఉపమానం) లోతైన సముద్రంలోని చీకట్ల వంటిది. కెరటంపై కెరటం ఎగిసిపడుతోంది! పైనుండి కారు మబ్బులు క్రమ్ముకుని ఉన్నాయి. ఉపరితలంలో అనేక చీకట్లు అలుముకున్నాయి. ఒకవేళ ఎవరయినా తన చేతిని బయటికి తీస్తే, దాన్ని కూడా అతను చూడలేని పరిస్థితి! దేవుడు ఎవరికి వెలుగును ఇవ్వడో అతనికి వెలుగన్నదే ఉండదు.

41. ఏమిటి, భూమ్యాకాశాలలో ఉన్న సమస్త వస్తువులు, రెక్కలు చాచి విహరిస్తున్న పక్షులు కూడా దేవుని పవిత్రతను కొనియాడుతుండటాన్ని నీవు చూడటం లేదా? వాటిలో ప్రతిదానికీ తన నమాజ్ గురించీ, తన కీర్తన గురించి తెలుసు. అవి చేసేదంతా దైవానికి ఎరుకే. 42. భూమ్యాకాశాల రాజరికం దైవానిదే. సమస్తం ఆయన వద్దకే మరలిపోవలసి ఉంది.

43. ఏమిటి, దేవుడు మేఘ మాలికలను నడిపించటాన్ని మీరు గమనించటం లేదా? మరి ఆయనే వాటిని పరస్పరం అనుసంధానం చేస్తున్నాడు. తరువాత వాటిని ఒకదానిపై ఒకటిగా పేర్చుతున్నాడు. తరువాత వాటి మధ్యలో నుండి వర్షం కురవటం నీవు చూస్తావు. మరి ఆయనే ఆకాశం నుండి, పర్వతాల (లాంటి మేఘాల) నుండి వడగళ్ల వాన కురిపిస్తాడు. వాటిని తాను కోరినవారిపై పడవేస్తాడు. తాను కోరిన వారి నుండి వాటిని తొలగిస్తాడు. ఆయన యొక్క మెరుపు తీగ చూపులను ఎగరేసుకుపోయినట్టే ఉంటుంది. 44. దేవుడు రేయింబవళ్ళను మారుస్తూ ఉంటాడు. నిశ్చయంగా ఇందులో కళ్ళున్నవారికి గుణపాఠ సూచన ఉంది.

45. దేవుడు ప్రతి జీవమున్న దానిని నీటితో సృష్టించాడు. మరి వాటిలో కొన్ని తమ పొట్ట ఆధారంగా ప్రాకుతుండగా, మరి కొన్ని రెండు కాళ్ళపై సంచరిస్తున్నాయి. ఇంకా కొన్ని నాలుగు కాళ్ళపై నడుస్తున్నాయి. దేవుడు తాను కోరిన దానిని సృష్టిస్తాడు. నిశ్చయంగా దేవుడు ప్రతిదీ చేయగల సమర్థుడు. 46. నిశ్చయంగా మేము స్పష్టంగా విశదీకరించే వచనాలను (ఆయతులను) అవతరింపజేశాము. దేవుడు తాను కోరిన వారికి రుజుమార్గం వైపు దర్శకత్వం వహిస్తాడు.

47. 'మేము దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించాము. ఇంకా మేము విధేయత చూపాము' అని వారు (కపటులు) అంటున్నారు. అయితే ఆనక వారిలోని ఒక వర్గం వారు వెనుతిరిగిపోతారు. అలాంటివారు విశ్వసించరు. 48. దైవప్రవక్త వారిమధ్య తీర్పు ఇచ్చే నిమిత్తం వారిని దేవుడు మరియు దైవప్రవక్త వైపునకు పిలిచినపుడు, వారిలోని ఒక వర్గం వారు విముఖులై పోతారు. 49. ఒకవేళ వారికి హక్కు లభిస్తుందనుకుంటే, వారతని వైపు

కడు వినయంతో వస్తారు. 50. ఏమిటి, వారి హృదయాలలో రోగం ఉందా? లేక వారు సంశయంలో పడి కొట్టుమిట్టాడుతున్నారా? లేక దేవుడు, దైవప్రవక్త తమకు అన్యాయం చేస్తారని భయపడుతున్నారా? యదార్థానికి వారే అన్యాయ పరులు.

51. నిశ్చయంగా విశ్వసించినవారి మాట ఎలా ఉంటుందంటే; దైవప్రవక్త వారి వివాదాలపై న్యాయనిర్ణయం గైకొనే నిమిత్తం, వారిని దైవం మరియు దైవప్రవక్త వైపునకు రండి అని పిలిచినపుడు, వారు 'మేము విన్నాము, శిరసావహించాము' అని అంటారు. అలాంటివారే సాఫల్యం పొందేవారలు. 52. ఎవడు దేవునికి, దైవప్రవక్తకు విధేయత చూపుతాడో, దైవానికి భయపడుతూ, ఆయన ఆగ్రహం నుండి తప్పించుకుంటాడో – ఇలాంటివారే విజేతలు.

53. నీవు గనక వారికి ఆజ్ఞాపిస్తే (ఇండ్ల నుండి) బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నామని వారు దేవునిపై ప్రమాణం చేస్తారు. చాలా గట్టి ప్రమాణమే చేస్తారు. వారికి చెప్పు : 'ప్రమాణాలు చేయకండి. నియమానుసారం విధేయత చూపటం ముఖ్యం. మీరు చేసేదంతా దేవునికి తెలుసు.' 54. వారితో అను: దైవానికి విధేయత చూపండి. దైవప్రవక్త పట్ల విధేయతాభావంతో మసలుకోండి. ఒకవేళ మీరు మరలిపోతే ప్రవక్తపై వేయబడిన కార్యభారం వరకే అతను బాధ్యుడు. మీపై ఉన్న కార్యభారానికి మీరు బాధ్యులు. మీరు అతనికి విధేయులై ఉన్నప్పుడే మీకు సన్మార్గం ప్రాప్తిస్తుంది. సందేశాన్ని స్పష్టంగా చేరవేయటం వరకే దైవప్రవక్త బాధ్యత.

55. మీలో విశ్వసించి, సత్క్రియలాచరించిన వారికి దేవుడు వాగ్దానం చేశాడు – వారి పూర్వీకులకు భువిలో అధికారం ఇచ్చినట్లే వారికి కూడా అధికారం ఇస్తానని, తాను వారి కోసం వారి జీవన ధర్మాన్ని స్థిరపరుస్తానని, వారు ఎదుర్కొంటున్న భయాందోళనలను, తరువాత శాంతిభద్రతలుగా పరివర్తనం చేస్తానని (వాగ్దానం చేశాడు). వారు కేవలం నన్నే ఆరాధిస్తారు. దేనినీ నాకు సాటి కల్పించరు. దీని మీదట కూడా ఎవరయినా తిరస్కార వైఖరికి ఒడిగడితే – అలాంటి వారే అవిధేయులు.

56. నమాజ్‌ను స్థాపించండి. జకాత్ చెల్లించండి. దైవప్రవక్తకు విధేయత కనబరచండి – మీరు కరుణించబడే అవకాశం ఉంది. 57. తిరస్కార వైఖరిని అవలంబించిన వారు రాజ్యంలో (భువిలో) చెలరేగి, మమ్మల్ని లొంగదీసుకుంటారని తలపోయకు. నరకాగ్నే వారి నివాస స్థలం. అది అత్యంత దుర్భరమైన గమ్యస్థానం.

58. విశ్వసించిన వారలారా! మీ బానిస స్త్రీపురుషులు, ప్రాజ్ఞతకు చేరని మీ పిల్లలు మూడు వేళల్లో మీ అనుమతిని తీసుకుని మరీ (లోనికి) రావాలి – (1) ఉదయం (ఫజ్ర్) నమాజ్‌కు ముందు, (2) మధ్యాహ్నం మీరు మీ బట్టలు విడిచి ఉన్నప్పుడు (విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు), (3) ఇషా (రాత్రి) నమాజు తరువాత. ఈ మూడు వేళలు మీ ఏకాంత (పరదాలో ఉండవలసిన) వేళలు. ఈ మూడు వేళలు మినహా వారిపైన గానీ, మీపైన గానీ ఎలాంటి ఆంక్షలు లేవు. మీలో ఒకరు ఇంకొకరి దగ్గరకు పదే పదే వస్తూపోతూ ఉండవలసినవారే. ఈ విధంగా దేవుడు మీ కొరకు తన ఆదేశాలను విశదీకరిస్తున్నాడు. దేవుడు సమస్తం తెలిసినవాడు, యుక్తిపరుడు. 59. మరి మీ పిల్లలు ప్రాజ్ఞతకు చేరిన మీదట వారు కూడా, తమ పూర్వీకులు అనుమతి పొందినట్లే అనుమతి పొంది రావాలి. ఇదేవిధంగా దేవుడు తన ఆజ్ఞలను మీకు విపులీకరిస్తున్నాడు. దేవుడు జ్ఞానసంపన్నుడు, వివేకధనుడు. 60. పెళ్ళి మీద ఆశ వదులుకున్న వృద్ధ స్త్రీలు తమ ఒంటిపైని దుప్పట్లను (బురఖాలను) తీసేసినా ఫరవాలేదు. కాకపోతే తమ అందాలంకరణను ప్రదర్శించే ఉద్దేశం వారిలో ఉండకూడదు. ఒకవేళ వారు కూడా జాగ్రత్తపడితే అది వారికే మేలు. దేవుడు అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు.

61. గుడ్డివానిపైగానీ, కుంటివానిపైగానీ, రోగగ్రస్తునిపై గానీ, ఖుద్దుగా మీపైనగానీ – మీరు మీ ఇండ్లలో నుంచి అయినా, లేదా మీ తండ్రీతాతల ఇండ్ల నుంచి అయినా లేదా మీ తల్లుల ఇండ్ల నుంచి అయినా లేదా మీ అన్నదమ్ముల ఇండ్ల నుంచి అయినా లేదా మీ అక్కాచెల్లెళ్ళ ఇళ్ళ నుంచి అయినా లేదా మీ పినతండ్రుల ఇళ్ళ నుంచి అయినా లేదా మీ మేనత్తల ఇళ్ళ నుంచి అయినా లేదా మీ మేనమామల ఇళ్ళ నుంచి అయినా

లేదా మీ పినతల్లుల ఇళ్ళ నుంచి అయినా లేదా తాళపు చెవులు మీ అధీనంలో ఉన్న ఇళ్ళ నుంచి అయినా లేదా మీ స్నేహితుల ఇళ్ళనుంచి అయినా - ఏమయినా (ఆహార పదార్థాలు) తీసుకుని తింటే అందులో ఎలాంటి ఆక్షేపణా లేదు. మీరంతా కలసి తిన్నా, వేర్వేరుగా తిన్నా అందులో అభ్యంతరం ఏమీ లేదు. అయితే మీరు ఇండ్లలో ప్రవేశించేటప్పుడు మాత్రం మీ వారికి సలాం చేయండి. ఇది దేవుని తరఫున నిర్ధారించబడిన శుభకరమయిన, పవిత్ర మయిన ప్రార్థన. ఈ విధంగా దేవుడు మీకు తన ఆజ్ఞలను విడమరచి చెబుతున్నాడు - మీరు అర్థం చేసుకుంటారని.

62. దేవునిపై, ఆయన ప్రవక్తపై దృఢ విశ్వాసం కలిగి ఉన్నవారే సిసలయిన విశ్వాసులు. వారు ఏదయినా సామూహిక కార్యం సందర్భంగా దైవప్రవక్త వెంట ఉన్నప్పుడు, ఆయన అనుమతి పొందనంతవరకూ వారెక్కడికీ వెళ్ళకూడదు. (ప్రవక్తా!) నీ నుండి అనుమతి పొందేవారే నిజానికి దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించేవారలు. కాబట్టి వారు ఎప్పుడయినా ఏదన్నా తమ పనిపై నీ నుండి సెలవు కోరితే, వారిలో నీవు కోరిన వారికి సెలవు ఇస్తూ ఉండు. ఇంకా వారి క్షమాపణకై దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉండు. నిశ్చయంగా దేవుడు క్షమాశీలుడు, దయాసాగరుడు.

63. (విశ్వాసులారా!) మీరు ప్రవక్త పిలుపును, మీరు ఒండొకరిని పిలుచుకునే సాధారణ పిలుపుగా భావించకండి. మీలో ఒకరి చాటున మరొకరు నక్కుతూ (సమావేశం నుండి) మెల్లగా జారుకునే వారి గురించి దైవానికి తెలుసు. కాబట్టి ప్రవక్త ఆజ్ఞకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నవారు తాము ఏదన్నా ఉపద్రవంలో చిక్కుకుంటామేమోనని లేదా వ్యథాభరితమయిన శిక్ష ఏదన్నా తమను చుట్టుకుంటుందేమోనని భయపడాలి. 64. గుర్తుంచుకోండి! నిశ్చయంగా భూమ్యాకాశాలలో ఉన్నదంతా దేవునిదే. మీరేస్థితిలో ఉన్నదీ ఆయనకు బాగా తెలుసు. అందరూ ఆయన వద్దకు రప్పించబడిన రోజు, వారు చేసుకున్నదంతా ఆయన వారికి తెలియపరుస్తాడు. దేవుడు ప్రతిదీ క్షుణ్ణంగా తెలిసినవాడు.

# 25. అల్ ఫుర్ఖాన్ (గీటురాయి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. లోకవాసులందరినీ సావధానపరిచేదిగా ఉండేటందుకు తన దాసునిపై గీటురాయి (ఖుర్ఆన్)ని అవతరింపజేసిన దేవుడు ఎంతో శుభకరుడు. 2. భూమ్యాకాశాల సార్వభౌమత్వం ఆయనదే. ఆయన ఎవరినీ కుమారునిగా చేసుకోలేదు. ఆయన సార్వభౌమత్వంలో ఆయనకు భాగస్వామి కూడా ఎవడూ లేడు. ఆయన ప్రతి వస్తువునూ సృష్టించటంతో పాటు, దాని విధి విధానాన్ని నిర్ధారించాడు. 3. అయినప్పటికీ జనులు నిజదైవాన్ని వదలి, దేనినీ సృష్టించలేని వారిని, స్వయంగా సృష్టించబడిన వారిని తమ ఆరాధ్య దైవాలుగా చేసుకున్నారు. వారు తమ స్వయానికి కూడా ఏదయినా లాభంగానీ, నష్టంగానీ చేకూర్చుకునే అధికారం కలిగిలేరు. ఒకరి జీవన్మరణా లను శాసించే అధికారం గానీ, మరణానంతరం తిరిగి బ్రతికించే అధికారం గానీ వారికి లేదు.

4. 'ఇది అతను కల్పించుకున్న అబద్ధం తప్ప మరొకటి కాదు. ఈ వ్యవహారంలో మరి కొంతమంది కూడా ఇతనికి తోడ్పడ్డారు' అని తిరస్కారులు చెబుతున్నారు. ఆ విధంగా వీళ్లు అన్యాయానికి, అబద్ధానికి ఒడిగట్టారు. 5. వారు ఇంకా ఇలా అంటారు : 'ఇవి పూర్వీకుల కట్టుకథలు. వీటిని ఇతను సంకలనం చేయించుకున్నాడు. అవి అతనికి ఉదయం సాయంత్రం వినిపించబడుతున్నాయి.' 6. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'భూమ్యాకాశాల రహస్యాలను ఎరిగినవాడే దీనిని అవతరింపజేశాడు. నిశ్చయంగా ఆయన క్షమాసాగరుడు, దయాకరుడు.'

7. ఇంకా వారిలా అంటారు : 'ఏం ప్రవక్తండీ ఇతను? ఇతనూ (అందరివలెనే) తింటున్నాడు, బజార్లలో తిరుగాడుతున్నాడు. ఇతని వెంట

ఉంటూ భయపెట్టే నిమిత్తం ఇతని వద్దకు ఓ దైవదూత అయినా ఎందుకు పంపబడలేదు? 8. లేదా అతని కోసం ఓ నిధి ఎందుకు దింపబడలేదు? లేదా అతని కోసం ఓ తోటయినా ఉంటే దాన్నుండి అతను తింటూ ఉండేవాడు కదా!' దుర్మార్గులు ఈ విధంగా కూడా ప్రేలారు : 'మీరొక మంత్రగ్రస్తుడైన మనిషిని అనుసరిస్తున్నారు.' 9. చూశావా! వారు నీ గురించి ఎటువంటి ఉపమానాలిస్తున్నారో! అసలు వారు దారి తప్పారు. ఇక వారు దారికి రారు.

10. ఆయన ఎంతో శుభకరుడు! ఆయన గనక తలచుకుంటే నీకు ఇంతకన్నా మేలైన వాటినే ఇవ్వగలడు. దిగువన కాలువలు ప్రవహించే ఉద్యానవనాలు ఇవ్వగలడు. ఎన్నో మేడలు, మిద్దెలు కల్పించగలడు. 11. అసలు విషయం ఏమిటంటే వారు ప్రళయ ఘడియను అసత్యంగా కొట్టివేశారు. ప్రళయాన్ని త్రోసిపుచ్చిన వారి కోసం మేము నరకాన్ని సిద్ధపరచి ఉంచాము. 12. అది వారిని దూరం నుంచి చూడగానే ఆగ్రహంతో ఊగిపోవటం, గర్జించటం వారు వింటారు. 13. వారు బంధించబడి, నరకంలోని ఒక ఇరుకైన స్థలంలో విసరివేయబడినపుడు చావు కోసం అరుస్తారు. 14. 'ఈ రోజు ఒక్క చావు కోసం అరవకండి. అనేక చావుల కోసం అరవండి' (అని వారితో అనబడుతుంది). 15. వారిని అడుగు : 'ఇది బాగుందా? లేక భక్తిపరులకు వాగ్దానం చేయబడిన శాశ్వతమైన స్వర్గమా? అది వారి ప్రతిఫలం. వారి గమ్యస్థానం.' 16. అందులో వారు కోరినదల్లా వారికి లభిస్తుంది. వారందులో సదా ఉంటారు. ఇది నీ ప్రభువుపైన ఉన్న ఒక బాధ్యత. దానిని ఆయన తప్పక నెరవేరుస్తాడు.

17. ఏ రోజున ఆయన వారిని సమావేశపరుస్తాడో, దైవాన్ని కాదని వారు పూజించే వాటిని కూడా ప్రోగుచేస్తాడో అప్పుడిలా అడుగుతాడు : 'మీరుగాని నా దాసులను అపమార్గం పట్టించారా? లేక వారంతట వారే అపమార్గం పట్టారా?' 18. వారిలా సమాధానమిస్తారు : 'నీవు పరమ

పవిత్రుడవు. నిన్ను కాదని ఇతరులను మా రక్షకులుగా చేసుకోవటం మాకెంతమాత్రం శోభించదు. కాని నీవు వీరికి, వీరి తాతముత్తాతలకు ప్రాపంచిక సంపత్తిని పుష్కలంగా ప్రసాదించావు. చివరకు వారు హితబోధనే మరచిపోయి, నాశనమయ్యే జనంలో చేరిపోయారు.' 19. (దేవుని తరఫున సెలవీయబడుతుంది) : మీ మాటలన్నింటినీ వారు అబద్ధంగా చిత్రీకరించారు. కనుక మీరిప్పుడు శిక్షను దాటవేయలేరు. మీకింక ఏ సహాయమూ అందదు. మీలో అన్యాయానికి ఒడిగట్టిన ప్రతి ఒక్కడికీ మేము పెద్ద శిక్షనే రుచి చూపిస్తాము.'

20. (ప్రవక్తా!) మేము నీకు పూర్వం పంపిన ప్రవక్తలంతా అన్నం తినేవారు. బజారులలో సంచరించేవారు. మేము మిమ్మల్ని ఒకరింకొకరి కొరకు పరీక్షగా చేశాము. మీరు ఓర్పు వహిస్తారా? మీ ప్రభువు అంతా గమనిస్తున్నాడు.

◆ (19) 21. మాతో సమావేశం కావలసి ఉందని ఆశించని వారిలా అన్నారు : 'మాపైన దైవదూతలు ఎందుకు అవతరించలేదు? లేదా మేమైనా మా ప్రభువును ఎందుకు చూడలేకపోతున్నాము?' వారు తమలో తామే చాలా గొప్పవారుగా ఊహించుకున్నారు. గర్వాహంకారంలో వారు మితిమీరి పోయారు. 22. ఏ రోజు వారు దైవదూతలను ప్రత్యక్షంగా చూసుకుంటారో, ఆ రోజు అపరాధులకు ఎలాంటి శుభవార్తా ఉండదు. 'శరణు శరణు' అని వారంటారు. 23. మరి మేము వారు చేసుకున్న ప్రతి కర్మ వైపునకు వెళ్ళి దానిని ఎగిరే దుమ్ముధూళి మాదిరిగా చేసేస్తాము. 24. స్వర్గవాసులు ఆ రోజు అత్యుత్తమ నివాసంలో ఉంటారు. వారి విశ్రాంతి నిలయం బహు చక్కగా ఉంటుంది.

25. ఏ రోజున ఆకాశం మేఘాలతో సహా చీలిపోతుందో, దైవదూతలు వరుసగా దింపబడతారో, 26. ఆ రోజు నిజసార్వభౌమత్వం కరుణామయుడైన

అల్లాహ్‌దే అయి ఉంటుంది. అది సత్యతిరస్కారుల పాలిట మహా గడ్డు దినమై ఉంటుంది. 27. ఆ రోజు దుర్మార్గుడు తన చేతులను కొరుక్కుంటూ ఇలా అంటాడు : 'అయ్యో! నేను దైవప్రవక్త వెంట ఉండి, ఆయన మార్గాన్ని అవలంబించి ఉంటే ఎంత బాగుండేది! 28. అయ్యో నా దౌర్భాగ్యం! నేను ఫలానా వ్యక్తిని స్నేహితునిగా చేసుకోకుండా ఉంటే ఎంత బాగుండేది! 29. నా దగ్గరకు ఉపదేశం (ఖుర్ఆన్) వచ్చిన మీదట కూడా వాడు నన్ను దాన్నుండి పెడత్రోవ పట్టించాడు. ఎంతయినా షైతాన్ మానవుని పాలిట దగుల్బాజీయే.' 30. అప్పుడు దైవప్రవక్త ఇలా అంటాడు : 'నా ప్రభూ! నా జాతివారు ఈ ఖుర్ఆన్‌ను బొత్తిగా ఉపేక్షించారు.' 31. ఈ విధంగా మేము అపరాధులలో నుండి కొందరిని ప్రతి దైవప్రవక్తకు విరోధులుగా చేశాము. మార్గదర్శకత్వం వహించటానికి, సహాయపడటానికి నీ ప్రభువు (ఒక్కడే) చాలు.

32. 'ఈయన గారిపై ఖుర్ఆన్ పూర్తిగా - ఒకేసారి - ఎందుకు అవతరింపజేయబడలేదు?' అని సత్యతిరస్కారులు అంటారు. నీ మనసును కుదుటపరచటానికే మేము ఈ విధంగా చేశాము. ఇంకా మేము దీనిని కొద్దికొద్దిగా అవతరింపజేశాము. 33. (ప్రవక్తా!) వారు నీ దగ్గరకు ఎంత విచిత్రమయిన ప్రశ్న తీసుకువచ్చినా, మేము దానికి దీటైన సమాధానాన్ని, అత్యుత్తమమయిన వివరణను నీకు తెలియపరుస్తాము. 34. ఎవరయితే తమ ముఖాల మీద (బోర్లాగా) నరకం వైపు తీసుకుపోబడతారో, వారి నివాసం అత్యంత చెడ్డ నివాసమై ఉంటుంది. వారు దారి తప్పి బహుదూరం వెళ్ళిపోయారు.

35. మేము మూసాకు గ్రంథం ప్రసాదించాము. అతని సోదరుడయిన హారూన్‌ను అతనికి సహాయకునిగా చేశాము. 36. తరువాత వారిద్దరినీ ఈ విధంగా ఆదేశించాము : 'మీరు మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించిన

జనుల వద్దకు వెళ్ళండి.' తరువాత మేము వాళ్ళను పూర్తిగా తుదముట్టించాము. 37. నూహ్ జాతి వారు కూడా మా ప్రవక్తలను అబద్ధీకులు అంటూ త్రోసిపుచ్చినపుడు మేము వాళ్ళను ముంచివేశాము. జనుల కొరకు వారిని ఒక సూచనగా చేశాము. దుర్మార్గుల కొరకు మేము వ్యధాభరితమయిన శిక్షను సిద్ధం చేసి ఉంచాము. 38. ఆద్, సమూద్ వారినీ, బావి వారినీ, వారి మధ్యన ఉన్న ఎన్నో సముదాయాలను (కూడా ఇలాగే అంతమొందించాము). 39. మేము వారిలో ప్రతి ఒక్కరినీ ఉదాహరణలతో సహా నచ్చజెప్పాము. తరువాత వారిలో ప్రతి ఒక్కరినీ సమూలంగా తుడిచి పెట్టేశాము. 40. భీకరంగా రాళ్ళ వాన కురిపించబడిన బస్తీ మీదుగా వారు రాకపోకలు సాగించారు. మరయితే వారు దాని దుర్గతిని చూడలేదా? అసలు విషయం ఏమిటంటే పునరుత్థానంపై వారికెలాంటి ఆశలు లేవు.

41. వారు నిన్ను చూసినప్పుడల్లా ఆటపట్టించాలనుకుంటారు. 'దేవుడు తన సందేశహరునిగా చేసినది ఈయన గారినేనా!? 42. మేమే గనక స్థిరంగా ఉండకపోతే ఈపాటికి ఇతను మమ్మల్ని మా దేవుళ్ళ నుండి దూరం చేసి ఉండేవాడే' అంటారు. శిక్షను కళ్ళారా చూసుకున్నప్పుడు, అందరికన్నా మార్గవిహీనులెవరో అనతికాలంలోనే వారికి తెలిసిపోతుంది.

43. (ప్రవక్తా!) తన మనోవాంఛలనే తన ఆరాధ్య దైవంగా చేసుకున్న వ్యక్తిని నీవు చూశావా? నీవు అతని బాధ్యత తీసుకోగలవా? 44. పోనీ వారిలో అనేకులు వింటారని, అర్థం చేసుకుంటారని నీవు అనుకుంటున్నావా? వారు పశువుల్లాంటివారు. పైగా వాటికన్నా ఎక్కువగా దారి తప్పినవారు.

45. ఏమిటి, నీవు నీ ప్రభువు వైపు దృష్టిని సారించలేదా, ఆయన ఏ విధంగా నీడను విస్తరిల్లజేశాడో!? ఆయనే గనక తలచుకుంటే దానిని నిలిపి ఉంచేసేవాడు. మరి మేము సూర్యుణ్ణి దాని ప్రామాణిక మార్గదర్శిగా

నిర్ధారించాము. 46. తరువాత మేము దానిని క్రమక్రమంగా మా వైపునకు లాక్కున్నాము. 47. ఆయనే మీ కొరకు రాత్రిని తెరగా, నిద్రను విశ్రాంతిగా, పగటిని బ్రతికి లేచే సమయంగా చేశాడు. 48. తన కారుణ్యానికి (వర్షానికి) ముందు చల్లని గాలులను శుభవార్తగా పంపేవాడు ఆయనే. మరి మేము ఆకాశం నుండి స్వచ్ఛమయిన నీటిని కురిపిస్తాము. 49 – తద్వారా మృత భూమిలో ప్రాణం పోయాలని! మా సృష్టితాలలోని ఎన్నో జంతువులకు, మరెందరో మనుషులకు నీరు త్రాపాలని!!

50. మేము దీనిని (ఈ ఖుర్‌ఆన్‌ను) వారి మధ్య పలు విధాలుగా విశదపరిచాము – వారు ఆలోచించాలని! అయినాసరే జనులలో అత్యధికులు కృతఘ్నులుగానే ఉండిపోతారు. 51. ఒకవేళ మేము తలచుకుంటే ప్రతి జనావాసంలోనూ సావధానపరిచే వానిని పంపి ఉండేవారము. 52. కనుక నీవు తిరస్కారుల మాట వినకు. దీని (ఖుర్‌ఆన్) మూలముగా నీవు వారిని శాయశక్తులా ఎదిరించు.

53. రెండు జలప్రవాహాలను కలిపినవాడు ఆయనే. ఇదేమో తియ్యనిది, దాహం తీర్చేది. అదేమో ఉప్పగా, చేదుగా ఉండేది. ఆయన వాటిమధ్య ఒక తెరను ఉంచాడు – పటిష్టమైన అడ్డుగోడలా! 54. ఇంకా ఆయనే మానవుణ్ణి నీటితో సృష్టించాడు. దరిమిలా అతన్ని ఒక వంశీయునిగా చేశాడు. అత్తవారితో అతనికి బంధుత్వం ఏర్పరిచాడు. నీ ప్రభువు గొప్ప శక్తి సామర్థ్యం కలవాడు.

55. వారు అల్లాహ్‌ను వదలి తమకు లాభాన్నిగానీ, నష్టాన్నిగానీ కలిగించలేని వాటిని పూజిస్తున్నారు. ఇక తిరస్కారి అయితే తన ప్రభువుకు వ్యతిరేకంగా (షైతాన్‌కు) తోడ్పడేవాడే. 56. (ప్రవక్తా!) మేము మాత్రం నిన్ను కేవలం శుభవార్త వినిపించేవానిగా, భయపెట్టేవానిగా చేసి పంపాము. 57. వారికి చెప్పేయ్ : 'నేను ఈ పనికిగాను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని

అడగటం లేదు. అయితే కోరిన వ్యక్తి తన ప్రభువు మార్గాన్ని అవలం బించవచ్చు.

58. మరణమన్నదే లేని నిత్య సజీవుడు అయిన అల్లాహ్‌పైనే భారం మోపు. స్తోత్రంతో సహా ఆయన పవిత్రతను కొనియాడు. తన దాసుల పాపాలను తెలుసుకుంటూ ఉండటానికి ఆయన ఒక్కడే చాలు. 59. ఆయనే ఆకాశాలనూ, భూమినీ, వాటి మధ్య ఉన్న వాటన్నింటినీ ఆరు దినాలలో సృష్టించాడు. తరువాత ఆయన పాలనా పీఠం (అర్ష్)పై స్థిరపడ్డాడు. అపార కరుణామయుడు. ఆయన ఘనత్వం గురించి తెలిసిన వ్యక్తిని అడుగు. 60. కరుణామయునికి ప్రణమిల్లమని వారితో చెప్పినపుడు, ఇంతకీ కరుణా మయుడంటే ఏమిటి? నీవు మాతో అన్న వారికల్లా మేము సాష్టాంగపడాలా?' అని వారంటారు. ఆ విధంగా వారు మరింతగా బెదిరిపోతారు.

61. ఆకాశాలలో బురుజులను నిర్మించి, అందులో మండే దీపాన్ని (సూర్యుణ్ణి), దేదీప్యమానమయిన చంద్రుణ్ణి చేసినవాడు ఎంతో శుభకరుడు. 62. మరి ఆయనే రేయింబవళ్ళను ఒకదాని వెంబడి ఒకటి వచ్చేలా చేశాడు. గుణపాఠం గ్రహించేవాని కోసం, కృతజ్ఞుడుగా మెలిగేవాని కోసం ఇది (నిదర్శనంగా) ఉంది.

63. కరుణామయుని దాసులు నేలపై వినమ్రులై నడుస్తారు. మూర్ఖులు తమతో వాదనకు దిగినప్పుడు, 'మీకు శాంతి కలుగుగాక!' అంటూ ముందుకు సాగిపోతారు. 64. వారు తమ ప్రభువు సన్నిధిలో ప్రణమిల్లుతూ, నిలబడుతూ రాత్రులు గడుపుతుంటారు. 65. వారిలా వేడుకుంటూ ఉంటారు: 'మా ప్రభూ! నరక యాతనను మా నుండి దూరంగా ఉంచు. నిశ్చయంగా దాని యాతన సర్వనాశనానికి తార్కాణం. 66. నిశ్చయంగా అది మా చెడ్డ స్థావరం, అతి చెడ్డ స్థలం.' 67. వారు ఖర్చుపెడుతున్నప్పుడు దుబారా ఖర్చు చేయటంగానీ, పిసినారులుగా వ్యవహరించటం గానీ చేయరు. వారి ఖర్చు ఆ రెంటికీ మధ్య సమతౌల్యంలో ఉంటుంది.

68. వారు అల్లాహ్‌తో పాటు మరో దేవుణ్ణి మొరపెట్టుకోరు. అల్లాహ్ నిషేధించిన (పవిత్రం గావించిన) ఏ ప్రాణినీ వారు – ధర్మబద్ధంగా తప్ప – చంపరు. వారు అక్రమ సంబంధాలు పెట్టుకోరు. ఇలాంటి పనులకు పాల్పడినవాడు శిక్షార్హుడవుతాడు. 69. ప్రళయదినాన అతని శిక్ష పెరుగుతూ పోతుంది. వాడక్కడ ఎల్లకాలం అవమానితుడై ఉంటాడు. 70. అయితే (ఈ పాపాల తర్వాత) ఎవడు విశ్వసించి, సదాచరణ చేస్తాడో – అలాంటి వారి చెడులను దేవుడు సత్కార్యాలుగా పరివర్తనం చేస్తాడు. దేవుడు క్షమాగుణం కలవాడు, కరుణాసాగరుడు. 71. ఇంకా – ఏ వ్యక్తి పశ్చాత్తాపపడి, సదాచరణ చేయటం మొదలెట్టాడో అతను వాస్తవానికి దేవుని వైపునకు మరలాడు.

72. ఇంకా వారు (కరుణామయుని నిజమైన దాసులు) అసత్యానికి సాక్షులుగా ఉండరు. ఎప్పుడయినా, ఏదయినా పనికిమాలిన విషయం మీదుగా సాగిపోవలసివస్తే హుందాగా సాగిపోతారు. 73. వారికి వారి ప్రభువు ఆదేశాల (ఆయతుల) ఆధారంగా బోధపరచినపుడు, వారు వాటి పట్ల చెవిటివారుగా, గుడ్డివారుగా వ్యవహరించరు. 74. వారిలా ప్రార్థిస్తారు: 'మా ప్రభూ! మా ఆలుబిడ్డల ద్వారా మా కళ్లకు చలువను ప్రసాదించు. మమ్మ్మ భక్తిపరుల నాయకునిగా చెయ్యి.'

75. ఇలాంటివారికి (స్వర్గంలో) ఉత్కృష్టమయిన నివాస స్థలాలు లభిస్తాయి. ఎందుకంటే వారు సహనం వహించారు. అక్కడ వారికి సలామ్, దుఆలతో స్వాగతం లభిస్తుంది. 76. వారందులో శాశ్వతంగా ఉంటారు. విడిది చేసే ఆ స్థలం ఎంత చక్కనిది! నివాసముండే ఆ స్థలం ఎంత రమణీయమైనది!! 77. వారితో అను : 'మీరు గనక నా ప్రభువును ప్రార్థించకపోతే (పోనివ్వండి), ఆయన మిమ్మల్ని లక్ష్యపెట్టడు. ఎందుకంటే మీరెలాగూ సత్యాన్ని త్రోసిపుచ్చారు. కాబట్టి ఆయన శిక్ష శీఘ్రంగానే మిమ్మల్ని చుట్టుకుంటుంది.

# 26. అష్ షుఅరా (కవులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. తా – సీన్ – మీమ్. 2. ఇవి సుస్పష్టమయిన గ్రంథ వచనాలు. 3. (ప్రవక్తా!) వారు విశ్వసించటం లేదన్న బాధతో నీవు నీ ప్రాణాలకే ముప్పు కొనితెచ్చుకునేలా ఉన్నావు. 4. మేము గనక తలచుకుంటే ఆకాశం నుండి వారిపై సూచనను అవతరింపజేసి, దాని ముందు వారి మెడలు వంగిపోయేలా చేయగలం. 5. కరుణామయుని వద్ద నుండి ఏ వినూత్న ఉపదేశం వచ్చినా, దానిపట్ల వారు విముఖత చూపకుండా ఉండటమనేది జరగలేదు. 6. దానిని వారు అసత్యమంటూ కొట్టివేశారు. కాబట్టి వారు ఎగతాళి చేస్తూ ఉండిన దానిలోని వాస్తవమేమిటో వారికి అతి త్వరలోనే తెలిసిపోతుంది.

7. ఏమిటి, వారు భూమిని చూడలేదా? మేమందులో ఏవిధంగా రకరకాల ఉత్కృష్టమయిన వస్తువులను సృష్టించి ఉన్నామో? 8. నిశ్చయంగా అందులో సూచన ఉంది. అయినాసరే వారిలో అనేకులు నమ్మరు. 9. నిశ్చయంగా నీ ప్రభువు – ఆయనే తిరుగులేనివాడు, దయాకరుడు.

10. నీ ప్రభువు మూసాను పిలిచి, 'నీవు దుర్మార్గజనుల వద్దకు వెళ్ళు. 11. ఫిరౌన్ జనుల వద్దకు. ఏమిటి, వారు భయపడరా?' అని చెప్పినప్పుడు, 12. మూసా ఇలా అన్నాడు : 'నా ప్రభూ! వారు నన్ను అసత్యవాదిగా ఖరారు చేస్తారేమోనని నాకు భయంగా ఉంది. 13. నా ఆంతర్యం కుంచించుకుపోతుంది. నా నోరు సరిగ్గా పెగలదు. కనుక నీవు హారూన్‌కు సందేశం పంపించు. 14. వారి తరపున నాపై ఒక నేరారోపణ కూడా ఉంది. వారు నన్ను చంపేస్తారేమోనని నేను భయపడుతున్నాను.'

15. సెలవీయబడింది : 'అలా జరగనేరదు. కనుక మీరిరువురూ నా సూచనలతో సహా వెళ్ళండి. మేము మీ వెంట ఉండి, అంతా వింటూ ఉంటాము. 16. కాబట్టి మీరుభయులూ ఫిరౌన్ వద్దకు వెళ్ళి, 'మేము

లోకేశ్వరుని తరఫున పంపబడిన సందేశహరులము. 17. కాబట్టి నీవు ఇస్రాయీల్ సంతతి వారిని మా వెంట పోనివ్వు' (అని చెప్పండి). 18. ఫిరౌన్ ఇలా అన్నాడు : 'ఏమిటి, బాల్యంలో మేము నిన్ను మా వద్దనే పెంచుకోలేదా? నీ వయసులోని అనేక సంవత్సరాలు నీవు మా దగ్గరే గడిపావు. 19. ఆ తర్వాత చేసిందేదో చేసివెళ్ళావు. ఆ విధంగా నీవు మేలును మరచిన వారిలో ఒకడివయ్యావు.'

20. మూసా ఇలా సమాధానమిచ్చాడు : 'అప్పుడు నా వల్ల జరిగిన పొరపాటు అది. 21. తరువాత నేను మీకు భయపడి మీ నుండి పారిపోయాను. ఆ తరువాత నా ప్రభువు నాకు వివేకాన్ని (యుక్తిని) ప్రసాదించి, నన్ను తన సందేశహరునిగా చేసుకున్నాడు. 22. ఇక నీవు నాకు చేసిన ఉపకారం అంటావా, ఆ మాటకొస్తే నీవు ఇస్రాయీల్ సంతతి వారిని కట్టుబానిసలుగా చేసుకున్నావు.'

23. 'ఇంతకీ రబ్బుల్ ఆలమీన్ అంటే ఏమిటి?' అని ప్రశ్నించాడు ఫిరౌన్. 24. మూసా సమాధానమిచ్చాడు : 'భూమ్యాకాశాల ప్రభువు. వాటి మధ్యనున్న సమస్తానికీ అధిపతి. మీరు నమ్మగల వారైతే (ఇదే సత్యం).' 25. ఫిరౌన్ తన చుట్టూ ఉన్న వారి నుద్దేశ్యించి, 'మీరు వింటున్నారా?' అన్నాడు. 26. 'ఆయన మీకూ ప్రభువే. మీ పూర్వీకులైన మీ తాతముత్తాతలకు కూడా ప్రభువే' అని మూసా చెప్పాడు. 27. 'మీ వద్దకు పంపబడిన మీ ఈ ప్రవక్త ఖచ్చితంగా పిచ్చివాడే.' 28. మూసా అన్నాడు : 'మీరు గనక వివేచన గలవారయితే ప్రాక్పశ్చిమాలకు, వాటిమధ్య నున్న సమస్తానికీ ప్రభువు ఆయనే.' 29. ఫిరౌన్ అన్నాడు : 'చూడు! నువ్వు నన్ను కాదని వేరెవరినయినా ఆరాధ్య దైవంగా చేసుకున్నావంటే, నిన్ను చెరసాలలో పడవేస్తాను.' 30. మూసా చెప్పాడు : 'ఏమిటి, నేను ఏదన్నా స్పష్టమైన ప్రమాణాన్ని సమర్పించినప్పటికీనా?' 31. 'నువ్వు చెప్పేదే నిజమైతే అదేమిటో సమర్పించు' అన్నాడు ఫిరౌన్. 32. మూసా తన చేతి కర్రను పడవెయ్యగానే అదొక స్పష్టమయిన సర్పంగా మారిపోయింది. 33. ఇంకా అతను తన చేతిని (చంక నుండి) లాగగానే అకస్మాత్తుగా వీక్షకులకు అది ప్రకాశిస్తున్నట్లు కనిపిం

చింది. 34. అప్పుడు ఫిరౌన్ తన చుట్టుప్రక్కల ఉన్న ప్రముఖులనుద్దేశించి, 'ఖచ్చితంగా ఈ వ్యక్తి ఆరితేరిన మాంత్రికుడు. 35. ఇతను తన మాంత్రిక బలంతో మిమ్మల్ని మీ రాజ్యం నుండి వెళ్ళగొట్టాలనుకుంటున్నాడు. ఇప్పుడేం చేయమంటారు?' అన్నాడు.

36. ఆస్థాన ప్రముఖులు ఇలా సూచించారు : 'ఇతనికీ, ఇతని సహోదరునికి కొంత వ్యవధి ఇవ్వండి. పట్టణాలన్నింటికీ వార్తాహరులను పంపించండి. 37. వారు నిష్ణాతులైన మాంత్రికులను మీ వద్దకు తీసుకువస్తారు.' 38. అంతే. మాంత్రికులంతా ఒకానొక దినాన, ఓ నిర్ణీత సమయాన సమీకరించబడ్డారు. 39. జనసామాన్యాన్ని ఉద్దేశ్యించి, 'మీరంతా సమావేశమైనట్టేనా?' అని అనబడింది. 40. 'మాంత్రికులది పైచేయి అయినట్లయితే మనమంతా వాళ్ళనే అనుసరించవలసి ఉంటుంది' (అని కూడా ప్రకటించబడింది). 41. మాంత్రికులంతా రాగానే ఫిరౌన్‌తో అన్నారు: 'మేము గెలిస్తే మాకేదన్నా పారితోషికం ఉంటుందా?' 42. 'అవును. అట్టి పరిస్థితిలో మీరు మా సన్నిహితుల్లో ఉంటారు' అని హామీ ఇచ్చాడు ఫిరౌన్.

43. 'మీరు పడవెయ్యదలచుకున్న వాటిని పడవేయండి' అన్నాడు మూసా ఆ మాంత్రికులతో. 44. వారు తమ త్రాళ్ళను, కర్రలను క్రిందపడవేసి, 'ఫిరౌన్ గౌరవ మర్యాదల సాక్షిగా! విజయం మాదే' అన్నారు. 45. తరువాత మూసా తన చేతి కర్రను పడవేయగానే అది వారి బూటకపు విన్యాసాలన్నింటినీ మ్రింగేసింది. 46. దాంతో ఆ మాంత్రికులంతా సాష్టాంగ ప్రణామం చేశారు. 47. ఇలా అన్నారు : 'సకల లోకాల ప్రభువును మేము విశ్వసిస్తున్నాము. 48. – మూసా హారూనుల ప్రభువును.'

49. ఫిరౌన్ అన్నాడు : 'ఏమిటి, నా ఆనతి పొందకముందే మీరతన్ని నమ్మేశారా? నిశ్చయంగా వాడే మీ అందరికీ మంత్రతంత్రాలను నేర్పిన మీ గురువు. సరే. మీకిప్పుడే తెలిసివస్తుంది, నేను మీకు ఒక వైపు నుండి చేతుల్ని, మరో వైపు నుండి కాళ్ళనూ నరికిస్తాను. తరువాత మీ అందరినీ శిలువపైకి ఎక్కిస్తాను.' 50. దానికి వారిలా అన్నారు : 'మరేమీ ఫరవాలేదు. మేము మా ప్రభువు వద్దకు చేరుకుంటాము. 51. మా ప్రభువు మా తప్పులను

క్షమిస్తాడని ఆశిస్తున్నాము. ఎందుకంటే మేము విశ్వసించిన వారిలో తొలివారము.'

52. మేము మూసాకు వహీ (దివ్యవాణి) ద్వారా తెలియపరిచాము: 'నీవు రాత్రికి రాత్రే నా దాసులను తీసుకుని వెళ్ళిపో. నిశ్చయంగా మీరు వెంబడించబడతారు.' 53. ఫిరౌన్ పట్టణాలకు తన వార్తాహరులను పంపాడు. 54. 'వీళ్ళు చూస్తే కొద్దిమంది మాత్రమే. 55. అయినప్పటికీ వీళ్ళు మమ్మల్ని ఆగ్రహోదగ్రుల్ని చేశారు. 56. మా దళం పెద్దది. కడు అప్రమత్తంగా ఉండేది. 57. మేము వాళ్ళను తోటల నుండి, చెలమల నుండి వెళ్ళగొట్టాము. 58. కోశాగారాల నుండి, ఉన్నత స్థానాల నుండి ఉద్వాసన పలికాము.' 59. ఇలా జరిగింది. మేము ఇస్రాయీల్ సంతతి వారిని వాటన్నింటికీ వారసులుగా చేశాము.

60. వారు సూర్యోదయ సమయాన వారిని వెంబడించారు. 61. తరువాత ఆ రెండు సమూహాలు ఎదురెదురైనపుడు మూసా సహచరులు, 'ఇక మనం పట్టుబడినట్లే' అన్నారు. 62. మూసా ఇలా అన్నాడు : 'అసంభవం. నిశ్చయంగా నా ప్రభువు నాకు తోడుగా ఉన్నాడు. ఆయన నాకు మార్గదర్శనం చేస్తాడు.' 63. మరి మేము మూసాకు, 'నీ చేతి కర్రతో సముద్రంలో కొట్టు' అని వహీ పంపాము. దాంతో అది రెండుగా చీలిపోయింది. ప్రతి భాగం ఓ మహా పర్వతంలా అయిపోయింది. 64. మరి మేము రెండవ దళాన్ని కూడా సమీపానికి చేర్చాము. 65. మేము మూసాను, అతని వెంట ఉన్న వారందరినీ కాపాడాము. 66. మిగతా వాళ్ళను (ఫిరౌన్‌ను, అతని జనులను) ముంచి వేశాము. 67. నిశ్చయంగా ఇందులో సూచన ఉంది. కాని వారిలో చాలామంది నమ్మటం లేదు. 68. నిశ్చయంగా నీ ప్రభువు తిరుగులేనివాడు, దయాసాగరుడు.

69. వారికి ఇబ్రాహీమ్ సమాచారాన్ని కూడా వినిపించు. 70. అతను తన తండ్రిని, తన జాతి వారినుద్దేశించి, 'మీరు పూజించేది వేటిని?' అని అడిగినప్పుడు, 71. 'మేము విగ్రహాలను పూజిస్తున్నాము. మేము వాటి సేవలకే కట్టుబడి ఉన్నామ'ని వారు చెప్పారు. 72. ఇబ్రాహీమ్ ఇలా అడిగాడు:

‘ఏమిటి, మీరు వాటిని పిలిచినప్పుడు అవి మీ పిలుపును ఆలకిస్తాయా? 73. పోనీ అవి మీకు లాభంగానీ, నష్టంగానీ కలిగిస్తాయా?’ 74. వారిలా అన్నారు : ‘అదేమోగాని, మేము మా తండ్రీ తాతలను ఈ విధంగా చేయటం చూశాము.’

75. ఇబ్రాహీమ్ ఇలా అడిగాడు : ‘మీరు పూజిస్తున్న వాటిని కనీసం చూశారా? 76. మీరయినా, మీ తాతముత్తాతలయినా? 77. ఒక్క సకల లోకాల ప్రభువు తప్ప ఇవన్నీ నా శత్రువులే. 78. ఆయనే నన్ను సృష్టించిన వాడు, మరి ఆయనే నాకు మార్గం చూపుతున్నాడు. 79. ఆయనే నాకు తినిపిస్తున్నాడు, త్రాగిస్తున్నాడు. 80. నాకు జబ్బుచేసినపుడు ఆయనే నాకు ఆరోగ్యాన్ని ప్రసాదిస్తున్నాడు. 81. ఆయనే నన్ను చంపుతాడు, తిరిగి నన్ను బ్రతికిస్తాడు. 82. ప్రతిఫలం లభించే దినాన ఆయన నా తప్పులను క్షమిస్తాడని నేను ఆశిస్తున్నాను.

83. ‘నా ప్రభూ! నాకు యుక్తిని ప్రసాదించు. ఇంకా నన్ను సజ్జనులలో చేర్చు. 84. భావి తరాల వారిలో నన్ను సచ్ఛీలునిగా మిగిల్చి ఉంచు. 85. ఇంకా నన్ను అనుగ్రహాలతో నిండిన స్వర్గవనానికి వారసులయ్యేవారిలో చేర్చు. 86. ఇంకా నా తండ్రిని క్షమించు. నిశ్చయంగా అతను మార్గభ్రష్టులలో చేరాడు. 87. ప్రజలు తిరిగి లేపబడే రోజున నన్ను అవమానపరచకు. 88. ఆ రోజు సిరిసంపదలుగానీ, సంతానంగానీ దేనికీ పనికిరావు. 89.మంచి మనసుతో దైవసన్నిధికి వచ్చినవాడు మాత్రమే (మోక్షం పొందుతాడు).

90. స్వర్గం దైవభీతిపరుల సమీపానికి తీసుకురాబడుతుంది. 91. నరకం మార్గభ్రష్టుల కొరకు ప్రస్ఫుటం చేయబడుతుంది. 92. వారితో ఇలా అనబడుతుంది : ‘మీరు కొలిచే ఆ దైవాలు ఎక్కడ? 93. అల్లాహ్‌ను కాదని (మీరు పూజించిన దైవాలు). ఏమి, అవి మీకేమయినా సాయం చేస్తాయా? పోనీ కనీసం తమకు తామైనా సాయం చేసుకోగలుగుతాయా? 94. తరువాత వారునూ, మార్గవిహీనులునూ తల క్రిందులుగా చేసి అందులో (నరకంలో) పడవేయబడతారు. 95. ఇబ్లీసు సైనికులునూ, వారంతా కూడా.

96. వారందులో పరస్పరం పోట్లాడుకుంటూ ఇలా చెప్పుకుంటారు :
97 ‘దేవునితోడు! మేము స్పష్టమయిన అపమార్గంలో పడి ఉండేవారము –
98. మిమ్మల్ని మేము సకల లోకాల ప్రభువుకు సమానంగా ఎంచినపుడు!
99. ఇదిగో, మమ్మల్ని పెడదారి పట్టించింది ఈ అపరాధులే. 100. మా
కొరకు ఇక సిఫారసు చేసేవాడు గానీ 101. మా ఆప్తమిత్రుడు గానీ ఎవడూ
లేడు.

102. అయ్యో! మాకు మరోసారి తిరిగివెళ్ళే అవకాశం దొరికితే
ఎంత బాగుండేది! మేము తప్పకుండా విశ్వసిస్తాము.’ 103. నిశ్చయంగా
ఇందులో సూచన ఉంది. కాని వారిలో చాలామంది విశ్వసించేవారు కారు.
104. నిశ్చయంగా నీ ప్రభువు మహా శక్తిశాలి, దయాశీలి.

105. నూహ్ జాతి వారు కూడా ప్రవక్తలను అసత్యవాదులుగా
చిత్రీకరించారు. 106. వారి సోదరుడైన నూహ్ వారితో ఇలా అన్నాడు :
‘మీరు భయపడరా? 107. నేను మీ యెడల నమ్మదగ్గ ప్రవక్తను.
108. కనుక మీరు దైవానికి భయపడండి. నా మాట వినండి.
109. దీనికిగాను మీ నుండి నేను ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు.
నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత సకల లోకాల ప్రభువుది.

110. కాబట్టి మీరు దైవానికి భయపడండి. నాకు విధేయత చూపండి.’
111. వారిలా అన్నారు : ‘ఏమిటి, నీ వెనుక ఉన్నవారంతా దళిత జనులే
అయినప్పటికీ మేము నిన్ను విశ్వసించాల్సిందేనా?’ 112. దానికి సమాధా
నంగా నూహ్ ఇలా చెప్పాడు:‘వారేం చేసేవారో నాకేం తెలుసు. 113. వారి
లెక్కల బాధ్యత నా ప్రభువుపై ఉంది – మీరు గనక అర్థం చేసుకోగలిగితే.
114. నేను మటుకు విశ్వసించిన వారిని నా నుండి దూరం చేసుకోలేను.
115. నా వరకు నేను స్పష్టంగా సావధానపరచేవాడను మాత్రమే.’

116. అప్పుడు వారిలా అన్నారు : ‘ఓ నూహ్! నీవు నీ ఈ పనిని
మానుకుంటే సరి. లేకుంటే నీపై రాళ్లు రువ్వటం ఖాయం.’ 117. నూహ్
ఇలా నివేదించుకున్నాడు : ‘నా ప్రభూ! నా జాతివారు నన్ను త్రోసిపుచ్చారు.
118. ఇక నీవు నాకూ – వారికీ మధ్య తీర్పు చెయ్యి. నాకూ, నా వెంట

ఉన్న విశ్వాసులకూ విముక్తిని ప్రసాదించు.’ 119. అప్పుడు మేము అతనినీ, నిండు నౌకలో ఉన్న అతని సహచరులనూ రక్షించాము. 120. ఆ తరువాత మిగిలిన వారందరినీ మేము ముంచివేశాము. 121. నిశ్చయంగా ఇందులో గుణపాఠ సూచన ఉంది. కాని వారిలో అనేకులు నమ్మేవారు కారు. 122. నిశ్చయంగా నీ ప్రభువు – ఆయన మహాశక్తిశాలి, దయాశీలి.

123. ఆద్ జాతి వారు కూడా దైవప్రవక్తలను అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. 124. అప్పుడు వారి సోదరుడైన హూద్ వారితో ఇలా అన్నాడు : ‘ఏమిటి, మీరు భయపడరా? 125. నేను మీ యెడల ఒక విశ్వసనీయుడనైన ప్రవక్తను. 126. కనుక మీరు దైవానికి భయపడండి. నా మాట వినండి. 127. దీనికి గాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత లోకేశ్వరునిది. 128. ఏమిటి, మీరు ప్రతి ఎత్తయిన స్థలంలో నిరర్థకంగా ఒక స్మారక కట్టడం నిర్మిస్తున్నారా? 129. మీరు శాశ్వతంగా ఇక్కడే ఉండిపోయినట్లుగా పెద్ద పెద్ద భవంతులు నిర్మిస్తారా? 130. మీరు ఎవరిపై చెయ్యి వేసినా దౌర్జన్యపరుల మాదిరిగా చెయ్యివేస్తారేమిటి? 131. ఇక నుంచయినా మీరు దేవునికి భయపడండి. నన్ను అనుసరించండి. 132. మీకు తెలిసిన మంచి వస్తువులన్నింటినీ మీకు వొసగి, మీకు సహాయపడిన వాని యెడల భయభక్తులు కలిగి ఉండండి. 133. ఆయన మీకు తోడ్పడ్డాడు – పశువుల ద్వారా, పుత్ర సంతానం ద్వారా! 134. తోటల ద్వారా, చెలమల ద్వారా! 135. మీపైన విరుచుకుపడే ఒక మహా గడ్డుదినపు శిక్ష గురించి నేను భయపడుతున్నాను.’

136. సమాధానంగా వారిలా అన్నారు : ‘నీవు మాకు బోధపరచినా, బోధపరచకపోయినా ఒక్కటే. 137. ఇదంతా పూర్వీకుల పోకడ మాత్రమే. 138. మాపై శిక్ష రాదు గాక రాదు. 139. ఆ విధంగా వారతనిని అసత్యవాదిగా ముద్రవేశారు. తరువాత మేము వారిని అంతమొందించాము. నిశ్చయంగా ఇందులో సూచన ఉంది. అయినా వారిలో అనేకులు నమ్మినడుచుకునేవారు కారు. 140. నిశ్చయంగా నీ ప్రభువు – ఆయన బలాఢ్యుడు, దయగలవాడు.

141. సమూదు వారు కూడా ప్రవక్తలను అసత్యవాదులంటూ తిరస్కరించారు. 142. అప్పుడు వారి సోదరుడైన సాలెహ్ వారితో ఇలా అన్నాడు : 'మీరు (దైవానికి) భయపడరా!? 143. నేను మీ కొరకు ఒక నమ్మదగ్గ ప్రవక్తను. 144. కనుక మీరు దేవునికి భయపడండి. నేను చెప్పినట్లు మసలుకోండి. 145. ఈ కార్యానికిగాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నీ అడగటం లేదు. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత సర్వలోకాల ప్రభువుది. 146. ఏమిటి, మీకు ప్రాప్తమై ఉన్న ఈ వస్తువుల మధ్య నిశ్చింతగా మిమ్మల్ని వదలిపెట్టడం జరుగుతుందని అనుకుంటున్నారా? 147. ఈ తోటలలో, చెలమలలో!? 148. ఈ పంటచేలలో, రసభరితమయిన పండ్ల గెలలు ఉన్న ఖర్జూర చెట్ల మధ్య!? 149. మీరు పర్వతాలను తొలిచి, మిడిసిపడుతూ భవనాలు నిర్మిస్తున్నారు. 150. ఇకనయినా మీరు దేవునికి భయపడండి. నా మాట వినండి. 151. హద్దుమీరిపోయేవారి మాట వినకండి. 152. వారు భువిలో అరాచకం సృష్టిస్తున్నారు. దిద్దుబాటుకు ఎంతమాత్రం ప్రయత్నించటం లేదు.'

153. దానికి వారిలా అన్నారు : 'నీకెవరో చేతబడి చేసినట్టున్నారు. 154. నీవు కూడా మాలాంటి ఒక సాధారణ మనిషివే. ఒకవేళ నీవు చెప్పేదే నిజమైతే నీవు ఏదయినా సూచనను తీసుకురా.' 155. సాలెహ్ ఇలా అన్నాడు: 'ఇదిగో ఆడ ఒంటె! ఇది నీరు త్రాగే వంతు ఒకటి, ఒక నిర్ధారిత దినం వంతు మీది. 156. దురుద్దేశంతో దీని జోలికి పోకండి. అన్యథా ఒక మహా (గడ్డు) దినపు శిక్ష మిమ్మల్ని చుట్టుకుంటుంది.' 157. అంత చెప్పినా వారు ఆ ఒంటెను చంపేశారు. తరువాత బాధపడ్డారు. 158. అందువల్ల శిక్ష వారిని కబళించింది. నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉంది. అయితే వారిలో అధికులు అంగీకరించేవారు కారు. 159. నిశ్చయంగా నీ ప్రభువు – ఆయన మహాశక్తిశాలి, దయాశీలి.

160. లూత్ జాతివారు కూడా ప్రవక్తలను అసత్యవాదులుగా చిత్రీకరించి, త్రోసిపుచ్చారు. 161. అప్పుడు వారి సహోదరుడు లూత్ వారితో ఇలా అన్నాడు : 'మీరు భయపడరా? 162. నేను మీ యెడల నమ్మకస్తుణ్ణి

అయిన ప్రవక్తను. 163. కనుక మీరు దైవానికి భయపడండి. నాకు విధేయత చూపండి. 164. ఈ కార్యభారానికి గాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్నీ అపేక్షించటం లేదు. నాకు ప్రతిఫలం వొసగే బాధ్యత సకల లోకాల ప్రభువుది. 165. మీరు ప్రపంచవాసులలోని పురుషుల వద్దకు పోతారేమిటి? 166. మీ ప్రభువు మీ కోసం పుట్టించిన భార్యలను విడిచిపెడతారేమిటి? అసలు మీరు బరితెగించిన జనంలా ఉన్నారు.'

167. వారన్నారు : 'ఓ లూత్! నీవు గనక మానుకోకపోతే తప్పకుండా ఇక్కణ్ణుంచి వెళ్ళగొట్టబడతావు.' 168. లూత్ ఇలా అన్నాడు : 'నేను మీ చేష్టను ఏవగించుకుంటున్నాను. 169. నా ప్రభూ! నీవు నాకూ, నా పరివార సభ్యులకూ ఈ పాడుపని నుండి విముక్తిని ప్రసాదించు.' 170. అందుకే మేము అతనిని, అతని పరివారం జనులందరినీ కాపాడాము. 171. కాని ఒక్క ముసలావిడ మాత్రం ఉండవలసిన వాళ్ళలోనే ఉండిపోయింది. 172. తరువాత మేము అక్కడున్న వారందరినీ అంతమొందించాము. 173. ఆ తరువాత మేము వారిపై ఒక వాన కురిపించాము. ముందుగా హెచ్చరిక చేయబడిన వారిపై కురిపించబడిన ఆ వాన మహా చెడ్డది. 174. నిశ్చయంగా ఇందులో ఒక సూచన ఉంది. కాని వారిలో అనేకులు ఓ పట్టాన నమ్మే రకం కాదు. 175. నిశ్చయంగా నీ ప్రభువు – తిరుగులేని వాడు, జాలి స్వభావుడూను.

176. అయ్కె వారు (వనవాసులు) కూడా తమ ప్రవక్తలను అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. 177. అప్పుడు షుఐబ్ వారితో ఇలా అన్నాడు : 'మీరు భయపడరేమిటి? 178. నేను మీ యెడల విశ్వసనీయుడనైన ప్రవక్తను. 179. కనుక మీరు దైవానికి భయపడండి. నేను చెప్పినట్లు మసలుకోండి. 180. ఇందుకుగాను నేను మీనుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగను. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత సర్వలోక ప్రభువుది. 181. మీరు కొలచి ఇస్తున్నప్పుడు పూర్తిగా కొలిచి ఇవ్వండి, నష్టం కలిగించకండి (తగ్గించి ఇవ్వకండి). 182. సరైన త్రాసుతో తూయండి. 183. ప్రజలకు వారి వస్తువులను తగ్గించి ఇవ్వకండి. భువిలో కల్లోలాన్ని రేకెత్తించకండి. 184. మిమ్మల్నీ, మీ పూర్వీకుల్ని సృష్టించిన వానికి భయపడండి.'

185. సమాధానంగా వారిలా అన్నారు : 'అసలు నిన్నెవరో చేతబడి చేశారు. 186. నీవు మాలాంటి ఒక మానవమాత్రుడవు మాత్రమే. నీవు అబద్ధీకుడవు అని మా అనుమానం. 187. ఒకవేళ నీవు సత్యసంధుడవే అయితే ఆకాశం నుండి మాపైన ఏదన్నా తునకను పడవెయ్యి.' 188. షుఐబ్ చెప్పాడు : 'మీరు చేసేదంతా నా ప్రభువుకు తెలుసు.' 189. ఆ విధంగా వారతనిని అసత్యవాది అంటూ ధిక్కరించారు. తరువాత వారిని మేఘావృత దినపు శిక్ష కబళించింది. 190. నిశ్చయంగా అదొొక మహా (గడ్డు) దినపు శిక్ష! నిశ్చయంగా ఇందులో సూచన ఉంది. అయితే వారిలో అధికులు విశ్వసించేవారు కారు. 191. నిశ్చయంగా నీ ప్రభువు మహాశక్తిశాలి, దయాశీలి.

192. (ప్రవక్తా!) నిశ్చయంగా ఇది లోకేశ్వరుని తరఫు నుండి అవతరింపజెయ్యబడింది. 193. దీనిని విశ్వసనీయుడైన దైవదూత తీసుకుని అవతరించాడు. 194. నీ మనోఫలకంపై! నీవు హెచ్చరించేవాడవు కావాలని! 195. స్పష్టమయిన అరబీ భాషలో! 196. దీని ప్రస్తావన పూర్వీకుల గ్రంథాలలోనూ ఉంది. 197. ఇస్రాయీల్ వంశీయులకు చెందిన పండితులకు సయితం దీని గురించి తెలిసి ఉండటం వారికొొక సూచనగా సరిపోదా?

198. ఒకవేళ మేము దీనిని (ఈ ఖుర్‌ఆన్‌ను) ఏ అరబ్బేతరునిపైననో అవతరింపజేసి ఉంటే, 199. అతను వారికి చదివి వినిపించినా వారు దానిని నమ్మేవారు కారు. 200. ఈ విధంగా మేము విశ్వసించకపోవటాన్ని అపరాధుల హృదయాలలో నాటుకునేలా చేశాము. 201. కఠిన శిక్షను చూడనంత వరకూ వీరు విశ్వసించరు. 202. అది వారిపై అకస్మాత్తుగా వచ్చిపడుతుంది. దాని గురించి వారికి తెలిసి ఉండదు. 203. 'మాకు ఏమన్నా గడువు లభిస్తుందా?' అని వారంటారు.

204. ఏమిటి, వారు మా శిక్ష కోసం తొందరపెడుతున్నారా? 205. చూశావా! ఒకవేళ మేము వారికి (గత) కొన్నేండ్లుగా లబ్ధి పొందే అవకాశం కల్పిస్తున్నప్పటికీ, 206. వారికి వాగ్దానం చేయబడినది

వారిపై వచ్చిపడినప్పుడు, 207. వారు పొందిన లబ్ధి వారికేం పనికి వస్తుంది? 208. భయబోధ చేసేవారు లేకుండా (ప్రవక్తలను పంపకుండా) మేము ఏ పట్టణాన్ని కూడా తుదముట్టించలేదు. 209. వారి జ్ఞాపకార్థం! మేము అన్యాయం చేసేవారం కాము. 210. దీనిని (ఖుర్‌ఆన్‌ను) షైతానులు తీసుకుని అవతరించలేదు. 211. అది వారికి తగదు కూడా. వారాపనిని చేయనూలేరు. 212. దానిని వినకుండా వారు నిలువరించబడ్డారు.

213. కనుక (ఓ ప్రవక్తా!) నీవు అల్లాహ్‌తో పాటు మరో ఆరాధ్య దైవాన్ని మొరపెట్టుకోకు. నీవు గనక అలా చేశావంటే శిక్షార్హుడవు అవుతావు. 214. నీ సమీప బంధువులను భయపెట్టు. 215. విశ్వసించి, నీవు చెప్పినట్లుగా మసలుకుంటున్నవారి కోసం వాత్సల్యభరితమయిన నీ బాహువులను వంచిపెట్టు. 216. ఒకవేళ వారు నీ మాటను ఎదిరిస్తే, 'మీరు చేసేవాటికి నేను బాధ్యుడను కాను' అని వారికి చెప్పేయ్. 217. మహా శక్తిశాలి, దయాశీలి అయిన దైవాన్నే నమ్ముకో. 218. నీవు లేచినప్పుడు ఆయన నిన్ను గమనిస్తూ ఉంటాడు. 219. సాష్టాంగపడే వారిలో కూడా నీ కదలికలను కనిపెట్టుకుని ఉంటాడు. 220. నిశ్చయంగా ఆయన సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు.

221. దెయ్యాలు ఎవడిపైన దిగుతాయో నేను మీకు తెలుపనా? 222. అబద్ధాలకోరు, పాపాత్ముడైన ప్రతి ఒక్కడిని అవి ఆవహిస్తాయి. 223. వినీ వినని మాటలను నూరిపోస్తాయి. వారిలో అత్యధికులు అబద్ధీకులే. 224. ఇక కవుల విషయానికి వస్తే, మార్గవిహీనులే వారి వెనుక నడుస్తారు. 225. ఏమిటి, నీవు చూడటం లేదా, వారు ప్రతి లోయలో ఎలా తచ్చాడుతున్నారో, 226. చేయని దాన్ని గురించి ఎలా (గొప్పలు) చెప్పుకుంటున్నారో!? 227. అయితే ఎవరు విశ్వసించి, సదాచరణ చేశారో, దైవాన్ని అత్యధికంగా స్మరించారో, తమకు జరిగిన అన్యాయం మేరకే ప్రతీకారం తీర్చుకున్నారో, వారు తప్ప, అన్యాయానికి ఒడిగట్టేవారికి తాము ఏ చోటికి చేర్చబడతారో త్వరలోనే తెలిసిపోతుంది.

# 27. అన్ నమ్ల్ (చీమలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. తా – సీన్. ఇవి ఖుర్ఆన్ వచనాలు, స్పష్టమయిన గ్రంథానికి
చెందినవి. 2. ఇది విశ్వసించిన వారికి మార్గదర్శకంగా, శుభవార్తగా ఉన్నది.
3. వారు నమాజును స్థాపిస్తారు, జకాత్‌నిస్తారు, పరలోకాన్ని నమ్ముతారు.
4. నిశ్చయంగా ఎవరయితే పరలోకాన్ని నమ్మరో, వారి కర్మలను మేము
వారికి అందమైనవిగా చేశాము. అందువల్ల వారు దారి తప్పుతున్నారు.
5. ఇలాంటి వారికి ఘోర శిక్ష ఉంటుంది. వారు పరలోకంలో తీవ్రంగా
నష్టపోతారు. 6. (ప్రవక్తా!) నిశ్చయంగా ఖుర్ఆన్ నీకు మహా వివేకి, మహా
జ్ఞాని అయిన వాని తరపున అందజేయబడుతోంది.

7. మూసా తన ఇంటివారితో ఇలా అన్నాడు : 'నేను అగ్నిని చూశాను.
నేనక్కడి నుండి ఏదన్నా సమాచారం తీసుకువస్తాను. లేదా మీరు చలి
కాచుకోవటానికి నిప్పు కణికనయినా తెస్తాను. 8. తీరా అతనక్కడికి వెళ్ళగానే
పిలుపు వినవచ్చింది : 'ఈ అగ్నిలోనూ, దీని పరిసరాలలోనూ ఉన్నవాడు
శుభవంతుడు. ఇంకా సకల లోకాల ప్రభువైన అల్లాహ్ పరమ పవిత్రుడు.'

9. 'ఓ మూసా! నేనే అల్లాహ్‌ను. శక్తిశాలిని, వివేచనాశీలిని.
10. నీవు నీ చేతి కర్రను పడవెయ్యి.' అతను దానిని (పడవేసినపుడు)
సర్పంలా కదలటం చూసి వెనుతిరిగాడు, తిరిగి చూడనయినా లేదు. 'ఓ
మూసా! భయపడకు. మా సమక్షంలో ప్రవక్తలు భయపడరు.
11. అన్యాయానికి ఒడిగట్టినవాడే భయపడతాడు. అయితే దురాగతానికి
పాల్పడిన మీదట అతను గనక దానిని సత్కార్యంగా మలచుకుంటే, నేను
క్షమించేవాడను, కరుణించేవాడను. 12. నీవు నీ చేతిని నీ చంకలో నొక్కిపెట్టు.
అది ఏ లోపమూ లేకుండా తెల్లగా ప్రకాశిస్తూ బయటికి వస్తుంది. ఈ
రెండింటితో కలిపి తొమ్మిది సూచనలు; వీటిని తీసుకుని ఫిరౌన్ వద్దకు,
అతని జాతివారి వద్దకు వెళ్ళు. నిశ్చయంగా వారు అవిధేయ జనులు.'

13. అయితే వారి వద్దకు మా స్పష్టమయిన సూచనలు చేరినప్పుడు వారు, 'ఇది పచ్చి మాయాజాలమే' అన్నారు. 14. యదార్థానికి వారి ఆంతర్యాలు వాటిని (సత్యమని) అంగీకరించినప్పటికీ అన్యాయం, అహంకారం కారణంగా వారు త్రోసిపుచ్చారు. మరి ఆ కల్లోల జనకుల పరిణామం ఏమైందో చూసుకో.

15. మేము దావూదు సులైమానులకు జ్ఞానమొసగాము. వారిద్దరూ ఇలా అన్నారు : 'విశ్వాసులైన తన దాసులెందరిపైనో మాకు ఆధిక్యతను ప్రసాదించిన అల్లాహ్‌కు కృతజ్ఞతలు.' 16. సులైమాన్ దావూదుకు వారసుడయ్యాడు. అతనిలా అన్నాడు : 'ప్రజలారా! మాకు పక్షుల భాష నేర్పబడింది. మాకు ప్రతిదీ వొసగబడింది. నిశ్చయంగా ఇది స్పష్టమయిన అనుగ్రహమే.'

17. సులైమాన్ కోసం అతని సైన్యం సమీకరించబడింది – జిన్నులు, మనుషులు, పక్షులు (త్రివిధ దళాలు). తరువాత వాటి పటాలాలు తీర్చిదిద్దబడ్డాయి. 18. చివరకు వారు ఒక చీమల లోయకు చేరుకున్నప్పుడు, ఒక చీమ ఇలా సావధానపరచింది : 'ఓ చీమల్లారా! మీరంతా మీమీ పుట్టలలోనికి దూరిపోండి. బహుశా సులైమాన్, అతని సేనలు మిమ్మల్ని నలిపివేయవచ్చు. ఆ విషయం వారికి తెలియకనూపోవచ్చు.' 19. దాని మాటకు సులైమాన్ (తొలుత) మందహాసం చేసి, (ఆ తరువాత) నవ్వేశాడు. ఇలా అన్నాడు : 'నా ప్రభూ! నీవు నాపైన, నా మాతాపితలపైన కురిపించిన అనుగ్రహ భాగ్యాలకు గాను నీకు కృతజ్ఞతలు తెలుపుకునే సద్బుద్ధిని నాకు ప్రసాదించు. నీకు ఇష్టమయిన సత్క్రియలాచరించటంలో నాకు తోడ్పాటు నందించు. నీ దయతో నన్ను సజ్జనులయిన నీ దాసులలో చేర్చుకో.'

20. సులైమాన్ తన పక్షుల సమూహాన్ని తనిఖీ చేసినపుడు, 'నాకు హుద్ హుద్ పక్షి (వడ్రంగి పిట్ట) కనిపించటం లేదేమిటి? 21. అదెక్కడయినా అదృశ్యమైందా? నేను దానిని కఠినంగా శిక్షిస్తాను. లేదా దానిని కోసివేస్తాను లేదా అది నా సమక్షంలో తగు సంజాయిషీనయినా ఇచ్చుకోవాలి' అన్నాడు.

22. ఎక్కువ సమయం గడవకుండానే అది వచ్చి ఇలా విన్నవించుకుంది : 'మీకు తెలియని విషయం ఒకటి నేను తెలుసుకుని వచ్చాను. నేను సబా (జాతి) నుండి ఒక విశ్వసనీయమయిన సమాచారం మోసుకువచ్చాను. 23. వారిని (సబా జాతి వారిని) ఒక స్త్రీ పరిపాలిస్తున్నట్లు నేను కనుగొన్నాను. ఆమెకు ప్రతిదీ వొసగబడి ఉంది. ఆమె సింహాసనం చాలా పెద్దది. 24. కాని (ఆశ్చర్యకరమయిన విషయం ఏమిటంటే) ఆమె, ఆమె జాతివారు అల్లాహ్‌ను కాదని సూర్యునికి ప్రణమిల్లటం నేను గమనించాను. షైతాన్ వారి కర్మలను వారికి అందమైనవిగా చేశాడు. తరువాత వాళ్ళను సన్మార్గం పొందకుండా అడ్డుకున్నాడు. అందువల్ల వారు సన్మార్గం పొందటం లేదు. 25. ఆ కారణంగానే వారు అల్లాహ్‌కు సాష్టాంగ ప్రణామం చెయ్యటం లేదు. ఆయనే భూమ్యాకాశాలలో నిక్షిప్తమై ఉన్న వాటిని వెలికి తీసేవాడు, మీరు దాచేవీ, వ్యక్తపరిచేవి అన్నీ తెలిసినవాడు. 26. అల్లాహ్ – ఆయన తప్ప మరో ఆరాధ్యదైవం లేదు. మహోన్నతమయిన పాలనాపీఠానికి అధిపతి.'

27. సులైమాన్ అన్నాడు : 'సరే. నీవు చెబుతున్నది నిజమో, అబద్ధమో మేము చూస్తాము. 28. నా ఈ ఉత్తరాన్ని తీసుకుపోయి, వాళ్ళ వైపు పడవెయ్యి. తరువాత వారి నుండి దూరం జరుగు. మరి వారేవిధంగా స్పందిస్తారో గమనించు.' 29. సబా రాణి ఇలా అంది : 'ఓ ఆస్థాన ప్రముఖులారా! నా వైపు ఓ గౌరవప్రదమయిన ఉత్తరం వేయబడింది. 30. అది సులైమాను తరఫు నుండి వచ్చింది. అదిలా ఉంది : అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను. 31. నీవు నాకు ప్రతిగా తలబిరుసుతనం చూపరాదు. విధేయతా భావంతో నా దగ్గరకు వచ్చేయాలి.' 32. రాణి ఇలా అన్నది : 'నా ఆస్థాన ప్రముఖులారా! నా వ్యవహారంలో మీరు నాకు సలహా ఇవ్వండి. మీరు లేకుండా నేను ఏ నిర్ణయం కూడా గైకొనను కదా!' 33. వారిలా చెప్పారు : '(అమ్మా!) మనం బలాఢ్యులం. గట్టి పోరాటపటిమ కలవారం. ఇక నిర్ణయాధికారం మీదేనమ్మా. మీరేమని ఆజ్ఞాపిస్తారో చూసుకోండి!' 34. రాణి ఇలా అంది : 'రాజులు ఏ పట్టణంలో జొరబడినా అక్కడ విధ్వంసం సృష్టిస్తారు. అక్కడి మర్యాదస్తులను పరాభవం

పాల్జేస్తారు. వీళ్ళూ అదే చేయవచ్చు. 35. నేను వారి వైపు ఒక కానుకను పంపిస్తాను. తరువాత దూతలు ఏం సమాధానం తీసుకువస్తారో వేచి చూస్తాను.'

36. (రాణిగారి) రాయబారి సులైమాన్ వద్దకు వచ్చినపుడు అతనిలా అన్నాడు : 'ఏమిటి, మీరు డబ్బూ దస్కంతో మాకు సహాయం చేయాలనుకుంటున్నారా? దేవుడు నాకు ప్రసాదించినది, మీకు ప్రసాదించిన దానికన్నా మేలైనది. కాబట్టి మీ కానుకతో మీరే సంతోషపడండి. 37. నువ్వు వాళ్ళ దగ్గరకే తిరిగి వెళ్ళు. వాళ్ళు ప్రతిఘటించలేని సైన్యాలను మేము తీసుకుని వస్తాము. మేము వారిని పరాభవానికి గురిచేసి అక్కడి నుండి వెళ్ళగొడ్తాము. కడకు వారు అణగారిపోతారు.'

38. సులైమాన్ ఇలా అన్నాడు : 'సభాసదులారా! వారు విధేయులై మా వద్దకు రాకముందే ఆమె సింహాసనాన్ని ఇక్కడకు తీసుకువచ్చే వారెవరు?' 39. జిన్నులలోని ఓ బలిష్టుడు, 'తమరు తమ స్థానం నుండి లేవక ముందే నేను దానిని మీ సమక్షంలో తెచ్చిపెడతాను. ఆపాటి శక్తి నాకుంది. నిజాయితీ తత్పరత గలవాణ్ణి కూడాను' అన్నాడు. 40. అంతలో గ్రంథజ్ఞానం గల ఒక వ్యక్తి ఇలా అన్నాడు : 'మీరు కళ్లు మూసి తెరిచేలోగా నేను దానిని మీ ముందు తెచ్చిపెట్టగలను!' అంతే. ఆ సింహాసనం తన కళ్ళెదుట ఉండటం చూసి సులైమాన్ ఇలా పలికాడు : 'ఇది నా ప్రభువు అనుగ్రహం. నేను కృతజ్ఞునిగా మసలుకుంటానో లేక కృతఘ్నుడ్ని అవుతానో పరీక్షించేందుకే ఇలా జరుగుతోంది. ఎవడు కృతజ్ఞతాపూర్వకంగా వ్యవహరిస్తాడో అతను తన (మేలు) కోసమే కృతజ్ఞుడుగా ఉంటాడు. మరెవరయినా కృతఘ్నునిగా వ్యవహరిస్తే నా ప్రభువు నిరపేక్షాపరుడు. గొప్ప ఉదాత్తుడు.'

41. సులైమాన్ ఆదేశించాడు : 'ఆమె సింహాసనం రూపురేఖలను మార్చివేయండి. ఆమె గుర్తుపడుతుందో లేక గుర్తుపట్టని వారిలో చేరుతుందో చూద్దాం.' 42. ఆమె రాగానే, 'మీ సింహాసనం ఇలాగే ఉంటుందా?' అని అనబడింది. దానికామె, 'ఇదీ అచ్చం అలాగే ఉంది. మాకు ఇంతకుముందే తెలిసివచ్చింది. మేము విధేయులం (ముస్లిములం) అయ్యాము' అని చెప్పింది.

43. నిజదైవాన్ని వదలి ఆమె వేటినయితే పూజించేదో అవి ఆమెను (సన్మార్గం నుండి) ఆపి ఉంచేవి. అందుకే ఆమె అవిశ్వాస జనులలో చేరి ఉండేది. 44. 'ప్రాసాదం లోనికి ప్రవేశించండి' అని ఆమెతో అనబడింది. ఆమె దానిని చూడగానే, అది నీటి కొలను అనుకుంది. అందుకే ఆమె తన వస్త్రాన్ని పిక్కల వరకూ విప్పింది. 'ఇది అద్దాల మేడ మాత్రమే' అన్నాడు సులైమాన్. ఆమె ఇలా అంది : 'నా ప్రభూ! నేను ఆత్మకు అన్యాయం చేసుకుంటిని. ఇప్పుడు నేను సులైమాన్‌తో పాటు సకలలోకాల ప్రభువుకు విధేయురాలినయ్యాను.'

45. మేము సమూద్ వైపు, వారి సహోదరుడైన సాలెహ్‌ను పంపాము –'అల్లాహ్‌నే ఆరాధించండి' అనే పిలుపు ఇవ్వటానికి. అయితే వారు రెండు ముఠాలుగా చీలిపోయి, పరస్పరం పెనుగులాడుకోసాగారు. 46. అతనిలా అన్నాడు : 'నా జాతివారలారా! మీరు మేలుకు ముందు కీడు కొరకు ఎందుకింత తొందరపెడుతున్నారు. మీరు క్షమాపణకై దైవాన్ని ఎందుకు ప్రార్థించరు? ప్రార్థిస్తే మీరు కరుణించబడవచ్చుకదా!' 47. వారిలా సమాధాన మిచ్చారు : 'మేము నిన్నూ, నీ వెంట ఉన్నవారినీ దరిద్రపుగొట్టులుగా భావిస్తు న్నాము.' సాలెహ్ చెప్పాడు : 'మీ దరిద్రం దైవాధీనమై ఉంది. అసలు విషయం ఏమిటంటే, మీరు పరీక్షించబడుతున్నారు.'

48. ఆ పట్టణంలో నవ ముష్కర మూక ఒకటుండేది. భువిలో కల్లోలం సృష్టించటమే వారి పని. సంస్కరణ అంటేనే వారికి గిట్టదు. 49. వాళ్లు ఈ విధంగా కూడబలుక్కున్నారు : 'మేము అతనినీ, అతని సహచరులను గుట్టుచప్పుడు కాకుండా కడతేరుస్తాం అని ఒట్టేసుకోండి. తరువాత అతని సంరక్షకులతో, అతని ఇంటివారు చంపబడినపుడు మేమక్కడ లేమని చెప్పేద్దాం. మేము చెప్పేది నిజం అని అందాం.' 50. ఈ విధంగా అక్కడ వారొక ఎత్తుగడవేస్తే, మేము కూడా ఒక ఎత్తుగడ వేశాము. దాని వాసన కూడా వారికి సోకలేదు. 51. ఇక చూడండి వారి ఎత్తుగడ ఎలా బెడిసికొట్టిందో! మేము వాళ్ళనూ, వారి జాతినంతటినీ తుడిచిపెట్టేశాము. 52. అదిగో వారి నివాస గృహాలు! వారి దురాగతాల కారణంగా అవి

నిర్మానుష్యంగా పడి ఉన్నాయి. నిశ్చయంగా ఇందులో తెలుసుకోగల జనులకు గుణపాఠం ఉంది. 53. ఇకపోతే, మేము విశ్వసించి, భయభక్తులతో వ్యవహరించే వారిని కాపాడాము.

54. లూత్ తన జాతివారితో ఇలా అన్నప్పుడు (ఏం జరిగిందో చూడండి) : 'మీరు చూస్తూనే నీతిబాహ్యమైన పనికి పాల్పడతారా? 55. అవ్వ! మీరు స్త్రీలను వదిలేసి, పురుషులతో మీ కామతాపం చల్లార్చు కుంటారా!? మీరు మరీ మూర్ఖులుగా ప్రవర్తిస్తున్నారు. 56. అప్పుడు అతని జాతివారి నుండి ఈ సమాధానం తప్ప మరొకటి రాలేదు : 'లూత్ ఇంటివారిని మీ బస్తీ నుండి వెళ్ళగొట్టండి. వీళ్ళు మహా పవిత్రులుగా తయారవు తున్నారు.'

57. తరువాత మేము అతనిని, అతని వెంట ఉన్నవారిని రక్షించాము – ఒక్క అతని అర్ధాంగిని తప్ప! ఆమె వెనక ఉండేవారి సరసన చేరుతుందని మేము ముందే నిర్ధారించాము. 58. మేము వారిపై ప్రచండమైన వాన కురిపించాము. హెచ్చరిక చేయబడిన ఆ మూకపై కురిపించబడిన వాన ఎంత ఘోరంగా పరిణమించిందో చూశారుగా! 59. ఇలా అను : స్తోత్రం అల్లాహ్‌కే శోభాయమానం. ఆయన ప్రత్యేకంగా ఎన్నుకున్న దాసులపై శాంతి కలుగుగాక! చెప్పండి, అల్లాహ్ మేలా? లేక వారు సహవర్తులుగా ఎంచినవారా?

◆ (20) 60. భూమ్యాకాశాలను సృష్టించినదెవరు? మీకోసం ఆకాశం నుండి నీటిని కురిపించినదెవరు? తరువాత మేము దాని ద్వారా అందము చిందే తోటల్ని ఉత్పన్నం చేశాము. ఆ తోటల్ని ఉత్పన్నం చేయటమన్నది మీ వల్ల అయ్యే పనికాదు. ఏమిటి, అల్లాహ్‌తో పాటు మరో దేవుడు కూడా ఉన్నాడా? అసలు విషయం ఏమిటంటే వారు మధ్యేమార్గం పట్ల విముఖత చూపే జనులు. 61. చెప్పండి, భూమిని నివాస యోగ్యంగా చేసినదెవరు? అందులో నదీనదాలను ఎవరు ప్రవహింపజేశారు? దాని స్థిరత్వం కోసం ఆయనే పర్వతాలను ప్రతిష్ఠించాడు. (రెండు) సముద్రాల

మధ్య అడ్డుతెరను వేశాడు. మరైతే, అల్లాహ్‌తో పాటు మరో దేవుడు కూడా ఉన్నాడా? కాని వారిలోని అనేకులు తెలియనివారే.

62. దీనుడు మొరపెట్టుకుంటున్నప్పుడు, అతని మొరను ఆలకించి, అతని బాధను దూరం చేసేవాడెవడు? మిమ్మల్ని భువికి వారసుల్ని చేసినదెవరు? ఏమిటి, అల్లాహ్‌తో పాటు మరో దేవుడు కూడా ఉన్నాడా? మీరైతే ఉపదేశం గ్రహించేది బహుస్వల్పం. 63. నేలపైనా, సముద్రాలలోని చీకట్లలోనూ మీకు దారి చూపేది ఎవరు? తన కారుణ్యజల్లుకు ముందు పవనాలను శుభసూచకంగా పంపేది ఎవరు? ఏమిటి, అల్లాహ్‌తో పాటు మరో దేవుడు కూడా ఉన్నాడా? వారు కల్పించే భాగస్వాములకు (షిర్క్‌కు) అల్లాహ్ అతీతుడు, ఎంతో ఉన్నతుడు. 64. సృష్టిని ఆరంభించినదెవరు? దానిని మళ్ళీ పునరావృతం చేయగలవాడెవడు? భూమ్యాకాశాల నుండి మీకు జీవనోపాధిని సమకూర్చేది ఎవరు? ఏమిటి, అల్లాహ్‌తో పాటు మరో దేవుడు కూడా ఉన్నాడా? వారికి చెప్పు : 'మీరు సత్యసంధులే అయితే, దాని ప్రమాణం తీసుకురండి.'

65. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'భూమ్యాకాశాలలో అగోచర విషయాల జ్ఞానం కలవాడు అల్లాహ్ తప్ప వేరెవడూ లేడు. వారెప్పుడు లేపబడతారన్నదీ వారికి తెలియదు.' 66. పైగా పరలోకం విషయంలో వారి పరిజ్ఞానంపై స్తబ్ధత ఆవరించింది. అసలు ఈ వ్యవహారంలో వారు సంశయానికి లోనయ్యారు. లేదు ... వారు అంధులై పోయారు. 67. తిరస్కారానికి ఒడిగట్టిన వారిలా అన్నారు : 'ఏమిటి, మేమూ, మా తండ్రీ తాతలు మట్టయి పోయాక కూడా మేము భూమిలో నుండి వెలికి తీయబడతామా? 68. ఈ వాగ్దానం మాకూ చేయబడింది. అంతకు మునుపు మా పూర్వీకులకు కూడా చేయబడింది. ఇవన్నీ ప్రాచీన కాలపు కట్టుకథలు తప్ప మరేమీ కావు.' 69. వారికి చెప్పు : 'భూమిలో సంచరించి, అపరాధులకు పట్టిన గతేమిటో చూడండి.'

70. వారి స్థితిపై ఆవేదన చెందకు. వారు పన్నే పన్నాగాలకు నీ మనసు నొచ్చుకోరాదు సుమా! 71. 'మీరు చెప్పేదే నిజమయితే ఆ వాగ్దానం

ఎప్పుడు నెరవేరుతుంది?' అని వారు (వ్యంగ్యంగా) అంటారు. 72. వారితో అను : 'దేని గురించి మీరు తొందరపెడుతున్నారో బహుశా అందులో ఎంతో కొంత ఈ పాటికి మిమ్మల్ని సమీపించి ఉండవచ్చు.' 73. నిశ్చయంగా నీ ప్రభువు ప్రజాబాహుళ్యం పట్ల గొప్ప అనుగ్రహశాలి. కాని వారిలో అత్యధికులు కృతజ్ఞతలు తెలుపుకోరు. 74. నిశ్చయంగా వారి ఆంతర్యాలు దాచి ఉంచేవీ, బహిర్గతం చేసేవీ - అన్నీ నీ ప్రభువుకు తెలుసు. 75. భూమ్యాకాశాలలో దాగివున్న ఏ వస్తువు కూడా స్పష్టమయిన గ్రంథంలో నమోదవకుండా లేదు.

76. నిశ్చయంగా ఈ ఖుర్ఆన్ ఇస్రాయీల్ వంశీయులు విభేదించుకునే ఎన్నో విషయాలలోని వాస్తవికతను తేటతెల్లం చేస్తున్నది. 77. విశ్వాసుల పాలిట ఇది మార్గదర్శిని, కారుణ్యవాహిని. 78. నిశ్చయంగా నీ ప్రభువు తన ఆజ్ఞానుసారం వారి మధ్యన తీర్పుచేస్తాడు. ఆయన మహాశక్తిశాలి, మహాజ్ఞాని. 79. కాబట్టి నీవు అల్లాహ్‌నే నమ్ముకో. నిస్సందేహంగా నీవు స్పష్టమయిన ధర్మంపై ఉన్నావు. 80. నీవు మృతులకు వినిపించలేవు. వెనుతిరిగిపోయే బధిరులకు కూడా నీవు నీ పిలుపును వినిపించలేవు. 81. అలాగే నీవు అంధులకు కూడా మార్గభ్రష్టత నుండి కాపాడి, సన్మార్గం చూపలేవు. మా వచనాలను నమ్మి, విధేయత చూపేవారికి మాత్రమే నీవు వినిపించగలవు.

82. (వారికి వ్యతిరేకంగా) విషయం వారిపై వచ్చిపడినపుడు, మేము వారికోసం భూమి నుండి ఒక 'దాబ్బహ్' (మానవేతర జీవి)ని వెలికితీస్తాము. అది వారితో మాట్లాడుతుంది. ఎందుకంటే జనులు మా వచనాలను (సూచనలను) నమ్మేవారు కారు. 83. ఆ రోజు మేము ప్రతి మానవ సముదాయం నుండి మా ఆయతులను అసత్యాలుగా చిత్రీకరించిన ఒక్కొక్క సమూహాన్ని సమీకరిస్తాము. తరువాత వారు వివిధ శ్రేణులుగా విభజించబడతారు. 84. కడకు వారంతా ప్రోగైన తరువాత, 'మీకు నా ఆయతులను గురించి పూర్తిగా తెలియకపోయినప్పటికీ, వాటిని మీరు అసత్యంగా ముద్ర వేశారు. అవునా? లేదంటే మీరు మరేం చేసేవారో

చెప్పండి?' అని దేవుడు అడుగుతాడు. 85. ఆ విధంగా వారిపై మాట పూర్తవుతుంది. ఎందుకంటే వారు దుర్మార్గానికి ఒడిగట్టేవారు. అందువల్ల వారు నోరు మెదపలేరు. 86. ఏమిటి, ప్రజలు విశ్రాంతి తీసుకునే నిమిత్తం మేము రాత్రిని చేయటాన్ని వారు చూడలేదా? ఇంకా పగటిని చూడగలిగేదిగా చేశాము. నిశ్చయంగా ఇందులో విశ్వసించే జనులకు సూచనలున్నాయి.

87. శంఖం ఊదబడిన రోజున భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ కలవరం చెందుతాయి – అయితే దేవుడు కోరిన వారికి మాత్రం ఈ కలవరం ఉండదు. అందరూ ఆయన ముందు నిస్సహాయులై హాజరవుతారు. 88. నీవు పర్వతాలను చూసి అవి స్థిరంగా నిలబడి ఉన్నాయని అనుకుం టున్నావు. కాని అవి కూడా మేఘమాలికల్లా తేలియాడుతూ ఉంటాయి. ఇది దేవుని పనితనం. ఆయన ప్రతి వస్తువునూ దృఢతరంగా చేశాడు. నిశ్చయంగా మీరు చేస్తున్నదంతా ఆయనకు తెలుసు. 89. ఎవరయితే మంచిని తీసుకువస్తాడో అతనికి అంతకంటే మేలైనదే ప్రాప్తమవుతుంది. ఆ రోజు వారు కలవరం నుండి సురక్షితంగా ఉంటారు. 90. మరే వ్యక్తి అయితే చెడును తెస్తాడో – అలాంటివారు తలక్రిందులుగా నరకంలో పడవేయ బడతారు. మీరు చేసుకున్నదే ప్రతిఫలంగా మీకు లభిస్తోంది (అని వారితో అనబడుతుంది).

91. (ప్రవక్తా! వారితో అను) 'ఈ (మక్కా) నగర ప్రభువునే ఆరాధించాలని నాకు ఆజ్ఞాపించబడింది. ఆయన దీనిని పవిత్ర క్షేత్రంగా చేశాడు. ప్రతిదీ ఆయనదే. నేను విధేయత చూపేవానిగా ఉండాలని ఆదేశించబడ్డాను. 92. ఇంకా ఖుర్‌ఆన్ పారాయణం చేస్తూ ఉండాలని కూడా (ఆజ్ఞాపించబడ్డాను). ఎవడు సన్మార్గాన్ని అవలంబించినా అతను తన స్వయం కొరకే అవలంబిస్తాడు. మరెవడయినా మార్గవిహీనుడైనట్లయితే, 'హెచ్చరించటం వరకే నా బాధ్యత' అని వారికి చెప్పేయ్. 93. ఇంకా ఇలా చెప్పు : 'సర్వస్తోత్రాలు అల్లాహ్ కొరకే. ఆయన తన సూచనలను మీకు చూపినపుడు, మీరు వాటిని గుర్తుపడతారు. మీరు చేసే పనుల పట్ల మీ ప్రభువు పరధ్యానంలో లేడు.'

# 28. అల్ ఖసస్ (వృత్తాంతం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. తా – సీన్ – మీమ్. 2. ఇవి సుస్పష్టమయిన గ్రంథ వచనాలు. 3. విశ్వసించిన జనుల కోసం మేము నీకు మూసా, ఫిరౌనుల సమాచారాన్ని యధాతథంగా వినిపిస్తున్నాము. 4. నిశ్చయంగా ఫిరౌన్ భువిలో (ఈజిప్టు రాజ్యంలో) అహంభావిగా తయారయ్యాడు. అతను తన పౌరులను వివిధ వర్గాలుగా వర్గీకరించాడు. వారిలో ఒక వర్గాన్ని మరీ బలహీనవర్గంగా మార్చేశాడు. అతను వారి మగపిల్లల్ని చంపేసి, వారి స్త్రీలను మాత్రం బ్రతకనిచ్చేవాడు. నిశ్చయంగా అతను కల్లోల జనకుడుగా ఉండేవాడు. 5. భువిలో అణచివేతకు గురైన వారిని కటాక్షించాలని, వారిని పేష్వాలుగా, వారసులుగా చేయాలని మేము కోరుకున్నాం. 6. భువిలో వారికి అధికారం ప్రసాదించాలని, ఫిరౌను, హామాన్ మరియు వారి సైనికులు దేని గురించి భయపడేవారో అదే వారికి చూపాలని నిర్ణయించుకున్నాము.

7. మేము మూసా తల్లికి (వహీ ద్వారా) సూచించాము – 'ఆ పసివాడికి పాలు త్రాగించు. మరి నీకు అతని విషయంలో ఎప్పుడు భయం కలిగినా, అతనిని నదిలో విడిచిపెట్టు. భయపడకు, దుఃఖించకు. మేమతన్ని నీ వద్దకే చేరుస్తాము. అతనిని మా ప్రవక్తలలో ఒకడుగా చేసుకుంటాము.' 8. తరువాత ఫిరౌన్ ఇంటివారే ఆ పసివాణ్ణి ఎత్తుకున్నారు – అతను వారి పాలిట శత్రువు, దుఃఖకారకుడు కావటానికి! నిశ్చయంగా ఫిరౌన్, హామాన్, వారి సైనికులు – అందరూ దోషులే. 9. ఫిరౌన్ భార్య ఇలా అన్నది : '(ఏమండీ!) ఈ బాబు నాకూ, మీకూ కంటి చలువగా ఉన్నాడు కదండీ! ఇతన్ని చంపవద్దండీ. ఇతను మనకు ప్రయోజకుడు కావచ్చండీ లేదా మనం ఇతన్ని దత్తపుత్రునిగా చేసుకోవచ్చు, ఆశ్చర్యమేముందీ!?' కాని (వారేం చేస్తున్నారో) తెలుసుకోలేకపోయారు.

10. మరోవైపు మూసా తల్లి మనసు తల్లడిల్లిపోతోంది. ఆమె

విశ్వాసురాలిగా ఉండేందుకు మేమే గనక ఆమె మనసును కుదుటపరచి ఉండకపోతే, ఆమె ఆ వ్యవహారాన్ని బట్టబయలు చేసేదే! 11. ఆమె ఆ పిల్లవాని అక్కతో ఇలా చెప్పింది : 'నువ్వు ఇతని వెనకాలే వెళ్ళు.' అందువల్ల ఆమె దూరం నుండే – అపరిచితురాలి మాదిరిగా – గమనిస్తూ వెళ్ళింది. ఆ సంగతి వాళ్ళకు తెలీదు. 12. మేము ముందు నుంచే మూసా కొరకు ఆయాల పాలు నిషేధించి ఉన్నాము. ఆమె వాళ్ళతో ఇలా అంది : 'ఈ పిల్లవాణ్ణి అల్లారుముద్దుగా పెంచే, ఇతని బాగోగులను అభిలషించే ఇంటివారి ఆచూకీ నేను మీకు తెలుపనా?' 13. ఆ విధంగా మేము మూసాను అతని తల్లి వైపునకు మరల్చాము – తద్వారా ఆమె కళ్ళకు చలువ ప్రాప్తించాలని! ఆమె దుఃఖితురాలై ఉండకూడదని!! ఇంకా దేవుని వాగ్దానం సత్యమని ఆమె తెలుసుకోవాలని (మేమిలా చేశాము). కాని చాలామంది (ఈ పరమార్థాన్ని) తెలుసుకోరు. 14. మూసా తన యుక్త వయస్సుకు చేరుకుని, పరిపక్వత పొందినపుడు మేమతనికి యుక్తినీ, జ్ఞానాన్ని ప్రసాదించాము. సదాచార సంపన్నులకు మేము ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తూ ఉంటాము.

15. నగరవాసులు ఆదమరచి (నిద్రిస్తూ) ఉన్న సమయంలో అతను నగరంలోనికి వచ్చాడు. అక్కడ ఇద్దరు వ్యక్తులు ఘర్షణపడటం అతనికి కనిపించింది. వారిలో ఒకతను తన జాతికి చెందినవాడైతే, రెండవతను శత్రువర్గానికి చెందినవాడు. తన శత్రువర్గానికి చెందిన వ్యక్తికి వ్యతిరేకంగా ఆ వ్యక్తి సహాయం అర్థించాడు. అంతే. మూసా అతన్ని ఒక్క గుద్దు గుద్దాడు. దాంతో అతని కథ ముగిసింది. అప్పుడు మూసా ఇలా అన్నాడు : 'ఇది షైతాన్ ప్రేరిత చేష్టే. ముమ్మాటికీ వాడు బద్ధ విరోధి. స్పష్టంగా మార్గభ్రష్టతకు లోను చేసేవాడు.' 16. అతనిలా ప్రార్థించాడు: 'నా ప్రభూ! నేను నా ఆత్మకు అన్యాయం చేసుకున్నాను. కనుక నన్ను క్షమించు.' అందువల్ల దేవుడతనిని క్షమించాడు. నిశ్చయంగా ఆయన అమితంగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడు. 17. అప్పుడు మూసా ఇలా అన్నాడు : 'నా ప్రభూ! నీవు నన్ను కటాక్షించినట్లే, ఇక నుండి నేను ఏ అపరాధికీ సహాయపడను.'

18. తెల్లవారాక అతను భయపడుతూనే సమాచారం గ్రహిస్తూ నగరంలోనికి వెళ్ళాడు. చూస్తే, నిన్న సహాయం కోసం తనను పిలిచిన వ్యక్తే మళ్లీ ఈ రోజు సహాయం కోసం కేకవేశాడు. మూసా అతనిని ఉద్దేశించి, 'ఖచ్చితంగా నువ్వు పెడదారి పట్టావు' అన్నాడు. 19. ఆ తరువాత అతను తామిద్దరికీ శత్రువు అయిన వ్యక్తిని పట్టుకోబోతుండగా, అతనిలా అన్నాడు: 'మూసా! నిన్న నువ్వు ఒక వ్యక్తిని చంపేసినట్లే నన్ను కూడా చంపేయ దలిచావా? చూస్తుంటే నువ్వు రాజ్యంలో దౌర్జన్యపరుని మాదిరిగా ఉన్నావు. సంస్కర్తగా ఉండాలన్న అభిలాష నీలో ఏ కోశానా కనిపించటం లేదు.' 20. అంతలో ఒక వ్యక్తి నగరం చివరి నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి, 'ఓ మూసా! ఆస్థాన ప్రముఖులు నిన్ను వధించటానికి సంప్రతింపులు జరుపుతున్నారు. కాబట్టి నువ్వు వెంటనే ఇక్కణ్ణుంచి వెళ్ళిపో. నేను నీ శ్రేయోభిలాషిగా చెబుతున్నాను.' 21. దాంతో మూసా భయపడుతూనే, జాగ్రత్తగా అక్కడి నుండి బయటపడ్డాడు. నా ప్రభూ! నన్ను దుర్మార్గ జనుల నుండి రక్షించు' అని ప్రార్థించాడు.

22. అతను మద్యన్ వైపు అభిముఖమైనపుడు, 'నా ప్రభువు నన్ను సరైన మార్గంలోనే తీసుకుపోతాడని ఆశిస్తున్నాను' అన్నాడు. 23. అతను మద్యన్ జలనిధి వద్దకు చేరుకున్నప్పుడు అక్కడ ఓ జన సమూహం (తమ పశువుల మందకు) నీరు త్రాగించటం చూశాడు. వారికి ఎడంగా ఇద్దరు స్త్రీలు తమ మేకలను ఆపుకుని నిలబడి ఉండటం కనిపించింది. 'ఇంతకీ మీ సమస్య ఏమిటి?' అని అడిగాడు మూసా ఆ స్త్రీలను. 'ఈ పశువుల కాపరులు తమ పశువులను తోలుకుపోయే వరకూ మేము మా మేకలకు నీరు త్రాగించలేము. మా నాన్న చాలా వృద్ధుడు' అని ఆ వనితలు వివరించారు. 24. అప్పుడు మూసా వారి మేకలకు నీరు త్రాగించి, నీడను ఆశ్రయించి ఇలా వేడుకున్నాడు : 'నా ప్రభూ! నీవు నాపై ఏ మేలును అవతరింపజేసినా, నాకు దాని అవసరం ఉంది.'

25. తరువాత ఆ ఇద్దరు అమ్మాయిలలో ఒకామె సిగ్గుపడుతూ వచ్చి

ఇలా అన్నది : 'నీవు మా (మేకల)కు నీరు త్రాపినందుకు ప్రతిఫలం ఇవ్వటానికి మా నాన్నగారు నిన్ను పిలుస్తున్నారు.' అతను ఆ పెద్ద మనిషి వద్దకు వచ్చి తన వృత్తాంతమంతా వినిపించినపుడు, 'భయపడకు. నీవు దుర్మార్గ జనుల నుండి విముక్తి పొందావు' అని ఓదార్చాడు. 26. వారిరువురిలో ఒక అమ్మాయి ఇలా అంది : 'నాన్నా! ఇతన్ని ఉద్యోగిగా నియమించుకోండి. మీరు ఎవరిని జీతంపై పెట్టుకున్నా అతను బలవంతుడుగా, విశ్వసనీయుడుగా ఉంటే మంచిది.' 27. ఆ పెద్దాయన ఇలా అన్నాడు : 'నా ఇద్దరు కూతుళ్ళలో ఒకామెను నీకిచ్చి వివాహం చేయగోర్తున్నాను. అయితే ఒక షరతు. నీవు నా దగ్గర ఎనిమిదేళ్ళు ఉద్యోగిగా ఉండాలి. ఒకవేళ నీవు పదేండ్లు పూర్తి చేయగలిగితే అది నీ తరఫున (మేలు అవుతుంది). నిన్ను కష్టపెట్టాలన్న ఉద్దేశం నాకు లేదు. దైవచిత్తమయితే నీవు నన్ను సజ్జనునిగా పొందగలవు.' 28. మూసా ఇలా అన్నాడు : 'మీకూ-నాకూ మధ్య ఈ ఒప్పందం కుదిరినట్లే. ఈ రెండు గడువులలో ఏ ఒక్క దానిని నేను పూర్తిచేసినా, నాపై ఎలాంటి బలవంతం ఉండకూడదు. మనం చెప్పుకున్న మాటలకు దేవుడే సాక్షి.'

29. తరువాత మూసా గడువును పూర్తిచేసి, తన ఇంటివారితో పయనమవుతుండగా, అతను తూరు (పర్వతం) వైపున అగ్నిని చూశాడు. అతను తన ఇంటివారితో ఇలా అన్నాడు : 'మీరిక్కడే ఉండండి. నేను అగ్నిని చూశాను. బహుశా నేనక్కడి నుండి ఏదన్నా సమాచారం రాబట్టవచ్చు లేదా మీరు చలి కాచుకోవటానికి నిప్పు కణికనయినా తేవచ్చు.' 30. మరి అతనక్కడికి చేరుకోగానే, లోయ కుడి అంచు నుండి, శుభవంతమైన ప్రదేశంలోని ఒక వృక్షం నుండి పిలువబడింది : 'ఓ మూసా! నేనే సర్వలోకాల ప్రభువైన అల్లాహ్‌ను. 31. నీ చేతి కర్రను పడవెయ్యి.' అదొక సర్పం మాదిరిగా ప్రాకటం చూసి, అతను వెన్నుచూపి పారిపోసాగాడు. తిరిగి చూడనయినా లేదు. 'ఓ మూసా, ముందుకు రా! భయపడకు. నీవు సురక్షితంగా ఉన్నావు. 32. నీ చేతిని చంకలో పెట్టుకో. అది ఏ దోషం లేకుండానే ప్రకాశిస్తూ బయటికి వస్తుంది. ఇంకా భయం (లేకుండా ఉండటం) కోసం నీ భుజాన్ని

నీ వైపు అదుముకో. ఫిరౌన్ వద్దకు, అతని ఆస్థాన ప్రముఖుల వద్దకు వెళ్ళటానికి నీ ప్రభువు తరఫున నీకు ఇవ్వబడిన రెండు ప్రమాణ నికషాలివి. నిశ్చయంగా వారు దుర్మార్గ జనులుగా ఉన్నారు.

33. మూసా ఇలా విన్నవించుకున్నాడు : 'ఓ నా ప్రభూ! నేను వారిలో ఒక వ్యక్తిని చంపి ఉన్నాను. అందుకే వారు నన్ను చంపేస్తారేమోనని భయపడుతున్నాను. 34. నా సోదరుడైన హారూన్ నాకన్నా మంచి వాక్పటిమ కలవాడు. కాబట్టి నన్ను ధ్రువీకరించే నిమిత్తం నీవు అతనిని నా సహాయకునిగా చేసి పంపు. వారు నన్ను అసత్యవాదిగా చిత్రీకరిస్తారేమోనన్న భయం ఉంది.' 35. సెలవిచ్చాడు : 'మేము నీ సోదరుని ద్వారా నీ బాహువులను బలపరుస్తాము. మేము మీరిద్దరికీ ఆధిక్యతను ప్రసాదిస్తాము. వారు మీ జోలికి రారు. మా సూచనల ఆధారంగా మీరిరువురూ, మీ అనుయాయులు మాత్రమే ప్రాబల్యం వహిస్తారు.'

36. తరువాత మూసా మా సూచనలను తీసుకుని వారి దగ్గరకు వెళ్ళినపుడు, 'ఇదొక కాల్పనిక మాయాజాలంలా ఉంది. ఇలాంటి విషయమేదీ మేము పూర్వీకులైన మా తాతముత్తాతల ద్వారా వినలేదు' అని వారన్నారు. 37. మూసా ఇలా అన్నాడు : 'తన తరఫు నుండి మార్గదర్శకత్వాన్ని తీసుకుని వచ్చిన వాని గురించి, పరలోక నిలయం పొందేవాని గురించి నా ప్రభువుకు బాగా తెలుసు. నిశ్చయంగా దుర్మార్గులు సాఫల్యం పొందలేరు.' 38. ఫిరౌన్ అన్నాడు : 'ఓ ఆస్థాన ప్రముఖులారా! మీకు నేను తప్ప మరో దేవుడు ఉన్నాడన్న సంగతి నాకు తెలియదు. ఓ హామాన్! నా కోసం మట్టిని కాల్చు. తరువాత నా కోసం ఓ ఆకాశహర్మ్యం నిర్మించు - తద్వారా నేను మూసా దేవుణ్ణి తొంగిచూడగలనేమో! నేనైతే ఇతన్ని ఒక అసత్యవాదిగా తలపో స్తున్నాను.'

39. అతనూ, అతని సిపాయిలు రాజ్యంలో అకారణంగా గర్వాహంకారం ప్రదర్శించారు. వారు మా వైపునకు మరలి రావటం జరగదని భావించేవారు. 40. అందువల్ల మేము అతనినీ, అతని సేనలను

పట్టుకున్నాము. తరువాత వాళ్ళను సముద్రంలో విసరివేశాము. చూశావా! దుర్మార్గులకు ఏ గతి పట్టిందో! 41. మేము వాళ్ళను నరకాగ్ని వైపునకు పిలిచే నాయకులుగా చేశాము. ప్రళయదినాన వారికెలాంటి సహాయం అందదు. 42. మేము ఈ ప్రపంచంలో కూడా వారి వెనుక అభిశాపం తగిలించాము. ప్రళయదినాన వారు దుర్భర స్థితిలో ఉంటారు.

43. పూర్వ తరాలను తుదముట్టించిన మీదట మేము మూసాకు గ్రంథం ప్రసాదించాము – మానవులకు వెలుగుగా, మార్గదర్శినిగా, కారుణ్య ప్రదాయినిగా. తద్వారా వారు హితబోధ గ్రహిస్తారని!

44. (ఓ ప్రవక్తా!) మేము మూసాకు ఆదేశాలు ఇచ్చినపుడు నీవు తూరు పర్వతం పశ్చిమ దిశలోనూ లేవు. నీవు దాని సాక్షులలో కూడా లేవు. 45. అయితే మేము ఎన్నో తరాలను ప్రభవింపజేశాము. వారిపై కూడా ఓ సుదీర్ఘ కాలం గడచిపోయింది. మద్‌యన్ వారికి మా వచనాలను చదివి వినిపించటానికి నీవు వారి మధ్యన కూడా నివసించలేదు కదా! కాని మేము మాత్రం మా ప్రవక్తలను పంపేవారమే. 46. మేము మూసాను పిలిచినపుడు నీవు తూరు (పర్వతం) అంచున కూడా లేవు. అయితే ఇది నీ ప్రభువు తరఫున వొసగబడిన కానుక – తద్వారా నీవు, నీకు పూర్వం హెచ్చరిక చేసేవాడెవడూ రాని జాతి వారిని హెచ్చరించటానికి! తద్వారా వారు హితబోధను గ్రహిస్తారని!

47. వారిపై వారి స్వయంకృతాల కారణంగా ఏదయినా విపత్తు విరుచుకుపడినపుడు, 'మా ప్రభూ! నీవు మా వైపు ఒక ప్రవక్తను ఎందుకు పంపలేదు? పంపి ఉంటే, మేము నీ సూచనలను అనుసరించి ఉండేవారం కదా! మేము విశ్వసించి ఉండేవారం కదా!' అనే పరిస్థితి రాకుండా ఉండేటట్లయితే (మేము ప్రవక్తను పంపేవారం కాము). 48. తరువాత వారి వద్దకు మా తరఫు నుండి సత్యం వచ్చేసినపుడు వారిలా అన్నారు : 'మూసాకు లభించినటువంటిదే ఇతనికి ఎందుకు లభించలేదు?' ఏమిటి, పూర్వం మూసాకు ఇవ్వబడిన దానిని అప్పటివారు తిరస్కరించలేదా? వారిలా

అన్నారు : 'ఉభయులూ (మూసా, ముహమ్మద్) మాంత్రికులే. వారు ఒండొకరి సమర్థకులుగా ఉన్నారు.' ఇంకా ఇలా అన్నారు : 'మేము ఇరువురినీ తిరస్కరిస్తున్నాము.'

49. వారికి చెప్పు : 'ఒకవేళ మీరు చెబుతున్నది నిజమే అయితే మార్గదర్శకత్వం విషయంలో ఈ రెండింటికన్నా ఉత్తమమయిన గ్రంథాన్ని తీసుకుని రండి; నేను దానిని అనుసరిస్తాను.' 50. ఒకవేళ వారు నీ సవాలును స్వీకరించకపోతే, వారు కేవలం తమ కోర్కెలను అనుసరించేవారని తెలుసుకో. దేవుని మార్గదర్శకత్వాన్ని కాదని తన మనోవాంఛల వెనుక నడిచే వాడికంటే ఎక్కువ మార్గవిహీనుడు ఎవడుంటాడు? ఎట్టి పరిస్థితిలోనూ దేవుడు దుర్మార్గ జనులకు సన్మార్గం చూపడు. 51. మేము వారికి మా వాక్కును నిరంతరం అందజేశాము – వారు హితబోధను గ్రహించాలని.

52. మేము పూర్వం గ్రంథం వొసగబడిన వారు దీనిని (ఖుర్ఆన్ను) విశ్వసిస్తారు. 53. వారికి అది (ఖుర్ఆన్) వినిపించబడినపుడు వారిలా అంటారు : 'మేము దీనిని విశ్వసించాము. నిశ్చయంగా ఇది మా ప్రభువు తరఫు నుండి వచ్చిన సత్యం. మేమైతే ముందునుంచే దీనిని విశ్వసిస్తున్నాము. 54. వారు వహించిన సహనానికిగాను వారికి రెండింతల ప్రతిఫలం ఇవ్వబడుతుంది. వారు చెడును మంచి ద్వారా నిర్మూలిస్తారు. మేము వారికి ప్రసాదించిన ఉపాధిలో నుండి ఖర్చుపెడతారు. 55. వారెప్పుడయినా, ఏదయినా వ్యర్థ విషయం విన్నప్పుడు వారు దానిపట్ల అనాసక్తత కనబరుస్తూ ఇలా అంటారు : 'మా కర్మలు మాకు. మీ కర్మలు మీకు. మీకో సలాం. మేము అజ్ఞానులతో వాదించదలచుకోలేదు.' 56. (ప్రవక్తా!) నీవు కోరిన వారికల్లా సన్మార్గం చూపలేవు. దేవుడు, తాను కోరిన వారికి సన్మార్గం చూపుతాడు. మార్గదర్శకత్వం పొందగలవారెవరో ఆయనకే బాగా తెలుసు.

57. వారిలా అంటారు : 'మేమే గనక నీ వెంట ఉండి సన్మార్గాన్ని అవలంబిస్తే, మేము మా భూభాగం నుండి తరిమివేయబడతాం. ఏమిటి, మేము వారికి శాంతిభద్రతలు గల పవిత్ర స్థలం (మక్కా)లో చోటు

కల్పించలేదా? అక్కడ వారికి అన్ని రకాల పండ్లు జీవనోపాధిగా మా తరఫు నుండి సమకూర్చబడుతున్నాయి. కాని వారిలో అనేకులు తెలియనివారే.

58. తమ ఆర్థిక ఒనరులపై మిడిసిపడిన ఎన్నో బస్తీలను మేము అంతమొందించాము. అవిగో, అవే వారి నివాసాలు. వారి తదనంతరం వాటిలో నివసించినవారు బహుకొద్దిమంది మాత్రమే. మేమే వాటికి వారసులమయ్యాము. 59. తన వచనాలను చదివి వినిపించే ప్రవక్తను ముఖ్య పట్టణంలో పంపనంత వరకూ, నీ ప్రభువు అక్కడి జనావాసాలను (అకారణంగా) నాశనం చేయడు. మేము జనావాసాలను, అక్కడి ప్రజలు దుర్మార్గులైపోతేనే తప్ప నాశనం చేసేవారం కాము.

60. మీకు ఏది ఇవ్వబడినా అది ప్రాపంచిక జీవితపు సామగ్రి, దాని తళుకుబెళుకు మాత్రమే. దేవుని వద్ద ఉన్నది మాత్రమే మేలైనది, మిగిలి ఉండేది. మరైతే మీరు అర్థం చేసుకోరా? 61. ఏమిటి, మేము చేసిన వాగ్దానాన్ని పొందిన వ్యక్తి, మేము ప్రసాదించిన ప్రాపంచిక భోగ భాగ్యాలను పొందిన మీదట ప్రళయదినాన (అపరాధిగా) హాజరుపరచబడే వ్యక్తితో సమానుడు కాగలడా?

62. ఆ రోజు దేవుడు వారిని పిలిచి అడుగుతాడు : 'మీరు నా భాగస్వాములుగా చెప్పుకున్న వారెక్కడున్నారు?' 63. ఎవరెవరికి ఈ ప్రశ్న వర్తిస్తుందో వారంతా ఇలా సమాధానమిస్తారు : 'మా ప్రభూ! మేము పెడదారి పట్టించినది వీళ్ళనే. మేము స్వయంగా దారి తప్పినట్లుగానే వీళ్ళను కూడా మేము దారి తప్పించాము. ఇక వారితో మాకెలాంటి సంబంధం లేదని చెబుతున్నాము. వీళ్లు మమ్మల్ని ఆరాధించేవారు కారు.'

64. వారితో అనబడుతుంది : 'సరే, మీ భాగస్వాములను పిలుచుకోండి.' అప్పుడు వారు వాళ్ళను పిలుస్తారు. కాని వాళ్ళు వారికి సమాధానం ఇవ్వరు. వారు శిక్షను చూసుకుంటారు. వారు సన్మార్గం అవలంబించి ఉంటే ఎంత బాగుండేది! 65. ఆ రోజు దేవుడు వారిని పిలిచి,

'ఇంతకీ మీరు సందేశహరులకు ఏమని సమాధానమిచ్చారు?' అని అడిగినప్పుడు, 66. ఆ రోజు వారి సంజాయిషీలన్నీ కనబడకుండా పోతాయి. అందుచేత వారు ఒండొకరిని కూడా ఏమీ ప్రశ్నించుకోలేరు. 67. అయితే ఎవడు పశ్చాత్తాపపడి, విశ్వసించి, సదాచరణ చేశాడో అతడు సాఫల్యం పొందే వారిలో ఉంటాడని ఆశించవచ్చు.

68. నీ ప్రభువు తాను కోరిన దానిని సృష్టిస్తాడు. తాను ఇష్టపడిన వారిని ఎన్నుకుంటాడు. ఎంపిక అధికారం వారి చేతుల్లో లేదు. అల్లాహ్ పరమపవిత్రుడు, వారు కల్పించే భాగస్వామ్యానికి అతీతుడు, మహోన్నతుడు. 69. వారి ఆంతర్యాలు దాచిపెట్టేదీ, వెల్లడించేదీ నీ ప్రభువుకు తెలుసు. 70. ఆయనే అల్లాహ్ – ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేదు. ప్రపంచంలోనూ, పరలోకంలోనూ ఆయనే స్తుతింపదగినవాడు. నిర్ణయాధికారం ఆయనదే. ఆయన వైపునకే మీరు మరల్చబడతారు.

71. వారిని అడుగు : 'చూడండి! ఒకవేళ అల్లాహ్ ప్రళయదినం వరకూ మీపైన నిత్యం రాత్రిని విధిస్తే, అల్లాహ్ తప్ప మీ కొరకు వెలుతురును తేగల దేవుడు ఎవడు? మరైతే మీరు వినరేమిటి?' 72. ఇలా అడుగు : 'చెప్పండి! ఒకవేళ అల్లాహ్ ప్రళయదినం వరకూ మీపైన పగటినే విధించినట్లయితే, అల్లాహ్ తప్ప మీ కోసం, మీరు విశ్రాంతిని పొందటానికి – రాత్రిని తీసుకువచ్చే దేవుడెవరు? ఏమిటి, మీరు గమనించరా?'

73. ఆయనే తన కృపతో మీ కోసం రేయింబవళ్లను నిర్మించాడు – తద్వారా మీరు అందులో విశ్రాంతి నొందాలని! మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించాలని! ఇంకా మీరు కృతజ్ఞులు కావాలని!

74. ఆ రోజు దేవుడు వారిని పిలిచి, 'మీరు ఎవరెవరిని నా భాగస్వాములుగా భావించేవారో వారెక్కడ?' అని అడుగుతాడు. 75. మరి మేము ప్రతి సముదాయంలో నుండి ఒక్కో సాక్షిని తీసుకువస్తాము. తరువాత జనులనుద్దేశ్యించి, 'మీ ప్రమాణాన్ని తీసుకుని రండి' అంటాము. అప్పుడు

వారికి తెలిసివస్తుంది, సత్యం అల్లాహ్ వైపున మాత్రమే ఉందని. వారు కల్పించుకున్నవన్నీ వారి నుండి మటుమాయమవుతాయి.

76. నిశ్చయంగా ఖారూన్ మూసా జాతికి చెందినవాడే. కాని వాడు తన వారిపైనే దౌర్జన్యం చేయసాగాడు. మేము వాడికి అపారమయిన నిధి నిక్షేపాలను వొసగాము. వాటి బీగాలను ఎత్తటానికి బలిష్టులైన పురుషులే అలసిపోయేవారు. అతని జాతివారు అతనిని ఉద్దేశించి ఇలా అన్నారు : 'మిడిసిపడకు. మిడిసిపడే వారిని దేవుడు ఎన్నటికీ ప్రేమించడు. 77. దేవుడు నీకు ప్రసాదించిన దానితో పరలోక నెలవును ఆశించు. నీ ప్రాపంచిక వాటాను కూడా విస్మరించకు. దేవుడు నీకు మేలు చేసినట్లే నీవు కూడా ప్రజలకు మేలు చెయ్యి. భువిలో అరాచకాన్ని, అవ్యవస్థను ఆశించకు. అరాచకం సృష్టించేవారిని దేవుడు సుతరామూ ఇష్టపడడు.'

78. ఖారూన్ ఇలా అన్నాడు : 'ఈ సంపద అంతా నా వద్ద ఉన్న జ్ఞానం (ప్రతిభ) ఆధారంగా ప్రాప్తమయింది.' ఏమిటి, దేవుడు అతనికి పూర్వం ఎన్నో తరాల వారిని, అతనికంటే ఎక్కువ బలవంతులను, మందీమార్బలం కలవారిని నాశనం చేశాడన్న విషయాన్ని అతను గ్రహించలేదా? అపరాధులను వారి పాపాల గురించి ప్రశ్నించటం జరగదు.

79. వాడు (ఒకసారి) తన జాతి వారి మధ్యన సమస్త హంగులతో – ఊరేగింపుగా – వచ్చాడు. అది చూసి ప్రాపంచిక జీవితంపై మోజుపడే వారిలా అన్నారు : 'ఖారూన్‌కు ప్రసాదించబడినదే మాకూ లభించి ఉంటే ఎంత బాగుండేది! నిజంగానే అతడు గొప్ప భాగ్యవంతుడు.' 80. జ్ఞాన సంపద వొసగబడిన వారిలా అన్నారు : 'మీ పాడుగాను! విశ్వసించి, సదాచరణచేసే వానికి దైవప్రసాదిత పుణ్యఫలమే ఎంతో మేలైనది. ఈ భాగ్యం సహనమూర్తులకు తప్ప వేరెవరికీ ప్రాప్తించదు.'

81. తరువాత మేము అతనినీ, అతని నివాస గృహాన్నీ భూమిలో కూర్చివేశాము. అప్పుడు దైవానికి వ్యతిరేకంగా అతనిని ఆదుకునే సమూహం

ఏదీ ముందుకొచ్చి నిలబడలేదు. అతను స్వయంగా కూడా ప్రతిఘటించ లేకపోయాడు. 82. నిన్నటి వరకూ అతనిలాంటి సంపన్నుడు కావాలని కాంక్షించేవారు (నేడు) ఇలా చెప్పుకున్నారు : 'విచారకరం. నిశ్చయంగా దేవుడు తన దాసులలో తాను కోరిన వారి జీవనోపాధిని వికసింపజేస్తాడు. తాను కోరిన వారి ఉపాధిని కుదిస్తాడు. ఒకవేళ దైవానుగ్రహమే గనక మాపై లేకుంటే మమ్మల్ని కూడా నేలలో అణగద్రొక్కి ఉండేవాడే. శోచనీయం! సత్య తిరస్కారులు సాఫల్యం పొందరు.

83. మేము ఈ పరలోక నెలవును భువిలో బడాయిని ప్రదర్శించ కుండా, కల్లోలం సృష్టించకుండా ఉండేవారి కోసమే సిద్ధం చేశాము. అంతిమ పరిణామం భయభక్తులు కలవారిదే సుమా! 84. మంచిని తీసుకుని వచ్చిన వానికి దానికన్నా మేలైనదే లభిస్తుంది. మరెవరయితే చెడును తీసుకువస్తాడో, వారు చేసుకున్న చెడుకు తగ్గ ప్రతిఫలమే (శిక్ష) వారికి లభిస్తుంది.

85. (ఓ ముహమ్మద్!) నిశ్చయంగా నీపై ఖుర్ఆన్‌ను విధించినవాడు, నిన్ను అత్యుత్తమ స్థానానికి చేరుస్తాడు. వారితో అను : 'మార్గదర్శకత్వాన్ని తీసుకు వచ్చిన వారెవరో నా ప్రభువుకు బాగా తెలుసు. స్పష్టమయిన మార్గభ్రష్టత్వానికి లోనై ఉన్నదెవరో కూడా ఆయనకు తెలుసు.' 86. నీపై గ్రంథం అవతరింపజేయబడుతుందని నీవు కూడా ఆశించలేదు. అయితే కేవలం నీ ప్రభువు కృపవల్లనే ఇలా జరిగింది. కనుక నీవు సత్యతిరస్కారులకు సహాయపడకు. 87. దైవ వచనాలు నీ వద్దకు పంపబడిన తరువాత, వారు (సత్య తిరస్కారులు) నిన్ను వాటి నుండి నిరోధించకూడదు సుమా! నీవు మాత్రం నీ ప్రభువు వైపునకు పిలుస్తూ ఉండు. బహుదైవారాధకులలో చేరకు. 88. అల్లాహ్‌తో పాటు వేరితర దైవాన్ని మొరపెట్టుకోకు. ఆయన తప్ప మరో దేవుడు లేనేలేడు. ప్రతిదీ అంతమయ్యేదే – ఒక్క ఆయన అస్థిత్వం తప్ప! నిర్ణయాధికారం ఆయనదే. మీరంతా ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.

# 29. అల్ అన్‌కబూత్ (సాలెపురుగు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ – లామ్ – మీమ్. 2. ఏమిటి, 'మేము విశ్వసించాము' అని పలికినంతమాత్రానికే తాము వదలివేయబడతామని, తమను పరీక్షించటం జరగదని ప్రజలు భావిస్తున్నారా? 3. నిజానికి మేము వారి పూర్వీకులను కూడా పరీక్షించాము. వారిలో సచ్ఛీలురు ఎవరో దేవుడు తెలుసుకుంటాడు. అబద్ధీకులను కూడా ఆయన తెలుసుకుంటాడు.

4. ఏమిటి, దుష్కార్యాలకు పాల్పడే వారు మా పట్టునుండి తప్పించుకోగలమని అనుకుంటున్నారా? వారి ఈ నిర్ణయం చాలా చెడ్డది. 5. అల్లాహ్‌ను కలుసుకోవాలని ఆశించే వ్యక్తి ఎవరయినాసరే – అల్లాహ్ వాగ్దానం అవశ్యంగా రానున్నది. ఆయన అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు. 6. సాధన చేసే వ్యక్తి ఎవరయినాసరే తన స్వయం కొరకే సాధన చేస్తాడు. నిశ్చయంగా దేవుడు లోకవాసుల అక్కర లేనివాడు. 7. ఎవరయితే విశ్వసించి, మంచిపనులు చేస్తారో మేము వారి చెడుగులను వారి నుండి దూరం చేస్తాము. వారు చేసిన మంచి పనులకుగాను వారికి మంచి ప్రతిఫలం ఇస్తాము.

8. తన తల్లిదండ్రుల యెడల ఉత్తమంగా మెలగమని మేము మానవునికి తాకీదు చేశాము. కాని నీకు తెలియని వాటిని నాకు భాగస్వామ్యంగా కల్పించమని వారు నీపై ఒత్తిడి తీసుకువస్తే మటుకు నీవు వారికి విధేయత చూపనవసరం లేదు. మీరంతా నా వద్దకు మరలి రావలసినవారే. మీరు చేసినదంతా అప్పుడు నేను మీకు తెలియపరుస్తాను. 9. ఇక ఎవరయితే విశ్వసించి, సత్క్రియలాచరించారో – వారిని మేము సద్వర్తనులలో చేర్చుకుంటాము.

10. జనులలోని ఒకడు 'మేము అల్లాహ్‌ను విశ్వసించాము' అని

ప్రకటిస్తాడు. తరువాత దైవమార్గంలో అతను బాధించబడినపుడు, ప్రజల తరఫున జరిగిన వేధింపులను 'దేవుడు విధించిన శిక్ష'గా ఊహించుకుంటాడు. ఒకవేళ నీ ప్రభువు తరఫు నుండి ఏదన్నా సహాయం వస్తే 'మేము మీతోనే ఉన్నాం కదండీ!' అనంటారు. లోకవాసుల ఆంతర్యాలలో ఏముందో దైవానికి తెలియదా ఏమిటి? 11. సిసలయిన విశ్వాసులెవరో దేవుడు తప్పక తెలుసుకుంటాడు. కపట విశ్వాసులెవరో కూడా ఆయన అవశ్యంగా తెలుసుకుంటాడు.

12. సత్యతిరస్కారులు విశ్వసించిన వారితో, 'మీరు మా మార్గాన నడవండి. మీ పాపభారమంతా మేమే మోస్తాము' అనంటారు. వారు వీరి పాపాలలో ఏ కాస్త కూడా మోయరు. ముమ్మాటికీ వారు అబద్ధాలకోరులు. 13. వారు తమ బరువులను విధిగా మోస్తారు. తమ బరువులతో పాటు మరికొన్ని బరువులు కూడా వారిపై పడతాయి. వారు కల్పించే అసత్యాలను గురించి ప్రళయదినాన వారు ప్రశ్నించబడతారు.

14. మేము నూహ్‌ను అతని జాతి వారి వైపునకు పంపాము. అతను వారి మధ్య ఏబది తక్కువ వెయ్యేండ్లు ఉన్నాడు. తరువాత వారిని పెను తుఫాను ముట్టడించింది. ఎందుకంటే వారు దుర్మార్గులై ఉండేవారు. 15. ఆ తరువాత మేము నూహ్‌ను, ఓడలోని వారిని రక్షించాము. మేము ఈ సంఘటనను ప్రపంచవాసుల కోసం ఒక సూచనగా చేశాము.

16. ఇబ్రాహీమును కూడా (పంపాము). అతను తన జాతివారితో ఇలా అన్నాడు : 'అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయనకే భయపడండి. మీరు గనక తెలుసుకోగలిగితే ఇదే మీ కొరకు ఎంతో మేలైనది. 17. మీరు నిజదైవమైన అల్లాహ్‌ను వదలి విగ్రహాలను పూజిస్తున్నారు. అబద్ధాలను కల్పించుకుంటున్నారు. అల్లాహ్‌ను కాదని మీరు వేటినయితే ఆరాధిస్తున్నారో, మీకు జీవనోపాధిని కల్పించే అధికారం వాటికి లేదు. కనుక మీరు అల్లాహ్ వద్దనే మీ ఉపాధిని అన్వేషించండి. ఆయన్నే సేవించండి. ఆయనకే కృతజ్ఞులై ఉండండి. ఆయన వద్దకే మీరు మరల్చబడతారు. 18. ఒకవేళ మీరు

త్రోసిపుచ్చినట్లయితే, మీకు పూర్వం గతించిన జాతులు కూడా త్రోసిపుచ్చే ఉన్నాయి. సందేశాన్ని స్పష్టంగా అందజేయటం తప్ప మరో బాధ్యత ప్రవక్తపై లేదు.'

19. దేవుడు సృష్టిని ఏ విధంగా మొదలెడుతున్నాడో వారు గమనించటం లేదా? తరువాత ఆయనే దానిని పునరావృతం చేస్తాడు. నిశ్చయంగా ఇది దైవానికి చాలా తేలిక. 20. వారికి చెప్పు : 'మీరు భువిలో సంచరించి, దేవుడు ఏ విధంగా సృష్టిని మొదలెట్టాడో చూడండి. తరువాత ఆయనే దానికి పునరుజ్జీవనాన్ని ప్రసాదిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. 21. ఆయన తాను కోరిన వారిని దండిస్తాడు. తాను కోరిన వారిపై దయజూపుతాడు. ఆయన వైపునకే మీరంతా మరల్చబడతారు. 22. మీరు భూమిలో గానీ, ఆకాశంలోగానీ (దేవుణ్ణి) అశక్తుణ్ణి చేయలేరు. మీకు అల్లాహ్ తప్ప మరో కార్యసాధకుడు గానీ, సహాయకుడు గానీ లేడు.' 23. ఎవరయితే దైవ సూచనలను, ఆయనతో కాబోయే సమావేశాన్ని ఖండించారో – అలాంటివారే నా కారుణ్యానికి దూరమయ్యారు. వారికి బాధాకరమైన యాతన ఉంటుంది.

24. మరి అతని జాతివారి సమాధానం ఇది తప్ప మరొకటి కాలేదు. వారిలా అన్నారు : 'ఇతన్ని చంపేయండి లేదా ఇతన్ని కాల్చివేయండి.' అప్పుడు అల్లాహ్ అతన్ని అగ్ని నుండి రక్షించాడు. నిశ్చయంగా ఇందులో విశ్వాస మాధుర్యాన్ని ఆస్వాదించిన జనులకు సూచనలున్నాయి. 25. ఇబ్రాహీమ్ వారితో ఇలా అన్నాడు : 'మీరు అల్లాహ్‌ను కాదని ఏ విగ్రహాలనైతే చేసుకున్నారో, అది మీ పరస్పర ప్రాపంచిక సంబంధాల కారణంగానే చేసుకున్నారు. కాని ప్రళయదినాన మీరు ఒకరింకొకరిని ఖండిస్తారు. ఒండొకరిని శపించుకుంటారు. అగ్ని మీ నివాసమవుతుంది. అక్కడ మీకు సహాయపడే వాడెవడూ ఉండడు.' 26. తరువాత లూత్ ఒక్కడే అతన్ని నమ్మాడు. అతనిలా అన్నాడు : 'నేను నా ప్రభువు వైపునకు ప్రస్థానం (హిజ్రత్) చేస్తాను. నిశ్చయంగా ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడు.'

27. మేమతనికి (ఇబ్రాహీముకు) ఇస్‌హాఖ్, యాఖూబులను ప్రసాదించాము. అతని సంతతిలో ప్రవక్త పదవిని, గ్రంథాన్ని ఉంచాము. మేమతనికి ప్రపంచంలోనూ మంచి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. పరలోకంలోనయితే అతను సజ్జనుల సరసన ఉంటాడు.

28. లూత్‌ను కూడా (మేము ప్రవక్తగా పంపాము). అప్పుడతను తన జాతి వారితో ఇలా అన్నాడు : 'మీకు పూర్వం ప్రపంచవాసులెవరూ చేయని సిగ్గుమాలిన పనిని మీరు చేస్తున్నారేమిటి? 29. ఏమిటి, మీరు (లైంగిక దమనం కోసం) పురుషుల వద్దకు పోతారా? దారిని మూసేస్తారా? మీరు మీ సమావేశాల్లోనే అసభ్యకరమైన పనులు చేస్తారా?' దీనికి సమాధానంగా అతని జాతివారిలా అన్నారు : 'నీవు సత్యవంతుడవే అయితే మాపైకి దైవశిక్షను తీసుకు రా.' 30. లూత్ ఇలా ప్రార్థించాడు : 'నా ప్రభూ! ఈ విచ్ఛిన్నకారులకు ప్రతిగా నాకు సహాయపడు.'

31. మేము పంపిన దూతలు ఇబ్రాహీమ్ వద్దకు శుభవార్తను తీసుకుని వెళ్ళినపుడు, 'మేము ఆ పట్టణవాసుల్ని నాశనం చేయబోతున్నాము. ఎందుకంటే అక్కడి వారు పరమ దుర్మార్గులుగా తయారయ్యారు' అని చెప్పారు. 32. 'కాని అక్కడ లూత్ ఉన్నాడు కదా!' అని ఇబ్రాహీమ్ సందేహపడగా, వారిలా అన్నారు : 'అక్కడ ఉన్నదెవరో మాకు బాగా తెలుసు. మేము అతనిని, అతని ఇంటివారలను కాపాడుకుంటాము. కాని అతని భార్యమాత్రం వెనుక ఉండిపోయే వారితో చేరుతుంది.' 33. తరువాత మేము పంపిన దూతలు లూత్ వద్దకు చేరుకున్నప్పుడు, వారిపట్ల అతను తీవ్రంగా ఆందోళన చెందాడు. అంతర్మథనం చెందాడు. దానికి వారు, నీవు భయపడవలసిన, దుఃఖించవలసిన అవసరం లేదు. మేము నిన్నూ, నీ పరివారాన్నీ రక్షిస్తాము. కాని నీ భార్య మాత్రం వెనుక ఉండేవారి పంచన చేరుతుంది. 34. మేము ఈ బస్తీవాసులపై వారి పాపిష్టి పనులకు శాస్తిగా ఆకాశం నుండి శిక్షను అవతరింపజేయబోతున్నాము' అని సముదాయించారు. 35. అయితే మేము

ఆ బస్తీలోని కొన్ని స్పష్టమయిన నిదర్శనాలను వివేచన గల జనులకు గుణపాఠ సూచనగా వదలిపెట్టాము.

36. మద్‌యన్ వైపునకు వారి సహోదరుడైన షుఐబ్‌ను (పంపాము). అతనిలా అన్నాడు : 'ఓ నా జాతివారలారా! మీరు అల్లాహ్‌ను ఆరాధించండి. అంతిమ దినాన్నీ ఆశించండి. భువిలో కల్లోలాన్ని వ్యాపింపజేయకండి.'
37. కాని వారతన్ని అసత్యవాది అంటూ త్రోసిపుచ్చారు. అంతే. వారిని భూకంపం కబళించింది. దాంతో వారు తమ నివాస గృహాలలో తలక్రిందులుగా పడిపోయారు.

38. ఆద్, సమూద్ వారి వ్యవహారం కూడా ఇంతే. వారి నివాస గృహాలు వారి పరిస్థితికి సాక్షీభూతంగా ఉన్నాయి. వారి కర్మలను షైతాన్ వారికి అందమైనవిగా చిత్రీకరించాడు. వారు మహాజాగరూకులే అయినప్పటికీ వాడు (షైతాన్) వాళ్ళను సన్మార్గాన పోకుండా అడ్డుకున్నాడు.

39. ఖారూన్, ఫిరౌన్, హామాన్‌లకు కూడా (అదే గతి పట్టింది). వారి వద్దకు మూసా చాలా స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చాడు. కాని వారు రాజ్యంలో గర్విష్టులుగా ప్రవర్తించారు. వారు ఎంతగా విర్రవీగినా
మా నుండి పారిపోలేరు. 40. మేము వారిలో ప్రతి ఒక్కరినీ వారి పాపాల
మూలంగా పట్టుకున్నాము. తరువాత వారిలో కొందరిపై రాళ్లు కురిపించే గాలిని పంపాము. వారిలో మరి కొందరిని భయంకరమైన గర్జన కబళించింది. వారిలో ఇంకా కొందరిని మేము భూమిలో కూర్చివేశాము. వారిలో కొందరిని మేము ముంచివేశాము. దేవుడు వారికి ఎలాంటి అన్యాయం చేసేవాడు కాడు. కాని వారు తమకు తామే అన్యాయం చేసుకునేవారు.

41. అల్లాహ్‌ను వదలి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్న వారి దృష్టాంతం సాలెపురుగు వంటిది. అది ఒక గూడు (ఇల్లు) కట్టుకుంది. నిశ్చయంగా గూళ్ళన్నింటికంటే బలహీనమయిన గూడు సాలెపురుగు గూడే – ప్రజలు ఈ విషయాన్ని తెలుసుకోగలిగితే ఎంత బాగుండేది! 42. వారు

అల్లాహ్‌ను కాదని మొరపెట్టుకునే వాటన్నింటిని గురించి ఆయనకు తెలుసు. ఆయన గొప్ప శక్తిమంతుడు, వివేకసంపన్నుడు. 43. ఇవీ కొన్ని ఉపమానాలు. వీటిని మేము ప్రజల కొరకు వివరిస్తూ ఉన్నాము. జ్ఞానసంపన్నులు మాత్రమే వీటిని గ్రహించగలుగుతారు. 44. అల్లాహ్ భూమ్యాకాశాలను సత్యబద్ధంగా సృష్టించాడు. నిశ్చయంగా ఇందులో విశ్వసించిన వారికి సూచన ఉంది.

◆ (21) 45. (ప్రవక్తా!) నీకు వహీ (దివ్యవాణి) ద్వారా పంపబడిన గ్రంథాన్ని పారాయణం చేస్తూ ఉండు. నమాజును స్థాపించు. నిశ్చయంగా నమాజ్ నీతి బాహ్యత నుండి, చెడు పనుల నుండి ఆపుతుంది. అల్లాహ్ (నామ) స్మరణ చాలా గొప్ప విషయం. మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.

46. గ్రంథం కల ప్రజలతో ఉత్తమరీతిలో తప్ప వాదించకండి. అయితే వారిలోని అన్యాయపరులతో వాదించటంలో తప్పులేదు. ఇలా అనండి : 'మా వైపు అవతరింపజేయబడిన దానిని, మీ వైపు పంపబడిన దానిని కూడా మేము విశ్వసించాము. మీ ఆరాధ్య దైవం, మా ఆరాధ్య దైవం ఒక్కడే. మేము ఆయన విధేయతకే కట్టుబడినవారము.'

47. ఇదేవిధంగా మేము నీ వైపునకు గ్రంథాన్ని అవతరింపజేశాము. కనుక (పూర్వం) మేము గ్రంథం వొసగబడిన వారు దీనిని విశ్వసిస్తారు. వారిలో (బహుదైవారాధకులలో) నుండి కూడా కొంతమంది విశ్వసిస్తారు. సత్య తిరస్కారులు మాత్రమే మా సూక్తులను ఖండిస్తారు. 48. ఇంతకు ముందు నీవు ఏ గ్రంథాన్నీ చదివినవాడవు కావు. నీ చేత్తో నీవు ఏ గ్రంథాన్నీ వ్రాయటం కూడా జరగలేదు. అదే గనక అయివుంటే మిథ్యావాదులు సందేహానికి లోనయ్యేవారు. 49. యదార్థానికి ఇవి స్పష్టమయిన సూక్తులు. జ్ఞానమొసగబడిన వారి ఆంతర్యాలలో ఇవి పదిలంగా ఉన్నాయి. అన్యాయపరులు మాత్రమే మా సూక్తులను ఖండిస్తారు.

50. 'ఇతనిపై ఇతని ప్రభువు తరఫున సూచనలు (మహిమలు) ఎందుకు అవతరించవు?' అని వారు అంటారు. వారికి చెప్పు : 'సూచనలు

దేవుని వద్ద ఉన్నాయి. నేను మిమ్మల్ని స్పష్టంగా సావధానపరిచేవాణ్ణి మాత్రమే.' 51. మేము నీపై గ్రంథాన్ని అవతరింపజేశాము. అది వారికి చదివి వినిపించ బడుతోంది. ఇది వారికి చాలదా ఏమి? నిశ్చయంగా ఇందులో నమ్మి నడుచు కునే జనులకు కారుణ్యం, ఉపదేశం ఉన్నాయి. 52. ఇలా చెప్పు : 'నాకూ-మీకూ మధ్య సాక్షిగా దేవుడే చాలు. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం ఆయనకు తెలుసు. ఎవరయితే అసత్యాన్ని నమ్మి, నిజదైవాన్ని తృణీకరించారో – అలాంటివారే నష్టపోయినవారు.

53. వారు నిన్ను శిక్ష కోసం తొందరపెడుతున్నారు. దానికొక సమయమంటూ నిర్ధారించబడి ఉండకపోతే, వారిపై శిక్ష వచ్చిపడేదే. నిశ్చయంగా అది వారిపై అకస్మాత్తుగా – తెలియని స్థితిలో – వచ్చిపడుతుంది. 54. శిక్ష కోసం వారు నిన్ను తొందరపెడుతున్నారు. నరకం తిరస్కారులను ముట్టడించి ఉన్నది. 55. ఆ రోజు శిక్ష వారిపై నుండి, వారి కాళ్ళ క్రింది నుండి వారిని ఆక్రమించుకుని, 'మీరు చేసుకున్న దాని రుచి చూడండి' అని అంటుంది.

56. విశ్వసించిన నా దాసులారా! నిశ్చయంగా నా భూమి ఎంతో విశాలమైనది. కాబట్టి మీరు నన్నే ఆరాధించండి. 57. ప్రతి ప్రాణీ మృత్యువు రుచి చూడవలసిందే. కడకు మీరు మా వైపునకే మరల్చబడతారు. 58. ఎవరు విశ్వసించి, సత్క్రియలాచరించారో, వారికి మేము స్వర్గంలోని ఎత్తయిన మేడలలో చోటు కల్పిస్తాము. వాటి క్రింద సెలయేరులు పారుతూ ఉంటాయి. వారందులో కలకాలం ఉంటారు. సదాచరణ చేసిన వారికి లభించిన ప్రతిఫలం ఎంత చక్కనిది! 59. వారు సంయమనం పాటించిన వారు. తమ ప్రభువుపైన్నే భారం మోపినవారు. 60. (నేలపై ఉన్న) ఎన్నో ప్రాణులు తమ జీవనోపాధిని మోసుకుంటూ తిరుగవు. అల్లాహ్‌యే వాటికి ఉపాధిని ఇస్తాడు, మీకు కూడా. ఆయన సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు.

61. 'భూమ్యాకాశాలను సృష్టించినదెవరు? సూర్యచంద్రులను నియంత్రణలో ఉంచినదెవరు?' అని నీవు గనక వారిని అడిగితే **'అల్లాహ్‌యే'**

అని వారంటారు. మరి వారు ఎటు నుండి మరల్చబడుతున్నారు? 62. అల్లాహ్‌యే తన దాసులలో తాను కోరిన వారి ఉపాధిని విస్తృత పరుస్తాడు, తాను కోరినవారి (ఉపాధి)ని కుదిస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదాని గురించి క్షుణ్ణంగా తెలిసినవాడు. 63. 'నింగి నుండి వర్షపు నీటిని కురిపించి, నేల మృతి చెందిన మీదట దానికి ప్రాణం పోసినదెవరు?' అని నీవు గనక వారిని అడిగితే, **'అల్లాహ్‌యే'** అని వారంటారు. వారితో అను : 'సర్వస్తోత్రాలు అల్లాహ్ కొరకే.' అయితే వారిలో అనేకులు అర్థం చేసుకోరు.

64. ఈ ప్రాపంచిక జీవితం ఓ కాలక్షేపం, ఓ ఆట వస్తువు తప్ప మరేమీ కాదు. వాస్తవానికి పరలోక నిలయమే సిసలైన జీవన స్థలం. ఈ విషయాన్ని వారు తెలుసుకోగలిగితే ఎంత బాగుండేది! 65. వారు ఓడలో ప్రయాణమైనపుడు, ధర్మాన్ని కేవలం ఆయనకే ప్రత్యేకించుకుని, అల్లాహ్‌ను మొరపెట్టుకుంటారు. తరువాత ఆయన వారిని రక్షించి తీరానికి చేర్చగానే, వారు షిర్క్ చేయటం (దైవానికి భాగస్వామ్యం కల్పించటం) మొదలెడతారు. 66 – మా వరప్రసాదాల పట్ల కృతఘ్నతా వైఖరికి ఒడిగట్టి, క్షణభంగుర మయిన సుఖసౌఖ్యాలను జుర్రుకుందామని! కనుక వారికి అతి త్వరలోనే తెలిసివస్తుంది.

67. ఏమిటి, మేము ప్రశాంతమైన (సురక్షితమైన) పవిత్ర ఆరాధనా లయం నిర్మించటాన్ని వారు చూడటం లేదా? తమ పరిసరాలలో ఉన్న జనులు ఏ విధంగా తన్నుకుపోబడుతున్నారో వారు గమనించటం లేదా? అయినప్పటికీ వారు మిథ్యను నమ్ముకుని, దైవానుగ్రహాల పట్ల కృతఘ్నతా వైఖరినే అవలంబిస్తారా? 68. అల్లాహ్‌కు అసత్యాన్ని ఆపాదించే వానికన్నా లేదా తన వద్దకు సత్యం వచ్చినపుడు దానిని అసత్యమంటూ ఖండించే వానికన్నా పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? ఇలాంటి సత్య తిరస్కారుల నివాస స్థలం నరకం కాదా? 69. ఎవరయితే మా కొరకు బాధలు భరిస్తారో, వారికి మేము 'మార్గాలు' చూపుతూపోతాము. నిశ్చయంగా అల్లాహ్ సజ్జనులకు తోడుగా ఉంటాడు.

# 30. అర్ రూమ్ (రోమనులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ – లామ్ – మీమ్. 2. రోమనులు ఓడిపోయారు – 3 – తమ సమీప భూభాగంలో. వారు ఈ ఓటమి తరువాత అనతి కాలంలోనే విజయం సాధిస్తారు. 4. కొన్నేండ్లలోపే. దానికంటే ముందయినా, తరువాత అయినా – అంతా దైవాధీనమై ఉంది. ఆ రోజు విశ్వాసులు సంతోషిస్తారు. 5. అల్లాహ్ సహాయంతో! ఆయన తాను కోరిన వారికి సహాయం చేస్తాడు. ఆయన మహాశక్తిశాలి, దయాశీలి. 6. అల్లాహ్ వాగ్దానమిది. అల్లాహ్ తన వాగ్దానానికి విరుద్ధంగా చేయడు. కాని చాలామందికి తెలియదు. 7. వారికి ప్రాపంచిక జీవితపు పై మెరుగులు మాత్రమే తెలుసు. వారు పరలోకం విషయంలో ప్రమత్తతకు లోనై ఉన్నారు.

8. ఏమిటి, వారు కనీసం ఆత్మావలోకనమయినా చేసుకోలేదా? దేవుడు భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న దాన్నంతటినీ సత్యబద్ధంగా సృష్టించాడు. అదీ ఓ నిర్ణీత వ్యవధి కోసమే! జనులలో చాలామంది తమ ప్రభువుతో అవవలసి ఉన్న సమావేశాన్ని తిరస్కరిస్తారు. 9. ఏమిటి, వారు భూమిలో సంచరించి, తమ పూర్వీకులకు పట్టిన గతేమిటో చూడలేదా? చూడబోతే వాళ్ళు వీరికన్నా ఎక్కువ బలవంతులే. వారు భూమిని దున్ని, వీరికన్నా బాగా సేద్యం చేశారు (నిర్మాణాలు చేశారు). వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చారు. దేవుడు వారికెలాంటి అన్యాయం చేయలేదు. కాని వారు స్వయంగా తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నారు. 10. తరువాత దురాగతాలకు పాల్పడిన వారికి దుర్గతే పట్టింది. ఎందుకంటే వారు దైవసూచనలను అసత్యాలంటూ త్రోసిపుచ్చారు. వాటిని పరిహసించేవారు.

11. సృష్టిని ఆరంభించినవాడు అల్లాహ్యే. మరి ఆయనే దానిని మలిసారి సృష్టిస్తాడు. మరి మీరంతా ఆయన వైపునకే మరల్చబడతారు. 12. ప్రళయం సంభవించిన నాడు అపరాధులు అచ్చెరువొందుతారు.

13. వారి భాగస్వాములలో ఏ ఒక్కరూ వారి కొరకు సిఫారసు చేయరు. వారు సయితం తమ భాగస్వాములను ఖండిస్తారు. 14. ఏ రోజున ప్రళయం నెలకొంటుందో ఆనాడు వారు వివిధ బృందాలుగా విడిపోతారు. 15. కనుక విశ్వసించి, సత్క్రియ లాచరించినవారు ఉద్యానవనంలో ఓలలాడుతూ ఉంటారు. 16. మరెవరయితే తిరస్కార వైఖరిని అవలంబించారో, మా సూచనలను, పరలోక సమావేశాన్ని అసత్యమంటూ కొట్టివేశారో - అలాంటివారంతా యాతనలో చిక్కుబడి ఉంటారు. 17. కనుక మీరు సంధ్యా సమయానికి చేరుకున్నప్పుడు, తెల్లవార్చినపుడు పవిత్రుడయిన అల్లాహ్‌ను స్మరించండి. 18. భూమ్యాకాశాలలో స్తోత్రం ఆయనకే చెందుతుంది - సాయం సమయమైననూ, మిట్టమధ్యాహ్నమైననూ.

19. ఆయన ప్రాణమున్న దానిని ప్రాణం లేని దాని నుండి వెలికి తీస్తాడు. ప్రాణం లేనిదానిని ప్రాణమున్న దాని నుండి వెలికి తీస్తాడు. ఆయనే భూమిని మృతిచెందిన మీదట బ్రతికిస్తాడు. అలాగే మీరు కూడా వెలికి తీయబడతారు. 20. ఆయన సూచనలలో ఒకటేమిటంటే; ఆయన మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. ఆ తరువాత మీరు మనుషులై సర్వత్రా వ్యాపించారు. 21. ఆయన సూచనలలోనే ఒకటేమిటంటే; ఆయన స్వయంగా మీ జాతి నుండే మీ కోసం మీ జంటలను (భార్యలను) సృష్టించాడు - వారి ద్వారా మీరు సుఖపడాలని. ఇంకా ఆయన మీ మధ్య ప్రేమానురాగాలను, దయార్ద్రతను పొందుపరిచాడు. నిశ్చయంగా ఇందులో ఆలోచించే జనులకు పలు సూచనలున్నాయి.

22. భూమ్యాకాశాల సృష్టి, మీ భాషల్లో, రంగుల్లో ఉన్న వైవిధ్యం కూడా ఆయన (శక్తి) సూచనలలోనివే. నిశ్చయంగా వీటిలో జ్ఞాన ధనులకు అనేక సూచనలున్నాయి. 23. మీరు రాత్రి వేళల్లో నిద్రించటం, పగటి వేళల్లో దైవానుగ్రహాన్ని అన్వేషించటం కూడా ఆయన సూచనలలో అంతర్భాగమే. ఇందులో వినగలిగే జనులకు అనేక సూచనలున్నాయి. 24. ఇంకా ఆయన సూచనలలో ఒకటేమిటంటే; ఆయన మీకు మెరుపును చూపిస్తాడు - ఒకింత భయపెడుతూ, ఒకింత ఆశపెడుతూ! ఇంకా -

ఆయన ఆకాశం నుండి వర్షం కురిపించి, తద్వారా భూమిని అది మృతిచెందిన మీదట బ్రతికిస్తాడు, నిశ్చయంగా ఇందులో వివేచనను ఉపయోగించే జనులకు పలు సూచనలున్నాయి.

25. ఆయన శక్తి సూచనలలో ఒకటేమిటంటే; ఆయన ఆదేశంపైనే భూమ్యాకాశాలు నెలకొని ఉన్నాయి. మరి ఆయన మిమ్మల్ని ఒక్కగానొక్క పిలుపు పిలువగానే మీరంతా భూమిలో నుండి వెలికివస్తారు. 26. భూమ్యాకాశాలలో ఉన్నదంతా ఆయనదే. అన్నీ ఆయనకే ఆజ్ఞాబద్ధమై ఉన్నాయి. 27. ఆయనే తొలిసారి సృష్టిస్తాడు. మలిసారి సృష్టించేది కూడా ఆయనే. ఇది ఆయనకు మరింత సులభం. భూమ్యాకాశాలలో ఆయన గుణగణాల దర్పమే మహోన్నతం. ఆయన మహా శక్తిమంతుడు, వివేక సంపన్నుడు.

28. ఆయన మీ కోసం స్వయంగా మీలో నుండే ఉదాహరణ ఇస్తున్నాడు. మేము మీకు ప్రసాదించిన సంపదలో మీ బానిసలెవరయినా మీకు సమాన భాగస్వాములుగా ఉన్నారా? మీరు మీ వారికి భయపడినట్లుగా, వారికి భయపడుతున్నారా? ఈ విధంగా మేము బుద్ధికి పదునుపెట్టే జనులకు మా ఆదేశాలను విశదీకరిస్తున్నాము. 29. అసలు విషయం ఏమిటంటే, తమ స్వయానికి అన్యాయం చేసుకునేవారు నిరాధారంగా తమ కోర్కెలను అనుసరిస్తున్నారు. దేవుడే అపమార్గాన వదలివేసిన వాడికి సన్మార్గం ఎవరు చూపగలరు? వారికి సహాయపడే వాడెవడూ ఉండడు.

30. కనుక నీవు ఏకాగ్రచిత్తంతో దైవధర్మం వైపు అభిముఖుడవై ఉండు. దేవుడు మానవులను ఏ స్వభావంపై పుట్టించాడో దానిపైనే స్థిరంగా ఉండాలి. ఆయన సృష్టిని మార్చకూడదు. ఇదే స్థిరమైన ధర్మం. కాని చాలామంది తెలుసుకోరు. 31. ఆయన వైపునకే మరలి, ఆయనకే భయపడండి. నమాజును స్థాపించండి. బహుదైవోపాసకులలో చేరకండి. 32. వారు తమ ధర్మాన్ని ముక్కచెక్కలు చేసేశారు. విభిన్న వర్గాలుగా చీలిపోయారు. వారిలో ప్రతి వర్గం వారు తమ వద్ద ఉన్న దానితోనే పరవశించి పోతున్నారు.

33. ప్రజలకు ఏదయినా కష్టం వచ్చినపుడు, వారు తమ ప్రభువు వైపునకు పూర్తి శ్రద్ధతో మరలి ఆయన్ని ప్రార్థిస్తారు. తరువాత ఆయన తన తరఫు నుండి వారికి కారుణ్యం రుచిని చూపినపుడు, వారిలోని ఒక వర్గం వారు తమ ప్రభువుకు సహవర్తుల్ని కల్పించటం మొదలెడతారు. 34. మేము వారికి ప్రసాదించిన దానికి కృతఘ్నుతగా! సరే, కొన్నాళ్ళపాటు లబ్ది పొందండి. త్వరలోనే మీరు తెలుసుకుంటారు. 35. మేము వారిపై ఏదన్నా ప్రమాణాన్ని దింపామా? దైవానికి సాటి కల్పించమని అదిగాని సమర్థిస్తోందా?

36. మేము మనుషులకు కారుణ్యం రుచిని చూపించినపుడు వారు ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బవుతారు. ఒకవేళ వారి స్వయంకృతాల కారణంగా వారికేదన్నా బాధ కలిగితే మాత్రం నిరాశకు లోనవుతారు. 37. ఏమిటి, దేవుడు తాను కోరినవారికి పుష్కలంగా జీవనోపాధిని ఇచ్చి, తాను కోరిన వారికి తగ్గించటాన్ని వారు చూడటం లేదా? నిశ్చయంగా ఇందులో విశ్వసించే జనులకు సూచనలున్నాయి. 38. కనుక నీ సమీప బంధువుకు అతని హక్కును ఇవ్వు. నిరుపేదకు, బాటసారికి కూడా (ఇవ్వాలి). దైవ ప్రసన్నత పొందగోరేవారికి ఇది ఎంతో ఉపయుక్తమైనది – అలాంటివారే సాఫల్యం పొందుతారు. 39. ప్రజల సంపదలో చేరి పెరుగుతుందన్న ఉద్దేశ్యంతో మీరిచ్చే వడ్డీ, దేవుని దృష్టిలో ఎంతమాత్రం పెరగదు. అయితే దైవప్రసన్నతను పొందటానికి మీరు జకాత్ ఇచ్చినట్లయితే – అలాంటివారే దైవసన్నిధిలో తమ సంపదను పెంచుకున్న వారవుతారు.

40. అల్లాహ్‌యే మిమ్మల్ని సృష్టించాడు. మరి ఆయనే మీకు జీవనోపాధిని ఇచ్చాడు. తరువాత ఆయనే మీకు మరణమొసగుతాడు. ఆపైన ఆయనే మిమ్మల్ని బ్రతికిస్తాడు. మరయితే మీరు సాటి కల్పించే వారిలో ఎవరయినా వీటిలో ఏ ఒక్క పనయినా చేయగలరా? వారు కల్పించే భాగస్వామ్యాల (షిర్కు) నుండి ఆయన పవిత్రుడు, మహోన్నతుడు. 41. జనులు తమ చేజేతులా చేసుకున్న దాని ఫలితంగా నేలపైనా, నీటిలోనూ విచ్ఛిన్నం ప్రబలిపోయింది – తద్వారా దేవుడు వారి కొన్ని చేష్టల రుచి వారికి చూపించటానికి! బహుశా వారు (ఆ విధంగానయినా) తమ ధోరణిని

మానుకుంటారని. 42. వారికి చెప్పు : 'భువిలో తిరిగి, పూర్వం గతించిన వారికి పట్టిన గతేమిటో కాస్త చూడండి. వారిలో అనేకులు బహుదైవో పాసకులే.'

43. కనుక (ఓ ప్రవక్తా!) అల్లాహ్ తరపు నుండి ఆ రోజు రాకముందే నీవు నీ ముఖాన్ని సరైన, స్థిరమైన ధర్మం వైపునకు మరల్చుకో. అది తొలగిపోయే అవకాశం ఎంతమాత్రం లేదు. ఆ రోజు జనులు చెల్లాచెదురైపోతారు. 44. ఎవడు తిరస్కరిస్తాడో, అతని తిరస్కారం అతని మీదే పడుతుంది. మరెవరయినా సదాచరణ చేస్తే – వారు తమ స్వయం కోసమే చేసుకుంటారు. 45 – విశ్వసించి, సత్క్రియలాచరించిన వారికి దేవుడు తన అనుగ్రహంతో మంచి ప్రతిఫలం ఇవ్వటానికి! నిశ్చయంగా ఆయన సత్యతిరస్కారులను ఇష్టపడడు.

46. ఇంకా ఆయన సూచనలలో ఒకటేమిటంటే; ఆయన శుభవార్తను అందించే నిమిత్తం చల్లని గాలులను పంపిస్తాడు – మీకు తన కారుణ్యం రుచి చూపించాలని! ఇంకా ఆయన ఆజ్ఞతో నౌకలు నడవాలని!! ఇంకా మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించాలని!!! ఇంకా మీరు ఆయనకు కృతజ్ఞులుగా ఉండాలని!!!! 47. నిజానికి మేము నీకు పూర్వం కూడా ప్రవక్తలను వారి జాతుల వైపు పంపించాము. వారు తమ వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చారు. అప్పుడు అపరాధానికి ఒడిగట్టిన వారిపై మేము ప్రతీకారం తీర్చుకున్నాము. ఎందుకంటే విశ్వసించిన వారికి సహాయపడవలసిన బాధ్యత మాపై ఉండింది.

48. అల్లాహ్‌యే గాలులను పంపిస్తాడు. అవి మేఘాలను పైకి లేపుతాయి. తరువాత అల్లాహ్ వాటిని తాను కోరిన విధంగా ఆకాశంలో విస్తరింపజేస్తాడు. వాటిని ఒకదానిపై ఒకటిగా పేర్చుతాడు. దరిమిలా ఆ మేఘాల నుండి వర్షం కురవటం నీవు చూస్తావు. మరి తన దాసులలో తాను తలచిన వారికి ఆ వర్షపు నీటిని అందిస్తాడు. దానికి వారు ఆనందంతో పరవశించిపోతారు. 49. ఆ వర్షం కురవక ముందు – ఆనందానికి ముందు – వారు నిరాశా నిస్పృహలకు లోనై ఉండేవారు. 50. మరి నీవు దైవ

కారుణ్య సూచనలపై దృష్టిని సారించు – ఆయన ఏ విధంగా మృతిచెందిన మీదట నేలను బ్రతికిస్తాడో! నిశ్చయంగా ఆయనే మృతులను బ్రతికించ నున్నాడు. ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

51. ఒకవేళ మేము (తెగులు సోకే) గాలిని పంపితే, తమ పంట చేలు (తమ కళ్ల ముందరే) పసుపు పచ్చగా వాడిపోవటం చూస్తే, తరువాత వారు తిరస్కారానికి ఒడిగడతారు. 52. కనుక నీవు మృతులకు వినిపించలేవు. వీపు త్రిప్పుకుని పోతున్న చెవిటి వారికి కూడా నీవు నీ మాటను వినిపించలేవు. 53. నీవు గ్రుడ్డివారిని కూడా, వారి పెడత్రోవ నుండి సన్మార్గానికి తేలేవు. మా వచనాలను విశ్వసించే వానికి మాత్రమే నీవు వినిపించగలవు. వారు మాత్రమే విధేయత చూపుతారు.

54. అల్లాహ్‌యే మిమ్మల్ని అత్యంత బలహీన స్థితి నుండి పుట్టించాడు. మరి బలహీనత తరువాత బలిమిని వొసగాడు. ఈ బలం తరువాత మళ్లీ బలహీనతను, వృద్ధాప్యాన్ని విధించాడు. ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు. ఆయన మహా జ్ఞాని. సర్వాధికారి. 55. ప్రళయం నెలకొన్న దినాన, అపరాధులు ప్రమాణం చేసి, తాము ఒక గడియకాలం కన్నా ఎక్కువసేపు (ప్రపంచంలో) ఉండలేదని అంటారు. ఇలా ఉంటుంది వారు మరల్చబడే వైనం. 56. అయితే జ్ఞానధనం, విశ్వాసభాగ్యం ఇవ్వబడిన వారిలా అంటారు : 'దైవగ్రంథంలో (ఉన్నదాని ప్రకారం) మీరు పునరుత్థానదినం వరకూ ఉన్నారు. ఇదే ఆ పునరుత్థానదినం. కాని మీరు తెలుసుకునేవారు కారు.' 57. కనుక ఆ రోజు వారి సంజాయిషీ ఏ విధంగానూ ఉపకరించదు. క్షమాపణ కోరుకోండి అని వారితో అనటమూ జరగదు.

58. మేము ఈ ఖుర్‌ఆన్‌లో జనుల కోసం అన్నిరకాల ఉదాహరణ లను వివరించాము. ఒకవేళ నీవు వారివద్దకు ఏదయినా సూచనను తీసుకువస్తే 'మీరంతా మిథ్యావాదులే' అని సత్య తిరస్కారులంటారు. 59. ఈ విధంగా దేవుడు అజ్ఞానుల హృదయాలపై ముద్ర వేసేస్తాడు. 60. కనుక నీవు ఓర్పు వహించు. నిశ్చయంగా దైవవాగ్దానం సత్యం. నమ్మకం లేనివారు నిన్ను అసహనానికి లోను చేయరాదు సుమా!

# 31. లుఖ్మాన్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ – లామ్ – మీమ్. 2. ఇవి విజ్ఞతా భరితమయిన గ్రంథ వచనాలు. 3. సదాచార సంపన్నుల కొరకు మార్గదర్శకం, కారుణ్యం. 4. వారు (ఆ సదాచార సంపన్నులు) నమాజును స్థాపిస్తారు. జకాత్ చెల్లిస్తారు. పరలోకంపై నమ్మకం కలిగి ఉంటారు. 5. ఇలాంటివారే తమ ప్రభువు తరఫు నుండి సన్మార్గం పొందేవారు.

6. జ్ఞానంతో నిమిత్తం లేకుండానే, జనులను దైవమార్గం నుండి తప్పించటానికి, దానిని అవహేళన చేయటానికి మనసును చలింపజేసే విషయాలను కొనుగోలు చేసేవాడు కూడా ప్రజాబాహుళ్యంలో ఉన్నాడు. ఇలాంటి వారికి పరాభవానికి లోనుచేసే శిక్ష ఉంటుంది. 7. వాడికి మా సూక్తులను వినిపించినపుడు, వాడు గర్వంతో తాను విననట్లే, తన చెవులలో చెవుడు ఉన్నట్లే ముఖం త్రిప్పుకుంటాడు. కనుక వాడికి బాధాకరమయిన శిక్ష ఉందన్న శుభవార్తను వినిపించు. 8. నిశ్చయంగా విశ్వసించి, సదాచరణ చేసిన వారికి అనుగ్రహాలతో నిండిన స్వర్గవనాలుంటాయి. 9. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇది దేవుని గట్టి వాగ్దానం. ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడు.

10. అల్లాహ్ ఆకాశాలను స్తంభాలు లేకుండానే నిర్మించాడు. మీరు స్వయంగా దీనిని గమనిస్తున్నారు. భూమి మిమ్మల్ని తీసుకుని ఒరిగిపోకుండా ఉండటానికి ఆయనే అందులో పర్వతాలను ప్రతిష్ఠించాడు. ఇంకా అందులో అన్ని రకాల జీవజాలాన్ని వ్యాపింపజేశాడు. ఇంకా మేము ఆకాశం నుండి నీటిని కురిపించాము. తరువాత భూమిలో అన్ని రకాల మేలైన వస్తువులను ఉత్పన్నం చేశాము. 11. ఇదీ దేవుని సృష్టి! మరైతే ఆయన తప్ప మిగిలిన వారు సృష్టించిందేమిటో కాస్త నాకు చూపించండి! అసలు విషయం ఏమిటంటే దుర్మార్గులు స్పష్టమయిన అపమార్గానికి లోనై ఉన్నారు.

12. నిశ్చయంగా మేము లుఖ్మాన్‌కు వివేకాన్ని ప్రసాదించాము. అతనికిలా బోధించాము : 'దైవానికి కృతజ్ఞుడవై ఉండు. కృతజ్ఞుడై ఉండే ప్రతి ఒక్కడూ తన స్వయం కొరకే కృతజ్ఞుడై ఉంటాడు. మరెవడయినా చేసిన మేలును మరిస్తే, నిశ్చయంగా దేవుడు అక్కరలేనివాడు, స్తవనీయుడు.' 13. లుఖ్మాన్ తన కుమారునికి హితబోధ చేసినపుడు ఇలా అన్నాడు : 'నా ముద్దుల కుమారుడా! అల్లాహ్‌కు సహవర్తుల్ని కల్పించకు. నిశ్చయంగా అల్లాహ్‌కు సహవర్తుల్ని నిలబెట్టడం (షిర్క్ చేయటం) ఘోరమయిన అన్యాయం.'

14. మేము మానవునికి అతని తల్లిదండ్రుల విషయమై తాకీదు చేశాము. అతని తల్లి అతనిని కష్టమ్మీద కష్టాన్ని భరిస్తూ తన గర్భంలో మోసింది. తరువాత అతని పాలు విడిపించటానికి రెండేళ్ళు పట్టింది. (అందుకే ఇలా అన్నాము : ఓ మానవుడా!) నీవు నాకూ, నీ తల్లిదండ్రులకు కృతజ్ఞుడవై ఉండు. కడకు మరలి రావలసింది నా వైపునకే. 15. ఒకవేళ వారు, నీ వెరుగని వారిని ఎవరినయినా నాకు సాటి కల్పించమని నీపై ఒత్తిడి తెస్తే మటుకు, నీవు వారి మాట విననవసరం లేదు. ప్రపంచంలో మాత్రం వారిపట్ల సద్భావంతో మెలగాలి. (ధార్మికంగా మాత్రం) నా వైపునకు రుజువర్తనుడైన వ్యక్తినే అనుసరించాలి. చివరకు మీరంతా నా వద్దకే రావలసి ఉంది. మీరేమేమి చేస్తూ ఉండేవారో అప్పుడు నేను మీకు తెలుపుతాను.

16. (లుఖ్మాన్ ఇంకా ఇలా ఉపదేశించాడు) 'నా చిట్టి తండ్రీ! ఏ కర్మ అయినాసరే, అది ఆవగింజంత ఉన్నా – అది ఏ రాయి క్రిందనో పడి ఉన్నా, ఆకాశాలలో ఉన్నా, లేక భూమిలో ఉన్నా – దేవుడు దానిని తీసుకువస్తాడు. నిశ్చయంగా దేవుడు సూక్ష్మదృష్టి కలవాడు, సర్వం తెలిసి ఉన్నవాడు. 17. నా కన్నతండ్రీ! నమాజును స్థాపించు. మంచి పనులు చెయ్యమని బోధిస్తూ ఉండు. చెడుల నుండి వారించు. నీకు ఏ కష్టం కలిగినా ఓర్చుకో. నిశ్చయంగా ఇవి సాహసోపేతమయిన పనులు. 18. ప్రజల నుండి నిర్లక్ష్యంగా ముఖం త్రిప్పుకోకు. భువిలో నిక్కుతూ నడవకు. నిశ్చయంగా దేవుడు అదిరిపాటు పడేవానిని, గర్వాహంకారం ప్రదర్శించేవాడినీ ఇష్టపడడు.

19. నీ నడకలో హుందాతనం పాటించు. నీ కంఠస్వరం మృదుమధురంగా ఉండేలా జాగ్రత్తపడు. స్వరాలన్నింటిలోకీ అత్యంత చెడ్డది గాడిద స్వరం.'

20. ఏమిటి, భూమ్యాకాశాలలో ఉన్న వాటన్నింటినీ దేవుడు మీ సేవలో నిమగ్నం చేయటాన్ని మీరు గమనించలేదా? ఆయనే తన వ్యక్త, అవ్యక్త వరాలన్నింటినీ మీపై పూర్తి చేశాడు. జ్ఞానంతో, మార్గదర్శకత్వంతో నిమిత్తం లేకుండానే, స్పష్టమయిన గ్రంథాధారం లేకుండానే దేవుని విషయంలో తర్జన భర్జనకు దిగేవారు కూడా జనబాహుళ్యంలో ఉన్నారు. 21. 'అల్లాహ్ అవతరింపజేసిన దానిని మీరు అనుసరించండి' అని వారితో అన్నప్పుడు, 'లేదు, మా తాతముత్తాతలు పాటిస్తూ ఉండగా మేము చూసిన దానినే మేము అనుసరిస్తాము' అని వారంటారు. ఏమిటి, షైతాన్ వారిని నరకాగ్ని యాతన వైపు పిలిచినప్పటికీనా?

22. ఎవడయితే అల్లాహ్ వైపునకు అభిముఖుడై, సదాచరణ కూడా చేస్తాడో అతను గట్టి త్రాటిని పట్టుకున్నాడు. సమస్త వ్యవహారాల అంతిమ ఫలితం అల్లాహ్ అధీనంలోనే ఉంది. 23. (ప్రవక్తా!) ఎవడయితే తిరస్కారానికి పాల్పడ్డాడో, అతని తిరస్కార వైఖరికి నీవు దుఃఖించవలదు. వారంతా మా వైపునకు రావలసిన వారే. వారి నిర్వాకాన్నంతా మేము వారికి ఎరుక పరుస్తాము. నిశ్చయంగా అల్లాహ్ ఆంతర్యాల్లోని గుట్టును సయితం ఎరిగినవాడు. 24. మేము వారికి కొంతకాలం పాటు లబ్ది పొందనిస్తాం. తరువాత వారిని కఠిన శిక్ష వైపు లాక్కుపోతాము.

25. 'భూమ్యాకాశాలను ఎవరు సృష్టించారు?' అని మీరు గనక వారిని అడిగితే **'అల్లాహ్'** అని వారు అవశ్యంగా అంటారు. 'సమస్త స్తోత్రములు అల్లాహ్‌కే చెందుతాయి' అని వారితో అను. అయితే వారిలో అనేకులు తెలియనివారు. 26. ఆకాశాలలో, భూమిలో ఉన్న సమస్తం అల్లాహ్‌దే. నిశ్చయంగా అల్లాహ్ నిరపేక్షాపరుడు, స్తుతిస్తోత్రాలకు అర్హుడు. 27. భూమిలో ఉన్న వృక్షాలన్నీ కలములుగా మారినా, సముద్రాలు మరో సప్త సముద్రాలతో కలిసి సిరాగా మారినా – అప్పటికీ అల్లాహ్ విషయాలు తరగవు. నిశ్చయంగా అల్లాహ్ శక్తిమంతుడు, వివేకవంతుడు.

28. మీ అందరినీ పుట్టించటం, (మరణానంతరం) తిరిగి బ్రతికించటం ఒక మనిషిని సృష్టించటం వంటిదే. నిశ్చయంగా దేవుడు వినేవాడు, చూసేవాడు. 29. ఏమిటి, దేవుడు రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేయటాన్ని, పగటిని రాత్రిలోనికి ప్రవేశింపజేయటాన్ని నీవు చూడటం లేదా? ఇంకా ఆయన సూర్యచంద్రుల్ని కార్య నిబద్ధుల్ని చేశాడు. ప్రతి ఒక్కటీ నిర్ధారిత సమయం వరకు సాగిపోతూ ఉంది. ఇంకా ఏమిటంటే; మీరు చేసేదంతా దేవుని దృష్టిలో ఉంది. 30. ఇలా ఎందుకంటే; అల్లాహ్‌యే సత్యం గనక! ఆయన్ని కాదని వారు మొరపెట్టుకునేవన్నీ అసత్యం గనక! నిశ్చయంగా అల్లాహ్ మహోన్నతుడు, గొప్పవాడు.

31. దైవానుగ్రహం వల్ల ఓడలు సముద్రంలో నడవటాన్ని నీవు చూడటం లేదా? ఆయన తన సూచనలను చూపించటానికే (ఇదంతా). నిశ్చయంగా ఇందులో సంయమనం పాటించే, కృతజ్ఞతలు తెలుపుకునే ప్రతి ఒక్కరికీ సూచనలున్నాయి. 32. సముద్ర కెరటాలు వారి తలలపై కారుమబ్బుల మాదిరిగా క్రమ్ముకున్నప్పుడు, వారు తమ ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని ఆయన్ని మొరపెట్టుకుంటారు. తరువాత ఆయన వారిని రక్షించి ఒడ్డుకు చేర్చిన మీదట, వారిలో కొందరు (మాత్రమే) సరిగ్గా ఉంటారు. వాగ్దాన భంగానికి పాల్పడేవారు, మేలును మరిచేవారు మాత్రమే మా సూచనలను తిరస్కరిస్తారు.

33. ప్రజలారా! మీ ప్రభువుకు భయపడండి. ఏ తండ్రీ తన కొడుకు తరఫున బదులు (పరిహారం) ఇచ్చుకోలేని, ఏ కుమారుడు కూడా తన తండ్రికి ఏ విధంగానూ ఉపయుక్తంకాని ఆ దినానికి భయపడండి. నిశ్చయంగా అల్లాహ్ వాగ్దానం సత్యమైనది. కాబట్టి ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసపుచ్చరాదు. ఆ మోసగాడు (షైతాన్) కూడా మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసగించరాదు సుమా! 34. ప్రళయం ఎప్పుడు వస్తుందనే విషయం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. ఆయనే వర్షం కురిపిస్తున్నాడు. గర్భాశయాలలో ఏముందో ఆయనకే తెలుసు. తాను రేపు ఏం సంపాదిస్తుందో ఏ ప్రాణీ ఎరుగదు. తాను ఏ గడ్డపై మరణించేదీ ఎవరికీ తెలియదు. నిశ్చయంగా అల్లాహ్‌యే సర్వజ్ఞాని, అన్నీ ఎరిగినవాడు.

# 32. అస్ సజ్‌దహ్ (సాష్టాంగ ప్రణామం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలిఫ్ – లామ్ – మీమ్. 2. సకల లోకాల ప్రభువు తరపున అవతరింపజేయబడిన గ్రంథమిది. ఇందులో సందేహానికి ఆస్కారమే లేదు. 3. ఏమిటి, ఈ వ్యక్తి స్వయంగా దీనిని కల్పించుకున్నాడని వారంటున్నారా? వాస్తవానికి ఇది నీ ప్రభువు తరఫు నుండి (వచ్చిన) సత్యం – తద్వారా నీవు, నీకు పూర్వం హెచ్చరించే వాడెవడూ రాని జాతి వారిని సావధానపరచాలని! తద్వారా వారు సన్మార్గం పొందాలని!

4. అల్లాహ్ – ఆయనే భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న వాటిని కేవలం ఆరు దినాలలో సృష్టించాడు. తరువాత ఆయన తన పాలనా పీఠం (అర్ష్)పై స్థిరపడ్డాడు. ఆయన తప్ప మీకు ఏ సహాయకుడు గానీ, మరే సిఫారసు చేసేవాడు గానీ లేడు. మరయితే మీరు బోధను గ్రహించరా? 5. ఆయన నింగి నుండి నేల వరకు సమస్త వ్యవహారాలను నిర్వహిస్తున్నాడు. తరువాత అవన్నీ ఒకానొక రోజున ఆయన వద్దకు మరల్చబడతాయి. దాని (ఆ రోజు) పరిమాణం మీ లెక్క ప్రకారం వెయ్యేండ్లకు సమానం. 6. ఆయనే గోచర అగోచర విషయాలన్నింటినీ ఎరిగినవాడు – గొప్ప శక్తిమంతుడు, అపార కరుణామయుడు. 7. ఆయన ఏది చేసినా అత్యుత్తమంగానే చేశాడు. ఆయన మానవ సృష్టి ప్రక్రియను మట్టితో మొదలెట్టాడు. 8. ఆ తరువాత అతని సంతతిని అత్యంత అల్పమైన నీటిసారం (రేతస్సు)తో సాగించాడు. 9. పిదప అతని అవయవాలను తీర్చిదిద్దాడు. అందులో తన ప్రాణం పోశాడు. మీ కొరకు చెవులను, కళ్ళను, హృదయాన్నీ చేశాడు. అయినా మీరు కృతజ్ఞతలు తెలుపుకునేది తక్కువే.

10. 'ఏమిటి, మేము మట్టిలో కలిసి, మటుమాయమైపోయిన తరువాత కూడా మేము సరికొత్తగా సృష్టించబడతామా?' అని వారన్నారు. అసలు విషయమేమిటంటే, వారు తమ ప్రభువుతో జరగబోయే సమావేశాన్ని

తిరస్కరిస్తున్నారు. 11. వారికి చెప్పు : 'మీపై నియమించబడిన మృత్యుదూత మీ ప్రాణాలను స్వాధీనం చేసుకుంటాడు. తరువాత మీరు మీ ప్రభువు వైపునకు మరల్చబడతారు. 12. ఈ అపరాధులు తమ ప్రభువు సమక్షంలో తలలు వంచుకుని ఉండటం నీవు చూస్తే ఎంత బాగుండేది! (వారీవిధంగా విన్నవించుకుంటారు), 'మా ప్రభూ! మేము చూశాము. మేము విన్నాము. సదాచరణ చేసుకునేందుకు మమ్మల్ని తిరిగి పంపించు. మాకిప్పుడు పూర్తి నమ్మకం కలిగింది.' 13. మేమే గనక తలచుకుంటే, ప్రతి వ్యక్తికీ అతని సన్మార్గాన్ని వొసగేవారమే. అయితే 'నేను నరకాన్ని జిన్నులతోనూ, మానవులతోనూ నింపుతాను' అన్న నా మాట ముందుగానే ఖరారైపోయింది. 14. కాబట్టి ఇప్పుడు మీరు ఈనాటి ఈ సమాదేశాన్ని విస్మరించిన దాని రుచిని చూడండి. మేము కూడా మిమ్మల్ని విస్మరిస్తున్నాము. మీరు చేసుకున్న దానికి శాస్తిగా శాశ్వతమైన శిక్షను చవిచూడండి.

15. మా వచనాల ద్వారా బోధపరచినపుడు, సజ్దాలో పడిపోయేవారే వాస్తవానికి మా వచనాల పట్ల విశ్వాసం కలవారు. వారు తమ ప్రభువును స్తుతించటంతో పాటు, ఆయన పవిత్రతను శ్లాఘిస్తారు. వారిలో గర్వం ఏ కోశానా ఉండదు. 16. వారి వీపులు వారి పడకల నుండి వేరై ఉంటాయి. వారు తమ ప్రభువును భయంతోనూ, ఆశతోనూ ప్రార్థిస్తూ ఉంటారు. మేము వారికి ప్రసాదించిన దానిలో నుండి ఖర్చుచేస్తూ ఉంటారు. 17. వారు చేసుకున్న కర్మలకు ప్రతిఫలంగా, వారి కళ్లకు చలువనిచ్చే ఎటువంటి సామగ్రిని మేము దాచిపెట్టామో ఎవరికీ తెలీదు.

18. మరైతే విశ్వసించిన వ్యక్తి అవిధేయుడితో సమానుడవుతాడా? వారిరువురూ సుతరామూ సమానులు కాజాలరు. 19. ఎవరయితే విశ్వసించారో, సత్క్రియలాచరించారో, వారు విడిది చేసేందుకు స్వర్గవనా లుంటాయి–వారు చేసుకున్న సత్కర్మలకుగాను ఆతిథ్యంగా. 20. మరెవరయితే అవిధేయతకు ఒడిగట్టారో వారి నివాస స్థలం నరకం అవుతుంది. వారు దాని నుండి బయటపడటానికి ప్రయత్నించినప్పుడల్లా, మళ్లీ అందులోనికే త్రోయబడతారు. 'మీరు త్రోసిపుచ్చుతూ వచ్చిన నరకాగ్ని యాతనను రుచి

చూడండి' అని వారితో అనబడుతుంది. 21. మేము వారికి ఆ పెద్ద శిక్షకు ముందు (కొన్ని) చిన్న శిక్షలు కూడా చవిచూపిస్తాము – తద్వారానయినా వారు దారికి రావాలని! 22. తన ప్రభువు వచనాల ఆధారంగా బోధపరచినప్పటికిన్నీ, వాటిపట్ల వైముఖ్య ధోరణిని కనబరిచే వాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? మేము అలాంటి అపరాధులపై తప్పక ప్రతీకారం తీర్చుకుంటాము.

23. మేము మూసాకు గ్రంథం వొసగి ఉన్నాము. కనుక నీవు అతనిని కలుసుకునే విషయమై ఏమాత్రం సందేహించకు. మేము దానిని (తౌరాతును) ఇస్రాయీల్ సంతతి వారి కోసం మార్గదర్శకంగా చేశాము. 24. ఇంకా వారు నిగ్రహం చూపినంత కాలం మేము వారిలో కొందరిని పేష్వాలుగా చేశాము. వారు మా ఆదేశానుసారం ప్రజలకు మార్గదర్శకత్వం వహించేవారు. వారు మా వచనాల పట్ల దృఢ నమ్మకం కలిగి ఉండేవారు. 25. నిశ్చయంగా నీ ప్రభువు ప్రళయదినాన వారి మధ్య వారు పరస్పరం విభేదించుకునే విషయాలపై తీర్పు చేస్తాడు. 26. ఏమిటి, మేము వారికి పూర్వం ఎన్నో తరాలను తుదముట్టించిన వైనం కూడా వారికి మార్గదర్శకం కాలేక పోయిందా? చూడబోతే వారు వాళ్ళ జనావాసాల మీదుగా రాకపోకలు సాగిస్తూనే ఉన్నారు. నిశ్చయంగా ఇందులో సూచనలున్నాయి. ఏమిటి, వారు వినటం లేదా?

27. ఏమిటి, మేము బంజరు భూమి వైపు (వర్షపు) నీటిని తీసుకుపోవటాన్ని వీరు గమనించటం లేదా? మరి మేము దాని ద్వారా పంటలు పండిస్తున్నాము. వాటిని వారి పశువులూ తింటున్నాయి, స్వయంగా వారు కూడా (తింటున్నారు). మరైతే వారు చూడటం లేదా? 28. 'మీరు సత్యవంతులే అయితే, ఆ తీర్పు ఎప్పుడో చెప్పండి?' అని వారంటున్నారు. 29. వారికి చెప్పు : 'తీర్పు దినాన విశ్వసించటం అవిశ్వాసులకు ఎంతమాత్రం ఉపకరించదు. వారికి వ్యవధి కూడా ఇవ్వబడదు.' 30. కనుక (ఓ ప్రవక్తా!) వారిని ఉపేక్షించు. నిరీక్షిస్తూ ఉండు. వారు కూడా నిరీక్షిస్తున్నారు.

# 33. అల్ అహ్‌జాబ్ (సైనిక కూటములు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ ప్రవక్తా! అల్లాహ్‌కు భయపడుతూ ఉండు. సత్యతిరస్కారుల, వంచకుల మాట వినకు. నిశ్చయంగా అల్లాహ్ జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు. 2. నీ ప్రభువు తరఫు నుండి నీకు 'వహీ'గా పంపబడే దానిని అనుసరిస్తూ ఉండు. నిశ్చయంగా మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది. 3. అల్లాహ్‌నే నమ్ముకో. కార్యసాధకునిగా అల్లాహ్ ఒక్కడే చాలు.

4. దేవుడు ఏ మనిషి రొమ్ములోనూ రెండు హృదయాలను ఉంచలేదు. అలాగే మీరు మీ భార్యలలో ఎవరినయినా 'నీవు నా తల్లిలాంటిదానవు' అని చెప్పినంత మాత్రాన ఆమెను మీ తల్లిగా చేయలేదు. మీ దత్తపుత్రులను కూడా ఆయన మీ కుమారునిగా చేయలేదు. ఇవన్నీ మీరు మీ నోటితో పలికే మాటలే. అల్లాహ్ సత్యం పలుకుతాడు. ఆయన సన్మార్గం చూపిస్తాడు. 5. దత్త పుత్రులను వారి తండ్రుల సంబంధంతోనే పిలవండి. అదే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ న్యాయసమ్మతమైనది. ఒకవేళ మీకు వారి తండ్రులెవరో తెలీకపోతే అప్పుడు వారు మీ ధార్మిక సోదరులు, సహవాసులు అవుతారు. ఏ విషయంలోనయినా మీ వల్ల మరుపు (పొరపాటు) జరిగిపోతే, దానికి మీరు నిందార్హులు కారు. కాని మీరు మనస్ఫూర్తిగా చేస్తే గనక (దానిపై నిలదీత తప్పదు). అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు.

6. దైవప్రవక్తకు విశ్వాసులపై గల హక్కు స్వయంగా వారి ప్రాణాల కన్నా ఎక్కువే. ప్రవక్త సతీమణులు వారికి తల్లులు. ఇక దైవ గ్రంథానుసారం రక్త సంబంధీకులు (బంధువులు) సాధారణ విశ్వాసులకన్నా, ముహాజిర్లకన్నా పరస్పరం ఎక్కువ హక్కుదారులు. ఒకవేళ మీరు మీ స్నేహితుల యెడల సద్వ్యవహారం ఏదన్నా చేయదలిస్తే అది వేరే విషయం. ఇది గ్రంథంలో లిఖితమై ఉంది.

7. మేము ప్రవక్తల నుండి వారి వాగ్దానం తీసుకున్నప్పుడు – నీ

నుండి, నూహ్ నుండి, ఇబ్రాహీమ్, మూసాల నుండి, ఇంకా మర్యమ్ కుమారుడగు ఈసా నుండి వాగ్దానం తీసుకున్నప్పుడు – మేము వారి నుండి గట్టి వాగ్దానమే తీసుకున్నాము. 8 – అల్లాహ్ సచ్ఛీలురను వారి సచ్ఛీలత గురించి ప్రశ్నించాలని. సత్య తిరస్కారుల కోసం ఆయన బాధాకరమయిన శిక్షను సిద్ధం చేసి ఉంచాడు.

9. విశ్వాసులారా! మీపై గల దైవానుగ్రహాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. (శత్రు) సేనలు మీపై దండెత్తి వచ్చినప్పుడు, మేము వాటిపై ఓ పెనుగాలిని పంపాము. మీకు కానరాని సైనిక దళాన్ని కూడా పంపాము. మీరు చేసేదంతా అల్లాహ్ చూసేవాడే. 10. వారు మీ పైకి మీ ఎగువ వైపు నుండి, దిగువ వైపు నుండీ దండెత్తి వచ్చినప్పుడు (భయంతో) మీ కళ్లు తిరిగిపోయాయి. మీ గుండెలు గొంతులదాకా వచ్చేశాయి. అల్లాహ్ గురించి ఆ క్షణంలో మీరు రకరకాలుగా అనుమానించసాగారు. 11. ఆ సమయంలో విశ్వాసులు పరీక్షించబడ్డారు. తీవ్రంగా కుదిపివేయబడ్డారు.

12. అప్పుడు కపటులు, హృదయాలలో రోగం ఉన్నవారు ఇలా అన్నారు : 'దేవుడు, దైవప్రవక్త మనతో చేసిన వాగ్దానం మోసం తప్ప మరేమీ కాదు.' 13. వారిలోని ఒక వర్గం వారైతే, 'ఓ యస్రిబ్ (మదీనా) వాసులారా! ఇది మీరు ఆగవలసిన చోటు కాదు. తిరోన్ముఖులవ్వండి' అని అనసాగారు. ఇంకొక వర్గం వారు దైవప్రవక్త నుండి సెలవు కోరుతూ, 'మా ఇండ్లు సురక్షితంగా లేవు' అన్నారు. నిజానికి అవి సురక్షితంగానే ఉన్నాయి. కాకపోతే వారు పలాయనం చిత్తగించాలనుకున్నారు. 14. ఒకవేళ (మదీనా) నగరం నలువైపుల నుండీ ఎవరయినా చొచ్చుకు వచ్చి, అరాచకం సృష్టించమని వారికి పిలుపు ఇచ్చి ఉంటే, వారు ఏమాత్రం తాత్సారం చేయకుండా ఒప్పేసుకునేవారు. 15. తాము వెన్ను చూపబోమని లోగడ వారు దైవానికి మాటిచ్చి ఉన్నారు. అల్లాహ్‌తో చేసిన బాస గురించి వారు అవశ్యంగా ప్రశ్నించబడతారు. 16. వారికి చెప్పు : 'మీరు చావు నుండి లేదా చంపబడటం నుండి భయపడి పారిపోతే, ఈ పారిపోవటం మీకు

ఎంతమాత్రం ఉపయోగపడదు. అట్టి పరిస్థితిలో మీకు కేవలం కొన్నాళ్ళపాటు లాభం పొందే అవకాశమే దొరుకుతుంది.' 17. చెప్పండి : 'ఒకవేళ అల్లాహ్ మీకేదన్నా నష్టం కలుగజేస్తే లేదా ఆయన మీపై దయదలిస్తే ఆయన పట్టు నుండి మిమ్మల్ని రక్షించగల వారెవరు?' వారు అల్లాహ్‌కు వ్యతిరేకంగా ఏ రక్షకుణ్ణీ, మరే మద్దతుదారుణ్ణీ పొందలేరు.

18. మీలో (యుద్ధం నుండి) ఇతరులను ఆపుతున్నదెవరో, తమ సోదరులనుద్దేశించి, 'మా పంచన చేరండి' అని చెబుతున్నదెవరో అల్లాహ్‌కు తెలుసు. వారు ఎప్పుడోగాని కదన రంగానికి కదలి రారు. 19. వారు మీ యెడల లోభత్వం ప్రదర్శిస్తారు. అయితే భయాందోళనల పరిస్థితి ఆసన్నమైనపుడు, మరణ ఘడియలు దాపురించిన వ్యక్తి కనుగ్రుడ్లు త్రిప్పినట్లుగా వారు నీ వైపు చూడటం నీవు గమనిస్తావు. తరువాత ఆపత్కాలం తొలగిపోయినపుడు ధనాశకొద్దీ తమ పదునయిన నాలుకలతో వాక్చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ నీ వద్దకు వస్తారు. అసలు వారు విశ్వసించనే లేదు. అందుకే అల్లాహ్ వారి కర్మలను వృధా గావించాడు. ఇలా చేయటం అల్లాహ్‌కు చాలా తేలిక. 20. సైనిక కూటములు ఇంకా వెళ్ళలేదని వారనుకుంటున్నారు. ఒకవేళ ఆ సైనిక దళాలు మళ్లీ దండెత్తి వస్తే, తాము పల్లెటూళ్ళల్లో, అక్కడి బైతుల మధ్యన ఉండి, అక్కడి నుండే మీ సమాచారం తెలుసుకోవటానికి ఇష్టపడతారు. ఒకవేళ వారు మీతో ఉన్నప్పటికీ యుద్ధంలో అరుదుగానే పాల్గొంటారు.

21. మీ కొరకు దైవప్రవక్తలో అత్యుత్తమ ఆదర్శం ఉంది – అల్లాహ్‌ను, అంతిమదినాన్ని ఆశిస్తూ, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించే ప్రతి ఒక్కని కొరకు. 22. విశ్వసించినవారు సైనిక కూటములను చూసినపుడు ఇలా అన్నారు : 'అల్లాహ్, ఆయన ప్రవక్త మనతో వాగ్దానం చేసినది ఇదే. అల్లాహ్, ఆయన ప్రవక్త చెప్పింది నిజం.' అది వారి విశ్వాసాన్ని, విధేయతా భావాన్ని మరింత అధికం చేసింది. 23. అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపినవారు కూడా విశ్వాసులలో ఉన్నారు. వారిలో కొందరు తమ కర్తవ్యాన్ని

నెరవేర్చగా, మరికొందరు (ఆ సువర్ణావకాశం) కొరకు ఎదురుచూస్తున్నారు. వారు (తమ పట్టుదలలో) ఏమాత్రం మార్పు రానివ్వలేదు. 24 – అల్లాహ్ సచ్ఛీలురకు వారి సచ్ఛీలతా పురస్కారం ఇవ్వటానికి, ఇంకా తాను కోరితే కపటులను దండించటానికి లేదా వారి పశ్చాత్తాపాన్ని ఆమోదించటానికి! నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు, దయాకరుడు.

25. దేవుడు సత్యతిరస్కారులను వారి ఆగ్రహ స్థితిలోనే తిరోన్ముఖుల్ని చేశాడు. వారి మనోరథం ఏదీ ఈడేరలేదు. విశ్వాసుల తరఫున పోరాడటానికి అల్లాహ్‌యే సరిపోయాడు. అల్లాహ్ మహా బలుడు, సర్వాధిక్యుడు. 26. దండయాత్ర చేసిన వారితో కుమ్మక్కు అయిన గ్రంథవహులను కూడా అల్లాహ్ వారి కోటల నుండి క్రిందికి దించేశాడు. వారి గుండెల్లో గుబులు పుట్టించాడు. (తత్ఫలితంగానే) మీరు వారిలోని ఒక వర్గం వారిని వధించ సాగారు, ఒక వర్గం వారిని బందీలుగా పట్టుకోసాగారు. 27. ఆయన వారి భూములకు, వారి నివాస గృహాలకు, వారి సిరిసంపదలకు మిమ్మల్ని వారసులుగా చేశాడు. మీరు కాలుమోపని భూభాగాన్ని కూడా (ఆయన మీకు స్వాధీనపరిచాడు). అల్లాహ్ ఏదయినా సరే చేయగల దక్షత కలవాడు.

28. ఓ ప్రవక్తా! నీ సతీమణులకు చెప్పు : 'మీరు గనక ప్రాపంచిక జీవితాన్ని, దాని కళాకాంతులను కోరుకునే వారైతే రండి, నేను మీకు కొంత సామగ్రిని ఇచ్చి ఉత్తమ రీతిలో సెలవు ఇస్తాను. 29. ఒకవేళ మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, పరలోక నెలవును కోరుకుంటున్నట్లయితే, నిశ్చయంగా అల్లాహ్ మీలోని సౌశీల్యవతుల కోసం గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు.' 30. ప్రవక్త సతీమణులారా! మీలో ఎవరయినా సరే స్పష్టంగా నీతిమాలిన పనికి పాల్పడితే, ఆమెకు రెండింతల దండన విధించబడుతుంది. ఇలా చేయటం అల్లాహ్‌కు చాలా తేలిక.

◆ (22) 31. మరి మీలో ఎవరు అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయురాలై ఉండి, సత్క్రియలాచరిస్తుందో ఆమెకు మేము రెండింతల పుణ్యఫలాన్ని ఇస్తాము. ఇంకా మేమామె కోసం గౌరవప్రదమైన ఉపాధిని

సిద్ధం చేసి ఉంచాము. 32. ప్రవక్త సతీమణులారా! మీరు సామాన్య మహిళల వంటివారు కారు. మీరు గనక దైవభీతి గలవారే అయితే, సుతిమెత్తని శైలిలో మాట్లాడకండి. తత్కారణంగా మనసులో రోగం ఉన్నవాడు పేరాశకు లోను కావచ్చు. అందుకే మాట్లాడితే నిర్దిష్టంగా – నిష్కర్షగా – మాట్లాడండి.

33. మీరు మీ ఇంటిపట్టునే ఆగి ఉండండి. పూర్వం అజ్ఞాన కాలంలో మాదిరిగా అలంకరణను చూపుతూ తిరగకండి. నమాజును స్థాపించండి. జకాత్ ఇస్తూ ఉండండి. దైవానికి, దైవప్రవక్తకు విధేయత చూపండి. ప్రవక్త ఇంటివారలైన మీ నుండి కాలుష్యాన్ని దూరం చేయాలని, మిమ్మల్ని సర్వవిధాలా పరిశుద్ధపరచాలని దేవుడు అభిలషిస్తున్నాడు. 34. మీ ఇండ్లల్లో జరిగే దైవవచనాల పారాయణాన్ని, వివేకవంతమైన బోధనలను జ్ఞాపకముంచుకోండి. నిశ్చయంగా అల్లాహ్ సూక్ష్మదృష్టికలవాడు, అన్నీ తెలిసినవాడు.

35. నిశ్చయంగా విధేయులైన పురుషులు – విధేయతా భావం గల స్త్రీలు, విశ్వాసులైన పురుషులు – విశ్వసించిన స్త్రీలు, ఆజ్ఞాపాలన చేసే పురుషులు – ఆజ్ఞలను శిరసావహించే వనితలు, సచ్ఛీలురైన పురుషులు – సత్యశీలత గల మహిళలు, సహనమూర్తులైన పురుషులు – సహనవతులైన స్త్రీలు, అణకువ గల పురుషులు – అణకువ గల అతివలు, దానధర్మాలు చేసే పురుషులు – దాతృగుణం గల వనితలు, ఉపవాసాలుండే పురుషులు – ఉపవాసాలుండే మగువలు, తమ మర్మస్థానాలను కాపాడుకునే పురుషులు – కాపాడుకునే మహిళామణులు, అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించే పురుషులు – స్మరించే స్త్రీలు – వీరి కొరకు అల్లాహ్ క్షమాపణను, గొప్ప ప్రతిఫలాన్ని సిద్ధం చేసి ఉంచాడు.

36. ఏదేని వ్యవహారంలో దైవం మరియు దైవప్రవక్త ఒక నిర్ణయం గైకొన్నప్పుడు విశ్వాసి అయిన పురుషునికి గానీ, విశ్వసించిన స్త్రీకి గానీ ఆ వ్యవహారంలో స్వీయ నిర్ణయం తీసుకునే అధికారం మిగిలి ఉండదు. ఒకవేళ ఎవరయినా దైవాన్ని, ఆయన ప్రవక్తను ఎదిరిస్తే, అతను స్పష్టమయిన మార్గభ్రష్టత్వంలో పడిపోయినట్లే.

37. (ప్రవక్తా! ఆ సందర్భాన్ని జ్ఞాపకం చేసుకో) దేవుడు అనుగ్రహించిన, నీవు సయితం అనుగ్రహించిన వ్యక్తితో, 'నీ భార్యను ఆపి ఉంచుకో. దైవానికి భయపడు' అని నీవు నచ్చజెబుతూ ఉండేవాడివి. దేవుడు బయట పెట్టదలచిన విషయాన్ని నీవు నీ మనసులో దాచిపెట్టావు. నీవు జనులకు భయపడుతూ ఉండేవాడివి. వాస్తవానికి నీ భయభక్తులకు అల్లాహ్‌యే ఎక్కువ హక్కుదారుడు. మరి జైద్ ఆమెతో తన లాంఛనాలన్నింటినీ పూర్తిచేసిన పిమ్మట (విడాకులిచ్చిన మీదట), మేము నీతో ఆమె నికాహ్ జరిపించాము – దత్తపుత్రులు తమ భార్యలకు ఇష్టపూర్వకంగా విడాకులిచ్చిన తరువాత, (విడాకులు పొందిన) వారి భార్యలను వివాహమాడటంలో విశ్వాసులు ఎలాంటి సంకోచానికి లోను కారాదని మేమిలా చేశాము. అల్లాహ్ ఆజ్ఞ అమల్లోకి రావలసినదే.

38. దేవుడు తన ప్రవక్త కొరకు నిర్ధారించిన దానిని ఆయన అవలంబించటంలో ఆక్షేపణీయం ఏమీ లేదు. లోగడ గతించిన ప్రవక్తల విషయంలో కూడా దేవుని సంప్రదాయమిదే. దైవాజ్ఞ తిరుగులేనిదై ఉంటుంది.
39. వారంతా (ప్రవక్తలంతా) దైవ సందేశాలను చేరవేసేవారు. ఆయనకు మాత్రమే భయపడేవారు. అల్లాహ్‌కు తప్ప వేరెవరికీ భయపడేవారు కారు. లెక్క తీసుకోవటానికి అల్లాహ్ చాలు. 40. ముహమ్మద్ మీ పురుషులలో ఎవరికీ తండ్రి కాదు. అయితే అతను దైవసందేశహరుడు. ప్రవక్తల పరంపరను పరిసమాప్తం చేసే చివరివాడు. అల్లాహ్‌కు అన్ని వస్తువుల గురించి తెలుసు.

41. విశ్వసించిన వారలారా! అల్లాహ్‌ను అత్యధికంగా స్మరించండి.
42. ఉదయం, సాయంత్రం ఆయన పవిత్రతను కొనియాడండి. 43. ఆయనే మీపై కారుణ్యాన్ని పంపుతూ ఉంటాడు. ఆయన దూతలు కూడా (మీపై కారుణ్యం కురవాలని దైవాన్ని ప్రార్థిస్తూ ఉంటారు) – తద్వారా మిమ్మల్ని అంధకారాల నుండి వెలికితీసి కాంతిరేఖల వైపునకు తీసుకురావాలని. ఆయన విశ్వాసుల పాలిట అపార కరుణామయుడు. 44. వారు ఆయన్ని కలుసుకున్న దినాన 'సలామ్'తో వారికి స్వాగతం లభిస్తుంది. ఆయన వారి కోసం గౌరవప్రదమయిన ప్రతిఫలాన్ని సిద్ధపరచి ఉంచాడు.

45. ఓ ప్రవక్తా! మేము నిన్ను సాక్ష్యమిచ్చేవానిగా, శుభవార్త వినిపించేవానిగా, భయబోధ చేసేవానిగా పంపాము – 46 – ఇంకా నిన్ను దేవుని ఆజ్ఞతో ఆయన వైపునకు పిలిచేవానిగా, వెలిగే దీపంగా (చేశాము). 47. విశ్వసించిన వారికి అల్లాహ్ తరఫున గొప్ప అనుగ్రహం ఉందన్న శుభవార్తను వినిపించు. 48. నీవు సత్యతిరస్కారుల, కపటుల మాట వినకు. వారి వేధింపులను ఉపేక్షించు. అల్లాహ్‌నే నమ్ముకో. నమ్ముకోవటానికి అల్లాహ్‌యే చాలు.

49. ఓ విశ్వాసులారా! విశ్వసించిన వనితలను మీరు వివాహమాడినపుడు, వారిని ముట్టుకోకముందే వారికి విడాకులిచ్చేసినట్లయితే, అట్టి పరిస్థితిలో మీరు లెక్కించే గడువు (ఇద్దత్) కాలం పూర్తిచేయమని వారిని కోరే హక్కు మీకు లేదు. అయితే వారికి ఎంతో కొంత పారితోషికంగా ఇచ్చి, ఉత్తమ రీతిలో సెలవు ఇవ్వండి.

50. ఓ ప్రవక్తా! నీవు మహర్ సొమ్మును చెల్లించిన నీ సతీమణులను మేము నీ కొరకు ధర్మసమ్మతం చేశాము. ఇంకా అల్లాహ్ యుద్ధప్రాప్తిగా నీ యాజమాన్యంలో ఇచ్చిన స్త్రీలు, ఇంకా తమ స్వస్థలాలను వదలి నీతో పాటు వచ్చిన (హిజ్రత్ చేసిన) నీ పినతండ్రుల కుమార్తెలు, నీ మేనత్తల కూతుళ్ళు, నీ మేనమామల కుమార్తెలు, నీ పినతల్లుల పుత్రికలు కూడా నీకు హలాల్ (ధర్మసమ్మతం) చేశాము. తనను తాను దైవప్రవక్తకు (హిబాగా) సమర్పించుకునే విశ్వాసురాలైన స్త్రీని కూడా హలాల్ చేశాము. అయితే దైవప్రవక్త ఆమెను తన వివాహబంధంలో తీసుకోదలిస్తేనే ఈ నిబంధన వర్తిస్తుంది. ఇది ప్రవక్తవైన నీ కొక్కనికే ప్రత్యేకం. విశ్వాసులకు ఇది వర్తించదు. వారికి (సామాన్య ముస్లింలకు) వారి భార్యల, వారి బానిస స్త్రీల విషయంలో విధించిన ఆదేశాలేమిటో మాకు బాగా తెలుసు – నీకెలాంటి ఇబ్బందీ కలుగకుండా ఉండేటందుకే (నీకు ప్రత్యేకంగా వెసులుబాటు ఇవ్వబడింది). అల్లాహ్ అమితంగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడు.

51. వారిలో నీవు కోరిన వారిని దూరంగా ఉంచవచ్చు, నీవు కోరిన

వారిని నీ దగ్గర ఉంచవచ్చు. నీవు దూరంగా ఉంచిన వారిలో ఎవరినయినా నీ దగ్గరకు పిలుచుకున్నా నీవు నిందార్హుడవు కావు – తద్వారా వారి కళ్లకు చలువ లభిస్తుందని, వారు ఆవేదన చెందకుండా ఉంటారని, నీవు వారికి ఏమి ఇచ్చినా దాంతో వారు సంతోషపడతారని ఆశించబడుతుంది. మీ హృదయాలలో ఏముందో అల్లాహ్‌కు తెలుసు. అల్లాహ్ జ్ఞాన సంపన్నుడు, సహనశీలుడు. 52. వీరు తప్ప, ఇతర స్త్రీలు నీకు ధర్మసమ్మతం కాదు. వీరి స్థానంలో వేరితర స్త్రీలను దాంపత్యంలో తీసుకోవటం కూడా నీకు సమ్మతం కాదు – వారి అందం నీకు ఎంతగా నచ్చినాసరే. అయితే నీ యాజమాన్యంలో ఉన్న బానిస స్త్రీల విషయంలో మటుకు ఈ ఆంక్ష వర్తించదు. అల్లాహ్ ప్రతి దానినీ పర్యవేక్షిస్తూ ఉన్నాడు.

53. విశ్వాసులారా! భోజనార్థం మీకు ఆనతి లభిస్తే తప్ప మీరు ప్రవక్త ఇండ్లలోనికి వెళ్ళకండి – అదైనా భోజనం తయారయ్యే వరకూ నిరీక్షించే విధంగా కాదు. మిమ్మల్ని ఆహ్వానించినపుడే వెళ్ళండి. భోజనాల వగానే లేచి వెళ్ళిపోండి. మాటల్లో పడి అక్కడే బైఠాయించకండి. దీనివల్ల ప్రవక్తకు ఇబ్బంది కలుగుతుంది. మొగమాటం వల్ల అతను మీకేమీ చెప్పడు. కాని అల్లాహ్ సత్యం చెప్పటానికి మొగమాటపడడు. మీరు ప్రవక్త సతీమణులను ఏదయినా వస్తువు అడగవలసి వచ్చినపుడు తెర వెనుక నుంచి అడగండి. ఈ పద్ధతి మీ హృదయాల, వారి హృదయాల పవిత్రత కోసం ఎంతో మేలైనది. దైవప్రవక్తను నొప్పించటం మీకు ధర్మసమ్మతం కాదు. అతని తదనంతరం అతని సతీమణులను వివాహమాడటం కూడా మీకు ధర్మసమ్మతం కాదు. ఇది దైవసన్నిధిలో చాలా తీవ్రమైన విషయం. 54. మీరు ఏ విషయాన్నయినా వెల్లడించినా లేదా దానిని గోప్యంగా ఉంచినా – నిశ్చయంగా అల్లాహ్‌కు ప్రతిదీ తెలుస్తుంది.

55. ప్రవక్త సతీమణులు తమ తండ్రుల ముందుకు వస్తే తప్పులేదు. అలాగే వారు తమ కుమారుల, తమ సోదరుల, తమ సోదరుల కుమారుల,

తమ సోదరీమణుల కుమారుల ముందుకు వచ్చినా దోషం లేదు. అలాగే వారు తమతో కలసిమెలసి ఉండే స్త్రీల లేదా బానిస స్త్రీల ఎదుట వచ్చినా నిందార్హులు కారు. మీరు అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ ప్రతి దానినీ కనిపెట్టుకుని ఉన్నాడు.

56. అల్లాహ్ మరియు దైవదూతలు ప్రవక్తపై కారుణ్యాన్ని పంపు
తున్నారు. ఓ విశ్వాసులారా! మీరు కూడా ప్రవక్తపై దురూద్, సలాములు
పంపండి. 57. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను బాధించే వారిపై అల్లాహ్
ప్రపంచంలోనూ, పరలోకంలోనూ శపిస్తాడు. వారికోసం అవమానకరమయిన
శిక్షను సిద్ధపరచి ఉంచాడు. 58. ఎవరయితే విశ్వాసులయిన పురుషులను,
విశ్వాసులయిన స్త్రీలను అకారణంగా వేధిస్తారో వారు అపనిందను,
స్పష్టమయిన పాపభారాన్ని మోసిన వారవుతారు.

59. ఓ ప్రవక్తా! నీ భార్యలకు, నీ కుమార్తెలకు, విశ్వాసులకు చెప్పు;
వారు తమపై నుంచి దుప్పట్లను క్రిందికి వ్రేలాడేవిధంగా కప్పుకోమని.
తద్వారా వారు చాలా తొందరగా (మర్యాదస్తులుగా) గుర్తించబడతారు.
వేధింపులకు గురికాకుండా ఉంటారు. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు.
60. కపటులు, హృదయాలలో రోగం ఉన్నవారు, మదీనాలో తప్పుడు
వార్తలను వ్యాపింపజేసేవారు – వీరంతా తమ (విచ్ఛిన్నకర) ధోరణిని
మానుకోకపోతే, మేము నిన్ను వారిపై చర్యతీసుకునే వానిగా నియమిస్తాము.
ఆ తరువాత వారు మదీనాలో నీతో బహుకొద్ది కాలం మాత్రమే సహజీవనం
సాగించగలుగుతారు. 61. శాపగ్రస్తులై, ఎక్కడ తారసపడితే అక్కడే
పట్టుకోబడతారు. ఘోరంగా చంపబడతారు. 62. ఇది దేవుని సంప్రదాయం.
వీరికి పూర్వం గతించిన వారి విషయంలో కూడా ఇలాగే జరిగింది. దేవుని
సంప్రదాయంలో నీవు ఎలాంటి మార్పునూ కనుగొనలేవు.

63. ప్రజలు నిన్ను ప్రళయం గురించి అడుగుతున్నారు. వారికి
చెప్పు : 'దీని జ్ఞానం అల్లాహ్ వద్ద మాత్రమే ఉంది. నీకేం తెలుసు!? బహుశా

ఆ ఘడియ దగ్గరపడిందేమో!' 64. నిశ్చయంగా అల్లాహ్ సత్యతిరస్కారులను కారుణ్యానికి దూరంగా విసిరేశాడు. వారి కొరకు భగభగమండే అగ్నిని సిద్ధం చేసి ఉంచాడు. 65. వారందులో సదా పడి ఉంటారు. వారు తమ కొరకు ఏ రక్షకుణ్ణిగానీ, సహాయకుణ్ణి గానీ పొందలేరు. 66. ముఖాలు నిప్పులపై అటూ ఇటూ పొర్లింపబడిననాడు వారిలా అంటారు : 'అయ్యో! మేము అల్లాహ్‌కు విధేయత చూపి ఉంటే, ప్రవక్తకు విధేయులం అయి ఉంటే ఎంత బాగుండేది!' 67. ఇంకా ఈ విధంగా అంటారు : 'మహాప్రభూ! మేము మా సర్దారులు, పెద్దలు చెప్పినట్లు నడుచుకున్నాము. వారేమో మమ్మల్ని దారి తప్పించారు. 68. మా ప్రభూ! వారికి రెండింతల శిక్ష విధించు. భారీ ఎత్తున వారిని శపించు.'

69. ఓ విశ్వాసులారా! మీరు మూసాను వేధించినవారి మాదిరిగా అవకండి. అప్పుడు అల్లాహ్ వారు అన్నమాట నుండి అతన్ని నిష్కళంకునిగా నిరూపించాడు. అతను అల్లాహ్ సన్నిధిలో ఎంతో ఆదరణీయుడు. 70. విశ్వసించిన వారలారా! మీరు అల్లాహ్‌కు భయపడండి. సూటిగా, సజావుగా మాట్లాడండి. 71. ఆయన మీ ఆచరణలను చక్కదిద్దుతాడు. మీ పాపాలను క్షమిస్తాడు. అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయుడుగా మసలు కున్న వ్యక్తి గొప్ప సాఫల్యాన్ని పొందాడు.

72. మేము అమానతు (అప్పగింత, నమ్మకం, బాధ్యత)ను భూమ్యాకాశాల ముందు, పర్వతాల ముందు పెట్టగా, దానిని మోయటానికి అవి నిరాకరించాయి. దానికి అవి భయపడిపోయాయి. కాని మానవుడు మాత్రం దానిని (ఆ బరువును) ఎత్తుకున్నాడు. నిశ్చయంగా వాడు మహా మొండిఘటం, మహా మూర్ఖుడు. 73. అల్లాహ్ కపటులైన పురుషులను, కపటులైన స్త్రీలను, బహు దైవారాధకులయిన పురుషులను, బహుదైవారాధన చేసే స్త్రీలను దండించటానికి, విశ్వాసులైన పురుషులను, విశ్వసించిన స్త్రీలను క్షమించి, వారిపై దయదలచటానికి (ఇదంతా జరిగింది). అల్లాహ్ క్షమించే వాడు, కరుణించేవాడూను.

# 34. సబా (షేబా జాతి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ప్రశంసలు, పొగడ్తలు అల్లాహ్ కొరకే. ఆకాశాలలో, భూమిలో ఉన్న సమస్తం ఆయనదే. పరలోకంలోనూ స్తోత్రం ఆయనకే చెందుతుంది. ఆయన వివేకవంతుడు, ప్రతిదీ తెలిసినవాడు. 2. భూమిలోనికి వెళ్ళేదీ, దాని నుండి వెలికివచ్చేదీ, ఆకాశం నుండి దిగేదీ, అందులోనికి ఎక్కివెళ్ళేదీ – సమస్తం ఆయనకు తెలుసు. ఆయన అపార కృపాశీలుడు, క్షమాశీలుడు.

3. 'మాపై ప్రళయం రాదు' అని సత్యతిరస్కారులు అంటారు. వారికి చెప్పు : 'ఎందుకు రాదు? అగోచరాల జ్ఞాని అయిన నా ప్రభువు తోడుగా! అది వచ్చి తీరుతుంది. అణువంత వస్తువు కూడా ఆయన నుండి దాగి లేదు – అది ఆకాశాలలో ఉన్నాసరే, భూమిలో ఉన్నాసరే. దానికన్నా చిన్నదయినా, దానికన్నా పెద్దదయినా – అది ఒక స్పష్టమయిన గ్రంథంలో నమోదై ఉంది. 4. విశ్వసించి, మంచిపనులు చేసే వారికి బహుమానం ఇవ్వటానికి (ఈ ఏర్పాటు జరిగింది). ఇలాంటి వారి కోసమే క్షమాపణ, గౌరవ ఉపాధి ఉన్నాయి. 5. మరెవరయితే మా సూచనలను లొంగదీసుకోవాలని ప్రయత్నించారో, వారికి అత్యంత నికృష్టమయిన, బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 6. జ్ఞానం వొసగబడినవారు, నీ ప్రభువు తరఫు నుండి నీపై అవతరింపజేయబడినది సత్యమని, అది శక్తిమంతుడు, స్తవనీయుడు అయిన దైవమార్గం వైపు దర్శకత్వం వహిస్తుందని గ్రహిస్తారు.

7. తిరస్కార వైఖరికి ఒడిగట్టిన వారు ఇలా అంటారు : 'మీరు (మరణించి) తుత్తునియలు అయిపోయిన మీదట, మళ్ళీ సరికొత్తగా సృష్టించబడతారని తెలుపుతున్న వ్యక్తిని మీకు చూపమంటారా? 8. ఏమిటి, అతను దేవునికి అసత్యాన్ని ఆపాదిస్తున్నాడా? లేక అతనికేమన్నా పిచ్చిపట్టిందా?' అసలు విషయమేమిటంటే, పరలోకంపై నమ్మకం లేనివారు

మాత్రమే శిక్షకు, బహుదూరపు మార్గవిహీనతకు లోనై ఉన్నారు. 9. ఏమిటి, వారు తమ ముందూ, తమ వెనుకా ఉన్న భూమ్యాకాశాల వైపు దృష్టిని సారించటం లేదా? మేము గనక తలచుకుంటే వారిని భూమిలో అణగద్రొక్కేవారం. లేదా ఆకాశం నుండి వారిపై తునకలు పడవేసేవారం. నిశ్చయంగా ఇందులో మరలివచ్చే ప్రతి దాసునికీ సూచన ఉంది.

10. మేము దావూదుకు మా తరఫు నుండి మహదానుగ్రహం ప్రసాదించాము. 'ఓ పర్వతాల్లారా! మీరు కూడా అతనితో చేరి మా స్తోత్రం చేయండి.' పక్షులకు కూడా ఇలాగే ఆదేశించాము. ఇంకా మేము ఇనుమును అతని కోసం మెత్తబరిచాము. 11. 'పొడవాటి కవచాలను నిర్మించు. వాటి కొక్కెములను ఖచ్చితంగా జోడించు. సదాచరణ చేస్తూ ఉండు. నీవు చేసేదంతా నేను చూస్తూ ఉన్నాను' (అని మేము అతనికి తాకీదు చేశాము).

12. ఇంకా – సులైమాను కోసం మేము గాలిని నియంత్రణలో ఉంచాము. అతని ఉదయ మజిలీ నెల రోజుల ప్రయాణానికి సమానంగా ఉండేది. అతని సాయంత్రపు మజిలీ ఒక నెల రోజుల ప్రయాణానికి సమానంగా ఉండేది. ఇంకా మేమతని కోసం రాగి ఊటను ప్రవహింప జేశాము. అతని ప్రభువు ఆజ్ఞానుసారం అతని సమక్షంలో పనిచేసే పొగరుబోతు జిన్నాతులు అతని వద్ద ఉండేవారు. వారిలో ఏ ఒక్కడు మా ఆజ్ఞను ఉల్లంఘించినా మేము వాడికి మండే అగ్నియాతనను చవిచూపిస్తాము. 13. వారు అతనికి, అతను కోరినదల్లా చేసిపెట్టేవారు. బ్రహ్మాండమైన భవనాలు, ప్రతిమలు, కోనేరుల్లాంటి విశాలమైన పళ్ళాలు, ఒకేచోట స్థిరపరచబడిన పెద్ద పెద్ద దేగిశాలు నిర్మించేవారు. 'ఓ దావూదు ఇంటివారలారా! కృతజ్ఞతాపూర్వకంగా ఆచరించండి. నా దాసులలో కృతజ్ఞులై ఉండేవారు తక్కువే' అని మేము ఉపదేశించాము.

14. మరి మేము అతనిపై మరణ శాసనాన్ని విధించినపుడు, అతని చేతికర్రను తింటూ ఉన్న చెదపురుగు తప్ప వేరెవరూ అతని చావు కబురును

తెలియపరచలేదు. అతను (సులైమాన్) నేలమీద పడిపోయినపుడు, తమకే గనక అగోచర విషయజ్ఞానం ఉండి ఉంటే ఇంతటి అవమానకరమయిన పరిస్థితి ఎదురయ్యేది కాదు అని జిన్నులకు తెలిసివచ్చింది.

15. సబా వారికి వారి స్వస్థలంలోనే ఒక సూచన ఉండేది. వారి కుడివైపునా, ఎడమ వైపునా రెండు తోటలు! 'మీ ప్రభువు ప్రసాదించిన జీవనోపాధి నుండి తినండి, ఆయనకు కృతజ్ఞులై ఉండండి' (అని వారితో అన్నాము). పట్టణమేమో పచ్చతోరణం లాంటిది! ప్రభువేమో క్షమాసాగరుడు! 16. కాని వారు (సత్యం పట్ల) విముఖులవటం వల్ల మేము వారిపై (ఆనకట్టను త్రెంచే) ఉధృతమయిన వరదను పంపాము. వారి రెండు తోటలను మరో రెండు తోటలతో మార్చివేశాము. వాటిలో వగరు ఫలాలు, ఝావుక చెట్లు, రేగి వృక్షాలు ఉండేవి. 17. మేలును మరిచే వారి ధోరణికి గాను మేమిచ్చిన ప్రతిఫలమిది! కృతఘ్నులకు మేమిచ్చే ప్రతిఫలం ఇలాగే ఉంటుంది మరి!

18. మేము వారికీ – మేము శుభవంతం చేసిన బస్తీలకు నడుమ మరికొన్ని జనావాసాలను కూడా వసింపజేశాము. అవి దారిలో కానవచ్చేవి. వాటి మధ్యన ప్రయాణ మజిలీలను కూడా మేము తగువిధంగా నిర్ధారించాము. 'మీరు వాటి మధ్య రేయింబవళ్ళు నిశ్చింతగా ప్రయాణించండి' (అని వారికి సూచించాము). 19. తరువాత వారు, 'మా ప్రభూ! మా ప్రయాణ మజిలీల మధ్య దూరాలను పెంచు' అని వేడుకుని తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నారు. అందువల్ల మేము వారిని ప్రాచీన కథగా మార్చివేశాము. వారిని పూర్తిగా చెల్లాచెదురు చేసివేశాము. నిశ్చయంగా ఇందులో సహనభావం, కృతజ్ఞతా భావం కల ప్రతి ఒక్కరికీ పలు సూచన లున్నాయి.

20. ఇబ్లీసు వారిపై గల తన అనుమానాన్ని నిజం చేసి చూపాడు. నిజ విశ్వాసుల ఒక వర్గం తప్ప మిగిలిన వారంతా వాణ్ణి అనుసరించారు. 21. వాస్తవానికి ఇబ్లీసుకు వారిపై ఎలాంటి అధికారం లేకుండింది. అయితే

పరలోకంపై గట్టి విశ్వాసం గలవారెవరో, సందిగ్ధంలో పడి ఉన్న వారెవరో పరికించి, వేరుపరచటానికే (మేమిలా చేశాము). నీ ప్రభువు ప్రతి వస్తువునూ కనిపెట్టుకుని ఉన్నాడు.

22. వారికి చెప్పు : అల్లాహ్‌ను కాదని మీరు ఆరాధ్య దైవాలుగా భావిస్తున్న వారిని పిలిచి చూడండి! ఆకాశాలలోగాని, భూమిలో గానీ వారికి రవంత అధికారం లేదు. ఆ రెండింటిలో వారికెలాంటి భాగస్వామ్యం కూడా లేదు. వారిలో ఎవడూ ఆయనకు సహాయకుడుగా కూడా లేడు. 23. ఆయన సమ్ముఖంలో – ఆయన అనుమతించిన వాని కొరకు తప్ప – వేరెవరికీ ఎవరి సిఫారసూ ఉపయోగపడదు. చివరకు వారి హృదయాలలోని ఆందోళన తొలగిన తరువాత, 'మీ ప్రభువు ఏమన్నాడు?' అని అడుగుతారు. 'సత్యం చెప్పాడు' అని వారంటారు. ఆయన సర్వోన్నతుడు, అందరికన్నా గొప్పవాడు.

24. 'మీకు భూమ్యాకాశాల నుండి జీవనోపాధిని సమకూర్చేదెవరు?' అని వారిని అడుగు. **'అల్లాహ్‌యే'** అని వారికి చెప్పు. మేముగానీ, మీరుగానీ – ఎవరో ఒకరు మాత్రమే సన్మార్గాన ఉన్నాము. లేదా స్పష్టమయిన మార్గభ్రష్టతలో పడి ఉన్నాము. 25. ఇలా అను : 'మేము చేసిన తప్పులకు మిమ్మల్ని నిలదీసి అడగటంగానీ, మీరు చేసే వాటిని గురించి మమ్మల్ని ప్రశ్నించటం గానీ జరగదు.' 26. ఇలా చెప్పు : 'మన ప్రభువు మనందరినీ సమావేశపరుస్తాడు. తరువాత మన మధ్య న్యాయబద్ధంగా తీర్పునిస్తాడు. ఆయనే తీర్పరి. అన్నీ తెలిసినవాడు.' 27. ఇలా అడుగు : 'మీరు ఆయనకు సాటిగా నిలబెట్టిన ఆ భాగస్వాములను కాస్త నాకు చూపించండి. ఎవరూ లేరు. వాస్తవానికి ఆయనే అల్లాహ్! శక్తిమంతుడు, వివేకవంతుడు.'

28. (ఓ ప్రవక్తా!) మేము నిన్ను సమస్త మానవులకు శుభవార్తనిచ్చే వానిగా, హెచ్చరిక చేసేవానిగా పంపాము. కాని చాలామందికి తెలియదు. 29. 'నీవు చెప్పేది నిజమే అయితే ఆ వాగ్దానం ఎప్పుడు నెరవేరుతుంది?' అని వారంటున్నారు. 30. వారికి చెప్పు : 'మీకోసం ఓ ప్రత్యేక దినపు

వాగ్దానం ఉంది. దాని నుండి ఒక గడియ వెనక్కి జరగటం గానీ, ముందుకు పోవటంగానీ జరగదు.'

31. తిరస్కారులు అంటారు : 'మేము ఈ ఖుర్ఆన్‌ను గానీ, దానికి పూర్వం ఉన్నవాటిని గానీ ముమ్మాటికీ ఒప్పుకోము.' ఈ దుర్మార్గులు తమ ప్రభువు సమక్షంలో హాజరుపరచబడి, పరస్పరం నిందించుకుంటున్నప్పుడు నీవు చూస్తే ఎంత బాగుంటుంది! బలహీన వర్గంగా పరిగణించబడినవారు పెద్దలుగా చెలామణీ అయిన వారి నుద్దేశించి, 'మీరు గనక లేకుంటే మేము తప్పక విశ్వసించేవారం' అంటారు. 32. బడాబాబులు బలహీనులతో ఇలా అంటారు : 'మీ దగ్గరకు మార్గదర్శకత్వం వచ్చినపుడు, మీరు దానిని అవలంబించకుండా మేమేమన్నా నిరోధించామా? స్వయంగా మీరే నేరస్తులు.' 33. అప్పుడు బలహీనులు బడాబాబులతో అంటారు : 'లేదు. రేయింబవళ్ళు మీరు పన్నిన పన్నాగాలే మాకు చేటుగా పరిణమించాయి. అల్లాహ్‌ను త్రోసిపుచ్చాలని, ఆయనకు సాటి కల్పించాలని మీరు మమ్మల్ని పురమాయించేవారు కదా!' శిక్షను చూసుకున్నప్పుడు వారు తమలోని పశ్చాత్తాపాన్ని బయటపడకుండా దాస్తారు. మేము తిరస్కారుల మెడలలో ఇనుప పట్టాలు వేస్తాము. వారు తాము చేసుకున్న దాని ప్రతిఫలాన్నే అనుభవిస్తారు.

34. మేము ఏ బస్తీలోనికి హెచ్చరించే వానిని పంపినా, అక్కడి శ్రీమంతులు, 'నీకిచ్చి పంపబడిన దానిని మేము తిరస్కరిస్తున్నాము' అనే చెప్పారు. 35. వారింకా ఇలా అన్నారు : 'మేము సిరిసంపదలలోనూ, సంతాన భాగ్యంలోనూ అధికులం. కాబట్టి శిక్ష మాకు వర్తించదు.' 36. వారికి చెప్పు : 'నా ప్రభువు తాను కోరిన వారికి విస్తృతంగా ఉపాధిని ఇస్తాడు. తాను కోరిన వారికి తగ్గించి ఇస్తాడు. కాని చాలామంది దీనిని గ్రహించరు.' 37. మీ సిరిసంపదలుగానీ, మీ సంతానం గానీ – అంతస్తు దృష్ట్యా – మిమ్మల్ని మా సమీపానికి చేర్చటంలో ఏ విధంగానూ పనికిరావు. అయితే విశ్వసించి, సదాచరణ చేస్తే అలాంటి వారికి వారి ఆచరణకు

రెండింతల ప్రతిఫలం ఉంటుంది. వారు ఎత్తయిన మంటపాలపై హాయిగా ఉంటారు. 38. మరెవరయితే మా సూచనలను లొంగదీసుకునే ప్రయత్నాలు చేస్తున్నారో – అలాంటివారు శిక్ష కోసం ప్రవేశపెట్టబడతారు. 39. ఇలా అను : 'నా ప్రభువు తన దాసులలో తాను కోరిన వారి జీవనోపాధిని విస్తృతపరుస్తాడు. తాను కోరిన వారికి కుదిస్తాడు. (ఆయన మార్గంలో) మీరు ఏది ఖర్చుచేసినా, దాని ప్రతిఫలం ఆయన మీకు ఇస్తాడు. ఆయన అత్యుత్తమ ఉపాధి ప్రదాత.'

40. ఆయన అందరినీ సమావేశపరచిననాడు, దైవదూతలతో, 'ఏమిటి, వీళ్ళు మిమ్మల్ని ఆరాధించేవారా?' అని అడుగుతాడు. 41. అప్పుడు వారిలా సమాధానమిస్తారు : 'నీవు పరమపవిత్రుడవు. మా సంబంధం నీతోనేగాని, వాళ్ళతో కాదు. పైగా వీళ్ళు జిన్నులను పూజించేవారు. వీరిలో చాలామంది వాళ్ళనే (జిన్నులనే) నమ్ముకున్నారు.' 42. (అప్పుడు వారితో అనబడుతుంది) ఈ రోజు మీలో ఎవరూ ఎవరికీ ఎలాంటి లాభంగానీ, నష్టంగానీ కలిగించలేరు. 'మీరు అబద్ధమంటూ త్రోసిపుచ్చిన నరకాగ్ని యాతనను ఇక రుచి చూడండి' అని మేము దుర్మార్గులతో అంటాము.

43. వారికి స్పష్టమయిన మా వచనాలు వినిపించబడినప్పుడు, వారు 'ఈ వ్యక్తి మిమ్మల్ని మీ పూర్వీకుల ఆరాధ్య దేవతల నుండి ఆపాలనుకుంటున్నాడు' అనంటారు. పైగా వారు 'ఇదొక కాల్పనిక అబద్ధం' అన్నారు. తిరస్కారుల ముందు సత్యం వచ్చేసినపుడు 'ఇదొక స్పష్టమయిన మంత్రజాలం మాత్రమే' అన్నారు. 44. మేము వారికి (మక్కా వాసులకు), వారు చదవటానికి గ్రంథాలు ఇవ్వలేదు. మేము నీకు పూర్వం వారి వద్దకు భయబోధ చేసే వానిని కూడా పంపలేదు. 45. వారి పూర్వీకులు కూడా త్రోసిపుచ్చినవారే. మేము వారికి ప్రసాదించి ఉన్న దానిలో పదోవంతుకు కూడా వీళ్ళు చేరుకోలేదు. వారు నా ప్రవక్తలను అసత్యవాదులంటూ త్రోసిపుచ్చారు. వారిపై నా శిక్ష ఎలా పడిందో చూశావుగా!

46. వారితో అను : 'నేను మీకు ఒక ఉపదేశం చేయగోర్తాను. అదేమిటంటే, మీరు దేవుని కొరకు ఇద్దరిద్దరు, ఒక్కొక్కరు చొప్పున నిలబడండి. ఆ తరువాత ఆలోచించండి. మీ ఈ సహచరునికి పిచ్చీ గిచ్చీ ఏమీ లేదు. అతనైతే మిమ్మల్ని ఒక కఠిన శిక్ష వచ్చిపడక ముందే సావధానపరుస్తున్నాడు.' 47. ఇలా చెప్పు : 'ఒకవేళ నేను మీ నుండి ప్రతిఫలం ఏమన్నా అడిగి ఉంటే, దానిని మీరే ఉంచుకోండి. నాకు ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌పై ఉంది. ఆయన ప్రతి విషయానికీ సాక్షిగా ఉన్నాడు.'

48. ఇలా అను : 'నా ప్రభువు సత్యాన్ని (అసత్యంపై) సంధిస్తాడు. ఆయన గోప్యంగా ఉన్న వాటిని ఎరిగినవాడు.' 49. ఈ విధంగా (కూడా) అను : 'సత్యం వచ్చేసింది. అసత్యం ఆరంభించిందీ ఏమీ లేదు, అది పునరావృతం చేసేది కూడా ఏమీ ఉండదు.' 50. ఇలా చెప్పు : 'ఒకవేళ నేను మార్గవిహీనుణ్ణి అయి ఉంటే నా మార్గవిహీనతా పాపం నా మీదే పడుతుంది. ఒకవేళ నేను సన్మార్గాన ఉంటే, ఇది నా ప్రభువు నాకు వహీ (దివ్యవాణి) ద్వారా పంపినదే. నిశ్చయంగా ఆయన అంతా వినేవాడు. అతి సమీపంలో ఉన్నవాడు.'

51. వారు కలవరం చెంది ఉండగా నీవు చూడగలిగితే ఎంత బాగుంటుంది! వారు తప్పించుకుని పారిపోలేరు. అతి సమీపం నుండే పట్టుకోబడతారు. 52. అప్పుడు వారు, 'మేము దీనిని (ఖుర్‌ఆన్‌ను) విశ్వసించాము' అనంటారు. కాని అంతదూరం నుండి వారు ఆశించిన దానిని ఎలా పొందగలుగుతారు? 53. అంతకు ముందైతే వారు దానిని త్రోసిపుచ్చారు. చూడకుండానే, అల్లంతదూరాన ఉండి ప్రేలాపనలు చేసేవారు. 54. వారికీ – వారి ఆకాంక్షలకు మధ్య అడ్డుతెర వేయబడుతుంది – గతంలో వారిలాంటి వారి పట్ల చేయబడినట్లుగానే! వారు కూడా తీవ్రమయిన సందిగ్ధానికి లోనై ఉండేవారు.

# 35. ఫాతిర్ (సృష్టికర్త)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. సర్వస్తోత్రాలు అల్లాహ్‌కే శోభిస్తాయి. (ఆయన) ఆకాశాలకు, భూమికి ఉనికిని ప్రసాదించినవాడు; దైవదూతలను సందేశవాహకులుగా చేసుకునేవాడు. వారికి రెండేసి, మూడేసి, నాలుగేసి రెక్కలుంటాయి. సృష్టిలో ఆయన తాను కోరిన దానిని పెంచుతాడు, నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. 2. దేవుడు ప్రజల కొరకు తెరిచే కారుణ్యాన్ని నిలిపివేసేవాడెవడూ లేడు. ఆయన దానిని నిలిపివేస్తే, దానిని తెరిచేవాడు కూడా ఎవడూ లేడు. ఆయన శక్తిమంతుడు, వివేకవంతుడు.

3. ప్రజలారా! మీపై గల దైవానుగ్రహాన్ని కాస్త జ్ఞాపకం చేసుకోండి. అల్లాహ్ తప్ప ఆకాశం నుండి, భూమి నుండి మీకు జీవనోపాధిని ఇచ్చే సృష్టికర్త ఎవడయినా ఉన్నాడా? ఆయన తప్ప వేరొక ఆరాధ్య దైవం లేనేలేడు. మరి మీరు ఎటు నుండి మోసగించబడుతున్నారు? 4. (ప్రవక్తా!) ఒకవేళ వీరు నిన్ను అసత్యవాది అంటూ త్రోసిపుచ్చినట్లయితే, నీకు పూర్వం కూడా ఎందరో ప్రవక్తలు ఈ విధంగా త్రోసిపుచ్చబడినవారే. సమస్త వ్యవహారాలు కడకు అల్లాహ్ వైపునకే మరల్చబడతాయి.

5. ప్రజలారా! నిశ్చయంగా దేవుని వాగ్దానం సత్యం. కాబట్టి ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసపుచ్చరాదు. ఆ మహా మోసగాడు (షైతాన్) కూడా అల్లాహ్ విషయంలో మిమ్మల్ని మోసగించకూడదు సుమా! 6. నిశ్చయంగా షైతాన్ మీ శత్రువు. కనుక మీరు కూడా వాణ్ణి శత్రువుగానే పరిగణించండి. వాడు తన అనుయాయులను పిలుస్తున్నది, వాళ్ళను నరకాగ్నివాసులుగా చేయటానికే. 7. తిరస్కార వైఖరిని అవలంబించినవారికి కఠిన శిక్ష ఉంటుంది. విశ్వసించి, సత్క్రియలాచరించిన వారికి క్షమాపణతో పాటు గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

8. ఏమిటి, ఎవరయినా ఒక వ్యక్తికి అతని దుష్కర్మలు అందమైనవిగా

చూపించబడినపుడు, అతను కూడా వాటిని సత్కర్మలుగా భావించినట్లయితే (అలాంటి వ్యక్తి సన్మార్గాన ఉన్న వానితో సమానుడవుతాడా?). అల్లాహ్ తాను కోరినవారిని అపమార్గాన వదలివేస్తాడు. తాను కోరిన వారికి మార్గదర్శకత్వం వహిస్తాడు. కనుక నీవు వారి గురించి తీవ్రంగా చింతించి, నీ ప్రాణాలకు హాని కలిగించుకోకు. నిశ్చయంగా వారు చేసే దాని గురించి అల్లాహ్‌కు తెలుసు.

9. గాలులను పంపేవాడు అల్లాహ్‌యే. తరువాత అవి మేఘాలను లేపుతాయి. దరిమిలా మేము వాటిని ఓ మృతప్రదేశం వైపు తీసుకుపోతాము. తద్వారా మేము ఆ భూమికి, అది మృతి చెందిన పిదప జీవం పోస్తాము. ఇదేవిధంగా (మృతులను) తిరిగి బ్రతికించటం జరుగుతుంది. 10. గౌరవాన్ని పొందగోరే వాడెవడయినాసరే గౌరవమంతా అల్లాహ్‌కే చెందుతుందని తెలుసుకోవాలి. పవిత్ర వచనం ఆయన వైపు ఎగబ్రాకుతుంది. సదాచరణ దానిని మరింత ఉన్నతికి చేరుస్తుంది. ఎవరయితే కుతంత్రాలతో పొద్దుపుచ్చు తున్నారో వారికి కఠిన శిక్ష ఉంటుంది. వారి కుతంత్రాలు నామరూపాల్లేకుండా పోతాయి.

11. అల్లాహ్ మిమ్మల్ని మట్టితో పుట్టించాడు. తరువాత నీటి (వీర్య) బిందువుతో, ఆ తరువాత మిమ్మల్ని జంటలుగా చేశాడు. ఆయన జ్ఞానపరిధిలో లేకుండా ఏ స్త్రీ గర్భం దాల్చటం గానీ, ప్రసవించటంగానీ జరగదు. దీర్ఘాయుషు పొందినవాని ఆయుషు పెరగటమయినా, మరొకరి ఆయుషు తగ్గటమయినా – అదంతా ఒక గ్రంథంలో నమోదై ఉంది. ఇలా చేయటం అల్లాహ్‌కు చాలా సులువు.

12. రెండు జలధులూ సమానం కావు. ఇదేమో తియ్యనిది, దాహం తీర్చేది, త్రాగేందుకు ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. అదేమో ఉప్పగా, చేదుగా ఉంది. అయితే మీరు ఆ రెండింటి నుండీ తాజా మాంసాన్ని తింటున్నారు. మీరు ధరించే ఆభరణాలను వెలికితీస్తున్నారు. ఇంకా నీవు (జలాశయాన్ని) చీల్చుకునిపోయే ఓడలను చూస్తున్నావు – తద్వారా మీరు

ఆయన అనుగ్రహాన్ని (ఉపాధిని) అన్వేషించాలని! ఇంకా మీరు కృతజ్ఞులు కావాలని!! 13. ఆయన రాత్రిని పగటిలోనికి ప్రవేశింపజేస్తున్నాడు. ఇంకా ఆయన పగటిని రాత్రిలోనికి ప్రవేశింపజేస్తున్నాడు. ఇంకా ఆయన సూర్యచంద్రులను కార్యనిబద్ధుల్ని చేశాడు – ప్రతిదీ ఒక నిర్థారిత వేళ ననుసరించి నడుస్తోంది. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. ఆయనే రాజ్యాధికారి. ఆయన్ని కాదని మీరు మొరపెట్టుకునేవారు ఖర్జూరపు టెంకపై ఉండే పొరకు కూడా యజమానులు కారు. 14. ఒకవేళ మీరు వారిని మొరపెట్టుకున్నా వారు మీ మొరను ఆలకించలేరు. ఒకవేళ ఆలకించినా వారు మీ ఫిర్యాదుకు స్పందించలేరు. పైగా వారు ప్రళయదినాన మీరు కల్పించిన భాగస్వామ్యాన్ని (షిర్క్‌ను) త్రోసిపుచ్చుతారు. అన్నీ తెలిసిన వాని మాదిరిగా ఎవరూ నీకు తెలియపరచలేరు.

15. ప్రజలారా! మీ అందరికీ అల్లాహ్ అవసరం ఉంది. అల్లాహ్ మాత్రం ఎవరి అవసరమూ లేనివాడు. స్తుతించదగినవాడు. 16. ఆయన గనక తలచుకుంటే మిమ్మల్ని తొలగించి, మరో నూతన సృష్టిని తేగలడు. 17. ఇది అల్లాహ్‌కు ఏమంత కష్టమైన పనికాదు. 18. బరువును మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడు. ఒకవేళ (ఎక్కువ) బరువును మోసేవాడు, తన బరువును మోయటానికి ఎవరినయినా పిలిచినా, అతను ఏ కాస్త కూడా దానిని ఎత్తుకోడు – అతడు సమీపబంధువు అయినాసరే! చూడకపోయినప్పటికీ తమ ప్రభువుకు భయపడేవారిని, నమాజును స్థాపించేవారిని మాత్రమే నీవు భయపెట్టగలవు. పరిశుద్ధతను అవలంబించినవాడు తన స్వయం కొరకే పరిశుద్ధతను అవలంబిస్తాడు. మరలిపోవలసింది మాత్రం అల్లాహ్ వైపునకే.

19. గుడ్డివాడు – కళ్ళున్నవాడు సమానులు కారు. 20. చీకటి – వెలుగు (సమానం కాజాలవు). 21. నీడా – ఎండా ఒకటి కావు. 22. సజీవమైనది – నిర్జీవమైనది సమానం కాలేవు. నిశ్చయంగా అల్లాహ్ తాను కోరిన వారికి వినిపిస్తాడు. సమాధులలో ఉన్న వారికి నీవు

వినిపించేవాడవు కాలేవు. 23. నీవు సావధానపరిచేవాడవు మాత్రమే. 24. మేము నిన్ను సత్యంతోపాటు శుభవార్త వినిపించేవానిగా, భయబోధ చేసేవానిగా పంపాము. భయబోధ చేసేవాడు రాని సమాజం అంటూ ఏదీ లేదు. 25. ఒకవేళ వీరు నిన్ను అసత్యవాదివంటూ తిరస్కరిస్తే, వీరికి పూర్వం గతించినవారు కూడా ఈ విధంగా తిరస్కరించి ఉన్నారు. వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమయిన మా నిదర్శనాలను, సహీఫాలను, జ్యోతిర్మయమయిన గ్రంథాన్ని తీసుకుని వచ్చారు. 26. ఆ తరువాతే నేను తిరస్కారులను పట్టుకున్నాను. మరి నా శిక్ష ఎంత తీవ్రంగా పరిణమించిందో చూశావుగా!

27. అల్లాహ్ ఆకాశం నుండి (వర్షపు) నీటిని కురిపించటాన్ని నీవు గమనించటం లేదా? మరి మేము దానిద్వారా రంగు రంగుల పండ్లను పండించాము. పర్వతాలలో సయితం తెలుపు, ఎరుపు – వివిధ భాగాలున్నాయి. కొన్ని మరీ నల్లగా ఉన్నాయి. 28. అలాగే మనుషులలోనూ, నేలపై ప్రాకే జంతువులలోనూ, పశువులలోనూ విభిన్న రంగులు కనిపిస్తాయి. నిశ్చయంగా దైవదాసులలో జ్ఞానసంపన్నులు మాత్రమే దైవానికి భయపడ తారు. నిశ్చయంగా దేవుడు శక్తిమంతుడు, క్షమాసాగరుడు.

29. నిశ్చయంగా ఎవరయితే దైవగ్రంథాన్ని పారాయణం చేస్తున్నారో, నమాజును స్థాపిస్తున్నారో, మేము ప్రసాదించిన ఉపాధిలో నుండి గోప్యం గానూ, బహిరంగంగానూ ఖర్చుచేస్తున్నారో వారు ఎన్నటికీ నష్టం కలగని వర్తకాన్ని ఆశిస్తున్నారు. 30. అల్లాహ్ వారికి వారి పూర్తి ప్రతిఫలం వొసగటానికి! ఆయన తన కృపతో వారికి మరింతగా ప్రసాదించటానికి!! నిశ్చయంగా ఆయన క్షమించేవాడు, విలువనిచ్చేవాడు. 31. మేము నీ వైపు వహీ (దివ్యవాణి) ద్వారా పంపిన ఈ గ్రంథం సత్యమైనది. దానికి పూర్వం నుండి ఉన్న గ్రంథాలను ధ్రువపరిచేది. నిశ్చయంగా అల్లాహ్ తన దాసుల గురించి పూర్తి సమాచారం తెలిసినవాడు, అంతా చూస్తున్నవాడు.

32. తరువాత మేము మా దాసులలో నుండి మేము ఎన్నుకున్న వారిని గ్రంథానికి వారసుల్ని చేశాము. అయితే వారిలో కొందరు తమ

ఆత్మలకు అన్యాయం చేసుకునేవారయితే, మరికొందరు మధ్యేమార్గం అవలంబించేవారు. వారిలో ఇంకొందరు దేవుడిచ్చిన సద్బుద్ధితో సత్కార్యాలలో ముందంజ వేసే వారున్నారు. ఇదే వాస్తవానికి మహదానుగ్రహం.
33. కలకాలం ఉండే స్వర్గవనాలలో వారు ప్రవేశిస్తారు. అక్కడ వారు స్వర్ణ కంకణాలతో, ముత్యాలతో సత్కరించబడతారు. అక్కడ వారు ధరించే వస్త్రాలు పట్టువస్త్రాలై ఉంటాయి. 34. వారిలా అంటారు : 'మా నుండి దుఃఖాన్ని దూరం చేసిన దైవానికి కృతజ్ఞతలు. నిశ్చయంగా మా ప్రభువు క్షమించేవాడు, సత్కారగుణం కలవాడు. 35. తన అనుగ్రహంతో ఆయన మమ్మల్ని కలకాలం కళకళలాడుతూ ఉండే నివాస గృహంలో దింపాడు. ఇందులో మాకెలాంటి ఇబ్బందిగానీ, అలసటగానీ ఉండదు.'

36. ఇకపోతే, తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారు; వారి కోసం నరకాగ్ని ఉంటుంది. వారిపై మరణ శాసనం అమలవటం గానీ, నరకాగ్ని యాతనను వారి నుండి ఏ కాస్తయినా సడలించటంగానీ జరగదు. మేము ప్రతి సత్యతిరస్కారినీ ఇలాగే దండిస్తాము. 37. వారు, 'మా ప్రభూ! మమ్మల్ని బయటికి తియ్యి. మేమింతకు మునుపు చేసే పనులకు భిన్నంగా మంచిపనులు చేస్తాము' అంటూ ఆక్రందన చేస్తారు. (సమాధానంగా ఇలా అనబడుతుంది), 'ఏమిటి, అర్థం చేసుకునే వాడికి అర్థం చేసుకునేందుకు మేము మీకు కావలసినంత వయసును ఇవ్వలేదా? మీ వద్దకు భయబోధ చేసేవాడు కూడా వచ్చాడు కదా! కనుక (శిక్షను) రుచి చూడండి. దుర్మార్గులకు సహాయపడే వాడెవడూ ఉండడు.'

38. నిశ్చయంగా అల్లాహ్ ఆకాశాలలో, భూమిలో ఉన్న రహస్యాలను ఎరిగినవాడు. ఆయన ఆంతర్యాల్లోని గుట్టును సయితం ఎరిగినవాడు.
39. ఆయనే మిమ్మల్ని భూమిలో వసింపజేశాడు. కాబట్టి ఎవడు నిరాకరి స్తాడో, అతని నిరాకరణ అతని మీదే పడుతుంది. తిరస్కారుల కొరకు వారి తిరస్కృతి, వారి ప్రభువు సమక్షంలో అప్రసన్నతకే కారణభూతం అవుతుంది. ఇంకా తిరస్కారుల కొరకు వారి తిరస్కార వైఖరి వారి నష్టాన్ని మాత్రమే పెంచుతుంది.

40. వారికి చెప్పు : 'అల్లాహ్‌ను వదలి మీరు మొరపెట్టుకునే మీ

భాగస్వాములను కాస్త చూడండి! వారు భువిలో సృష్టించినదేమిటో నాకు చూపిస్తారా! పోనీ, ఆకాశాలలోనయినా వారికేదన్నా భాగస్వామ్యం ఉందా? లేదా మేము వారికి ఏదన్నా గ్రంథం ఇచ్చి ఉన్నామా? దాన్నిగాని వారు ప్రమాణంగా సమర్పిస్తున్నారా?' పైగా ఈ దుర్మార్గులు ఒండొకరికి కేవలం మోసపూరితమయిన వాగ్దానాలు చేసుకుంటున్నారు. 41. నిశ్చయంగా అల్లాహ్‌యే భూమ్యాకాశాలను చలించకుండా నిలిపి ఉంచాడు. ఒకవేళ అవి గనక తమ స్థానాల నుండి తొలగిపోతే, ఆయన తప్ప వాటిని నిలిపి ఉంచేవాడు ఎవడూ లేడు. నిశ్చయంగా ఆయన సహనశీలుడు, క్షమాశీలుడు.

42. తమ వద్దకే గనక హెచ్చరిక చేసేవాడు వస్తే, తాము వేరితర సముదాయాలకన్నా ఉత్తమ రీతిలో సన్మార్గాన్ని అవలంబిస్తామని వీళ్ళు దేవునిపై గట్టి ప్రమాణాలు చేసి మరీ చెబుతుండేవారు. కాని ఆ హెచ్చరిక చేసేవాడు వారి వద్దకు వచ్చినపుడు, వారి విసుగు మరింత అధికమయింది. 43. లోకంలో తమంతటివారు లేరన్న అహంభావంతో, కుతంత్రాలతో వారు చెలరేగిపోయారు. వాస్తవానికి కుతంత్రాల పాపం కుతంత్రాలకు పాల్పడేవారి పైనే పడుతుంది. మరయితే వారు తమ పూర్వీకుల విషయంలో జరిగినదే తమకూ జరగాలని ఎదురు చూస్తున్నారా? నీవు దైవ సంప్రదాయంలో ఎలాంటి మార్పునూ కనుగొనలేవు. దైవ సంప్రదాయం (యధాస్థితి నుండి) తొలగటం కూడా నీవు కానలేవు. 44. ఏమిటి, వారు భువిలో సంచరించి, తమకు పూర్వం గతించిన వారి పర్యవసానం ఏమయిందో చూడలేదా? వాస్తవానికి బలపరాక్రమాల దృష్ట్యా వారు వీళ్ళను మించినవారే. ఆకాశాలలో గానీ, భూమిలోగానీ ఉన్నదేదీ అల్లాహ్‌ను ఓడించజాలదు. నిశ్చయంగా ఆయన జ్ఞానధనుడు, సర్వశక్తుడు.

45. అల్లాహ్‌యే గనక జనుల చేష్టలపై (అప్పటికప్పుడే) నిలదీయటం మొదలెడితే, భూమ్మీద ఉన్న ఏ ప్రాణినీ ఆయన వదలిపెట్టి ఉండేవాడు కాడు. అయితే ఆయన వారికి ఒక నిర్ణీత గడువు వరకు విడుపు ఇచ్చాడు. వారి గడువు ముగియగానే, అల్లాహ్ స్వయంగా తన దాసుల సంగతి చూసుకుంటాడు.

# 36. యాసీన్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. యా – సీన్. 2. వివేకవంతమైన ఖుర్‌ఆన్ సాక్షిగా! 3. నిశ్చయంగా
నీవు మేము పంపిన ప్రవక్తలలోని వాడవు. 4. రుజుమార్గాన ఉన్నావు.
5. ఇది శక్తిమంతుడు, కృపాశీలుడయిన దేవుని తరపున అవతరింప
జేయబడింది – 6 ఎవరి పూర్వీకులకు భయబోధ చేయబడలేదో ఆ జనులకు
నీవు భయబోధ చేయాలని. వారు అలసత్వానికి లోనై ఉన్నారు.

7. వారిలో అనేకులకు (శిక్ష తథ్యమనే) విషయం రూఢీ
అయిపోయింది. కనుక వారిక విశ్వసించరు. 8. మేము వారి మెడలలో
ఇనుప పట్టాలు వేశాము. అవి వారి గడ్డాల వరకూ బిగుసుకున్నాయి.
అందుకే వారి తలలు క్రిందికి వంగవు. 9. మేము వారి ముందు ఒక
అడ్డునూ, వారి వెనుక ఒక అడ్డునూ పెట్టాము. ఆ విధంగా మేము వారిని
కప్పివేశాము. అందుకే వారికి ఏమీ కానరాదు. 10. నీవు వారిని
సావధానపరచినా, సావధానపరచకపోయినా ఒక్కటే – వారు విశ్వసిం
చబోరు. 11. హితబోధను అనుసరిస్తూ, చూడకపోయినప్పటికీ కరుణామయు
డయిన దేవునికి భయపడే వ్యక్తిని మాత్రమే నీవు సావధానపరచగలవు.
అలాంటి వ్యక్తికి క్షమాభిక్షతో పాటు గౌరవ ఉపాధి లభిస్తుందనే శుభవార్తను
వినిపించు.

12. నిశ్చయంగా మేము మృతులను బ్రతికిస్తాము. వారు తమ
ముందుకు పంపుకున్న దానిని, తమ వెనుక వదలిన దానిని మేము
వ్రాసుకుంటున్నాము. మేము ప్రతి విషయాన్ని ఒక స్పష్టమయిన గ్రంథంలో
నమోదు చేసుకున్నాము.

13. ఉదాహరణకు నీవు వారికి, ప్రవక్త వచ్చినప్పటి ఒక పట్టణవాసుల
వృత్తాంతాన్ని వినిపించు. 14. మేము వారి వద్దకు ఇద్దరు ప్రవక్తలను పంపగా,
వారిద్దరిని కూడా వారు అసత్యవాదులుగా ముద్రవేసి త్రోసిపుచ్చారు. అప్పుడు

మేము మూడవవాని ద్వారా వారికి తోడ్పడ్డాము. వారిలా అన్నారు : 'మేము మీ వద్దకు సందేశహరులుగా పంపబడ్డాము.' 15. దానికి ఆ పట్టణ ప్రజలు, 'మీరూ మాలాంటి మానవమాత్రులే. కరుణామయుడు అవతరింపజేసినది ఏమీ లేదు. మీరు చెప్పేదంతా అబద్ధమే' అన్నారు. 16. వారు (ప్రవక్తలు) చెప్పారు : 'మేము మీ వద్దకు పంపబడినది వాస్తవమన్న సంగతి మా ప్రభువుకు తెలుసు. 17. సందేశాన్ని యథాతథంగా అందజేయటం వరకే మా బాధ్యత.' 18. దానికి ఆ జనులు ఇలా స్పందించారు : 'మేము మిమ్మల్ని దరిద్రులుగా భావిస్తున్నాము. మీరు గనక (ఈ ప్రచారాన్ని) మానుకోకపోతే, మేము మీపై రాళ్ళు రువ్వి చంపేస్తాము. మా తరఫున మీకు కఠినాతికఠిన మయిన బాధ కలుగుతుంది (జాగ్రత్త!).' 19. (ప్రవక్తలు) ఇలా అన్నారు : 'మీ దరిద్రమేదో అది మిమ్మల్నే చుట్టుకుని ఉంది. ఏమిటి, మీకు బోధపరచిన దానికే మీరింత విపరీతంగా వ్యవహరిస్తారా? అసలు విషయం ఏమిటంటే, మీరు హద్దుమీరిన జనంలా ఉన్నారు.'

20. (అంతలోనే) పట్టణం చివరి నుండి ఒక వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చి ఇలా అన్నాడు : 'నా జాతి ప్రజలారా! మీరు ప్రవక్తల మాట వినండి. 21. మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగని వారిని అనుసరించండి. వారు సన్మార్గంపై ఉన్నారు.'

◆ (23) 22. 'ఇక నా స్వవిషయానికి వస్తే, నాకంటూ ఒక ఉనికిని ప్రసాదించిన వానిని నేను ఎందుకు ఆరాధించకూడదు? మీరంతా మరల్చబడేది కూడా ఆయన వైపునకే. 23. అలాంటి నిజదైవాన్ని కాదని నేను ఇతరులను ఆరాధ్యులుగా చేసుకోవాలా? ఒకవేళ కరుణామయుడు (అయిన దేవుడు) నాకేదయినా బాధ కలిగించదలిస్తే, వీళ్ళ సిఫారసు నాకేవిధంగానూ పనికి రాదు. వారు నన్ను విడిపించనూ లేరు. 24. నిశ్చయంగా నేనప్పుడు స్పష్టమయిన మార్గభ్రష్టతకు లోనవుతాను. 25. నేను మీ ప్రభువును విశ్వసించాను. కాబట్టి మీరు కూడా నా మాట వినండి.' 26. సెలవీయబడింది : 'నీవు స్వర్గంలో ప్రవేశించు.' దానికతను, 'ఈ విషయం నా జాతి వారికి తెలిస్తే ఎంతబాగుండేది! 27. నా ప్రభువు

నన్ను క్షమించాడని, నన్ను ఆదరణీయుల సరసన చేర్చాడని (వారికి తెలిస్తే ఎంత బాగుండేది)!' అన్నాడు.

28. అతని తదనంతరం అతని జాతివారిపై మేము ఆకాశం నుండి సేనావాహినిని దింపలేదు. దింపాల్సిన అవసరమే మాకు లేదు. 29. ఒకే ఒక్క ప్రేలుడు! ఆ దెబ్బకే వారంతా ఆరిపోయారు. 30. దాసుల పరిస్థితి కడు శోచనీయం! తమ వద్దకు ఏ ప్రవక్త వచ్చినా ఎగతాళి చేయటం వారికి ఆనవాయితీ అయిపోయింది. 31. ఏమిటి, వారికి పూర్వం మేము ఎన్నో తరాల వారిని అంతమొందించటాన్ని వారు చూడలేదా? ఇక వారెన్నటికీ వారి వద్దకు తిరిగి రారు. 32. కాని ఎట్టకేలకు వారంతా సమీకరించబడి (లెక్కల నిమిత్తం) మా సమక్షంలో హాజరుపరచబడతారు.

33. మృతభూమి కూడా వారికొక సూచనగా ఉంది. దానిని మేము బ్రతికించాము. దాని నుండి మేము ఆహార ధాన్యాల్ని వెలికితీశాము. దాన్నుండి వారూ తింటున్నారు. 34. ఇంకా మేమందులో ఖర్జూర, ద్రాక్ష తోటల్ని (ఉత్పన్నం) చేశాము. ఇంకా మేమందులో ఊటలను ప్రవహింప జేశాము 35 – వారు దాని పండ్లు తినాలని! అదైతే వారు తమ స్వహస్తాలతో చేసినది కాదు. మరలాంటప్పుడు వారు కృతజ్ఞత చూపరా? 36. నేల నుండి ఉత్పన్నమయ్యే వస్తువులన్నింటిలోనూ, స్వయంగా వారిలోనూ, ఇంకా వారెరుగని ఎన్నో వాటిలోనూ (ఆడ–మగ) జంటలను సృష్టించిన ఆ దేవుడు పరమ పవిత్రుడు. 37. రాత్రి కూడా వారికి ఒక సూచనే. మేము దాన్నుండి పగటిని లాక్కోగానే అది గాఢాంధకారంలో మునిగిపోతుంది. 38. ఇక సూర్యుని విషయానికి వస్తే; అది తన కొరకు నిర్ధారించబడిన కక్ష్యలో సాగిపోతూ ఉంటుంది. ఇదంతా శక్తిమంతుడు, జ్ఞానసంపన్నుడు విధించిన నిబంధనావళి. 39. ఇంకా చంద్రుని కొరకు మేము మజిలీలను నిర్ధారించాము. కడకు అది తన గమనంలో (తరుగుతూ తరుగుతూ) ఖర్జూరపు పాత రెమ్మలా తయారవుతుంది. 40. చంద్రుణ్ణి అందుకోవటం సూర్యుని తరం కాదు. పగటిని దాటిపోవటం రాత్రికీ సాధ్యమయ్యే పని కాదు. ప్రతిదీ తమ తమ పరిధిలో (కక్ష్యలో) తేలియాడుతున్నాయి.

41. మేము వారి సంతతిని నిండు నౌకలో ఎక్కించటం కూడా వారికొక సూచనగా ఉన్నది. 42. ఇంకా మేము వారి కొరకు, అటువంటివే మరెన్నింటినో వారు ప్రయాణించేందుకు (స్వారీ అయ్యేందుకు) సృష్టించాము. 43. మేము గనక తలచుకుంటే వాటిని ముంచివేయగలం. అప్పుడు వారి గోడును వినిపించుకునేవారు గానీ, వారిని రక్షించేవారు గానీ ఎవరూ ఉండరు. 44. కాని మేము వారిపై దయదలచి, ఒక నిర్ణీత సమయం వరకూ వారికి లబ్ధిని చేకూరుస్తున్నాము.

45. 'మీరు ముమ్మందు ఎదుర్కోబోయే దానికి, వెనుక వదలిపెట్టిన దానికి భయపడండి – తద్వారా మీరు కరుణించబడే అవకాశం ఉంది' అని వారితో అన్నప్పుడు (వారు దానిని లక్ష్యపెట్టరు). 46. వారి ప్రభువు సూచనలలో నుండి ఏ సూచన వారివద్దకు వచ్చినా, వారు దాని పట్ల విముఖత చూపకుండా ఉండలేదు. 47. 'దేవుడు మీకు ప్రసాదించిన ఉపాధిలో నుండి ఖర్చుచేయండి' అని వారితో అన్నప్పుడు, సత్య తిరస్కారులు విశ్వాసులతో 'ఏమిటి, మేము వారికి తినిపించాలా? దేవుడు తలిస్తే ఆయన స్వయంగా వారికి తినిపించగలడు కదా! మీరు మాత్రం స్పష్టంగా అపమార్గాన ఉన్నారు' అంటారు.

48. 'మీరు చెబుతున్నదే నిజమైతే ఆ (ప్రళయ) వాగ్దానం ఎప్పుడు నెరవేరుతుంది?' అని వారు అడుగుతున్నారు. 49. వారు ఎదురుచూస్తున్నది ఒక్కగానొక్క ప్రేలుడు కొరకే. వారు వివాదంలో పడి ఉండగానే అది వారిని అమాంతం కబళిస్తుంది. 50. అప్పుడు వారు వీలునామా చేయటంగానీ, తమ వారి వైపునకు మరలటం గానీ చేయలేరు. 51. శంఖం ఊదబడగానే వారంతా సమాధుల నుండి లేచి తమ ప్రభువు వైపునకు శీఘ్రంగా వస్తారు. 52. 'అయ్యో, మా దౌర్భాగ్యం! మా సమాధి నుండి మమ్మల్ని ఎవరు లేపారు?' అని వారంటారు – ఆ కరుణామయుడు వాగ్దానం చేసినదే ఇది. ప్రవక్తలు చెప్పింది నిజం. 53. అది ఒకే ఒక్క గర్జన మాత్రమే. తరువాత వారంతా కలసి మా ఎదుట హాజరవుతారు.

54. కాబట్టి ఈ రోజు ఎవరికీ ఎలాంటి అన్యాయం జరుగదు. మీరు చేసుకున్న దాని ప్రతిఫలం తప్ప వేరొకటి మీకు దొరకదు.
55. నిశ్చయంగా స్వర్గవాసులు ఈనాడు తమ తమ వ్యాపకాల్లో నిమగ్నులై సంతోషిస్తూ ఉంటారు. 56. వారూ, వారి భార్యలు నీడలలో పీఠాలపై దిండ్లకు ఆనుకుని – దర్జాగా – ఆసీనులై ఉంటారు. 57. వారి కోసం అక్కడ (రకరకాల) పండ్లు ఉంటాయి. వారు అడిగినదల్లా వారి ముందు సమర్పించబడుతుంది. 58. కరుణామయుడయిన ప్రభువు తరఫున వారికి 'సలామ్' తెలుపబడుతుంది.

59. 'అపరాధులారా! ఈ రోజు మీరు (సజ్జనుల నుండి) వేరైపోండి'
60. 'ఓ ఆదం సంతతి వారలారా! మీరు షైతాన్‌ను పూజించరాదని, నిశ్చయంగా వాడు మీ బద్ధ విరోధి అని నేను మీకు తాకీదు చేయలేదా?
61. మీరు నన్నే ఆరాధించండి. ఇదే రుజుమార్గం (అని అనలేదా?)
62. వాడు మీలోని ఒక పెద్ద వర్గాన్ని పెడదారి పట్టించాడు. అయినా మీరు అర్థం చేసుకోరా? 63. మీకు వాగ్దానం చేయబడుతూ ఉండిన నరకం ఇదే. 64. మీ అవిశ్వాస వైఖరికి బదులుగా ఈ రోజు ఇందులో ప్రవేశించండి.'
65. ఈ రోజు మేము వారి నోళ్లకు సీలు వేస్తాము. వారి చేతులు మాతో మాట్లాడతాయి. వారు సముపార్జించిన దాని గురించి వారి కాళ్ళు సాక్ష్యమిస్తాయి. 66. మేము గనక కోరుకుంటే వారి కళ్లను చెరిపివేసేవారం. అప్పుడు వారు దారివైపు పరుగెత్తి దేవులాడేవారు. కాని వారికి అది ఎక్కడ కనిపిస్తుంది? 67. మేమే గనక తలచుకుంటే వారున్నచోటే వారి రూపురేఖలను మార్చివేసేవారం. దాంతో వారు ముందుకు గానీ, వెనక్కి గానీ పోలేక సతమతం అయ్యేవారు. 68. మేము ఎవరి వయస్సును పెంచుతామో, అతనిని అతని శైశవంలోనికి – వెనక్కి – మళ్ళిస్తాము. అయినప్పటికీ వారు (విషయాన్ని గ్రహించరా?)

69. మేమతనికి కవిత్వం నేర్పలేదు. అది అతనికి శోభించదు కూడా. ఇదైతే ఒక జ్ఞాపిక (హితోపదేశం); స్పష్టమయిన ఖుర్‌ఆన్ మాత్రమే.

70. బ్రతికి ఉన్న ప్రతి వ్యక్తికి అతను సావధానపరచాలని! సత్యతిరస్కారులకు వ్యతిరేకంగా సాక్ష్యం రూఢీ కావాలని!

71. ఏమిటి, మేము మా స్వహస్తాలతో చేసిన వాటిలో, వారి కొరకు పశువులు సృష్టించబడి ఉండటాన్ని వారు చూడటం లేదా? వాటికి వారు యజమానులు కూడాను. 72. మేము వాటిని వారి స్వాధీనంలో ఉంచాము. వాటిలో కొన్ని, వారికి వాహనాలుగా పనికివస్తున్నాయి. మరి కొన్నింటిని (మాంసాన్ని) వారు తింటున్నారు. 73. వాటిలో వారికి లాభాలూ ఉన్నాయి, త్రాగే పదార్థం (పాలు) కూడాను. మరయితే వారు కృతజ్ఞతలు తెలుపుకోరా? 74. వారు అల్లాహ్‌ను కాదని ఇతర దైవాలను చేసుకున్నారు – బహుశా తమకు సహాయం చేయబడుతుందేమోనన్న ఆశతో. 75. కాని వారికి సహాయపడే సామర్థ్యం వా(రి)టికి లేదు. వారు వారి యెడల (శత్రు) సైనికుల్లా హాజరుపరచబడతారు. 76. కనుక (ఓ ప్రవక్తా!) వారి మాటలు నిన్ను దుఃఖానికి లోను చేయరాదు. వారు దాచేదీ, వ్యక్తపరిచేది–అంతా మాకు తెలుసు.

77. ఏమిటి, మేము మనిషిని ఒక (వీర్య) బిందువుతో పుట్టించటాన్ని అతను గమనించటం లేదా? తరువాత అతను పేచీకి పెదబాబుగా తయారయ్యాడు. 78. అతను మాకే పోలికలు ఆపాదిస్తున్నాడు. అతను తన పుట్టుకనే మరచిపోయాడు. 'ఎముకలు కృశించిపోయిన మీదట వాటిని బ్రతికించేదెవరు?' అని అతనంటున్నాడు. 79. 'వాటిని తొలిసారి పుట్టించిన వాడే మళ్లీ బ్రతికిస్తాడు. సర్వవిధాల సృష్టి పరిజ్ఞానం ఆయనకుంది' అని వారికి చెప్పు. 80. ఆయనే మీ కోసం పచ్చని చెట్టు నుండి అగ్నిని సృష్టించాడు. దాంతో మీరు నిప్పును (మంటను) మండిస్తున్నారు. 81. ఏమిటి, భూమ్యా కాశాలను సృష్టించినవాడు, వీరిలాంటివారిని (తిరిగి) సృష్టించలేడా? తప్పక సృష్టిస్తాడు. ఆయనే సిసలయిన సృష్టికర్త, మహాజ్ఞాని. 82. ఆయన వ్యవహార మెటువంటిదంటే, ఆయన దేని గురించి అయినా సంకల్పించుకుని 'అయిపో' అనంటాడు. అది అయిపోతుంది. 83. కనుక ఎవరి చేతిలో సర్వసత్తాధికారం ఉందో ఆయన పరమ పవిత్రుడు. మీరంతా ఆయన వైపునకే మరల్చబడతారు.

# 37. అస్ సాప్ఫాత్ (వరుసలు, శ్రేణులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. వరుసతీరి నిలబడేవారి (దైవదూతల) సాక్షిగా! 2. తీవ్రంగా
మందలించే వారి సాక్షిగా! 3. ఉపదేశాన్ని వినిపించేవారి సాక్షిగా!
4. నిశ్చయంగా మీ ఆరాధ్య దైవం ఒక్కడే – 5 – భూమ్యాకాశాల ప్రభువు,
వాటి మధ్యనున్న సమస్తానికి, తూర్పులన్నింటికీ అధిపతి. 6. మేము క్రింది
ఆకాశాన్ని నక్షత్రాల (అందాల)తో ముస్తాబు చేశాము. 7. పొగరుబోతు
అయిన ప్రతి షైతాను బారి నుండి దీనిని సురక్షితంగా ఉంచాము.

8. వారు ఊర్ధ్వలోకాలలో ఉన్న దైవదూతల మాటలు వినలేరు.
వారు అన్ని వైపుల నుండీ రువ్వబడతారు – 9 తరిమివేయటానికి. వారికి
స్థిరమయిన శిక్ష కలదు. 10. ఒకవేళ ఏ షైతానయినా ఏదన్నా మాటను
మోసుకుపోతుంటే మండే అగ్ని జ్వాల వాణ్ణి వెంటాడుతుంది.

11. వారిని అడుగు : 'వారిని సృష్టించటం కష్టసాధ్యమా? లేక
మేము సృష్టించిన ఇతర వస్తువులనా? మేము వారిని అతుక్కుపోయే జిగట
మన్నుతో సృష్టించాము. 12. అది కాదు, నీవు (వారి తిరస్కార పోకడపై)
ఆశ్చర్యపోతుంటే, వారేమో వేళాకోళం చేస్తున్నారు. 13. వారిని
బోధపరచినపుడు, వారు అర్థం చేసుకోరు. 14. వారేదైనా సూచనను
చూసినపుడు దానిని నవ్వులాటగా తీసుకుంటారు. 15. వారిలా అంటారు:
'ఇది పచ్చి మాయాజాలం మాత్రమే. 16. ఏమిటి, మేము మరణించి మట్టిగా,
ఎముకలుగా మారాక కూడా మేము మళ్లీ లేపబడతామా? 17. పూర్వీకులైన
మా తాతముత్తాతలు కూడానా?' 18. వారితో అను: 'అవును. మీరు పరాభవా
నికి కూడా లోనవుతారు.'

19. అదొక గద్దింపు మాత్రమే. మరి వారు (బిక్కవోయి) దిక్కులు
చూడసాగుతారు. 20. వారిలా అంటారు : 'అయ్యో! మా దౌర్భాగ్యం! ఇదేకదా
ప్రతిఫల దినం!' 21. (వారితో అనబడుతుంది) 'ఇదే ఆ తీర్పుదినం. దీనిని

మీరు అసత్యమంటూ కొట్టివేసేవారు.' 23. (ఆదేశించబడుతుంది) 'దుర్మార్గులందరినీ ప్రోగుచేయండి. వారితో జత కట్టినవారినీ, అల్లాహ్‌ను వదలి వారు ఆరాధించేవారిని కూడా (సమీకరించండి). తరువాత వారందరినీ నరకాగ్ని దారి చూపించండి. 24. వాళ్ళను ఆపండి. వాళ్ళను ప్రశ్నించవలసి ఉంది. 25. 'ఏమయింది మీకు? మీరు పరస్పరం సహాయం చేసుకోరేమిటి?' 26. ఆ రోజు మాత్రం వారు ఆత్మ సమర్పణ చేసుకుని (బుద్ధిమంతుల్లా నిలబడి) ఉంటారు.

27. వారు ఒండొకరివైపు తిరిగి ప్రశ్నించుకుంటారు – 28 'మీరు మా వద్దకు కుడి వైపు నుంచి వచ్చేవారు కదా! (మరి ఇప్పుడేమంటారు?)' అని అడుగుతారు. 29. సమాధానంగా వారిలా అంటారు : 'అసలు మీరే విశ్వాసం పట్ల సుముఖంగా లేరు. 30. మీపై మా అధికారం ఏమీ నడిచేది కాదు. ఎందుకంటే మీరు తలబిరుసులుగా వ్యవహరించేవారు. 31. కాబట్టి ఇప్పుడు మన ప్రభువు వాక్కు మనందరిపై పూర్తయ్యింది. మనమందరం (శిక్షను) చవిచూడవలసిందే. 32. మేము మిమ్మల్ని దారి తప్పించాము. మేము స్వయంగా దారి తప్పి ఉండేవారము.' 33. ఆ విధంగా వారంతా ఆ రోజు శిక్షలో భాగస్వాములవుతారు.

34. మేము నేరస్తుల పట్ల ఇలాగే వ్యవహరిస్తాము. 35. వారెలాంటి వారంటే; అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేదని వారితో అన్నప్పుడు, వారు గర్విష్టుల్లా ప్రవర్తించేవారు. 36. 'ఏమిటి, మతిభ్రమించిన ఒక కవి చెప్పినంతమాత్రాన మేము మా ఆరాధ్య దైవాలను వదులుకోవాలా?' అని అనేవారు. 37. యదార్థానికి అతను సత్యాన్ని తీసుకువచ్చాడు. (తనకు పూర్వం వచ్చిన) దైవప్రవక్తలందరినీ ధ్రువపరుస్తున్నాడు. 38. నిశ్చయంగా మీరు వ్యధాభరితమయిన శిక్షను చవిచూడవలసి ఉంటుంది. 39. మీరు చేసుకున్న దాని ప్రతిఫలమే మీకు ఇవ్వబడుతోంది.

40. అయితే దేవుడు ఎన్నుకున్న దాసులు మాత్రం (శిక్ష నుండి సురక్షితంగా ఉంటారు). 41. వారి కోసం వారికి తెలిసిన ఉపాధి ఉంటుంది. 42. పండ్లు ఫలాలు! అవి కూడా ఎంతో గౌరవప్రదంగా సమర్పించబడతాయి.

43. భోగభాగ్యాలతో నిండిన స్వర్గవనాలలో! 44. వారు సుతిమెత్తని ఆసనాలపై – దర్జాగా – ఎదురెదురుగా కూర్చుని ఉంటారు.

45. ప్రవహించే మధువులో నుండి నింపబడిన మధుపాత్ర వారి మధ్య త్రిప్పబడుతూ ఉంటుంది. 46. అది అత్యంత స్వచ్ఛంగా, సేవించే వారికి కమ్మగా ఉంటుంది. 47. దానివల్ల హాని కలగటంగానీ, బుద్ధి తికమక పడటంగానీ జరగదు. 48. వారి దగ్గర (బిడియంతో) చూపులు క్రిందికి వాలి ఉండే, పెద్ద పెద్ద కన్నులు గల కోమలాంగులు ఉంటారు–49 భద్రపరచ బడిన గ్రుడ్ల మాదిరిగా!

50. వారు ఒండొకరి వైపు తిరిగి కుశల ప్రశ్నలు వేసుకుంటారు. 51. వారిలో ఒకడు ఇలా అంటాడు : '(ఇహలోకంలో) నాకు తెలిసిన ఒక వ్యక్తి ఉండేవాడు. 52. 'నువ్వు కూడా ప్రళయాన్ని నిజమని ధ్రువీకరిస్తున్నావా? 53. మనం మరణించి, మట్టిగా, ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా మనకు ప్రతిఫలం లభిస్తుందా?' అని అతను అనేవాడు. 54. 'ఏమిటి, మీరతన్ని చూడదలుస్తున్నారా?' అంటాడు. 55. అతను తొంగిచూస్తే, అతను నరకం మధ్యలో కనిపిస్తాడు. 56. అతను (స్వర్గవాసి) ఇలా అంటాడు: 'అల్లాహ్ తోడు! నువ్వు నన్ను కూడా సర్వ నాశనం చేసి ఉండేవాడివే. 57. నా ప్రభువు అనుగ్రహమే గనక లేకపోయినట్లయితే, నేను కూడా శిక్షార్హులుగా హాజరుపరచబడిన వారిలో ఒకడుగా ఉండేవాణ్ణి.' 58. (ఆ స్వర్గవాసి ఇంకా ఇలా అంటాడు) 'మనకిక చావు లేదా!? 59. ఆ మొదటి చావే తప్ప! మనకిక శిక్ష కూడా లేదు కదూ! 60. నిశ్చయంగా ఇదే గొప్ప విజయం!' 61. ఇటువంటి విజయం కోసమే ఆచరించేవారు ఆచరించాలి.

62. ఈ ఆతిథ్యం బాగుందా? లేక జెముడు వృక్షమా? 63. మేము దానిని దుర్మార్గుల కొరకు పరీక్షగా చేశాము. 64. అది నరకం అట్టడుగు భాగంలో మొలిచే వృక్షం. 65. దాని పండ్ల గుత్తులు షైతాన్ తలల మాదిరిగా ఉంటాయి. 66. వారు దాన్నుండే తింటారు. వాటితోనే తమ కడుపులు నింపుకుంటారు. 67. దానికి తోడు వారికి మరిగే నీరు త్రాగటానికి ఇవ్వబడుతుంది. 68. తరువాత వారంతా మండే నరకాగ్ని వైపునకే

మరల్చబడతారు. 69. వారు తమ తాతముత్తాతలను మార్గభ్రష్టత్వంలో పడి ఉండటం చూశారు. 70. తరువాత వారు కూడా తమ పూర్వీకుల అడుగుజాడలలోనే పరుగులు తీశారు. 71. వారికి పూర్వం కూడా ఎందరో అపమార్గం పట్టారు. 72. మేము వారిలో కూడా భయబోధ చేసే వారిని పంపి ఉన్నాము. 73. మరయితే భయబోధ చేయబడిన వారి పర్యవసానం ఏమయిందో చూడు! 74. అయితే అల్లాహ్ ఎన్నుకున్న దాసులు మాత్రమే ఈ దుష్పరిణామం నుండి సురక్షితంగా ఉండగలిగారు.

75. మమ్మల్ని నూహ్ పిలిచాడు. దానికి మేము ఎంత అమోఘంగా స్పందించామో! 76. మేము అతనిని, అతని జనులను ఘోర కలి నుండి కాపాడాము. 77. మేము అతని సంతతిని మాత్రమే మిగిల్చి ఉంచాము. 78. భావితరాల వారిలో అతని విధానాన్ని అవలంబించే ఒక వర్గాన్ని ఉంచాము. 79. సమస్త లోకవాసులలో నూహ్పై శాంతి కలుగుగాక! 80. సదాచార సంపన్నులకు మేము ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తాము. 81. నిశ్చయంగా అతను విశ్వసించిన మా దాసులలో ఒకడు. 82. తరువాత మేము మిగిలిన వారందరినీ ముంచివేశాము.

83. అతని పంథాలో ముందుకు సాగిన వారిలో ఇబ్రాహీమ్ కూడా ఒకడు. 84. అతను తన ప్రభువు సన్నిధికి నిష్కల్మషమయిన మనసుతో ఏతెంచినపుడు, 85. అతను తన తండ్రితో, తన జాతి వారితో ఇలా అన్నాడు: 'మీరు దేనిని పూజిస్తున్నారు? 86. ఏమిటి, మీరు అల్లాహ్ను కాదని మనో కల్పిత దైవాలను కోరుకుంటున్నారా? 87. ఇంతకీ లోకేశ్వరుని గురించి మీ అభిప్రాయం ఏమిటి?'

88. తరువాత ఇబ్రాహీమ్ నక్షత్రాలపై దృష్టిని సారించాడు. 89. తరువాత 'నాకు జబ్బు చేసింది' అన్నాడు. 90. అప్పుడు అతనివారు అతనిని విడిచి వెళ్ళిపోయారు. 91. అప్పుడతను వారి విగ్రహాల మధ్యలో వెళ్ళి అడిగాడు : 'మీరు (అన్నం) తినరా?' 92. అసలు మీకేమయింది? మీరు మాట్లాడరే!?' 93. తరువాత వాటిని గట్టిగా కొట్టాడు. 94. వారు (విగ్రహారాధకులు) అతని దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చారు.

95. వారిని ఇబ్రాహీమ్ అడిగాడు : 'ఏమిటి, మీరు మీ స్వహస్తాలతో చెక్కిన వాటిని పూజిస్తారా?' 96. వాస్తవానికి మిమ్మల్నీ, మీరు నిర్మించిన వాటిని పుట్టించినవాడు అల్లాహ్‌యే కదా!' 97. వారిలా అన్నారు : 'ఇతని కోసం ఓ చితిని తయారుచేయండి. దరిమిలా ఇతనిని మండే అగ్నికి ఆహుతి చేయండి.' 98. అదీ సంగతి ! వారు అతనికి వ్యతిరేకంగా ఓ ఎత్తుగడ వేయాలనుకున్నారు. అయితే మేము వారందరినీ చిత్తు చేశాము. 99. ఇబ్రాహీమ్ ఇలా అన్నాడు : 'నేను నా ప్రభువు వైపునకే పోతున్నాను. ఆయనే నాకు మార్గదర్శకత్వం వహిస్తాడు. 100. నా ప్రభూ! నాకు గుణనిధి అయిన కుమారుణ్ణి ప్రసాదించు.' 101. అందువల్ల మేమతనికి, సహనశీలుడైన అబ్బాయి కలుగుతాడని శుభవార్త వినిపించాము.

102. ఆ అబ్బాయి అతనికి చేదోడు వాదోడుగా ఉండే ప్రాయానికి చేరుకున్నప్పుడు, అతను (ఇబ్రాహీమ్) ఇలా అన్నాడు : 'ఓ ముద్దులకన్నా! నిన్ను జిబహ్ చేస్తున్నట్లు (దైవమార్గంలో అర్పిస్తున్నట్లు) కలగన్నానురా. మరి నీ ఉద్దేశమేమిటో ఆలోచించుకో.' దానికి ఆ అబ్బాయి, 'నాన్నా! మీకు ఆదేశించబడిన దానిని మీరు నిస్సంకోచంగా అమలుపరచండి. ఇన్‌షా అల్లాహ్ మీరు నన్ను సహనశీలిగా కనుగొంటారు' అన్నాడు. 103. వారిరువురూ దైవాజ్ఞను శిరసావహించినపుడు, ఇబ్రాహీమ్ తన పుత్రరత్నాన్ని నుదుటిపై (బోర్లా) పడుకోబెట్టాడు. 104. అప్పుడు మేమతన్ని పిలిచాము – 'ఓ ఇబ్రాహీమ్! 105. నీవు నీ కలను నిజం చేసి చూపావు.' నిశ్చయంగా మేము సదమరవర్తనులకు ఇలాగే అత్యుత్తమ ప్రతిఫలం ఇస్తుంటాము. 106. నిశ్చయంగా ఇదొక స్పష్టమయిన (కఠిన) పరీక్ష! 107. మేము ఓ మహాబలికి బదులుగా ఆ బాలుణ్ణి విడిపించుకున్నాము. 108. భావి తరాల వారిలో మేము అతని విధానాన్ని అనుసరించే ఒక వర్గాన్ని వదిలాము. 109. ఇబ్రాహీమ్‌కు శాంతి కలుగుగాక! 110. త్యాగశీలురకు మేము ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తూ ఉంటాము. 111. నిశ్చయంగా అతను విశ్వాసులైన మా దాసులలో ఒకడు. 112. మేమతనికి ఇస్‌హాఖ్ కలుగుతాడని శుభవార్తను వినిపించాము. అతనొక

ప్రవక్త – సజ్జనుల కోవకు చెందినవాడు. 113. మేము అతనికి, ఇస్హాఖ్‌కు శుభాలను వొసగాము. వారిరువురి సంతతిలో సజ్జనులూ ఉన్నారు. తమ ఆత్మలకు తీరని అన్యాయం చేసుకున్న వారు కూడా ఉన్నారు.

114. వాస్తవానికి మేము మూసా, హారూనులను కటాక్షించాము. 115. వారినీ, వారి జాతివారినీ ఘోర విపత్తు నుండి విముక్తిని ప్రసాదించాము. 116. మేము వారికి అండగా నిలవగా, వారే ప్రాబల్యం పొందే వారయ్యారు. 117. మేము వారిరువురికీ సవివరమయిన గ్రంథం వొసగాము. 118. ఇంకా మేము వారిద్దరికీ రుజుమార్గం వైపు దర్శకత్వం వహించాము. 119. భావితరాల వారిలో వారి పద్ధతిని అవలంబించే ఒక వర్గాన్ని మేము వదిలాము. 120. మూసా, హారూనులపై శాంతి కలుగుగాక! 121. మేము సత్క్రియలాచరించే మహనీయులకు ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తూ ఉంటాము. 122. నిశ్చయంగా వారిరువురూ విశ్వసించిన మా దాసులలోని వారు.

123. ఇల్యాస్ కూడా ప్రవక్తలలోనివాడే. 124. అతను తన జాతి వారితో ఇలా అన్నాడు : 'మీరు (దైవానికి) భయపడరా? 125. మీరు 'బాల్' (విగ్రహము)ను మొరపెట్టుకుంటూ, అత్యుత్తమ సృష్టికర్తను వదిలేస్తున్నారేమిటి? 126. మీ ప్రభువూ, మీ పూర్వీకుల ప్రభువు అయిన అల్లాహ్‌ను విడిచిపెడతారేమిటి?' 127. కాని వారు అతన్ని అసత్యవాదిగా ముద్రవేసి, అతన్ని త్రోసిపుచ్చారు. అందుకే (అపరాధులుగా) హాజరుపరచబడే వారిలో వారూ ఉన్నారు. 128. అయితే దేవుడు ఎన్నుకున్న ప్రత్యేక దాసులు మాత్రం (ఈ నిలదీత నుండి) మినహాయించబడతారు. 129. భావి తరాల వారిలో అతని విధానాన్ని అనుసరించే ఒక వర్గాన్ని మేము వదిలాము. 130. ఇల్యాస్‌కు శాంతి కలుగుగాక! 131. సద్వర్తనులకు మేము ఇలాగే మంచి ప్రతిఫలం ఇస్తూ ఉంటాము. 132. నిశ్చయంగా అతను విశ్వసించిన మా దాసులలోనివాడు.

133. నిశ్చయంగా లూత్ కూడా ప్రవక్తలలోనివాడే. 134. మేము అతనినీ, అతని పరివార జనులనూ కాపాడాము. 135. కాని వెనుక ఉండిపోయిన ఆ వృద్ధురాలిని మాత్రం కాపాడలేదు. 136. తరువాత మేము

ఇతరులందరినీ అంతమొందించాము. 137. మీరు ప్రొద్దునపూట కూడా ఆ జనావాసాల మీదుగా సాగిపోతున్నారు. 138. రాత్రిపూట కూడా. అయినా మీరు అర్థం చేసుకోరేమిటి?

139. నిశ్చయంగా యూనుస్ కూడా మా ప్రవక్తలలోనివాడే. 140. అతను (తన జాతివారిపై కినుక వహించి) ప్రయాణీకులతో కిక్కిరిసిపోయిన నావ వైపునకు పరుగెత్తినపుడు, 141. వారు చీటీలు వేసి అదృష్టాన్ని పరీక్షించుకోగా, అతనే పరాజితునిగా తేలాడు. 142. తరువాత ఒక చేప అతనిని మ్రింగింది. ఆ సమయంలో అతను తనను తానే నిందించుకోసాగాడు. 143. అతనే గనక దేవుని పవిత్రతను కొనియాడకపోతే, 144. జనులు తిరిగి లేపబడే దినం వరకూ చేప కడుపులోనే ఉండిపోయేవాడు. 145. తరువాత మేమతనిని, నీరసించిన స్థితిలో (సముద్రం) ఒడ్డున పడవేశాము. 146. అతనిపై (నీడను కల్పించేలా) ఒక తీగను మొలిపించాము. 147. మేమతనిని ఒక లక్ష లేదా అంతకన్నా ఎక్కువ జనాభాగల ప్రజలవైపు (ప్రవక్తగా) పంపాము. 148. తరువాత వారు విశ్వసించారు. అందువల్ల మేము వారికి ఒక నిర్ణీత కాలం వరకు లబ్ది పొందే అవకాశం ఇచ్చాము.

149. వారిని అడుగు; నీ ప్రభువుకైతే కూతుళ్ళూను, వారి కోసమేమో కుమారులా? 150. ఏమిటి, మేము దైవదూతలను స్త్రీలుగా పుట్టించామా? దానికి వారుగాని ప్రత్యక్ష సాక్షులుగా ఉన్నారా? 151. వినండి! వారు కేవలం తమ మనోకల్పన ఆధారంగా ఇలా మాట్లాడుతున్నారు – 152 'అల్లాహ్‌కు సంతానం ఉంది' అని. నిశ్చయంగా వారిది అబద్ధ ప్రేలాపన. 153. ఏమిటి, ఆయన కొడుకులకు బదులుగా కూతుళ్ళను ఇష్టపడ్డాడా? 154. అసలేమైపోయింది మీకు? మీరు ఎందుకిలా తీర్మానించుకుంటున్నారు? 155. మీరు ఆ మాత్రం మీ విజ్ఞతను ఉపయోగించరా? 156. మీ దగ్గర స్పష్టమయిన ప్రమాణం ఏదన్నా ఉందా? 157. మీరు చెప్పేదే నిజమయితే, మీ గ్రంథాన్ని తీసుకురండి!?

158. చివరకు వారు అల్లాహ్‌కు – జిన్నులకు మధ్య కూడా బంధుత్వ

సంబంధాన్ని ఆపాదించారు. వారు పట్టి తేబడతారన్న విషయం స్వయంగా జిన్నులకూ తెలుసు. 159. వారు కల్పించే విషయాలకు అల్లాహ్ అతీతుడు, పరిశుద్ధుడు. 160. అల్లాహ్ ఎంపిక చేసుకున్న దాసులు మాత్రమే ఇలాంటి అభూత కల్పనలకు దూరంగా ఉంటారు. 161. మీరుగానీ, మీరు పూజించే (మిథ్యా) దైవాలుగానీ, 162. నిజ దైవం నుండి ఎవరినీ మళ్ళించలేరు – 163. నరకాగ్నికి ఆహుతి కానున్నవానిని తప్ప! 164. '(దైవదూతలము అయిన) మాలో ప్రతి ఒక్కరికీ ఒక నిర్ణీత స్థానం ఉంది. 165. మేము దైవసేవలో వరుసతీరి నిలబడి ఉంటాము. 166. మేము ఆయన పవిత్రతను కొనియాడటంలో నిమగ్నులమై ఉంటాము.'

167. వారు (అవిశ్వాసులు) ఇలా చెప్పేవారు : 168. 'మా వద్దనే గనక పూర్వీకుల ఉపదేశం ఉండి ఉంటే, 169. మేము కూడా దేవుడు ఎన్నుకున్న దాసుల సరసన ఉండేవారం.' 170. కాని వారు దానిని (ఖుర్ఆన్‌ను) తిరస్కరించారు. సరే! త్వరలోనే వారు తెలుసుకుంటారు. 171. మేము పంపిన మా ప్రత్యేక దాసులకు, ప్రవక్తలకు మేమిచ్చిన మాట ప్రకారం నిర్ణయం ముందే జరిగిపోయింది – 172. నిశ్చయంగా వారే ప్రాబల్యం వహిస్తారు. 173. మా సేనలే విజయం సాధిస్తాయి. 174. కనుక (ఓ ప్రవక్తా!) కొన్నాళ్ళపాటు వారిని ఉపేక్షించు. 175. వాళ్ళను చూస్తూ ఉండు. త్వరలోనే వాళ్ళు కూడా (తమ దుష్పరిణామాన్ని) చూసుకుంటారు.

176. ఏమిటి, వారు మా శిక్ష కోసం తొందరపెడుతున్నారా? 177. అది వారి ఆవరణలోకి వచ్చి వాలినప్పుడు, దాని గురించి ముందస్తు హెచ్చరిక చేయబడినవారి ప్రాతఃకాలం కడు దుర్భరంగా ఉంటుంది. 178. కనుక (ఓ ప్రవక్తా!) కొంతకాలం పాటు వాళ్ళ నుండి నీ దృష్టిని మరల్చుకో. 179. కాకపోతే వాళ్ళను (ఓ కంట) కనిపెట్టుకుని ఉండు. త్వరలోనే వాళ్ళు స్వయంగా (తమ దుర్గతిని) చూసుకుంటారు. 180. పవిత్రుడు నీ ప్రభువు! గౌరవానికి అధిపతి! వారు కల్పించే కాల్పనిక విషయాలకు అతీతుడు, పరిశుద్ధుడు! 181. దైవ సందేశహరులపై శాంతి వర్షించుగాక! 182. సకల లోకాల ప్రభువగు అల్లాహ్‌కే ప్రశంసలు, పొగడ్తలు శోభిస్తాయి.

# 38. సాద్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. సాద్ – ఉపదేశంతో నిండి ఉన్న ఖుర్‌ఆన్ సాక్షిగా! 2. తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారు అహంభావంతో హఠం చేస్తున్నారు. 3. వీరికి పూర్వం మేము ఎన్నో తరాలను అంతమొందించి ఉన్నాము. (అంతిమ ఘడియల్లో) వారు హాహాకారాలు చేయసాగారు. కాని అది రక్షించబడే సమయం కాదయ్యే!

4. తమ వద్దకు తమలో నుండే సావధానపరిచేవాడొకడు రావటం పట్ల వారు ఆశ్చర్యచకితులయ్యారు. అందుకే సత్య తిరస్కారులు అన్నారు : 'ఇతనొక మాయలమారి. అబద్ధాగ్రేసరుడు. 5. ఏమిటి, ఇతను ఇంతమంది దేవుళ్ళ స్థానంలో ఒకే దేవుణ్ణి చేసుకున్నాడా? ఇది మరీ విచిత్రంగా ఉందే!' 6. వారి సర్దారులు చివాలున లేచి, 'పదండి, మీరు మీ దైవాల (ఆరాధన) పై స్థిరంగా ఉండండి. ఇతను చెప్పేదానిలో ఏదో కిటుకు ఉంది. 7. ఇలాంటి విషయాన్ని మేము వెనుకటి మత ధర్మంలో ఎప్పుడూ వినలేదు. ఇదొక కట్టుకథ తప్ప మరొకటి కాదు. 8. ఏమిటి, మనందరిలో ఇతనొక్కడిపైనే దైవోపదేశం అవతరించిందా?' అన్నారు. మొత్తానికి వారు నా ఉపదేశం గురించి సంశయంలో పడిపోయారు. అసలు విషయం ఏమిటంటే, వారింతవరకు నా శిక్ష ఎలా ఉంటుందో చవిచూడలేదు.

9. ఏమిటి, వారివద్ద శక్తిశాలి, అనుగ్రహశాలి అయిన నీ ప్రభువు కారుణ్య నిధులుగాని ఉన్నాయా? 10. పోనీ, భూమ్యాకాశాలపై, వాటి మధ్యన ఉన్న వస్తువులన్నింటిపై గల రాజ్యాధిపత్యం వారికి సంక్రమించిందా? అలాగైతే వారు నిచ్చెనవేసి పైకెక్కమను. 11. ఇక్కడ ఓటమిపొందే సైనిక కూటములలో ఈ సైనిక దళం కూడా ఒకటై ఉంటుంది. 12. వీరికి పూర్వం నూహ్ జాతివారు, ఆద్ వారు, మేకులుగల ఫిరౌన్ వారు కూడా సత్యాన్ని త్రోసిపుచ్చారు. 13. సమూద్‌వారు, లూత్ జాతివారు, వనవాసులు కూడా త్రోసిపుచ్చినవారే – వారంతా పెద్ద పెద్ద కూటములుగా వర్థిల్లినవారే. 14. వారంతా ప్రవక్తలను అసత్యవాదులుగా ముద్రవేసి, తిరస్కరించినవారే.

అందువల్ల వారిపై నా శిక్ష విరుచుకుపడింది. 15. వీరంతా ఒకే ఒక్క ప్రేలుడు కోసం ఎదురుచూస్తున్నారు. దరిమిలా వారికి ఎలాంటి విడుపు ఇవ్వటం జరగదు. 16. వారిలా అంటున్నారు : 'మా ప్రభూ! మా భాగమేదో మాకు లెక్కల దినానికి ముందే ఇచ్చేయ్.'

17. (ప్రవక్తా!) వారి మాటలపై సంయమనం పాటించు. మా దాసుడయిన దావూదును జ్ఞాపకం చేసుకో. అతను బలశాలి. మా వైపునకు మరలేవాడు కూడా. 18. మేము పర్వతాలను అతని అదుపాజ్ఞలలో ఉంచాము. అవి అతనితో పాటే ఉదయం సాయంత్రం మా పవిత్రతను కొనియాడేవి. 19. పక్షులు కూడా గుమికూడేవి – అవన్నీ దేవుని వైపునకు మరలేవి. 20. మేము అతని సామ్రాజ్యాన్ని బలోపేతం చేశాము. అతనికి వివేకాన్ని అనుగ్రహించాము. వ్యాజ్యాలపై తీర్పు ఇచ్చే దక్షతను వొసగాము.

21. గొడవపడిన వ్యక్తుల సమాచారం గాని నీకు అందిందా? అప్పుడు వారిరువురూ గోడ దూకి సరాసరి అతని ప్రార్థనా గదిలోనికి జొరబడ్డారు. 22. వారు దావూదును సమీపించినపుడు, అతను కించిత్ భయాందోళనకు గురయ్యాడు. వారిలా విన్నవించుకున్నారు : 'తమరు భయపడకండి. మేమిద్దరం ఒక వ్యవహారంలో కక్షిదారులం. మాలో ఒకరు మరొకరిపై దౌర్జన్యం చేశారు. కాబట్టి తమరు మా మధ్యన న్యాయసమ్మతంగా తీర్పు చేయండి. అన్యాయం చేయకండి. మాకు సరయిన మార్గం చూపండి.'

23. 'ఇతను నా సహోదరుడు. ఇతని దగ్గర తొంభై తొమ్మిది ఆడ గొర్రెలుండగా, నా దగ్గర ఒకే ఒక్క ఆడగొర్రె ఉంది. ఈ ఒక్క దానిని కూడా తనకు స్వాధీనపరచమని ఇతనంటున్నాడు. వాక్పటిమ ద్వారా నన్ను లొంగదీసుకున్నాడు.' 24. దావూదు ఇలా అన్నాడు : 'ఇతను నీ ఆడగొర్రెను తన ఆడ గొర్రెల మందలో కలుపుకుంటానని కోరి నీపై అన్యాయానికి ఒడిగట్టాడు. చాలామంది భాగస్వాములు ఇలాగే ఒండొకరిపై జులుం చేస్తూ ఉంటారు. అయితే విశ్వసించి, సత్క్రియలాచరించేవారు మాత్రం ఇలా చేయరు. కాని అలాంటివారు అరుదుగానే ఉంటారు ....' అంతే! మేము తనను పరీక్షిస్తున్నామన్న ఆలోచన తట్టింది దావూదుకు. వెంటనే అతను

క్షమాపణకై తన ప్రభువును అర్థించాడు. సాష్టాంగపడి, ఆయన వైపునకు రుజువర్తనుడయ్యాడు. 25. తరువాత మేము అతని (పొరపాటు)ని మన్నించాము. నిశ్చయంగా అతను మా వద్ద సామీప్యం, మంచి మరలింపు స్థానం పొందినవాడు.

26. ఓ దావూద్! మేము నిన్ను భువిలో ఖలీఫా (పరిపాలకుని)గా చేశాము. కనుక ప్రజల మధ్యన సత్య (న్యాయ) బద్ధంగా తీర్పు చెయ్యి. కోర్కెల వెనక పరుగెత్తకు. అవి నిన్ను దైవమార్గం నుండి తప్పిస్తాయి. దైవమార్గం నుండి తప్పిపోయినవారికి కఠిన శిక్ష ఉంటుంది. ఎందుకంటే వారు లెక్కల దినాన్ని విస్మరించారు.

27. మేము ఆకాశాన్ని, భూమిని, వాటి మధ్యనున్న వాటిని నిరర్థకంగా సృష్టించలేదు. ఇది సత్యతిరస్కారుల ఊహ మాత్రమే. కనుక సత్యతిరస్కారులకు అగ్ని ద్వారా వినాశం ఖాయం. 28. ఏమిటి, మేము విశ్వసించి సదాచరణచేసే వారిని, భువిలో విధ్వంసం సృష్టించేవారిలా చేసేస్తామా? లేక దైవభీతిపరాయణులను అక్రమార్కుల మాదిరిగా చేసేస్తామా? 29. (ప్రవక్తా!) మేము నీ వైపు అవతరింపజేసిన శుభప్రదమైన గ్రంథమిది – ప్రజలు దీని వచనాలపై యోచన చేయాలని! బుద్ధిజీవులు దీనిద్వారా హితబోధ గ్రహించాలని!!

30. మేము దావూదుకు సులైమానును ప్రసాదించాము. అతనొక ఉత్తముడైన దాసుడు. తన ప్రభువు వైపునకు అత్యధికంగా మరలేవాడు. 31. ఒకనాడు సాయంత్రంపూట అతని ముందు వేగంగా పరుగెత్తే మేలుజాతి అశ్వాలు ప్రదర్శించబడినపుడు 32 అతనిలా అన్నాడు : 'నేను ఈ సంపదపై గల మక్కువ కారణంగా నా ప్రభువు ధ్యానాన్ని విస్మరించాను.' ఈలోగా సూర్యుడు తెరచాటుకు వెళ్ళిపోయాడు. 33. 'వాటిని మళ్లీ నా వద్దకు తీసుకురండి' (అని ఆదేశించాడు సులైమాన్). తరువాత వాటి పిక్కలను, మెడలను (ఆప్యాయంగా) నిమిరాడు.

34. మేము సులైమానును పరీక్షించాము. మేము అతని సింహాసనంపై ఒక (మృత) దేహాన్ని పడవేశాము. తరువాత అతను (అందలి పరమార్థాన్ని గ్రహించి) మా వైపు మరలాడు. 35. ఈ విధంగా ప్రార్థించాడు : 'నా

ప్రభూ! నన్ను క్షమించు, నా తరువాత వేరెవరికీ శోభాయమానం కాజాలని గొప్ప సామ్రాజ్యాన్ని నాకు ప్రసాదించు. నిశ్చయంగా నీవు గొప్ప ప్రదాతవు.' 36. అందువల్ల మేము గాలులను అతని అదుపాజ్ఞలలో ఉంచాము. అవి అతని ఆజ్ఞానుసారం – అతను కోరిన చోటికి – సుతిమెత్తగా వీచేవి. 37. జిన్నులను కూడా మేము అతని నియంత్రణలో ఉంచాము. అన్ని రకాల భవన నిర్మాతలు వారు. (సముద్రంలో మునకలు వేసి ముత్యాలు తదితర ఆభరణాలను తెచ్చే) గజ ఈతగాళ్ళు వారు. 38. సంకెళ్ళతో బంధించబడిన (పొగరుబోతు) జిన్నాతులు కూడా ఉండేవి. 39. (అతనితో ఇలా అన్నాము) 'ఇది మా వరప్రసాదం. దీనిని నీవు ఇతరులకు ఇచ్చినా లేక నీవద్దనే ఉంచుకున్నా (అది నీ ఇష్టం), నీ నుండి లెక్క తీసుకోబడదు.' 40. నిశ్చయంగా అతనికి మా వద్ద సామీప్యం ఉంది. సత్పరిణామం కూడా.

41. మా దాసుడయిన అయ్యూబును తలచుకో. 'షైతాన్ నన్ను క్షోభకు, బాధకు లోను చేశాడు' అని అతను తన ప్రభువుకు నివేదించు కున్నప్పుడు, 42 'నీ కాలిని నేలమీద కొట్టు. ఇదిగో చల్లని నీరు. స్నానం చేయటానికి, త్రాగటానికీను' (అని మేము సూచించాము). 43. మేమతనికి అతని పరివారమంతటినీ ప్రసాదించాము. వారితో పాటు మరి అంతమందిని కూడా మా ప్రత్యేక కృపతో అనుగ్రహించాము – విజ్ఞులకు గుణపాఠ సూచనగా! 44. (ఇంకా మేమతనికి ఈ విధంగా సూచించాము) : 'నీ చేత్తో ఒక గడ్డి పరకల కట్టను తీసుకుని కొట్టు. ప్రమాణభంగానికి పాల్పడకు.' నిశ్చయంగా మేమతనిని ఓపికలో అందెవేసిన చేయిగా కనుగొన్నాము. అతను అమోఘమైన దాసుడు! తన ప్రభువు వైపునకు అత్యధికంగా మరలేవాడు!!

45. ఇంకా మా దాసులయిన ఇబ్రాహీమ్, ఇస్హాఖ్ యాఖూబులను మననం చేసుకో. వారంతా సిద్ధహస్తులు, దార్శనికత కలవారు. 46. మేము వారిని ఒక ప్రత్యేక విషయం కొరకు ప్రత్యేకించుకున్నాము – అదే పరలోక స్మరణ. 47. వారంతా మా వద్ద ఎన్నుకోబడినవారు, అత్యుత్తమ శ్రేణికి చెందినవారు. 48. ఇస్మాయీల్, అల్ యసఅ, జుల్‌కిఫ్లలను కూడా జ్ఞప్తికి తెచ్చుకో. వీరంతా ఉన్నత శ్రేణికి చెందినవారే.

49. ఇదొక ఉపదేశం! నిశ్చయంగా దైవభీతిపరుల కొరకు మంచి నివాస స్థానం ఉంటుంది. 50. శాశ్వతమయిన స్వర్గవనాలుంటాయి. వాటి ద్వారాలు తెరచుకుని ఉంటాయి. 51. వాటిలో వారు దర్జాగా దిండ్లకు ఆనుకుని కూర్చుని ఉంటారు. ఎన్నో పండ్లను, పానీయాలను కోరి తెప్పించుకుంటూ ఉంటారు. 52. వారివద్ద బిడియపడే వాలుకనులు గల సమవయస్కులైన సుందరాంగులు ఉంటారు. 53. లెక్కల దినం రావటం గురించి మీతో చేయబడే వాగ్దానమిది. 54. నిశ్చయంగా ఇది మేమిచ్చే ఉపాధి. ఇది ఎన్నటికీ తరగనిది.

55. ఇదీ (సజ్జనుల) సంగతి. ఇక తలబిరుసుల విషయానికి వస్తే, వారికి బహుచెడ్డ నివాసముంటుంది. 56. అంటే, నరకం. దానికి వారు ఆహుతి అవుతారు. ఎంత చెడ్డ స్థలం అది! 57. ఇది మరిగే నీరు, చీము నెత్తురు. వారు దాని రుచి చూడవలసి ఉంటుంది. 58. ఇలాంటివే మరెన్నో (శిక్షలు) ఉంటాయి. 59. అదిగో, మరో గుంపు మీ వద్దకు దూసుకుని వస్తోంది! వారికెలాంటి స్వాగత సన్నాహాలు లేవు. (ఎందుకంటే) వారు నరకానికి ఆహుతి కావలసినవారు. 60. వారు వీళ్ళతో ఇలా అంటారు : 'అసలు స్వాగతానికి నోచుకోనిది మీరే. అసలు మాకు ఈ దుస్థితిని తెచ్చిపెట్టింది కూడా మీరేగా!' ఎంత దుర్భరమైన చోటు అది!! 61. వారిలా అంటారు : 'మా ప్రభూ! మాకు ఈ స్థితిని తెచ్చిపెట్టిన వానికి నరకంలో రెట్టింపు శిక్ష విధించు.' 62. వారింకా ఇలా అంటారు : 'అరె! మనం దుష్టులుగా జమకట్టినవారు మనకిక్కడ కనిపించటం లేదే!? 63. ఏమిటి, మనం వాళ్ళను నవ్వులాటగా తీసుకున్నామా? లేక మన దృష్టి వారి నుండి తొలగిపోతోందా?' 64. నరకవాసుల మధ్య సంఘర్షణ తప్పక జరుగుతుం దనేది మాత్రం నిజం.

65. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'నేను కేవలం భయబోధ చేసేవాడను మాత్రమే. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేదు. ఆయన ఒకే ఒక్కడు. ఆయన ఎదురులేనివాడు. 66. ఆయన భూమ్యాకాశాలకు, వాటి మధ్యనున్న వాటన్నింటికీ ప్రభువు. ఆయన శక్తిశాలి, క్షమాశీలి.' 67. ఇలా అను : 'అదొక మహావార్త! 68. దానిపట్ల మీరు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు.

69. ఊర్ధ్వలోకాల సదస్సులో (మానవ సృష్టి గురించి) అక్కడి వారిమధ్య వివాదం తలెత్తినప్పుడు ఏం జరిగిందో నాకేమీ తెలియదు. 70. నేను స్పష్టంగా సావధానపరచేవాడను గనకనే నా వద్దకు దివ్యవాణి (వహీ) వస్తుంది.'

71. నీ ప్రభువు దైవదూతలతో ఈ విధంగా చెప్పినప్పుడు (ఏం జరిగిందో జ్ఞాపకం చేసుకో); 'నేను మట్టితో ఒక మనిషిని సృష్టించబోతున్నాను. 72. నేనతనిని తీర్చిదిద్ది, అతనిలో నా ఆత్మను ఊదినపుడు, మీరంతా అతనికి సాష్టాంగపడాలి.' 73. అప్పుడు దైవదూతలంతా (ఆదమ్‌కు) సాష్టాంగపడ్డారు. 74. కాని ఇబ్లీసు మాత్రం (సాష్టాంగపడలేదు). వాడు గర్విష్టి అయి, తిరస్కారులలో చేరిపోయాడు. 75. 'ఓ ఇబ్లీస్! నేను నా రెండు చేతులతో సృష్టించిన వాని ముందు సాష్టాంగపడకుండా నిన్ను ఆపినది ఏది? నీకేమన్నా పొగరా? లేక నువ్వేమన్నా అగ్రశ్రేణికి చెందినవాడివా?' అని (అల్లాహ్) అడిగితే, 76. ఇబ్లీసు ఇలా చెప్పాడు : 'నేను ఆదమ్ కంటే ఉత్తముడను. నీవు నన్ను అగ్నితో సృష్టించావు. అతన్నేమో మట్టితో పుట్టించావు.' 77. సెలవిచ్చాడు : 'పో ఇక్కణ్ణుంచి. ఎందుకంటే నీవు ధూత్కరించబడ్డావు. 78. తీర్పుదినం వరకూ నీపై నా శాపం ఉంటుంది.'

79. 'నా ప్రభూ! ప్రజలు తిరిగి లేపబడే దినం వరకూ నాకు వ్యవధి ఇవ్వు' అని ఇబ్లీస్ నివేదించుకున్నాడు. 80. 'నీకు వ్యవధి ఇవ్వబడింది – 81 అది సమయం నిర్ధారించబడి ఉన్న రోజు వరకే' అని సెలవీయబడింది. 82. ఇబ్లీస్ అన్నాడు : 'అలాగయితే నీ గౌరవం మీద ఒట్టు! నేను వీళ్ళందరినీ దారి తప్పిస్తాను – 83 నీవు ఎన్నుకున్న నీ ప్రత్యేక దాసులను మినహాయించి!' 84 (అల్లాహ్) సెలవిచ్చాడు : 'సరే. సత్యం మాత్రం ఇదే. నేను సత్యమే పలుకుతున్నాను. 85. నేను నరకాన్ని నీతోనూ, వారిలో నిన్ను అనుసరించిన వారితోనూ నింపుతాను.'

86. వారికి చెప్పు : 'నేను ఈ కార్య నిర్వహణకుగాను మీ నుండి ఎలాంటి ప్రతిఫలం అడగటం లేదు. నేను మిమ్మల్ని మభ్యపెట్టేవాణ్ణి కూడా కాను.' 87. ఇదైతే లోకవాసులందరికీ ఒక ఉపదేశం మాత్రమే. 88. అనతి కాలంలోనే మీరు ఈ సమాచారంలోని నిజాన్ని తెలుసుకుంటారు.'

# 39. అజ్ జుమర్ (తండోపతండాలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఈ గ్రంథం శక్తిశాలి, వివేచనాశీలి అయిన దేవుని తరపున అవతరింపజేయబడింది. 2. నిశ్చయంగా మేమీ గ్రంథాన్ని నీ వైపు సత్యంతో అవతరింపజేశాము. కనుక నీవు నీ ధర్మాన్ని కేవలం అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని, ఆయనను మాత్రమే ఆరాధించు. 3. విను! నిష్కల్మషమయిన ధర్మం (ఆరాధన, విధేయత) మాత్రమే అల్లాహ్‌కు చెందుతుంది. ఆయనతో పాటు ఇతరులను కూడా తమ రక్షకులుగా చేసుకున్నవారు ఇలా అంటారు: 'వారు మమ్మల్ని దైవసామీప్యానికి చేర్చుతారన్న ఉద్దేశంతోనే వారిని ఆరాధిస్తున్నాము.' నిశ్చయంగా అల్లాహ్ వారు విభేదించుకునే దానిపై వారి మధ్యన తీర్పు ఇస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ అబద్ధాలకోరులకు, సత్యాన్ని నిరాకరించే వారికి సన్మార్గం చూపడు.

4. ఒకవేళ అల్లాహ్ (ఎవరినయినా) కొడుకుగా చేసుకోవాలనే అనుకుంటే తన సృష్టితాలలో తాను కోరిన వారిని ఎన్నుకుని ఉండేవాడు. కాని ఆయన పరమ పవిత్రుడు. ఆయనే అల్లాహ్. ఒకే ఒక్కడు. సర్వాధిపత్యం కలవాడు. 5. ఆయన భూమ్యాకాశాలను సత్యబద్ధంగా సృష్టించాడు. ఆయన రాత్రిని పగటిపై చుట్టివేస్తున్నాడు. పగటిని రాత్రిపై చుట్టివేస్తున్నాడు. ఆయన సూర్యచంద్రులను నియమబద్ధం చేశాడు – ప్రతిదీ నిర్ధారిత వేళ ప్రకారం సాగిపోతూ ఉంది. వినండి! ఆయన అపార శక్తిమంతుడు, క్షమాభిక్ష పెట్టేవాడు.

6. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. మరి దానితోనే ఆయన దాని జతను కూడా చేశాడు. ఇంకా ఆయనే మీ కొరకు పశువులలో ఎనిమిది రకాల ఆడ – మగలను అవతరింపజేశాడు. ఆయనే మీ మాతృగర్భాలలో మూడేసి చీకటి పొరలలో ఒకదాని తరువాత ఒకటిగా – దశల వారీగా – రూపకల్పన చేస్తూ పోతున్నాడు. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. సార్వభౌమత్వం ఆయనదే. ఆయన తప్ప మరో దైవం లేదు. మరలాంటప్పుడు మీరు ఎక్కడి నుండి (దారి) మళ్ళించబడుతున్నారు?

7. ఒకవేళ మీరు కృతఘ్నుతా వైఖరిని అవలంబించినట్లయితే అల్లాహ్‌కు మీ అవసరం లేదు (అని తెలుసుకోండి). తన దాసుల కృతఘ్నుతా ధోరణిని ఆయన సుతరామూ ఇష్టపడడు. మీరు గనక కృతజ్ఞులుగా మెలగినట్లయితే, దీనిని ఆయన మీ కోసం ఇష్టపడతాడు. బరువును మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడు. తరువాత మీరంతా మరలిపోవలసింది మీ ప్రభువు వైపునకే. అప్పుడు మీరు చేస్తూ ఉన్నదంతా ఆయన మీకు తెలియపరుస్తాడు. నిశ్చయంగా ఆయన ఆంతర్యాలలో ఉన్న రహస్యాలను సయితం ఎరిగినవాడు.

8. మనిషిపై ఏదయినా విపత్తు వచ్చిపడినప్పుడు, అతను తన ప్రభువు వైపు మరలి, కడుదీనంగా విజ్ఞప్తి చేసుకుంటాడు. తరువాత ఆయన తన వద్ద నుండి అతనికి అనుగ్రహ భాగ్యాన్ని ప్రసాదిస్తే, ఒకప్పుడు అతను దేని కోసం విన్నపాలు చేసుకున్నాడో వాటిని మరచిపోతాడు. పైగా అతను అల్లాహ్‌కు సహవర్తులను కల్పించి (షిర్క్ చేసి), తద్వారా ఇతరులను కూడా అపమార్గం పట్టించాలని చూస్తాడు. వారికి చెప్పు : 'నీవు నీ తిరస్కారవైఖరి ద్వారా కొన్నాళ్ళపాటు లబ్ది పొందు. ఖచ్చితంగా నువ్వు నరకాగ్ని వాసులలో చేర్తావు.'

9. ఒక వ్యక్తి రాత్రి గడియలలో సాష్టాంగ ప్రణామాలు చేస్తూ, దైవారాధనలో నిలబడుతున్నాడు. పరలోకానికి భయపడుతున్నాడు, తన ప్రభువు కారుణ్యాన్ని ఆశిస్తున్నాడు (మరో వ్యక్తి ఇవేమీ చేయటం లేదు). చెప్పండి! తెలిసినవారు – తెలియనివారు సమానులు కాగలరా? బుద్ధిమంతులు మాత్రమే ఉపదేశాన్ని గ్రహిస్తారు.

10. ఇలా చెప్పు : విశ్వసించిన నా దాసులారా! మీ ప్రభువుకు భయపడండి. ఈ లోకంలో మంచి చేసినవారికి మంచి ప్రతిఫలం ఉంటుంది. అల్లాహ్ భూమి విస్తృతమైనది. నిశ్చయంగా నిగ్రహం పాటించేవారికి, లెక్క లేనంత ప్రతిఫలం వొసగబడుతుంది.

11. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని,

ఆయనను మాత్రమే ఆరాధించాలని నేను ఆజ్ఞాపించబడ్డాను.
12. అందరికన్నా ముందు నేను ముస్లింను (విధేయుణ్ణి) కావాలని కూడా
ఆజ్ఞాపించబడ్డాను.' 13. ఇలా అను : 'ఒకవేళ నేను గనక నా ప్రభువుకు
అవిధేయత చూపితే, మహా గడ్డుదినాన విధించబడే శిక్ష గురించి నేను
భయపడుతున్నాను.' 14. ఈ విధంగా చెప్పు : 'నేను అల్లాహ్‌ను మాత్రమే
ఆరాధిస్తున్నాను - నా శ్రద్ధాభక్తులను ఆయనకే ప్రత్యేకించుకుని! 15. ఇక
మీరు, ఆయనను కాదని ఎవరిని పూజిస్తారో పూజించుకోండి.' ఇలా అను:
'తాము స్వయంగా నష్టపోవటంతో పాటు, తమ ఇంటివారిని కూడా
ప్రళయదినాన నష్టానికి గురిచేసినవారే అసలు నష్టపోయినవారు. వినండి!
ఘోరంగా నష్టపోవటమంటే ఇదే. 16. వారి కోసం వారిపై నుండి అగ్ని
ఛాయలు ఉంటాయి, వారి క్రింది నుండి కూడా! ఇలాంటి వస్తువు ద్వారా
అల్లాహ్ తన దాసులను భయపెడుతున్నాడు. 'ఓ నా దాసులారా! మీరు
నాకు భయపడండి.'

17. మరెవరయితే షైతాన్ దాస్యానికి దూరంగా ఉంటూ, అల్లాహ్
వైపునకు మరలివచ్చారో, అలాంటి వారికే శుభవార్త! కనుక (ఓ ప్రవక్తా!)
అలాంటి నా దాసులకు శుభవార్త వినిపించు. 18. వారు మాటను శ్రద్ధగా
వింటారు. అందులో ఉన్న మంచిని అవలంబిస్తారు. దేవుడు సన్మార్గం
చూపినది ఇలాంటి వారికే - ఇలాంటివారే విజ్ఞులు.

19. ఎవరిపై శిక్షా వాక్కు ఖరారైపోయిందో, నరకాగ్నిలో ఉన్న ఆ
వ్యక్తిని నీవు కాపాడగలవా? 20. అయితే తమ ప్రభువుకు భయపడేవారి
కొరకు అంతస్తుల మేడలున్నాయి. వాటిపైన మరిన్ని అంతస్తులు నిర్మించబడి
ఉన్నాయి. వాటి దిగువన కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. అల్లాహ్
వాగ్దానమిది. అల్లాహ్ తన వాగ్దానానికి విరుద్ధంగా చేసేవాడు కాడు.

21. ఏమిటి, అల్లాహ్ ఆకాశం నుండి వర్షాన్ని కురిపించి, దానిని
భూగర్భంలోని ఊటలలో ఎలా ప్రవహింపజేస్తున్నాడో నీవు చూడటం లేదా?
తరువాత ఆయన దీనిద్వారా విభిన్న రంగుల పంటలు వెలికి తీస్తున్నాడు.
తరువాత అవి ఎండిపోయినపుడు పసుపు పచ్చగా మారటం నీవు గమనిస్తావు.

ఆఖరికి ఆయన దానిని పొట్టుగా మార్చేస్తాడు. నిశ్చయంగా ఇందులో బుద్ధిమంతులకు హితోపదేశం ఉంది. 22. ఏ వ్యక్తి హృదయాన్నయినా అల్లాహ్ ఇస్లాం కొరకు విప్పారజేస్తే, ఆ వ్యక్తి అల్లాహ్ తరఫున ఒక జ్యోతిని పొందినట్లే. ఇకపోతే; ఎవరి హృదయాలు దైవోపదేశం విషయంలో కఠినమైపోయాయో అలాంటి వారికి వినాశం తథ్యం. అలాంటివారు స్పష్టమయిన మార్గభ్రష్టతకు లోనై ఉన్నారు.

23. అల్లాహ్ అత్యుత్తమమయిన విషయాన్ని అవతరింపజేశాడు. అది పరస్పరం పోలిక కలిగి ఉండే, పదే పదే పునరావృతం అవుతూ ఉండే వచనాలతో కూడుకున్న గ్రంథంగా ఉంది. దానివల్ల తమ ప్రభువుకు భయపడే వారి రోమాలు నిక్కబొడుచుకుంటాయి. ఆ తరువాత వారి శరీరాలు, వారి హృదయాలు మెత్తబడి అల్లాహ్ స్మరణ వైపు మొగ్గుతాయి. ఇదీ అల్లాహ్ మార్గదర్శకత్వం! దీనిద్వారా ఆయన తాను కోరిన వారిని సన్మార్గానికి తెస్తాడు. అల్లాహ్ అపమార్గం పట్టించిన వానికి సన్మార్గం చూపేవాడెవడూ లేడు.

24. ఏ వ్యక్తి ప్రళయదినాన ఘోరమయిన శిక్ష పడకుండా తన ముఖాన్ని అడ్డుగా పెట్టుకుంటాడో (అతని పరిస్థితిని మీరు ఊహించారా?) 'మీరు సంపాదించుకున్న దాని రుచి చూడండి' అని అప్పుడు దుర్మార్గులతో అనబడుతుంది. 25. వీరి పూర్వీకులు కూడా సత్యాన్ని త్రోసిపుచ్చినవారే. అందువల్ల వారిపై శిక్ష వారు ఊహించనయినా లేని చోటు నుండి విరుచుకుపడింది. 26. ఆ విధంగా దేవుడు ప్రాపంచిక జీవితంలోనే అవమానం రుచి చూపించాడు. పరలోక శిక్ష ఇంతకన్నా పెద్దది. ఈ విషయాన్ని వారు తెలుసుకుంటే ఎంత బాగుండేది!

27. మేము ఈ ఖుర్ఆన్‌లో ప్రజల బోధనార్థం అన్ని రకాల ఉపమానాలు ఇచ్చాము. 28. ఇది అరబీలో ఉన్న ఖుర్ఆన్. ఇది ఎలాంటి వక్రతా లేనిది – బహుశా వారు భయభక్తులతో మసలుకుంటారని (మేమిలా చేశాము). 29. అల్లాహ్ ఒక బానిస వ్యక్తి ఉదాహరణ ఇస్తున్నాడు. అతను విరుద్ధ భావాలకు నిలయమైన అనేకమంది భాగస్వాముల యాజమాన్యంలో నలిగిపోతున్నాడు. కాగా; రెండవ వ్యక్తి పూర్తిగా ఒకే యజమానికి బానిసగా

ఉన్నాడు, చెప్పండి! వారిద్దరి పరిస్థితి ఒకటేనా? ప్రశంసలన్నీ అల్లాహ్‌కే. కాని చాలామంది తెలుసుకోరు. 30. నిశ్చయంగా నీవూ మరణిస్తావు. వారూ మరణించవలసినవారే. 31. తరువాత మీరంతా ప్రళయదినాన మీ ప్రభువు సమక్షంలో మీ వివాదాన్ని సమర్పిస్తారు.

◆ (24) 32. అల్లాహ్‌పై అబద్ధాలు ఆపాదించే వాడికంటే, సత్యం తన వద్దకు వచ్చినపుడు దానిని అసత్యమంటూ త్రోసిపుచ్చినవాడికంటే పరమ దుర్మార్గుడు ఎవడుంటాడు? ఇలాంటి తిరస్కారుల నివాస స్థలం ఉండేది నరకంలో కాదా? 33. ఎవరయితే సత్యాన్ని తీసుకువచ్చాడో, మరెవరయితే దానిని సత్యమని ధ్రువీకరించాడో – అలాంటివారే భయభక్తులు కలవారు. 34. వారి కొరకు వారి ప్రభువు వద్ద వారు కోరినదల్లా ఉంది. ఇది సదాచార సంపన్నులకు లభించే ప్రతిఫలం. 35. తద్వారా అల్లాహ్ వారి నుండి వారి దుష్కర్మలను దూరం చేయాలని, వారి సత్కర్మలకు బదులుగా వారికి వారి పుణ్యఫలం ఇవ్వాలని (ఈ విధంగా చేశాడు).

36. ఏమిటి, అల్లాహ్ తన దాసునికి చాలడా? కాని వారేమో ఆయనను కాదని ఇతరుల గురించి నిన్ను భయపెడుతున్నారు. అల్లాహ్ అపమార్గం పట్టించిన వానికి దారి చూపేవాడెవడూ ఉండడు. 37. అల్లాహ్ సన్మార్గం చూపిన వానిని అపమార్గం పట్టించేవాడెవడూ ఉండడు. ఏమిటి, అల్లాహ్ శక్తిమంతుడు, ప్రతీకారం చేసేవాడు కాడా? 38. భూమ్యాకాశాలను సృష్టించిన దెవరు? అని నీవు గనక వారిని అడిగితే **'అల్లాహ్'** అని వారు సమాధానమిస్తారు. వారిని అడుగు : 'చూడండి! అల్లాహ్‌ను కాదని మీరు వేటిని మొరపెట్టుకుంటున్నారో అవి, ఒకవేళ అల్లాహ్ నాకేదన్నా బాధ కలిగించదలిస్తే, ఆయన కలిగించిన బాధను అవి తొలిగించగలవా? పోనీ, అల్లాహ్ నన్ను కరుణించదలిస్తే, అవి ఆయన కారుణ్యాన్ని అడ్డుకోగలవా?' ఇలా చెప్పు : 'నాకు అల్లాహ్ చాలు. నమ్మేవారు ఆయన్నే నమ్ముకుంటారు.' 39. ఇలా చెప్పు : 'నా జాతి వారలారా! మీ స్థానంలో మీరు ఆచరిస్తూ ఉండండి. నేనూ ఆచరిస్తూ ఉన్నాను. శీఘ్రంగానే మీకు తెలిసివస్తుంది – 40 – పరాభవం పాల్జేసే శిక్ష ఎవరిపై రానున్నదో! శాశ్వతంగా ఉండే శిక్ష

ఎవరిని చుట్టుముడుతుందో!! 41. మేము మానవుల మార్గదర్శకత్వం నిమిత్తం ఈ గ్రంథాన్ని నీపై సత్యంతో పాటు అవతరింపజేశాము. కనుక సన్మార్గాన్ని పొందినవాడు తన స్వయం కొరకే పొందుతాడు. మరెవడయినా మార్గవిహీనుడైతే ఆ మార్గవిహీనతా నష్టమంతా అతని మీదే పడుతుంది. నీవు వారి నష్టానికి బాధ్యుడవు కావు కదా!

42. అల్లాహ్‌యే (మానవ) ఆత్మలను వారి మరణ సమయంలో స్వాధీనం చేసుకుంటాడు. మరణించని వారి ఆత్మలను కూడా వారు నిద్రిస్తున్న సమయంలో వశపరచుకుంటాడు. తరువాత మరణ నిర్ణయం జరిగిపోయిన వారి ఆత్మలను ఆపుకుంటున్నాడు. మిగిలిన వారందరి ఆత్మలను ఒక నిర్ధారిత సమయం కొరకు విడిచిపెడుతున్నాడు. నిశ్చయంగా ఇందులో ఆలోచించే జనుల కొరకు సూచనలున్నాయి.

43. ఏమిటి, వారు అల్లాహ్‌ను వదలి ఇతరులను సిఫారసు చేసేవారుగా పరిగణిస్తున్నారా? వారిని అడుగు : 'వారికి ఏ అధికారం లేకపోయినా, వారేమీ అర్థం చేసుకోకపోయినా (వారు మీకు సిఫారసు చేస్తారా?)' 44. వారికి చెప్పు : 'సిఫారసు అంతా అల్లాహ్ అధీనంలో ఉంది. భూమ్యాకాశాల సార్వభౌమత్వం ఆయనదే. తరువాత మీరంతా ఆయన వైపునకే మరల్చబడతారు. 45. ఒక్కడైన అల్లాహ్‌ను గురించి ప్రస్తావించినపుడు పరలోకాన్ని నమ్మని వారి గుండెలు అవిసిపోతాయి. ఆయన తప్ప ఇతరుల గురించి ప్రస్తావించినపుడు మాత్రం వారు సంబరపడతారు. 46. ఇలా అను : 'ఓ అల్లాహ్! భూమ్యాకాశాలను సృష్టించినవాడా! గోచర అగోచర విషయాలను గురించి తెలిసినవాడా! నీ దాసులు విభేదించుకుంటున్న దానిపై వారి మధ్యన నీవు మాత్రమే తీర్పు ఇవ్వగలవు.' 47. ఒకవేళ దుర్మార్గుల దగ్గర భువిలో ఉన్న సాధన సంపత్తులన్నీ ఉన్నా, వాటితో పాటే మరి అంత ఉన్నా, ప్రళయదినపు కఠిన శిక్ష నుండి తప్పించుకోవటానికి వారు అదంతా పరిహారంగా ఇవ్వటానికి సిద్ధమవుతారు. ఎందుకంటే వారు ఊహించి కూడా ఉండని వ్యవహారం అల్లాహ్ తరఫున వారికి ఎదురవుతుంది. 48. వారు సముపార్జించిన దుష్కర్మలన్నీ వారి ముందుకు వచ్చేస్తాయి. వారు పరిహసిస్తూ ఉండినదే వారిని చుట్టుముడుతుంది.

49. మనిషికి ఏదన్నా కష్టం వచ్చినప్పుడు అతను మమ్మల్ని (కడు దీనంగా) మొరపెట్టుకుంటాడు. తరువాత మేమతనిని మా తరఫున అనుగ్రహించినపుడు, 'ఇదంతా నా ప్రతిభ మూలంగానే నాకివ్వబడింది' అని బీరాలు పోతాడు. ఎంతమాత్రం కాదు. వాస్తవానికి అదొక పరీక్ష. కాని వారిలో అనేకులు ఈ విషయాన్ని తెలుసుకోరు. 50. వీరి పూర్వీకులు కూడా ఇదే మాటన్నారు. అందువల్ల వారు సముపార్జించినదేదీ వారికి పనికి రాలేదు. 51. వారు మూటకట్టుకున్న పాపఫలాలే వారిపై వచ్చిపడ్డాయి. ఇక వీరిలోని దుర్మార్గుల ముందు కూడా వీరి సంపాదనా దుష్ఫలితాలు త్వరలోనే వచ్చి నిలుస్తాయి. వీరు మమ్మల్ని ఎప్పటికీ లొంగదీసుకోలేరు. 52. అల్లాహ్ తాను కోరిన వారి ఉపాధిని వికసింపజేస్తాడని, దానిని తగ్గించేవాడు కూడా ఆయనే నని వారికి తెలీదా? నిశ్చయంగా ఇందులో విశ్వసించే జనులకు పలు సూచనలున్నాయి.

53. (ఓ ప్రవక్తా!) వారికి చెప్పు : 'మీ ఆత్మలకు అన్యాయం చేసుకున్న నా దాసులారా! దైవకారుణ్యం పట్ల నిరాశ చెందకండి. నిశ్చయంగా దేవుడు పాపాలన్నింటినీ క్షమిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు, అపారంగా కరుణించేవాడూను. 54. (కాకపోతే ఒక షరతు!) మీరు మీ ప్రభువు వైపునకు చిత్తశుద్ధితో మరలాలి. ఆయనకు విధేయత చూపాలి. మీపై ఆపద వచ్చిపడక ముందే, మీకు ఎలాంటి సహాయం అందని పరిస్థితి ఏర్పడక ముందే (మీరు ఈ పని చేయాలి).

55. మీకు తెలియకుండానే, మీపై అకస్మాత్తుగా ఆపద విరుచుకుపడక ముందే, మీ ప్రభువు తరఫు నుండి మీపై అవతరింపజేయబడిన గ్రంథంలోని అత్యుత్తమ విషయాన్ని అనుసరించండి. 56. అప్పుడు ఏ వ్యక్తికి కూడా, 'అయ్యో! నా స్థితి శోచనీయం. అల్లాహ్ విషయంలో నా వల్ల ఎంత అలసత్వం జరిగిపోయింది! నేను పరిహసించే వారిలో ఒకరిగా ఉండిపోయానే!' అని బాధపడే పరిస్థితి రాకూడదు. 57. లేదా 'ఒకవేళ అల్లాహ్ నాకు సన్మార్గం చూపి ఉంటే నేను కూడా భయభక్తులు కలిగి ఉండేవాడినే' అని ఎవరయినా అనవచ్చు. 58. లేదా శిక్షను చూసుకున్న పిదప వేరొకరు, 'అయ్యో! నా

దురదృష్టం! ఒకవేళ నేనేగనక మళ్లీ ప్రపంచానికి వెళ్ళగలిగితే నేను తప్పకుండా సజ్జనులలో చేరిపోతాను కదా!' అంటారు. 59. (ఈ విధంగా సెలవీయ బడుతుంది) 'అదేమిటి? నిశ్చయంగా నా ఆదేశాలు నీ వద్దకు వచ్చాయి. కాని నువ్వే వాటిని అసత్యాలంటూ త్రోసిపుచ్చావు. గర్వం ప్రదర్శించి తిరస్కారులలో చేరిపోయావు.' 60. అల్లాహ్‌పై అబద్ధాలు కల్పించిన వారి ముఖాలు ప్రళయదినాన నల్లగా మారిపోవటం నీవు చూస్తావు. ఏమిటి, గర్విష్టుల నివాస స్థలం నరకం కాదా!? 61. మరెవరయితే భయభక్తులతో మెలిగారో, వారికి అల్లాహ్ సాఫల్య భాగ్యంతో సహా కాపాడుతాడు. వారికె లాంటి కష్టంగానీ, దుఃఖంగానీ కలగదు.

62. ప్రతి దానికీ సృష్టికర్త అల్లాహ్‌యే. ప్రతి దానినీ పర్యవేక్షించేవాడు కూడా ఆయనే. 63. భూమ్యాకాశాల బీగాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఆఖరికి అల్లాహ్ సూచనలను (వచనాలను) తిరస్కరించినవారే నష్టపోయే వారు. 64. ఇలా చెప్పు : 'అజ్ఞానులారా! దైవేతరుణ్ణి పూజించమని మీరు నాకు చెబుతారా?' 65. వాస్తవానికి నీ వైపునకు, నీ పూర్వీకుల వైపునకు కూడా ఈ విధంగా వహీ (దివ్యవాణి) పంపబడినది : 'నీవు గనక బహుదైవా రాధన (షిర్క్)కు పాల్పడితే నీవు చేసుకున్న కర్మ అంతా వృధా అయిపోతుంది. నీవు నష్టపోయిన వారిలో ఒకడివవుతావు. 66. అందుకే నీవు కేవలం అల్లాహ్‌నే ఆరాధించు. కృతజ్ఞులలో చేరిపో.'

67. జనులు అల్లాహ్ ఘనత్వాన్ని అంచనా వేయవలసిన విధంగా అంచనా వేయలేదు. ప్రళయదినాన భూమి అంతా ఆయన గుప్పెట్లో ఉంటుంది. ఆకాశాలన్నీ ఆయన కుడి చేతిలో చుట్టబడి ఉంటాయి. వీరు పాల్పడే భాగస్వామ్యానికి (షిర్క్‌కు) ఆయన అతీతుడు, ఉన్నతుడు. 68. శంఖం ఊదబడగానే భూమ్యాకాశాలలో ఉన్నవారంతా (ఉన్నవన్నీ) స్పృహతప్పి పడిపోతారు – అల్లాహ్ కోరినవారు తప్ప! తరువాత మళ్లీ శంఖం పూరించగానే అంతా ఒక్కసారిగా లేచి చూడసాగుతారు. 69. భూమి తన ప్రభువు తేజస్సుతో ఉజ్వలమవుతుంది. గ్రంథం తెరువబడుతుంది.

ప్రవక్తలు, సాక్షులు హాజరుపరచబడతారు. ప్రజల మధ్య ధర్మబద్ధంగా తీర్పు చేయబడుతుంది. వారికెలాంటి అన్యాయం జరగదు. 70. ప్రతి వ్యక్తికీ అతను చేసుకున్న కర్మల పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుంది. వారు చేసేదేమిటో ఆయనకు తెలుసు.

71. తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారు తండోపతండాలుగా (వర్గీకరించబడి) నరకం వైపు తోలబడతారు. చివరికి వారు అక్కడకు చేరుకోగానే, దాని ద్వారాలు తెరువబడతాయి. దాని పర్యవేక్షకులు వారితో ఇలా అంటారు : 'ఏమిటి, మీ ప్రభువు వచనాలను చదివి వినిపించే ప్రవక్తలు స్వయంగా మీలో నుండే రాలేదా? ఈనాటి ఈ సమావేశం గురించి వారు మీకు భయబోధ చేయలేదా?' సమాధానంగా వారిలా అంటారు : 'అవును, వచ్చారు.' కాని (అప్పటికే) అవిశ్వాసులపై శిక్షా ఉత్తర్వు ఖరారైపోయింది. 72. వారితో ఇలా అనబడుతుంది : 'నరక ద్వారాలలో ప్రవేశించండి – అందులోనే శాశ్వతంగా ఉందురుగాని.' బడాయి చాటుకున్న వారి నివాస స్థలం ఎంత చెడ్డది!

73. మరెవరయితే తమ ప్రభువుకు భయపడుతూ ఉండేవారో, వారు వివిధ బృందాలుగా స్వర్గానికి కొనిపోబడతారు. వారు అక్కడకు చేరుకోగానే, దాని ద్వారాలు తెరువబడతాయి. దాని పర్యవేక్షకులు వారినుద్దేశించి, 'మీకు శాంతి కలుగుగాక! మీరిక్కడ హాయిగా ఉండండి. శాశ్వతంగా ఉండేటందుకు ఇందులో ప్రవేశించండి' అంటారు. 74. స్వర్గంలో చేరేవారు ఇలా అంటారు: 'మాకు చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపిన, మమ్మల్ని ఈ (స్వర్గ) సీమకు వారసులుగా చేసిన అల్లాహ్‌కు కృతజ్ఞతలు! ఇక మేమీ స్వర్గంలో కోరినచోట ఉంటాము.' సత్కర్మలు చేసేవారికి లభించే ప్రతిఫలం ఎంత చక్కనిది! 75. నీవు దైవదూతలను చూస్తావు – వారు దైవసింహాసనం చుట్టూ చేరి తమ ప్రభువును స్తుతించటంతో పాటు, ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటారు. జనుల మధ్య ధర్మబద్ధంగా తీర్పు చేయబడుతుంది. 'లోకేశ్వరుడైన అల్లాహ్‌కే సర్వస్తోత్రాలు' అని అనబడుతుంది.

# 40. అల్ మూ'మిన్ (విశ్వాసి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా - మీమ్. 2. ఈ గ్రంథం శక్తి సంపన్నుడు, జ్ఞానధనుడు అయిన అల్లాహ్ తరఫున అవతరింపజేయబడింది. 3. ఆయన పాపాలను క్షమించేవాడు, పశ్చాత్తాపాన్ని ఆమోదించేవాడు. కఠినంగా శిక్షించేవాడు, అపార అనుగ్రహశాలి. ఆయన తప్ప మరో దేవుడు లేడు. ఆయన వైపునకే మరలిపోవలసి ఉంది.

4. అల్లాహ్ సూచనల విషయంలో సత్య తిరస్కారులు తప్ప వేరెవరూ వాదులాడరు. కాబట్టి అలాంటి వారు రాజ్యాలలో కలియ తిరగటం నిన్ను మోసపుచ్చరాదు సుమా! 5. వీరికి పూర్వం నూహ్ జాతివారు కూడా త్రోసిపుచ్చారు. తదుపరి సమూహాల వారు కూడా ధిక్కార వైఖరిని అవలం బించారు. ప్రతి సముదాయంవారు కూడా తమ ప్రవక్తను పట్టుకోవా లనుకున్నారు. సత్యాన్ని దెబ్బతీసేందుకు లేనిపోని వాదనలకు తెరలేపారు. అందువల్ల నేను వాళ్ళను పట్టుకున్నాను. మరి నా శిక్ష ఎంత తీవ్రంగా ఉందో (చూడు)! 6. ఈ విధంగా 'వారు నరకవాసులు' అన్న నీ ప్రభువు వాక్కు సత్య తిరస్కారుల విషయంలో నిజమయింది.

7. దైవసింహాసనాన్ని మోసేవారు, దానిచుట్టూ ఉన్నవారు (దైవదూతలు) తమ ప్రభువు పవిత్రతను శ్లాఘిస్తున్నారు. ఆయన్ని కీర్తిస్తున్నారు. వారు ఆయన్ని విశ్వసిస్తున్నారు. ఇంకా వారు విశ్వసించిన దాసుల క్షమాపణకై ప్రార్థిస్తున్నారు - 'మా ప్రభూ! నీ కారుణ్యం, నీ జ్ఞానం ప్రతి వస్తువును ఆవరించి ఉంది. కనుక నీవు పశ్చాత్తాపంతో నీ వైపు మరలే, నీ మార్గాన్ని అవలంబించే వారిని క్షమించు. నీవు వారిని నరక యాతన నుండి కాపాడు. 8. ఓ మా ప్రభూ! నీవు వారికి వాగ్దానం చేసినట్లుగా, వారికి శాశ్వతమైన స్వర్గవనాలలో ప్రవేశం కల్పించు. వారి పూర్వీకులలోని, వారి భార్యలలోని,

వారి సంతతిలోని సజ్జనులకు కూడా (స్వర్గంలో చోటు కల్పించు). నిశ్చయంగా నీవు శక్తిమంతుడవు, వివేకవంతుడవు. 9. వారిని చెడుల నుండి రక్షించు. ఆ రోజు నీవు ఎవరిని చెడు (ఫలితాల) నుండి కాపాడుతావో, వారే వాస్తవానికి నీ కారుణ్యానికి నోచుకున్నవారు. ఇదే అసలు గొప్ప విజయం.

10. (ఆ రోజు) తిరస్కారులను పిలిచి ఇలా అనబడుతుంది : 'మీపై మీకే ఎంత అసహ్యంగా ఉందో, అంతకంటే ఎక్కువ అసహ్యమే అల్లాహ్‌కు మీపై కలిగేది. ఎందుకంటే అప్పుడు మిమ్మల్ని విశ్వాసం వైపు పిలుస్తుంటే మీరేమో దానిని తిరస్కరించేవారు.' 11. సమాధానంగా వారిలా అంటారు: 'మా ప్రభూ! నీవు మాకు రెండుసార్లు చావు ఇచ్చావు. రెండుసార్లు జీవితమిచ్చావు. మేము మా పాపాలను అంగీకరిస్తున్నాము. ఇప్పుడు మేము బయటపడే మార్గం ఏదన్నా ఉందా?' 12. (వారితో ఇలా అనబడుతుంది), 'మీ ఈ దుస్థితికి కారణమేమిటంటే ఒక్కడయిన అల్లాహ్ వైపు మిమ్మల్ని పిలిచినప్పుడు, మీరు త్రోసిపుచ్చేవారు. ఆయనతో భాగస్వాముల్ని చేర్చినప్పుడు మాత్రం (మహదానందంతో) విశ్వసించేవారు.' కనుక ఇప్పుడు నిర్ణయాధి కారం మహోన్నతుడు, గొప్పవాడు అయిన అల్లాహ్ అధీనంలో ఉంది.

13. ఆయనే మీకు తన సూచనలను చూపిస్తున్నాడు. ఆకాశం నుండి మీ కోసం జీవనోపాధిని దించుతున్నాడు. అల్లాహ్ వైపు మరలేవాడు మాత్రమే హితబోధను గ్రహించగలడు. 14. కనుక ధర్మాన్ని అల్లాహ్‌కే ప్రత్యేకించుకుని, ఆయననే మొరపెట్టుకోండి – సత్య తిరస్కారులకు అది సహించరానిదయినా సరే! 15. ఆయన ఉన్నత శ్రేణులు కలవాడు! పాలనా పీఠానికి (అర్ష్‌కు) అధిపతి. ఆయన తన దాసులలో తాను కోరిన వారిపై వహీ (దివ్యవాణి)ని అవతరింపజేస్తాడు – తద్వారా అతను సమావేశం కానున్న దినం గురించి సావధానపరచాలని! 16. ఏ రోజున వారు (గోరీల నుండి) బయల్పడతారో, అప్పుడు వారి లోగుట్టు ఏదీ అల్లాహ్ నుండి దాగి ఉండదు. ఈ రోజు

సార్వభౌమత్వం ఎవరిది? ఒక్కడైన, ఎదురులేనివాడైన అల్లాహ్‌దే. 17. ఈ రోజు ప్రతి వ్యక్తికీ, అతను సముపార్జించిన దాని ప్రతిఫలం ముడుతుంది. ఈ రోజు అన్యాయం జరుగదు. నిశ్చయంగా అల్లాహ్ శీఘ్రంగా లెక్క తేల్చేవాడు.

18. (ప్రవక్తా!) చాలా తొందరగా రానున్న ఆ గడ్డు దినం గురించి వారిని హెచ్చరించు. అప్పుడు గుండెలు గొంతు దాకా వచ్చి ఉంటాయి. వారు దుఃఖంలో మునిగి ఉంటారు. (ఆ రోజు) దుర్మార్గులను ఆదుకునే మిత్రుడుగానీ, మాట చెల్లునట్టి సిఫారసుదారుడు గానీ ఉండదు. 19. ఆయన చూపుల చౌర్యాన్ని, ఆంతర్యాలలో దాగి ఉన్న భేదోపాయాలను సయితం ఎరిగినవాడు. 20. అల్లాహ్ సత్యబద్ధంగా (మరియు న్యాయసమ్మతంగా) తీర్పు చేస్తాడు. అల్లాహ్‌ను కాదని వారు ఎవరెవరిని పిలుస్తున్నారో, వారు ఏ విషయంలోనూ నిర్ణయం గైకొనలేరు. నిశ్చయంగా అల్లాహ్ వినేవాడు, చూసేవాడు.

21. ఏమిటి, వారు భువిలో సంచరించి, తమ పూర్వీకులకు పట్టిన గతేమిటో చూడలేదా? శక్తి సామర్థ్యాలలో వారు వీరికన్నా గట్టివారు. భూమిలో వదలివెళ్ళిన స్మారక చిహ్నాల దృష్ట్యా కూడా వారు వీరికన్నా మెరుగైనవారే. తరువాత అల్లాహ్ వారిని వారి దురాగతాల కారణంగా పట్టుకున్నాడు. అప్పుడు అల్లాహ్ పట్టునుండి వారిని కాపాడేవాడు ఎవడూ లేకపొయ్యాడు. 22. ఇలా ఎందుకు జరిగిందంటే, వారి వద్దకు వారి ప్రవక్తలు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకువచ్చారు. కాని వారు నిరాకరించారు. అందుకే అల్లాహ్ వారిని పట్టుకున్నాడు. నిశ్చయంగా ఆయన మహాబలుడు, కఠినంగా శిక్షించేవాడు.

23. మేము మూసాను మా నిదర్శనాలతో సహా, స్పష్టమయిన ప్రమాణంతో సహా 24 ఫిరౌన్, హామాన్, ఖారూన్‌ల వద్దకు పంపాము. కాని వారేమో, 'ఇతను మాంత్రికుడు! అసత్యవాది!' అని ఎద్దేవా చేశారు.

25. మరి అతను మా తరఫు నుండి సత్యాన్ని తీసుకుని వారి వద్దకు చేరుకున్నప్పుడు వారిలా అన్నారు : 'అతనితో చేరి విశ్వసించిన వారి కుమారులను వధించి, వారి స్త్రీలను మాత్రం బ్రతకనివ్వండి.' అయితే సత్య తిరస్కారుల ఎత్తుగడలన్నీ నిర్వీర్యమైపోయాయి.

26. ఫిరౌన్ ఇలా అన్నాడు : 'నన్నొదలండి. నేను మూసాను హతమారుస్తాను. అతను తన ప్రభువును పిలుచుకోమనండి! అతను మీ మతధర్మాన్ని ఎక్కడ మార్చివేస్తాడో, లేక రాజ్యంలో ఎక్కడ అస్థిరతను సృష్టిస్తాడోనని నేను భయపడుతున్నాను.' 27. మూసా ఈ విధంగా అన్నాడు: 'లెక్కల దినాన్ని విశ్వసించని ప్రతి దురహంకారి బారినుండి రక్షణకై నేను నాకూ, మీకూ ప్రభువైన వాని శరణు వేడుతున్నాను.'

28. అప్పటి వరకు తన విశ్వాసాన్ని గోప్యంగా ఉంచిన ఫిరౌన్ వంశీయుడయిన ఒక విశ్వాసి ఇలా అన్నాడు : 'ఏమిటి, ఒక వ్యక్తి "అల్లాహ్‌యే నా ప్రభువు" అన చెప్పినంతమాత్రానికే మీరతన్ని చంపేస్తారా? చూడబోతే అతను మీ ప్రభువు తరఫు నుండి స్పష్టమయిన నిదర్శనాలను కూడా తీసుకు వచ్చాడు. ఒకవేళ అతను అబద్ధీకుడై ఉంటే అతని అబద్ధం (ఆ పాపఫలం) అతని మీదే పడుతుంది. ఒకవేళ అతను చెప్పేది నిజమైతే, అతను మీకు చేసే వాగ్దానం (హెచ్చరిక) లో కొంత భాగం మీకు తప్పక చుట్టుముట్టుతుంది. నిశ్చయంగా అల్లాహ్ హద్దుమీరి పోయేవాడికి, అబద్ధాలకోరుకి సన్మార్గం చూపడు. 29. నా జాతి వారలారా! ఈ రోజు రాజ్యాధికారం మీది. రాజ్యంలో మీకు తిరుగులేని ఆధిక్యత ఉంది. సరేగాని అల్లాహ్ తరఫున విపత్తు వచ్చిపడినపుడు, మనల్ని ఆదుకునే వాడెవడో చెప్పండి.' ఫిరౌన్ ఇలా చెప్పాడు: 'నాకు సమంజసంగా తోచిన అభిప్రాయమే మీ ముందుంచాను. సరైన మార్గం వైపునకే నేను మీకు దర్శకత్వం వహిస్తున్నాను.'

30. విశ్వసించిన ఆ వ్యక్తి ఇలా అన్నాడు : 'నా జాతి ప్రజలారా! పూర్వీకులైన జన సమూహాలపై వచ్చిన (గడ్డు) దినం లాంటిదే మీపై

వచ్చిపడుతుందేమోనని నాకు భయంగా ఉంది. 31. అంటే – నూహ్ జాతి వారికి, ఆద్ సమూదు వారికి, ఆ తరువాత వారికి ఎదురైనదే (మీకూ ఎదురవుతుందేమో!) తన దాసులకు అన్యాయం చేయాలన్న ఉద్దేశం అల్లాహ్కు ఎంతమాత్రం లేదు. 32. మీపై, కేకలు పెట్టి కలకలం రేపే దినం రావచ్చేమోనని కూడా నేను భయపడుతున్నాను. 33. ఆ రోజు మీరు వెన్నుచూపి పారిపోతారు. మిమ్మల్ని దేవుని నుండి కాపాడే వాడెవడూ ఉండడు. దేవుడు అపమార్గం పట్టించిన వానికి సన్మార్గం చూపేవాడెవడూ ఉండడు.

34. ఇంతకు మునుపు యూసుఫ్ కూడా మీ వద్దకు చాలా స్పష్టమయిన ప్రమాణాలను తీసుకువచ్చాడు. ఆయన తెచ్చిన సందేశాలపై కూడా మీరు సంశయంలోనే పడ్డారు. చివరకు ఆయన మరణించినపుడు, "ఇక ఈయన తదనంతరం దేవుడు ఏ ప్రవక్తనూ పంపబోడు" అని మీరన్నారు. ఈ విధంగా అల్లాహ్ హద్దులను అతిక్రమించేవారిని, అనుమానాల అయ్యలను మార్గభ్రష్టుల్ని చేసేస్తాడు.' 35. తమ వద్ద ప్రమాణబద్ధమైన ఏ ఆధారమూ లేకపోయినప్పటికీ దైవసూచనల విషయంలో వాదులాడే వారి ధోరణి అల్లాహ్ మరియు విశ్వాసుల దృష్టిలో తీవ్రంగా గర్హించదగినది. ఈ విధంగా అల్లాహ్ దురహంకారి, బలాత్కారి అయిన ప్రతి వ్యక్తి హృదయంపై సీలు వేసేస్తాడు.

36. ఫిరౌన్ ఇలా అన్నాడు : "హామాన్! నా కోసం ఓ ఎత్తయిన కట్టడాన్ని నిర్మించు. తద్వారా నేను ఆ మార్గాల వరకు చేరుకుంటానేమో! 37 – ఆకాశమార్గాల వరకు! బహుశా మూసా దేవుణ్ణి తొంగిచూడగలనేమో! నేనైతే ఇతన్ని ఒక అసత్యవాదిగా భావిస్తున్నాను' – ఈ విధంగా ఫిరౌన్ కొరకు అతని దుష్కర్మ అందమైనదిగా చేయబడింది. అతను సరైన మార్గం నుండి ఆపివేయబడ్డాడు. ఫిరౌన్ పన్నిన పన్నాగం సర్వనాశనమైపోయింది.

38. విశ్వాసి అయిన ఆ వ్యక్తి ఇలా అన్నాడు : 'నా జాతివారలారా! మీరు నన్ను అనుసరించండి. నేను మీకు సరైన బాట చూపిస్తున్నాను.

39. నా జాతి ప్రజలారా! ఈ ప్రాపంచిక జీవితం కొన్నాళ్ళదే. శాశ్వతంగా నిలిచే స్థలమైతే పరలోకమే. 40. ఎవరయినా చెడు చేస్తే దానికి తగిన దుష్ఫలితమే ఉంటుంది. మరెవరయినా మంచిచేస్తే – అతను పురుషుడయినా, స్త్రీ అయినా – విశ్వసించిన వారై ఉంటే, ఇలాంటి వారే స్వర్గంలో ప్రవేశిస్తారు. వారక్కడ లెక్కలేనంత ఉపాధిని పొందుతారు. 41. నా జాతి జనులారా! నేను మిమ్మల్ని మోక్షం వైపు పిలుస్తుంటే మీరు నన్ను అగ్ని వైపు పిలుస్తారేమిటి? 42. నేను అల్లాహ్‌ను తిరస్కరించాలని, నేనెరుగని వాటిని ఆయనకు సహవర్తులుగా నిలబెట్టాలని మీరు నన్ను పిలుస్తున్నారు. అదే సమయంలో నేను మిమ్మల్ని శక్తిశాలి, క్షమాశీలి వైపు ఆహ్వానిస్తున్నాను. 43. మీరు నన్ను దేనివైపు పిలుస్తున్నారో దాని స్పందన ఏదీ ఇహలోకంలోగానీ, పరలోకంలో గానీ ఎంతమాత్రం లేదు. ఇది నిశ్చయం. మనమంతా మరలిపోవలసింది అల్లాహ్ వైపునకే. హద్దుమీరిపోయేవారే నరకాగ్ని వాసులవుతారు. 44. నా పలుకులను మీరు మున్ముందు నెమరువేసుకుంటారు. నేను మాత్రం నా వ్యవహారాన్ని దైవాధీనం చేస్తున్నాను. నిశ్చయంగా దేవుడు తన దాసులను గమనిస్తూనే ఉన్నాడు.'

45. తరువాత అల్లాహ్ అతనిని వారి కుతంత్రాల కీడు నుండి రక్షించాడు. కాగా; ఫిరౌనీయులను ఘోర విపత్తు చుట్టుముట్టింది. 46. అగ్ని ముందు వారు ఉదయం, సాయంత్రం హాజరుపరచబడుతుంటారు. ప్రళయం నెలకొన్న నాడు 'ఫిరౌనీయులను కఠిన శిక్షకు ఆహుతి చేయండి' (అని ఆదేశించబడుతుంది).

47. వారు నరకంలో పరస్పరం వాదులాటకు దిగినపుడు బలహీన వర్గాలవారు అగ్రజులను ఉద్దేశించి, 'మేము మీకు లోబడి మసలుకునేవారం కదా! మరి ఇప్పుడు అగ్నిలో ఏ కాస్తయినా మానుండి తొలగించగలరా?' అని అడుగుతారు. 48. సమాధానంగా అగ్రజులంటారు : 'మనమంతా ఈ అగ్ని (యాతన)లోనే ఉన్నాము కదా! అల్లాహ్ తన దాసుల మధ్య,

న్యాయనిర్ణయం చేసేశాడు (ఇక మనం చేయగలిగిందేమీ లేదు).' 49. అప్పుడు నరకాగ్నిలో కాలుతున్నవారు, నరక పాలకులను ఉద్దేశించి, 'మా యాతనను కనీసం ఒక్క రోజైనా తగ్గించమని కాస్త మీ ప్రభువుకు విజ్ఞప్తి చేయండి బాబూ!' అని ప్రాధేయపడతారు. 50. దానికి వారు, 'ఏమిటి, మీ దగ్గరకు దైవప్రవక్తలు స్పష్టమయిన నిదర్శనాలతో సహా రాలేదా?' అని అడుగుతారు. 'ఎందుకు రాలేదు? (వచ్చారు)' అని వారు సమాధానమిస్తారు. 'అలాగైతే మీరే విజ్ఞప్తి చేసుకోండి' అని నరక పాలకులు చెబుతారు. మొత్తానికి తిరస్కారుల మొరలు పనికిరాకుండా పోతాయి.

51. నిశ్చయంగా మేము మా ప్రవక్తలకు, విశ్వాసులకు ప్రాపంచిక జీవితంలోనూ సహాయపడతాము. సాక్షులు నిలబడే రోజున కూడా (సహాయపడతాము). 52. ఆ రోజు దుర్మార్గులకు వారి సంజాయిషీ ఏమాత్రం ఉపకరించదు. వారిపై శాపం ఉంటుంది. వారి కోసం దుర్భరమయిన నివాస స్థానం ఉంటుంది. 53. నిజానికి మేము మూసాకు మార్గదర్శనం చేశాము. ఇస్రాయీల్ సంతతి వారిని గ్రంథానికి వారసులుగా చేశాము. 54. విజ్ఞులకు మార్గదర్శినిగా, ఉపదేశంగా! 55. కనుక (ఓ ప్రవక్తా!) నీవు నిగ్రహం పాటించు. నిశ్చయంగా దైవవాగ్దానం సత్యం. నీ తప్పుల మన్నింపుకై ప్రార్థించు. సాయం సమయంలోనూ, ప్రభాత సమయంలోనూ నీ ప్రభువు పవిత్రతను కొనియాడుతూ, కీర్తిస్తూ ఉండు.

56. ఎవరయితే అల్లాహ్ సూచనల విషయంలో – తమ దగ్గరకు ఎలాంటి ప్రమాణం రాకపోయినప్పటికీ – వాదులాడుతున్నారో వారి అంతర్యాలలో కేవలం బడాయి తిష్ఠవేసింది. అందాక వారు ఎప్పటికీ చేరుకోలేరు కూడా. కనుక నీవు అల్లాహ్ శరణు వేడుకో! నిశ్చయంగా ఆయన అంతా వినేవాడు, అన్నింటినీ చూస్తున్నవాడు.

57. నిశ్చయంగా భూమ్యాకాశాల సృష్టి మానవ సృష్టికన్నా పెద్ద (కఠినమైన) పని. కాని చాలామంది దీనిని తెలుసుకోరు. 58. గుడ్డివాడు – కళ్ళున్నవాడు సమానులు కాలేరు. అలాగే విశ్వసించి మంచిపనులు చేసే వారూను, దుర్వర్తనులూను (సమానులు కాలేరు). కాని మీరు ఆలోచించేది

చాలా తక్కువ. 59. నిశ్చయంగా ప్రళయం రావటం తథ్యం. ఇందులో సందేహానికి తావే లేదు. కాని చాలామంది నమ్మరు.

60. మీ ప్రభువు ఇలా సెలవిచ్చాడు : 'మీరు నన్నే పిలవండి. నేను మీ విజ్ఞప్తిని ఆమోదిస్తాను. నా ఆరాధన పట్ల అహంకారం ప్రదర్శించేవారు, అతిత్వరలోనే అవమానితులై నరకంలో ప్రవేశిస్తారు. 61. అల్లాహ్‌యే మీ కొరకు రాత్రిని చేశాడు – మీరందులో విశ్రాంతి పొందాలని. పగటిని ప్రకాశమానంగా చేశాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రజల యెడల అనుగ్రహశాలి. కాని ప్రజలలో చాలామంది కృతజ్ఞత తెలుపుకోరు. 62. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. ప్రతి దానినీ సృష్టించేవాడు. ఆయన తప్ప మరో దేవుడు లేడు. మరి మీరు ఎటు నుండి మళ్ళించబడుతున్నారు? 63. ఇదేవిధంగా దైవసూచనలను నిరాకరించేవారు కూడా (నిజ ప్రభువు నుండి) మళ్ళించబడేవారు.

64. అల్లాహ్‌యే మీ కొరకు భూమిని స్థిరపడే స్థలంగా చేశాడు. ఆకాశాన్ని పందిరిగా నిర్మించాడు. మీ రూపకల్పన చేశాడు. మీకు అత్యుత్తమమైన ఆకృతిని ప్రసాదించాడు. ఆయన మీకు స్వాదిష్టమయిన (పరిశుద్ధమయిన) పదార్థాలను ఉపాధిగా ప్రసాదించాడు. ఈ అల్లాహ్‌యే మీ ప్రభువు. లోకేశ్వరుడైన అల్లాహ్ శుభకరుడు. 65. ఆయన సజీవుడు, నిత్యుడు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేనే లేదు. కనుక మీరు మీ ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకించుకుంటూ ఆయనను వేడుకొనండి. సర్వస్తోత్ర ములు సర్వలోక ప్రభువైన అల్లాహ్‌కే చెందుతాయి.

66. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'అల్లాహ్‌ను కాదని మీరు మొరపెట్టుకునే వాటిని ఆరాధించటం నుండి నేను వారించబడ్డాను. దీనికి సంబంధించి నా వద్దకు నా ప్రభువు తరఫు నుండి నిదర్శనాలు వచ్చి ఉన్నాయి. సకల లోకాల ప్రభువుకే ఆత్మ సమర్పణ చేసుకోవాలని నాకు ఆజ్ఞ అయింది. 67. ఆయనే మిమ్మల్ని మట్టితో సృష్టించాడు. తరువాత వీర్య బిందువుతో, ఆ తరువాత నెత్తుటి గడ్డతో, ఆ తరువాత శిశువు రూపంలో మిమ్మల్ని

బయటికి తీస్తున్నాడు. ఆ తరువాత ఆయన మీకు ఎదుగుదలను ఇస్తున్నాడు – మీరు దృఢమయిన యౌవనానికి చేరాలని, పిమ్మట వృద్ధాప్యానికి చేరుకోవాలనీని! మీలోని ఒకడు దానికి ముందే మరణిస్తాడు – నిర్ధారించబడిన సమయానికి చేరుకునేందుకు! మీరు అర్థం చేసుకుంటారని (ఇదంతా మీకు విశదీకరించబడుతోంది).

68. ఆయనే జీవన్మరణాల ప్రదాత. ఆయన ఏ విషయంలోనయినా ఒక నిర్ధారణకు వచ్చినప్పుడు, దానినుద్దేశించి 'అయిపో' అంటాడు. అంతే! అది అయిపోతుంది.

69. దైవసూచనల విషయంలో వితండవాదన చేసేవారిని నీవు చూడలేదా? వారెక్కడి నుండి దారి మళ్ళించబడుతున్నట్టు? 70. ఎవరయితే గ్రంథాన్ని, మేము మా ప్రవక్తలకు ఇచ్చి పంపిన దానిని కూడా అసత్యంగా ముద్రవేసి త్రోసిపుచ్చారో, వారు అనతి కాలంలోనే (తమ పరిణామాన్ని) తెలుసుకుంటారు. 71. అప్పుడు వారి మెడలలో పట్టాలు, సంకెళ్ళు ఉంటాయి. వారు ఈడ్వబడతారు – 72 మరిగే నీళ్ళలోనికి. తరువాత వారు నరకాగ్నిలోనికి త్రోయబడతారు. 73. మరి వారితో ఇలా అనబడుతుంది : 'మీరు చేర్చిన ఆ భాగస్వాములు ఎక్కడున్నారు? 74 అల్లాహ్‌ను కాదని!' వారిలా అంటారు : 'వారు మా నుండి మటుమాయం అయిపోయారు. మేమసలు లోగడ ఎవరినీ (దేనినీ) మొరపెట్టుకోనేలేదు.' ఈ విధంగా అల్లాహ్ సత్యతిరస్కారులను మార్గభ్రష్టుల్ని చేస్తాడు. 75. మీరు భువిలో అకారణంగా ఉబ్బితబ్బిబ్బవుతూ, అహంకారంతో విర్రవీగినందుకు తగిన శాస్తి ఇది. 76. నరక ద్వారాలలో ప్రవేశించండి – శాశ్వతంగా అందులోనే ఉందురుగాని. గర్విష్టుల ఈ నివాస స్థలం ఎంత చెడ్డది?!

77. కనుక (ఓ ప్రవక్తా!) ఓర్పు వహించు. నిశ్చయంగా అల్లాహ్ వాగ్దానం సత్యం. మేము వారికి చేసిన (శిక్షా) వాగ్దానాలలో కొంతభాగం నీకు చూపించినా లేదా నీకు మరణమొసగినా – వారు మరలి రావలసినది మాత్రం మా వద్దకే కదా!

78. నిజానికి మేము నీకు పూర్వం ఎంతోమంది ప్రవక్తలను పంపి ఉన్నాము. వారిలో కొందరి స్థితిగతులను మేము నీకు వినిపించాము. మరికొందరి స్థితిగతులను నీకు వినిపించలేదు. అల్లాహ్ ఆనతి లేకుండా మహిమలను తీసుకువచ్చే అధికారం ఏ ప్రవక్తకూ లేకుండింది. పిమ్మట అల్లాహ్ ఆజ్ఞ వచ్చేసినపుడు న్యాయబద్ధంగా తీర్పు జరిగిపోయింది. అప్పుడు అసత్యవాదులు నష్టంలో ఉండిపోయారు.

79. అల్లాహ్‌యే మీ కొరకు పశువులను సృష్టించాడు. వాటిలో కొన్నింటిపై మీరు స్వారీ చేస్తారు. మరి కొన్నింటిని మీరు తింటారు కూడా. 80. వాటిలో మీకు ఇతరత్రా ప్రయోజనాలు కూడా ఉన్నాయి. వాటిద్వారా మీరు మీ మనసులలో ఉన్న అక్కరలను సాధించటానికి (కూడా మేము వీటిని మీ అధీనంలో ఉంచాము). వీటి మీద, ఓడల మీద మీరు ప్రయాణం కూడా చేస్తారు. 81. ఈ విధంగా ఆయన మీకు తన సూచనలను చూపిస్తున్నాడు. మరైతే మీరు అల్లాహ్ సూచనలలో వేటిని నిరాకరించగలరు?

82. ఏమిటి, వారు భూమిలో సంచరించి, తమకు పూర్వం గడచిన వారికి పట్టిన గతేమిటో గమనించటం లేదా? వారు వీరికన్నా అధిక సంఖ్యలో ఉండేవారు. బలపరాక్రమాల దృష్ట్యా కూడా వీరికన్నా గట్టివారే. భువిలో ఎన్నో పురావస్తు చిహ్నాలను కూడా వదలివెళ్ళారు. అయితే వారు సంపాదించినది వారికి ఏమీ పనికి రాలేకపోయింది. 83. వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చినపుడు, వారు తమ వద్ద ఉన్న జ్ఞానసంపదను చూసుకుని మురిసిపోయారు. కడకు వారు దేనిని పరిహసించారో అదే వారిపై విరుచుకుపడింది. 84. తీరా వారు మా శిక్షను చూసుకున్నప్పుడు, 'మేము ఒక్కడయిన అల్లాహ్‌ను విశ్వసించాము. ఆయనకు సహవర్తులుగా ఎంచిన వాటన్నింటినీ తిరస్కరిస్తున్నాము' అన్నారు. 85. కాని మా శిక్షను ప్రత్యక్షంగా చూశాక, వారు ప్రకటించిన విశ్వాసం వారికేవిధంగానూ పనికి రాలేదు. ఇదే అల్లాహ్ సంప్రదాయం. ఇది (యుగయుగాలుగా) ఆయన దాసుల మధ్య కొనసాగుతూ ఉంది. అప్పుడేమో సత్యతిరస్కారులు (టోకుగా) నష్టపోయారు.

# 41. ఫుస్సిలత్ (విపులీకరించబడినవి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా – మీమ్. 2. ఇది అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడైన వాని తరఫున అవతరింపజేయబడిన వాక్కు. 3. ఇదొక గ్రంథం. దీని వచనాలు స్పష్టంగా విడమరచి చెప్పబడ్డాయి – అరబీ ఖుర్‌ఆన్‌గా! విషయ పరిజ్ఞానం గల జనుల కోసం!! 4. ఇది శుభవార్తను ఇచ్చేదిగా, హెచ్చరిక చేసేదిగా ఉంది. అయినప్పటికీ వారిలోని చాలామంది దీనికి విముఖులయ్యారు. అందుకే వారు దీనిని వినటం లేదు. 5. వారు ఈ విధంగా అన్నారు : 'ఏ విషయాల వైపు నీవు మమ్మల్ని పిలుస్తున్నావో వాటిపట్ల మా హృదయాలపై తెరలున్నాయి. మా చెవులు మొద్దుబారి ఉన్నాయి. నీకూ – మాకూ మధ్య ఒక అడ్డుతెర ఉంది. కాబట్టి నీ పనేదో నువ్వు చేసుకో. మేము మా పని చేసుకుంటాము.'

6. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'నేనూ మీలాంటి మానవమాత్రుణ్ణే. మీ అందరి ఆరాధ్య దైవం ఒకే దైవమని నా వద్దకు సందేశం వస్తుంది. కనుక మీరంతా ఆయన వైపునకే తిరిగి నిలబడాలని, క్షమాపణ కొరకు ఆయన్నే వేడుకోవాలని నాకు వహీ ద్వారా తెలుపబడింది.' ముష్రిక్కులకు వినాశం తథ్యం. 7. వారు జకాత్ ఇవ్వరు. వారు పరలోకాన్ని తిరస్కరిస్తారు. 8. నిశ్చయంగా విశ్వసించి, మంచి పనులు చేసిన వారికి ఎన్నటికీ ఎడతెగని ప్రతిఫలం ఉంటుంది.

9. వారిని అడుగు : 'ఏమిటి, కేవలం రెండు రోజులలో భూమిని సృష్టించిన వానినే మీరు కాదంటున్నారా? ఇతరులను ఆయనకు సహవర్తులుగా ఎంచుతున్నారా? ఆయన సకల లోకాలకు ప్రభువు.' 10. ఆయన భూమిలోపల దానిపై నుండి పర్వతాలను ప్రతిష్ఠించాడు. అందులో

లాభదాయకమయిన వస్తువులను పొందుపరిచాడు. అందులో ఆహార వస్తువులను కూడా నాలుగు రోజులలో నిక్షిప్తం చేశాడు. ప్రశ్నించేవారికి ఇది సరిపోతుంది. 11. తరువాత ఆయన ఆకాశం వైపు దృష్టిని సారించాడు. అది పొగ మాదిరిగా ఉండేది. ఆయన దానినీ, భూమినీ ఉద్దేశించి, 'మీకు ఇష్టమున్నాసరే, ఇష్టం లేకున్నాసరే (ఉనికిలోకి) వచ్చేయండి' అని ఆదేశించాడు. 'చిత్తం! మేమిద్దరం ఇష్టపూర్వకంగా వచ్చేశాం' అని అవి పలికాయి. 12. తరువాత ఆయన రెండు రోజులలో దానిని సప్తాకాశాలుగా స్థాపించాడు. ప్రతి ఆకాశంలోనూ తన ఆజ్ఞను పంపాడు. ఇంకా మేము క్రింది ఆకాశాన్ని అద్భుతమైన దీపాలతో అలంకరించాము. దానిని (సర్వవిధాలా) సురక్షితం గావించాము. ఇదంతా శక్తిమంతుని, వివేకవంతుని ప్రణాళికా రచన.

13. ఒకవేళ వారు అప్పటికీ విముఖంగా ఉంటే వారితో ఇలా అను: 'ఆద్ సమూద్ వారిపై అకస్మాత్తుగా విరుచుకుపడిన విపత్తులాంటి దానిని గురించి నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. 14. వారివద్దకు దైవప్రవక్తలు వారి ముందు నుండి, వారి వెనుక నుండీ వచ్చి, 'అల్లాహ్‌ను తప్ప వేరెవరినీ ఆరాధించకండి' అని ఉపదేశించినపుడు వారిలా అన్నారు : 'మా ప్రభువే గనక తలచుకుంటే ఇందు నిమిత్తం దైవదూతలనే పంపి ఉండేవాడు. కాబట్టి మీకిచ్చి పంపబడిన దానిని మేము తిరస్కరిస్తున్నాము.'

15. ఇక ఆద్ వారి పరిస్థితి ఎలాంటిదంటే; వారు భువిలో అన్యాయంగా అహంకారం చూపారు. 'బలపరాక్రమాలలో మమ్మల్ని మించిన మగధీరుడు ఎవడు?' అని సవాలు విసిరారు. ఏమిటి, వారిని సృష్టించిన దేవుడు వారికన్నా ఎంతో బలశాలి అన్న దానిని వారు గమనించటం లేదా? ఆ విధంగా వారు మా సూచనలను (ఆఖరి వరకూ) తిరస్కరిస్తూనే ఉన్నారు. 16. అందుచేత మేము కొన్ని దుర్దినాలలో వారిపై ఓ ప్రచండమయిన

పెనుగాలిని పంపాము – తద్వారా వారికి ప్రాపంచిక జీవితంలోనే అవమానకరమయిన శిక్షను రుచి చూపించాలని. పరలోక శిక్ష ఇంతకన్నా అవమానకరమయినది సుమా! వారికి (అక్కడ) ఎలాంటి సహాయం అందదు. 17. ఇక సమూద్ విషయానికి వస్తే, మేము వారికి సన్మార్గం చూపాము. అయితే వారు సన్మార్గానికి బదులు అంధత్వాన్నే ఇష్టపడ్డారు. అందుచేత వారి దౌష్ట్యాల కారణంగా అవమానకరమయిన పిడుగు శిక్ష వారిని అమాంతం కబళించింది. 18. మరైతే మేము విశ్వసించి, భక్తిపరులుగా మసలుకునే వారిని (ఆ ఘోర విపత్తు నుండి) కాపాడాము.

19. దైవ విరోధులు నరకం వైపు సమీకరించబడిననాడు, వివిధ జట్లుగా విభజించబడతారు. 20. కడకు వారు దానిని సమీపించినపుడు వారి చెవులు, వారి కళ్ళు, వారి చర్మాలు వారి కర్మలను గురించి – వారికి వ్యతిరేకంగా – సాక్ష్యమిస్తాయి. 21. 'మీరు మాకే వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చారేమిటి?' అని వారు తమ చర్మాలను అడిగితే, అవి ఇలా చెబుతాయి : 'ప్రతి దానికీ మాట్లాడే శక్తిని ప్రసాదించిన దేవుడే మాకూ మాట్లాడటం నేర్పాడు. ఆయనే మిమ్మల్ని తొలిసారి సృష్టించాడు. ఆయన వద్దకే మీరు రప్పించబడ్డారు. 22. మీరు గుట్టుగా (చెడులకు) పాల్పడుతున్నప్పుడు మీ చెవులు, మీ కళ్ళు, మీ చర్మాలు మీకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయన్న ధ్యాసే మీకు లేకపోయింది. పైపెచ్చు మీరు చేసే ఎన్నో పనులు దైవానికి తెలియవని మీరు అనుకునేవారు. 23. మీ ప్రభువు గురించి మీరు చేసిన ఈ తలంపే మిమ్మల్ని సర్వనాశనం చేసింది. ఆ విధంగా మీరు నష్టపోయిన వారయ్యారు.' 24. ఇక వారు సహనం వహించినా (ప్రయోజనం లేదు) నరకమే వారి నివాసం. ఒకవేళ వారు క్షమాభిక్ష కోసం నివేదించుకున్నా వారికి క్షమాభిక్ష లభించదు.

25. మేము వారికి తోడుగా కొంతమంది దుష్ట సావాసులను

నియమించాము. వారేమో వారికి ముందూ, వారికి వెనుకా ఉన్న ప్రతి దానిని అందమైనదిగా చిత్రీకరించారు. వీరికి పూర్వం గడచిన జిన్నుల, మానవ సమూహాల విషయంలో ఖరారయిన దైవవాక్కే వీరి వ్యవహారంలో కూడా ఖరారయింది. ఖచ్చితంగా వారు నష్టపోవలసిన వారే.

26. తిరస్కార వైఖరికి ఒడిగట్టిన వారిలా అన్నారు : 'ఈ ఖుర్‌ఆన్‌ను అస్సలు వినకండి. అందులో అంతరాయం కలిగించండి – అలా చేశారంటే మీరు విజయం సాధిస్తారు.' 27. కనుక తిరస్కారులకు మేము కఠిన శిక్షను చవిచూపిస్తాము. వారు చేసుకున్న దానికి తగిన దుష్ఫలితం వారికి తప్పక ఇస్తాము. 28. దైవ విరోధులకు తగిన ప్రతిఫలం ఈ నరకాగ్నే. వారి కోసం శాశ్వత నివాసం అందులోనే ఉంటుంది. వారు మా సూచనలను త్రోసిపుచ్చుతూ వచ్చిన దానికి తగిన ప్రతిఫలం అది!

29. తిరస్కార వైఖరికి ఒడిగట్టిన వారిలా అంటారు : 'మా ప్రభూ! జిన్నులలో, మనుషులలో ఎవరెవరు మమ్మల్ని అపమార్గం పట్టించారో కాస్త మాకు చూపించు. మేము వాళ్ళను పడవేసి మా కాళ్ళక్రింద తొక్కుతాము – అలాగయినా వారు పరాభవంతో అట్టడుగు స్థానానికి దిగజారుతారు.' 30. ఎవరయితే 'అల్లాహ్‌యే మా ప్రభువు' అని పలికి, తరువాత దానిపై స్థిరంగా ఉంటారో అలాంటి వారిపై దైవదూతలు అవతరించి ఇలా అంటారు: 'మీరు భయపడకండి. ఆవేదన చెందకండి. మీకు వాగ్దానం చేయబడిన స్వర్గలోక శుభవార్తను అందుకుని సంతోషించండి. 31. ప్రాపంచిక జీవితంలో కూడా మేము మీకు అండగా ఉన్నాము, పరలోకంలో కూడా (ఉంటాము). అక్కడ మీకు మీ మనసు కోరినదల్లా ప్రాప్తిస్తుంది. మీరు అడిగినదల్లా అక్కడ మీ కోసం సిద్ధంగా ఉంటుంది – 32. క్షమాశీలి, దయాశీలి అయిన వాని తరపున ఆతిథ్యంగా!'

33. అల్లాహ్ వైపు (సర్వ జనులను) పిలుస్తూ, సత్క్రియలాచరిస్తూ,

'నేను దైవ విధేయులలో ఒకడను' అని పలికేవాని మాటకన్నా మంచి మాట మరెవరిది కాగలదు? 34. మంచి – చెడు ఎన్నటికీ సమానం కాజాలవు. నీవు (చెడుకు) సమాధానం దానికన్నా మేలైన విధంగా ఇవ్వు. ఆ తర్వాత నువ్వే చూస్తావు! నీకు బద్ధ విరోధిగా ఉన్న వ్యక్తి నీ ఆత్మీయ మిత్రుడైపోతాడు. 35. అయితే ఈ భాగ్యం సహనమూర్తులకు మాత్రమే లభిస్తుంది. ఈ అనుగ్రహం గొప్ప అదృష్టవంతులకు మాత్రమే వరిస్తుంది. 36. ఒకవేళ షైతాన్ నీ మనసులో ఏదన్నా శంకను నూరిపోస్తే, నీవు అల్లాహ్ శరణు వేడుకో. నిశ్చయంగా ఆయన అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు.

37. రేయింబవళ్ళు, సూర్యచంద్రులు కూడా ఆయన సూచనల లోనివే. కనుక మీరు సూర్యునికి, చంద్రునికి సాష్టాంగపడకండి. వాటన్నింటినీ సృష్టించిన అల్లాహ్‌కు మాత్రమే సాష్టాంగపడండి. మీరు నిజంగా ఆయన్ని ఆరాధించేవారైతే (మీరు ఈ ఆజ్ఞను శిరసావహించాలి). 38. ఒకవేళ వారు అహంకారంతో విర్రవీగితే, నీ ప్రభువు సమీపంలో ఉన్నవారు అహోరాత్రులు ఆయన పవిత్రతను కొనియాడుతున్నారు (అన్న సంగతి మరువకు). ఇలా చేస్తూ వారు ఎప్పటికీ అలసిపోరు.

39. ఆయన (శక్తి) సూచనలలో ఒకటేమిటంటే; నేల అణగారిన స్థితిలో ఉండటం నీవు చూస్తావు. తరువాత మేము దానిపై వర్షపు నీటిని కురిపించగానే అది పులకిస్తుంది, ఉబికి వస్తుంది. నిశ్చయంగా ఈ నేలను బ్రతికించినవాడే మృతులను కూడా బ్రతికిస్తాడు. నిశ్చయంగా ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు. 40. ఎవరయితే మా వచనాలకు పెడర్థాలు తొడిగిస్తారో, వారు మా నుండి దాగిలేరు. చెప్పండి! నరకాగ్నికి ఆహుతి చేయబడేవాడు మేలా? లేక ప్రళయదినాన సురక్షితంగా హాజరయ్యేవాడు మేలా? మీరు కోరుకున్నదల్లా చేసుకోండి. మీరు చేసేదంతా ఆయన చూస్తూనే ఉన్నాడు.

41. ఎవరయితే తమ వద్దకు ఉపదేశం (ఖుర్ఆన్) వచ్చినపుడు

దానిని తిరస్కరిస్తారో (వారు ఖచ్చితంగా నష్టపోతారు). నిశ్చయంగా ఇది చాలా శక్తిమంతమైన గ్రంథం. 42. ఇందులోనికి అధర్మం దాని ముందు నుండిగానీ, దాని వెనుక నుండి గానీ జొరబడజాలదు. ఇది వివేకవంతుని, ప్రశంసనీయుని తరఫున అవతరింపజేయబడినది. 43. నీకు పూర్వం గడచిన ప్రవక్తలతో చెప్పబడిన విషయాలే నీకూ చెప్పబడుతున్నాయి. నిశ్చయంగా నీ ప్రభువు క్షమ కలవాడు. కఠినాతి కఠినంగా శిక్షించేవాడు కూడా.

44. ఒకవేళ మేమే గనక దీనిని అరబ్బేతర ఖుర్‌ఆన్‌గా చేసి ఉంటే, 'దీని వాక్యాలు క్షుణ్ణంగా ఎందుకు విశదీకరించబడలేదు? గ్రంథమేమో అరబ్బేతరమైనదీను, జనులేమో అరబ్బులా!?' అని వారు అనేవారు. వారికి చెప్పు : 'ఇది విశ్వసించిన వారి పాలిట మార్గదర్శిని, వ్యాధి నివారిణి. కాని విశ్వసించని వారి చెవులలో బరువు (చెవుడు) ఉంది. వారి పాలిట ఇది అంధత్వం. వీరు బహు దూరస్థలం నుండి పిలువబడుతున్నట్టున్నారు.

45. మేము మూసాకు గ్రంథం ప్రసాదించగా, అందులోనూ విభేదం సృష్టించటం జరిగింది. నీ ప్రభువు తరఫు నుండి ముందే ఒక విషయం నిర్ధారించబడకుండా ఉన్నట్లయితే, వీళ్ళ మధ్య ఎప్పుడో తీర్పు జరిగిపోయి ఉండేది. వీళ్ళేమో దాని గురించి తీవ్రంగా వ్యాకులపరిచే సందేహంలో పడి ఉన్నారు. 46. ఎవరయినా సత్కార్యం చేస్తే అతను తన స్వయం కోసమే చేసుకుంటాడు. మరెవరయినా చెడు చేస్తే దాని దుష్ఫలితం అతని మీదే పడుతుంది. నీ ప్రభువు తన దాసులకు అన్యాయం చేసేవాడు మాత్రం కాడు.

◆ (25) 47.ప్రళయజ్ఞానం మాత్రం అల్లాహ్‌కు సంబంధించినదే. ఆయనకు తెలియకుండా ఏ ఫలమూ తన పుష్పకోశం నుండి బయటికి రాదు, ఏ స్త్రీ కూడా గర్భవతి కావటంగానీ, ప్రసవించటంగానీ జరగదు. 'మీరు కల్పించిన నా సహవర్తులు ఎక్కడ?' అని అల్లాహ్ ఎలుగెత్తి పిలిచిన

రోజు, '(మహాప్రభూ!) మాలో ఎవడూ దీనికి సంబంధించిన సాక్ష్యమిచ్చేవాడు లేడు' అని మేము నీకు విజ్ఞప్తి చేసుకుంటున్నాము' అని వారు సమాధాన మిస్తారు. 48. అంతకు ముందు వారు మొరపెట్టుకునేవారంతా వారి నుండి అదృశ్యమైపోతారు. తాము తప్పించుకునే దారి ఏదీ లేదని వారు అర్థం చేసుకుంటారు.

49. మానవుడు మేలు కొరకు అర్థిస్తూ ఎన్నటికీ అలసిపోడు. కాని అతనికేదయినా కీడు కలిగితే మాత్రం ఆశ వదులుకుంటాడు, భగ్న హృదయుడైపోతాడు. 50. ఒకవేళ అతనికి కలిగే బాధ తరువాత మేమతనికి మా కారుణ్యం రుచి చూపిస్తే 'అది నాకు చెందవలసిన హక్కే. ప్రళయం వస్తుందని నేనైతే అనుకోను. ఒకవేళ నేను నా ప్రభువు వైపు మరల్చబడినా, ఆయన సన్నిధిలో కూడా నాకు మంచి స్థానమే ఉంటుంది' అనంటాడు. కనుక మేము ఈ తిరస్కారులకు వారు చేసుకున్న కర్మలను తప్పక తెలియపరుస్తాము. వారికి కఠోరమైన యాతనను రుచి చూపిస్తాము.

51. మేము మానవుణ్ణి కటాక్షించినపుడు అతను వైముఖ్య ధోరణిని ప్రదర్శిస్తాడు, ఓ ప్రక్కకు – వంకర – తిరిగిపోతాడు. తనకు బాధ కలిగినపుడు మాత్రం సుదీర్ఘమయిన ప్రార్థన (దుఆ)లో లీనమైపోతాడు. 52. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'మీరే చెప్పండి! ఒకవేళ ఈ ఖుర్ఆన్ అల్లాహ్ తరపు నుండి వచ్చి ఉంటే, మరి మీరు దానిని తిరస్కరిస్తే, వ్యతిరేకతలో బహుదూరం వెళ్ళిపోయిన వానికంటే ఎక్కువ మార్గభ్రష్టుడెవడుంటాడు?'

53. అనతి కాలంలోనే మేము వారికి మా సూచనలను చూపిస్తాము – జగతిలోనూ, స్వయంగా వారిలోనూ! కడకు ఇదే (ఈ ఖుర్ఆన్ గ్రంథమే) సత్యమన్న విషయం వారికి సుబోధకం అవుతుంది. నీ ప్రభువు ప్రతి దానికి సాక్షిగా ఉన్నాడనే విషయం సరిపోదా? 54. వినండి! వీళ్ళు తమ ప్రభువుతో సమావేశమవటంపై మీమాంసకు లోనై ఉన్నారు. వినండి! ఆయన ప్రతి వస్తువునూ పరివేష్ఠించి ఉన్నాడు.

# 42. అష్ షూరా (పరస్పర సంప్రతింపులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా - మీమ్. 2. ఐన్ - సీన్ - ఖాఫ్. 3. (ఓ ప్రవక్తా!) ఇదేవిధంగా శక్తిమంతుడు, వివేకవంతుడు అయిన అల్లాహ్ నీ వైపునకూ, నీకు పూర్వం గడచిన వారి (ప్రవక్తల) వైపునకూ దివ్యవాణిని పంపుతూ వచ్చాడు. 4. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనదే. ఆయన మహోన్నతుడు, ఘనత వహించినవాడు. 5. త్వరగానే ఆకాశాలు పైనుండి బ్రద్దలై పడిపోయేలాగున్నాయి. దైవదూతలంతా తమ ప్రభువు పవిత్రతను కొనియాడుతూ, ఆయన స్తోత్రగానం చేస్తూ ఉన్నారు. వారు నేలనున్న వారి క్షమాపణకై ప్రార్థిస్తున్నారు. వినండి! నిశ్చయంగా అల్లాహ్‌యే క్షమించేవాడు, కరుణించేవాడు. 6. మరెవరయితే ఆయనను కాదని, ఇతరులను సంరక్ష కులుగా చేసుకున్నారో, వారిని అల్లాహ్ కనిపెట్టుకునే ఉన్నాడు. నీవు వారి (చేష్టల) కి బాధ్యుడవు కావు.

7. నీవు మక్కా వారికి, దాని పరిసరాలలో నివసించేవారికి భయబోధ చేయటానికి, అందరూ సమావేశమయ్యే ఆ రోజు గురించి సావధాన పరచటానికి మేము నీ వైపునకు అరబీ ఖుర్ఆన్‌ను పంపాము. ఆ రోజు రావటంలో సందేహానికి ఆస్కారమే లేదు. (అప్పుడు) ఒక వర్గం స్వర్గంలో ఉంటే, మరో వర్గం నరకాగ్నిలో ఉంటుంది.

8. అల్లాహ్‌యే గనక కోరుకుంటే వారందరినీ ఒకే సముదాయంగా చేసి ఉండేవాడు. అయితే ఆయన తలచుకున్న వారిని తన కారుణ్యంలో చేర్చుకుంటాడు. దుర్మార్గులకు ఆశ్రయం ఇచ్చేవాడు, సహాయపడేవాడు ఎవడూ ఉండడు. 9. ఏమిటి, వారు అల్లాహ్‌ను కాదని ఇతరులను తమ రక్షకులుగా చేసుకున్నారా? యదార్థానికి అల్లాహ్‌యే రక్షకుడు. ఆయనే మృతులను బ్రతికించేవాడు, ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు. 10. మీరు ఏ ఏ

విషయాలలో విభేదించుకున్నా, వాటికి సంబంధించిన తీర్పు దైవాధీనమై ఉంది. 'ఆ అల్లాహ్‌యే నా ప్రభువు. నేను ఆయనపైనే భారం మోపాను. ఆయన వైపునకే నేను మరలుతున్నాను' (అని వారికి చెప్పు).

11. భూమ్యాకాశాలకు ఉనికిని ప్రసాదించినవాడు ఆయనే. ఆయన మీ కొరకు–స్వయంగా మీలో నుండే–మీ జంటలను సృష్టించాడు. పశువుల జంటలను కూడా చేశాడు. తద్వారా ఆయన మీ సంతతికి మనుగడను ఇచ్చాడు. ఆయనను పోలిన వస్తువేదీ లేదు. ఆయన వినేవాడు, చూసేవాడు. 12. భూమ్యాకాశాల బీగాలన్నీ ఆయన అధీనంలో ఉన్నాయి. ఆయన తాను కోరిన వారికి పుష్కలంగా జీవనోపాధిని ఇస్తాడు. తాను కోరిన వారికి తగ్గించి ఇస్తాడు. నిశ్చయంగా ఆయన ప్రతిదీ తెలిసినవాడు.

13. ఏ ధర్మాన్ని స్థాపించమని ఆయన నూహ్‌కు ఆజ్ఞాపించాడో అదే ధర్మాన్ని మీ కోసం కూడా నిర్ధారించాడు. దానినే (ఓ ప్రవక్తా!) మేము నీకు వహీ (దివ్యవాణి) రూపంలో పంపాము. దీని గురించే మేము ఇబ్రాహీమ్, మూసా, ఈసాలకు కూడా ఆజ్ఞాపించాము – మీరు ధర్మాన్ని స్థాపించండి, అందులో విభేదించుకోకండి అని. (ప్రవక్తా!) ఏ విషయం వైపు నీవు పిలుస్తున్నావో అది బహుదైవారాధకులకు భరించశక్యం కానిదిగా ఉంటుంది. అల్లాహ్ తాను కోరిన వానిని తన లక్ష్యం కోసం ఎంపిక చేసుకుంటాడు. తన వైపు మరలేవానికి ఆయన తన మార్గం చూపుతాడు.

14. విభేదించుకున్నవారు 'జ్ఞానం' వచ్చినమీదటే విభేదించుకున్నారు – అదీ ఎందుకంటే తమ మధ్యన గల పంతాలు పట్టింపుల మూలంగానే! ఒకవేళ నీ ప్రభువు తరఫున ఒక నియమిత కాలపు వాగ్దానం ముందుగానే ఖరారై ఉండకపోతే, వారి మధ్యన వ్యవహారం ఎప్పుడో తేల్చివేయబడేది. వారి తదనంతరం గ్రంథం వొసగబడిన వారు కూడా దాని గురించి సంశయంలో పడిపోయారు. అది వారిని కోలుకోకుండా చేసింది.

15. కనుక (ఓ ప్రవక్తా!) నీవు వారిని దీని వైపునకే పిలుస్తూ ఉండు. నీకు ఆజ్ఞాపించబడిన విధంగా దానిపైనే స్థిరంగా ఉండు. వారి ఆకాంక్షలను అనుసరించకు. ఇలా అను : 'అల్లాహ్‌ అవతరింపజేసిన గ్రంథాన్నే నేను విశ్వసించాను. మీ మధ్యన న్యాయం చేయవలసిందిగా నాకు ఆదేశించ బడింది. అల్లాహ్‌యే మా ప్రభువూ, మీ ప్రభువు కూడా. మా ఆచరణలు మాకు. మీ ఆచరణలు మీకు. మీకూ – మాకూ మధ్య గొడవకు ఆస్కారమే లేదు. అల్లాహ్‌ మనందరినీ సమావేశపరుస్తాడు. ఆయన వద్దకే పోవలసి ఉంది.' 16. ఎవరయితే అంగీకరించిన మీదట అల్లాహ్‌ విషయంలో వాదులాటకు తెర లేపారో, వారి వాదులాట వారి ప్రభువు దృష్టిలో అర్థం లేనిది. వారు ఆగ్రహానికి పాత్రులు. వారికి కఠిన శిక్ష తథ్యం.

17. అల్లాహ్‌యే గ్రంథాన్ని సత్యబద్ధంగా అవతరింపజేశాడు. ఇంకా న్యాయస్థాపన కొరకు ధర్మకాంటాను కూడా (దించాడు). నీకేం తెలుసు? బహుశా ఆ ఘడియ సమీపంలోనే ఉందేమో! 18. దానిని నమ్మనివారే దాని గురించి ఆదుర్దా చెందుతున్నారు. నమ్మినడుచుకునేవారు మాత్రం దానికి భయపడుతూ ఉంటారు. అది సంభవించటం సత్యం అని వారికి తెలుసు మరి! గుర్తుంచుకోండి! ప్రళయ గడియ గురించి జగడం చేసేవారు మార్గవిహీనతలో చాలా దూరం వెళ్ళిపోయారు.

19. అల్లాహ్‌ తన దాసుల యెడల మృదుత్వం (జాలి) కలవాడు. ఆయన కోరిన వారికి ఉపాధిని ఇస్తాడు. ఆయన బలశాలి, తిరుగులేనివాడు. 20. ఎవరయితే పరలోక పంటను కోరుకుంటాడో, అతని పంటలో మేము సమృద్ధిని ప్రసాదిస్తాము. మరెవరయితే ఇహలోక పంటను కోరుకుంటాడో, మేమతనికి అందులో నుండి ఎంతో కొంత ఇస్తాము. పరలోకంలో మాత్రం అతనికి ఏ వాటా ఉండదు.

21. ఏమిటి, అల్లాహ్‌ ఆనతి లేకుండానే తమ కొరకు ఏదయినా ధర్మాన్ని నిర్ధారించగల భాగస్వాములను వారు కలిగి ఉన్నారా? ఒకవేళ

తీర్పు విషయం ముందే నిర్ధారించబడకుండా ఉంటే, వీళ్ల వ్యవహారం (ఈ పాటికి) తేల్చివేయబడేది. నిశ్చయంగా దుర్మార్గులకు వ్యధాభరితమయిన శిక్ష ఉంటుంది. 22. ఈ దుర్మార్గులు తాము సంపాదించుకున్న దానిపై భయపడటం నీవు చూస్తావు. అది వారిపై అవశ్యంగా పడుతుంది. ఇకపోతే; విశ్వసించి మంచి పనులు చేసినవారు స్వర్గంలోని ఉద్యానవనాలలో ఉంటారు. వారు కోరినదల్లా వారికి వారి ప్రభువు వద్ద లభిస్తుంది. ఇదే మహదానుగ్రహం. 23. విశ్వసించి, సదాచరణ చేసిన తన దాసులకు అల్లాహ్ ఇచ్చే శుభవార్త ఇది. వారికి చెప్పు : 'దీనికిగాను నేను మీ నుండి ఎలాంటి ప్రతిఫలాన్ని అడగటం లేదు. కాని బంధుత్వ ప్రేమను మాత్రం కాంక్షిస్తున్నాను.' ఎవడయినా, ఏదన్నా మంచి చేస్తే, మేమతని మంచిలో మరింత వృద్ధిని ఇస్తాము. నిశ్చయంగా అల్లాహ్ అమితంగా క్షమించేవాడు, సేవలకు విలువ ఇచ్చేవాడూను.

24. ఏమిటి, ఇతను (మా ప్రవక్త) అల్లాహ్‌పై అసత్యాలు కల్పించాడని వారంటున్నారా? అల్లాహ్‌యే గనక తలచి ఉంటే నీ హృదయంపై సీలు వేసి ఉండేవాడు. అల్లాహ్ అసత్యాన్ని చెరిపివేస్తాడు. తన వచనాల ద్వారా సత్యాన్ని సత్యంగా రూఢీ చేస్తాడు. నిశ్చయంగా ఆయన గుండెల్లోని గుట్టును సయితం ఎరిగినవాడు. 25. ఆయనే తన దాసుల పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు, వారి పాపాలను మన్నించేవాడు. మీరు చేసేదంతా ఆయనకు తెలుసు. 26. ఆయన విశ్వసించి, మంచి పనులు చేసేవారి ప్రార్థనలను ఆమోదిస్తాడు. తన అనుగ్రహం నుండి వారికి మరింతగా ఇస్తాడు. ఇక తిరస్కారులంటారా, వారికి కఠిన శిక్ష ఖాయం.

27. ఒకవేళ అల్లాహ్ తన దాసుల కొరకు ఉపాధి ద్వారాలను పూర్తిగా తెరచివేస్తే వారు భువిలో స్వైరవిహారం చేస్తారు. కాని ఆయన ఓ లెక్క ప్రకారం – తాను కోరినంతగానే – ఉపాధిని అవతరింపజేస్తూ ఉంటాడు. నిశ్చయంగా ఆయన తన దాసుల గురించి బాగా తెలిసినవాడు, గమనిస్తూ

ఉన్నవాడు. 28. ఆయనే జనులు నిరాశకు లోనైన పిదప వర్షం కురిపిస్తు న్నాడు. తన కారుణ్యాన్ని విస్తారం చేస్తున్నాడు. ఆయనే కార్యసాధకుడు, ప్రశంసలకు అర్హుడు. 29. భూమ్యాకాశాల సృష్టి, వాటి మధ్యన వ్యాపించి ఉన్న జీవరాశుల సృష్టి కూడా ఆయన సూచనలలోనివే. మరి తాను కోరినప్పుడు వాటన్నింటినీ సమీకరించే శక్తి కూడా ఆయనకు ఉంది.

30. మీపై ఏ ఆపద వచ్చిపడినా, అది మీ చేజేతులా చేసుకున్న దాని ఫలితం అయి ఉంటుంది. ఆయనైతే ఎన్నో తప్పులను మన్నించి వదలిపెడుతుంటాడు. 31. మీరు భువిలో అల్లాహ్ అదుపాజ్ఞల నుండి పారిపోలేరు. అల్లాహ్ తప్ప మీకు మరో కార్యసాధకుడుగానీ, సహాయకుడు గానీ లేడు.

32. సముద్రంలో నడిచే పర్వతాల్లాంటి ఓడలు కూడా ఆయన సూచనలలోనివే. 33. ఆయన గనక తలచుకుంటే గాలిని స్తంభింపజేయ గలడు. తరువాత అవి సముద్ర మట్టంపై అలాగే నిలిచిపోగలవు. నిశ్చయంగా ఇందులో ఓర్పు వహించే, కృతజ్ఞతలు తెలుపుకునే ప్రతి వ్యక్తికీ సూచన లున్నాయి. 34. లేదా వారి స్వయంకృతాల కారణంగా వారిని (ఓడల సమేతంగా) తుదముట్టించవచ్చు, మరెంతో మందిని మన్నించనూవచ్చు. 35. మా సూచనల విషయంలో వాదులాడే వారు తాము పారిపోయే చోటేదీ లేదని తెలుసుకోవాలి.

36. మీకు ఇవ్వబడినదంతా ప్రాపంచిక జీవితపు తాత్కాలిక భృతి మాత్రమే. అల్లాహ్ వద్ద ఉన్నదే మేలైనది, మిగిలి ఉండేది. విశ్వసించి, కేవలం తమ ప్రభువును నమ్ముకున్న వారికి మాత్రమే అది లభిస్తుంది.

37. (వారెలాంటి వారంటే) వారు పెద్ద పెద్ద పాపాల నుండి, నీతి బాహ్యత నుండి తమను కాపాడుకుంటారు. కోపం వచ్చినపుడు (కూడా జనులను) క్షమిస్తారు. 38. వారు తమ ప్రభువు పిలుపును అంగీకరించారు.

సమాజును స్థాపించారు. వారు తమ పనులను పరస్పర సలహా సంప్రతింపులతో చేసుకుంటారు. మేము వారికి ప్రసాదించిన దానిలో నుండి వారు (మా మార్గంలో) ఖర్చుపెడతారు. 39. తమపై దౌర్జన్యం జరిగినపుడు (మాత్రమే) వారు ప్రతీకారం తీర్చుకుంటారు. 40. చెడుకు బదులు (ప్రతీకారం) అటువంటి చెడే. మరెవరయినా ప్రత్యర్థిని మన్నించి, దిద్దుబాటుకు యత్నిస్తే అతనికి ప్రతిఫలం ఇచ్చే బాధ్యత అల్లాహ్‌ది. నిశ్చయంగా ఆయన అన్యాయం చేసేవారిని ఇష్టపడడు. 41. ఒకవేళ ఎవరయినా తనకు అన్యాయం జరిగిన మీదట (న్యాయబద్ధంగా) ప్రతీకారం తీర్చుకుంటే – అలాంటివారు నిందార్హులు కారు. 42. జనులపై దౌర్జన్యం చేసేవారు, భువిలో అన్యాయంగా తిరగబడేవారు మాత్రమే నిందార్హులు. ఇలాంటివారికే బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 43. మరెవరయినా ఓర్పు వహించి, మన్నింపుల వైఖరిని అవలంబిస్తే నిశ్చయంగా అది సాహసోపేతమైన పనుల్లోకి వస్తుంది.

44. అల్లాహ్ ఏ వ్యక్తినయినా అపమార్గం పట్టిస్తే, ఇక దాని తరువాత అతన్ని రక్షించేవాడెవడూ ఉండడు. ఈ దుర్మార్గులు శిక్షను ప్రత్యక్షంగా చూసుకున్నప్పుడు, తిరిగి వెళ్ళే అవకాశం ఏమన్నా ఉందా? అని అనటం నీవు చూస్తావు. 45. వారు నరకం ముందు తీసుకు రాబడినపుడు, వారు అవమానభారంతో కృంగిపోతూ, దొంగచూపులు చూస్తూ ఉండటం కూడా నీవు గమనిస్తావు. ఆ సమయంలో విశ్వసించినవారు ఇలా అంటారు : 'ప్రళయదినాన తమ స్వయాన్ని, తమ సంబంధీకులను నష్టానికి గురిచేసినవారే అసలు నష్టపోయినవారు.' వినండి! దుర్మార్గులు శాశ్వతమైన శిక్షను అనుభవిస్తారు. 46. అల్లాహ్‌కు ప్రతిగా వారిని ఆదుకునే సహాయకులెవరూ ఉండరు. అల్లాహ్ అపమార్గాన వదలివేసిన వానికి మరే మార్గమూ ఉండదు.

47. తొలగించ తరంకాని ఆ రోజు దేవుని తరఫున రాక ముందే

మీ ప్రభువు పిలుపును శిరసావహించండి. ఆ రోజున మీకు ఏ ఆసరా లభించదు. మీరు దేనినీ నిరాకరించలేరు. 48. (ప్రవక్తా!) ఒకవేళ వారు విముఖత చూపితే, మేము నిన్ను వారిపై కాపలాదారుగా చేసి పంపలేదు కదా! (సందేశాన్ని) అందజేయటం వరకే నీ బాధ్యత. మేము మానవుణ్ణి మా కారుణ్యంతో సత్కరించినపుడు, దానిపై అతను సంతోషంతో పొంగిపోతాడు. ఒకవేళ వారి దురాగతాల కారణంగా వారిపై ఏదన్నా ఆపద వచ్చిపడితే, మానవుడు కృతఘ్నుడుగా తయారవుతాడు.

49. భూమ్యాకాశాల సార్వభౌమత్వం అల్లాహ్‌కే చెందుతుంది. ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు. తాను కోరిన వారికి ఆడపిల్లల్ని ఇస్తాడు. తాను కోరిన వారికి మగపిల్లల్ని ప్రసాదిస్తాడు. 50. లేదా వారికి మగపిల్లలను, ఆడపిల్లలను కలిపి ఇస్తాడు. తాను కోరిన వారిని సంతానహీనులుగా ఉంచేస్తాడు. నిశ్చయంగా ఆయన సర్వం తెలిసినవాడు. సర్వశక్తుడు. 51. ఏ మానవమాత్రుడూ అల్లాహ్‌తో ప్రత్యక్షంగా సంభాషించలేడు. అయితే వహీ (దివ్యవాణి) ద్వారా గానీ, తెరవెనుక నుంచిగానీ లేదా ఆయన పంపిన దైవదూత ద్వారా గానీ ఇది సంభవమే. అదైనా దేవుని అనుజ్ఞతో ఆయన కోరిన సందేశాన్ని (వహీని) మాత్రమే అందజేయగలడు. నిశ్చయంగా ఆయన మహోన్నతుడు, వివేకసంపన్నుడు. 52. ఇదేవిధంగా (ఓ ప్రవక్తా!) మేము నీ వద్దకు వహీ (దివ్యవాణి) ద్వారా మా ఆజ్ఞతో ఆధ్యాత్మిక శక్తిని పంపాము. (అంతకుముందు) గ్రంథమంటే ఏమిటో, విశ్వాసం అంటే ఏమిటో నీకు తెలియదు. అయితే మేము దీనిని (ఖుర్ఆన్‌ను) ఒక జ్యోతిగా చేశాము. దీని ద్వారా మేము మా దాసులలో మేము కోరుకున్నవారికి సన్మార్గ భాగ్యం ప్రసాదిస్తున్నాము. (ఓ ప్రవక్తా!) నిశ్చయంగా నీవు రుజుమార్గం వైపు దర్శకత్వం వహిస్తున్నావు. 53 – ఆ దైవమార్గం వైపునకు! భూమ్యాకాశాలలో ఉన్న సమస్తం ఆయనకే చెందుతుంది. వినండి! సమస్త వ్యవహారాలు అల్లాహ్ వైపునకే తిరిగి వస్తాయి.

# 43. అజ్ జుఖ్రుఫ్ (బంగారు ఆభరణాలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా – మీమ్. 2. స్పష్టంగా ఉన్న గ్రంథం సాక్షిగా! 3. మేము దీనిని అరబీ ఖుర్ఆన్‌గా చేశాము – మీరు క్షుణ్ణంగా అర్థం చేసుకుంటారని. 4. నిశ్చయంగా ఇది మా వద్ద ఉన్న మూల గ్రంథంలో భద్రపరచబడి ఉంది – ఉన్నతమైనది, యుక్తితో నిండినది.

5. ఏమిటి, మీరు హద్దుమీరిపోయే జనం గనక మేము ఈ ఉపదేశాన్ని మీ నుండి మళ్లించాలా? 6. మేము పూర్వకాలపు ప్రజలలో కూడా ఎంతోమంది ప్రవక్తలను పంపి ఉన్నాము. 7. వారి వద్దకు వచ్చిన ఏ ప్రవక్తను కూడా వారు పరిహసించకుండా ఉండలేదు. 8. మేము వీరికన్నా మహా ఘటికులనే అంతమొందించాము. పూర్వీకుల దృష్టాంతాలెన్నో గడచి పోయాయి.

9. 'భూమ్యాకాశాలను సృష్టించినదెవరు?' అని నీవు గనక వారిని అడిగితే, 'మహా శక్తిమంతుడు, మహా జ్ఞాని అయినవాడే సృష్టించాడు' అని వారంటారు. 10. ఆయన మీ కొరకు భూమిని పరుపుగా చేశాడు. మీరు మార్గం పొందగలందులకు అందులో మీ కొరకు త్రోవలను ఏర్పరచాడు. 11. ఆయనే ఓ లెక్క ప్రకారం ఆకాశం నుండి వర్షపు నీరును కురిపించాడు. మరి మేమే దానిద్వారా మృతభూమిని బ్రతికించాము. మీరు కూడా ఇలాగే (సమాధుల నుండి) వెలికి తీయబడతారు. 12. ఆయనే వస్తువులన్నింటినీ జంటలుగా సృష్టించాడు. ఇంకా మీ కొరకు ఓడలను, పశువులను చేశాడు. వాటిపై మీరు ప్రయాణం చేస్తుంటారు. 13. – మీరు వాటి వీపులపై కుదురుగా కూర్చోవాలని! మీరు వాటిపై కూర్చున్న మీదట మీ ప్రభువు అనుగ్రహాన్ని స్మరించుకుంటూ ఇలా ప్రార్థించండి : వీటన్నింటినీ మా అదుపులో ఉంచిన దేవుడు పరమ పవిత్రుడు. అన్యథా వీటిని లోబరుచు

కోవటం మా వల్ల అయ్యే పనికాదు. 14. నిశ్చయంగా (ఎట్టకేలకు) మేము మా ప్రభువు వైపునకు మరలిపోవలసిన వారమే.'

15. వారు దైవదాసులలోనే కొందరిని 'దైవాంశం'గా చేసుకున్నారు. నిశ్చయంగా మానవుడు మేలును మరవటంలో మేటి. 16. ఏమిటి, దేవుడు తన సృష్టితాలలో తన కొరకు కూతుళ్ళను ఇష్టపడి, మిమ్మల్నేమో కొడుకులతో సత్కరించాడా? 17. వారు కరుణామయుడయిన దేవునికి అంటగట్టేదే (ఆడపిల్లే) వారిలో ఎవడికయినా కలిగిందనే శుభవార్త అందజేయబడినపుడు, వాడి ముఖం నల్లగా మారిపోతుంది. వాడు పుట్టెడు దుఃఖంలో మునిగి పోతాడు. 18. ఏమిటి, నగనట్రా మధ్య పోషించబడి, వాదోపవాదాలలో తన మనోభావాన్ని స్పష్టంగా అభివ్యక్తం చేయజాలని (ఆడపిల్లలను వారు దైవానికి ఆపాదిస్తున్నారా? ఈ పంపకం మరీ దారుణం కదూ!) 19. కరుణా మయుని దాసులైన దైవదూతలనేమో వారు ఆడవారుగా ఖరారు చేసుకున్నారు. ఏమిటి, వారి పుట్టుక సమయంలో వారక్కడ ఉన్నారటనా? వారి ఈ సాక్ష్యం వ్రాసుకోబడుతోంది. దీని గురించి వారు అవశ్యంగా ప్రశ్నించబడతారు.

20. 'కరుణామయుడు (దేవుడు) కోరి ఉంటే మేము వాటిని పూజించి ఉండేవారం కాము కదా!' అని వారంటారు. దీని గురించి వారికసలు ఏమీ తెలీదు. వారు కేవలం ఊహాగానాలు చేస్తున్నారు. 21. మేము వారికి లోగడ ఏదయినా గ్రంథం ఇచ్చి ఉన్నామా? దానిని వారు గట్టిగా ఆశ్రయించి ఉన్నారా? 22. వాళ్ళు చెప్పేది మాత్రం ఒక్కటే : 'మా తాతముత్తాతలు ఒక పద్ధతిపై ఉండగా మేము చూశాము. మేము కూడా వారి వెనుకే నడుస్తున్నాము.' 23. ఇదేవిధంగా మేము నీకు పూర్వం ఏ జనావాసంలో భయబోధ చేసేవాణ్ణి పంపినా అక్కడి శ్రీమంతులు ఇలా అనేవారు : 'మేము మా తాతలు తండ్రులను ఒక పద్ధతిని అవలంబిస్తూ ఉండగా చూశాము. మేము కూడా వారి అడుగుజాడలలోనే నడుచుకుంటున్నాము.' 24. 'ఒకవేళ మీ తాతలు తండ్రులు అవలంబిస్తూ ఉండగా మీరు చూచిన విధానం కన్నా సరైన మార్గాన్ని నేను తీసుకు వచ్చినప్పటికీనా?' అని భయబోధ చేసేవాడు

అడిగినప్పుడు, 'నీకు ఇచ్చి పంపబడిన దానిని మేము త్రోసిపుచ్చుతున్నాం' అని వారన్నారు. 25. అందుకే మేము వారిపై ప్రతీకారం తీర్చుకున్నాము. చూడండి! సత్యాన్ని త్రోసిపుచ్చిన వారికి పట్టిన గతి ఎలాంటిదో!!

26. ఇబ్రాహీమ్ తన తండ్రితో, తన జాతివారితో ఈ విధంగా చెప్పినప్పటి విషయం (చిరస్మరణీయం). 'మీరు పూజించే వాటితో నాకెట్టి సంబంధం లేదు. 27. నన్ను సృష్టించిన వానిని మాత్రమే నేను ఆరాధిస్తాను. ఆయనే నాకు మార్గదర్శకత్వం వహిస్తాడు.' 28. ఇబ్రాహీమ్ ఇదే మాటను తన తదనంతరం తన సంతానంలో మిగిల్చి ఉంచాడు – వారు దాని వైపునకే మరలాలని. 29. పైగా నేను వారికీ, వారి తాతముత్తాతలకు ప్రాపంచిక సాధన సంపత్తులను ఇస్తూనే వచ్చాను. కడకు వారి వద్దకు సత్యం వచ్చేసింది. అన్నింటినీ విడమరచి చెప్పే ప్రవక్త కూడా వచ్చేశాడు. 30. తీరా సత్యం వచ్చేశాక వారు, 'ఇదొక మంత్రజాలం. మేము దీనిని త్రోసిపుచ్చుతున్నాం' అని తేల్చిచెప్పేశారు.

31. వారిలా అన్నారు : 'ఈ ఖుర్ఆన్ ఈ రెండు పట్టణాల (మక్కా, తాయిఫ్)లోని ఎవరో ఒక 'ప్రముఖ వ్యక్తి' పై ఎందుకు అవతరించలేదు?' 32. ఏమిటి, వారు నీ ప్రభువు కారుణ్యాన్ని పంచిపెట్టేవారా? ప్రాపంచిక జీవితంలో వారి జీవనోపాధిని పంచిపెట్టినది మేమేనాయె. వారిలో ఒకరింకొకరి (వస్తు) సేవలు పొందేవిధంగా మేము ఒకరికి మరొకరిపై ప్రాధాన్యతను కల్పించాము. వారు కూడబెట్టేదానికన్నా నీ ప్రభువు కారుణ్యం ఎంతో మేలైనది. 33. జనులంతా ఒకే పంథాలో పోతారనే మాటే గనక లేకుంటే, కరుణామయుని యెడల తిరస్కార వైఖరికి పాల్పడేవారి ఇండ్ల కప్పులను, వాటిపైకి ఎక్కివెళ్లే మెట్లను కూడా మేము వెండితో చేసి ఉండేవారం. 34. వారి ఇండ్ల తలుపులను, వారు దిండ్లకు ఆనుకుని కూర్చునే పీఠాలను కూడా మేము వెండితోనే చేసి ఉండేవారం. 35. బంగారు ఆభరణాలను కూడా! ఈ వస్తువులన్నీ ప్రాపంచిక జీవితపు (స్వల్ప) సామగ్రి మాత్రమే. పరలోకం మాత్రం నీ ప్రభువు వద్ద భక్తిపరులకే ప్రత్యేకమై ఉంది.

36. కరుణామయుని స్మరణ పట్ల వైముఖ్యం ప్రదర్శించే వ్యక్తిపై మేము ఒక షైతాన్‌ను నియమిస్తాము. వాడే ఇక అతని సావాసిగా ఉంటాడు.
37. వారు (షైతానులు) వారిని సన్మార్గం నుండి అడ్డుకుంటూ ఉంటారు. వారేమో తాము సన్మార్గంపైనే ఉన్నామని భ్రమపడుతూ ఉంటారు.
38. చివరకు అతను మా వద్దకు వచ్చినపుడు (తన షైతాన్ సావాసితో ఇలా) అంటాడు : 'అయ్యో! నీకూ – మాకూ మధ్య తూర్పు పడమరల అంతరం ఉంటే ఎంత బాగుండేది! నీవు ఎంత చెడ్డ సావాసివయ్యా!'
39. మీరెలాగూ దుర్మార్గులని తేలిపోయింది. కాబట్టి ఈ రోజు మీరంతా యాతనలో భాగస్థులై ఉండటం మీకేవిధంగానూ ఉపకరించదు.

40. మరయితే (ప్రవక్తా!) నీవు చెవిటి వారికి వినిపించగలవా? అంధులకుగానీ, కరడుగట్టిన మార్గవిహీనులకు గానీ మార్గం చూపగలవా?
41. ఒకవేళ మేము నిన్ను ఇక్కడి నుండి లేపుకున్నా (మరణమొసగినా), మేము వీళ్ళపై ప్రతీకారం తీర్చుకోకుండా ఉండము. 42. లేదా మేము వీరికి చేసిన వాగ్దానాన్ని నీకు (నీ జీవిత కాలంలోనే) చూపిస్తాము. వారిపై మాకు పూర్తి అధికారం ఉంది. 43. కనుక నీవు దివ్యవాణి ద్వారా నీకు పంపబడేదానిని గట్టిగా పట్టుకో. నిశ్చయంగా నీవు రుజుమార్గంపై ఉన్నావు.
44. నిశ్చయంగా ఇది నీకూ, నీ జాతివారికీ ఒక ఉపదేశం (జ్ఞాపిక) గా ఉంది. ముస్ముందు మీరు ప్రశ్నించబడతారు. 45. మేము నీకు పూర్వం పంపిన ప్రవక్తలను అడిగిచూడు – మేము కరుణామయుడు తప్ప పూజా పునస్కారాల నిమిత్తం వేరితర దేవుళ్ళను చేశామేమో!?

46. మేము మూసాను, మా సూచనలతో సహా ఫిరౌన్ వద్దకు, అతని పెద్దల వద్దకు పంపించాము. అతను వారితో, 'నేను లోకేశ్వరుని సందేశహరుడను' అన్నాడు. 47. అతను మా సూచనలను తీసుకుని వారి దగ్గరకు వచ్చినపుడు, వారంతా వాటిని నవ్వులాటగా తీసుకున్నారు.
48. మేము వారికి ఏ సూచనను చూపించినా, అది మునుపటి సూచనకన్నా గొప్పదై ఉండేది. మేము వారిని శిక్షలో భాగంగా పట్టుకున్నాము –

అలాగయినా మరలి వస్తారేమోనని! 49. వారిలా అనేవారు : 'ఓ మాంత్రికుడా! నీ ప్రభువు నీతో చేసిన వాగ్దానాన్ని పురస్కరించుకుని కాస్త మా కోసం ఆయన్ని ప్రార్థించు. (ఈ గండం నుండి గట్టెక్కితే) మేము తప్పకుండా సన్మార్గానికి వస్తాము.' 50. మరి మేము వారిపై నుండి ఆ విపత్తును తొలగించినపుడు, వారు వాగ్దానభంగానికి పాల్పడేవారు.

51. ఫిరౌన్ తన జాతి జనుల మధ్య ప్రకటించాడు : నా జాతివార లారా! ఈజిప్ట్ రాజ్యాధికారం నాది కాదా? నా దిగువన ప్రవహించే ఈ కాలువలను మీరు చూడటం లేదా? 52. పైగా అధముడైన అతని కంటే నేను ఘనుడను. సరిగ్గా మాట్లాడటం కూడా రాదతనికి. 53. మరయితే అతనిపై స్వర్ణ కంకణాలు ఎందుకు అవతరించలేదు? పోనీ, అతని వెంట వరుసతీరిన దైవదూతలు ఎందుకు రాలేదు?' 54. ఆ విధంగా అతను తన జాతి ప్రజల మతి పోగొట్టాడు. దరిమిలా వారంతా అతను చెప్పినట్టు విన్నారు. మొత్తానికి వారంతా అవిధేయ జనులే. 55. తరువాత వారు మాకు కోపం తెప్పించగా, మేము వారిపై ప్రతీకారం తీర్చుకున్నాము. మేము వారందరినీ ముంచివేశాము. 56. ఆ విధంగా మేము వారిని మాజీ వృత్తాంతంగా, భావితరాల వారికి (గుణపాఠ) ఉదాహరణగా చేశాము.

57. ఇక మర్యమ్ కుమారుని ఉపమానం ఇవ్వబడినపుడు నీ జాతి ప్రజలు దానిపై కేకలు వేశారు. 58. 'ఇంతకీ మా ఆరాధ్య దైవాలు నయమా? లేక అతనా?' అని (గుచ్చి గుచ్చి) అడిగారు. నీతో తగవుపెట్టుకోవటానికే వారీ ఉపమానం ఇస్తున్నారు. వారసలే తగవులమారులు. 59. అతను (మర్యమ్ కుమారుడగు ఈసా) ఒక దాసుడు మాత్రమే. మేమతనిని కటాక్షించాము. ఇస్రాయీల్ సంతతి వారికి అతనిని ఒక ఉపమానంగా చేశాము. 60. మేము గనక తలచుకుంటే మీలో నుండే దైవదూతలను చేసి ఉండేవారము. వారు భువిలో మీకు వారసులయ్యేవారు. 61. నిశ్చయంగా అతను (ఈసా) ప్రళయ సూచన. కనుక మీరు అందులో సందేహించకండి. మీరు నన్ను అనుసరించండి. ఇదే రుజుమార్గం. 62. షైతాన్ మిమ్మల్ని దీని నుండి అడ్డుకోరాదు. నిశ్చయంగా వాడు మీ బహిరంగ శత్రువు.

63. ఈసా స్పష్టమయిన నిదర్శనాల సమేతంగా వచ్చినపుడు, ఇలా అన్నాడు : 'మీరు విభేదించుకుంటున్న కొన్ని విషయాలలోని వాస్తవికతను మీకు విడమరచి చెప్పటానికి నేను మీ వద్దకు వివేకాన్ని తెచ్చాను. కాబట్టి మీరు అల్లాహ్‌కు భయపడండి. నాకు విధేయత చూపండి. 64. నిశ్చయంగా అల్లాహ్‌యే నా ప్రభువూ మీ ప్రభువు కూడా. కనుక మీరు ఆయన్నే ఆరాధించండి. ఇదే రుజుమార్గం.' 65. తరువాత వివిధ కూటములు పరస్పరం విభేదించుకున్నాయి. కనుక దుర్మార్గానికి ఒడిగట్టిన వారికి వినాశం తప్పదు – వ్యధాభరితమయిన ఒక దినపు శిక్ష ఖాయం.

66. వారు ప్రళయ ఘడియ కొరకు ఎదురు చూస్తున్నారా? తమకు తెలియకుండానే అకస్మాత్తుగా అది వచ్చిపడాలని వారు కోరుకుంటున్నారా? 67. ఆ రోజు స్నేహితులంతా పరస్పరం విరోధులైపోతారు. అయితే దైవభీతిపరులు మాత్రం అలా ప్రవర్తించరు. 68. (విశ్వాసులతో ఈ విధంగా అనబడుతుంది) : 'నా దాసులారా! ఈ రోజు మీకెలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు. 69. మా సూచనలను విశ్వసించి, మాకు విధేయులుగా మసలుకున్న వారలారా! 70. మీరూ, మీ భార్యలు స్వర్గంలో ప్రవేశించండి – మీరు సత్కరించబడతారు.' 71. వారి సమక్షంలో బంగారు పళ్ళాలు, గ్లాసులు సమర్పించబడతాయి. అక్కడ మనసు మెచ్చే, కళ్లకు నచ్చే వస్తువులుంటాయి. అక్కడ మీరు సదా ఉంటారు. 72. ఇదీ ఆ స్వర్గం! మీరు చేసుకున్న (సత్) కర్మల కారణంగా మీరు దానికి వారసులుగా చేయబడ్డారు. 73. అందులో మీ కోసం పండ్లు ఫలాలు పుష్కలంగా ఉన్నాయి. వాటిలో నుండి మీరు తింటారు.

74. నిశ్చయంగా అపరాధులు శాశ్వతమయిన నరక యాతనలో మ్రగ్గుతూ ఉంటారు. 75. అది వారి నుండి ఏమాత్రం సడలించబడదు. వారందులో నిరాశా నిస్పృహలతో పడి ఉంటారు. 76. మేము వారికెలాంటి అన్యాయం చేయలేదు. పైగా వారు తమకు తామే అన్యాయం చేసుకున్నారు. 77. వారిలా అరుస్తారు : 'ఓ మాలిక్ (నరక పాలకుడా!) నీ ప్రభువు మమ్మల్ని ఒకేసారి కడతేరిస్తే పోతుంది కదా!' దానికతను, 'మీరు ఎల్లకాలం

ఇలాగే పడి ఉండాలి' అంటాడు. 78. 'మేము మీ వద్దకు సత్యాన్ని తీసుకువచ్చాము. కాని మీలో చాలామందికి సత్యమంటేనే గిట్టేది కాదు.' 79. ఏమిటి, వీళ్ళు (నీకు వ్యతిరేకంగా) ఏదన్నా తీర్మానం చేసుకున్నారా? అలాగైతే మేమూ ఒక తీర్మానం చేసుకుంటాము. 80. ఏమిటి, మేము వాళ్ళ రహస్య విషయాలను, వారి సంప్రతింపులను వినటం లేదని వారనుకుంటున్నారా? పైగా మేము పంపిన దూతలు వాళ్ళ దగ్గరే అంతా వ్రాసుకుంటున్నారు.

81. (ప్రవక్తా!) వారికి చెప్పు : "ఒకవేళ కరుణామయునికి కుమారుడే గనక ఉంటే, అందరికన్నా ముందు నేనే అతనిని ఆరాధించేవాణ్ణి. 82. భూమ్యాకాశాలకు ప్రభువు, అర్ష్ (సింహాసనము)నకు అధిపతి అయిన అల్లాహ్ వీళ్లు కల్పించే మాటలకు అతీతుడు, పరమ పవిత్రుడు. 83. కనుక నీవు వాళ్ళను వారి వాగుడులోనే, ఆటల్లోనే పడి ఉండేలా విడిచిపెట్టు. చివరికి వారికి వాగ్దానం చేయబడే ఆ రోజు ఎలాగూ ఎదురవుతుంది.

84. ఆయనే ఆకాశాలలో ఆరాధ్య దైవం. భూమిలో కూడా ఆయనే ఆరాధ్యుడు. ఆయన గొప్ప వివేకవంతుడు, జ్ఞానధనుడు. 85. ఆకాశాలకూ, భూమికి, వాటిమధ్య ఉన్న సమస్తానికీ సామ్రాజ్యాధిపతి అయిన ఆయన ఎంతో శుభకరుడు. ప్రళయ జ్ఞానం ఆయన వద్దనే ఉంది. ఆయన వైపునకే మీరంతా మరల్చబడతారు.

86. వారు అల్లాహ్ తప్ప ఎవరెవరిని పిలుస్తున్నారో వారికి సిఫారసు చేసే అధికారం ఏదీ లేదు. అయితే సత్య సాక్ష్యమిచ్చే వారికి, దాని గురించి తెలిసిన వారికి మాత్రం (ఆ మేరకు అనుమతి ఉంటుంది). 87. 'మిమ్మల్ని ఎవరు సృష్టించారు?' అని నీవు గనక వారిని అడిగితే, **'అల్లాహ్'** అని వారు చెబుతారు. మరలాంటప్పుడు వారెక్కడ దారి మళ్ళించబడుతున్నారు? 88. 'నా ప్రభూ! వీళ్ళు మాత్రం విశ్వసించే జనులు కారు' అని ప్రవక్త చెప్పిన పలుకు కూడా అల్లాహ్‌కు తెలుసు. 89. కనుక (ఓ ప్రవక్తా!) వారిపట్ల మన్నింపుల వైఖరిని అవలంబించు. 'మీకు సలాం' అను. త్వరలోనే వారికి తెలిసివస్తుంది.

# 44. అద్ దుఖాన్ (పొగ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా – మీమ్. 2. స్పష్టమయిన ఈ గ్రంథం సాక్షిగా! 3. మేము దీనిని శుభవంతమైన ఒక రాత్రియందు అవతరింపజేశాము. నిశ్చయంగా మేము సావధానపరిచేవారము. 4. ఈ రాత్రియందు వివేకవంతమయిన ప్రతి వ్యవహారానికి సంబంధించి నిర్ణయం గైకొనబడుతుంది–

5. మా ఆజ్ఞానుసారం. నిశ్చయంగా (సందేశాలను) పంపేవారం మేమే. 6. నీ ప్రభువు కారుణ్యం నుండి! ఆయన సర్వం వినేవాడు, సర్వం తెలిసినవాడు. 7. మీరు గనక నమ్మగల వారయితే ఆయనే భూమ్యాకాశాలకు, వాటి మధ్యనున్న సమస్తానికీ ప్రభువు. 8. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. ఆయనే ప్రాణం పోస్తున్నాడు, ఆయనే ప్రాణం తీస్తున్నాడు. మీకూ ఆయనే ప్రభువు, పూర్వీకులయిన మీ తాతముత్తాతలకు కూడా ఆయనే ప్రభువు.

9. పైగా వారు సంశయాలలో పడి ఆడుకుంటున్నారు. 10. కనుక ఆ రోజు కొరకు నిరీక్షించు! అప్పుడు ఆకాశం ఒక స్పష్టమయిన పొగను ప్రస్ఫుటం చేస్తుంది. 11. అది జనులపై క్రమ్ముకుంటుంది. అదొక వ్యధాభరితమయిన శిక్ష. 12. (అప్పుడు వారిలా వేడుకుంటారు) : 'మా ప్రభూ! ఈ ఆపదను మాపై నుండి తొలగించు. మేము విశ్వసిస్తున్నాము.' 13. ఉపదేశం వారికి అప్పుడు ఏం ఉపకరిస్తుంది? స్పష్టంగా విపులీకరించే ప్రవక్త వారి వద్దకు (ఏనాడో) వచ్చాడు. 14. కాని వారేమో అతనికి వెన్ను చూపారు. 'ఇతనొక నేర్పించి పంపబడిన పిచ్చివాడు' అని ఎద్దేవా చేశారు. 15. మేము కొంతకాలం పాటు శిక్షను తొలగిస్తే, మీరు మళ్లీ యధాస్థితికి వస్తారు. 16. ఏ రోజున మేము మిమ్మల్ని గట్టిగా పట్టుకుంటామో, అప్పుడు పూర్తిగా ప్రతీకారం తీర్చుకుంటాము.

17. వీరికి పూర్వం మేము ఫిరౌన్ జాతి వారిని పరీక్షించాము. వారి వద్దకు ఒక గౌరవనీయుడయిన ప్రవక్త వచ్చాడు. 18. అతనిలా అన్నాడు : 'అల్లాహ్ దాసులను నాకు అప్పగించండి. నేను మీ వద్దకు పంపబడిన

విశ్వసనీయుణ్ణి అయిన ప్రవక్తను. 19. మరో విషయం ఏమిటంటే; మీరు అల్లాహ్‌కు ప్రతిగా తలబిరుసుతనం చూపకండి. నేను మీ ముందు ఒక స్పష్టమయిన ప్రమాణాన్ని సమర్పిస్తున్నాను. 20. మీరు నన్ను రాళ్ళు రువ్వి చంపే పన్నాగం నుండి నేను నాకూ, మీకూ ప్రభువు అయిన అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను. 21. ఒకవేళ మీరు నన్ను నమ్మకపోతే, నా నుండి వేరైపొండి.'

22. మరి మూసా తన ప్రభువుకు 'వీళ్ళు అపరాధ జనులు' అని నివేదించుకున్నాడు. 23. (అప్పుడు ఈ విధంగా సెలవీయబడింది) 'నీవు నా దాసులను తీసుకుని రాత్రికి రాత్రే వెళ్ళిపో. మీరు వెంబడించబడతారు. 24. సముద్రం చీలి ఉన్న స్థితిలోనే వదలిపోండి. వాళ్ళ సైన్యమంతా మునిగిపోనున్నది.' 25. వారు ఎన్నో తోటలను, చెలమలను, 26. పంట పొలాలను, బ్రహ్మాండమయిన నివాస గృహాలను, 27. వారు అనుభవిస్తూ ఉండిన ఎన్నెన్నో విలాస వస్తువులను – అన్నింటినీ వదలిపోయారు. 28. ఇలా ముగిసింది వారి కథ. మేము మరో జాతి వారిని వాటికి వారసులుగా చేశాము. 29. వారి స్థితిపై భూమ్యాకాశాలు ఘోషించి విలపించనూ లేదు, వారికి వ్యవధి ఇవ్వబడనూ లేదు.

30. మరోవైపు మేము ఇస్రాయీల్ సంతతి వారిని అవమాన కరమయిన యాతన (పీడన) నుండి విముక్తి నొసగాము. 31. అంటే ఫిరౌన్ (చెర) నుండి! నిశ్చయంగా అతను మహా తలబిరుసు, హద్దుమీరి పోయినవాడుగా ఉండేవాడు. 32. మేము తెలిసీ వారికి లోకవాసులపై ప్రాధాన్యతను వొసగాము. 33. ఇంకా మేము వారికి స్పష్టమయిన బహు మానం (పరీక్ష) గల సూచనలను ప్రసాదించాము.

34. (సత్యాన్ని తిరస్కరించిన) వారు ఇలా అంటున్నారు : 35 'ఈ మరణం తప్ప మాకు మరొకటి లేదు. మేము మళ్ళీ లేపబడటమన్నది కల్ల. 36. ఒకవేళ మీరు చెప్పేదే నిజమయితే మా తాతముత్తాతలను తిరిగి తీసుకురండి!' 37. ఏమిటి, వీళ్ళు గొప్పవారా? లేక తుబ్బాజాతి వారూను, వారికంటే పూర్వం వారా? మేము వాళ్ళను అంతమొందించాము. నిశ్చయంగా వారు అపరాధులు.

38. మేము భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న వాటిని ఏదో వినోదం కోసం సృష్టించలేదు. 39. మేము వాటిని సత్య (లక్ష్య) బద్ధంగానే సృష్టించాము. కాని వారిలో చాలామంది తెలియనివారు. 40. నిశ్చయంగా తీర్పుదినం – వారందరికీ నిర్ధారించబడిన ఒక వాగ్దాన సమయం. 41. ఆనాడు ఏ బంధువూ మరో బంధువుకు ఏ విధంగానూ ఉపయోగపడడు. వారికెలాంటి తోడ్పాటు కూడా అందదు. 42. కాని అల్లాహ్ ఎవరిపైనయినా దయతలిస్తే అది వేరే విషయం. నిశ్చయంగా ఆయన శక్తిమంతుడు, దయాకరుడు.

43. నిశ్చయంగా జెముడు (జఖ్ఖూమ్) వృక్షం 44. పాపాత్ముల ఆహారంగా ఉంటుంది. 45. అది నూనె గసి మాదిరిగా ఉంటుంది. కడుపులోకి పోయి మరుగుతుంది. 46. సలసల మరిగే నీరులా! 47. 'వాణ్ణి పట్టుకోండి! వాణ్ణి ఈడ్చుకుంటూపోయి నరకం నడిబొడ్డు వరకూ చేర్చండి. 48. తరువాత వాడి నెత్తిమీద మరిగే నీళ్ళను – శిక్షగా – కుమ్మరించండి. 49. దీని రుచి చూడు! మహా గొప్పవానిగా, గౌరవనీయునిగా చెలామణీ అయ్యేవాడివి కదా! 50. దేని గురించి మీరు మీమాంసలో పడి ఉండేవారో అదే ఇది' (అని వారితో అనబడుతుంది).

51. నిశ్చయంగా దైవభీతిపరులు సురక్షితమయిన – ప్రశాంతమయిన – చోట ఉంటారు. 52. ఉద్యాన వనాల, ఊటల మధ్యన ... 53. వారు సన్నని పట్టువస్త్రాలతో పాటు, జరీ వస్త్రాలు కూడా ధరించి ఎదురెదురుగా కూర్చుని ఉంటారు. 54. ఇదీ వారి వైభవం! పెద్ద పెద్ద కన్నులు గల సుందరాంగులతో మేము వారి వివాహం జరిపిస్తాము. 55. వారందులో దర్జాగా అన్ని రకాల పండ్లు ఫలాలను కోరి తెప్పించుకుంటూ ఉంటారు. 56. మొదటిసారి వచ్చిన ఆ మరణమే తప్ప, ఇక వారు మృత్యువు రుచిచూడటమనేది ఉండదు. అల్లాహ్ వారిని నరకయాతన నుండి కాపాడాడు. 57. ఇది కేవలం నీ ప్రభువు అనుగ్రహం. ఇదే అసలు గొప్ప సాఫల్యం!

58. మేము ఈ ఖుర్‌ఆన్‌ను నీ భాషలో సులభతరం గావించాము – జనులు ఉపదేశం గ్రహించాలని! 59. కనుక నీవు నిరీక్షించు. వాళ్ళూ నిరీక్షిస్తున్నారు.

# 45. అల్ జాసియహ్ (మోకాళ్ళమీద పడి ఉండటం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. హా – మీమ్. 2. ఇది శక్తిమంతుడు, వివేకవంతుడైన అల్లాహ్ తరఫు నుండి అవతరింపజేయబడిన గ్రంథం. 3. నిశ్చయంగా ఆకాశాలలో, భూమిలో విశ్వసించిన వారికి ఎన్నో సూచనలున్నాయి. 4. మీ పుట్టుకలోనూ, ఆయన భూమిలో సర్వవ్యాప్తం చేసిన జంతువులలోనూ నమ్మకం గల జనులకు అనేక సూచనలున్నాయి. 5. రేయింబవళ్ళ రాకపోకలలోనూ, అల్లాహ్ ఆకాశం నుండి ఉపాధిని (వర్షపు నీటిని) కురిపించి, భూమి నిర్జీవంగా మారిన తరువాత దానికి జీవం పోయటంలోనూ, గాలుల మార్పులోనూ విజ్ఞులైన జనులకు పలు సూచనలున్నాయి. 6. ఇవి అల్లాహ్ సూక్తులు. వీటిని మేము నీకు యధాతథంగా (సత్యబద్ధంగా) వినిపిస్తున్నాము. ఇక అల్లాహ్ మరియు ఆయన వచనాల (ను త్రోసిపుచ్చిన) తరువాత వారు విశ్వసించదగిన విషయం ఏం ఉంటుందని!?

7. అపవాది, పాపాత్ముడు అయిన ప్రతి ఒక్కడికీ వినాశం తప్పదు. 8. వాడి పరిస్థితి ఎటువంటిదంటే, వాడి ముందు దైవ వాక్యాలను చదివి వినిపించినపుడు వింటాడుగాని, విననట్లే అహంకారంతో నిక్కుతూ ఉంటాడు. కనుక నీవు వాడికి బాధాకరమయిన శిక్ష పడుతుందన్న శుభవార్తను వినిపించు. 9. మా సూక్తులలోని ఏదన్నా విషయం అతనికి తెలిసినపుడు, దానిని వేళాకోళం చేస్తాడు. ఇలాంటి వారికి అవమానకరమయిన శిక్ష ఉంటుంది. 10. వారికి ముందు నరకం ఉంది. వారు సంపాదించుకున్నదేదీ వారికి ఉపయోగపడదు. అల్లాహ్‌ను కాదని వారు కార్యసాధకులుగా చేసుకున్న వారు కూడా వారికి పనికిరారు. వారికి మహా కఠినమయిన శిక్ష ఉంటుంది. 11. ఇదీ మార్గదర్శకత్వం. తమ ప్రభువు వచనాలను తిరస్కరించిన వారికి గుండె పగిలిపోయే బాధాకరమయిన శిక్ష ఉంటుంది.

12. అల్లాహ్‌యే మీ కొరకు సముద్రాన్ని ఉపయుక్తంగా చేశాడు – ఆయన ఆజ్ఞానుసారం అందులో ఓడలు పయనించాలని! మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించాలని! ఇంకా, మీరు కృతజ్ఞులుగా వ్యవహరించాలని!
13. ఇంకా ఆయన భూమ్యాకాశాలలో ఉన్న వస్తువులన్నింటినీ – తన తరఫున – మీ సేవలో నిమగ్నులై ఉండేలా చేశాడు. నిశ్చయంగా ఇందులో ఆలోచించే జనులకు పలు సూచనలున్నాయి.

14. (ఓ ప్రవక్తా!) అల్లాహ్ ఒక వర్గం వారికి, వారు సముపార్జించిన దాని ప్రతిఫలం ఎలాగూ ఇస్తాడు గనక, అల్లాహ్ తరఫున (గడ్డు) దినాలు రావటంపై నమ్మకం లేని వారిని క్షమించి వదలిపెట్టమని విశ్వసించిన వారికి చెప్పు.
15. ఏ వ్యక్తి అయినా సదాచరణ చేసుకుంటే, దాని లాభం స్వయంగా అతనికే కలుగుతుంది. మరే వ్యక్తి అయినా చెడు చేస్తే దాని పాపభారం అతని మీదే పడుతుంది. దరిమిలా మీరంతా మీ ప్రభువు వైపునకే మరల్చబడతారు.

16. మేము ఇస్రాయీల్ సంతతివారికి గ్రంథాన్నీ, యుక్తినీ, ప్రవక్తా పదవిని ప్రసాదించాము. ఇంకా – వారికి మేము పరిశుద్ధమైన జీవనోపాధిని ఇచ్చాము. లోకవాసులపై వారికి ప్రాధాన్యతను వొసగాము.
17. ధర్మావలంబనకు సంబంధించిన స్పష్టమయిన నిదర్శనాలను కూడా వారికి అనుగ్రహించాము. కాని తీరా జ్ఞానం వచ్చేసిన మీదటే వారు పరస్పర అసూయ, ఓర్వలేనితనం కారణంగా విభేదించుకున్నారు. నిశ్చయంగా నీ ప్రభువు ప్రళయదినాన వారు పరస్పరం విభేదించుకునే విషయాల గురించి – వారి మధ్యన తీర్పు ఇస్తాడు.
18. తరువాత మేము నిన్ను ధర్మం యొక్క ఒక స్పష్టమయిన విధానంపై స్థిరపరచాము. కనుక నీవు దీనినే అనుసరించు. అజ్ఞానుల ఆకాంక్షలను అనుసరించకు.
19. వారు అల్లాహ్‌కు ప్రతిగా నీకు ఏ విధంగానూ పనికి రారు. నిశ్చయంగా దుర్మార్గులు ఒండొకరికి చేదోడు వాదోడుగా ఉంటారు. భక్తిపరులకు అండగా ఉండేవాడు అల్లాహ్ మాత్రమే.
20. ఇవి ప్రజల యెడల దూరదృష్టితో కూడుకున్న విషయాలు. దృఢనమ్మకం గల జనులకు మార్గదర్శకత్వంతో, కారుణ్యంతో కూడుకున్నవి.

21. ఏమిటి, పాపాలకు ఒడిగట్టిన వారు తమనూ – విశ్వసించి మంచి పనులు చేసిన వారిని ఒకే విధంగా పరిగణిస్తామనీ, వారందరి జీవన్మరణాలు సమానంగా ఉంటాయని తలపోస్తున్నారా? వారు గైకొన్న ఈ నిర్ణయం చాలా చెడ్డది. 22. అల్లాహ్ భూమ్యాకాశాలను వివేకంతో సృష్టించాడు– ప్రతి వ్యక్తికీ అతను చేసుకున్న దాని ప్రతిఫలం సంపూర్ణంగా ఇవ్వాలని. వారికెలాంటి అన్యాయం జరగదు.

23. తన మనోభిరామాన్ని తన ఆరాధ్య దైవంగా చేసుకున్న వానిని నీవు చూశావా? అతని దగ్గర జ్ఞాన సంపద ఉన్నప్పటికీ అల్లాహ్ అతనిని అపమార్గానికి లోను చేశాడు. అతని చెవులపై, అతని హృదయంపై సీలు వేసేశాడు. అతని నేత్రాలపై పరదా వేసేశాడు. అల్లాహ్ అపమార్గం పట్టించిన తర్వాత ఇక అలాంటి వ్యక్తికి మార్గదర్శకత్వం వహించగల వాడెవడు? ఏమిటి, మీరు హితబోధను గ్రహించరా?

24. వారిలా అంటారు : 'మా ఈ ప్రాపంచిక జీవితం తప్ప మరో జీవితం లేదు. మేము మరణిస్తున్నాము. జీవిస్తున్నాము. ఈ కాల చక్రమే మమ్మల్ని చంపుతోంది' – అసలు విషయమేమిటంటే, దీని గురించి వారికి బొత్తిగా తెలీదు. వారు కేవలం అనుమానాల అయ్యలుగా మాట్లాడుతున్నారు. 25. వారికి మా స్పష్టమయిన వచనాలను వినిపించినపుడు, 'ఒకవేళ మీరు చెప్పేదే నిజమైతే మా తాతముత్తాతలను బ్రతికించి తీసుకురండి' అని హఠం చేయటం తప్ప వారి వద్ద మరో ఆధారమేదీ ఉండదు. 26.వారికి చెప్పు : 'అల్లాహ్యే మిమ్మల్ని బ్రతికిస్తున్నాడు, తరువాత ఆయనే మిమ్మల్ని చంపుతున్నాడు, తరువాత ఆయనే ప్రళయదినాన మిమ్మల్ని సమావేశ పరుస్తాడు. ఇందులో ఎలాంటి సందేహం లేదు. కాని చాలామంది తెలుసుకోరు.'

27. భూమ్యాకాశాల సార్వభౌమత్వం అల్లాహ్కే చెందుతుంది. ఏ రోజున ప్రళయం నెలకొంటుందో ఆనాడు అసత్యవాదులు నష్టంలో ఉంటారు.

28. ప్రతి సముదాయం మోకాళ్ళపై పడి ఉండటం నీవు చూస్తావు. ప్రతి వర్గం తన కర్మల పత్రం వైపు పిలువబడుతుంది. 'ఈ రోజు మీకు మీరు చేసుకున్నదాని ప్రతిఫలమే ఇవ్వబడుతుంది. 29. ఇదిగో! ఇదే మీ రిజిస్టరు. మీ గురించి ఇది ఉన్నదున్నట్టుగా సాక్ష్యమిస్తోంది. మీరు చేసేదంతా మేము నమోదు చేయించేవాళ్ళం' (అని వారికి చెప్పబడుతుంది).

30. కనుక విశ్వసించి, సత్క్రియలాచరించిన వారిని, వారి ప్రభువు తన కారుణ్యంలో చేర్చుకుంటాడు. ఇదే స్పష్టమయిన సాఫల్యం. 31. మరెవరయితే తిరస్కరించారో (వారితో ఇలా అనబడుతుంది) ; 'ఏమిటి, మా వచనాలు మీకు చదివి వినిపించబడలేదా? కాని మీరు అహంకారం ప్రదర్శించారు. మీరు అపరాధ జనులు. 32. 'ప్రళయ వాగ్దానం సత్యం. ఆ ఘడియ సంభవించటంలో సందేహమే లేదు' అని మీతో అనబడినపుడు, 'ప్రళయం అంటే ఏమిటో మాకు తెలియదు. కాకపోతే దానికి సంబంధించి మాకు ఊహామాత్రంగా అనుమానముందంతే. అంతకుమించి మాకు ఎలాంటి నమ్మకం లేద'ని మీరు చెప్పేవారు.

33. వారి కర్మల చెడుగులన్నీ వారిపై ప్రస్ఫుటం అవుతాయి. వారు ఎగతాళి చేసినదే వారిని చుట్టుముడుతుంది. 34. వారితో ఇలా అనబడుతుంది : 'మీరు ఈనాటి ఈ సమావేశాన్ని విస్మరించినట్లే మేము మిమ్మల్ని విస్మరిస్తాము. ఇక మీ నివాసం నరకమే. ఇక్కడ మీకు సహాయపడే వాడెవడూ లేడు.' 35. ఇలా ఎందుకంటే, మీరు దైవ వచనాలను ఎగతాళి చేశారు. ప్రాపంచిక జీవితం మిమ్మల్ని మోసపుచ్చింది. కాబట్టి ఈ రోజు వారు దాన్నుండి బయటికి తీయబడరు. వారి సంజాయిషీ కూడా ఆమోదించబడదు.

36. కాబట్టి గగనాల ప్రభువు, భువన ప్రభువు, సమస్త లోకాల ప్రభువు అయిన అల్లాహ్‌కే స్తోత్రం శోభాయమానం. 37. గగన భువనాలలో పెద్దరికం ఆయనకే చెందుతుంది. ఆయనే శక్తిమంతుడు, వివేకవంతుడు.

# 46. అల్ అహ్‌ఖాఫ్ (ఇసుక దిబ్బలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (26) 1.హా–మీమ్. 2. ఈ గ్రంథం శక్తిశాలి, వివేచనాశీలి (అయిన అల్లాహ్) తరఫున అవతరింపజేయబడినది. 3. మేము భూమ్యాకాశాలను, వాటి మధ్యనున్న వస్తువులన్నింటినీ సత్య (లక్ష్య) బద్ధంగా – ఒక నిర్ణీత గడువు కొరకు – సృష్టించాము. తిరస్కార వైఖరిని అవలంబించేవారు మాత్రం తమకు భయబోధ చేయబడే దానిపట్ల విముఖులవుతున్నారు.

4. (ప్రవక్తా!) వారిని అడుగు : 'అల్లాహ్‌ను కాదని మీరు మొరపెట్టుకునే వాటిని గురించి ఎన్నడయినా ఆలోచించారా? వారు భువిలో చేసిందేమిటో నాకు చూపండి? పోనీ గగన సీమల్లో వారికేదన్నా భాగస్వామ్యం ఉన్నదా? మీరు చెప్పేదే నిజమయితే, దీనికి పూర్వం ఉన్న ఏదన్నా గ్రంథంగానీ, చెలామణిలో ఉన్న ఏదన్నా జ్ఞాన విశేషంగానీ నా వద్దకు తీసుకురండి.' 5. అల్లాహ్‌ను వదలి ప్రళయదినం వరకూ తన పిలుపుకు సమాధానం ఇవ్వలేని వారిని ప్రార్థించే వాని కంటే ఎక్కువ మార్గభ్రష్టుడెవడుంటాడు? తమను మొరపెట్టుకున్న సంగతి కూడా (కనీసం) వారికి తెలిసి ఉండదు. 6. జనులు సమావేశపరచబడినపుడు, వారు వారికి శత్రువులైపోతారు. తమను ఆరాధించిన విషయాన్ని వారు నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చుతారు.

7. సుస్పష్టమయిన మా వాక్యాలను వారికి చదివి వినిపించినప్పుడు, ఈ సత్యతిరస్కారులు తమ వద్దకు వచ్చిన సత్యం గురించి మాట్లాడుతూ, 'ఇదొక పచ్చి మంత్రజాలమే' అంటారు. 8. అతనే (ముహమ్మదే) స్వయంగా తన తరఫున దీనిని కల్పించుకున్నాడని వారంటున్నారా? వారితో అను : 'ఒకవేళ నేను దీనిని నా తరఫున కల్పించుకుని ఉంటే, మీరు నన్ను అల్లాహ్ పట్టు నుండి ఏ విధంగానూ కాపాడలేరు. మీరు కల్పించుకునే మాటల గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు. నాకూ – మీకూ మధ్య సాక్షిగా ఆయన ఒక్కడే చాలు. ఆయన క్షమించేవాడు, కరుణించేవాడు.'

9. వారికి చెప్పు : 'నేనే మీ విలక్షణమైన ప్రవక్తను కాను. (రేపు) నా పట్ల ఏం జరుగుతుందో, మీ పట్ల ఏం జరుగుతుందో నాకు తెలియదు. నా వద్దకు పంపబడిన సందేశాన్ని మాత్రమే నేను అనుసరిస్తాను. నేను స్పష్టంగా భయబోధ చేసేవాడను మాత్రమే.' 10. ఇలా చెప్పు : 'మీరెప్పుడయినా ఆలోచించారా? ఒకవేళ ఈ ఖుర్‌ఆన్ అల్లాహ్ తరపు నుండి ఉంటే, మీరు దీనిని తిరస్కరించినట్లయితే, ఇస్రాయీల్ వంశీయులలోని ఒక సాక్షి ఇలాంటి ఒక గ్రంథంపై సాక్ష్యం కూడా ఇచ్చి, అతను విశ్వసించి ఉండగా మీరు గర్వాహంకారం ప్రదర్శిస్తే (మీ పరిణామం ఎలా ఉంటుందో ఊహించారా?) నిశ్చయంగా అల్లాహ్ దుర్మార్గులకు మార్గదర్శకత్వం వహించడు.

11. సత్య తిరస్కారులు విశ్వాసుల గురించి ఇలా అంటున్నారు : 'ఒకవేళ అందులో (ఇస్లాంలో) మంచి అనేదే ఉంటే, దాన్ని అవలంబించే విషయంలో వాళ్ళు మాకన్నా ముందుకుపోయే వారు కాదు.' వారెలాగూ దీనిద్వారా మార్గదర్శకత్వం పొందలేదు కాబట్టి 'ఇదొక పురాతన అబద్ధం' అంటూ తేలిగ్గా కొట్టివేస్తారు.

12. ఇంతకు మునుపు మూసా గ్రంథం మార్గదర్శినిగా, కారుణ్య వాహినిగా ఉండేది. కాగా; అరబీ భాషలో ఉన్న ఈ గ్రంథం (ఖుర్‌ఆన్) దానిని ధ్రువపరుస్తోంది–తద్వారా దుర్మార్గులను హెచ్చరించటానికి, సదాచార సంపన్నులకు శుభవార్త వినిపించటానికి! 13. నిశ్చయంగా ఎవరయితే 'అల్లాహ్‌యే మా ప్రభువు' అని పలికి, తరువాత దానిపై నిలకడగా ఉన్నారో, వారికెలాంటి భయంగానీ, దుఃఖంగానీ ఉండదు. 14. వారే స్వర్గవాసులు. వారందులో శాశ్వతంగా ఉంటారు. ఇది వారు చేసుకున్న సదాచారాలకు తగిన ప్రతిఫలం.

15. తన తల్లిదండ్రుల యెడల ఉత్తమంగా ప్రవర్తించమని మేము మానవునికి తాకీదు చేశాము. అతని తల్లి అతనిని బాధను భరిస్తూనే తన కడుపులో మోసింది. బాధను భరిస్తూనే అతనిని ప్రసవించింది. అతనిని గర్భస్థ శిశువుగా మోయటానికిగాని, అతని పాలు విడిపించటానికి గాని ముప్పయి మాసాలు పట్టింది. కడకు అతను పూర్తి పరిపక్వతకు, నలుబది ఏండ్ల ప్రాయానికి చేరుకున్నప్పుడు ఇలా విన్నవించుకున్నాడు : 'నా ప్రభూ!

(నన్ను వినయశీలిగా ఉంచు). నీవు నాపైనా, నా తల్లిదండ్రులపైనా కురిపించిన అనుగ్రహ భాగ్యాలకు గాను నీకు కృతజ్ఞుడనై ఉండేలా, నీ ప్రసన్నతను బడసే సత్కార్యాలు చేసేలా నాకు తోడ్పాటునందించు. నా కొరకు నా సంతానాన్ని కూడా సజ్జనులుగా తీర్చిదిద్దు. నేను చిత్తశుద్ధితో నీ వైపునకే మరలుతున్నాను. నీ విధేయతకు తలఒగ్గిన వారిలో నేనూ ఒకణ్ణి.'
16. ఇలాంటి వారి సదాచరణలనే మేము సమ్మతించి ఆమోదిస్తాము. వారి తప్పులను ఉపేక్షిస్తాము. వారు స్వర్గవాసులలో ఉంటారు. ఇది వారికి చేయబడిన నిజమయిన వాగ్దానం.

17. మరెవడయితే తన తల్లిదండ్రులతో, 'నేను మీతో విసుగెత్తి పోయాను. నేను మళ్లీ (గోరీ నుండి) లేపబడతానని మీరు నన్ను అదేపనిగా భయపెడతారా? వాస్తవానికి నాకు పూర్వం ఎన్నో సముదాయాలు గతించాయి' అని అంటాడో (అతని పెడసరి ధోరణికి సమాధానంగా) వారిరువురూ అల్లాహ్‌కు నివేదించుకుంటూ; 'నీ పాడుగానూ! నువ్వు విశ్వసించరా! అల్లాహ్ వాగ్దానం సత్యమయిందిరా!' అంటారు. దానికతను, 'అంతా వట్టిదే. ఇవన్నీ పూర్వీకుల కట్టుకథలు' అంటాడు. 18. ఇలాంటి వారిపై (శిక్షా) వాక్కు రూఢీ అయింది. వీరికి పూర్వం గడచిన జిన్నుల, మానవ వర్గాల్లోనే వీరూ చేరిపోతారు. నిశ్చయంగా వీరు నష్టంలో పడిపోయినవారే.

19. ప్రతి ఒక్కరికీ వారి ఆచరణలను బట్టి తరగతులుంటాయి – వారి ఆచరణలకు తగ్గ ప్రతిఫలం అల్లాహ్ వొసగటానికే (ఈ తరగతులు). వారికి ఎలాంటి అన్యాయం జరగదు. 20. సత్యతిరస్కారులు నరకాగ్ని ముందుకు తేబడినపుడు (వారితో ఇలా అనబడుతుంది), మీరు మీ మంచి వస్తువులను ప్రాపంచిక జీవితంలోనే పొందారు. వాటిని అక్కడే అనుభవించారు. కాబట్టి ఈ రోజు మీకు పరాభవంతో కూడిన శిక్ష విధించబడుతుంది. ఎందుకంటే మీరు ప్రపంచంలో అకారణంగా అహంకారం చూపేవారు. ఇంకా ఎందుకంటే మీరు అవిధేయులుగా ప్రవర్తించేవారు.

21. ఆద్ సోదరుడు (అయిన హూద్)ను జ్ఞప్తికి తెచ్చుకోండి. అతను తన జాతి వారిని ఇసుక దిబ్బల వద్ద భయబోధ చేశాడు. భయబోధ చేసేవారు అతనికి పూర్వం కూడా గతించారు; అతని తరువాత కూడా వచ్చారు.

(అతనిలా బోధించాడు) : 'అల్లాహ్‌ను తప్ప మీరు వేరితరులను ఆరాధించకండి. ఒక మహా గడ్డుదినమున మీపై విరుచుకుపడే శిక్ష గురించి నేను భయపడుతున్నాను.' 22. దానికి వారిలా అన్నారు : 'ఏమిటి, మా ఆరాధ్య దైవాల నుండి మమ్మల్ని దూరం చేయడానికేనా నువ్వు వచ్చింది? ఒకవేళ నీవు చెప్పేదే నిజమయితే, నీవు వాగ్దానం చేస్తున్నదానిని మాపైకి తీసుకురా?' 23. అతనిలా అన్నాడు : 'దాని జ్ఞానం మాత్రం అల్లాహ్ వద్దనే ఉంది. నాకిచ్చి పంపబడిన సందేశాన్ని మాత్రమే నేను మీకు అందజేస్తున్నాను. కాని మీరు మాత్రం నాకు మరీ మూర్ఖజనంలా కనిపిస్తున్నారు.'

24. ఆ విపత్తు కారుమేఘం రూపంలో తమ లోయవైపు రావటం చూసి వారు 'ఇది మాపై కురవటానికి వస్తున్న మబ్బుతునక' అన్నారు. కానే కాదు. వాస్తవానికి అది మీరు తొందరపెట్టిన ప్రమాద సంకేతం! అదొక పెనుగాలి. అందులో వ్యధాభరితమయిన శిక్ష అంతర్లీనమై ఉంది. 25. అది తన ప్రభువు అనుజ్ఞతో ప్రతి దానిని పెకలించివేస్తుంది. తరువాత జరిగిందేమిటంటే; వారి ఇండ్లు తప్ప అక్కడేమీ కానరాలేదు. అపరాధ జనులకు మేము జరిపే శాస్తి ఇలాగే ఉంటుంది.

26. పలు విషయాలలో మేము మీకు ఇవ్వని శక్తిని వారికి ఇచ్చాము. మేము వారికి చెవులిచ్చాము, కళ్ళిచ్చాము. హృదయాలిచ్చాము. కాని వారు దైవసూచనలను తిరస్కరించిన కారణంగా వారి చెవులు, కళ్లు, వారి హృదయాలు వారికేవిధంగానూ ఉపయోగపడలేదు. చివరకు వారు పరిహసించినదే వారిని ముట్టడించింది. 27. మేము మీ చుట్టుప్రక్కల ఉన్న పురములను కూడా ధ్వంసం చేశాము. వారు తమ ధోరణిని మానుకుంటారేమోనని మేము మాటిమాటికీ మా సూచనలను చూపించాము. 28. దైవ సామీప్యం పొందే ఉద్దేశంతో వారు అల్లాహ్‌ను వదలి ఆశ్రయించిన వారి ఆరాధ్య దైవాలు వారికి ఎందుకు సహాయపడలేదు? పైగా వారంతా వీళ్ళ నుండి అదృశ్యమైపోయారు. నిజానికి అదంతా వారి అసత్యం! వారి అభూత కల్పన!!

29. (ప్రవక్తా!) మేము జిన్నుల సమూహం ఒకదానిని నీ వైపు తీసుకు వచ్చినపుడు, వారు ఖుర్‌ఆన్ వినసాగారు. వారు అతనిని సమీపించినపుడు,

'నిశ్శబ్దంగా ఉండండి' అన్నారు. ఖుర్‌ఆన్ పఠనం పూర్తయిన తరువాత వారు, భయబోధ చేసేవారుగా తమ జాతివారి వద్దకు తిరిగి వెళ్ళారు.

30. వారిలా అన్నారు : 'మా జాతి వారలారా! మూసా తరువాత అవతరింపజేయబడిన ఒక గ్రంథాన్ని మేము విన్నాము. అది తనకు పూర్వం ఉన్న గ్రంథాలన్నింటినీ సత్యమని ధ్రువీకరిస్తోంది. అది సత్యం వైపునకు, రుజుమార్గం వైపునకు దారి చూపుతోంది.

31. ఓ మా జాతివారలారా! అల్లాహ్ వైపునకు పిలిచేవాని సందేశాన్ని స్వీకరించండి. అతనిని విశ్వసించండి. అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు. వ్యధాభరితమయిన యాతన నుండి మిమ్మల్ని కాపాడుతాడు.

32. అల్లాహ్ వైపు పిలిచేవాని పిలుపుకు స్పందించనివాడు భువిలో ఆయన అదుపాజ్ఞల నుండి తప్పించుకుపోలేడు. అల్లాహ్ తప్ప అతనికి సాయం చేసేవాడు కూడా ఎవడూ ఉండడు. ఇలాంటివారే స్పష్టమయిన అపమార్గానికి లోనై ఉన్నారు.'

33. ఏమిటి, వారు గమనించటం లేదా? భూమ్యాకాశాలను సృష్టించిన దేవుడు, వాటిని సృష్టించటంలో ఏమాత్రం అలసిపోనివాడు, మృతులను తిరిగి బ్రతికించగలడన్న విషయాన్ని వారు గ్రహించటంలేదా? ఎందుకు బ్రతికించలేడు? ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

34. ఈ సత్యతిరస్కారులు నరకాగ్ని ముందుకు తీసుకురాబడిన రోజున (వారితో ఇలా అనబడుతుంది) : 'ఏమిటి, ఇది సత్యం కాదా?' దానికి వారు, 'ఎందుకు కాదు? మా ప్రభువు తోడుగా! (ఇది సత్యమే)' అనంటారు. సెలవీయబడుతుంది : 'మరయితే మీ తిరస్కార వైఖరికి బదులుగా శిక్షను చవిచూడండి.'

35. కనుక (ఓ ప్రవక్తా!) స్థిర సంకల్పులైన ప్రవక్తలు ఓర్పు వహించినట్లే నీవు కూడా ఓర్పు వహించు. వారి విషయంలో తొందరపెట్టకు. వారికి వాగ్దానం చేయబడుతున్న దానిని వారు ప్రత్యక్షంగా చూసుకున్నప్పుడు, వారు దినములో ఒక గడియ కాలం కన్నా ఎక్కువగా (ప్రపంచంలో) ఉండలేదని భావిస్తారు. ఈ సందేశాన్ని అందజేయటం నీ కర్తవ్యం. అవిధేయతకు ఒడిగట్టే జనమే అంతమవుతుంది.

# 47. ముహమ్మద్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఎవరు సత్యాన్ని తిరస్కరించి, దైవమార్గం నుండి (ఇతరులను) అడ్డుకున్నారో, వారి కర్మలను దేవుడు నిష్ఫలం గావించాడు. 2. మరెవరు విశ్వసించి, సత్క్రియలాచరించారో, ముహమ్మద్‌పై అవతరింపజేయబడిన దానిని నమ్మినడుచుకున్నారో – వారి ప్రభువు తరఫు నుండి ఉన్న సత్యం అదేను – దేవుడు వారి చెడులను వారి నుండి దూరం చేశాడు. వారి పరిస్థితిని చక్కదిద్దాడు. 3. ఇలా ఎందుకంటే; తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారు మిథ్యావాదాన్ని అనుసరించగా, విశ్వసించినవారేమో తమ ప్రభువు నుండి వచ్చిన సత్యాన్ని అనుసరించారు. ఈ విధంగా అల్లాహ్ జనుల కొరకు వారి ఉదాహరణను వివరిస్తున్నాడు.

4. కనుక సత్య తిరస్కారులను (కదన రంగంలో) మార్కొన్నప్పుడు వారి మెడలపై వ్రేటువెయ్యండి. కడకు వారిని పూర్తిగా ఓడించిన పిదప (ఖైదీలుగా) గట్టిగా నిర్బంధించండి. ఆ తరువాత ఉపకార భావంతో వారిని విడిచిపెట్టినా లేక పరిహారం పుచ్చుకుని విడుదల చేసినా (అది మీ ఇష్టం). యుద్ధం చేసేవారు తమ ఆయుధాలను పడవేసేదాకా (పోరు ఆగకూడదు. దైవాజ్ఞమాత్రం) ఇదే. అల్లాహ్ గనక కోరితే స్వయంగా ఆయనే ప్రతీకారం తీర్చుకునేవాడు. కాని ఆయన మీలో కొందరిని మరి కొందరి ద్వారా పరీక్షించేందుకే ఇదంతా. అల్లాహ్ మార్గంలో చంపబడిన వారి కర్మలను ఆయన ఎట్టి పరిస్థితిలోనూ వృధా కానివ్వడు. 5. ఆయన వారికి మార్గదర్శకత్వం వహిస్తాడు, వారి స్థితిగతులను తీర్చిదిద్దుతాడు. 6. తాను వారికి పరిచయం చేసివున్న స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు.

7. ఓ విశ్వాసులారా! మీరు గనక అల్లాహ్‌కు సహాయం చేస్తే అల్లాహ్ మీకు సహాయం చేస్తాడు. మీ పాదాలకు నిలకడను ప్రసాదిస్తాడు. 8. మరెవరయితే తిరస్కార వైఖరిని అవలంబించారో, వారికి వినాశం తథ్యం.

(దేవుడు) వారి కర్మలను వృధా గావిస్తాడు. 9. ఇలా ఎందుకంటే, అల్లాహ్ అవతరింపజేసిన దానిని వారు సహించలేకపోయారు. అందుకే అల్లాహ్ వారి కర్మలను నిష్ఫలం చేసేశాడు. 10. ఏమిటి, వారు తమకు పూర్వం గడచిన వారి పరిణామాన్ని వీక్షించటానికి భువిలో సంచరించలేదా? అల్లాహ్ వారిని తుక్కు తుక్కు చేసేశాడు. సత్యతిరస్కారుల ముందు ఇలాంటి వారి దృష్టాంతాలే రావలసి ఉంది. 11. ఇలా ఎందుకంటే, అల్లాహ్ విశ్వాసుల రక్షకుడుగా ఉన్నాడు. అవిశ్వాసులకు రక్షకుడుగా ఎవడూ లేడు.

12. నిశ్చయంగా అల్లాహ్ విశ్వసించి, సత్కార్యాలు చేసేవారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. ఇక సత్యతిరస్కారుల విషయానికి వస్తే, వారు ప్రాపంచిక భోగభాగ్యాలను జుర్రుకోవటంలోనే లీనమయ్యారు. పశువుల మాదిరిగా మెక్కుతున్నారు. నరకాగ్నే వారి నివాసం అవుతుంది. 13. (ఓ ముహమ్మద్!) నిన్ను వెళ్ళగొట్టిన ఈ నగరం కన్నా బలోపేతమయిన ఎన్నో నగరాలుండేవి. మేము వాటిని అంతమొందించాము. అప్పుడు వారికి సహాయపడేవాడు ఎవడూ లేకపోయాడు.

14. ఏమిటి, తన ప్రభువు తరఫున స్పష్టమయిన నిదర్శనంపై ఉన్న వ్యక్తి, ఎవడి దుష్కర్మలు అతనికి అందమైనవిగా చేయబడ్డాయో, ఎవరు తమ ఆకాంక్షలను అనుసరిస్తున్నారో వారిలాంటివాడు కాగలడా? 15. ధర్మనిష్ఠాపరులకు వాగ్దానం చేయబడిన స్వర్గం ఉపమానం ఇది : అందులో ప్రవహించే నీటి కాలువలు ఉంటాయి. ఆ నీటిలో ఎలాంటి మార్పూ రాదు. పాల కాలువలు ఉంటాయి. వాటి రుచిలో మార్పు ఉండదు. మధువు ప్రవహించే కాలువలుంటాయి. అది త్రాగే వారికి మృదు మధురంగా, కమ్మగా ఉంటుంది. స్వచ్ఛమయిన తేనె కాలువలుంటాయి. వారి కొరకు అక్కడ అన్ని రకాల పండ్లు ఉంటాయి. వారి ప్రభువు తరఫున క్షమాభిక్ష ఉంటుంది. (చెప్పండి! స్వర్గసుఖాలు పొందే) వీరు సతతం నరకాగ్నిలో ఉండే వారితో, త్రాగేందుకు మరిగే నీరు ఇవ్వబడేవారితో, తత్కారణంగా ప్రేగులు ముక్కలు ముక్కలు అయ్యేవారితో సమానులు కాగలరా?

16. వారిలో కొందరు నీ వైపు చెవియొగ్గి వినేవారు కూడా ఉన్నారు. కడకు వారు నీ వద్ద నుండి నిష్క్రమించిన తరువాత, జ్ఞానమొసగబడిన వారితో, 'ఇందాక అతను చెప్పిందేమిటి!' అని ఆరా తీస్తారు. ఇలాంటి వారి హృదయాల మీదనే అల్లాహ్ సీలు వేశాడు. వారు కేవలం తమ కోర్కెల వెనుక పరుగెత్తుతూ ఉంటారు. 17. ఎవరయితే సన్మార్గాన్ని అవలంబిస్తారో, అల్లాహ్ వారి సన్మార్గంలో మరింత వృద్ధిని ప్రసాదిస్తాడు. వారికి భక్తిపరాయణ తను ప్రసాదిస్తాడు.

18. మరయితే వీరు ప్రళయ ఘడియ తమపై అకస్మాత్తుగా రావాలని ఎదురు చూస్తున్నారా? వాస్తవానికి దాని చిహ్నాలు ఇప్పటికే పొడసూపాయి. అది వచ్చిపడినపుడు, ఉపదేశం గ్రహించే అవకాశం వారికెక్కడుంటుంది? 19. కనుక తెలుసుకో! అల్లాహ్ తప్ప మరో దైవం లేనేలేదు. నీ పొరపాట్ల మన్నింపుకై వేడుకుంటూ ఉండు. విశ్వాసులయిన పురుషుల, విశ్వాసులైన స్త్రీల క్షమాపణ కొరకు కూడా ప్రార్థించు. మీ కదలికలను గురించి, మీరు బస చేయటం గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు.

20. విశ్వసించినవారు, '(ధర్మయుద్ధానికి సంబంధించిన) సూరా ఏదయినా ఎందుకు అవతరించలేదు?' అని అడుగుతున్నారు. అయితే ఒక స్పష్టమయిన సూరా అవతరించినపుడు, అందులో యుద్ధ ప్రస్తావన కూడా ఉన్నప్పుడు, హృదయాలలో రోగం ఉన్నవారు మృత్యువు ఆవహించినవాని మాదిరిగా నీ వైపు చూడటం నీవు గమనిస్తావు. అలాంటివారికి మూడుతుంది. 21. ఆజ్ఞను శిరసావహించాలి. మంచి మాటను పలకాలి. (యుద్ధానికి సంబంధించిన) తుది నిర్ణయం గైకొన్నప్పుడు, వారు అల్లాహ్ పక్షాన సత్యవంతులుగా నిలిస్తే, అది వారికే శ్రేయోదాయకం అయ్యేది. 22. ఒకవేళ మీరు (ఆజ్ఞాపాలన నుండి) మరలిపోతే, మీరు భువిలో అరాచకాన్ని సృష్టించటం, బంధుత్వ సంబంధాలను త్రెంచటం తప్ప మరో మంచిని మీ నుండి ఆశించటానికి ఆస్కారముండదు. 23. ఇలాంటివారినే అల్లాహ్ తన కారుణ్యం నుండి దూరంగా విసరివేశాడు. వారిని చెవిటివారిగా చేశాడు. వారి కళ్ళకు అంధత్వాన్ని ఇచ్చాడు.

24. ఏమిటి, వీరు ఖుర్‌ఆన్‌పై చింతన చేయరా? లేక వారి హృదయాలపై తాళాలు పడి ఉన్నాయా? 25. ఎవరయితే తమపై మార్గదర్శకత్వం తేటతెల్లమయిన తరువాత వెన్నుచూపి తిరిగిపోయారో, వారిని షైతాన్ మభ్యపెట్టాడు. (అల్లాహ్) వారికి విడుపు ఇచ్చాడు. 26. ఇలాంటి స్థితికి కారణమేమిటంటే; వీరు దేవుడు అవతరింపజేసిన దానిని సహించలేని వారితో ఇలా అన్నారు : 'మేము కొన్ని విషయాలలో మీరు చెప్పినట్లుగా మసలుకుంటాము.' వారి లోగుట్టు వ్యవహారమంతా దైవానికి ఎరుకే. 27. దైవదూతలు వారి ఆత్మలను స్వాధీనం చేసుకుంటూ ఎడాపెడా వారి చెంపలపై, వారి వీపులపై వాయిస్తున్నప్పుడు వారి పరిస్థితి ఎలా ఉంటుంది? 28. ఈ స్థితికి కారణమేమిటంటే, వారు అల్లాహ్‌ను ఆగ్రహోదగ్రుణ్ణి చేసే పంథాను అవలంబించారు. ఆయన ప్రసన్నతను వారు అభిలషించలేదు. అందుకే అల్లాహ్ వారి కర్మలను వృధా గావించాడు.

29. హృదయాలలో రోగం ఉన్నవారు, తమ (అంతర్యాలలో ఉన్న) కుళ్లును అల్లాహ్ బయటపెట్టడని అనుకుంటున్నారా? 30. మేము గనక తలచుకుంటే వాళ్ళందరినీ నీకు చూపి ఉండేవారం. అయినా నీవు వారి చిహ్నాలను బట్టి వారిని పసిగట్టగలవు. వారి సంభాషణా సరళినిబట్టి వారిని తెలుసుకోగలవు. మీ ఆచరణలను అల్లాహ్ బాగా ఎరుగు.

31. మేము మిమ్మల్ని అవశ్యంగా పరికిస్తాము – తద్వారా మీలో ధర్మయుద్ధం చేసేవారెవరో, సహన స్థయిర్యాలు చూపేవారు ఎవరో తెలుసుకోవాలని! మీ స్థితిగతులను పరీక్షించాలని! 32. నిశ్చయంగా ఎవరయితే తిరస్కార వైఖరికి ఒడిగట్టారో, దైవమార్గం నుండి నిరోధించారో, మార్గదర్శకత్వం తమకు స్పష్టమయిన తరువాత కూడా దైవప్రవక్తలను వ్యతిరేకించారో, వారు అల్లాహ్‌కు ఎంతమాత్రం నష్టం కలిగించలేరు. అల్లాహ్ వారి కర్మలను నిష్ఫలం గావిస్తాడు.

33. ఓ విశ్వాసులారా! అల్లాహ్‌కు విధేయత చూపండి. ప్రవక్తకు విధేయులై ఉండండి. మీ కర్మలను వ్యర్థం చేసుకోకండి.

34. నిశ్చయంగా తిరస్కార వైఖరికి పాల్పడి, దైవమార్గం నుండి (జనులను) అడ్డుకుని, తిరస్కార స్థితిలోనే మరణించినవారిని అల్లాహ్ సుతరామూ క్షమించడు. 35. కనుక మీరు ధైర్యం వీడకండి. (అవసరం లేకపోయినప్పటికీ) సంధికోసం విజ్ఞప్తి చేయకండి. అంతిమ విజయం మీదే అవుతుంది. అల్లాహ్ మీకు తోడుగా ఉన్నాడు. ఆయన మీ కర్మలలో ఎన్నటికీ కోత విధించడు.

36. ప్రాపంచిక జీవితమైతే ఓ క్రీడ, వినోద వస్తువు మాత్రమే. మీరు గనక విశ్వసించి, నిష్ఠతో జీవించినట్లయితే అల్లాహ్ మీకు మీ ప్రతిఫలాన్ని వొసగుతాడు. ఆయన మీ నుండి మీ సొమ్ములను అడగడు. 37. ఒకవేళ ఆయన మీ నుండి మీ ధనాన్ని అడిగితే, ఆఖరి వరకూ అడుగుతూనే ఉంటే, మీరు పిసినారులుగా ప్రవర్తించవచ్చు, అప్పుడు అల్లాహ్ మీలోని లోభత్వాన్ని (కల్మషాన్ని) బట్టబయలు చేయవచ్చు. 38. ఇదిగో! దైవమార్గంలో ఖర్చుచేయండి అని మీకు పిలుపు ఇవ్వబడినపుడు, మీలోని కొందరు పిసినారులుగా ప్రవర్తిస్తున్నారు. పిసినారిగా వ్యవహరించేవాడు తన స్వయం పట్లనే పిసినారి అవుతాడు. అల్లాహ్ అవసరం లేనివాడు. అవసరం ఉన్నవారు మీరే. ఒకవేళ మీరు విముఖులైపోతే అల్లాహ్ మీ స్థానంలో మరో జాతిని తీసుకువస్తాడు. వారు మీ వంటి వారై ఉండరు.

## 48. అల్ ఫత్హ్ (విజయం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ప్రవక్తా!) నిజంగానే మేము నీకు స్పష్టమయిన విజయాన్ని ప్రసాదించాము – 2 – అల్లాహ్ నీ భూత భవిష్యత్కాలాల పొరపాట్లను క్షమించాలని, నీపై తన అనుగ్రహాన్ని పూర్తి చేయాలని, నీకు రుజుమార్గం చూపాలనీని. 3. ఇంకా, అల్లాహ్ నీకు గొప్ప సహాయం అందించాలని.

4. ఆయనే విశ్వాసుల హృదయాలలో నిబ్బరాన్ని అవతరింపజేశాడు – తద్వారా వారి విశ్వాసంలో మరింత విశ్వాస సమృద్ధి జరగాలని. గగన భువనాలలోని సైన్యాలన్నీ అల్లాహ్వే. అల్లాహ్ జ్ఞాన సాగరుడు, వివేక

సంపన్నుడు. 5. అల్లాహ్ విశ్వసించిన పురుషులను, విశ్వసించిన స్త్రీలను క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేసేందుకు, వారందులో శాశ్వతంగా ఉండేటందుకు, వారి చెడుగులను వారి నుండి దూరం చేసేందుకు (ఈ విధంగా జరిగింది). అల్లాహ్ సన్నిధిలో ఇదే ఘన విజయం. 6. అల్లాహ్ గురించి చెడు తలంపు గల కపటులైన పురుషులను, కపటులైన స్త్రీలను, బహు దైవారాధకులైన పురుషులను, బహుదైవారాధకులైన స్త్రీలను అల్లాహ్ శిక్షించటానికి (కూడా ఈ విధంగా చేశాడు). దుర్దశ వారి మీదే పడుతుంది. అల్లాహ్ వారిపై ఆగ్రహించాడు. ఆయన వారిని శపించాడు. వారి కోసం ఆయన నరకాన్ని సిద్ధం చేసి ఉంచాడు. అదెంతో చెడ్డ గమ్యస్థానం. 7. భూమ్యాకాశాలలోని సేనావాహిని అంతా అల్లాహ్‌కే చెందుతుంది. అల్లాహ్ మహాశక్తిశాలి, వివేచనాశీలి.

8. (ప్రవక్తా!) నిశ్చయంగా మేము నిన్ను సాక్షిగా, శుభవార్తను వినిపించేవానిగా, భయబోధ చేసేవానిగా చేసి పంపాము – 9. మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించాలని, మీరతనికి (ప్రవక్తకు) సహాయకులుగా ఉండాలని, అతనిని ఆదరించాలని, ఇంకా మీరు ఉదయం సాయంత్రం అల్లాహ్ పవిత్రతను కొనియాడాలనీని. 10. (ఓ ముహమ్మద్!) ఎవరయితే (నీ చేతిలో చెయ్యేసి) విధేయతా ప్రమాణం చేస్తున్నారో వారు నిజానికి అల్లాహ్‌తో ప్రమాణం చేస్తున్నారు. అల్లాహ్ చేయి వారి చేతుల మీద ఉంది. ఇక ఎవరయినా ఈ ప్రమాణాన్ని భంగపరిస్తే, భంగపరచిన నష్టానికి అతడే బాధ్యుడవుతాడు. మరెవరయితే అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని నెరవేరుస్తాడో అతనికి అల్లాహ్ గొప్ప ప్రతిఫలం ప్రసాదిస్తాడు.

11. వెనుక ఉండిపోయిన పల్లెటూరి వాళ్ళు ఇప్పుడు వచ్చి, 'మా ఆస్తిపాస్తులు, ఆలుపిల్లలు మమ్మల్ని తెమలకుండా చేశాయి. కాబట్టి తమరు మా మన్నింపుకై ప్రార్థించండి' అని ప్రాధేయపడతారు. వారు తమ హృదయాలలో లేని మాటలను నోటితో పలుకుతున్నారు. నీవు వారితో చెప్పు : 'ఒకవేళ అల్లాహ్ మీకేదన్నా నష్టంగానీ, లాభంగానీ కలిగించదలిస్తే ఆయన సమక్షంలో అడ్డుకునే అధికారం ఎవరికుంది? పైగా అల్లాహ్ మీరు

చేసే పనులన్నింటినీ కనిపెట్టుకుని ఉన్నాడు. 12. పైగా మీరు, దైవప్రవక్తకు గానీ, విశ్వాసులకు గానీ తమ ఇండ్లకు తిరిగివచ్చే యోగం లేదని ఊహాగానాలు చేయసాగారు. ఈ ఆలోచన మీ అంతర్యాలను అలరించ సాగింది. మొత్తానికి మీ కాకిలెక్కలు మహా చెడ్డవి. ఏది ఏమయినా మీరు మాత్రం నాశనమయ్యే జనులే. 13. మరెవడయితే అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించడో, అలాంటి అవిశ్వాసుల కొరకు మేము మండే అగ్నిని సిద్ధం చేసి ఉంచాము. 14. భూమ్యాకాశాల సార్వభౌమత్వం అల్లాహ్‌దే. ఆయన తాను కోరిన వారిని క్షమిస్తాడు, తాను కోరిన వారిని శిక్షిస్తాడు. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు.

15. మీరు యుద్ధప్రాప్తిని తీసుకోవటానికి వెళుతున్నప్పుడు వెనుక ఉండిపోయిన వారు వచ్చి, 'మమ్మల్ని కూడా మీతో రానివ్వండి' అంటారు. వారు దైవవాక్కునే మార్చివేయదలుస్తున్నారు. (ప్రవక్తా!) వారికి చెప్పేయ్ : 'మీరు మాతో రాలేరు. అల్లాహ్ ఈ విషయం ముందుగానే సెలవిచ్చాడు.' దానికి వారు, 'అదేమీ కాదు. మీకు మాపై అసూయ' అంటారు. అసలు విషయమేమిటంటే, వారిలో విషయావగాహన చాలా తక్కువ.

16. వెనుక ఉండిపోయిన పల్లెటూరి వారితో ఇలా అను : 'త్వరలోనే మీకు పరాక్రమశాలురైన జనులతో పోరాడేందుకు పిలుపు వస్తుంది. మీరు వారితో పోరాడటమో లేదా వారు ఇస్లాం స్వీకరించటమో జరుగుతుంది. (అప్పుడు) మీరు గనక ఆజ్ఞాపాలన చేశారంటే, అల్లాహ్ మీకు మంచి ప్రతిఫలం ఇస్తాడు. ఒకవేళ మీరు లోగడ విముఖులైనట్లే విముఖత చూపితే, ఆయన మిమ్మల్ని వ్యధాభరితమయిన శిక్షకు గురిచేస్తాడు. 17. (యుద్ధం విషయంలో) గుడ్డివారుగానీ, కుంటివారుగానీ, రోగగ్రస్తులుగానీ నిందార్హులు కారు. ఎవడు అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు విధేయత చూపుతాడో అతనిని అల్లాహ్ దిగువ కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. మరెవడు వెనుతిరిగిపోతాడో అతనిని వ్యధాభరితమయిన శిక్షకు లోనుచేస్తాడు.

18. విశ్వాసులు వృక్షం క్రింద నీతో విధేయతా ప్రమాణం చేస్తూ

ఉన్నప్పుడు అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడయ్యాడు. వారి హృదయాలలో ఉన్న దానిని అల్లాహ్ తెలుసుకున్నాడు. అందువల్ల వారిపై ప్రశాంత స్థితిని (నెమ్మదిని) అవతరింపజేశాడు. బహుమానంగా వారికి సమీపంలోనే (లభించే) విజయాన్ని అనుగ్రహించాడు. 19. ఇంకా ఎన్నో విజయధనాలను కూడా వారు పొందుతారు. అల్లాహ్ శక్తిమంతుడు, వివేకవంతుడు. 20. ఇంకా అల్లాహ్ ఎన్నో విజయ సొత్తులను గురించి మీకు వాగ్దానం చేశాడు. వాటిని మీరు గ్రహిస్తారు. దీనిని మాత్రం ఆయన మీకు వెంటనే అనుగ్రహించాడు. జనుల చేతులను మీ నుండి ఆపాడు – విశ్వాసులకు ఇదొక సూచనగా ఉండాలని! ఆయన మిమ్మల్ని రుజుమార్గంపై నడిపించాలని!! 21. ఇంకా మీ కైవసం కాని మరో విజయాన్ని కూడా! అల్లాహ్ మాత్రం దానిని దిగ్బంధం చేసి ఉంచాడు. అల్లాహ్ ఏదయినాసరే చేయగల సమర్థుడు.

22. ఈ సత్యతిరస్కారులు ఒకవేళ మీపై కయ్యానికి కాలుదువ్వినప్పటికీ వెన్నుచూపి పారిపోయేవారు. తరువాత వారు ఏ రక్షకుణ్ణీ, ఏ సహాయకుణ్ణీ పొందలేకపోయేవారు. 23. ఇది అనాదిగా వస్తూ ఉన్న దైవ సంప్రదాయం. దైవ సంప్రదాయంలో నీవు ఎలాంటి మార్పునూ కనుగొనలేవు. 24. మక్కా లోయలో సత్య తిరస్కారులపై మీకు ఆధిపత్యం వొసగిన పిమ్మట వారి చేతులు మీపైనా, మీ చేతులు వారిపైనా లేవకుండా కట్టి పడేసినవాడు ఆయనే. మీ నిర్వాకాన్నంతా అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు.

25. తిరస్కార వైఖరికి ఒడిగట్టినవారు, మిమ్మల్ని మస్జిదె హరామ్ నుండి ఆపినవారు, ఖుర్బానీ పశువులను వాటి స్థలాలకు చేరకుండా అడ్డు తగిలిన వారు వారే. ఒకవేళ వారిలో (మక్కాలో) అనేకమంది విశ్వసించిన పురుషులు, విశ్వసించిన స్త్రీలు లేకుంటే, మీకు తెలియని స్థితిలో మీరు వారిని నలిపివేస్తారన్న అనుమానమే గనక లేకుంటే, వారి మూలంగా నీపై అపవాదు వచ్చేందుకు ఆస్కారం లేకపోతే (మేము యుద్ధం చేసేందుకు అనుమతిని ఇచ్చి ఉండేవారం). అయితే అల్లాహ్ తాను కోరిన వారిని తన కారుణ్యంలో ప్రవేశింపజేస్తాడు (అందుకే పరిస్థితిని యుద్ధం వరకూ

రానివ్వలేదు). ఒకవేళ వారు (మక్కాలో నివసిస్తున్న ముస్లింలు) వేరైపోయి ఉంటే, అక్కడ ఉన్న తిరస్కారులను మేము కఠినాతి కఠినంగా శిక్షించి ఉండేవారం.

26. సత్యతిరస్కారులు తమ హృదయాలలో అహంభావాన్ని పెంచుకున్నప్పుడు – అందునా వారు అజ్ఞానపు కుహనా ప్రతిష్ఠకు పోయినపుడు – అల్లాహ్ తన ప్రవక్తపై, విశ్వాసులపై తన తరఫున నిమ్మళాన్ని అవతరింపజేశాడు. అల్లాహ్ వారిని భక్తి వాక్యానికి (నైతిక నియమానికి) కట్టుబడి ఉండేలా చేశాడు. వారు దానికి హక్కుదారులు, యోగ్యులు కూడాను. అల్లాహ్ ప్రతిదీ క్షుణ్ణంగా తెలిసినవాడు.

27. నిశ్చయంగా అల్లాహ్ తన ప్రవక్తకు సత్యమైన స్వప్నాన్ని చూపాడు. (అది పరిస్థితులకు అనుగుణంగా ఉంది). అల్లాహ్ తలిస్తే మీరు మస్జిదె హరామ్‌లోకి సురక్షితంగా చేరుకుంటారు. శిరోముండనం చేయించుకుంటారు, జుత్తు కత్తిరించుకుంటారు. మీకెలాంటి భయం ఉండదు. మీకు తెలియనిది ఆయనకు తెలుసు. దానికి ముందే ఆయన మీకు ఓ విజయాన్ని అందించాడు.

28. అల్లాహ్‌యే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్ని, సత్యధర్మాన్ని ఇచ్చి పంపాడు – దానికి ఇతర మత ధర్మాలన్నింటిపై ఆధిక్యతను వొసగాలని! సాక్షిగా అల్లాహ్‌యే చాలు.

29. ముహమ్మద్ దైవ సందేశహరుడు. ఆయన వెంట ఉన్నవారు సత్యతిరస్కారులకు కొరుకుడు పడనివారు. ఒండొకరి పట్ల మాత్రం మృదు మనస్కులు. వారు దైవసన్నిధిలో వినమ్రులై వంగటాన్ని, సాష్టాంగపడటాన్ని నీవు చూస్తావు. వారు దైవానుగ్రహాన్ని అన్వేషిస్తూ ఉంటారు. దైవప్రసన్నత కొరకు తహతహలాడుతూ ఉంటారు. వారి సాష్టాంగ ప్రణామాల (సజ్దాల) ప్రభావం వారి ముఖారవిందాలపై తొణికిసలాడుతూ ఉంటుంది. వారి ఈ ఉపమానం తౌరాతులోనూ ఉంది. ఇంజీలులో వారు ఒక పంట పొలంతో పోల్చబడ్డారు. అది తన మొలకను మొలకెత్తించింది. తరువాత దానిని

దృఢతరం చేసింది. ఆ తరువాత అది లావెక్కింది. దరిమిలా అది తన కాండంపై స్థిరంగా నిలబడింది. అది రైతులను అలరిస్తుంది – వారి ద్వారా సత్యతిరస్కారులను ఉడికించాలని! అయితే వారిలో విశ్వసించి, మంచిపనులు చేసిన వారికి క్షమాపణను, గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తానని అల్లాహ్ వాగ్దానం చేశాడు.

# 49. అల్ హుజురాత్ (నివాస గదులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను మించి పోకండి. అల్లాహ్‌కు భయపడండి. నిశ్చయంగా అల్లాహ్ అంతా వినేవాడు, అన్నీ తెలిసినవాడు.

2. ఓ విశ్వసించిన వారలారా! మీరు మీ కంఠ స్వరాలను ప్రవక్త కంఠ స్వరంకన్నా హెచ్చుగా ఉంచకండి. మీరు పరస్పరం ఒండొకరిని కేకవేసి పిలిచేవిధంగా అతనిని పిలవకండి. తత్కారణంగా మీ కర్మలన్నీ వ్యర్థమై పోవచ్చు. ఆ విషయం మీకు తెలీకనూపోవచ్చు. 3. ఎవరు దైవప్రవక్త సమక్షంలో తమ కంఠస్వరాలను తగ్గించి – సంస్కారవంతుల్లా – మాట్లాడతారో అలాంటివారి హృదయాలను అల్లాహ్ భక్తిపరాయణత కొరకు పరికించు కున్నాడు. వారికి క్షమాపణ ఉంది, గొప్ప ప్రతిఫలం కూడా. 4. (ప్రవక్తా!) ఎవరయితే నీ నివాస గదుల నుండి నిన్ను బిగ్గరగా పిలుస్తున్నారో వారిలో అనేకులు విజ్ఞత లేనివారే. 5. నీవు స్వయంగా వారివద్దకు వెడలి వచ్చేవరకూ వారు సంయమనం పాటించి ఉంటే, అది వారికే మేలు కలిగించేది. అల్లాహ్ క్షమాశీలుడు, దయాకరుడు.

6. విశ్వసించిన ఓ ప్రజలారా! ఎవడయినా దుర్వర్తనుడు మీ వద్దకు ఏదయినా సమాచారం తీసుకువస్తే, దానికి సంబంధించిన నిజానిజాలను ముందుగా నిర్ధారించుకోండి. అన్యథా మీరు తెలియని స్థితిలో ఏ వర్గానికయినా హాని కలిగించి, తరువాత మీ వల్ల జరిగిపోయిన దానిపై బాధపడే పరిస్థితి రావచ్చు. 7. మీ మధ్యన దైవప్రవక్త ఉన్నాడనే విషయాన్ని

బాగా తెలుసుకోండి. ఎన్నో విషయాలలో అతను మీరు చెప్పినట్లుగా వింటే, మీరే ఇబ్బందుల్లో పడిపోతారు. కాని అల్లాహ్ మీలో విశ్వాసం పట్ల ప్రేమాభిమానాన్ని జనింపజేశాడు. దాంతో మీ మనో జగత్తును ముస్తాబు చేశాడు. సత్య తిరస్కారాన్ని, దుర్వర్తనను, అవిధేయతను మీరు అసహ్యించుకునేలా చేశాడు. ఇలాంటివారే సన్మార్గగాములు. 8 – దైవకృపవల్ల! దైవానుగ్రహం వల్ల!! అల్లాహ్ మహాజ్ఞాని. మహా వివేకి.

9. ఒకవేళ ముస్లింలలోని రెండు వర్గాలు పరస్పరం పోరాడుకుంటే వారి మధ్య రాజీ కుదర్చండి. తరువాత వారిలోని ఒక వర్గం వారు మరోవర్గం వారిపై దౌర్జన్యం చేస్తే, దౌర్జన్యం చేసేవారు దైవాజ్ఞ వైపు మరలివచ్చేవరకూ వారితో పోరాడండి. మరి వారు గనక మరలివస్తే, వారి మధ్య న్యాయబద్ధంగా సంధి చేయండి. న్యాయం చేయండి. నిశ్చయంగా అల్లాహ్ న్యాయం చేసేవారిని ఇష్టపడతాడు. 10. విశ్వాసులంతా అన్నదమ్ములు. కాబట్టి మీ అన్నదమ్ముల మధ్య సర్దుబాటుకు ప్రయత్నించండి. అల్లాహ్‌కు భయపడండి – తద్వారా మీరు కరుణించబడవచ్చు.

11. ఓ విశ్వాసులారా! పురుషులు తోటి పురుషులను ఎగతాళి చేయకూడదు. ఎందుకంటే వారు వీరికన్నా ఉత్తములై ఉండవచ్చు. స్త్రీలు తోటి స్త్రీలను ఎగతాళి చేయకూడదు. బహుశా వారు వీరికన్నా మంచివారై ఉండవచ్చు. ఒకరింకొకరిని ఎత్తిపొడుచుకోకండి. ఒండొకరిని చెడ్డ బిరుదులతో పిలుచుకోకండి. విశ్వసించిన మీదట పాపిష్టిపేరు తగిలించటం చాలా చెడ్డ విషయం. ఈ ధోరణిని మానుకోనివారే అసలు దుర్మార్గులు.

12. విశ్వసించిన వారలారా! ఎన్నో అనుమానాలకు దూరంగా ఉండండి. ఎందుకంటే కొన్ని అనుమానాలు పాపాల క్రిందికి వస్తాయి. ఒండొకరి కూపీలు లాగకండి. మీలో ఎవరూ మరొకరి వీపు వెనుక చాడీలు చెప్పకండి. మీలో ఎవరయినాసరే మృతి చెందిన మీ సోదరుని మాంసం తినటానికి ఇష్టపడతారా? దీనిని మీరు స్వయంగా ఏవగించుకుంటున్నారు. అల్లాహ్‌కు భయపడండి. నిశ్చయంగా అల్లాహ్ మన్నించేవాడు, కనికరించేవాడు.

13. మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుడు, ఒకే స్త్రీ ద్వారా పుట్టించాము. మీ పరస్పర పరిచయాలు, గుర్తింపుల నిమిత్తం మిమ్మల్ని వర్గాలుగా, తెగలుగా విభజించాము. నిశ్చయంగా మీలో దైవభీతిగలవాడే దైవసన్నిధిలో అందరికన్నా ఆదరణీయుడు. నిశ్చయంగా అల్లాహ్ అన్నీ తెలిసినవాడు, కనిపెట్టుకుని ఉన్నవాడు.

14. 'మేము విశ్వసించాము' అని పల్లెటూరి వాళ్ళు అంటున్నారు. వారికి చెప్పు : మీరింకా విశ్వసించలేదు. అయితే 'ఆత్మసమర్పణ చేసుకున్నాం' అని మాత్రం అనండి. విశ్వాసం మీ మనోభూమిలో ఇంకా నాటుకోలేదు. మీరు గనక దైవానికి, ఆయన ప్రవక్త విధేయతకు తల ఒగ్గితే, దేవుడు మీ కర్మల (ప్రతిఫలం)లో ఏ లోటూ రానివ్వడు. నిశ్చయంగా అల్లాహ్ క్షమాగుణం కలవాడు, కరుణామయుడు. 15. నిజానికి అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను (చిత్తశుద్ధితో) విశ్వసించి, ఆ తరువాత ఎలాంటి సంశయానికి లోనవకుండా, అల్లాహ్ మార్గంలో తమ ధన ప్రాణాలతో పోరాడేవారే సిసలైన విశ్వాసులు. ఇలాంటి వారే సచ్ఛీలురు.

16. వారికి ఇలా చెప్పు : 'ఏమిటి, మీ ధార్మికతను గురించి మీరు అల్లాహ్‌కే తెలియపరచాలనుకుంటున్నారా? నిజానికి భూమ్యాకాశాలలో ఉన్నదంతా అల్లాహ్‌కు తెలుసు. అల్లాహ్ ప్రతి దానిని గురించి క్షుణ్ణంగా తెలిసినవాడు. 17. వాళ్ళు ఇస్లాం స్వీకరించి నీకేదో ఉపకారం చేసినట్లుగా భావిస్తున్నారు. వారికి చెప్పు : 'మీ ఇస్లాం ఉపకారాన్ని నాపై పెట్టకండి. వాస్తవానికి విశ్వాసమార్గం చూపి అల్లాహ్‌యే మీకు ఉపకారం చేశాడు. మీరు సచ్ఛీలురే అయితే (ఈ యదార్థాన్ని మీరు తెలుసుకోవాలి).' 18. నిశ్చయంగా భూమ్యాకాశాలలో దాగివున్న విషయాలన్నీ అల్లాహ్‌కు తెలుసు. మీరు చేసేదంతా ఆయన చూస్తూనే ఉన్నాడు.

## 50. ఖాఫ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఖాఫ్. ఘనమయిన ఖుర్‌ఆన్ సాక్షిగా! 2. వారి వద్దకు స్వయంగా

వారిలో నుండే భయబోధ చేసేవాడొకడు రావటం వారిని ఆశ్చర్యానికి గురిచేసింది. అందుకే సత్యతిరస్కారులు, 'ఇది కడు విచిత్రంగా ఉందే! 3. 'ఏమిటి, మేము మరణించి, మట్టైపోయిన తరువాత, మళ్లీ తిరిగి (బ్రతికి) రావటం బహుదూరపు విషయంగా ఉందే!' అన్నారు. 4. భూమి లోపలి నుండి వారిని ఎంతగా తగ్గిస్తుందో (హరిస్తుందో) మాకు తెలుసు. మా వద్ద ఉన్న గ్రంథంలో అంతా భద్రపరచబడి ఉంది. 5. అసలు విషయం ఏమిటంటే, వారు తమ వద్దకు సత్యం వచ్చినపుడు దానిని అసత్యమంటూ త్రోసిపుచ్చారు. పైగా వారు అయోమయంలో పడి ఉన్నారు.

6. ఏమిటి, వారు తమపైన ఉన్న ఆకాశాన్ని చూడలేదా, ఏ విధంగా మేము దానిని నిర్మించి, అలంకరించామో? అందులో ఎలాంటి రంధ్రం కూడా లేదు. 7. మేము భూమిని విస్తరింపజేసి, అందులో పర్వతాలను ప్రతిష్ఠించాము. ఇంకా అందులో అన్నిరకాల అందాలు చిందే వస్తువులను ఉత్పన్నం చేశాము – 8 –రుజువర్తనుడయ్యే ప్రతి దాసునికి ఇవి గుణపాఠంగా, జ్ఞాపికగా ఉన్నాయి. 9. మరి మేము ఆకాశం నుండి శుభవంతమైన నీటిని కురిపించాము. తద్వారా మేము తోటలను, కోతకు వచ్చే ఆహార ధాన్యాలను మొలిపించాము. 10. ఎత్తయిన ఖర్జూర చెట్లను కూడా. వాటి పండ్ల గుత్తులు ఒకదానిపై ఒకటి పేరుకుని ఉంటాయి. 11. దాసులకు జీవనోపాధిగా! వీటన్నింటి ద్వారా మేము మృతభూమికి జీవకళను ప్రసాదించాము. ఇదే విధంగా (గోరీల నుండి) బయటికి రావలసి ఉన్నది.

12. వీరికి పూర్వం నూహ్ జాతివారు, రస్ జనులు, సమూదు వారు కూడా సత్యాన్ని త్రోసిపుచ్చారు. 13. ఆద్, ఫిరౌన్ వారు, లూత్ జాతి సోదరులు, 14. అయ్‌కా వారు, తుబ్బా జాతివారు కూడా ప్రవక్తలను ధిక్కరించినవారే. అందువల్ల వారిపై నా ముందస్తు హెచ్చరిక నిజమయింది. 15. ఏమిటి, మేము తొలి సృష్టికే అలసిపోయామా? అసలు విషయం ఏమిటంటే వీరు వినూత్న సృష్టి (మలిసారి సృష్టి) పట్ల సందేహంలో పడి ఉన్నారు.

16. మేము మనిషిని సృష్టించాము. అతని ఆంతర్యంలో రేకెత్తే

ఆలోచనలను కూడా మేమెరుగుదుము. మేమతని కంఠనాళం కన్నా అతనికి దగ్గరలో ఉన్నాము. 17. అప్పుడు తీసుకునే వారిద్దరు తీసుకుంటూ ఉంటారు. వారిలో ఒకరు కుడివైపున, మరొకరు ఎడమ వైపున కూర్చుని ఉంటారు. 18. అతని నోట మాట వెలువడక ముందే, అతని దగ్గరలో ఉన్న చురుకైన పర్యవేక్షకుడు నమోదు చేసుకునేందుకు కాచుకుని ఉంటాడు.

19. మరణ అపస్మారక స్థితి సత్యసమేతంగా వచ్చేసింది. (మానవుడా!) దేని నుండి నీవు పారిపోయేవాడివో అదే ఇది. 20. శంఖం ఊదబడుతుంది. ఇదే హెచ్చరిక చేయబడిన దినం. 21. ప్రతి వ్యక్తీ ఒక తోలేవాడితో, ఒక సాక్ష్యమిచ్చేవానితో సహా వస్తాడు. 22. నువ్వు దీనిపట్ల అశ్రద్ధ వహించావు. కనుక మేము నీ మీద పడి ఉన్న ముసుగును తొలగించాము. ఈ రోజు నీ చూపు చాలా వాడిగా ఉంది. 23. 'ఇదిగో! నా దగ్గర ఉండేది (కర్మల పత్రం) సిద్ధంగా ఉంది' అని తోటి దైవదూత అంటాడు. 24. 'కృతఘ్నుడు, విరోధి అయిన ప్రతి ఒక్కణ్ణీ నరకాగ్నికి ఆహుతి చేయండి. 25. వాడు మంచి నుండి ఆపేవాడు, హద్దుమీరే వాడు, అనుమానం రేకెత్తించేవాడు. 26. వాడు అల్లాహ్‌తో పాటు వేరితర ఆరాధ్య దేవుళ్ళను కూడా చేసుకున్నాడు. కాబట్టి వాణ్ణి కఠిన యాతనలో పడవెయ్యండి.' 27. అతని సహవాసి (షైతాన్) అంటాడు : 'మా ప్రభూ! నేనతన్ని తలబిరుసుగా మార్చలేదు. తనంతటతానే మార్గం మరిచాడు. మార్గం మరచి బహుదూరం వెళ్ళిపోయాడు.' 28. సెలవీయబడుతుంది : 'నా సమక్షంలో గొడవపడకండి. నేను మిమ్మల్ని ముందుగానే శిక్ష గురించి హెచ్చరిక చేశాను. 29. నా దగ్గర మాట మార్చబడదు. నేను నా దాసులకు అన్యాయం చేసేవాడను కాను.'

30. 'నీవు నిండిపోయావా?' అని మేము నరకాన్ని అడిగిననాడు, 'ఏం, ఇంకా ఏమన్నా ఉందా?' అని అది అంటుంది. 31. స్వర్గం భక్తిపరుల సమీపంలోకి తీసుకురాబడుతుంది. అది ఏమంత దూరాన ఉండదు. 32. మీకు వాగ్దానం చేయబడేది ఇదే. మాటిమాటికీ (దేవుని వైపునకు) మరలి, నియమాలను గుర్తుంచుకునే ప్రతి ఒక్కరికీ, 33. చూడకుండానే కరుణామయునికి భయపడే, రుజువర్తన చెందే నిష్కల్మషమైన హృదయంతో వచ్చిన ప్రతి ఒక్కరి కోసం ఇది ప్రత్యేకించబడింది. 34. నిక్షేపంగా ఇందులో

ప్రవేశించండి. కలకాలం నిలిచే దినమిది. 35. అక్కడ వారికోసం వారు కోరినదల్లా ఉంటుంది. మా వద్ద ఇంకా ఎంతో ఉంది.

36. మేము వీరికి పూర్వం ఎన్నో జాతులను తుదముట్టించాము. వారు వీరికన్నా ఎక్కువ బలవంతులు. వారు దేశదేశాలు సంచరించారు. కాని వారికి ఎక్కడయినా నిలువ నీడ లభించిందా? 37. మనసున్న వానికి లేదా శ్రద్ధగా విని మరలేవానికి ఇందులో హితబోధ ఉంది.

38. మేము భూమ్యాకాశాలను, వాటి మధ్యన ఉన్నవాటిని కేవలం ఆరు దినాలలో సృష్టించాము. కాని మాకు ఎంతమాత్రం అలసట కలగలేదు. 39. కనుక (ఓ ప్రవక్తా!) వారు చెప్పే మాటలపై సహనం వహించు. నీ ప్రభువు పవిత్రతను కొనియాడు. ఆయన్ని స్తుతించు – సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి ముందు కూడా. 40. రాత్రివేళల్లో కూడా ఆయన పవిత్రతను శ్లాఘించు. సజ్దాల (నమాజుల) తరువాత కూడా.

41. జాగ్రత్తగా విను! ఏ రోజున పిలిచేవాడు చాలా దగ్గరి నుండి పిలుస్తాడో, 42. ఏ రోజున జనులు అవశ్యంగా ఒక భయంకరమయిన కేకను వింటారో, అది (గోరీల నుండి) బయల్పడే రోజై ఉంటుంది. 43. నిశ్చయంగా మేమే బ్రతికించేవారము. మేమే చంపేవారము. అందరూ మరలవలసింది మా వైపునకే. 44. ఆ రోజు భూమి వారి కోసం బ్రద్దలైపోతుంది. అప్పుడు వారు లేచి పరుగులు తీస్తారు. ఈ పాటి సమీకరణ మాకు చాలా తేలిక.

45. వారు చెప్పేదేమిటో మాకు తెలుసు. నీవు వారిపై బలవంతం చేసేవాడవు కావు. నా హెచ్చరికకు భయపడే వానికి మాత్రమే నువ్వు ఖుర్‌ఆన్ ద్వారా బోధపరుస్తూ ఉండు.

## 51. అజ్ జారియాత్ (దుమ్ము రేపే గాలులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. దుమ్ము రేపే గాలుల సాక్షిగా! 2. తరువాత అవి (వర్షపు నీటి) బరువును ఎత్తుకుంటాయి. 3. తరువాత అవి నెమ్మదిగా – మలయ

మారుతంలా – కదులుతాయి. 4. తరువాత అవి (దైవాజ్ఞానుసారం) వ్యవహార పంపిణీ జరుపుతాయి. 5. నిశ్చయంగా మీకు చేయబడే వాగ్దానం సత్యం. 6. నిశ్చయంగా తీర్పు జరగవలసి ఉంది. 7. మార్గాలు గల గగనం సాక్షిగా! 8. నిశ్చయంగా మీరొక భేదాభిప్రాయంలో పడివున్నారు. 9. మళ్ళించబడిన వాడే దాని నుండి మరలిపోతాడు.

10. అంచనాల ఆధారంగా గాలి మేడలు కట్టేవారు నాశనమవుదురు గాక! 11. వారు అలసత్వంలో పడి, మరుపునకు లోనయ్యారు. 12. ఇంతకీ ఆ తీర్పుదినం ఎప్పుడు? అని వారు అడుగుతున్నారు. 13. అది వారు అగ్నిపై కాల్చబడే రోజై ఉంటుంది. 14. 'మీ వెకిలిచేష్టల రుచిచూడండి. మీరు దేని కొరకు తొందరపెట్టేవారో అదే ఇది' (అని వారితో అనబడుతుంది). 15. నిశ్చయంగా భయభక్తులు కలవారు ఉద్యానవనాలలో, చెలమల మధ్యన ఉంటారు. 16. వారి ప్రభువు వారికి ఇచ్చిన దానిని పుచ్చుకుంటూ ఉంటారు. అంతకు మునుపు వారు సదాచార సంపన్నులుగా ఉండేవారు. 17. వారు రాత్రివేళల్లో చాలా తక్కువగా నిద్రించేవారు. 18. తొలిజాము వేళల్లో వారు క్షమాపణకై ప్రార్థిస్తూ ఉండేవారు. 19. వారి సంపదల్లో అడిగేవారికి, అడగని వారికి (అభిమానధనులకు) కూడా హక్కు (భాగం) ఉండేది.

20. నమ్మేవారికి భువిలో పలు సూచనలు ఉన్నాయి. 21. ఖుద్దుగా మీలోనే ఉన్నాయి – ఏమిటి, మీరు గమనించటం లేదా? 22. ఆకాశంలో మీ జీవనోపాధి ఉంది. దాంతోపాటు మీకు వాగ్దానం చేయబడేది కూడా ఉంది. 23. కనుక భూమ్యాకాశాల ప్రభువు సాక్షిగా! అది తథ్యం. మీరు పరస్పరం మాట్లాడుకుంటున్నట్లే (సత్యమది).

24. ఏమిటి, నీకు ఇబ్రాహీమ్ గౌరవ అతిథుల విషయంగాని చేరిందా? 25. వారతని వద్దకు వచ్చినపుడు, వారికి సలామ్ చేశారు. అతను కూడా వారికి ప్రతి సలామ్ చేశాడు – వీళ్ళు అపరిచిత వ్యక్తుల్లా ఉన్నారే (అని మనసులో అనుకున్నాడు). 26. వెంటనే అతను తన ఇంటివైపు వెళ్ళి వేయించిన ఆవు దూడను తెచ్చాడు. 27. దానిని వారి ముందు సమర్పించి 'మీరు తినరేమిటి?' అన్నాడు. 28. తరువాత లోలోపలే

భయపడ్డాడు. 'భయపడవద్దు' అంటూ వారు అభయమిచ్చారు. తరువాత అతనికి జ్ఞానసంపన్నుడైన అబ్బాయి కలుగుతాడని శుభవార్త వినిపించారు. 29. అప్పుడతని భార్య అరుస్తూ, నొసటిపై చేత్తో బాదుకుంటూ వచ్చి, 'అవ్వ! నేనొక ముసలిదానిని. దానికి తోడు గొడ్రాలిని కూడా (నాకిప్పుడు సంతానమేమిటి)?' అంది. 30. దానికి వారు, 'ఇలాగే జరుగుతుంది. నీ ప్రభువు ఈ విధంగా సెలవిచ్చాడు. నిశ్చయంగా ఆయన వివేకవంతుడు, జ్ఞానధనుడు' అని చెప్పారు.

◆ (27) 31. 'ఓ దైవదూతలారా! ఇంతకీ మీరు వచ్చిన పనేమిటి?' అని ఇబ్రాహీమ్ అడగ్గా, 32. వారిలా చెప్పారు : 'మేము ఒక అపరాధ మూక (లూత్ జాతి) వైపు పంపబడ్డాము. 33 – వారిపై కాల్చబడిన మట్టిరాళ్లను కురిపించటానికి. 34. హద్దుమీరిపోయిన వారి కోసం నీ ప్రభువు వద్ద అచ్చువేయబడిన రాళ్ళు అవి.' 35. మరి అక్కడ ఉన్న విశ్వాసులందరినీ మేము బయటికి తీశాము. 36. కాని మాకక్కడ ఒక్కగానొక్క ముస్లిం ఇల్లు మాత్రమే కనిపించింది. 37. వ్యధాభరితమయిన శిక్షకు భయపడేవారికి మేము ఇందులో ఒక సూచనను వదిలాము.

38. మూసా వృత్తాంతంలో కూడా సూచన ఉంది. మేమతనికి ఒక స్పష్టమయిన ప్రమాణాన్ని ఇచ్చి ఫిరౌన్ వద్దకు పంపినపుడు, 39. అతను తన మంది మార్బలంతో సహా విముఖుడయ్యాడు. పైగా 'ఇతనొక మాంత్రికుడో లేదా పిచ్చివాడో అయి ఉంటాడ'ని అన్నాడు. 40. అందుకే మేము అతనినీ, అతని సైన్యాన్ని పట్టుకున్నాము. తరువాత వాళ్ళను సముద్రంలో విసిరివేశాము. ఈ పరిణామానికి స్వయంగా అతనే బాధ్యుడు (నిందార్హుడు). 41. ఆద్ (జాతి) లో కూడా ఒక సూచన ఉంది. అప్పుడు మేము వారిపై నిష్ఫలమయిన గాలిని పంపాము. 42. ఆ గాలి దేనిపై వీచినా దానిని తుత్తునియలు చేయకుండా వదల్లేదు. 43. సమూదు వారిలో కూడా (గుణపాఠ) సూచన ఉంది. 'కొన్నాళ్ళపాటు సుఖాలు జుర్రుకోండి' అని వారితో అనబడినపుడు, 44. వారు తమ ప్రభువు ఆజ్ఞను ఎంతమాత్రం ఖాతరు చేయలేదు. అందువల్ల వారిని ఒక భయంకరమయిన ప్రేలుడు

అమాంతం కబళించింది. దానిని వారు కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయారు. 45. ఆ దెబ్బకు వారు లేచి నిలబడలేకపోయారు. తమ్ము తాము కాపాడుకోనూలేకపోయారు. 46. అంతకు ముందు నూహ్ జాతి వ్యవహారమూ ఇంతే. ఎందుకంటే వారు కూడా అవిధేయజనంగా ఉండేవారు.

47. మేము ఆకాశాన్ని మా శక్తితో నిర్మించాము. మేము విస్తృతి నొసగేవారము. 48. మేము భూమిని (పరుపుగా) పరచాము. మేము ఎంత చక్కగా పరుస్తామో! 49. ఇంకా మేము వస్తువులన్నింటినీ జంటలుగా సృష్టించాము – తద్వారా మీరు సానుకూలంగా స్పందిస్తారని! 50. కనుక అల్లాహ్ వైపు పరుగులు తీయండి. నేను ఆయన తరఫున స్పష్టంగా సావధానపరచేవాడను. 51. అల్లాహ్‌తో పాటు మరో ఆరాధ్యదైవాన్ని చేర్చకండి. నేను ఆయన తరఫున స్పష్టంగా భయబోధ చేసేవాడను.

52. ఇదేవిధంగా వీరి పూర్వీకులు కూడా తమ వద్దకు ఏ ప్రవక్త వచ్చినా, 'ఇతను మాంత్రికుడో, పిచ్చివాడో అయి ఉంటాడ'ని అనేవారు. 53. ఏమిటి, వారు ఇదే విషయాన్ని ఒకరికొకరు తాకీదు చేస్తూ వస్తున్నారా? అది కాదు, అసలు వారంతా తలబిరుసులే. 54. కనుక నీవు అలాంటి వారిని పట్టించుకోకు. ఈ విషయంలో నీవు నిందార్హుడవు కావు. 55. కాకపోతే ఉపదేశాన్ని మాత్రం కొనసాగించు. ఎందుకంటే ఉపదేశం విశ్వాసులకు లాభదాయకం కాగలదు.

56. నేను జిన్నును, మనిషిని సృష్టించినది కేవలం నన్ను ఆరాధించటానికే. 57. నేను వారి నుండి జీవనోపాధిని కోరటం లేదు. వారు నాకు అన్నం పెట్టాలని కూడా నేను అభిలషించటం లేదు. 58. నిశ్చయంగా అల్లాహ్‌యే ఉపాధి ప్రదాత. మహా బలశాలి. మహా ఘటికుడు. 59. ఇకపోతే ఈ దుర్మార్గులు; వారి సహవాసుల పాపం పండినట్లే వారి పాపం కూడా పండింది. కాబట్టి వారు (శిక్ష కోసం) ఆత్రం చేయకూడదు. 60. కాబట్టి తిరస్కారులకు వాగ్దానం చేయబడుతున్న దినం వల్ల వారికి వినాశం తథ్యం.

# 52. అత్ తూర్ (తూరు పర్వతం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. తూరు (సినాయ్ కొండ) సాక్షిగా! 2. లిఖించబడిన గ్రంథం సాక్షిగా! 3. అది విశాలమైన పుటలలో ఉంది. 4. నిత్యం కళకళలాడుతూ ఉండే ఆరాధనాలయం (బైతుల్ మామూర్) సాక్షిగా! 5. ఎత్తయిన కప్పు సాక్షిగా! 6. ఉప్పొంగే సముద్రం సాక్షిగా! 7. నిశ్చయంగా నీ ప్రభువు శిక్ష రానున్నది. 8. దానిని తొలగించటం ఎవరి తరం కాదు. 9. ఏ రోజున ఆకాశం జలదరిస్తుందో, 10. పర్వతాలు నడవటం మొదలెడతాయో, 11. ఆ రోజు సత్యాన్ని ధిక్కరించిన వారికి మూడినట్లే. 12. వారు ఆడుతూ పాడుతూ అపసవ్యమైన మాటలు కల్పించుకుంటున్నారు. 13. ఆ రోజు వారు నరకాగ్ని వైపునకు త్రోయబడతారు. 14. 'మీరు అసత్యమని త్రోసిపుచ్చిన అగ్ని ఇదే. 15. ఇది మంత్రజాలమా? లేక ఇది మీ (కళ్ళ)కు కనబడటం లేదా? 16. ఇక దీనికి ఆహుతి అవండి. మీరిప్పుడు ఓర్పు వహించినా, ఓర్పు వహించకపోయినా మీకు ఒక్కటే. మీరు చేసుకున్న దాని ప్రతిఫలమే మీకు ఇవ్వబడుతోంది' (అని వారితో అనబడుతుంది).

17. నిశ్చయంగా దైవభీతిపరులు ఉద్యానవనాలలో, సుఖసౌఖ్యాలలో ఉంటారు. 18. తమ ప్రభువు తమకు ప్రసాదించిన వస్తువులపట్ల వారు ఆనందంతో పరవశించి పోతుంటారు. వారి ప్రభువు వారిని నరకయాతన నుండి రక్షించాడు. 19. 'మీరు చేసుకున్న సత్‌కర్మలకు బదులుగా హాయిగా తినండి, త్రాగండి' (అని వారితో అనబడుతుంది). 20. అక్కడ వారు వరుసగా పరచబడిన ఆసనాల మీద దిండ్లకు ఆనుకుని (దర్జాగా) కూర్చుని ఉంటారు. పెద్ద పెద్ద కన్నులు గల స్వర్గకన్యలతో మేము వారి వివాహం జరిపిస్తాము.

21. విశ్వసించిన వారి సంతానం కూడా వారి మార్గాన విశ్వాసంతో నడిస్తే, మేము వారి సంతతిని కూడా వారితో పాటు కలుపుతాము. మరయితే వారి కర్మల నుండి దేనినీ తగ్గించము. ప్రతి మనిషీ తాను సంపాదించుకున్న దానిలో చిక్కుబడి (తాకట్టుగా) ఉన్నాడు. 22. వారు మెచ్చిన పండ్లు ఫలాలను,

మాంసాహారాన్ని మేము వారికి ఇస్తూ ఉంటాము. 23. వారక్కడ ఒండొకరి నుండి మధుపాత్రలను అందుకుంటూ ఉంటారు. వాటి సేవనం వాగుడుకుగానీ, పాపకార్యానికి దారి తీయదు. 24. వారి సేవలో కుర్రాళ్ళు పరుగులు తీస్తూ ఉంటారు – వారు భద్రంగా ఉంచబడిన ముత్యాల మాదిరిగా ఉంటారు. 25. వారు ఎదురెదురుగా కూర్చుని కుశల ప్రశ్నలు వేసుకుంటూ ఉంటారు. 26. వారిలా చెప్పుకుంటారు : 'ఇదివరకు మనం మన ఇంటివారలలో భయపడుతూ ఉండేవాళ్ళం. 27. అందుకే అల్లాహ్ మనల్ని కటాక్షించాడు. మనల్ని నరకంలోని తీవ్రమయిన సెగ నుండి రక్షించాడు. 28. మనం ఇంతకు ముందు ఆయన్నే మొరపెట్టుకునేవారం. నిశ్చయంగా ఆయన సద్వ్యవహారం చేసేవాడు, దయాకరుడు.'

29. కనుక (ఓ ప్రవక్తా!) నీవు బోధపరుస్తూ ఉండు. నీ ప్రభువు అనుగ్రహం వల్ల నీవు జ్యోతిష్యుడవూ కావు, పిచ్చివాడవూ కావు. 30. ఏమిటి, ఇతనొక కవిపుంగవుడనీ, ఇతనిపై వచ్చే చెడ్డకాలం కొరకు తాము నిరీక్షిస్తున్నామని వారంటున్నారా? 31. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'మీరూ నిరీక్షించండి. నేను కూడా మీతోపాటే నిరీక్షిస్తున్నాను.' 32. ఏమిటి, వారి బుద్ధులు వారికి ఆజ్ఞాపించేది ఇదేనా? లేక అసలు ఈ జనమే తలబిరుసు జనమా? 33. 'ఇతను స్వయంగా ఈ ఖుర్ఆన్‌ని కల్పించుకున్నాడ'ని వారంటున్నారా? అసలు విశ్వసించాలన్న ఉద్దేశమే వారికి లేదు. 34. వారు తమ వాదనలో సత్యవంతులే అయితే దీనివంటి ఒక విషయాన్నయినా తెమ్మను.

35. ఏమిటి, వారు ఏ సృష్టికర్తా లేకుండానే పుట్టారా? లేక వారు స్వయంగానే సృష్టికర్తలా? 36. ఏమిటి, భూమ్యాకాశాలను వారే సృష్టించారా? లేదు. వారు నమ్మే రకం కాదు. 37. ఏమిటి, వారి దగ్గర నీ ప్రభువు నిధినిక్షేపాలు ఉన్నాయా? వాళ్ళుగాని ఆ ఖజానాలకు కాపలాదారులుగా ఉన్నారా? 38. ఏమిటి, వాళ్ళ దగ్గర నిచ్చెన ఉందా? దానిద్వారా వారు పైకి ఎక్కి అక్కడి విషయాలు విని వస్తున్నారా? అలా వినేవాడు ఎవడయినా

ఉంటే ఆ మేరకు స్పష్టమయిన ప్రమాణం తీసుకురావాలి. 39. ఏమిటి, దేవుని కొరకైతే కూతుళ్ళూను, మీకేమో కొడుకులా?

40. (ఓ ప్రవక్తా!) నీవుగాని వారి నుండి ఏదన్నా ప్రతిఫలం అడుగుతున్నావా? ఆ రుణభారం క్రింద వారు అణగారిపోతున్నారనడానికి!? 41. ఏమిటి, వారి వద్ద అగోచర విషయం ఏదన్నా ఉందా? వారుగాని దాన్ని వ్రాస్తున్నారా? 42. పోనీ, వారేదన్నా వల వేయదలుస్తున్నారా? ఒకవేళ అలాంటిదేమన్నా ఉంటే సత్యతిరస్కారులే ఆ వలలో పడిపోతారు. 43. ఏమిటి, అల్లాహ్ కాకుండా వారికి వేరితర దైవం ఉన్నాడా? వారు కల్పించే భాగస్వామ్యానికి అల్లాహ్ అతీతుడు, పరిశుద్ధుడు.

44. ఒకవేళ వారు ఆకాశం నుండి ఏదయినా తునక విరుచుకు పడటం చూసినా, 'అది ఒకదానిపై ఒకటిగా పేరుకున్న మబ్బుతునక మాత్రమే' అనంటారు. 45. కనుక వారు స్పృహ కోల్పోయే రోజును ఎదుర్కొనేవరకూ వారిని వారి మానాన వదలిపెట్టు. 46. ఆ రోజు వారి ఎత్తుగడలు వారికి ఏ విధంగానూ ఉపయోగపడవు. వారికి ఏ సహాయం కూడా అందదు. 47. ఈ దుర్మార్గులకు ఇదిగాకుండా మరో శిక్ష కూడా ఉంది. కాని వారిలో చాలామందికి తెలియదు.

48. కనుక నీవు ఓర్పుతో నీ ప్రభువు ఆదేశం కొరకు నిరీక్షించు. నిశ్చయంగా నీవు మా దృష్టిలోనే ఉన్నావు. నీవు లేచినపుడు నీ ప్రభువు పవిత్రతను కొనియాడు, ఆయన్ని స్తుతించు. 49. రాత్రివేళల్లో కూడా ఆయన పవిత్రతను శ్లాఘించు. నక్షత్రాలు వెనుతిరిగే సమయంలో కూడా.

## 53. అన్ నజ్మ్ (నక్షత్రం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అస్తమించినప్పటి నక్షత్రం సాక్షిగా! 2. మీ సహచరుడు (ముహమ్మద్) దారి తప్పనూ లేదు, అపమార్గానికి లోనుకానూ లేదు. 3. అతను తన మనసు కోరినట్లుగా కూడా మాట్లాడడు. 4. అతనేం చెప్పినా

అది అతనికి పంపబడే వహీ (దివ్యవాణి) అయి ఉంటుంది. 5. అది అత్యంత శక్తిమంతుడు (అయిన దైవదూత) నేర్పినది. 6. అతడు శక్తి, యుక్తి కలవాడు. అతను (కర్తవ్యాన్ని ఉపదేశించేందుకు) నిలబడ్డాడు. 7. అతడు ఎత్తయిన ఆకాశపుటంచుపై ఉన్నాడు. 8. తరువాత సమీపించసాగాడు ... మరింత క్రిందికి వచ్చాడు. 9. రెండు ధనుస్సులంత దూరాన లేక అంతకన్నా దగ్గరగా ఉండిపోయాడు. 10. తరువాత అల్లాహ్ తన దాసునికి వహీ చేయవలసినది వహీ చేశాడు. 11. దైవప్రవక్త మనసు అతను తిలకించిన దానిని అబద్ధమంటూ కొట్టివేయలేదు. 12. అలాంటప్పుడు మీరు అతడు తిలకించిన దానిపై అతనితో వాదులాడుతారా? 13. అతను మరోసారి కూడా అతనిని (దైవదూత జిబ్రీల్‌ని) దిగుతుండగా చూసి ఉన్నాడు. 14. సిద్రతుల్ మున్తహా (రేగు వృక్షం) వద్ద! 15. అక్కడే జన్నతుల్ మావా (హాయిగా విశ్రమించే ఉద్యానవనం) ఉంది. 16. అప్పుడు ఆ వృక్షంపై ఆవరించేది ఏదో ఆవరిస్తూ ఉంది. 17. (వీక్షకుని) దృష్టి చెదరిపోనూలేదు, అవధి మీరనూ లేదు. 18. అతను తన ప్రభువు యొక్క గొప్ప సూచనలను తదేకంగా తిలకించాడు.

19. ఏమిటి, మీరు లాత్ ఉజ్జాలను గురించి (ఎన్నడయినా) ఆలోచించారా? 20. మరొకటి, మూడవది అయిన మనాతును గురించి (కూడా యోచించారా? చెప్పండి! అవి నిజంగా దైవాలేనా?) 21. ఏమిటి, మీ కోసమేమో కొడుకులూను, దేవుని కోసమేమో కూతుళ్ళా? 22. ఇది మరీ దారుణమయిన పంపకం (కదూ)! 23. ఇవన్నీ మీరూ, మీ తాతముత్తాతలు పెట్టుకున్న వట్టి పేర్లు తప్ప మరేమీ కావు. అల్లాహ్ వాటికి అనుకూలంగా ఏ ఆధారాన్నీ అవతరింపజేయలేదు. వీళ్ళు కేవలం అనుమానాలను, మనోభిరామాన్ని అనుసరిస్తున్నారు. వాస్తవానికి వారివద్దకు వారి ప్రభువు తరఫు నుండి మార్గదర్శకత్వం వచ్చేసింది. 24. ఏమిటి, మనిషికి అతను కోరుకున్నదల్లా ప్రాప్తమవుతుందా? 25. వాస్తవానికి ఇహపరాలు దైవాధీనమై ఉన్నాయి.

26. ఆకాశాలలో ఎందరో దైవదూతలున్నారు. కాని వారి సిఫారసు ఏమాత్రం ఉపయోగపడదు – తరువాత అల్లాహ్ తాను కోరిన వారి

విషయంలో సిఫారసు వినటానికి అనుమతిస్తేనే తప్ప! 27. నిశ్చయంగా పరలోకాన్ని నమ్మనివారు దైవదూతలకు స్త్రీల పేర్లు పెడతారు. 28. నిజానికి వారి దగ్గర దీనికి సంబంధించిన విషయజ్ఞానం ఏదీ లేదు. వారు కేవలం అనుమానాన్ని అనుసరిస్తున్నారు. అనుమానాలు సత్యం ముందు ఏ విధంగానూ ఉపకరించవు (నిలువలేవు). 29. కనుక (ఓ ప్రవక్తా!) మా ఉపదేశం పట్ల విముఖుడై, కేవలం ఐహిక జీవితం తప్ప మరేదీ అభిలషించని వ్యక్తి నుండి నీవు దృష్టిని మరల్చుకో. 30. వారి విషయావగాహన అంతవరకే. తన మార్గం నుండి వైదొలగిన వాడెవడో నీ ప్రభువుకు బాగా తెలుసు. సన్మార్గాన ఉన్నదెవరో కూడా ఆయనకు బాగా తెలుసు.

31. భూమ్యాకాశాలలో ఉన్నదంతా అల్లాహ్‌కే చెందుతుంది – దుష్కర్మలు చేసిన వారికి వారి కర్మలకు తగ్గ ప్రతిఫలం ఇవ్వటానికి! సత్క్రియలాచరించిన వారికి సత్ఫలితం ఇవ్వటానికి!! 32. ఎవరు చిన్న చిన్న పొరపొచ్చాలు మినహా పెద్ద పాపాల నుండి, నీతి బాహ్యమైన చేష్టల నుండి తమ్ము తాము కాపాడుకుంటారో (వారు వారి ప్రభువు క్షమాభిక్షకు అర్హులు). నిశ్చయంగా నీ ప్రభువు క్షమాపణ బహు విస్తృతమైనది. ఆయన మిమ్మల్ని మట్టి నుండి సృష్టించినప్పటి మీ స్థితిని ఎరిగినవాడు. మీరు మీ మాతృగర్భాలలో – గర్భస్థ శిశువుగా – ఉన్నప్పటి పరిస్థితిని గురించి కూడా ఆయన బాగా ఎరిగినవాడే. కనుక మిమ్మల్ని మీరు మహా పవిత్రులుగా భావించుకోకండి. దైవభీతి పరాయణులెవరో ఆయనకు బాగా తెలుసు.

33. అది సరేగాని (దైవమార్గం నుండి) తిరిగిపోయినవాణ్ణి నీవు చూశావా? 34. వాడు (దైవమార్గంలో) ఏదో కాస్త ఇచ్చి, (ఇవ్వటం) ఆపేశాడు. 35. వాడి వద్ద రహస్యజ్ఞానం ఉందా? దానిని వాడు వీక్షిస్తున్నాడా? 36. ఏమిటి, మూసా గ్రంథ ప్రతుల్లో ఉన్న విషయ సమాచారం అతనికి చేరలేదా? 37. మాట నిలుపుకున్న ఇబ్రాహీమ్ విశేషాలు (చేరలేదా?) 38. బరువును మోసేవాడెవడూ ఇతరుల బరువును మోయడన్న సంగతి వాడికి తెలియదా? 39. మరో విషయం ఏమిటంటే ప్రతి మనిషికీ తాను దేనికోసం కృషిచేస్తాడో, అదే అతనికి లభిస్తుంది. 40. ఇంకా ఏమిటంటే,

అతని కృషి (ఫలితం) అనతికాలంలోనే చూపబడుతుంది. 41. తరువాత అతనికి పూర్తి ప్రతిఫలం ప్రసాదించబడుతుంది. 42. ఇంకా – అందరూ చేరుకోవలసింది నీ ప్రభువు వద్దకే.

43. నిశ్చయంగా ఆయనే నవ్విస్తున్నాడు, ఆయనే ఏడిపిస్తున్నాడు. 44. ఆయనే చంపుతున్నాడు, ఆయనే బ్రతికిస్తున్నాడు. 45. ఆయనే రెండు రకాలను – ఆడ మగ జంటలను – సృష్టించాడు. 46. స్ఖలించబడినప్పటి ఒక్కగానొక్క వీర్యబిందువుతో. 47. మలిసారి (బ్రతికించి) లేపే బాధ్యత కూడా ఆయనదే. 48. ఆయనే సంపదను ప్రసాదించాడు, సుసంపన్నుల్ని చేశాడు. 49. షీరా (అనే నక్షత్రమునకు) ప్రభువు కూడా ఆయనే.

50. తొలి ఆద్ వారిని అంతమొందించినది కూడా ఆయనే. 51. సమూద్ వారిని కూడా. తరువాత ఎవరినీ మిగిల్చి ఉంచలేదు. 52. అంతకు ముందు నూహ్ జాతివారిని కూడా. నిశ్చయంగా వారు దుర్మార్గులు, తలబిరుసులు. 53. తలక్రిందులైన బస్తీలను కూడా ఆయనే విసిరివేశాడు. 54. వారిని ఆక్రమించుకునేదేదో ఆక్రమించింది. 55. మరైతే నీవు నీ ప్రభువు యొక్క ఏ ఏ చిత్రవిచిత్రాలను త్రోసిపుచ్చగలవు?

56. పూర్వం భయబోధ చేసినవారి వలెనే ఇతను కూడా ఒక భయబోధ చేసేవాడే. 57. దగ్గర పడేది దగ్గరపడింది. 58. అల్లాహ్ తప్ప దానిని తొలగించగల వాడెవడూ లేడు. 59. ఏమిటి, దీనిపై మీకు ఆశ్చర్యం కలుగుతోందా? 60. ఏమిటి, మీరు నవ్వుతున్నారా? మీకు ఏడుపు రావటం లేదా? 61. పైగా మీరు మితిమీరిన నిర్లక్ష్యం ప్రదర్శిస్తారా? 62. అల్లాహ్ సమక్షంలో ప్రణమిల్లండి, ఆయన్నే ఆరాధించండి.

## 54. అల్ ఖమర్ (చంద్రుడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ప్రళయ ఘడియ సమీపించింది. చంద్రుడు చీలిపోయాడు. 2. వారు మహిమను చూసినప్పటికీ విముఖతే చూపుతారు. 'ఇది అనాదిగా వస్తూవున్న మాయాజాలమే కదా!' అంటారు. 3. వీళ్లు సత్యాన్ని కాదన్నారు.

తమ మనోవాంఛల వెనకే నడిచారు. ప్రతి వ్యవహారానికీ ఒక సమయం నిర్ధారితమై ఉంది. 4. వారివద్దకు గుణపాఠంతో కూడిన పలు సమాచారాలు చేరాయి. 5. వివేకంతో నిండినది కూడా అందినది. కాని హెచ్చరికలు వారికి ప్రయోజనం చేకూర్చలేదు. 6. కనుక నీవు వారి నుండి దృష్టి మరల్చుకో. పిలిచేవాడొకడు భరించనలవి కాని విషయం వైపు పిలిచిననాడు, 7. వారు కళ్లు వాల్చుకుని, సమాధుల నుండి చెల్లాచెదరైన మిడతల దండు మాదిరిగా బయలుదేరివస్తారు. 8 – పిలిచేవాని వైపు పరుగులు తీస్తూ! అప్పుడు సత్య తిరస్కారులు, 'ఇది చాలా గడ్డుదినం' అంటారు.

9. వీరికి పూర్వం నూహ్ జాతి వారు కూడా సత్యాన్ని అసత్యంగా చిత్రీకరించారు. వారు మా భక్తుణ్ణి (ప్రవక్తను) అసత్యవాదిగా ముద్రవేయటంతో పాటు, అతన్ని పిచ్చోడన్నారు. అతన్ని విదిలించారు. 10. అందువల్ల అతను తన ప్రభువును ఇలా ప్రార్థించాడు : '(ప్రభూ!) నేను ఓడిపోయాను. నాకు సహాయం చెయ్యి (వారిపై ప్రతీకారం తీర్చుకో).' 11. అప్పుడు మేము ఆకాశద్వారాలను తెరచి కుండపోతగా వర్షం కురిపించాము. 12. భూమి నుండి ఊటలు పెల్లుబికి ప్రవహించేలా చేశాము. కాగల కార్యాన్ని నెరవేర్చటానికి ఆ నీళ్ళన్నీ ఏకమైనాయి. 13. మేమతనిని (నూహ్‌ను) పలకలు, మేకులు గల దానిపై (ఓడపై) ఎక్కించుకున్నాము. 14. అది మా కనుల ముందరే పయనించసాగింది. విలువ ఇవ్వబడని వ్యక్తి తరఫున మేము తీర్చుకున్న ప్రతీకారమది! 15. దానిని మేము ఒక సూచనగా వదలిపెట్టాము. మరి చింతన చేసేవాడెవడయినా ఉన్నాడా? 16. మరి ఎలా ఉంది మా శిక్ష, మా హెచ్చరిక? 17. మేము ఖుర్‌ఆన్‌ను హితబోధ నిమిత్తం సులభతరం చేశాము. మరయితే హితబోధను గ్రహించేవాడెవడయినా ఉన్నాడా?

18. ఆద్ (జాతి) వారు కూడా సత్యాన్ని త్రోసిపుచ్చారు. మరయితే నా శిక్ష, నా భయబోధ ఎలా ఉండినవో చూశారుగా! 19. మేము వారిపై ఒకానొక దుర్దినాన నిరాఘాటంగా వీచే ప్రచండమయిన గాలిని పంపాము. 20. అది ఆ జనులను కూకటి వ్రేళ్ళతో పెకలించబడిన ఖర్జూర బోదెల

మాదిరిగా ఎత్తిపడవేయసాగింది. 21. మరి ఎలా ఉండింది మా దెబ్బ! మా హెచ్చరిక? 22. మేము ఖుర్ఆన్‌ను హితబోధ నిమిత్తం సులభతరం చేశాము. మరయితే హితబోధను గ్రహించే వాడెవడయినా ఉన్నాడా?

23. సమూదు జాతివారు మా హెచ్చరికలనే అసత్యంగా కొట్టివేశారు. 24. వారిలా అన్నారు : 'ఏమిటి, మేము మాలోని ఒక్కగానొక్క వ్యక్తి చెప్పినట్లుగా నడుచుకోవాలా? అలాగైతే మేము తప్పుదారిపట్టి, పిచ్చిలో పడిపోయినట్లే. 25. ఏమిటి, మేమింతమందిమి ఉండగా, ఇతనొక్కడిపైనే ఉపదేశం అవతరించిందా? లేదు, అతనొక బడాయిని చాటుకునే అసత్య వాది.' 26. అసత్యవాది ఎవరో, బడాయి చాటుకునేదెవరో రేపటి రోజున వారికే తెలిసివస్తుంది. 27. వాళ్ళను పరీక్షించేందుకు మేము ఒక ఆడ ఒంటెను పంపించబోతున్నాము. కాబట్టి నీవు వాళ్ళ వ్యవహారంలో నిరీక్షించు. సంయమనం పాటించు. 28. వాళ్ళ మధ్య నీళ్ళ పంపిణీ జరిగిందని, వారు తమ వంతుల ప్రకారం నీళ్ళ కోసం రావాలని వారికి తెలియపర్చు. 29. తరువాత వాళ్ళు తమ సహచరుణ్ణి పిలిచారు. వాడు ఆ ఒంటెపై దాడిచేసి, దానిని నరికేశాడు. 30. మరి నా శిక్ష, నా హెచ్చరిక ఎలా ఉండిందో చూశారుగా! 31. మేము వారిపై ఒకే ఒక్క గర్జన (అరుపు)ను వదిలాము. దాంతో వారు కంచె వేసేవాడు తొక్కిన గడ్డి మాదిరిగా తుక్కుతుక్కై పోయారు. 32. మేము ఖుర్ఆన్‌ను హితబోధ నిమిత్తం సులభం చేశాము. మరయితే హితబోధను గ్రహించేవాడెవడయినా ఉన్నాడా?

33. లూత్ జాతి కూడా తమకు భయబోధ చేసేవారిని త్రోసిపుచ్చింది. 34. మేము వారిపై రాళ్ళు కురిపించే గాలిని పంపాము. లూత్ ఇంటివారు మాత్రమే దాని నుండి సురక్షితంగా బయటపడ్డారు. వారిని మేము తొలిజాము వేళ కాపాడాము. 35. – మా ప్రత్యేక అనుగ్రహంతో! కృతజ్ఞతా భావం కలిగి ఉండేవానికి మేము వొసగే ప్రతిఫలం ఇలాగే ఉంటుంది. 36. మా పట్టు గురించి వారికి లూత్ ముందే హెచ్చరించాడు. కాని వారు హెచ్చరికలనే వివాదాస్పదంగా మార్చేశారు. 37. వారు అతని అతిథులనే అతన్నుండి లాక్కునే దుస్సాహసానికి పాల్పడ్డారు. అందువల్ల మేము వారి కళ్లు పోగొట్టాము. 'ఇక నా శిక్షను, నా హెచ్చరికను రుచి చూడండి' (అని వారితో

అనబడింది). 38. తెల తెలవారుతుండగా ఖరారైన శిక్ష వాళ్ళపై విరుచుకుపడింది. 39. 'ఇక రుచి చూడండి నా శిక్షను, నా హెచ్చరికలను.' 40. మేము ఖుర్‌ఆన్‌ను హితబోధ నిమిత్తం సులభం చేశాము. మరయితే హితబోధను గ్రహించేవాడెవడయినా ఉన్నాడా?

41. హెచ్చరించేవారు ఫిరౌన్ వద్దకు కూడా చేరుకున్నారు. 42. కాని వారు మా సూచనలన్నింటినీ బూటకమంటూ కొట్టివేశారు. అందువల్ల మేము వాళ్ళను శక్తిమంతుడు, సర్వసత్తాధికారి మాదిరిగా పట్టుకున్నాము.

43. ఏమిటి, మీలోని సత్యతిరస్కారులు వాళ్ళకన్నా ఘనాపాటి అనుకుంటున్నారా? లేక మీ కోసం ఆకాశ గ్రంథాలలో ఏదయినా (క్షమాపణ, వెసులుబాటు) వ్రాయబడి ఉందా? 44. ఏమిటి, తమది గెలుపొందే వర్గం అన్న మితిమీరిన ధీమా వారికుందా? 45. (తెలుసుకోండి!) త్వరలోనే ఈ వర్గం పరాజయం పాలుకానున్నది. అది వెన్నుచూపి పారిపోతుంది. 46. వారికి వాగ్దానం చేయబడిన అసలు సమయమైతే ప్రళయమే. ప్రళయం మహా కఠినమైనది, మహా చేదైనది. 47. నిశ్చయంగా అపరాధ జనులు మార్గవిహీనతలో, మతిమాలిన స్థితిలో పడి ఉన్నారు. 48. ఆ రోజు వారు తమ ముఖాల మీద నరకాగ్నిలోనికి ఈడ్వబడతారు. 'నరకాగ్ని రుచిని చూడండి.'

49. మేము ప్రతి వస్తువును ఒక లెక్క ప్రకారం సృష్టించాము. 50. మా ఆజ్ఞ ఒక్కటి చాలు. (ఏ పనయినా సరే) రెప్పపాటు సమయంలో జరిగిపోతుంది. 51. మీ వెంట ఉండే వారినెందరినో మేము తుదముట్టించాము. మరి దీని గురించి ఆలోచించేవాడెవడయినా ఉన్నాడా? 52. వారు చేసుకున్నదంతా వారి కర్మల చిట్టాలలో నమోదై ఉంది. 53. ప్రతి చిన్న పెద్ద విషయం లిఖించబడి ఉంది. 54. నిశ్చయంగా దైవభీతి పరాయణులు స్వర్గవనాల సెలయేరుల మధ్యన ఉంటారు. 55. వారు తిరుగులేని సార్వభౌమాధికారి వద్ద సిసలయిన – నిజమయిన – స్థానంలో కూర్చుని ఉంటారు.

## 55. అర్ రహ్మాన్ (అపార కరుణామయుడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అపార కరుణామయుడు (అయిన అల్లాహ్) 2. ఖుర్ఆన్ బోధించాడు. 3. ఆయనే మనిషిని సృష్టించాడు. 4. అతనికి మాట్లాడటం నేర్పాడు. 5. సూర్యచంద్రులకు ఒక లెక్క (నియమం) నిర్ధారితమై ఉంది. 6. నక్షత్రాలు, వృక్షాలు కూడా సాష్టాంగపడుతున్నాయి. 7. ఆయనే ఆకాశాన్ని బాగా పైకెత్తాడు. ఇంకా ఆయనే త్రాసును ఏర్పరచాడు. 8. మీరు తూకంలో వైపరీత్యానికి (అన్యాయానికి) పాల్పడకుండా ఉండాలని! 9. న్యాయసమ్మతంగా తూచి ఇవ్వండి. తూకంలో తగ్గించకండి.

10. ఆయన తన సృష్టిరాశుల కోసం భూమిని పరచి ఉంచాడు. 11. అందులో పండ్లు ఫలాలున్నాయి. ఖర్జూరాలున్నాయి. అవి పొరలలో చుట్టబడి ఉన్నాయి. 12. ఊక గల ఆహార ధాన్యాలూ ఉన్నాయి, సువాసనను గుభాళించే పువ్వులూ ఉన్నాయి. 13. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదనగలరు? 14. ఆయన మనిషిని పెంకు మాదిరిగా మ్రోగే ఎండిన గార మట్టితో సృష్టించాడు. 15. ఇంకా ఆయన జిన్నులను అగ్నిజ్వాలతో సృష్టించాడు. 16. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదనగలరు? 17. రెండు తూర్పులకు, రెండు పడమరలకు అధిపతి ఆయనే. 18. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదనగలరు? 19. రెండు సాగర జలాలను కలిసి ప్రవహించేలా వదలినవాడు ఆయనే. 20. రెండింటి మధ్య ఒక అడ్డుతెర ఉంది. దానిని అవి అతిక్రమించవు.

21. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదనగలరు? 22. ఆ రెండింటి నుండి ముత్యాలు, పగడాలు బయల్పడుతున్నాయి. 23. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అనుగ్రహాలను కాదనగలరు? 24. సముద్రంలో ఎత్తయిన పర్వతాల్లా నిలిచి ఉన్న ఓడలు కూడా ఆయనవే. 25. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను నిరాకరించగలరు?

26. నేలపై ఉన్న ప్రతి ఒక్కరూ నశించేవారే. 27. ఎప్పటికీ మిగిలి ఉండేది ఘనత వహించిన, ఉదాత్తమయిన నీ ప్రభువు అస్తిత్వం మాత్రమే. 28. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అద్భుతాలను త్రోసిరాజనగలరు? 29. భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ ఆయన్నే అర్థిస్తున్నాయి. అనుదినం ఆయన ఓ వినూత్న ప్రణాళికా వైభవంతో వెలుగొందుతున్నాడు. 30. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదనగలరు?

31. పెద్ద సమూహాలుగా ఉన్న ఓ ఇరు వర్గీయులారా! మేము త్వరలోనే తీరిక చేసుకుని మీ సంగతి చూసుకుంటాము. 32. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అద్భుతాలను నిరాకరించగలరు? 33. ఓ జిన్నుల, మానవుల వర్గానికి చెందిన వారలారా! మీకంత శక్తి ఉంటే, భూమ్యాకాశాల సరిహద్దులు దాటి పారిపోగలిగితే పొండి. (మా తరఫున) సాధికారికత లేకుండా మీరెన్నటికీ పోలేరు. 34. మరి మీరు మీ ప్రభువు తరఫున గల ఏ ఏ అద్భుతాలను కాదంటారు? 35. మీపై అగ్నిజ్వాలలు, పొగ వదలబడతాయి. మీరు వాటిని ప్రతిఘటించలేరు. 36. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను నిరాకరిస్తారు?

37. ఆకాశం చీలిపోయి, చర్మం మాదిరిగా ఎర్రగా తయారయినపుడు ... 38. మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ అద్భుతాలను కాదంటారు? 39. ఆ రోజు ఏ మానవుణ్ణిగానీ, ఏ జిన్నునుగానీ అతని పాపాల గురించి ప్రశ్నించవలసిన అవసరమే ఉండదు. 40. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అద్భుతాలను నిరాకరిస్తారు? 41. అపరాధులు తమ ఆనవాళ్ళను బట్టి ఇట్టే గుర్తించబడతారు. తరువాత వారి లలాటకురులు, కాళ్ళు పట్టి ఈడ్వటం జరుగుతుంది. 42. మరి మీరు మీ ప్రభువు యొక్క ఏ ఏ శక్తి సామర్థ్యాలను కాదంటారు? 43. అపరాధులు అబద్ధమంటూ త్రోసిపుచ్చిన నరకం ఇదే. 44. వారు దానికీ – సలసల కాగే నీటికి మధ్య తిరుగాడుతూ ఉంటారు. 45. మరి మీరు మీ ప్రభువు తరఫున జరిగే ఏ ఏ లీలలను త్రోసిరాజంటారు?

46. తన ప్రభువు సమక్షంలో నిలబడవలసి ఉందని భయపడుతూ ఉండే వానికి రెండు తోటలున్నాయి. 47. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అనుగ్రహాలను నిరాకరిస్తారు? 48. ఆ రెండు (తోటలు కూడా) శాఖోపశాఖలుగా విస్తరించినవి. 49. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అద్భుత సౌకర్యాలను కాదంటారు? 50. ఆ రెండు తోటలలోనూ రెండు సెలయేరులు పారుతూ ఉంటాయి. 51. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అనుగ్రహ భాగ్యాలను నిరాకరిస్తారు? 52. ఆ రెండు తోటలలోనూ ప్రతి పండు రెండు రకాలుగా ఉంటుంది. 53. మరి మీరు మీ ప్రభువు వరప్రసాదాలలో దేనిని కాదనగలరు? 54. వారు పట్టు వస్త్రపు అస్తరుగల పరుపులపై దిండ్లకు ఆనుకుని కూర్చుని ఉంటారు. ఆ తోటల పండ్లు క్రిందికి వాలి వారికి అందుబాటులో ఉంటాయి. 55. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ అనుగ్రహ భాగ్యాలను నిరాకరిస్తారు? 56. ఆ తోటలలో (బిడియం వల్ల) కనులు క్రిందికి వాలి ఉండే స్వర్గకన్య లుంటారు. వీరికి ముందు ఆ స్వర్గ కన్యలను ఏ మానవుడుగానీ, ఏ జిన్నుగానీ తాకి ఉండడు. 57. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ బహుమానాలను కాదంటారు? 58. వారు (స్వర్గ కన్యలు) కెంపులు, పగడాల వలే ఉంటారు. 59. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ కానుకలను కాదంటారు? 60. మంచితనానికి బదులు మంచితనం తప్ప మరేం కాగలదు? 61. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ ఉపకారాలను కాదంటారు?

62. ఇవిగాక మరో రెండు తోటలు కూడా ఉన్నాయి. 63. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ మహోపకారాలను నిరాకరిస్తారు? 64. అవి రెండూను దట్టంగా, ముదురు ఆకుపచ్చగా ఉంటాయి. 65. మరి మీరు మీ ప్రభువు కురిపించిన ఏ ఏ అనుగ్రహాలను కాదంటారు? 66. వాటిలో పొంగి పరవళ్ళు తొక్కే రెండు సెలయేరులు ఉంటాయి. 67. మరి మీరు మీ ప్రభువు చేసిన ఏ ఏ ఉపకారాలను నిరాకరిస్తారు? 68. వాటిలో రకరకాల పండ్లు, ఖర్జూరాలు, దానిమ్మకాయలు ఉంటాయి. 69. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ వరప్రసాదాలను త్రోసిపుచ్చగలరు? 70. వాటిలో

శీలవతులు, సౌందర్యవతులైన స్వర్గ కన్యలుంటారు. 71. మరి మీరు మీ ప్రభువు ప్రసాదించిన ఏ ఏ కానుకలను కాదనగలరు? 72. గుడారాలలో బసచేసిన సుందరాంగులు ... 73. మరి మీరు మీ ప్రభువు తరఫున ఉన్న ఏ ఏ మహదానుగ్రహాలను నిరాకరిస్తారు? 74. వీరికి పూర్వం ఆ సుందరీమణులను ఏ మనిషిగానీ, ఏ జిన్నుగానీ ముట్టుకుని ఉండడు. 75. మరి మీరు మీ ప్రభువు ప్రదానం చేసిన ఏ ఏ బహుమతులను నిరాకరించగలరు? 76. వారు పచ్చని పరుపులపై, నాణ్యమైన తివాచీలపై దిండ్లకు ఆనుకుని దర్జాగా ఆసీనులవుతారు. 77. మరి మీరు మీ ప్రభువు ఏర్పాటు చేసిన ఏ ఏ సుఖసౌఖ్యాలను కాదనగలరు? 78. ఘనాఘనుడు, పరమ ఉదాత్తుడు అయిన నీ ప్రభువు నామం ఎంతో శుభప్రదమైనది.

## 56. అల్ వాఖిఅహ్ (అనివార్య సంఘటన)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అనివార్యమైన సంఘటన సంభవించినపుడు, 2. అది సంభవించటంలో అసత్యానికి (నిరాకరణకు) ఆస్కారమే లేదు. 3. అది (కొందరిని) అట్టడుగుకు చేర్చేది, (కొందరిని) అత్యున్నతికి ఎత్తేది అయి ఉంటుంది. 4. భూమి తీవ్రంగా కుదిపివేయబడినపుడు, 5. పర్వతాలు పగిలి తునాతునకలైపోయినపుడు, 6. తరువాత అవి దుమ్ము ధూళిగా చెల్లాచెదురైపోయినపుడు, 7. మీరు మూడు వర్గాలుగా ఏర్పడతారు.

8. వారిలో కుడిపక్షం వారు; కుడిపక్షం వారి సౌభాగ్యం గురించి ఏమని (ఎలా) చెప్పేది!? 9. మరి ఎడమపక్షం వారు; ఎడమ పక్షం వారి దుస్థితి గురించి ఏమని చెప్పేది!? 10. ఇక ముందంజవేసిన వారంటారా!? వారు ఎంతయినా ముందు వరుసలో ఉండేవారే. 11. వారు (దైవ) సామీప్యానికి నోచుకున్నవారు. 12. వారు సుఖసౌఖ్యాలతో కూడిన స్వర్గవనాలలో ఉంటారు. 13. వారిలో చాలామంది తొలి కాలానికి చెందినవారై ఉంటారు. 14. కొద్దిమంది మాత్రం తరువాతివారై ఉంటారు. 15. వారు బంగారు జలతారుతో నేయబడిన ఆసనాలపై 16. దిండ్లకు

ఆనుకుని - ఎదురెదురుగా - ఆసీనులై ఉంటారు. 17. వారి సేవలో ఎల్లకాలం బాలురుగానే ఉండే బాలసేవకులు ఉంటారు. 18. వారు పాత్రలు, కూజాలు, గ్లాసులలో స్వచ్ఛమయిన మధువు నింపుకుని ఉంటారు. 19. ఆ మధుపానం వల్ల తలనొప్పి రావటం గానీ, బుద్ధి తికమక పడటంగానీ జరగదు. 20. అక్కడ వారికోసం వారు కోరుకున్న పండ్లు ఫలాలు ఉంటాయి. 21. వారికి ఇష్టమయిన పిట్టల మాంసం సమర్పించబడుతుంది. 22. (వారి కొరకు) పెద్ద పెద్ద కన్నులు గల సుందరీమణులు ఉంటారు. 23. వారు సురక్షితంగా ఉంచబడిన ముత్యాల మాదిరిగా ఉంటారు. 24. వారు చేసుకున్న సత్కర్మలకు ప్రతిఫలంగా! 25. అక్కడ వారు పనికిమాలిన మాటలుగానీ, పాప విషయాలుగానీ వినరు. 26. ఎటుచూసినా శాంతియుతమయిన పలుకులే ప్రతిధ్వనిస్తూ ఉంటాయి.

27. ఇక కుడిపక్షంవారు; కుడిపక్షం వారు ఎటువంటి సౌభాగ్య వంతులు! 28. వారు ముళ్లులేని రేగు వృక్షాల మధ్యన ఉంటారు. 29. ఒకదానిపై ఒకటిగా పేరుకున్న అరటిగెలలు, 30. విస్తరించిన నీడలు, 31. జలప్రవాహాలు, 32. పుష్కలమైన పండ్లు ఫలాల మధ్యన వారు హాయిగా ఉంటారు. 33. అవి ఎన్నటికీ తరగనివి, ఆంక్షలు నిషేధాజ్ఞలు లేనివి. 34. (వారికోసం) ఎత్తయిన పరుపులు ఉంటాయి. 35. మేము వారిని (వారి భార్యలను) విశిష్ఠ రీతిలో ప్రభవింపజేశాము. 36. వారిని కన్యలుగానే ఉంచాము. 37. వారు (తమ భర్తలకు) మనసైనవారై, వారికి సమవయస్కులై ఉంటారు. 38. ఇవన్నీ కుడిపక్షం వారికి. 39. వీరు తొలికాలం వారిలో కూడా హెచ్చు సంఖ్యలో ఉంటారు. 40. తరువాతి వారిలో నుండి కూడా భారీ సంఖ్యలోనే ఉంటారు.

41. ఇకపోతే ఎడమ పక్షంవారు; ఎడమ పక్షంవారి దురవస్థ గురించి ఏమని చెప్పేది!? 42. వారు అగ్నిలో మాడుతూ, మరిగే నీటిలో ఉడుకుతూ ఉంటారు. 43. నల్లని పొగల నీడలో మ్రగ్గుతూ ఉంటారు. 44. అది చల్లదనాన్ని గానీ, ఉల్లాసాన్నిగానీ ఇవ్వదు. 45. అంతకుముందు వారంతా

భోగభాగ్యాలను జుర్రుకున్నవారే. 46. పైగా వారు పెద్ద పాపాల కోసం మొండిపట్టు పట్టేవారు. 47. వారీవిధంగా అనేవారు : 'ఏమిటి, మేము మరణించి, మట్టై, ఎముకలుగా మారిన తరువాత కూడా మళ్ళీ లేపబడతామా? 48. మా పూర్వీకులయిన మా తాతముత్తాతలు కూడా లేపబడతారా?' 49. వారికి చెప్పు : 'ముందటివారు, వెనుకటివారు, 50. అందరూ ఒక నిర్ధారిత దినపు నిర్ణీత సమయాన సమావేశపరచబడతారు. 51. తరువాత మీరంతా ఓ మార్గభ్రష్టులారా! సత్యాన్ని త్రోసిపుచ్చిన వారలారా! 52. జెముడు వృక్షాన్ని తింటారు. 53. దాంతోనే మీ కడుపు నింపుకుంటారు. 54. ఆపైన మరిగే నీరు త్రాగుతారు – 55 – దప్పికగొన్న ఒంటెలు త్రాగినట్లే. 56. ఇదీ తీర్పుదినాన వారికి లభించే ఆతిథ్యం!

57. మిమ్మల్ని పుట్టించిన వారం మేమేకదా! మరలాంటప్పుడు మీరీ సత్యాన్ని ఎందుకు ధ్రువపరచరు? 58. అదిసరే, మీరు స్ఖలించే రేతస్సును గురించి ఎన్నడయినా ఆలోచించారా? 59. దాంతో సృష్టిప్రక్రియను మొదలెట్టేది మీరా? లేక మేము సృష్టిస్తున్నామా? 60. మేము మీ మధ్యన చావును విధించాము. ఈ వ్యవహారంలో మేము అశక్తులం కాము. 61. పైగా మీ స్థానంలో మీ వంటివారిని సృష్టించి, మీరెరుగని ఆకృతిలో మిమ్మల్ని ప్రభవింపజేయటం కూడా అసంభవం ఏమీ కాదు. 62. మొదటి పుట్టుక గురించి మీకెలాగూ తెలిసిందే. మరి దానిద్వారా గుణపాఠం ఎందుకు నేర్చుకోరు? 63. మీరు నాటే వస్తువు (విత్తనం) గురించి మీరెన్నడయినా ఆలోచించారా? 64. దానిని మీరు పండిస్తున్నారా లేక దానిని పండించేది మేమా? 65. మేము గనక తలచుకుంటే దానిని తొక్కిన గడ్డిమాదిరిగా చేసివేయగలం. తరువాత మీరు మాటలతో పొద్దుపుచ్చాల్సిందే. 66. 'మేము అప్పుల్లో కూరుకుపోయాం. 67. అసలు మా తలరాతే ఇలా ఉంది' అంటారు. 68. మీరు త్రాగే ఆ నీరు గురించి మీరెప్పుడయినా ఆలోచించారా? 69. దానిని మేఘ మాలికల నుండి మీరు కురిపిస్తున్నారా? లేక దానిని కురిపించేది మేమా? 70. మేము గనక తలచుకుంటే దానిని కటిక ఉప్పు (నీరు)గా మార్చివేయగలం. మరలాంటప్పుడు మీరు కృతజ్ఞులుగా ఎందుకు

మసలుకోరు? 71. మీరు మండించే అగ్గిని గురించి మీరేనాడయినా ఆలోచించారా? 72. దాని చెట్టును మీరు పుట్టించారా? లేక దానిని పుట్టించినది మేమా? 73. మేము దీనిని గుణపాఠ సూచనగానూ, ప్రయాణీకులకు ఉపయోగపడే వస్తువుగానూ చేశాము. 74. కనుక (ఓ ప్రవక్తా!) నీవు మహోన్నతుడగు నీ ప్రభువు నామ పవిత్రతను కొనియాడు.

75. అదికాదు, నేను నక్షత్రాలు అస్తమించటంపై ప్రమాణం చేస్తున్నాను. 76. మీరు గనక తెలుసుకోగలిగితే ఇది చాలా గొప్ప ప్రమాణం. 77. నిశ్చయంగా ఈ ఖుర్ఆన్ మహిమాన్వితమైనది. 78. అదొక సురక్షితమయిన గ్రంథంలో ఉంది. 79. పరిశుద్ధులుగా ఉన్నవారు మాత్రమే దానిని ముట్టుకుంటారు. 80. ఇది సకల లోకాల ప్రభువు తరఫున అవతరింపజేయబడినది. 81. మరైతే మీరు ఈ మహత్పూర్వకమయిన విషయం పట్ల బద్ధకం వహిస్తున్నారా? 82. మీరు దీనిని నిరాకరించటమే మీ జీవనోపాధిగా చేసుకున్నారా?

83. కాకపోతే ఏమిటి? (గుండెలోని) ప్రాణం గొంతుదాకా వచ్చేసినపుడు, 84. ఆ సమయంలో మీరు చూస్తూ ఉంటారు. 85. అప్పుడు మేము మీకన్నా ఆ (మరణించే) వ్యక్తికి సమీపంలో ఉంటాము. కాని మీరు చూడలేరు. 86. మీరే గనక ఒకరి ఆదేశానికి తలఒగ్గి ఉండకపోతే ... 87. మీరు ఆ (పోయే) ప్రాణాన్ని తిరిగి రప్పించుకోరెందుకు? మీరు సత్యవంతులే అయితే (ఈ పనిచేసి చూపండి).

88. ఒకవేళ ఆ వ్యక్తి సామీప్యం పొందినవాడై ఉంటే 89. అతని కోసం సుఖసౌఖ్యాలు, ఉత్తమ జీవనోపాధి, అనుగ్రహంతో నిండిన తోట ఉంటుంది. 90. ఒకవేళ అతను కుడిపక్షంలోని వాడై ఉంటే 91. 'నీకు శాంతి కలుగుగాక! నీవు కుడిపక్షంలోని వాడవు' (అని అనబడుతుంది). 92. ఒకవేళ అతను సత్యాన్ని ఖండించి, మార్గభ్రష్టుల్లో చేరి ఉన్నవాడైతే, 93. మరిగే నీటితో అతనికి అతిథి సత్కారం చేయబడుతుంది. 94. అతను నరకానికి ఆహుతి కావలసి ఉంటుంది. 95. నిశ్చయంగా ఇది తిరుగులేని సత్యం. 96. కనుక నీవు మహోన్నతుడగు నీ ప్రభువు నామ పవిత్రతను కొనియాడు.

# 57. అల్ హదీద్ (ఇనుము)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భువన గగనాలలో ఉన్న ప్రతిదీ అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉన్నది. ఆయన గొప్ప శక్తిమంతుడు, వివేకవంతుడు. 2. భూమ్యాకాశాల సార్వభౌమత్వం ఆయనదే. ఆయనే బ్రతికిస్తున్నాడు, ఆయనే చంపుతున్నాడు. ఆయన ఏదయినాసరే చేయగల సమర్థుడు. 3. ఆయనే తొలివాడు, తుదివాడు. ఆయనే బాహ్యం, నిగూఢం. ఆయన ప్రతిదీ తెలిసినవాడు. 4. ఆయనే భూమ్యాకాశాలను కేవలం ఆరు రోజులలో సృష్టించాడు. తరువాత ఆయన సింహాసనాన్ని అధిష్టించాడు. భూమి లోపలికి పోయేదీ, దానినుండి వెలికి వచ్చేది, ఆకాశం నుండి దిగేది, దానిలోనికి ఎగబ్రాకేది – అంతా ఆయనకు తెలుసు. మీరెక్కడ ఉన్నాసరే ఆయన మీతోనే ఉంటాడు. మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు. 5. భూమ్యాకాశాల సార్వభౌమత్వం ఆయనదే. సమస్త వ్యవహారాలు అల్లాహ్ వైపునకే మరల్చ బడతాయి. 6. ఆయనే రాత్రిని పగటిలోనికి జొప్పిస్తున్నాడు, పగటిని రాత్రి లోనికి జొప్పిస్తున్నాడు. ఆయన ఆంతర్యాల్లోని గుట్టును కూడా ఎరిగినవాడు.

7. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించండి. ఆయన మీకు ధర్మకర్తగా చేసిన సొమ్ములో నుండి ఖర్చుపెట్టండి. మీలో విశ్వసించి, దానరూపేణా ఖర్చుపెట్టిన వారికి గొప్ప ప్రతిఫలం ఉంటుంది. 8. అసలు మీకేమయింది? మీరు అల్లాహ్‌ను విశ్వసించరేమిటి? మీ ప్రభువును విశ్వసించండి అంటూ దైవప్రవక్త మీకు పిలుపు ఇస్తున్నాడు. మీరు విశ్వాసులే అయితే ఆయన మీ నుండి వాగ్దానం కూడా తీసుకున్నాడు. 9. ఆయనే తన దాసునిపై స్పష్టమయిన సూచనలను అవతరింపజేస్తున్నాడు – మిమ్మల్ని కటిక చీకట్ల నుండి వెలికితీసి కాంతి రేఖల వైపు తీసుకురావాలని! నిశ్చయంగా అల్లాహ్ మీ యెడల మృదుస్వభావి, దయాశీలుడు. 10. అసలు మీకేమయింది? మీరు దైవమార్గంలో ఎందుకు ఖర్చుచేయరు? యదార్థానికి భూమ్యాకాశాలన్నీ చివరకు దైవమార్గంలోనే పోతాయి. మీలో ఎవరు

విజయానంతరం పోరాడారో, ఖర్చుపెట్టారో వారు విజయానికి పూర్వం ఖర్చుపెట్టిన వారితో, పోరాడిన వారితో సమానులు కాలేరు. విజయానికి పూర్వం పోరాడిన, ఖర్చుపెట్టినవారి అంతస్తే గొప్పది. అయితే అల్లాహ్ మాత్రం అందరికీ మేలు చేస్తానని వాగ్దానం చేశాడు. మీరు చేసేదంతా అల్లాహ్ జ్ఞానపరిధిలో ఉంది.

11. అల్లాహ్‌కు అత్యుత్తమ రుణం ఇచ్చేవాడెవడు? – దానిని ఆయన ఎన్నో రెట్లు పెంచి అతనికి ఇవ్వటానికి! అతని కొరకు గౌరవప్రదమైన ప్రతిఫలం ఉంటుంది. 12. ఆ రోజు నీవు విశ్వాసులయిన పురుషులను, విశ్వాసులయిన స్త్రీలను చూస్తావు! వారి వెలుగు వారికి ముందు, వారికి కుడి వైపు ప్రసరిస్తూ ఉంటుంది – 'ఈ రోజు మీకు దిగువన కాలువలు ప్రవహించే స్వర్గవనాల శుభవార్త ఇవ్వబడుతోంది. ఇందులో మీరు కలకాలం ఉంటారు. ఇదే గొప్ప సాఫల్యం!' 13. ఆ రోజు కపటులైన స్త్రీ పురుషులు విశ్వాసులతో 'కాస్త మాకూ అవకాశం కల్పించండి! మేము కూడా మీ వెలుగు ద్వారా లాభం పొందుతాము' అనంటారు. 'మీరు వెనక్కి తిరిగి వెళ్ళండి. వెలుతురును అక్కడే వెతుక్కోండి' అని వారితో అనబడుతుంది. తరువాత వారి మధ్యన ఒక గోడ నిలబెట్టబడుతుంది. అందులో ఒక ద్వారం ఉంటుంది. ఆ ద్వారం లోపల కారుణ్యముండగా, వెలుపల యాతన ఉంటుంది. 14. వారు వీరినుద్దేశ్యించి కేకలేస్తారు : 'ఏమిటి, మేము మీతోనే ఉండలేదా?' దానికి సమాధానంగా వీరు ఇలా అంటారు : 'మీరు మాతో ఉన్న విషయం నిజమే. కాని మిమ్మల్ని మీరు వంచించుకున్నారు. (మాపై ఆపదలు రావాలని) ఎదురుచూశారు. సంశయంలో పడి ఊగిసలాడారు. మీ బూటకపు ఆశలే మిమ్మల్ని మోసగించాయి. కడకు అల్లాహ్ తీర్పు రానే వచ్చింది. ఆ మహా మోసగాడు (షైతాన్) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసగించాడు.' 15. కాబట్టి ఈ రోజు మీ నుండిగానీ, తిరస్కారానికి ఒడిగట్టిన వారి నుండి గానీ ఎలాంటి నష్టపరిహారం స్వీకరించబడదు. నరకాగ్నే మీ నివాసం. అదే ఇక మీ నేస్తం. అది ఎంతో చెడ్డ గమ్యస్థానం.

16. ఏమిటి, విశ్వసించిన వారి హృదయాలు దైవోపదేశం ముందు, ఆయన అవతరింపజేసిన సత్యం ముందు మెత్తబడి, వినమ్రతతో వంగే సమయం ఇంకా ఆసన్నం కాలేదా? వీరు తమకు పూర్వం గ్రంథం వొసగబడిన వారి మాదిరిగా కారాదు సుమా! వారిపై ఒక సుదీర్ఘ కాలం గడిచేసరికి వారి హృదయాలు కఠినమై పోయాయి. వారిలో చాలామంది అవిధేయులే.
17. తెలుసుకోండి! నిశ్చయంగా అల్లాహ్‌యే భూమి మృతి చెందిన మీదట దానికి జీవం పోస్తున్నాడు. మేము మా సూచనలను మీకు సుబోధకం చేస్తున్నాము – మీరు అర్థం చేసుకోవాలని!

18. నిశ్చయంగా దానధర్మాలు చేసే పురుషులు, దానధర్మాలు చేసే స్త్రీలు, అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారు – అది వారి కొరకు పెంచబడుతుంది. వారి కొరకు గౌరవప్రదమైన ప్రతిఫలం ఉంటుంది.
19. మరెవరయితే అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను నమ్మి నడుచుకుంటారో, అలాంటివారే తమ ప్రభువు సన్నిధిలో సచ్ఛీలురు, సత్యసాక్షులు. వారి కొరకు వారి ప్రతిఫలంతో పాటు, వారి జ్యోతి ఉంటుంది. మరెవరయితే తిరస్కార వైఖరికి ఒడిగట్టి, మా సూచనలను అసత్యమంటూ త్రోసిపుచ్చారో – అలాంటివారే నరకవాసులు.

20. తెలుసుకోండి! ఈ ప్రాపంచిక జీవితం ఓ ఆట, ఓ తమాషా, అలంకారం, పరస్పరం గర్వపడటం, సిరిసంపదలలో, సంతానం విషయంలో ఒండొకరిని మించిపోవాలనే పేరాశ మాత్రమే. దీని ఉపమానం వర్షపు నీరు వంటిది. దాంతో మొలకెత్తిన పంట రైతులను ఆహ్లాదపరుస్తుంది. తరువాత అది ఎండిపోతుంది. ఆ తరువాత అది నీకు పసుపుపచ్చగా కానవస్తుంది. దరిమిలా అది పొట్టు పొట్టుగా అయిపోతుంది. పరలోకంలో కఠిన శిక్ష ఉంటుంది. అల్లాహ్ తరఫున క్షమాపణ, ఆయన ప్రసన్నత కూడా ఉంటుంది. ఈ ప్రాపంచిక జీవితం మోసపుచ్చే సామగ్రి తప్ప మరేమీ కాదు.
21. మీ ప్రభువు క్షమాపణ వైపునకు పరుగెత్తండి – ఇంకా ఆ స్వర్గం వైపునకు! దాని వెడల్పు భూమ్యాకాశాలంత విశాలమైనది. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించిన వారి కొరకు అది సిద్ధం చేయబడింది. ఇది అల్లాహ్

అనుగ్రహం. దీనిని ఆయన తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. అల్లాహ్ గొప్ప అనుగ్రహం కలవాడు.

22. ఏ విపత్తు అయినాసరే – అది భువిలో వచ్చినదయినా, మీ ప్రాణాల మీదికి వచ్చినదయినా, మేము దానిని సృష్టించక ముందే – అదొక గ్రంథంలో వ్రాయబడి ఉంది. నిశ్చయంగా ఇది అల్లాహ్‌కు చాలా తేలిక. 23. పోగొట్టుకున్న దానిపై మీరు దుఃఖించకుండా ఉండాలని, ఆయన మీకు ప్రసాదించిన దానిపై మీరు గర్వంతో ఉబ్బిపోకుండా ఉండాలని (మీకు ఇదంతా అవగతం చేయబడింది). అల్లాహ్ మిడిసిపడే వాడినిగానీ, డాంబికాలు చెప్పుకునే వాడినిగానీ ఎంతమాత్రం ఇష్టపడడు. 24. వారి నైజం ఎటువంటిదంటే, వారు స్వయంగా పరమ పీనాసులుగా ప్రవర్తించినది గాక ఇతరులకు కూడా పిసినారితనం గురించి పురికొల్పుతారు. మరెవ డయినా వైముఖ్య ధోరణిని ప్రదర్శిస్తే, అల్లాహ్ నిరపేక్షాపరుడు, స్తవనీయుడు.

25. యదార్థానికి మేము మా ప్రవక్తలను నిదర్శనాలతో సహా పంపించాము. వారితో పాటు గ్రంథాన్ని, త్రాసును కూడా అవతరింపజేశాము – ప్రజలు న్యాయంపై స్థిరంగా ఉండాలని! ఇంకా మేము ఇనుమును అవతరింపజేశాము. అందులో చాలా శక్తి ఉంది. ప్రజల కొరకు ప్రయోజ నాలు కూడా ఉన్నాయి. చూడకుండానే తనకు, తన ప్రవక్తలకు తోడ్పడే వారెవరో తెలుసుకోవాలని అల్లాహ్ ఇదంతా చేశాడు. అల్లాహ్ మహా బలవంతుడు, ఆధిక్యత కలవాడు.

26. ఇంకా మేము నూహ్‌ను, ఇబ్రాహీమును పంపాము. వారి సంతతిలో ప్రవక్తాపదవిని, గ్రంథాన్ని ఉంచాము. వారిలో కొందరు సన్మార్గంపై ఉండగా, చాలామంది అవిధేయులుగా ఉన్నారు. 27. వారి అడుగుజాడల లోనే మేము మా ప్రవక్తలను పంపుతూ పోయాము. వారి వెనుకే మర్యమ్ కుమారుడగు ఈసాను కూడా పంపాము. మేమతనికి ఇంజీలును ప్రసాదించాము. అతనిని అనుసరించిన వారి హృదయాలలో మేము వాత్సల్యాన్ని, దయార్ద్రతను పొందుపరిచాము. సన్యాసత్వాన్ని వారంతట వారే మొదలెట్టారు. మేమైతే దానిని వారిపై వ్రాసిపెట్టలేదు. అయితే వారు

దైవప్రసన్నతను బడసే ఉద్దేశంతో సన్యాసత్వాన్ని అవలంబించారు. కాని దానికి ఖచ్చితంగా కట్టుబడి ఉండలేకపోయారు. తరువాత వారిలో విశ్వసించిన వారికి మేము వారి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. అయితే వారిలో అత్యధికులు మాత్రం అవిధేయులే.

28. విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. ఆయన ప్రవక్తను విశ్వసించండి. అల్లాహ్ మీకు తన కారుణ్యం నుండి రెండు భాగాలను ప్రసాదిస్తాడు. మీకు జ్యోతిని అనుగ్రహిస్తాడు. దాని వెలుగులో మీరు ముందుకు నడుస్తారు. ఆయన మిమ్మల్ని క్షమిస్తాడు. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు. 29. – దైవానుగ్రహంలోని ఏ వస్తువుపై కూడా తమకు ఎలాంటి అధికారం లేదని, అనుగ్రహమంతా అల్లాహ్ చేతిలోనే ఉందని, ఆయన తాను కోరిన వారికి దానిని ఇస్తాడని గ్రంథం కల ప్రజలు తెలుసుకోవాలని (ఈ ఉపదేశం చేయబడింది). అల్లాహ్ మహదానుగ్రహం కలవాడు.

## 58. అల్ ముజాదలహ్ (వాదన)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (28) 1. (ప్రవక్తా!) తన భర్త విషయంలో నీతో వాదించి, అల్లాహ్‌కు ఫిర్యాదు చేసుకున్న ఆ ఇల్లాలి మాటను అల్లాహ్ విన్నాడు. అల్లాహ్ మీరిద్దరి ప్రశ్నోత్తరాలను కూడా విన్నాడు. నిశ్చయంగా అల్లాహ్ వినేవాడు, చూసేవాడు.

2. మీలో ఎవరయినాసరే మీ భార్యలను ఉద్దేశించి, 'నీవు నా తల్లిలాంటి దానివి' అని చెప్పినంత మాత్రాన వారు వారికి తల్లులు కాలేరు. వారిని కన్నవారు మాత్రమే వారి తల్లులు. ముమ్మాటికీ వీళ్ల ఒక అనుచితమయిన మాటను, అబద్ధాన్ని పలుకుతున్నారు. కాగా; అల్లాహ్ మన్నింపుల వైఖరిని అవలంబించేవాడు, క్షమించేవాడూను. 3. ఎవరయితే తమ భార్యల ముందు నోరుజారి (జిహార్ ప్రయోగించి), తరువాత తాము చెప్పిన మాటను ఉపసంహరించదలచుకుంటారో, వారు ఒకరినొకరు తాకకముందే ఒకరి మెడను విడిపించవలసి ఉంటుంది (అంటే, ఒక బానిసకు

స్వేచ్ఛను ప్రసాదించవలసి ఉంటుంది). దీనిద్వారా మీకు బోధపరచబడు తోంది. మీరు చేసేదంతా అల్లాహ్ జ్ఞానపరిధిలో ఉంది. 4. (బానిసకు స్వేచ్ఛనొసగే) స్థోమత లేనివ్యక్తి తన ఇల్లాలితో సమాగమం జరపక ముందే నిరాఘాటంగా రెండు నెలల పాటు ఉపవాసం పాటించాలి. ఇదీ చేయలేని వాడైతే అరవైమంది నిరుపేదలకు అన్నం పెట్టవలసి ఉంటుంది. మీరు అల్లాహ్ యెడల, ఆయన ప్రవక్త యెడల దృఢ విశ్వాసం కలవారని నిరూపించు కోవటానికే ఇది. ఇవి అల్లాహ్ నిర్ధారించిన హద్దులు. తిరస్కారులకు వ్యధాభరితమయిన శిక్ష తథ్యం.

5. అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను వ్యతిరేకించేవారు వారి పూర్వీకులు అవమానితులైనట్లే అవమానితులవుతారు. మేము చాలా స్పష్టమయిన సూచనలను అవతరింపజేశాము. సత్యతిరస్కారులకు అవమానకరమైన యాతన ఖాయం. 6. అల్లాహ్ వారందరినీ తిరిగి లేపిన రోజున, వారు చేసుకున్న వాటిని వారికి తెలియపరుస్తాడు. అల్లాహ్ అంతా లెక్కించి ఉంచాడు. వారు మాత్రం దానిని మరచిపోయి ఉంటారు. అల్లాహ్ అన్నింటికీ సాక్షిగా ఉన్నాడు.

7. భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి వస్తువు గురించి అల్లాహ్‌కు తెలుసు అన్న దానిని నీవు గమనించటం లేదా? నాలుగవ వాడుగా అల్లాహ్ లేకుండా ఏ ముగ్గురి మధ్యన కూడా రహస్య సమాలోచనలు జరగవు. ఆరవవాడుగా ఆయన లేకుండా ఏ అయిదుగురి మధ్యన కూడా రహస్య మంతనాలు సాగవు. అంతకన్నా తక్కువమంది ఉన్నా, ఎక్కువమంది ఉన్నా – వారెక్కడ ఉన్నాసరే – ఆయన వారితో ఉంటాడు. వారి నిర్వాకమంతా ప్రళయదినాన ఆయన వారికి తెలియపరుస్తాడు. నిశ్చయంగా అల్లాహ్ ప్రతిదీ తెలిసినవాడు. 8. రహస్య మంతనాల నుండి వారించబడిన వారిని నీవు చూడలేదా? అయినాసరే వారు వారించబడిన వాటినే చేస్తున్నారు. వారు పాపం, అత్యాచారం, దైవప్రవక్త పట్ల అవిధేయతకు సంబంధించిన రహస్య మంతనాలే సాగిస్తున్నారు. వారు నీ వద్దకు వచ్చినపుడు, అల్లాహ్ నీకు సలామ్ చేయని రీతిలో నీకు సలామ్ చేస్తారు. పైపెచ్చు, 'మేము పలికే ఈ మాటలకు గాను

అల్లాహ్ మమ్మల్ని శిక్షించడేమి?' అని తమ మనసులోనే చెప్పుకుంటారు. వారికి నరకమే చాలు. వారు దానికి ఆహుతి అవుతారు, అది మహా చెడ్డ గమ్యస్థానం.

9. ఓ విశ్వాసులారా! మీరు సమాలోచన జరిపినపుడు పాపం, అత్యాచారం, దైవప్రవక్త యెడల అవిధేయత గురించిన సమాలోచన జరపకండి. సత్కార్యం, దైవభీతికి సంబంధించిన సమాలోచన మాత్రమే జరపండి. అల్లాహ్‌కు భయపడండి. ఆయన వద్దకే మీరు సమీకరించబడతారు.
10. నిజానికి ఇలాంటి రహస్య మంతనాలు షైతాన్ ప్రేరేపితమై ఉంటాయి. విశ్వసించిన వారిని మనస్తాపానికి లోను చేయాలన్నదే వాడి ఉద్దేశ్యమై ఉంటుంది. అయితే దైవాజ్ఞ కానంత వరకూ వాడు వారికి ఎలాంటి మనస్తాపం కలిగించలేడు. విశ్వసించినవారు సదా అల్లాహ్‌నే నమ్ముకోవాలి.

11. విశ్వసించిన ఓ ప్రజలారా! సమావేశాలలో ఎడంగా కూర్చోమని మీతో అన్నప్పుడు మీరు ఎడంగా కూర్చోండి. అల్లాహ్ మీకు విస్తృతిని కల్పిస్తాడు. లేవమని మీతో అన్నప్పుడు వెంటనే లేచి నిలబడండి. మీలో విశ్వసించిన వారి, జ్ఞానమొసగబడిన వారి అంతస్తులను అల్లాహ్ పెంచుతాడు. మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు.

12. ఓ విశ్వాసులారా! మీరు దైవప్రవక్తను ఏకాంతంలో సంప్రతించ దలచినపుడు మీ రహస్య సంప్రతింపులకు ముందు ఏదయినా దానం చేయండి. ఇదే మీ కొరకు శ్రేయస్కరమైనది. పరిశుద్ధమైనది. ఒకవేళ మీ వద్ద ఆ స్థోమత లేకుంటే అల్లాహ్ క్షమించేవాడు, దయచూపేవాడు.
13. ఏమిటి, మీ రహస్య సంప్రతింపులకు ముందు దానం చేయాలనేసరికి మీరు భయపడిపోయారా? మీరు అలా చేయలేకపోయినపుడు, అల్లాహ్ మిమ్మల్ని మన్నించాడు. కాబట్టి నమాజులను (మాత్రం ఎట్టి పరిస్థితిలోనూ) స్థాపించండి. జకాత్‌ను చెల్లించండి. దైవానికి, దైవప్రవక్తకు విధేయులై ఉండండి. మీరు చేసేదంతా అల్లాహ్ దృష్టిలో ఉంది. 14. ఏమిటి, దైవాగ్రహా నికి పాత్రులయిన వారితో స్నేహం చేసే వారిని నీవు చూడలేదా? వారు మీలోనూ లేరు. వారిలోనూ లేరు. వారు తెలిసీ అసత్య ప్రమాణాలు

చేస్తున్నారు. 15. అల్లాహ్ వారికోసం కఠిన శిక్షను సిద్ధం చేసి ఉంచాడు. నిశ్చయంగా వారు చేసేవి చెడ్డ పనులే. 16. వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకున్నారు. దానికి తోడు దైవమార్గం నుండి (జనులను) ఆపుతున్నారు. వారికి అవమానకరమయిన శిక్ష తథ్యం.

17. వారి సిరిసంపదలుగానీ, వారి సంతానం గానీ వారికేవిధంగానూ అల్లాహ్‌కు వ్యతిరేకంగా పనికిరావు. వారు నరకవాసులు. వారందులో శాశ్వతంగా ఉంటారు. 18. అల్లాహ్ వారందరినీ తిరిగి లేపిన రోజున, వారు మీ ఎదుట ప్రమాణాలు చేసినట్లే ఆయన ఎదుట కూడా ప్రమాణాలు చేస్తారు. తమకూ ఒక ప్రమాణబద్ధత ఉందని వారు అనుకుంటున్నారు. బాగా వినండి! వారు వట్టి అబద్ధాలకోరులు. 19. షైతాన్ వారిని పూర్తిగా తన అదుపులో తీసేసుకున్నాడు. తరువాత వారిని దైవధ్యానం విషయంలో మరుపునకు లోనుచేశాడు. ఇలాంటి వారంతా షైతాన్ పక్షానికి చెందినవారు. వినండి! నిశ్చయంగా షైతాన్ పక్షం నష్టపోతుంది. 20. ఎవరు అల్లాహ్ యెడల, ఆయన సందేశహరుని యెడల వైరవైఖరిని అవలంబిస్తారో – అలాంటివారే అధమశ్రేణికి చెందినవారు. 21. 'నేనూ, నా ప్రవక్తలు మాత్రమే ప్రాబల్యం వహిస్తాము' అని అల్లాహ్ వ్రాసిపెట్టాడు. నిశ్చయంగా అల్లాహ్ మహాబలశాలి, శక్తిశాలి.

22. అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించేవారు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త విరోధులతో మైత్రి సంబంధాలు పెట్టుకున్నట్లు నీవు ఎక్కడా చూడవు – ఒకవేళ ఆ విరోధులు తమ తండ్రులైనాసరే, తమ కొడుకులయినా సరే, తమ సోదరులయినాసరే, తమ కుటుంబ సభ్యులైనాసరే – ఇలాంటి వారి హృదయాలలోనే అల్లాహ్ విశ్వాసాన్ని వ్రాసిపెట్టాడు. ఇంకా వారికి తన అండదండలను ప్రసాదించాడు. ఇంకా, వారికి క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశం కల్పిస్తాడు. వాటిలో వారు శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ వారి పట్ల ప్రసన్నుడయ్యాడు. వారు అల్లాహ్ యెడల సంతుష్టులయ్యారు – ఇలాంటివారే అల్లాహ్ పక్షంవారు. వినండి! అల్లాహ్ పక్షం వారే సాఫల్యం పొందుతారు.

# 59. అల్ హష్ర్ (బహిష్కరణ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భూమ్యాకాశాలలో ఉన్న వస్తువులన్నీ అల్లాహ్ పవిత్రతను కొనియాడుతున్నై. ఆయన గొప్ప శక్తిమంతుడు, మహా వివేకవంతుడు. 2. ఆయనే గ్రంథవహులలోని సత్యతిరస్కారులను వారి ఇండ్ల నుండి తొలి ప్రయత్నంలోనే తీసివేయించాడు. వారు వెళ్ళిపోతారని మీరు ఊహించనయినా లేదు. పటిష్టమైన తమ కోటలు తమను అల్లాహ్ (పట్టు) నుండి కాపాడుతాయని వారనుకున్నారు. మరయితే అల్లాహ్ వారు ఊహించనయినా లేని చోటు నుండి వారిని ముట్టడించాడు. వారి గుండెల్లో దడ పుట్టించాడు. అందువల్ల వారు తమ ఇండ్లను తమ చేతులారా ధ్వంసం చేయసాగారు. విశ్వాసుల చేతుల మీదుగా కూడా. కనుక తమ చర్మచక్షువులతో వీక్షించే వారలారా! గుణపాఠం నేర్చుకోండి.

3. ఒకవేళ అల్లాహ్ వారి నొసట దేశబహిష్కరణను వ్రాసిపెట్టి ఉండకపోతే, ప్రపంచంలోనే వారిని శిక్షించి ఉండేవాడు. పరలోకంలో వారికి నరకాగ్ని యాతన ఎలాగూ ఉంటుంది. 4. ఇలా ఎందుకంటే, వారు అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు వ్యతిరేకంగా వ్యవహరించారు. ఎవడు అల్లాహ్‌ను వ్యతిరేకించినా అల్లాహ్ అతనిని కఠినంగా దండిస్తాడు. 5. (విశ్వాసులారా!) మీరు ఏ ఖర్జూర చెట్లను నరికివేసినా, మరే ఖర్జూర చెట్లను వాటి వ్రేళ్లపై నిలబడి ఉండేలా వదలిపెట్టినా – అదంతా దైవాజ్ఞతోనే జరిగింది. అవిధేయులను పరాభవం పాల్జేయటానికి ఇది అనివార్యమయింది.

6. అల్లాహ్ వారి నుండి ఏ సొమ్ములనయితే తన ప్రవక్త వైపు మళ్లించాడో వాటిపై మీరు మీ గుఱ్ఱాలనుగానీ, ఒంటెలను గానీ పరుగెత్తించలేదు. అయితే అల్లాహ్ తన ప్రవక్తలకు తాను కోరిన వారిపై ప్రాబల్యాన్ని వొసగుతాడు. అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. 7. అల్లాహ్ పురజనుల నుండి తన ప్రవక్త వైపు మళ్లించిన (ఫయ్) సొమ్ము అల్లాహ్‌కు, ప్రవక్తకు, బంధువులకు, అనాథలకు, నిరుపేదలకు, బాటసారులకు

చెందుతుంది – అది మీ ధనిక వర్గాల మధ్యనే పరిభ్రమిస్తూ ఉండరాదన్న ఉద్దేశంతో ఇలా నిర్ణయించటం జరిగింది. ప్రవక్త మీకు ఇచ్చిన దానిని పుచ్చుకోండి. ఆయన దేనినుండైనా మిమ్మల్ని వారిస్తే, మీరు దాని నుండి ఆగిపొండి. అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. అల్లాహ్ కఠినంగా శిక్షించగలవాడు. 8. (మరీ ముఖ్యంగా ఈ ఫయ్ సొమ్ము) తమ ఇల్లూ వాకిలి నుండి, తమ ఆస్తిపాస్తుల నుండి వెళ్ళగొట్టబడిన నిరుపేద ముహాజిర్లకు చెందాలి. వారు దైవానుగ్రహాన్ని, ఆయన ప్రసన్నతను కోరుకుంటున్నారు. ఇంకా వారు దైవానికి, దైవప్రవక్తకు తోడ్పడుతున్నారు. ఇలాంటివారే సత్యసంధులు.

9. మరెవరయితే ముందు నుండే మదీనాలో స్థిరనివాసం ఏర్పరచుకుని విశ్వాసాన్ని పటిష్టవంతం చేసుకున్నారో (వారు సయితం ఔదార్యానికి హక్కుదారులే. వారెలాంటి వారంటే) వారు వలసపోయి తమ వద్దకు వచ్చిన వారిని ప్రేమిస్తారు. ముహాజిర్లకు (వలస వచ్చినవారికి) ఏమిచ్చినా, వారు తమ ఆంతర్యాలలో సంకోచానికి తావివ్వరు. మరోవైపు తాము పస్తు ఉన్నప్పటికీ తమపై ముహాజిర్లకే ప్రాధాన్యత ఇస్తారు. ఎవడు తన ఆత్మ లోభత్వం (పేరాశ) నుండి రక్షించబడ్డాడో – అలాంటివారే సాఫల్యం పొందేవారలు. 10. వారి తరువాత వచ్చినవారు సయితం (సద్వ్యవహారానికి అర్హులే). వారిలా ప్రార్థిస్తూ ఉంటారు : 'మా ప్రభూ! మమ్ము క్షమించు. మాకన్నా ముందు విశ్వసించిన మా సోదరులను కూడా (క్షమించు). మా హృదయాలలో విశ్వసించిన వారి యెడల ఎలాంటి అక్కసునూ ఉంచకు. మా ప్రభూ! నిశ్చయంగా నీవు వాత్సల్యం కలవాడవు, కృపాశీలుడవు.'

11. (ఓ ప్రవక్తా!) కాపట్యానికి లోనైన వారిని నీవు చూడలేదా? వారు గ్రంథవహులలోని తిరస్కార సోదరులతో ఇలా అంటారు : 'ఒకవేళ మీరు గాని దేశం నుండి వెళ్ళగొట్టబడినట్లయితే మేము కూడా మీతోపాటే వచ్చేస్తాము. మీ విషయంలో మేము ఎవరి మాటా వినము. ఒకవేళ మీతో యుద్ధమే గనక జరిగితే మేము మీకు అండగా నిలుస్తాము.' అయితే వారు వట్టి అబద్ధాలకోరులని అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు. 12. ఒకవేళ వారు

వెళ్ళగొట్టబడితే, వీళ్లు (కపటులు) వారి వెంట వెళ్ళటానికి ససేమిరా అంటారు. ఒకవేళ వారితో యుద్ధం జరిగితే వీళ్లు వారికి ఎంతమాత్రం సహాయం చేయరు. ఒకవేళ సాయం చేసినా (సరైన సమయంలో) వెన్నుచూపి పారిపోతారు. తరువాత వారికి ఎక్కడా సాయం లభించదు.

13. అల్లాహ్‌కన్నా అధికంగా మీరంటేనే వారి ఆంతర్యాలలో భయాందోళన గూడుకట్టుకుంది. ఇలా ఎందుకంటే వారు బొత్తిగా విషయావగాహన లేనివారు. 14. వారంతా ఏకమయినాసరే మీతో యుద్ధం చేయలేరు. కాకపోతే పటిష్టమైన కోటలున్న నగరాలలోనో, లేదా గోడల మాటునో ఉండి దాడి చేస్తారు. వారిమధ్య ఉన్న వైషమ్యం చాలా తీవ్రమైనది. వారంతా సంఘటితంగా ఉన్నారని నీవు అనుకుంటున్నావు. వాస్తవానికి వారి హృదయాలు వేర్వేరుగా ఉన్నాయి. వారి ఈ పరిస్థితికి కారణం వారు వివేచన లోపించిన జనులు.

15. వీళ్ళ పరిస్థితి చూస్తే కొన్నాళ్ళ క్రితమే తమ స్వయంకృతాపరాధాల రుచి చూసిన వారిలా ఉంది. వారికి బాధాకరమయిన శిక్ష ఉంటుంది. 16. షైతాన్‌ను పోలినది వారి పరిస్థితి. వాడు మనిషితో 'సత్యాన్ని తిరస్కరించు' అంటాడు. తీరా అతను తిరస్కార వైఖరిని అవలంబించిన మీదట, 'నీతో నాకెలాంటి సంబంధం లేదు. నేను సకల లోకాల ప్రభువైన అల్లాహ్‌కు భయపడుతున్నాన'ంటూ తప్పించుకుంటాడు. 17. పరిణామ స్వరూపం ఒక్కటే. వారిరువురూ నరకాగ్నికి ఆహుతి అయ్యారు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. దుర్మార్గులకు తగిన శాస్తి ఇదే.

18. విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. ప్రతి వ్యక్తీ, తాను రేపటి కొరకు ఏం పంపుకున్నాడో చూసుకోవాలి. అల్లాహ్‌కు భయపడండి. నిశ్చయంగా మీరు చేసేదంతా అల్లాహ్ జ్ఞానపరిధిలో ఉంది. 19. మీరు అల్లాహ్‌ను మరచిపోయిన వారివలే అయిపోకండి. తత్కారణంగా అల్లాహ్ వారిని తమ్ము తాము మరచిపోయేటట్లు చేశాడు – అలాంటివారే అసలు అవిధేయులు. 20. నరకవాసులు – స్వర్గవాసులు సమానులు కాలేరు. స్వర్గవాసులు మాత్రమే వాస్తవానికి సాఫల్యం పొందినవారు.

21. ఒకవేళ మేము ఈ ఖుర్ఆన్‌ను ఏ పర్వతం పైననో అవతరింప జేస్తే, అది దైవభీతితో అణగారిపోవటం, బ్రద్దలై పోవటం నీవు గమనిస్తావు – బహుశా జనులు ఆలోచిస్తారేమోనని మేము ఈ ఉపమానాలను వారికి విశదీకరిస్తున్నాము. 22. ఆయనే అల్లాహ్ – ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేనేలేడు. ఆయన నిగూఢమయిన, బహిర్గతమయిన విషయాలన్నింటినీ ఎరిగినవాడు. ఆయన అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడు. 23. ఆయనే అల్లాహ్ – ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. రాజాధిరాజు, దోషాలన్నింటి నుండి పరిశుద్ధుడు, నిలువెల్లా శాంతికి ప్రతిరూపం, అభయం (భద్రత) ఇచ్చువాడు, రక్షకుడు, గొప్ప శక్తిమంతుడు, పరాక్రమశాలి, అత్యున్నతుడు – ప్రజలు కల్పించే భాగస్వామ్యాలకు (షిర్క్‌కు) అల్లాహ్ అతీతుడు, పరమపవిత్రుడు. 24. ఆయనే అల్లాహ్ – సృష్టికర్త, ఉనికిలోనికి తెచ్చేవాడు, రూపకర్త; అత్యుత్తమ పేర్లన్నీ ఆయనకే చెందుతాయి. భూమ్యాకాశా లలో ఉన్న ప్రతిదీ ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంది. ఆయన శక్తిశాలి, మహావివేకి.

## 60. అల్ ముమ్తహినహ్ (పరీక్షించబడిన స్త్రీ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ విశ్వాసులారా! నాకూ, మీకూ శత్రువులైన వారిని మీ మిత్రులుగా చేసుకోకండి. మీరేమో వారితో స్నేహసంబంధాలు ఏర్పరచు కోవాలన్న ఆకాంక్షను అభివ్యక్తం చేస్తున్నారు. కాని వారేమో మీ వద్దకు వచ్చిన సత్యాన్ని తిరస్కరించారు. మీరు మీ ప్రభువు అల్లాహ్‌ను విశ్వసించారనే నెపంతో వారు ప్రవక్తను, మిమ్మల్నీ మీ స్వస్థలం నుండి వెళ్ళగొట్టారు. మీరు నా మార్గంలో పోరాడేందుకు, నా ప్రసన్నతను చూరగొనేందుకు బయలుదేరిన వారే అయితే, మీరు లోపాయికారిగా వారికి మైత్రీ సందేశాలు పంపిస్తారా!? మీరు దాచేదీ, వెల్లడించేది – అంతా నాకు తెలుసు. మీలో ఈ లోపాయికారి వ్యవహారం చేసినవాడు రాచబాట నుండి తప్పిపోయినట్లే. 2. ఒకవేళ వారు మీపై అదుపు సాధించినట్లయితే వారు మీకు శత్రువులైపోతారు. మీపై చేయి

చేసుకుంటారు. నోరు పారేసుకుంటారు. ఎలాగయినా సరే మీరు సత్యాన్ని తిరస్కరించాలని కోరుకుంటారు. 3. మీ బంధువులుగానీ, మీ పిల్లలుగానీ ప్రళయదినాన మీకేవిధంగానూ పనికిరారు. ఆయన మీ మధ్య తీర్పు చేస్తాడు. మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు.

4. మీకు ఇబ్రాహీములోనూ, అతని సహచరులలోనూ ఉత్తమ ఆదర్శం ఉంది. అప్పుడు వారు తమ జాతివారితో ఇలా అన్నారు : 'మాకు మీతోనూ, అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వాటితోనూ ఎట్టి సంబంధం లేదు. మేము మిమ్మల్ని తిరస్కరిస్తున్నాం. మీరు ఒక్కడయిన అల్లాహ్‌ను విశ్వసించనంత వరకూ మాకూ – మీకూ మధ్య శాశ్వతంగా విరోధం, వైమనస్యం ఏర్పడినట్లే. అయితే ఇబ్రాహీమ్ తన తండ్రితో, '(నాన్నా!) నేను నీ క్షమాపణ కోసం ప్రార్థిస్తాను. అంతకుమించి నేను నీ విషయమై దైవసమక్షంలో ఎలాంటి అధికారం కలిగిలేను' అని చెప్పినమాట (మాత్రం పరిగణనలోకి రాదు). 'మా ప్రభూ! మేము నిన్నే నమ్ముకున్నాము. నీ వైపునకే రుజువర్తనులవుతున్నాము. మేము చేరుకోవలసింది కూడా నీ సన్నిధికే. 5. మా ప్రభూ! మమ్మల్ని అవిశ్వాసుల చేత పరీక్షించకు. ప్రభూ! మమ్మల్ని క్షమించు. నిశ్చయంగా నీవు శక్తిమంతుడవు, వివేకవంతుడవు.' 6. నిశ్చయంగా మీకు వారి (జీవనశైలి)లో మంచి ఆదర్శం ఉంది– ముఖ్యంగా అల్లాహ్‌తో సమావేశమవటాన్ని, అంతిమదినాన్ని ఆశించేవానికి! మరెవడయినా విముఖుడైపోతే అల్లాహ్ అక్కరలేనివాడు, స్వతహాగా ప్రశంసనీయుడు. 7. అల్లాహ్ మీకూ–మీరు శత్రుత్వం వహించిన వారికీ మధ్య స్నేహబంధం ఏర్పరిచే అవకాశమూ లేకపోలేదు. అల్లాహ్ ఏదయినాసరే చేయగలడు. అల్లాహ్ క్షమాగుణం కలవాడు, దయాసాగరుడు.

8. ధర్మం విషయంలో మీతో యుద్ధం చేయకుండా, మిమ్మల్ని మీ నివాస గృహాల నుండి వెళ్ళగొట్టకుండా ఉన్న వారితో మీరు సద్వ్యవహారం చేయటాన్ని, వారి పట్ల న్యాయసమ్మతంగా ప్రవర్తించటాన్ని అల్లాహ్ వారించడు. నిస్సందేహంగా అల్లాహ్ న్యాయశీలురను ప్రేమిస్తాడు. 9. ధర్మావలంబన విషయంలో మీపై కయ్యానికి కాలుదువ్వి, మిమ్మల్ని మీ

నివాస గృహాల నుండి వెళ్ళగొట్టిన వారితో, మిమ్మల్ని బహిష్కరించటంలో ఇతరులకు తోడ్పడిన వారితో స్నేహం చేయటాన్ని మాత్రమే అల్లాహ్ వారిస్తున్నాడు. ఎవరు వారితో స్నేహం చేస్తారో వారే దుర్మార్గులు.

10. విశ్వసించిన వారలారా! ముస్లిం స్త్రీలు హిజ్రత్ చేసి (వలసపోయి) మీ వద్దకు వచ్చినపుడు, మీరు వారిని బాగా పరీక్షించండి. అసలు వారి విశ్వాసం గురించి అల్లాహ్‌కే బాగా తెలుసు. వారు విశ్వసించిన మహిళలని నిర్ధారణ అయిన మీదట వారిని అవిశ్వాసుల వద్దకు తిరిగి పంపకండి. ఈ మహిళలు వారికిగాని, వారు ఈ మహిళలకుగానీ ధర్మసమ్మతం కారు. సత్య తిరస్కారులైన వారి భర్తలు వారిపై ఖర్చుపెట్టి ఉన్న సొమ్మును వారికి చెల్లించండి. ఆ తరువాత మీరు ఈ మహిళలకు మహర్ సొమ్మును చెల్లించి, వారిని నికాహ్ చేసుకోవటం ఏమాత్రం ఆక్షేపణీయం కాదు. మీరు సయితం సత్యతిరస్కారులైన మహిళలను మీ వివాహబంధంలో ఆపి ఉంచకండి. వారిపై మీరు వెచ్చించిన సొమ్మును అడిగి తీసేసుకోండి. అటు సత్యతిరస్కారులు కూడా, తాము వెచ్చించిన దానిని మీ నుండి అడిగి తీసేసుకోవాలి. ఇది అల్లాహ్ ఆదేశం (తీర్పు). దీనిని ఆయన మీ మధ్య విధించాడు. అల్లాహ్ జ్ఞానధనుడు, వివేక సంపన్నుడు. 11. ఒకవేళ మీ భార్యల మహర్‌లో నుండి ఎంతో కొంత సొమ్ము తిరస్కారుల వద్దనే ఉండిపోతే, తరువాత మీ వంతు వచ్చినపుడు, ఎవరి స్త్రీలు వెళ్ళిపోయారో వారికి (యుద్ధ ప్రాప్తి నుండి) వారు వెచ్చించి ఉన్న సొమ్మును చెల్లించండి. మీరు విశ్వసించిన అల్లాహ్ యెడల భయభక్తులు కలిగి ఉండండి.

12. ఓ ప్రవక్తా! విశ్వసించిన మహిళలు నీ వద్దకు ప్రతిజ్ఞ (బైఅత్) చేయటానికి వచ్చి, ఈ షరతులకు కట్టుబడి ఉంటామని అంగీకరిస్తే వారిచేత ప్రతిజ్ఞ (బైఅత్) చేయించు. అవేమంటే –

- అల్లాహ్‌కు భాగస్వామ్యం కల్పించబోము (షిర్క్‌కు పాల్పడము)
- దొంగతనం చేయము.
- వ్యభిచారానికి పాల్పడము.
- సంతాన హత్యకు పాల్పడము.

- మా కాళ్ళు చేతుల మధ్య నుండి ఎలాంటి అపనిందను కల్పించి తీసుకురాము.
- సత్కార్యాలలో నీకు అవిధేయత చూపము.

(ప్రవక్తా!) వారి క్షమాపణ కొరకు అల్లాహ్‌ను ప్రార్థించు. నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు.

13. ఓ విశ్వాసులారా! దైవాగ్రహానికి పాత్రులయిన వారిని మీ స్నేహితులుగా చేసుకోకండి. గోరీలలో పడి ఉన్న సత్యతిరస్కారులు నిరాశ చెందినట్లే, వారు కూడా పరలోకం పట్ల ఆశ వదులుకున్నారు.

## 61. అస్ సఫ్ (బారులు తీరటం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భూమ్యాకాశాలలో ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్ మహిమను, పవిత్రతను కొనియాడుతూ ఉంది. ఆయన మహా శక్తిమంతుడు, వివేక సంపన్నుడు. 2. విశ్వాసులారా! మీరు చేయని దానిని గురించి ఎందుకు చెప్పుకుంటారు. 3. చేయని దానిని గురించి మీరు డాంబికాలు చెప్పుకోవటం అల్లాహ్ దృష్టిలో ఎంతో అయిష్టకరమయిన విషయం. 4. అల్లాహ్ మాత్రం తన మార్గంలో సీసంపోసి నిర్మించబడిన గోడవలే కలసికట్టుగా – బారులు తీరి – పోరాడే వారిని ఇష్టపడతాడు.

5. మూసా తన జాతి వారినుద్దేశించి ఈ విధంగా చెప్పినప్పటి విషయం (చిరస్మరణీయం) : 'నా జాతి జనులారా! నేను మీ వద్దకు అల్లాహ్ తరఫు నుండి పంపబడిన ప్రవక్తనన్న విషయం తెలిసివుండి కూడా మీరు నన్నెందుకిలా వేధిస్తున్నారు?' కాని వారు వంకర తిరిగి (మరలి) పోవటం వల్ల అల్లాహ్ కూడా వారి హృదయాలను వంకరగానే ఉంచేశాడు. అవిధేయ జనులకు అల్లాహ్ మార్గదర్శకత్వం వహించడు.

6. మర్యమ్ కుమారుడగు ఈసా చెప్పిన విషయం (కూడా జ్ఞాపకం చేసుకోండి) : 'ఓ ఇస్రాయీల్ సంతతి వారలారా! నిశ్చయంగా నేను అల్లాహ్ తరఫున మీ వద్దకు పంపబడిన ప్రవక్తను. నాకు పూర్వం ఉన్న తౌరాతును

సత్యమని ధ్రువపరచేవాడను. నా తరువాత రాబోయే ప్రవక్తను గురించి శుభవార్త ఇచ్చేవాడను. అతని పేరు అహ్మద్ అయి ఉంటుంది.' మరి ఆ ప్రవక్త వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలను తీసుకుని వచ్చినపుడు, 'ఇది పచ్చి మంత్రజాలమే' అని వారన్నారు. 7. తనకు ఇస్లాం వైపు పిలుపు అందుతున్నప్పటికీ అల్లాహ్‌కు అబద్ధాలను ఆపాదించేవానికంటే పెద్ద దుర్మార్గుడు ఎవడుంటాడు? అల్లాహ్ దుర్మార్గ జనులకు మార్గదర్శనం చేయడు. 8. వారు అల్లాహ్ జ్యోతిని తమ నోటితో ఊది ఆర్పివేయాలనుకుంటున్నారు. వాస్తవానికి అల్లాహ్ తన జ్యోతిని పరిపూర్ణం చేసిగాని వదలడు – సత్య తిరస్కారులకు అది ఎంతగా సహించరానిదయినాసరే! 9. ఆయనే తన ప్రవక్తను మార్గదర్శకత్వంతో, సత్యధర్మంతో సహా పంపాడు – దానిని ఇతర మతధర్మాలన్నింటిపై ఆధిక్యం వహించేలా చేయటానికి! బహుదైవారాధకులు దీనిని జీర్ణించుకోలేకపోయినాసరే!

10. ఓ విశ్వాసులారా! మిమ్మల్ని బాధాకరమయిన యాతన నుండి కాపాడే వ్యాపారమేదో నేను మీకు తెలుపనా? 11. మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను విశ్వసించండి. అల్లాహ్ మార్గంలో మీ ధన ప్రాణాలొడ్డి పోరాడండి. మీరు గనక తెలుసుకుంటే ఇదే మీకు శ్రేయస్కరమైనది. 12. అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు. క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో మిమ్మల్ని ప్రవేశింపజేస్తాడు. శాశ్వతంగా ఉండే ఉద్యానవనాలలో బహుచక్కని నివాసాలను సమకూరుస్తాడు. ఇదే గొప్ప సాఫల్యం. 13. మీరు ఆకాంక్షించే మరో వస్తువు కూడా! అదే అల్లాహ్ సహాయం! శీఘ్ర విజయం! (ప్రవక్తా! దీని గురించి) విశ్వాసులకు శుభవార్త వినిపించు.

14. విశ్వసించిన ప్రజలారా! మీరు అల్లాహ్‌కు సహాయకులు అవండి. మర్యమ్ కుమారుడగు ఈసా తన సహచరులతో, 'దైవమార్గంలో నాకు సహాయపడేవారెవరు?' అని అడిగినపుడు, 'అల్లాహ్‌కు సహాయకులుగా మేమున్నాము' అని చెప్పినట్లుగా! అప్పుడు ఇస్రాయీల్ సంతతి వారిలో కొందరు విశ్వసించగా, మరికొందరు తిరస్కరించారు. అప్పుడు మేము విశ్వసించిన వారికి–వారి శత్రువులకు వ్యతిరేకంగా–తోడ్పడ్డాము. అందువల్ల వారే ఆధిక్యత వహించారు.

# 62. అల్ జుముఅహ్ (సమావేశదినం, శుక్రవారం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భూమ్యాకాశాలలో ఉన్నవన్నీ రాజాధిరాజు, పరిశుద్ధుడు, శక్తిమంతుడు, వివేకవంతుడు అయిన వాని పవిత్రతను శ్లాఘిస్తున్నాయి. 2. ఆయనే నిరక్షరాస్యులలో నుండి ఒక ప్రవక్తను – స్వయంగా వారిలో నుండే – ప్రభవింపజేశాడు. అతను వారికి ఆయన సూక్తులను (ఆయతులను) చదివి వినిపిస్తున్నాడు, వారిని పరిశుద్ధపరుస్తున్నాడు, వారికి గ్రంథాన్నీ, వివేకాన్ని బోధపరుస్తున్నాడు. అంతకు ముందైతే వారు స్పష్టమయిన అపమార్గానికి లోనై ఉండేవారు. 3. ఇంకా వారితో వచ్చి చేరని ఇతరులకు కూడా (మార్గబోధన చేయడానికి)! ఆయన మహాశక్తిశాలి, వివేచనాశీలి. 4. ఇది అల్లాహ్ అనుగ్రహం. దీనిని ఆయన తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. అల్లాహ్ మహదానుగ్రహం కలవాడు.

5. తౌరాతు గ్రంథ బాధ్యత మోపబడినప్పటికీ, తగురీతిలో ఆ బాధ్యతాభారాన్ని మోయని వారి ఉపమానం, పుస్తకాల బరువు మోసే గాడిద వంటిది. అల్లాహ్ వచనాలను అసత్యాలంటూ త్రోసిపుచ్చిన జనుల ఉపమానం కూడా ఎంత చెడ్డది!? దుర్మార్గులైన జనులకు అల్లాహ్ సన్మార్గం చూపడు. 6. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'ఓ యూదులారా! ఇతర జనులకన్నా మీరే దైవానికి ప్రీతిపాత్రులు అన్న ధీమా మీకుంటే మీరు చావును కోరుకోండి. మీరు సత్యసంధులే అయితే (ఈ సవాలును స్వీకరించండి).' 7. తమ చేతులు ముందుగానే చేసి పంపుకున్న ఘోరకృత్యాల కారణంగా వారెన్నటికీ చావును కోరుకోరు. దుర్వర్తనుల గురించి అల్లాహ్‌కు ఎరుకే. 8. వారికి చెప్పు : 'ఏ చావు నుండి మీరు పారిపోతున్నారో అది మిమ్మల్ని కబళించటం తథ్యం. తరువాత మీరు వ్యక్త – అవ్యక్త విషయాలు తెలిసినవాని వైపునకు తీసుకుపోబడతారు. అప్పుడు ఆయన మీరు చేసినదంతా మీకు ఎరుకపరుస్తాడు.

9. ఓ విశ్వాసులారా! శుక్రవారం నాటి నమాజ్ కొరకు పిలువబడి

నపుడు అల్లాహ్ స్మరణ వైపునకు త్వరపడండి. క్రయవిక్రయాలను విడిచిపెట్టండి. మీరు గనక తెలుసుకుంటే ఇదే మీ కొరకు మేలైనది. 10. మరి నమాజు చేయటం పూర్తయ్యాక భువిలో విస్తరిల్లండి. దైవానుగ్రహాన్ని అన్వేషించండి. అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తూ ఉండండి – తద్వారా మీరు సాఫల్యం పొందవచ్చు. 11. (వాళ్ళ పరిస్థితి ఎలా ఉందంటే) ఏదయినా వర్తకాన్ని, లేదా వినోద వస్తువును చూసినపుడు, వారు నిన్ను నిలబడి ఉన్న స్థితిలోనే వదలి వెళ్ళిపోతున్నారు. వారికి చెప్పు : 'అల్లాహ్ వద్ద ఏదైతే ఉందో, అది వినోదవస్తువు కన్నా, వర్తకం కన్నా మేలైనది. అల్లాహ్ శ్రేష్ఠమైన ఉపాధిప్రదాత.

## 63. అల్ మునాఫిఖూన్ (వంచనాశిల్ప నిష్ణాతులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ఓ ప్రవక్తా!) నయవంచకులు నీ దగ్గరకు వచ్చినపుడు, 'నిశ్చయంగా మీరు దైవ సందేశహరులేనని మేము సాక్ష్యమిస్తున్నామండీ' అనంటారు. నిజంగా నీవు ఆయన సందేశహరుడవే అన్న సంగతి అల్లాహ్‌కు తెలుసు. ఈ వంచకులు అబద్ధాగ్రేసరులని కూడా అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు. 2. వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకున్నారు. ఆపైన వారు దైవమార్గం నుండి (జనులను) ఆపుతున్నారు. ముమ్మాటికీ వారు చేసే పని చాలా చెడ్డది. 3. ఇలా ఎందుకంటే; తొలుత వారు విశ్వసించి, తరువాత తిరస్కరించారు. దరిమిలా వారి హృదయాలపై సీలు వేయబడింది. ఇక వారికి ఏమీ బోధపడదు.

4. చూడబోతే నీకు వారి శరీరాకృతులు అబ్బురపరుస్తాయి. వారు మాట్లాడసాగితే నీవు వారి మాటల్ని వింటూ ఉండిపోతావు. ఒకరకంగా వారు (గోడకు) ఆనించబడిన కొయ్యల మాదిరిగా ఉన్నారు. ఏ అరుపు వినవచ్చినా దానిని వారు తమపై విరుచుకుపడిన విపత్తుగానే భావిస్తూ ఉంటారు. ఇలాంటివారే అంతర్గత శత్రువులు. వారిపట్ల జాగ్రత్తగా ఉండు. అల్లాహ్ వారిని నాశనం చెయ్యి! వారెటు మళ్లించబడుతున్నారు? 5. 'రండి,

దైవప్రవక్త మీ మన్నింపు కొరకు ప్రార్థిస్తాడు' అని వారితో అన్నప్పుడు, వారు తమ తల తిప్పుకుంటారు. వారు గర్వాతిశయంతో తిరిగిపోవటం నీవు చూస్తావు. 6. (ప్రవక్తా!) నీవు వారి క్షమాపణ కొరకు ప్రార్థించినా, ప్రార్థించకపోయినా ఒక్కటే. అల్లాహ్ ఎట్టిపరిస్థితిలోనూ వారిని క్షమించడు. నిశ్చయంగా అల్లాహ్ అవిధేయ మూకకు మార్గదర్శకత్వం వహించడు.

7. 'దైవప్రవక్త వద్ద ఉండే వారిపై మీరేమీ ఖర్చుచేయకండి. దాంతో వారంతట వారే చెల్లాచెదురైపోతారు' అని చెప్పేది కూడా వారే. భూమ్యాకాశాలలో ఉన్న నిధులన్నీ అల్లాహ్‌కు చెందినవే. కాని వంచనా శిల్ప నిష్ణాతులు ఈ విషయాన్ని అర్థం చేసుకోవటం లేదు. 8. 'మనం మదీనాకు చేరుకోగానే గౌరవనీయుడు అక్కణ్ణుంచి అధముణ్ణి వెళ్లగొడతాడు' అని కూడా ఈ నయవంచకులు అంటున్నారు. వాస్తవానికి గౌరవం అనేది అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు, విశ్వాసులకు చెందుతుంది. కాని ఈ కపటాగ్రేసరులు తెలుసుకోవటం లేదు.

9. విశ్వాసులారా! మీ సిరిసంపదలు, మీ సంతానం మిమ్మల్ని అల్లాహ్ స్మరణ విషయంలో మరుపునకు లోనుచేయరాదు సుమా! ఎవరు అలా చేస్తారో వారే నష్టపోయిన వారవుతారు. 10. మీలో ఎవరికయినా మృత్యువు దాపురించి, 'నాకు మరికొంత గడువు ఎందుకు ఇవ్వలేదు? ఇస్తే, నేను దానధర్మాలు చేసి, సజ్జనులలో చేరేవాణ్ణి కదా!' అని చెప్పే స్థితి ఏర్పడక ముందే మేము మీకు ప్రసాదించిన జీవనోపాధిలో నుండి ఖర్చుచేయండి. 11. అల్లాహ్ ఏ ప్రాణికి కూడా దాని నిర్ధారిత సమయం (మృత్యువు) ఆసన్నమైనపుడు, దానికి ఎంతమాత్రం గడువు ఇవ్వడు. మీరు చేసేదంతా అల్లాహ్ జ్ఞానపరిధిలోనే ఉంది.

## 64. అత్ తగాబున్ (జయాపజయాలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఆకాశాలలో ఉన్న ప్రతిదీ, భూమిలో ఉన్న ప్రతిదీ అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంది. సార్వభౌమాధికారం ఆయనదే. ప్రశంస,

పొగడ్త ఆయనకే శోభాయమానం. ఆయన సర్వం చేయగల సమర్థుడు. 2. ఆయనే మిమ్మల్ని సృష్టించినవాడు. మరి మీలో కొందరు అవిశ్వాసులుగా ఉంటే, మరికొందరు విశ్వాసులుగా ఉన్నారు. మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తూనే ఉన్నాడు. 3. ఆయన భూమ్యాకాశాలను సత్యబద్ధంగా (సమతూకంతో) సృష్టించాడు. ఆయనే మీ రూపకల్పన చేశాడు. మీకు అత్యుత్తమమయిన రూపం ఇచ్చాడు. ఆఖరికి మరలి పోవలసినది ఆయన వైపునకే. 4. భూమ్యాకాశాలలో ఉన్న సమస్తమూ ఆయనకు తెలుసు. మీరు దాచేదీ, వ్యక్తపరచేదీ ఆయనకు తెలుసు. అల్లాహ్ గుండెల్లోని గుట్టును సయితం ఎరిగినవాడు.

5. ఏమిటి, లోగడ తిరస్కార వైఖరికి ఒడిగట్టి, తరువాత తమ స్వయంకృతాల దుష్పరిణామాన్ని చవిచూసిన వారి సమాచారం మీకు చేరలేదా? వారికి బాధాకరమయిన యాతన ఉంటుంది. 6. ఇలా ఎందుకంటే; వారి ప్రవక్తలు వారి వద్దకు స్పష్టమయిన నిదర్శనాలతో సహా వచ్చినపుడు, 'ఏమిటి, మనుషులు కూడా మాకు మార్గదర్శకత్వం వహించేవారై పోయారా!?' అంటూ వారు (అవహేళనగా) మాట్లాడారు. ఆ విధంగా వారు తిరస్కరించి, వెనుతిరిగిపోయారు. అల్లాహ్ కూడా వారిని పట్టించుకోవటం మానేశాడు. అల్లాహ్ అక్కరలేనివాడు, స్తవనీయుడు.

7. తాము (మరణానంతరం) తిరిగి లేపబడేది ఉండదని సత్య తిరస్కారులు కరాకండీగా చెప్పారు. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'ఎందుకు లేపబడరు? నా ప్రభువు తోడు! మీరు తప్పకుండా లేపబడతారు. ఆ తరువాత మీరు చేసుకున్నదంతా మీకు తెలియపరచబడుతుంది. ఇది అల్లాహ్‌కు చాలా సులభం.' 8. కనుక మీరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను, మేము అవతరింపజేసిన జ్యోతి (ఖుర్ఆన్)ని విశ్వసించండి. మీరు చేసేదంతా అల్లాహ్ కనిపెట్టుకునే ఉన్నాడు. 9. ఏ రోజున ఆయన మిమ్మల్నందరినీ సమావేశమయ్యే దినాన సమావేశపరుస్తాడో, అది జయాపజయాల దినమై ఉంటుంది. ఎవరయితే అల్లాహ్‌ను విశ్వసించి సదాచరణ చేసి ఉంటాడో, అల్లాహ్ అతని

పాపాలను అతని నుండి దూరం చేస్తాడు. అతనిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అందులో వారు కలకాలం ఉంటారు. ఇదే గొప్ప సాఫల్యం. 10. మరెవరయితే తిరస్కార వైఖరికి ఒడిగట్టి, మా సూచనలను అసత్యాలంటూ కొట్టివేశారో - ఇలాంటివారే నరకాగ్ని వాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. అది మహాచెడ్డ గమ్యస్థానం.

11. ఏ ఆపద వచ్చినా దైవాజ్ఞతోనే వస్తుంది. అల్లాహ్‌ను విశ్వసించిన వ్యక్తి హృదయానికి అల్లాహ్ మార్గదర్శనం చేస్తాడు. అల్లాహ్ ప్రతిదీ తెలిసినవాడు. 12. మీరు అల్లాహ్‌కు విధేయత చూపండి, ప్రవక్తకు విధేయత చూపండి. ఆ తరువాత మీరుగాని తిరిగిపోయారంటే, మా ప్రవక్తపై ఉన్న బాధ్యతల్లా సందేశాన్ని స్పష్టంగా చేరవేయటం వరకే (అని తెలుసుకోండి). 13. అల్లాహ్ - ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేదు. విశ్వసించిన వారు అల్లాహ్‌నే నమ్ముకోవాలి.

14. ఓ విశ్వాసులారా! మీ ఆలుబిడ్డలలో కొందరు మీ శత్రువులు. కాబట్టి వారిపట్ల అప్రమత్తంగా ఉండండి. ఒకవేళ మీరు వారిని మన్నిస్తే, ఉపేక్షిస్తే, క్షమించివేస్తే, నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడు, కృపాశీలుడు. 15. మీ సిరిసంపదలు, మీ సంతానం మీ పాలిట పరీక్షా వస్తువులు. అల్లాహ్ వద్ద గొప్ప ప్రతిఫలం ఉంది. 16. కాబట్టి మీరు సాధ్యమైనంతవరకు అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. వినండి. విధయులై ఉండండి. (దైవ మార్గంలో) ఖర్చుపెట్టండి. ఇదే మీ కొరకు మేలైనది. ఎవడయితే ఆత్మ లోభత్వం (పేరాశ) నుండి రక్షించబడ్డాడో - అలాంటివారే సాఫల్యాన్ని ఆస్వాదించేవారు. 17. మీరు గనక అల్లాహ్‌కు మంచి రుణం ఇస్తే, ఆయన దానిని మీ కొరకు ఎన్నో రెట్లు పెంచి ఇస్తాడు. మిమ్మల్ని క్షమిస్తాడు. అల్లాహ్ (తన దాసుల కృషిని) గుర్తించి, విలువ ఇచ్చేవాడు, సహనశీలుడు. 18. అగోచర గోచర విషయాలను ఎరిగినవాడు, శక్తిమంతుడు, వివేక వంతుడు.

# 65. అత్ తలాఖ్ (విడాకులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ ప్రవక్తా! మీలో ఎవరయినాసరే తమ భార్యలకు విడాకు ఇస్తున్నప్పుడు, వారి గడువు (ఇద్దత్) ఆధారంగా విడాకు ఇవ్వండి. గడువు (రుతువు)ను లెక్కిస్తూ ఉండండి. మీ ప్రభువైన అల్లాహ్‌కు భయపడండి. వారిని (గడువు కాలంలో) వారి ఇండ్ల నుండి వెళ్ళగొట్టకండి. వారు కూడా (ఆ ఇద్దత్ కాలంలో) వెళ్ళిపోకూడదు – ఒకవేళ వారేదయినా సిగ్గుమాలిన పనికి బాహాటంగా పాల్పడితే తప్ప! ఇవి అల్లాహ్ విధించిన హద్దులు. ఎవరయితే అల్లాహ్ నిర్ధారించిన హద్దులను అతిక్రమిస్తాడో అతడు తన ఆత్మకే అన్యాయం చేసుకున్నవాడవుతాడు. నీకు తెలియదు – బహుశా ఈ విడాకు తరువాత దేవుడు ఏదన్నా కొత్త స్థితిని సృష్టిస్తాడేమో! 2. తరువాత వారు తమ గడువుకు చేరుకున్నప్పుడు వారిని ఉత్తమ రీతిలో మీ దాంపత్య బంధంలోనయినా ఉంచుకోండి లేదంటే ఉత్తమ రీతిలో వారిని విడిచిపెట్టడ మయినా చేయండి. (ఇందు నిమిత్తం) మీలోని ఇద్దరు న్యాయశీలురైన పురుషులను సాక్షులుగా పెట్టుకోండి. అల్లాహ్ కొరకు ఖచ్చితంగా సాక్ష్యం ఇవ్వండి. అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించే ప్రతి వ్యక్తికీ ఇందుమూల ముగా ఉపదేశించబడుతోంది. ఎవడు అల్లాహ్‌కు భయపడతాడో, అల్లాహ్ అతనికి (ఈ సమస్యను అధిగమించే) మార్గం తెరుస్తాడు. 3. అతను ఊహించనయినా లేని వైపు నుండి అతనికి జీవనోపాధిని ఇస్తాడు. అల్లాహ్‌పై భారం మోపినవానికి అల్లాహ్‌యే చాలు. నిశ్చయంగా అల్లాహ్ తన కార్యాన్ని నెరవేరుస్తాడు. అల్లాహ్ ప్రతి దానికి ఒక లెక్కను నిర్ధారించాడు.

4. మీ స్త్రీలలో ముట్టుపై ఆశ వదులుకున్న వారి గురించి మీకేదైనా అనుమానం ఉంటే, అలాంటివారి గడువు (ఇద్దత్) కాలం మూడు మాసాలు. రజస్వల కాని వారి గడువు కూడా అంతే. ఇక గర్భవతుల గడువు వారి ప్రసవం అయ్యేవరకూ ఉంటుంది. ఎవడు అల్లాహ్‌కు భయపడుతూ ఉంటాడో, అతనికి అల్లాహ్ అతని కార్యకలాపాలలో సౌలభ్యాన్ని కల్పిస్తూ ఉంటాడు.

5. ఇది అల్లాహ్ ఆజ్ఞ. దీనిని ఆయన మీ వైపునకు అవతరింపజేశాడు. ఎవడు దైవభీతి కలిగి ఉంటాడో, దేవుడు అతని పాపాలను అతని నుండి దూరం చేస్తాడు. అతనికి గొప్ప పుణ్యఫలాన్ని ప్రసాదిస్తాడు.

6. మీరు (విడాకు పొందిన) ఆ స్త్రీలకు మీ స్థోమతను బట్టి, మీరున్నచోటే వసతి సౌకర్యం కల్పించండి. వారిని ఇబ్బందుల పాల్జేసేందుకు వారిపై దాష్టీకానికి ఒడిగట్టకండి. ఒకవేళ వారు గర్భవతులై ఉంటే, వారికి ప్రసవం అయ్యేవరకూ వారి పోషణా ఖర్చులు ఇవ్వండి. ఒకవేళ వారు – మీ కోరికను మన్నించి – మీ బిడ్డలకు పాలు త్రాగిస్తున్నట్లయితే వారికి వారి వేతనం ఇవ్వండి. మీరు పరస్పరం మంచిని ప్రబోధించుకోనూవచ్చు. ఒకవేళ (శిశువుకు పాలు త్రాగించే విషయంలో) మీరు మొండిగా వ్యవహరిస్తే, అతని కోరికపై మరొకామె (బిడ్డకు) పాలు పడుతుంది. 7. స్థితిమంతుడు తన స్థోమతకు తగ్గట్టుగా ఖర్చుపెట్టాలి. తక్కువ ఆదాయం ఉన్న వ్యక్తి దేవుడు తనకు ఇచ్చిన దానినిబట్టి ఖర్చుచేయాలి. అల్లాహ్ ఏ వ్యక్తిపైన కూడా అతనికి ప్రసాదించిన దానికంటే ఎక్కువ భారం మోపడు. అల్లాహ్ లేమి తరువాత త్వరలోనే కలిమిని ప్రసాదించవచ్చు.

8. ఎన్నో బస్తీలవారు తమ ప్రభువు ఆదేశం పట్ల, ఆయన ప్రవక్తల పట్ల తిరుగుబాటు వైఖరిని అవలంబించారు. తత్కారణంగా మేము వారి నుండి కఠినంగా లెక్క తీసుకున్నాము. ప్రాణం తోడేసే విధంగా శిక్షించాము. 9. మొత్తానికి వారు తమ చేష్టల దుష్ఫలితాన్ని చవిచూశారు. చివరకు వారు ఘోరంగా నష్టపోయారు.

10. అల్లాహ్ వారి కోసం కఠిన శిక్షను సిద్ధంచేసి ఉంచాడు. కనుక విశ్వసించిన ఓ బుద్ధిమంతులారా! అల్లాహ్‌కు భయపడండి. అల్లాహ్ మీ వైపునకు ఒక హితోపదేశాన్ని అవతరింపజేశాడు. 11. ఒక ప్రవక్త మీకు దేవుని స్పష్టమయిన సూక్తులను చదివి వినిపిస్తున్నాడు – తద్వారా విశ్వసించి, సత్కార్యాలు చేసిన వారిని అంధకారం నుండి వెలికితీసి కాంతి వైపునకు తీసుకురావాలని! ఎవడు అల్లాహ్‌ను విశ్వసించి, సత్క్రియలాచరిస్తాడో, అతనిని

అల్లాహ్ క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. వారందులో శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ వారికి ఎంతోమంచి ఉపాధిని ప్రసాదించాడు.

12. అల్లాహ్‌యే సప్తాకాశాలను, వాటి మాదిరిగానే భూమిని కూడా సృష్టించాడు. వాటి మధ్య ఆయన ఆజ్ఞ అవతరిస్తూ ఉంటుంది – అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడనీ, అల్లాహ్ తన జ్ఞానంతో ప్రతి వస్తువునూ పరివేష్టించి ఉన్నాడని మీరు తెలుసుకోవాలని!

# 66. అత్ తహ్రీమ్ (నిషిద్ధం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఓ ప్రవక్తా! అల్లాహ్ నీ కొరకు ధర్మసమ్మతం (హలాల్) గావించిన వస్తువును నీవెందుకు నిషిద్ధం (హరామ్) చేసుకున్నావు. నీ సతీమణుల సంతోషం కోసమా? అల్లాహ్ క్షమించేవాడు, కనికరించేవాడు. 2. (అనాలోచితమైన) మీ ప్రమాణాలను మీరు వెనక్కి తీసుకోవటాన్ని అల్లాహ్ విధిగా ఖరారు చేశాడు. అల్లాహ్‌యే మీ సంరక్షకుడు, ఆయన మహాజ్ఞాని, మహా వివేకి.

3. ప్రవక్త తన భార్యలలో ఒకామెకు ఒక విషయం రహస్యంగా చెప్పినప్పుడు, ఆమె ఆ విషయాన్ని మరొకామెకు చెప్పింది. అల్లాహ్ ఆ విషయాన్ని తన ప్రవక్తకు తెలియపరచగా, ప్రవక్త ఆ విషయాన్ని (మొదటి) ఆమెకు కొంత చెప్పి, మరి కొంత దాటవేశాడు. ప్రవక్త ఈ విషయాన్ని ఆమెతో చెప్పినపుడు, 'ఇంతకీ ఈ సమాచారాన్ని తమరికి ఎవరు చేరవేశారు?' అని ఆమె అడిగింది. 'అన్నీ తెలిసినవాడు, సమస్తాన్నీ కనిపెట్టుకుని ఉన్నవాడు నాకీ సంగతి తెలియపరిచాడు' అని ప్రవక్త అన్నాడు. 4. (ప్రవక్త ప్రాణసఖులారా!) మీరిరువురూ పశ్చాత్తాపభావంతో అల్లాహ్ వైపునకు మరలితే (అది మీకే మేలు. ఎందుకంటే) మీ హృదయాలు ప్రక్కకు వంగిపోయాయి. ఒకవేళ మీరిద్దరూ ప్రవక్తకు వ్యతిరేకంగా కార్యకలాపాలు కొనసాగిస్తే అల్లాహ్ తన ప్రవక్తకు అండగా ఉన్నాడు. జిబ్రీల్‌తో పాటు సద్వర్తనులైన విశ్వాసులు

అతనికి ఆదరువుగా ఉంటారు. దైవదూతలు కూడా అతని పక్షాన నిలుస్తారు సుమా! 5. ఒకవేళ ప్రవక్త మీ అందరికీ విడాకులిస్తే, అతని ప్రభువు అతనికి – మీకు బదులుగా – మీకన్నా మంచి భార్యలను ప్రసాదిస్తాడు. వారంతా ముస్లింలు, విశ్వసించినవారు, వినయశీలురు, పశ్చాత్తాపపడేవారు, దైవారాధన చేసేవారు, ఉపవాసాలు పాటించేవారు అయి ఉంటారు. వారు వితంతువులు, కన్యలూ అయి ఉంటారు.

6. ఓ విశ్వాసులారా! మిమ్మల్నీ, మీ కుటుంబ సభ్యులను – మనుషులు, రాళ్ళు ఇంధనంగా మారే నరకాగ్ని నుండి కాపాడుకోండి. దానిపై బలిష్ఠులు, కర్కశులు అయిన దైవదూతలు నియమితులై ఉన్నారు. అల్లాహ్ వారికి దేని గురించి ఆజ్ఞాపించినా దానిని జవదాటరు. పైగా వారు తమకు లభించిన ఆజ్ఞలను యథాతథంగా అమలుపరుస్తారు. 7. తిరస్కార వైఖరికి ఒడిగట్టిన వారలారా! ఈ రోజు మీరు సాకులు చెప్పకండి. చేసుకున్న కర్మల ఫలాన్నే మీరు పొందుతున్నారు.

8. ఓ విశ్వాసులారా! దైవసమక్షంలో సిసలయిన పశ్చాత్తాపం చెందండి. మీ ప్రభువు మీ పాపాలను క్షమించవచ్చు. క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో మీకు ప్రవేశం కల్పించవచ్చు. ఆనాడు అల్లాహ్ ప్రవక్తనూ, అతని వెంట ఉన్న విశ్వాసులను పరాభవానికి లోను చేయడు. వారి వెలుగు వారి ముందు, వారి కుడి వైపున విరజిమ్ముతూ ఉంటుంది. వారిలా అంటూ ఉంటారు : 'మా ప్రభూ! మా వెలుగును మా కొరకు పరిపూర్ణం గావించు. మమ్మల్ని క్షమించు. నిశ్చయంగా నీకు ప్రతిదానిపై అధికారం ఉంది.'

9. ఓ ప్రవక్తా! సత్య తిరస్కారులతో, కపటులతో పోరాటం సాగించు. వారిపట్ల కఠినంగా వ్యవహరించు. వారి నివాసం నరకమే. అది చాలా చెడ్డ స్థలం. 10. అల్లాహ్ సత్యతిరస్కారుల కొరకు నూహ్, లూత్ భార్యల ఉపమానం ఇస్తున్నాడు. వారిద్దరూ మా దాసులలోని ఇద్దరు సత్పురుషుల వివాహబంధంలో ఉండేవారు. తరువాత వారిద్దరూ తమ భర్తల యెడల నమ్మకద్రోహానికి పాల్పడ్డారు. అందువల్ల వారిద్దరూ అల్లాహ్‌కు వ్యతిరేకంగా

వారికి (తమ భార్యలకు) ఏ విధంగానూ ఉపయోగపడలేకపోయారు. 'నరకాగ్నికి ఆహుతి అయ్యేవారితో పాటే మీరు కూడా ఆహుతి అవ్వండి' అని వారితో అనబడింది.

11. ఇంకా – అల్లాహ్ విశ్వాసులకు ఫిరౌన్ భార్య ఉదాహరణ ఇస్తున్నాడు. అప్పుడామె ఇలా ప్రార్థించింది : 'నా ప్రభూ! నా కోసం నీ వద్ద – స్వర్గంలో – ఒక ఇల్లు నిర్మించు. నన్ను ఫిరౌన్ బారి నుండి, అతని చేష్టల నుండి కాపాడు. ఈ దుర్మార్గ జనుల నుండి నాకు విముక్తిని ప్రసాదించు.' 12. ఇమ్రాన్ పుత్రిక యగు మర్యమ్ (ఉదాహరణ కూడా). ఆమె తన శీల కుసుమాన్ని కాపాడుకుంది. మరి మేము ఆమెలో మా తరఫు నుండి ఒక ఆత్మను ఊదాము. ఆమె తన ప్రభువు వాక్కులను, ఆయన గ్రంథాలను సత్యమని ధ్రువపరచింది. ఆమె దైవ విధేయతా భావం గల మహిళామణి.

# 67. అల్ ముల్క్ (సార్వభౌమాధికారం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (29) 1. విశ్వ సార్వభౌమత్వం హస్తగతమై ఉన్న ఆయన ఎంతో శుభకరుడు. ఆయన ప్రతిదానిపై సంపూర్ణాధికారం కలవాడు. 2. మీలో సదాచరణ చేసేవారెవరో పరీక్షించటానికి ఆయన జీవన్మరణాలను సృష్టించాడు. ఆయన మహాశక్తిశాలి, క్షమాశీలి. 3. ఆయన ఒకదానిపై ఒకటిగా సప్తాకాశాలను సృష్టించాడు. నీవు కరుణామయుని సృష్టిప్రక్రియలో ఎలాంటి అవరోధాన్ని కానలేవు. మరోసారి నీ దృష్టిని సారించు. నీకేదయినా అంతరాయం (అడ్డంకి) కానవస్తోందా? 4. మళ్లీ మళ్లీ నీ దృష్టిని సారించు. నీ దృష్టి అలసిసొలసి విఫలమై నీ వైపునకే తిరిగివస్తుంది.

5. మేము క్రింది ఆకాశాన్ని దీపాలతో అలంకరించాము. ఇంకా మేము వాటిని భూత పిశాచాలను తరిమికొట్టేవిగా చేశాము. వాటి కొరకు మండే నరకాగ్ని శిక్షను సిద్ధంచేసి ఉంచాము. 6. తమ ప్రభువు యెడల తిరస్కార వైఖరిని అవలంబించిన వారి కొరకు నరకయాతన ఉంది. అది చాలా చెడ్డ గమ్యస్థానం. 7. వారు అందులో పడవేయబడినపుడు, భయంకర

మయిన దాని గర్జనను వింటారు. అది ఆవేశంతో ఉప్పొంగిపోతున్నట్లు ఉంటుంది. 8. ఆగ్రహంతో బద్దలైపోతుందేమో! అనిపిస్తుంది. అందులోనికి ఏ సమూహాన్నయినా పడవేసినప్పుడల్లా, నరక పాలకులు వారిని ఉద్దేశించి, 'మీ వద్దకు భయబోధ చేసేవాడు రాలేదా?' అని అడుగుతారు. 9. దానికి వారిలా అంటారు : 'అవును. భయబోధ చేసేవాడు వచ్చాడు. కాని మేమే అతనిని అసత్యవాదిగా చిత్రీకరించాము. అల్లాహ్ దేనినీ అవతరింప జేయలేదని, మీరే పెద్ద అపమార్గానికి లోనై ఉన్నారని చెప్పేశాము.' 10. ఇంకా ఇలా చెబుతారు : 'మేము వినేవారమో లేదా అర్థం చేసుకునేవారమో అయివుంటే నరకవాసుల్లో చేరాల్సిన ఖర్మపట్టేది కాదు.' 11. మొత్తానికి వారు తమ పాపాన్ని అంగీకరిస్తారు. కనుక నరకవాసులు (దైవకారుణ్యానికి) దూరమవుగాక!

12. ఎవరయితే తమ ప్రభువును చూడకపోయినప్పటికీ, ఆయనకు భయపడతారో వారి కొరకు క్షమాపణతో పాటు, గొప్ప ప్రతిఫలం ఉంది. 13. మీరు మీ మాటను చాలా మెల్లగా చెప్పినా, లేదా బిగ్గరగా చెప్పినా, నిశ్చయంగా ఆయన ఆంతర్యాలలోని విషయాన్ని సయితం ఎరిగినవాడు. 14. ఏమిటి, సృష్టించిన వానికే తెలియకుండా ఉంటుందా? ఆయన సూక్ష్మద్రష్ట. ప్రతిదానినీ పసిగట్టగలవాడు.

15. భూమిని మీ కొరకు లోబడి ఉండేలా చేసినవాడు ఆయనే. కనుక మీరు దాని మార్గాలపై నడవండి. ఆయన ప్రసాదించిన ఉపాధిని తినండి. (మీరంతా) ఆయన వద్దకే లేచి వెళ్ళవలసి ఉన్నది. 16. ఏమిటి, నింగినున్నవాడు మిమ్మల్ని నేలలో అణగద్రొక్కటం గురించి, అది అకస్మాత్తుగా ప్రకంపించటం గురించి మీరు నిర్భయంగా ఉన్నారా? 17. లేక నింగినున్న వాడు మీపై రాళ్లవాన కురిపించే గాలిని పంపటం పట్ల మీరు నిర్భయంగా ఉన్నారా? అలాగైతే నా హెచ్చరిక ఎటువంటిదో మీకు త్వరలోనే తెలిసి వస్తుంది. 18. నిజానికి వీరి పూర్వీకులు కూడా సత్యాన్ని త్రోసిపుచ్చారు. మరి ఎలా పడింది నా దెబ్బ?

19. ఏమిటి, తమపైన ఎగిరే పక్షులు ఏవిధంగా రెక్కల్ని చాపుతాయో, మరేవిధంగా ముడుచుకుంటాయో వారు చూడటం లేదా? కరుణామయుడు (అయిన అల్లాహ్) తప్ప వాటిని ఆ స్థితిలో ఎవరూ నిలిపి ఉంచలేదు. నిశ్చయంగా ఆయన ప్రతి దానినీ గమనిస్తూనే ఉన్నాడు. 20. చెప్పండి! కరుణామయునికి ప్రతిగా మీకు సహాయపడగల సేనావాహిని ఏది? సత్య తిరస్కారులు మాత్రం మోసంలో పడి ఉన్నారు. 21. ఒకవేళ అల్లాహ్ తన ఉపాధిని నిలిపివేస్తే, మీకు జీవనోపాధిని ఇచ్చేవాడెవడు? అయినాసరే వీరు తలబిరుసుతనంపై, దాటవేత వైఖరిపై మొండికేశారు.

22. 'చెప్పండి! తన ముఖం మీద (పడుతూ లేస్తూ) నడిచేవాడు ఎక్కువగా సన్మార్గం పొందుతాడా? లేక తిన్నగా రుజుమార్గంపై నడిచేవాడా?' 23. వారికి చెప్పు : 'మిమ్మల్ని సృష్టించినవాడు ఆయనే. మీకోసం చెవులు, కళ్లు, హృదయాలు చేసినవాడు ఆయనే. కాని మీరు కృతజ్ఞతలు తెలుపుకునేది చాలా తక్కువ.' 24. ఇలా చెప్పు : 'ఆయనే మిమ్మల్ని భూమిలో విస్తరింపజేశాడు. మీరంతా ఆయన వైపునకే సమీకరించబడతారు.'

25. 'మీరు చెప్పేదే నిజమయితే ఆ వాగ్దానం ఎప్పుడు నెరవేరు తుంది?' అని వారు అడుగుతున్నారు. 26. వారికి చెప్పు : 'ఈ జ్ఞానం అల్లాహ్ వద్దనే ఉంది. సావధానపరచటం వరకే నా బాధ్యత.' 27. అది సమీపంలో ఉండగా వారు దానిని చూసినపుడు, తిరస్కారుల ముఖాలు వికృతంగా మారిపోతాయి. అప్పుడు వారితో, 'మీరు (మాటిమాటికీ) అడుగుతూ ఉండేది ఇదే' అని అనబడుతుంది. 28. ఇలా అడుగు : 'చూడండి! ఒకవేళ అల్లాహ్ నన్నూ, నా వెంట ఉన్న వారిని అంతమొందించినా లేక మాపై దయదలచినా సత్య తిరస్కారులను వ్యథాభరితమైన శిక్ష నుండి ఎవడు రక్షిస్తాడు?' 29. ఇలా అను : 'ఆయన అపార కరుణామయుడు. మేము ఆయన్నే విశ్వసించాము. ఆయనపైనే భారం మోపాము. స్పష్టమయిన అపమార్గానికి లోనై ఉన్నవారెవరో మీకు శీఘ్రంగానే తెలుస్తుంది.' 30. ఈ విధంగా అడుగు : 'చూడండి! మీరు త్రాగే ఈ నీరు భూమిలో దిగిపోతే, మీ కోసం స్వచ్ఛమయిన నీటిని తెచ్చేదెవరు?'

# 68. అల్ ఖలమ్ (కలము)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. నూన్ – కలము సాక్షిగా! వారందరూ వ్రాసేది సాక్షిగా!
2. (ప్రవక్తా!) నీ ప్రభువు అనుగ్రహం వల్ల నీవు పిచ్చివాడవు కావు.
3. నిశ్చయంగా నీకొరకు అనంతమయిన ప్రతిఫలం ఉంది. 4. నిశ్చయంగా
నీవు గుణగణాల దృష్ట్యా అత్యున్నత స్థానంలో ఉన్నావు. 5. త్వరలోనే నీవు
చూస్తావు. వారూ చూసుకుంటారు – 6 – మతి చలించింది ఎవరికో!?
7. తన మార్గం నుండి తప్పిపోయిన వారెవరో నీ ప్రభువుకు బాగా తెలుసు.
సన్మార్గాన ఉన్నదెవరో కూడా ఆయనకు తెలుసు.

8. కనుక నీవు సత్యాన్ని కాదన్న వారి మాట వినకు. 9. నీవు
మెతక వైఖరిని అవలంబిస్తే వారు కూడా మెతకవైఖరిని అవలంబించాలని
కోరుకుంటున్నారు. 10. నీవు చీటికి మాటికి ఒట్టేసుకునే తుచ్ఛుని మాట
వినకు. 11. ఎత్తిపొడుస్తూ మాట్లాడటం, చాడీలు చెబుతూ తిరగటం వాడికి
అలవాటు. 12. వాడు మంచి పనులను అడ్డుకుంటూ ఉంటాడు. బరితెగించే
పాపాత్ముడు వాడు. 13. అసలే కఠినాత్ముడు, దానికి తోడు హీన వంశస్థుడు.
14. ఇంతకీ వాడి ఈ దుర్వర్తనకు కారణం వాడికి సిరిసంపదలు, పుత్ర
సంతానం ఎక్కువగా ఉండటమే. 15. వాడి ముందు మా వాక్యాలను చదివి
వినిపించినపుడు, 'ఇవి పూర్వీకుల నిరాధారమైన కథలు' అని కొట్టివేస్తాడు.
16. త్వరలోనే మేము వాడి ముక్కుపై వాతవేస్తాము.

17. మేము తోటవారిని పరీక్షించినట్లే వీళ్లను (మక్కా వారిని) కూడా
పరీక్షించాము. అప్పుడు వారు, తెల్లవారేసరికి తోట పండ్లు కోసేసుకుంటామని
ఒట్టేసుకున్నారు. 18. ఏమీ మిగిల్చి ఉంచము (అని ధీమాతో) అన్నారు.
19. అందువల్ల వారు నిద్రిస్తుండగానే నీ ప్రభువు తరఫున ఆ తోటపై
తిరిగిపోయేది (తెగులు) ఏదో తిరిగిపోయింది. 20. తెల్లవారే సరికి ఆ
తోట కోతకోసినదిగా అయిపోయింది. 21. తెలతెల వారుతుండగా వారు
ఒండొకరిని కేకవేసి పిలువసాగారు ... 22. 'పండ్లు కోయాలనుకుంటే

పెందలాడే పొలానికి చేరుకోండి' అని. 23. వారు బయల్దేరారు ... పరస్పరం మెల్లగా చెప్పుకుంటున్నారు ... 24. 'ఈ రోజు ఏ బీదాబిక్కీ మీ తోటలో జొరబడకుండా జాగ్రత్తపడండి.' 25. ఆ విధంగా వారు 'ఎట్టి పరిస్థితిలోనూ ఇవ్వబోము' అనే ధీమాతో వెళ్ళారు. 26. కాని ఆ తోటను చూడగానే, 'ఖచ్చితంగా మనం దారి తప్పాం' అన్నారు. 27. (కాస్త తేరుకున్న మీదట) 'లేదు, మన అదృష్టమే మనల్ని వంచించింది' అని చెప్పుకున్నారు. 28. వారందరిలోకి ఉత్తముడయిన వాడు ఇలా అన్నాడు : 'మీరు దేవుని పవిత్రతను కొనియాడరెందుకు అని నేను మీతో అన్నానా? లేదా?' 29. అప్పుడు వారంతా, 'మన ప్రభువు పరమ పవిత్రుడు. వాస్తవానికి మనమే దుర్మార్గులం' అని ఒప్పుకున్నారు. 30. తరువాత వారు పరస్పరం నిందించుకోసాగారు. 31. 'అయ్యో మా పాడుగాను! నిజంగా మనం బరితెగించిపోయాం. 32. బహుశా మన ప్రభువు మనకు దీనికి బదులుగా దీనికన్నా మంచి తోటను ప్రసాదించవచ్చు. కాబట్టి మనం ఆయన వైపునకే పశ్చాత్తాపభావంతో మరలుదాం' అని చెప్పుకున్నారు. 33. (చూశారా!) ఇలా వచ్చిపడుతుంది విపత్తు! పరలోక శిక్ష ఇంతకన్నా పెద్దది. వీరు ఈ విషయాన్ని తెలుసుకుంటే ఎంత బాగుండేది!

34. నిశ్చయంగా భయభక్తులు కలవారికి వారి ప్రభువు వద్ద సుఖసౌఖ్యాలతో కూడిన స్వర్గవనాలున్నాయి. 35. ఏమిటి, మేము విధేయతా భావం గలవారిని అపరాధుల సరసన నిలబెడతామా? 36. ఏమయింది మీకు? ఎలాంటి నిర్ణయాలు గైకొంటున్నారు మీరు? 37. మీ దగ్గర ఏదయినా గ్రంథం ఉందా? అందులో మీరు (ఇలాంటి విషయాలు) చదువుతున్నారా? 38. అందులో మీ కోసం మీరు కోరుకున్నదే లభిస్తుందని ఉందా? 39. పోనీ, మీరు నిశ్చయించుకున్నదల్లా మీకు లభించే విధంగా ప్రళయదినం వరకూ ఉండే ప్రమాణాలను మా నుండి తీసుకున్నారా? 40. వారిలో ఎవరు దీనికి బాధ్యులుగా ఉంటారో వారిని అడుగు. 41. పోనీ, వారి భాగస్వాములు ఎవరయినా ఉన్నారా? ఒకవేళ ఉన్నట్లయితే ఆ భాగస్వాములను వారు తీసుకురావాలి. వారు చెప్పేదే నిజమయితే ఈ పని చేసి చూపాలి.

42. ఏ రోజున యదార్థంపై నుండి ముసుగు తొలగించబడుతుందో, అప్పుడు జనులు సాష్టాంగప్రణామం (సజ్దా) కొరకు పిలువబడతారు. కాని వారు సజ్దా చేయలేకపోతారు. 43. వారి చూపులు క్రిందికి వంగి ఉంటాయి. అవమానం వారిని ఆవరించి ఉంటుంది. వాస్తవానికి వారు ఒకప్పుడు సురక్షితంగా, క్షేమంగా ఉన్నప్పుడు సజ్దా కొరకు పిలువబడేవారు (కాని వారు ఆ పిలుపును లక్ష్యపెట్టలేదు). 44. కనుక నన్నూ - ఈ వాక్కును అసత్యంగా చిత్రీకరించే వారిని వదలిపెట్టండి. మేము వారిని క్రమక్రమంగా - వారికి తెలియని వైపు నుండి - రప్పిస్తున్నాము. 45. నేను వారికి కొంత వ్యవధి ఇస్తున్నాను. నిశ్చయంగా నా వ్యూహం చాలా పకడ్బందీగా ఉంటుంది.

46. (ప్రవక్తా!) నీవుగాని వారి నుండి ఏదన్నా ప్రతిఫలం అడుగుతున్నావా? ఆ రుణభారం క్రింద వారు నలిగిపోతున్నారా? 47. పోనీ, వారి దగ్గర రహస్య విషయం ఉందా? దానిని వారు లిఖిస్తున్నారా? 48. కనుక నీ ప్రభువు తీర్పు వచ్చేవరకూ ఓర్పు వహించు. చేపవాని మాదిరిగా అవకు. అతను (తన ప్రభువును) మొరపెట్టుకున్నప్పుడు, దుఃఖంలో మునిగి ఉన్నాడు. 49. అతని ప్రభువు కనికరమే గనక అతనికి తోడై ఉండకపోతే, అతడు నిందితుడై ఉన్న స్థితిలో కటిక మైదానంలో విసరివేయబడేవాడు. 50. మరయితే అతని ప్రభువు అతన్ని కటాక్షించాడు. అతనిని సత్పురుషులలో చేర్చుకున్నాడు. 51. ఈ సత్యతిరస్కారులు హితోపదేశాన్ని విన్నప్పుడు, తమ తీక్షణ వీక్షణాలతో నిన్ను జారించి పడవేసినట్లే నిన్ను (ఎగాదిగా) చూస్తారు. 'ఇతను ఖచ్చితంగా పిచ్చివాడే' అనంటారు. 52. అయితే వాస్తవానికి అది (ఖుర్ఆన్) లోకవాసుల పాలిట ఒక ఉపదేశంగా ఉన్నది.

## 69. అల్ హాఖ్ఖహ్ (అనివార్యమయినది)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అనివార్యమైనది. 2. ఏమిటా అనివార్యమైనది? 3. ఆ అనివార్య మైన దాని గురించి నువ్వేమనుకున్నావు? 4. సమూద్, ఆద్ జాతుల వారు దడ పుట్టించే ఆ విపత్తును అసత్యమంటూ త్రోసిపుచ్చారు. 5. సమూదు

వారు ఒక భయంకరమయిన అరుపు ద్వారా అంతమొందించబడ్డారు. 6. ఇక ఆద్ వారు ఒక ప్రచండమైన పెనుగాలి ద్వారా తుదముట్టించబడ్డారు. 7. దానిని అల్లాహ్ వారిపై నిరంతరం ఏడు రాత్రులు, ఎనిమిది పగళ్ళ వరకూ విధించాడు. వారక్కడ నేలకొరిగిన ఖర్జూర బోదెల వలే పడి ఉండటం నీవు చూస్తావు. 8. మరైతే వారిలో ఎవడయినా మిగిలి ఉన్నట్లు నీకు కనిపిస్తున్నాడా? 9. ఫిర్ఔన్ అయినా, అతని పూర్వీకులయినా, తలక్రిందులుగా చేయబడిన జనావాసాలయినా – వారంతా పాపాలకు పాల్పడినవారే. 10. వారు తమ ప్రభువు యొక్క ప్రవక్తలను ఎదిరించారు. అందువల్ల అల్లాహ్ వారిని కఠినంగా పట్టుకున్నాడు. 11. జలప్రవాహం ఉధృతమైనపుడు మేము మిమ్మల్ని ఓడలో ఎక్కించాము – 12 – దానిని మీకు ఒక జ్ఞాపికగా చేయాలని! జ్ఞాపకముంచుకునే చెవులు జ్ఞాపకం ఉంచుకోవాలనీని!!

13. మరెప్పుడయితే ఒకేసారి శంఖం పూరించబడుతుందో 14. మరెప్పుడయితే భూమి, పర్వతాలు లేపి ఒకే దెబ్బకు తుత్తునియలుగా చేసివేయబడతాయో, 15. ఆ రోజు నిజంగా జరగవలసినది జరిగిపోతుంది. 16. అప్పుడు ఆకాశం బద్దలై పోతుంది. ఆ రోజు అది పూర్తిగా పట్టు సడలిపోతుంది. 17. దైవదూతలు దాని అంచులపై ఉంటారు. నీ ప్రభువు అర్ష్‌ను (పాలనాపీఠాన్ని) ఆ రోజు ఎనమండుగురు దైవదూతలు తమపై ఎత్తుకుని ఉంటారు. 18. ఆ రోజు మీరు హాజరుపరచబడతారు. మీ విషయమేదీ గోప్యంగా ఉండదు.

19. ఏ వ్యక్తి కర్మల పత్రం అతని కుడిచేతికి ఇవ్వబడుతుందో, అతనిలా అంటాడు : 'ఇదిగో, నా కర్మల పత్రాన్ని చదవండి. 20. నా లెక్క నాకు లభిస్తుందని నేననుకునేవాణ్ణి.' 21. మరి అతను తన మనసు మెచ్చిన భోగభాగ్యాలలో ఉంటాడు. 22. ఎత్తయిన స్వర్గవనంలో! 23. దాని పండ్లు క్రిందికి వంగి – అందుబాటులో – ఉంటాయి. 24. 'గడచిన రోజులలో మీరు చేసుకున్న కర్మలకు బదులుగా హాయిగా తినండి, త్రాగండి' (అని వారితో అనబడుతుంది). 25. ఏ వ్యక్తి కర్మల పత్రం అతని ఎడమ చేతికి

ఇవ్వబడుతుందో అతనంటాడు : “అయ్యో! నా కర్మల పత్రం నాకు ఇవ్వబడకుండా ఉంటే ఎంత బాగుండేది! 26. నా లెక్క ఏమిటో నాకు తెలియకుండా ఉంటే ఎంత బాగుండేది! 27. ఆ మరణమే ఏదో ఒకటి తేల్చివేసి ఉంటే బాగుండేదే! 28. నా సంపద నాకు పనికి రాకుండా పోయింది. 29. నా అధికారం అంతమైపోయింది.’ 30. ‘వాణ్ణి పట్టుకోండి. వాడికి కంఠపాశం వెయ్యండి. 31. తరువాత వాణ్ణి నరకానికి ఆహుతి చేయండి. 32. దరిమిలా వాణ్ణి డెబ్బయి చేతుల పొడవైన సంకెళ్ళతో బిగించి కట్టండి. 33. ఈ వ్యక్తి మహోన్నతుడైన అల్లాహ్‌ను విశ్వసించేవాడూ కాదు. 34. నిరుపేదలకు అన్నం పెట్టమని (కనీసం) ప్రోత్సహించేవాడు కూడా కాదు. 35. కనుక ఈ రోజు అతనిని ఓదార్చే ఆత్మీయుడు ఎవడూ లేడు. 36. గాయాల కడుగు తప్ప అతనికి వేరొక ఆహారం లేదు. 37. దానిని పాపాత్ములు తప్ప ఎవరూ తినరు.’

38. కనుక నేను మీరు చూడగలిగే వాటిపై ప్రమాణం చేస్తున్నాను. 39. మీరు చూడలేని వాటిపై కూడా. 40. నిశ్చయంగా ఇది గౌరవనీయుడయిన సందేశవాహకుడు తెచ్చిన వాక్కు. 41. అది ఏ కవిపుంగవుడో పలికిన పలుకు కాదు. కాని మీరు విశ్వసించేది బహు తక్కువ. 42. ఇది ఏ జ్యోతిష్కుని పలుకు కూడా కాదు. అయితే మీరు చింతన చేసేది బహు స్వల్పం. 43. ఇది లోకేశ్వరుని తరఫున అవతరింపజేయబడినది. 44. ఒకవేళ అతను (ప్రవక్త) తన తరఫున ఏమన్నా కల్పించుకుని మాకు ఆపాదించి ఉంటే, 45. మేమతని కుడిచేతిని పట్టుకుని ఉండేవారం. 46. తరువాత మేమతని ప్రాణ నాళాన్ని కోసివేసేవాళ్ళం. 47. అప్పుడు మీలో ఎవరూ మమ్మల్ని ఈ చర్య నుండి ఆపగలిగేవాడు కాదు. 48. నిశ్చయంగా ఇది భయభక్తులు కలవారికి హితోపదేశం. 49. మీలో కొందరు దీనిని (ఖుర్‌ఆన్‌ను) అసత్యమంటూ త్రోసిపుచ్చేవారున్నారన్న సంగతి మాకు తెలుసు. 50. అది సత్యతిరస్కారులకు బాధాకరం అవుతుంది. 51. ఇది తిరుగులేని సత్యం. 52. కనుక నీవు మహోన్నతుడగు నీ ప్రభువు నామ పవిత్రతను కొనియాడు.

# 70. అల్ మఆరిజ్ (ఉన్నత సోపానాలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అడిగేవాడొకడు తప్పనిసరిగా వచ్చిపడే విపత్తును గురించే అడిగాడు – 2. సత్యతిరస్కారుల కొరకు. దానిని ఎవరూ తొలగించలేడు. 3. అది ఉన్నత సోపానాలకు అధిపతి అయిన అల్లాహ్ తరఫు నుండి ఉంటుంది. 4. యాభైవేల ఏండ్లకు సమానమయిన ఒక రోజున దైవదూతలు, జిబ్రీల్ ఆయన వైపునకు అధిరోహిస్తారు. 5. కనుక (ఓ ప్రవక్తా!) నీవు సంయమనం పాటించు. అత్యుత్తమ సంయమనం! 6. వారు దానిని దూరాన ఉన్నట్టు చూస్తున్నారు. 7. మా దృష్టిలో అది చాలా దగ్గరగా ఉంది. 8. ఆ రోజు ఆకాశం నూనె గసి మాదిరిగా అయిపోతుంది. 9. పర్వతాలు ఏకిన దూది పింజాల్లా తయారవుతాయి. 10. ఏ మిత్రుడూ తోటి మిత్రుని బాగోగులను పట్టించుకోడు. 11. నిజానికి వారు వారికి చూపించబడతారు. ఆ రోజు అపరాధి శిక్ష నుండి తప్పించుకునేందుకు పరిహారంగా తన కన్నకొడుకులను, 12. తన భార్యను, తన సహోదరుణ్ణి, 13. తనకు నీడ కల్పిస్తూ ఉండిన తన కుటుంబాన్నీ, 14. సమస్త భూలోక వాసులను ఇచ్చేసి, తాను మాత్రం బయటపడాలనుకుంటాడు.

15. అది జరగని పని. అదైతే మండే అగ్నిజ్వాల అయి ఉంటుంది. 16. అది చర్మాన్ని వలచివేస్తుంది. 17. అది (సత్యం పట్ల) వెన్నుచూపిన, మరలిపోయిన ప్రతి ఒక్కడినీ ఎలుగెత్తి పిలుస్తుంది. 18. ధనాన్ని కూడబెట్టిన వాణ్ణి, భద్రంగా దాచిపెట్టినవాణ్ణి కూడా (కేకేసి పిలుస్తుంది). 19. నిశ్చయంగా మానవుడు ధైర్యం లోపించినవాడుగా పుట్టించబడ్డాడు. 20. కాస్తంత కష్టం కలగగానే కంగారు పడిపోతాడు. 21. కష్టాల నుండి గట్టెక్కి కలిమిని ఆస్వాదించగానే పరమపీనాసిగా మారిపోతాడు. 22. అయితే నమాజు చేసేవారు మాత్రం (ఈ అవగుణం నుండి సురక్షితంగా ఉంటారు). 23. వారు తమ నమాజు వ్యవస్థపై నిలకడగా ఉంటారు. 24. వారి సొమ్ములలో హక్కు నిర్ధారించబడి ఉంటుంది – 25 – అడిగే అగత్యపరులకు,

(స్వాభిమానం వల్ల నోరుతెరచి) అడగని అభాగ్య జీవులకు కూడా. 26. వారు తీర్పుదినంపై దృఢ నమ్మకం కలిగి ఉంటారు. 27. వారు తమ ప్రభువు శిక్షకు భయపడేవారై ఉంటారు. 28. నిశ్చయంగా వారి ప్రభువు శిక్ష నిర్భయంగా ఉండదగినది కాదు. 29. వారు తమ మర్మస్థానాలను కాపాడుకునేవారై ఉంటారు. 30. అయితే తమ భార్యల విషయంలో, ధర్మబద్ధంగా తమ స్వాధీనంలోనికి వచ్చిన బానిస స్త్రీల విషయంలో (కాపాడుకోకపోయినప్పటికీ) వారు నిందార్హులు కారు. 31. మరే వ్యక్తి అయినా దీనికి మించి కూడా ఏదన్నా ఆశిస్తే – అలాంటివారే హద్దుమీరిన వారవుతారు. 32. వారు తమ అప్పగింతలను నెరవేర్చేవారు, తమ వాగ్దానాలను నిలుపుకునేవారై ఉంటారు. 33. తమ సాక్ష్యాలపై స్థిరంగా ఉంటారు. 34. ఇంకా వారు తమ నమాజులను పరిరక్షించుకుంటారు. 35. ఇలాంటివారే స్వర్గవనాలలో సగౌరవంగా ఉంటారు.

36. ఈ సత్య తిరస్కారులకు ఏమైపోయింది? వారు ఎందుకలా నీ వైపు ఎగబడివస్తున్నారు? 37 – కుడివైపు నుండీ, ఎడమ వైపు నుండీ, గుంపులు గుంపులుగా!? 38. ఏమిటి, వారిలోని ప్రతి ఒక్కడూ సుఖసౌఖ్యాలుగల తోటలో ప్రవేశింపజేయబడతానని ఆశపడుతున్నాడా? 39. అది అసంభవం. మేము వారిని దేంతో పుట్టించామో స్వయంగా వారికీ తెలుసు.

40. కనుక అది కాదు – నేను తూర్పుల, పడమరల ప్రభువుపై ప్రమాణం చేస్తున్నాను. మాకు ఆ శక్తి ఉంది – 41. మేము వారికి బదులుగా వారి స్థానంలో వారికన్నా మెరుగైన వారిని తీసుకురాగలం. అది మా వల్ల కాని పనేం కాదు. 42. కనుక నీవు వారికి వాగ్దానం చేయబడుతున్న దినాన్ని వారు ఎదుర్కొనే వరకూ వారిని వ్యర్థ విషయాల్లో, ఆటల్లో పడి ఉండేలా వదలిపెట్టు. 43. ఆ రోజు వారు గోరీల నుండి లేచి, ఒక లక్ష్యాన్ని ఛేదించటానికి పరుగెత్తుతున్న వారిలా పరుగులు తీస్తారు. 44. వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి. పరాభవం వారిని క్రమ్ముకుని ఉంటుంది. ఇదే వారికి వాగ్దానం చేయబడిన దినం.

# 71. నూహ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. మేము నూహ్‌ను అతని జాతి వైపునకు పంపుతూ, 'నీ జాతి ప్రజలపై వ్యధాభరితమయిన శిక్ష వచ్చిపడక ముందే నీవు వారికి భయబోధ చెయ్యి' అని సూచించాము. 2. అతనిలా ఉపదేశించాడు : 'నా జాతి ప్రజలారా! నేను మిమ్మల్ని స్పష్టంగా హెచ్చరించేవాడను. 3. మీరు అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయనకు భయపడండి. నాకు విధేయత చూపండి. 4. అల్లాహ్ మీ పాపాలను క్షమిస్తాడు. ఒక నిర్ణీత కాలం వరకు మిమ్మల్ని మిగిల్చి ఉంచుతాడు. నిశ్చయంగా అల్లాహ్ నిర్ధారించిన సమయం వచ్చేసిందంటే, అది తొలగించబడటం అంటూ ఉండదు. దీనిని మీరు తెలుసుకుంటే ఎంత బాగుండేది!?'

5. నూహ్ ఈ విధంగా విజ్ఞప్తి చేసుకున్నాడు : 'నా ప్రభూ! నేను నా జాతి వారికి అహోరాత్రులు పిలుపు ఇచ్చాను. 6. కాని నా పిలుపు వారి పలాయనవాదాన్నే పెంచింది. 7. నీవు క్షమించేందుకు నేను వారిని ఎప్పుడు ఆహ్వానించినా, వారు తమ చెవులలో వ్రేళ్లు దూర్చుకున్నారు. తమపైన గుడ్డలు కప్పుకున్నారు. మంకుతనం చూపారు. గర్వాతిశయంతో విర్రవీగారు. 8. తరువాత నేను వారిని బాహాటంగా పిలుపు ఇచ్చాను. 9. ఆపైన వారిని బహిరంగంగా బోధపరచాను. రహస్యంగా కూడా నచ్చజెప్పాను.' 10. (ప్రభూ!) నేను వారికి ఇలా బోధించాను : "క్షమాభిక్షకై మీ ప్రభువును ప్రార్థించండి. నిశ్చయంగా ఆయన గొప్ప క్షమాశీలి. 11. ఆయన మీపై ఆకాశం నుండి పుష్కలంగా వర్షం కురిపిస్తాడు. 12. మీ ఆస్తిపాస్తులలో, మీ పుత్ర సంతతిలో అభివృద్ధిని ప్రసాదిస్తాడు. మీకోసం తోటలను ఉత్పన్నం చేస్తాడు. మీ కొరకు కాలువలను ప్రవహింపజేస్తాడు. 13. అసలు మీకేమయిపోయింది? మీరు దైవమహత్తు పట్ల ఆశావహ దృక్పథం ఎందుకు కలిగి ఉండరు? 14. యదార్థానికి ఆయనే మిమ్మల్ని అంచెలవారీగా

సృష్టించాడు. 15. అల్లాహ్ ఏ విధంగా సప్తాకాశాలను – ఒకదానిపై ఒకటిగా – సృష్టించాడో మీరు చూడటం లేదా? 16. ఇంకా వాటిలో చంద్రుణ్ణి కాంతిమంతంగా, సూర్యుణ్ణి దేదీప్యమానమైన దీపంగా చేశాడు. 17. ఇంకా – అల్లాహ్ మిమ్మల్ని నేల నుండి విశిష్ఠమయిన రీతిలో (మొక్కల వలె) మొలిపించాడు. 18. మళ్లీ ఆయన మిమ్మల్ని అందులోనికే చేర్చుతాడు. మళ్లీ అందులో నుండే మిమ్మల్ని వెలికి తీస్తాడు. 19. అల్లాహ్యే భూమిని మీ కొరకు సుగమం చేశాడు. 20. మీరు అందలి విశాల మార్గాలలో నడవాలని!"

21. నూహ్ ఇలా నివేదించుకున్నాడు : 'నా ప్రభూ! వీళ్లు నా మాట వినలేదు. ఎవరి సిరిసంతానాదులు వారి నష్టాన్ని మాత్రమే అధికం చేశాయో అలాంటి వారినే వీళ్లు అనుసరించారు. 22. వీళ్లు చాలా పెద్ద కుట్రలు పన్నారు. 23. వీళ్లు ఇలా చెప్పుకున్నారు : "మీరు మీ ఆరాధ్య దేవతలను ఎంతమాత్రం వదలిపెట్టకండి. వద్ను, సువాను గానీ, యగూస్, యవూఖ్, నస్ను గానీ ఎట్టి పరిస్థితిలోనూ విడిచిపెట్టకండి." 24. (ప్రభూ!) వీళ్లు చాలామందిని అపమార్గం పట్టించారు. కనుక నీవు కూడా వీరి అపమార్గాన్ని మరింత అధికం చెయ్యి.' 25. కడకు వారు తమ పాపాల కారణంగానే ముంచివేయబడ్డారు. తరువాత నరకాగ్నిలో ప్రవేశింపజేయబడ్డారు. వారు అల్లాహ్ పట్టునుండి తమను కాపాడే ఏ సహాయకుణ్ణీ పొందలేకపోయారు.

26. నూహ్ ఇలా ప్రార్థించాడు : 'నా ప్రభూ! నీవు ఈ తిరస్కారులలో ఏ ఒక్కడినీ భూమండలంపై నివసించేలా వదలకు. 27. నీవు గనక వీళ్లను విడిచిపెట్టావంటే, వీళ్లు నీ దాసులను మార్గభ్రష్టుల్ని చేసేస్తారు. వీళ్ల సంతతిలో పుట్టే వాడెవడయినా సరే వాడు పాపాత్ముడు, కరడుగట్టిన తిరస్కారి అయి ఉంటాడు. 28. నా ప్రభూ! నన్ను క్షమించు. నా తల్లిదండ్రులను, నా ఇంట్లో విశ్వాసి అయి ప్రవేశించిన వారిని క్షమించు. విశ్వసించిన సమస్త పురుషులను, విశ్వసించిన సమస్త స్త్రీలను క్షమించు. దుర్మార్గులకు వినాశం తప్ప మరెందులోనూ వృద్ధి నొసగకు.'

# 72. అల్ జిన్న్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ప్రవక్తా!) వారికి చెప్పు : 'నాకు దివ్యవాణి (వహీ) ద్వారా తెలియపరచబడింది – జిన్నుల సమూహం ఒకటి ఖుర్ఆన్ విన్నది. వారు తమ వర్గం వారితో ఇలా అన్నారు : "మేమొక అమోఘమయిన ఖుర్ఆన్‌ను విన్నాము. 2. అది సన్మార్గం వైపునకు దర్శకత్వం వహిస్తోంది. అందువల్ల మేము దానిని విశ్వసించాము. ఇక నుండి మేము మా ప్రభువుకు భాగస్వామిగా ఎవరినీ చేర్చము. 3. మరో విషయమేమిటంటే, మా ప్రభువు వైభవం అత్యున్నతమైనది. ఆయన ఎవరినీ ఇల్లాలిగాగానీ, కొడుకుగా గానీ చేసుకోలేదు. 4. ఇంకా ఏమిటంటే; మనలోని మూర్ఖుడు అల్లాహ్ గురించి సత్యవిరుద్ధమయిన మాటలు చెప్పేవాడు. 5. మనుషులుగానీ, జిన్నులుగానీ దేవుని విషయంలో అబద్ధాలు కల్పించి చెప్పరని మనం భావిస్తూ ఉండేవాళ్ళం. 6. ఇంకో విషయం ఏమిటంటే; మనుషులలోని కొందరు జిన్నుల్లోని కొందరి శరణు వేడుతూ ఉండేవారు. దీని మూలంగా కూడా జిన్నుల గర్వం మరింత అధికమయింది. 7. అల్లాహ్ ఎవరినీ తిరిగి లేపడని మీరు అనుకున్నట్లే, వాళ్ళూ (మనుషులు కూడా) అనుకునేవారు.

8. మేము ఆకాశంలోని పరిస్థితుల స్వరూపాన్ని వీక్షించబోయినపుడు అది గట్టి బందోబస్తుతో, అగ్ని జ్వాలలతో నిండి ఉండటం పసిగట్టాము. 9. మేము అక్కడ కొన్ని ప్రదేశాలలో రహస్య విషయాలు వినటానికి మాటేసి కూర్చునేవాళ్ళం. కాని ఇప్పుడెవరయినా అలాంటి ప్రయత్నం చేస్తే, అతని కోసం ఒక అగ్నిజ్వాల సిద్ధంగా ఉంటోంది. 10. ఇంతకీ ఈ భూలోకవాసుల కోసం ఏదయినా కీడు తలపెట్టబడిందో లేక వారి ప్రభువు వారికేదన్నా మేలు చేయగోర్తున్నాడో మాకు అంతుబట్టడం లేదు. 11. ఇంకా ఏమిటంటే; మనలో కొందరు మంచివారుండగా మరికొందరు మరోవిధంగా ఉన్నారు. మన విధానాలు విభిన్నంగా ఉన్నాయి. 12. భూలోకంలో మనం అల్లాహ్‌ను ఓడించలేమన్న సంగతి మనకు ఏనాడో విదితమైపోయింది. (ఊర్ధ్వలోకాలలో)

ఎక్కడికయినా పారిపోయి ఆయన్ని అశక్తుణ్ణి చేయలేమన్న విషయం కూడా నిర్ధారణ అయిపోయింది. 13. మార్గదర్శకత్వంతో కూడుకున్న విషయాన్ని (ఖుర్‌ఆన్‌ను) వినగానే మేము దానిని విశ్వసించాము. కనుక ఎవడయితే తన ప్రభువును విశ్వసిస్తాడో అతనికెలాంటి హెచ్చుతగ్గులు జరిగే భయం ఉండదు. 14. మరో విషయమేమిటంటే; మనలో కొందరు విధేయతా భావం గల వారైతే, మరికొందరు మార్గవిహీనులుగా ఉన్నారు. ఎవరు విధేయతా వైఖరిని అవలంబించారో, వారు శ్రేయస్కర మార్గాన్ని కనుగొన్నారు. 15. మరెవరు మార్గవిహీనులుగా ఉన్నారో, వారు నరకానికి ఇంధనం అవుతారు."

16. ఇంకా నాకు దివ్యవాణి (వహీ) ద్వారా తెలుపబడినదేమంటే; ఈ జనులు గనక సన్మార్గంపై స్థిరంగా ఉంటే, మేము వారికి పుష్కలంగా నీరు సమకూరుస్తాము – 17 – తద్వారా వారిని పరీక్షించాలని! తన ప్రభువు స్మరణ విషయంలో విముఖుడయిన వ్యక్తిని అల్లాహ్ కఠిన శిక్షకు గురిచేస్తాడు. 18. మరో విషయం ఏమిటంటే; మస్జిదులు అల్లాహ్ కొరకే. కాబట్టి మీరు (వాటిలో) అల్లాహ్‌తో పాటు వేరితరులను పిలవకండి. 19. అల్లాహ్ దాసుడు (ముహమ్మద్) ఆయన్ని పిలవటానికి నిలబడినపుడు, జనులు అతనిపై విరుచుకుపడటానికి సిద్ధమయ్యారు. 20. (ఓ ముహమ్మద్!) వారికి చెప్పు : 'నేను కేవలం నా ప్రభువును మాత్రమే పిలుస్తాను (ప్రార్థిస్తాను). ఆయనకు భాగస్వామిగా వేరెవరినీ చేర్చను.' 21. ఇంకా ఇలా చెప్పు : 'మీకు కీడు గానీ, మేలుగానీ కలిగించే అధికారం నాకు లేదు.' 22. ఇలా అను : 'అల్లాహ్ బారి నుండి నన్నెవరూ కాపాడలేరు. ఆయన తప్ప వేరొకరి ఆశ్రయం కూడా నాకు లేదు. 23. అయితే అల్లాహ్ ఆదేశాన్ని గ్రహించి, ఆయన సందేశాలను అందజేయటం వరకే నా బాధ్యత.' ఇక ఎవడయినా అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను ఎదిరిస్తే అతని కొరకు నరకాగ్ని ఉంది. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

24. కడకు వారికి వాగ్దానం చేయబడిన దానిని వారు చూసుకున్నప్పుడు, ఎవరి సహాయకులు బలహీనులో, ఎవరు అల్పసంఖ్యాకులో వారికి

తెలిసివస్తుంది. 25. వారితో అను : 'మీకు వాగ్దానం చేయబడుతున్నది సమీపంలోనే ఉందో లేక నా ప్రభువు దాని వ్యవధిని సుదీర్ఘంగా నిర్ధారించాడో నాకైతే తెలియదు.' 26. అగోచర జ్ఞాని మాత్రం ఆయనే. తన అగోచర విషయాన్ని ఆయన ఎవరికీ తెలుపడు – 27 – తాను ప్రత్యేకంగా ఇష్టపడిన తన సందేశహరునికి తప్ప! మరి ఆ సందేశహరునికి ముందు, వెనుకా ఆయన తన రక్షకులను నియమిస్తాడు. 28 – వారు తమ ప్రభువు సందేశాలను (హెచ్చుతగ్గులు లేకుండా) అందజేస్తున్నారన్న విషయాన్ని ఆయన తెలుసుకోవటానికి! ఇంకా ఆయన వారి పరిసరాలన్నింటినీ పరివేష్ఠించి ఉన్నాడు. ఇంకా ప్రతి దానినీ లెక్కించి పెట్టాడు.

# 73. అల్ ముజ్జమ్మిల్ (కప్పుకున్నవాడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కంబళి కప్పుకున్నవాడా! 2. రాత్రివేళ (నమాజులో) నిలబడు. కాని కొంతభాగం. 3. రాత్రిలో సగభాగం లేదా అంతకంటే కొంచెం తక్కువ చేసుకో. 4. లేదా అంతకన్నా కొంచెం ఎక్కువ చేసుకో. ఖుర్ఆన్‌ను బాగా ఆగి ఆగి – నింపాదిగా – పఠించు. 5. మేము నీపై ఒక బరువైన వాక్కును (సందేశ బాధ్యతా భారాన్ని) వేయనున్నాము.

6. నిశ్చయంగా రాత్రివేళ లేవటం మనోవాంఛలకు కళ్ళెం వేయటానికి దోహదకారి అవుతుంది. మాట సూటిగా – స్థిరంగా – వెలువడుతుంది. 7. నిశ్చయంగా నీకు పగటివేళ ఎన్నో పనులుంటాయి. 8. మరి నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు. అన్నింటి నుండీ వేరై, ఆయన వైపునకే మరలు. 9. ఆయనే తూర్పు–పడమరలకు ప్రభువు. ఆయన తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. కాబట్టి ఆయన్నే నీ కార్యసాధకునిగా చేసుకో. 10. జనులు చెప్పుకునే అవాకులు చెవాకులపై నిగ్రహం పాటించు. హుందాగా అలాంటివారి నుండి వేరై పో. 11. సత్యాన్ని ధిక్కరించే శ్రీమంతుల వ్యవహారాన్ని నాకు వదిలేయ్. వారికి మరి కాస్త విడుపు ఇవ్వు. 12. నిశ్చయంగా మా వద్ద బేడీలు ఉన్నాయి. నరకం ఉంది. 13. గొంతులో

ఇరుక్కుపోయే ఆహారం ఉంది. బాధాకరమయిన యాతన ఉంది. 14. ఆ రోజు భూమి, పర్వతాలు చలిస్తాయి. పర్వతాలు జారిపోయే ఇసుక తిన్నెల్లా అయిపోతాయి.

15. మేము ఫిరౌన్ వైపు ప్రవక్తను పంపినట్లే, మీ వైపునకు ఒక ప్రవక్తను – మీపై సాక్షిగా చేసి పంపాము. 16. కాని ఫిరౌన్ ప్రవక్త పిలుపును అంగీకరించకపోవటం వల్ల మేమతన్ని పట్టుకుని చాలా కఠినంగా శిక్షించాము. 17. ఒకవేళ మీరు తిరస్కారానికి ఒడిగట్టినట్లయితే, పసివాళ్ళను సయితం ముసలివారుగా మార్చివేసే ఆనాటి శిక్ష నుండి ఎలా తప్పించు కుంటారు? 18. అప్పుడు ఆకాశం బ్రద్దలైపోతుంది. నిశ్చయంగా ఆయన వాగ్దానం నెరవేరుతుంది. 19. ఇది ఒక ఉపదేశం. ఇక కోరినవాడు తన ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు.

20. (ఓ ముహమ్మద్!) నీవు మూడింట రెండొంతుల రాత్రి, ఒక్కోసారి సగం రాత్రి, ఒక్కోసారి మూడింట ఒక వంతు రాత్రి (దైవారాధనలో) నిలబడతావన్న విషయం నీ ప్రభువుకు తెలుసు. నీ వెంట ఉన్న వారిలో కూడా కొంతమంది ఇలా చేస్తున్నారని ఆయనకు తెలుసు. రేయింబవళ్ళను మదించేవాడు అల్లాహ్ మాత్రమే. మీరు దీనిని (ఎల్లకాలం) నిర్వర్తించలేరని ఆయన తెలుసుకున్నాడు. అందువల్ల ఆయన మీపై జాలిచూపాడు. ఇక మీరు ఖుర్‌ఆన్‌లో నుండి సులువుగా పఠించగలిగినంతగా పఠించండి. మీలో ఎందరో రోగగ్రస్తులుంటారని, మరెందరో దైవానుగ్రహాన్ని అన్వేషిస్తూ భువిలో ప్రయాణం చేస్తుంటారని, ఇంకా ఎందరో దైవమార్గంలో ధర్మయుద్ధం చేస్తుంటారని ఆయన గ్రహించాడు. కనుక మీరు అందులో నుండి సులువుగా పఠించగలిగినంతగా పఠించండి. నమాజును (మాత్రం) స్థాపించండి. జకాత్‌ను చెల్లించండి. అల్లాహ్‌కు మంచి రుణం ఇస్తూ ఉండండి. మీరు మీ స్వయం కోసం ఏ మంచిని ముందుకు పంపుకున్నా, దానిని అల్లాహ్ వద్ద పొందుతారు. అదే శ్రేష్ఠమైనది. ప్రతిఫలం దృష్ట్యా చాలా గొప్పది. క్షమాపణకై అల్లాహ్‌ను అర్థిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడు.

# 74. అల్ ముద్దస్సిర్ (శాలువ కప్పుకున్నవాడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. శాలువ కప్పుకున్నవాడా! 2. లే. లేచి భయబోధ చెయ్యి. 3. నీ ప్రభువు ఘనతను చాటి చెప్పు. 4. నీ దుస్తులను పరిశుభ్రంగా ఉంచుకో. 5. మురికి, మాలిన్యాన్ని విడనాడు. 6. ఉపకారం చేసి ఎక్కువ ప్రతిఫలాన్ని ఆశించకు. 7. నీ ప్రభువు ప్రసన్నత నిమిత్తం సహనం వహించు.

8. మరెప్పుడయితే శంఖం ఊదబడుతుందో, 9. ఆ రోజు చాలా గడ్డురోజై ఉంటుంది. 10. అది తిరస్కారుల పాలిట సులువైనదై ఉండదు. 11. వదలండి నన్నూ, నేను ఒంటరిగా పుట్టించిన ఆ వ్యక్తిని! 12. వాడికి బోలెడంత ధనం ఇచ్చాను. 13. నిత్యం అతని సేవలో హాజరై ఉండే కొడుకులనిచ్చాను. 14. అన్ని రకాల సాధన సంపత్తులను అతనికి సమకూర్చిపెట్టాను. 15. అయినాసరే నేను వాడికి ఇంకా ఇంకా ఇవ్వాలని అత్యాశకు పోతున్నాడు. 16. ఎన్నటికీ కాదు ... వాడు మా సూక్తుల పట్ల వైర వైఖరిని అవలంబిస్తున్నాడు. 17. త్వరలోనే నేను వాడ్ని ఓ కఠినమయిన ఎత్తుకు ఎక్కిస్తాను. 18. వాడు ఆలోచించాడు. ఆపైన ఒక వ్యూహరచన చేశాడు. 19. వాడు నాశనమవ్వ! ఎటువంటి వ్యూహాన్ని రచించాడు వాడు!? 20. మరి వాడు నాశనమవ్వ! ఎలాంటి వ్యూహ రచన చేశాడు కదా వాడు!? 21. తరువాత వాడు కొరకొరా చూశాడు. 22. ఆ తరువాత నుదురు చిట్లించాడు. మూతి ముడుచుకున్నాడు. 23. పిమ్మట వెనుతిరిగాడు. అహంకారం ప్రదర్శించాడు. 24. ఇలా అన్నాడు : 'ఇది ప్రాచీన కాలం నుండీ వస్తున్న మంత్రజాలం తప్ప మరొకటి కాదు. 25. ఇది కేవలం ఒక మానవ మాత్రుని వాక్కు మాత్రమే.' 26. నేను శీఘ్రంగానే వాణ్ణి నరకాగ్నికి ఆహుతి చేస్తాను. 27. ఆ నరకాగ్ని గురించి నువ్వేమనుకున్నావు? 28. అది మిగిలి ఉండనివ్వదు, (సజీవంగా) వదలదు. 29. అది (మనిషి) చర్మాన్ని కాల్చివేస్తుంది. 30. దానిపై పందొమ్మిది మంది దైవదూతలు నియుక్తులై ఉన్నారు. 31. మేము నరక భటులుగా దైవదూతలను మాత్రమే

నియమించాము. మేము వారి సంఖ్యను కేవలం సత్యతిరస్కారులను పరీక్షించటానికే పెట్టాము – తద్వారా గ్రంథం వొసగబడిన వారు నమ్మకం పొందాలని! విశ్వాసులు తమ విశ్వాసాన్ని వృద్ధిచేసుకోవాలని! గ్రంథవహులు, విశ్వసించినవారు సందిగ్ధానికి లోను కారాదని! హృదయాలలో రోగం ఉన్నవారు, సత్యతిరస్కారులు, 'ఇంతకీ దీనిద్వారా (ఈ సంఖ్య ద్వారా) దేవుడు చెప్పదలచిందేమిటి?' అని అనాలని (మేము ఈ విధంగా చేశాము). ఈ విధంగా అల్లాహ్ తాను కోరిన వారిని మార్గభ్రష్టతకు లోనుచేస్తాడు. తాను కోరిన వారికి సన్మార్గం చూపుతాడు. నీ ప్రభువు సేనావాహిని గురించి స్వయంగా ఆయనకే తెలుసు. ఇది కేవలం ప్రజల బోధనార్థం మాత్రమే.

32. ఎన్నటికీ కాదు ... చంద్రుని సాక్షిగా! 33. వెనుతిరిగి పోతున్నప్పటి రాత్రి సాక్షిగా! 34. ప్రకాశమానమైనప్పటి ఉదయం సాక్షిగా! 35. నిశ్చయంగా నరకం (అగ్ని) మహా ఘోరమైనది. 36. మనిషి పాలిట భయంకరమైనది. 37. మీలో ముందంజ వేయదలచిన, వెనుక ఉండిపోదలచిన ప్రతి ఒక్కరికీ! 38. ప్రతి వ్యక్తీ తాను సముపార్జించిన దానికి బదులుగా కుదువ ఉన్నాడు. 39. కుడిపక్షం వారు తప్ప! 40. వారు స్వర్గవనాలలో ఉంటారు. ఇలా అడుగుతారు – 41. అపరాధులనుద్దేశించి! 42. 'మిమ్మల్ని ఏ విషయం నరకానికి గొనిపోయింది?' 43. వారిలా అంటారు: 'మేము నమాజ్ చేసేవారం కాము. 44. నిరుపేదలకు అన్నం తినిపించేవారం కూడా కాము. 45. పైగా మేము అనవసరంగా వాదించే వారితో చేరి వాదులాడేవారము. 46. తీర్పుదినాన్ని అసత్యమని త్రోసిపుచ్చే వారం. 47. కడకు ఆ నిశ్చయమైనది (మృత్యువు) రానే వచ్చింది.' 48. కాబట్టి సిఫారసు చేసేవారి సిఫారసు వారికి ఏవిధంగానూ ఉపయోగ పడలేదు.

49. మరయితే వారికేమయింది? వారెందుకు హితబోధపట్ల విముఖులవుతున్నారు? – 50 – బెదిరిపోయిన అడవి గాడిదల మాదిరిగా! 51. సింహాన్ని చూసి పారిపోతున్నట్లుగా! 52. పైగా వారిలోని ప్రతి ఒక్కడూ తనకు తెరచివున్న సందేశపత్రాలు ఇవ్వబడాలని కాంక్షిస్తున్నాడు. 53. అది

కాదు ... వారసలు పరలోకానికి భయపడటం లేదు. 54. ఎన్నటికీ కాదు ... ఇదైతే ఒక ఉపదేశం. 55. కనుక కోరినవాడు దీనిద్వారా హితబోధను గ్రహించవచ్చు. 56. అయితే అల్లాహ్ తలచనంత వరకూ వారు దాన్నుండి హితబోధను పొందలేరు. ఆయన మాత్రమే భయపడదగినవాడు. ఆయన మాత్రమే క్షమించగలవాడు.

## 75. అల్ ఖియామహ్ (ప్రళయం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. లేదు ... నేను ప్రళయదినంపై ప్రమాణం చేస్తున్నాను. 2. లేదు ... నేను ఆత్మనింద చేసుకునే ప్రాణిపై ప్రమాణం చేస్తున్నాను. 3. ఏమిటి, మేము తన ఎముకలను కూర్చలేమని మానవుడు భావిస్తున్నాడా? 4. ఎందుకు కూర్చలేము? మేమతని వ్రేళ్ల కొనలను సయితం సవరించగలము. 5. పైగా మానవుడైతే తన (మనస్సాక్షి) ముందరే దౌష్ట్యానికి పాల్పడాలనుకుంటున్నాడు. 6. ఇంతకీ ఆ ప్రళయదినం ఎప్పుడొస్తుంది? అని ప్రశ్నిస్తున్నాడు. 7. కళ్లు కళవళపడినప్పుడు ... 8. చంద్రుడు కాంతిహీనమై పోయినప్పుడు ... 9. సూర్యుడు చంద్రుడు సమీకరించబడినపుడు ... 10. ఆ రోజు మనిషి 'నేనెక్కడికి పారిపోను?' అనంటాడు. 11. ఎన్నటికీ కాదు... ఎక్కడా ఆశ్రయం లభించదు. 12. ఆనాడు నీ ప్రభువు వద్ద మాత్రమే ఆశ్రయం ఉంటుంది. 13. ఆ రోజు మనిషి, తానేం ముందుకు పంపుకున్నాడో, ఏం వెనుక వదలివచ్చాడో తెలుపబడుతుంది. 14. పైగా మనిషికి తానేమిటో తనకు బాగా తెలుసు – 15. తానెన్ని సంజాయిషీలు ఇచ్చుకున్నప్పటికీ.

16. (ప్రవక్తా!) నీవు దీనిని తొందరగా నేర్చుకునే తపనతో, దీనిని పఠించేటప్పుడు నీ నాలుకను వేగంగా త్రిప్పకు. 17. దీనిని కూర్చే, వినిపించే బాధ్యత మాది. 18. కనుక మేము దీనిని వినిపించినపుడు నీవు శ్రద్ధగా అనుసరించు. 19. తరువాత దీనిని విశదపరిచే బాధ్యత మాది.

20. అదికాదు – మీరు తొందరగా లభ్యమయ్యే వాటిపై మోజుపడుతున్నారు. 21. ఆలస్యంగా లభించేదానిని వదలిపెడుతున్నారు.

22. కొన్ని ముఖాలు ఆ రోజు కళకళ లాడుతూ ఉంటాయి. 23. తమ ప్రభువును తదేకంగా తిలకిస్తూ ఉంటాయి. 24. మరికొన్ని ముఖాలు ఆ రోజు ఉదాసీనంగా ఉంటాయి. 25. తమ పట్ల నడ్డి విరిచే వ్యవహారం జరగనున్నదని అనుమానిస్తూ ఉంటాయి. 26. అది కాదు ... (గుండెలోని) ప్రాణం గొంతువరకూ వచ్చేసినపుడు, 27. 'ఎవడు .... !? .... మంత్రించి ఊదేవాడు?' అని అనబడినపుడు, 28. ఇది వేరుపడిపోయే సమయం అని అతననుకుంటాడు. 29. అప్పుడు ఒక పిక్క మరో పిక్కతో కలసిపోతుంది. 30. అది నీ ప్రభువు వైపునకు ప్రస్థానం చేసే రోజై ఉంటుంది.

31. మరి వాడు సత్యాన్ని ధ్రువపరచనూలేదు, నమాజు చేయనూ లేదు. 32. పైగా సత్యాన్ని కాదన్నాడు. దాని నుండి మరలిపోయాడు. 33. ఆపైన నిక్కుతూ తన ఇంటివారి వైపు వెళ్ళిపోయాడు. 34. శోచనీయం! నీ ధోరణి కడు శోచనీయం!! 35. విచారకరం! నీ వైఖరి మిక్కిలి విచారకరం!! 36. ఏమిటి, తాను ఇట్టే విడిచిపెట్టబడతానని మనిషి ఊహిస్తున్నాడా? 37. ఏమిటి, (ఒకప్పుడు) అతను స్ఖలించబడిన ఒక వీర్య బిందువుగా ఉండలేదా? 38. తరువాత అతను (మాతృగర్భంలో జలగ మాదిరిగా వ్రేలాడే) నెత్తుటి గడ్డ అయ్యాడు. దరిమిలా అల్లాహ్ అతని నిర్మాణ ప్రక్రియను మొదలెట్టాడు. ఆపైన అతని అవయవాలను తీర్చిదిద్దాడు. 39. అటు పిమ్మట స్త్రీ – పురుషులనే రెండు రకాలను చేశాడు. 40. ఇదంతా చేసినవాడు మృతులను తిరిగి బ్రతికించలేడా?

## 76. అద్ దహ్ర్ (కాలం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఏమిటి, ఈ అనంత కాలగమనంలో మానవుడు ప్రస్తావించదగిన వస్తువుగా లేని సమయం ఒకటి గడవలేదా? 2. మేము మనిషిని ఓ మిశ్రమ (ద్వివర్ణ) బిందువుతో పుట్టించాము. మేమతనిని త్రిప్పుతూ ఉండేవారము. తరువాత అతనిని మేము వినేవాడుగా, చూసేవాడుగా చేశాము. 3. మేమతనికి మార్గదర్శకత్వం వహించాము. ఇక వాడు కృతజ్ఞుడుగానయినా

మెలగవచ్చు లేదా కృతఘ్నుడు అయినా కావచ్చు (మేమతని స్వేచ్ఛపై ఆంక్ష విధించలేదు).

4. మేము సత్య తిరస్కారుల కోసం సంకెళ్ళను, కంఠపాశాలను, మండే అగ్నిని సిద్ధంగా ఉంచాము. 5. సజ్జనులు మాత్రం కర్పూరం కలుపబడిన మధుపాత్రల నుండి సేవిస్తారు. 6. అదొక చెలమ. దాని నుండి దైవదాసులు మధువు సేవిస్తారు. దాని నుండి పాయలు తీసుకు పోతారు. 7. వారు (ఆ సజ్జనులు) మొక్కుబడులు చెల్లించుకునే వారై ఉంటారు. ఏ రోజు కాఠిన్యం సర్వసామాన్యమై ఉంటుందో దానికి వారు భయపడుతూ ఉంటారు. 8. ఆయన యెడల గల ప్రేమకొద్దీ వారు అగత్యపరులకు, అనాథలకు, ఖైదీలకు అన్నం పెడతారు. 9. (వారిలా అంటారు) 'దైవప్రీతిని కోరి మేము మీకు తినిపిస్తున్నాము. మేము మీ నుండి ప్రతిఫలాన్నిగానీ, మీ ధన్యవాదాలను గానీ ఆశించటం లేదు. 10. మా ప్రభువు తరఫు నుండి ఎదురయ్యే కఠినమయిన, భీకరమయిన దినం గురించి భీతిల్లు తున్నాము.' 11. అందుచేత అల్లాహ్ వారిని ఆ దినపు కాఠిన్యం నుండి రక్షించాడు. వారికి ఉల్లాసాన్నీ, సంతోషాన్ని ప్రసాదించాడు. 12. వారు వహించిన ఓర్పుకు బదులుగా వారికి స్వర్గాన్ని, పట్టు వస్త్రాలను ప్రసాదించాడు. 13. వారందులో ఆసనాలపై దిండ్లకు ఆనుకుని ఆసీనులై ఉంటారు. వారికక్కడ తీవ్రమయిన వేడిగాని, తీవ్రమయిన చలిగానీ ఉండదు. 14. స్వర్గం నీడలు వారిపై పడుతూ ఉంటాయి. స్వర్గంలోని పండ్లు వారికి అందుబాటులో ఉంటాయి. 15. వారి సేవలో వెండి కూజాలు, స్వచ్ఛమయిన గాజు గ్లాసులు సమర్పించబడుతూ ఉంటాయి. 16. ఆ గ్లాసులు సయితం వెండివి అయి ఉంటాయి. వాటిని నింపేవారు కూడా చక్కగా – తగువిధంగా – నింపి ఉంటారు.

17. అక్కడ వారికి మరో విశిష్టమయిన మధువు కూడా త్రాపబడుతుంది. అందులో సొంటి కలుపబడి ఉంటుంది. 18. అది స్వర్గంలో 'సల్‌సబీల్' అనబడే ఒక ప్రత్యేక ప్రవాహం. 19. వారి దగ్గర నిత్యం బాలురుగానే ఉండే కుర్రాళ్ళు తిరుగాడుతూ ఉంటారు. నువ్వు వారిని చూస్తే

వెదజల్లబడిన ముత్యాలా! అనుకుంటావు. 20. నీవు ఎటువైపు దృష్టిని సారించినా గొప్ప అనుగ్రహభాగ్యాలు, గొప్ప సామ్రాజ్య వైభవాలే కానవస్తుంటాయి. 21. వారి ఒంటిపై పలుచని, ఆకుపచ్చని పట్టువస్త్రాలు ఉంటాయి. ఖరీదయిన జరీ అంచుగల దుస్తులు కూడా. వారికి వెండితో చేయబడిన ముంజేతి మురుగులు తొడిగించబడతాయి. వారి ప్రభువు వారికి పరిశుద్ధమయిన మధువును త్రాగిస్తాడు. 22. 'నిశ్చయంగా ఇది మీ కృషి ఫలితం. మీ కృషి స్వీకరించబడింది.'

23. (ప్రవక్తా!) మేము నీపై ఖుర్‌ఆన్‌ను అంచెలవారీగా – కొద్ది కొద్దిగా – అవతరింపజేశాము. 24. కనుక నీవు నీ ప్రభువు ఆదేశానుసారం ఓర్పు వహించు. వారిలో ఏ పాపాత్ముని, మరే కృతఘ్నుని మాట కూడా వినకు. 25. నీ ప్రభువు నామాన్ని ఉదయం, సాయంత్రం స్మరిస్తూ ఉండు. 26. రాత్రివేళ కూడా ఆయన సన్నిధిలో సాష్టాంగపడుతూ ఉండు. రాత్రి సుదీర్ఘ సమయం ఆయన పవిత్రతను కొనియాడు. 27. వీళ్ళు తొందరగా లభించే వస్తువు (ప్రపంచం)ను కోరుకుంటున్నారు. తమ వెనుక ఒక బరువైన దినాన్ని వదలిపెడుతున్నారు. 28. మరి చూడబోతే వారిని సృష్టించినది, వారి శరీర చట్రాన్ని సంగఠితపరచినది మేమే. మరి మేము కోరుకున్నప్పుడు వీరి వంటి వారినే వీరి స్థానంలో తీసుకురాగలము. 29. ఇదొక ఉపదేశం. కాబట్టి కోరిన వ్యక్తి తన ప్రభువు వైపునకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు. 30. అల్లాహ్ కోరినది తప్ప మీరు కోరలేరు. నిశ్చయంగా అల్లాహ్ సర్వం తెలిసినవాడు, వివేకవంతుడు. 31. ఆయన తాను కోరిన వారిని తన కారుణ్యంలో చేర్చుకుంటాడు. దుర్మార్గుల కొరకు ఆయన వ్యధాభరితమయిన శిక్షను సిద్ధం చేసి ఉంచాడు.

## 77. అల్ ముర్సలాత్ (వదలబడిన గాలులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఆహ్లాదపరిచే విధంగా వదలబడిన గాలుల సాక్షిగా! 2. తరువాత అవి తుఫాను వేగంతో వీస్తాయి. 3. మేఘాలను పైకి లేపి వ్యాపింపజేస్తాయి.

4. తరువాత వ్యవహారాన్ని వేరుపరుస్తాయి. 5. ఆపైన (దైవ) ధ్యానం రగుల్గొల్పుతాయి. 6. విమోచనగా లేదా హెచ్చరికగా! 7. దేని గురించి మీతో వాగ్దానం చేయబడుతున్నదో అది అవశ్యంగా నెరవేరుతుంది.

8. నక్షత్రాలు కాంతిహీనమై పోయినప్పుడు ... 9. ఆకాశం బద్దలై పోయినపుడు ... 10. పర్వతాలు తుత్తునియలుగా చేసివేయబడినప్పుడు ... 11. ప్రవక్తలు నిర్ధారిత వేళపై సమావేశపరచబడినపుడు ... 12. ఇక ఏ రోజు కొరకు ఆలస్యం? 13. నిర్ణయాత్మకమైన దినం కొరకు! 14. ఆ నిర్ణయాత్మక దినం గురించి నువ్వేమనుకున్నావు? 15. సత్యాన్ని త్రోసిపుచ్చిన వారికి ఆ రోజు మూడుతుంది. 16. ఏమిటి, మేము పూర్వీకులను అంతమొందించలేదా? 17. తరువాతి వారిని మేము వారి వెనుకే పంపిస్తున్నాము. 18. మేము అపరాధుల పట్ల ఇలాగే చేస్తాము. 19. సత్యాన్ని నిరాకరించే వారికి ఆ రోజు మూడటం ఖాయం.

20. ఏమిటి, మేము మిమ్మల్ని అల్పమయిన ఒక నీటి బిందువుతో పుట్టించలేదా? 21. తరువాత దానిని ఒక సురక్షితమైన చోట ఉంచాము – 22. ఒక నిర్ణీత కాలం వరకు. 23. తరువాత దానికొక లెక్క నిర్ధారించాము. మేము ఎంత ఖచ్చితంగా లెక్కవేస్తామో! 24. సత్యాన్ని తృణీకరించేవారికి ఆ రోజు తిప్పలు తప్పవు. 25. ఏమిటి, మేము భూమిని ఇమిడ్చుకునేదిగా చేయలేదా? 26. బ్రతికి ఉన్న వారిని, మృతులను కూడా! 27. మేము అందులో ఎత్తయిన పర్వతాలను ప్రతిష్ఠించాము. మీకు తియ్యని నీరు త్రాపాము. 28. సత్యాన్ని త్రోసిపుచ్చిన వారికి ఆ రోజు వినాశం తథ్యం.

29. (వారితో ఇలా అనబడుతుంది) 'మీరు నిరాకరించిన దాని వైపునకే పదండి. 30. మూడు పాయలుగా చీలిన ఆ నీడ వైపునకు! 31. అది నీడనూ ఇవ్వదు, వేడి నుండి కూడా రక్షించదు. 32. అది మిద్దెల మాదిరి నిప్పు రవ్వలను కురిపిస్తుంది. 33. అవి పసుపు పచ్చని ఒంటెల వలే ఉంటాయి. 34. సత్యాన్ని కొట్టివేసిన వారికి ఆ రోజు ముప్పు తప్పదు. 35. ఆ రోజు జనులు నోరు విప్పి మాట్లాడలేరు. 36. సంజాయిషీ ఇచ్చుకునే

అనుమతి కూడా వారికి ఉండదు. 37. సత్యాన్ని ధిక్కరించిన వారికి ఆ రోజు మూడుతుంది. 38. ఇది నిర్ణయాత్మకమయిన దినం. మేము మిమ్మల్నీ, మీ పూర్వీకుల్నీ (తీర్పు కోసమే) ప్రోగు చేశాము. 39. మీ వద్ద ఏదయినా తంత్రం ఉంటే దానిని నాపై ప్రయోగించి చూడండి! 40. సత్యాన్ని నిరాకరించిన వారికి ఆ రోజు మూడుతుంది.

41. నిశ్చయంగా భయభక్తులు కలవారు నీడలలో, చెలమలలో ఉంటారు. 42. వారు ఇష్టపడే పండ్లు ఫలాల మధ్యన! 43. 'హాయిగా తినండి, త్రాగండి – మీరు చేసుకున్న (మంచి) పనులకు ప్రతిఫలంగా! 44. మేము సదాచార సంపన్నులకు ఇలాగే ప్రతిఫలం ఇస్తాము.' (అని వారితో అనబడుతుంది). 45. సత్యాన్ని త్రోసిపుచ్చేవారికి ఆ రోజు మూడుతుంది. 46. కొన్నాళ్ళపాటు తినండి, భోగభాగ్యాలను జుర్రుకోండి. మీరు ముమ్మాటికీ అపరాధులే. 47. ఆ రోజు సత్యాన్ని త్రోసిపుచ్చిన వారికి మూడుతుంది. 48. '(దైవసన్నిధిలో) తలవంచండి' అని వారితో అన్నప్పుడు వారు తలవంచరు. 49. ఆ రోజు సత్యాన్ని తృణీకరించిన వారికి మూడుతుంది. 50. ఇక దీని తరువాత వారు విశ్వసించటానికి ఏముందనీ?

## 78. అన్ నబా (మహావార్త)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

◆ (30) 1. వారు దేని గురించి ప్రశ్నించుకుంటున్నారు? 2. ఆ మహావార్తను గురించేనా? 3. దాని గురించేనా వారు భిన్నాభిప్రాయానికి లోనయ్యారు? 4. ఎన్నటికీ కాదు ... త్వరలోనే వారు తెలుసుకుంటారు. 5. మరెన్నటికీ కాదు ... అతి త్వరలోనే వారు తెలుసుకుంటారు. 6. ఏమిటి, మేము భూమిని పరుపుగా పరచలేదా? 7. పర్వతాలను మేకులు మాదిరిగా (పాతిపెట్టలేదా)? 8. ఇంకా మేము మిమ్మల్ని జంటలుగా సృష్టించాము. 9. ఇంకా మేము నిద్రను మీ బడలిక తీర్చేదిగా చేశాము. 10. ఇంకా మేము రాత్రిని ఆచ్ఛాదనగా చేశాము. 11. మేము పగటిని సంపాదనా సమయంగా చేశాము. 12. ఇంకా మేము మీపైన పటిష్టమయిన ఏడు

ఆకాశాలను నిర్మించాము. 13. ఇంకా మేమందులో ఉజ్వలమయిన ఒక దీపాన్ని ఉంచాము. 14. నీటితో నిండిన మేఘాల ద్వారా కుండపోతగా వర్షం కురిపించాము. 15 – తద్వారా మేము ఆహారధాన్యాలను, పచ్చిక బయళ్ళను వెలికితీయాలని. 16. దట్టమయిన తోటలను (ఉత్పన్నం చేయాలని). 17. నిశ్చయంగా నిర్ణయాత్మక దినం ఒకానొక సమయాన నిర్ధారితమై ఉంది.

18. ఆ రోజు శంఖం ఊదబడుతుంది. అప్పుడు మీరు గుంపులు గుంపులుగా తరలివస్తారు. 19. ఆకాశం తెరచివేయబడుతుంది. అందులో ఎన్నో ద్వారాలు ఏర్పడతాయి. 20. పర్వతాలు నడిపింపబడతాయి. కడకు అవి ఎండమావుల్లా తయారవుతాయి. 21. నిశ్చయంగా నరకం మాటేసి ఉంది. 22. అది తలబిరుసుల నివాసం. 23. వారందులో యుగాల తరబడి గ్రమ్మగ్గుతూ ఉంటారు. 24. వారందులో చల్లదనాన్ని గానీ, పానీయాన్ని గానీ ఆస్వాదించరు. 25. అయితే మరిగే నీరు, చీము నెత్తురు మాత్రం సమర్పించబడుతుంది. 26. అది వారి ఆచరణకు తగిన ప్రతిఫలం! 27. వారు (తమ) లెక్కను గురించి అసలు పట్టించుకునేవారే కాదు. 28. వారు మా సూచనలను అసత్యాలుగా చిత్రీకరించి, త్రోసిపుచ్చారు. 29. మేము ప్రతి దానిని లెక్కించి భద్రపరిచాము. 30. కనుక రుచి చూడండి. మేము మీ శిక్షను పెంచుతూనే ఉంటాము.

31. నిశ్చయంగా భయభక్తులు కలవారు సాఫల్యం పొందుతారు. 32. వారి కొరకు ఉద్యానవనాలు, ద్రాక్షపండ్లు ఉంటాయి. 33. ఒకే వయస్సుగల నవ యువతులుంటారు. 34. పూర్తిగా నిండి పొలుకుతున్న మద్యం గ్లాసులుంటాయి. 35. అక్కడ వారు ఎలాంటి వ్యర్థ ప్రేలాపనలుగానీ, అబద్ధాలుగాని వినరు. 36. అది వారి సదాచరణను బట్టి నీ ప్రభువు ప్రసాదించే ప్రతిఫలమై ఉంటుంది. 37. భూమ్యాకాశాలకు, వాటి మధ్యనున్న సమస్తానికి ప్రభువు అయిన కరుణామయుని తరఫున! ఆయనతో సంభాషించే సాహసం ఎవరూ చేయలేరు. 38. ఏ రోజున ఆత్మ (జిబ్రీల్) మరియు దైవదూతలు వరుస తీరి నిలబడి ఉంటారో, అప్పుడు కరుణామయుని ఆనతి

పొందినవారు తప్ప ఎవరూ నోరెత్తి మాట్లాడలేరు. ఆ మాట్లాడేవారయినా ఎంతో సమంజసంగా మాత్రమే మాట్లాడగలరు. 39. ఆ రోజు (నెలకొనటం) ఒక సత్యం. కనుక కోరినవాడు తన ప్రభువు వద్ద మంచి స్థానం కోసం యత్నించవచ్చు. 40. మేము మిమ్మల్ని సమీపంలోనే ఉన్న శిక్షను గురించి సావధానపరిచాము. ఆ రోజు ప్రతి మనిషీ తన చేతులు ముందుకు పంపుకున్న దానిని ప్రత్యక్షంగా చూసుకుంటాడు. అప్పుడు సత్య తిరస్కారి, 'అయ్యో! నేను మట్టినయినా అయి ఉంటే బాగుండేదే!' అనంటాడు.

## 79. అన్ నాజిఆత్ (పెకలించేవి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కూకటివ్రేళ్లతో పెకలించే గాలుల సాక్షిగా! 2. మలయమారుతంలా
వీచే పవనాల సాక్షిగా! 3. తేలియాడే మేఘమాలికల సాక్షిగా! 4. రివ్వున
ముందుకు దూసుకుపోయే వారి సాక్షిగా! 5. (తమ ప్రభువు ఆజ్ఞానుసారం)
వ్యవహారాలను నిర్వహించే వారి సాక్షిగా! 6. ఆ రోజు కుదిపివేసేది
కుదిపివేస్తుంది. 7. దాని వెంబడే మరో ప్రకంపన వస్తుంది. 8. ఆనాడు
ఎన్నో గుండెలు దడదడలాడుతుంటాయి. 9. వారి చూపులు క్రిందికి వంగి
ఉంటాయి. 10. వారిలా అడుగుతున్నారు : 'ఏమిటి, మేము మళ్లీ మొదటి
స్థితికే మరల్చబడతామా? 11. మా ఎముకలు కృశించిపోయిన తరువాత
కూడానా!?' 12. 'అలాగయితే ఈ మళ్ళింపు చాలా నష్టకరమయినదే'
అంటారు. 13. అదైతే ఒకే ఒక ప్రేలుడు అయి ఉంటుంది. 14. అప్పుడు
అకస్మాత్తుగా వారంతా ఒక మైదానంలో ప్రోగై ఉంటారు.

15. ఏమిటి, మూసా వృత్తాంతం గాని నీకు అందిందా?
16. అప్పుడతని ప్రభువు అతనిని తువా పవిత్ర లోయలో పిలిచి, 17 'నీవు
ఫిరౌన్ వద్దకు వెళ్ళు. వాడు మరీ పొగరుబోతుగా ప్రవర్తిస్తున్నాడు.
18. అతనికి చెప్పు : 'ఏమి, నీవు స్వీయసంస్కరణకు సంసిద్ధంగా ఉన్నావా?
19. నీవు దైవభీతిపరునిగా మసలుకోగలందులకు నేను నీకు మార్గబోధన
చేయనా!?' 20. తరువాత మూసా అతనికి గొప్ప నిదర్శనం చూపాడు.

21. అయినప్పటికీ అతను (ఫిరౌన్) దానిని అసత్యమంటూ ఖండించాడు. విశ్వసించేందుకు నిరాకరించాడు. 22. ఆ తరువాత వెనుతిరిగి, తన ప్రయత్నాలను ముమ్మరం చేశాడు. 23. బహిరంగ సభను ఏర్పాటుచేసి, ఎలుగెత్తి ప్రకటించాడు. 24. 'నేనే మీ సర్వోన్నత ప్రభువును' అన్నాడు. 25. అందువల్ల అల్లాహ్ అతనిని ఇహపరాల శిక్షకై పట్టుకున్నాడు. 26. నిశ్చయంగా ఇందులో దైవానికి భయపడే ప్రతి వ్యక్తికీ గుణపాఠం ఉంది.

27. ఏమిటి మిమ్మల్ని సృష్టించటం కష్టతరమైన పనా? లేక ఆకాశాన్నా? అల్లాహ్‌యే దానిని నిర్మించాడు. 28. దాని కప్పును అత్యున్నతం చేశాడు. ఆపైన దానిని తీర్చిదిద్దాడు. 29. దాని రాత్రిని చీకటిగా చేశాడు. దాని పగటిని ప్రస్ఫుటం చేశాడు. 30. ఆ తరువాత భూమిని సుగమం (నివాసయోగ్యంగా) చేశాడు. 31. దాని నుండి దాని నీటిని, పచ్చికను వెలికి తీశాడు. 32. (భూమిలో) పర్వతాలను నెలకొల్పాడు. 33. జీవన సామగ్రిగా – మీ కోసం, మీ పశువుల కోసం!

34. మరెప్పుడయితే ఆ మహా విపత్కర సంఘటన సంభవిస్తుందో, 35. ఆ రోజు మానవుడు తాను చేసుకున్నదంతా జ్ఞప్తికి తెచ్చుకుంటాడు. 36. చూసేవాని ముందు నరకం ప్రత్యక్షపరచబడుతుంది. 37. ఎవడు తలబిరుసుగా ప్రవర్తించి ఉంటాడో, 38. ప్రాపంచిక జీవితానికే ప్రాధాన్యత ఇచ్చి ఉంటాడో, 39. అతని నివాస స్థలం నరకం అవుతుంది. 40. మరెవరయితే తన ప్రభువు సమక్షంలో నిలబడవలసి ఉందన్న తలంపుతో భయపడుతూ, తన మనసును (దుష్ట) కాంక్షల నుండి ఆపుకున్నాడో, 41. అతని నివాసం స్వర్గం అవుతుంది. 42. (ప్రవక్తా!) వారు నిన్ను ప్రళయం గురించి, 'ఇంతకీ అది ఎప్పుడు సంభవిస్తుంది?' అని ప్రశ్నిస్తున్నారు. 43. ఆ ప్రస్తావనతో నీకేం పని? 44. ఈ వ్యవహారం నీ ప్రభువు అధీనంలో ఉంది. 45. భయపడేవానిని సావధానపరచటం వరకే నీ పని. 46. వారు దానిని చూసుకున్ననాడు, తాము ప్రపంచంలో ఓ సంధ్యా సమయం లేక ఓ ప్రభాత సమయం కన్నా ఎక్కువసేపు గడపలేదని భావిస్తారు.

# 80. అబస (చిరాకు ప్రదర్శించాడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ప్రవక్త) చిరాకు ప్రదర్శించాడు. ముఖం త్రిప్పుకున్నాడు.
2. తన దగ్గరకు ఒక అంధుడు వచ్చినందుకు. 3. నీకేం తెలుసు, అతను
దిద్దుబాటను అవలంబిస్తాడని!? 4. లేదా హితబోధను వింటాడని? హితబోధ
అతనికి లాభదాయకం కాగలదని? 5. ఏ వ్యక్తి (ఉపదేశం పట్ల) నిర్లక్ష్యంగా
వ్యవహరిస్తున్నాడో, 6. అతని గురించి నీవు ఎంతగానో మథనపడుతున్నావు.
7. అతను గనక దారికి రాకపోతే నీపై ఎలాంటి బాధ్యతా (నింద) లేదు.
8. మరే వ్యక్తి నీ దగ్గరకు (సందేహనివృత్తి కోసం) పరుగులు తీస్తూ వస్తున్నాడో,
9. దైవభీతి కూడా కలిగి ఉన్నాడో, 10. అతని పట్లనేమో నీవు అనాసక్తత
కనబరుస్తున్నావు. 11. ఎన్నటికీ కాదు ... నిశ్చయంగా ఇది (ఈ ఖుర్ఆన్)
ఒక ఉపదేశం. 12. కనుక కోరినవారు (దీనిద్వారా) ఉపదేశం గ్రహించవచ్చు.
13. ఇది గౌరవప్రదమయిన పత్రాలలో ఉంది. 14. అత్యున్నతమైనది.
పవిత్రమైనది. 15. లేఖకుల (దైవదూతల) చేతులలో ఉంది. 16. వారు
గౌరవనీయులు, పుణ్యాత్ములు.

17. మనిషి పాడుగాను! ఎటువంటి కృతఘ్నుడు వాడు!?
18. అల్లాహ్ వాణ్ణి దేంతో పుట్టించాడు? 19. ఒక్కగానొక్క (వీర్య)
బిందువుతోనే కదా వాణ్ణి పుట్టించాడు! ఆ తరువాత అతని విధి విధానాన్ని
నిర్ధారించాడు. 20. పిమ్మట అతని కొరకు మార్గాన్ని సులభతరం గావించాడు.
21. ఆపైన అతనికి మరణమిచ్చాడు. దరిమిలా అతన్ని సమాధిలోనికి
చేర్చాడు. 22. ఇక తాను తలచినప్పుడు అతన్ని మళ్లీ బ్రతికిస్తాడు.
23. కానేకాదు ... దేవుడు అతనికి జారీచేసిన ఆజ్ఞలను అతను అమలుపరచనే
లేదు. 24. కనుక మనిషి తాను తినే ఆహారాన్ని ఓసారి చూసుకోవాలి.
25. మేమే (వర్షపు) నీటిని బాగా కురిపించాము. 26. తరువాత మేము
నేలను అమోఘంగా చీల్చాము. 27. అందులో ఆహారధాన్యాలను
పండించాము. 28. ద్రాక్ష పండ్లను, కూరగాయలను, 29. ఆలివ్ (జైతూన్),

ఖర్జూరాలను, 30. దట్టమయిన తోటలను, 31. పండ్లు ఫలాలను, పచ్చిక బయళ్లను ఉత్పన్నం చేశాము. 32. మీకు, మీ పశువులకు – జీవన సామగ్రిగా!

33. గూబ గుయ్యిమనిపించే గావుకేక వినవచ్చినపుడు, 34. ఆ రోజు మనిషి పారిపోతాడు – తన సోదరుడి నుండి, 35. తన కన్నతల్లి నుండి,తన కన్న తండ్రి నుండి, 36. తన అర్ధాంగి నుండి, తన కన్నకొడుకుల నుండి. 37. ఆ రోజు ప్రతి ఒక్కరూ ఎవరి గొడవ వారిదే అన్నట్టు ఉంటారు. వేరొకరిని పట్టించుకునే అవకాశమే వారికి చిక్కదు. 38. కొన్ని ముఖాలు ఆ రోజు దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉంటాయి. 39. నవ్వుతూ, సంతోషంతో పరవశించిపోతూ ఉంటాయి. 40. మరికొన్ని ముఖాలు ఆనాడు దుమ్ము కొట్టుకుని (విచారంగా) ఉంటాయి. 41. వారిపై చీకటి అలుముకుని ఉంటుంది. 42. ఇలాంటివారే సత్యతిరస్కారులు, కరడుగట్టిన పాపాత్ములు.

## 81. అత్ తక్వీర్ (చుట్టివేయబడటం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. సూర్యుడు చుట్టివేయబడినప్పుడు, 2. నక్షత్రాలు కాంతిహీనమై పోయినప్పుడు, 3. పర్వతాలు నడిపించబడినప్పుడు, 4. పది మాసాల సూడి ఒంటెలు దిక్కుతోచని విధంగా తిరుగాడుతున్నప్పుడు, 5. అడవి జంతువులన్నీ ఒకచోట గుమిగూడినప్పుడు, 6. సముద్రాలు రగుల్గొల్పబడి నపుడు, 7. ఒకేరకమయిన జనులు ఒకచోట సమీకరించబడినపుడు, 8. సజీవంగా పాతిపెట్టబడిన చిన్నారి బాలికను ఉద్దేశించి, 9. 'తాను ఏ పాపం చేసిందని హతమార్చబడినట్టు?' అని ప్రశ్నించబడినప్పుడు, 10. కర్మల పత్రాలు తెరువబడినప్పుడు, 11. ఆకాశం తెరుచుకున్నప్పుడు, 12. నరకం రగిలించబడినప్పుడు, 13. స్వర్గం సమీపంలోకి తీసుకురాబడి నప్పుడు, ... 14 ... అప్పుడు ప్రతి వ్యక్తీ తాను తన వెంట తెచ్చుకున్నదేమిటో తెలుసుకుంటాడు.

15. కనుక అది కాదు – నేను ప్రమాణం చేస్తున్నాను వెనక్కి జరిగే

నక్షత్రాలపై, 16. నడిచే, అదృశ్యమయ్యే గ్రహాలపై, 17. నిష్క్రమిస్తున్నప్పటి రాత్రిపై, 18. ఆగమనం చేస్తున్నప్పటి ఉదయంపై, 19. నిశ్చయంగా ఇది గౌరవనీయుడయిన సందేశవాహకుడు తెచ్చిన వాక్కు. 20. అతను మహాబలశాలి. సింహాసనాధీశుని సన్నిధిలో ఉన్నతస్థానం కలవాడు. 21. అతని మాటకు విలువ ఉంది. అతను విశ్వసనీయుడు. 22. మీ ఈ సహవాసి (ముహమ్మద్) పిచ్చివాడు కాడు. 23. అతను ఆ దూతను స్పష్టమయిన ఆకాశపుటంచుపై చూశాడు. 24. అతను గుప్త విషయాల పట్ల అత్యాశ గలవాడు కాడు. 25. అది శాపగ్రస్తుడైన షైతాన్ వాక్కు ఎంతమాత్రం కాదు. 26. మరైతే మీరు ఎటుపోతున్నారు? 27. ఇది (ఈ ఖుర్ఆన్) లోకవాసులందరికీ హితోపదేశం. 28. మీలో సరైన పంథాలో నడవదలచిన వానికోసం! 29. లోకేశ్వరుడయిన అల్లాహ్ తలచుకోనంత వరకూ మీరేమీ తలంచలేరు.

## 82. అల్ ఇన్ఫితార్ (చీలిపోవటం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఆకాశం చీలిపోయినప్పుడు, 2. నక్షత్రాలు చెల్లాచెదురైపోయి నప్పుడు, 3. సముద్రాలు పొంగి పరవళ్లు తొక్కినప్పుడు, 4. గోరీలు తెరువ బడినప్పుడు ... 5. అప్పుడు ప్రతి వ్యక్తీ తాను ముందుకు పంపుకున్నదేమిటో, వెనుక వదలిపెట్టినదేమిటో తెలుసుకుంటాడు. 6. ఓ మానవుడా! ఉదాత్తుడయిన నీ ప్రభువు విషయంలో ఏ వస్తువు నిన్ను మోసంలో పడవేసింది? 7. చూడబోతే నిన్ను పుట్టించినవాడు, నిలువెల్లా నిన్ను తీర్చిదిద్దినవాడు, తగు రీతిలో నిన్ను పొందికగా మలచినవాడు ఆయనే కదయ్యా! 8. ఇంకా ఆయన తాను కోరిన రూపంలో మీ రూపకల్పన చేశాడు. 9. ఎన్నటికీ కాదు ... మీరు తీర్పుదినాన్నే అసత్యమంటూ త్రోసిపుచ్చుతున్నారు. 10. వాస్తవానికి మీపై పర్యవేక్షకులు నియమించ బడి ఉన్నారు. 11. గౌరవనీయులయిన లేఖకులు. 12. మీరు చేసేదంతా వారికి తెలుసు. 13. నిశ్చయంగా సదాచార సంపన్నులు సుఖసౌఖ్యాలలో

ఉంటారు. 14. నిశ్చయంగా పాపాత్ములు నరకంలో ఉంటారు. 15. తీర్పు దినాన వారందులో పడవేయబడతారు. 16. వారు దాని నుండి ఎంతమాత్రం వేరు కాలేరు. 17. తీర్పుదినం గురించి నీకేం తెలుసు? 18. మరి ఆ తీర్పుదినం గురించి నువ్వేమనుకున్నావు? 19. ఆ రోజు ఏ ప్రాణీ మరో ప్రాణికి ఏ విధంగానూ ఉపయుక్తం కాజాలదు. ఆనాటి వ్యవహారమంతా దైవాధీనమై ఉంటుంది.

## 83. అత్ తత్ఫీఫ్ (కొలతలు, తూనికలలో తగ్గించి ఇచ్చేవారు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కొలతలు, తూనికలలో తగ్గించి ఇచ్చేవారికి మూడుతుంది. 2. వారు జనుల నుండి కొలిచి తీసుకునేటప్పుడేమో పూర్తిగా తీసుకుంటారు. 3. అయితే వారికి కొలిచిగానీ, తూచిగానీ ఇచ్చేటప్పుడు మాత్రం తగ్గించి ఇస్తారు. 4. ఏమిటి, తాము తిరిగి లేపబడనున్నామన్న ఆలోచన వారికి తట్టడం లేదా? 5. ఒక మహాదినం కొరకు!? 6. ఆ రోజు జనులంతా సకల లోకాల ప్రభువు సమక్షంలో నిలబడి ఉంటారు. 7. ఎంతమాత్రం కాదు ... నిశ్చయంగా పాపాత్ముల కర్మల చిట్టా 'సిజ్జీన్'లో ఉంటుంది. 8. సిజ్జీన్ గురించి నువ్వేమనుకున్నావు? 9. అదొక లిఖితపూర్వకమయిన రికార్డు (కార్యాలయం). 10. సత్యాన్ని త్రోసిపుచ్చిన వారికి ఆ రోజు మూడుతుంది. 11. వారు తీర్పుదినాన్ని అసత్యమంటూ త్రోసిపుచ్చుతున్నారు. 12. బరి తెగించిన పాపాత్ముడు మాత్రమే దానిని త్రోసిపుచ్చుతాడు. 13. వాడికి మా వచనాలను వినిపించినపుడు, 'ఇవి పూర్వీకుల కట్టుకథలే' అంటాడు. 14. ఎన్నటికీ కాదు ... అసలు విషయం ఏమిటంటే వారి హృదయాలపై వారి స్వయంకృతాల తుప్పు పేరుకుపోయింది. 15. కానేకాదు ... పైగా ఆ రోజు వారు తమ ప్రభువు దర్శనభాగ్యానికి నోచుకోనివిధంగా – చాటున – ఉంచబడతారు. 16. తరువాత వారు నరకానికి ఆహుతి అవుతారు. 17. 'మీరు అసత్యంగా చిత్రీకరించినది ఇదే' అని వారితో అనబడుతుంది.

18. ఎంతమాత్రం కాదు, నిశ్చయంగా సజ్జనుల కర్మల పత్రం 'ఇల్లియ్యీన్' లో ఉంటుంది. 19. 'ఇల్లియ్యీన్' గురించి నువ్వేమనుకున్నావు? 20. అదొక వ్రాతపూర్వకమయిన రిజిస్టరు (కార్యాలయం). 21. అది సన్నిహితులయిన దైవదూతల పర్యవేక్షణలో ఉంటుంది. 22. నిశ్చయంగా సద్వర్తనులు సుఖసంతోషాలలో ఉంటారు. 23. వారు ఆసనాలపై దర్జాగా ఆసీనులై పరిసరాలను వీక్షిస్తూ ఉంటారు. 24. వారి ముఖారవిందాలపై నీవు సుఖసౌఖ్యాల తాజాదనాన్ని గమనిస్తావు. 25. వారికి త్రాగటానికి ముఖబంధిత మధుకలశం సమర్పించబడుతుంది. 26. దానిపై వేయబడిన ముద్ర (సీలు) కూడా 'ముష్క్' (కస్తూరి) సువాసనను గుబాళిస్తూ ఉంటుంది. అది ఎటువంటి వస్తువంటే దానిని పొందటానికి పోటీపడేవారు పోటీపడవచ్చు. 27. ఆ మధువులో 'తస్నీం' జలం మిశ్రమం చేయబడి ఉంటుంది. 28. అదొక విశిష్ఠమయిన సరోవరం. దైవసామీప్యం పొందిన భక్తులు దాని నుండి సేవిస్తారు. 29. అపరాధ జనులు విశ్వాసుల స్థితిపై నవ్విపోయేవారు. 30. వారు (విశ్వాసులు) తమ సమీపం నుండి సాగిపోతున్నప్పుడు, కన్నుగీటి పరస్పరం వెకిలి సైగలు చేసుకునేవారు. 31. వారు తమ వారివద్దకు మరలినప్పుడు కూడా వేళాకోళం చేస్తూ మరలేవారు. 32. వారు విశ్వాసులను చూసినప్పుడు, 'వీళ్లు దారి తప్పినవారు' అంటూ ఎద్దేవా చేసేవారు. 33. నిజానికి వారు వారిపై (విశ్వాసులపై) రక్షకభటులుగా చేసి పంపబడలేదు. 34. కనుక ఈ రోజు విశ్వాసులు సత్యతిరస్కారుల స్థితిపై నవ్వుతారు. 35. వారు పరుపులపై కూర్చుని (అక్కడ జరగేదంతా) తిలకిస్తూ ఉంటారు. 36. సత్యతిరస్కారులకు వారు చేసుకున్న దాని పూర్తి ప్రతిఫలం లభించింది కదా!

## 84. అల్ ఇన్‌షిఖాఖ్ (చిట్లటం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఆకాశం చిట్లినప్పుడు, 2. అది తన ప్రభువు ఆజ్ఞను శిరసావహిస్తుంది. దానికి అదే తగినది. 3. భూమి సాగదీయబడినప్పుడు, 4. అది

తన లోపలి వస్తువులను బయటపడేసి, ఖాళీ అయిపోతుంది. 5. అది తన ప్రభువు ఆజ్ఞను శిరసావహిస్తుంది. అదే దానికి తగినది. 6. ఓ మానవుడా! నీవు నిరంతర సాధన చేస్తూనే నీ ప్రభువు వైపునకు సాగిపోతున్నావు. కడకు ప్రయాసకు ఓర్చుకుంటూనే ఆయన్ని కలుసుకోబోతున్నావు. 7. కనుక ఎవరి కర్మల పత్రం అతని కుడిచేతికి ఇవ్వబడుతుందో, 8. అతని నుండి సులభమైన లెక్క తీసుకోబడుతుంది. 9. అతను తన పరివారం వైపు సంతోషంతో వస్తాడు. 10. మరెవరి కర్మల పత్రం అతని వీపు వెనుక నుండి ఇవ్వబడుతుందో, 11. అతను చావు కోసం అరుస్తాడు. 12. నరకానికి ఆహుతి చేయబడతాడు. 13. ఒకప్పుడు అతను తన వారి మధ్యన ఆనందడోలికల్లో తేలియాడేవాడు. 14. తానెన్నటికీ (దేవుని వద్దకు) మరల్చబడనని భావించేవాడు. 15. అదెట్లా? అతని ప్రభువు అతన్ని గమనిస్తూనే ఉండేవాడు. 16. అది కాదు. నేను సంధ్యారుణిమపై ప్రమాణం చేస్తున్నాను. 17. ఇంకా రాత్రిపై, అది తనలో ఇమిడ్చుకునే వాటిపై, 18. పూర్ణ పరిణతి చెందినప్పటి చంద్రునిపై ప్రమాణం చేస్తున్నాను. 19. మీరు అవశ్యంగా ఒక అవస్థ నుండి మరో అవస్థకు చేరుకోవలసి ఉంటుంది. 20. మరయితే వారికేమయింది? వారెందుకు విశ్వసించటంలేదు? 21. వారి సమక్షంలో ఖుర్ఆన్ పారాయణం చేయబడినపుడు, వారెందుకు దేవుని ముందు తలవంచరు? 22. పైగా ఈ సత్యతిరస్కారులు ధిక్కార వైఖరిని అవలంబిస్తున్నారు. 23. వారు కూడబెట్టేదంతా అల్లాహ్‌కు తెలుసు. 24. కనుక వారికి ఒక వ్యధాభరిత మయిన శిక్ష గురించి శుభవార్త వినిపించు. 25. అయితే ఎవరు విశ్వసించి, సత్క్రియలాచరిస్తారో, వారికి ఎన్నటికీ అంతంకాని ప్రతిఫలం ఉంది.

## 85. అల్ బురూజ్ (నక్షత్ర గ్రహరాశి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. బురుజులు గల ఆకాశం సాక్షిగా! 2. వాగ్దానం చేయబడిన దినం సాక్షిగా! 3. చూసేవాని సాక్షిగా! చూడబడిన దాని సాక్షిగా! 4. కందకం వాళ్ళు నాశనమయ్యారు. 5. అందులో ఇంధనం రగిలించబడిన అగ్ని ఉండేది.

6. అప్పుడు వారు ఆ కందకం వద్ద కూర్చుని ఉన్నారు. 7. తాము విశ్వాసుల పట్ల జరుగుతున్న అమానుష కాండను (వేడుకగా) తిలకించేవారు. 8. విశ్వాసులతో వారి శత్రుత్వానికి ప్రధాన కారణం; వారు శక్తిమంతుడు, స్తోత్రనీయుడయిన అల్లాహ్‌ను విశ్వసించటం తప్ప మరొకటి కాదు. 9. భూమ్యాకాశాల సార్వభౌమత్వం ఆయనదే. అల్లాహ్ ప్రతిదానికీ సాక్షిగా ఉన్నాడు. 10. ఎవరయితే విశ్వసించిన పురుషులను, విశ్వసించిన స్త్రీలను వేధించారో, తరువాత పశ్చాత్తాపపడలేదో – అలాంటి వారికి నరక యాతన ఉంటుంది. దహించే శిక్ష కూడా ఉంటుంది. 11. నిశ్చయంగా! విశ్వసించి, సత్కార్యాలు చేసినవారికి క్రింద కాలువలు ప్రవహించే ఉద్యానవనాలు ఉన్నాయి. ఇదే గొప్ప సాఫల్యం. 12. నిశ్చయంగా నీ ప్రభువు పట్టు మాగట్టిది. 13. నిశ్చయంగా ఆయనే ఆరంభిస్తాడు, ఆయనే పునరావృతం చేస్తాడు. 14. ఆయన క్షమాసాగరుడు, ప్రేమమయుడు. 15. మహత్పూర్వకమయిన పాలనా పీఠానికి అధిపతి. 16. కోరిన దానిని చేసి తీరేవాడు. 17. ఏమిటి, నీకు ఆ సైనిక పటాలాల సమాచారం గాని అందిందా? 18. ఫిరౌన్, సమూద్ వారి సమాచారం!? 19. కాని ఈ సత్యతిరస్కారులు మాత్రం తమ తమ ధిక్కార వైఖరిపైనే మొండికేశారు. 20. అల్లాహ్ మాత్రం వారిని అన్ని వైపుల నుండీ దిగ్బంధం చేసి ఉన్నాడు. 21. యదార్థానికి అదైతే మహత్తుగల ఖుర్‌ఆన్. 22. అది సురక్షితమయిన ఫలకంపై లిఖించబడి ఉంది.

## 86. అత్ తారిఖ్ (రాత్రివేళ ప్రస్ఫుటమయ్యేది)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఆకాశం సాక్షిగా! రాత్రివేళ ప్రస్ఫుటమయ్యే దాని సాక్షిగా! 2. రాత్రివేళ ప్రస్ఫుటమయ్యే దాని గురించి నువ్వేమనుకున్నావు? 3. అది మెరిసే నక్షత్రం! 4. తనపై ఒక పర్యవేక్షకుడంటూ లేకుండా ఏ ప్రాణీ లేదు. 5. కాబట్టి మనిషి, తాను దేంతో పుట్టించబడ్డాడో కాస్త చూసుకోవాలి. 6. అతను ఉరకలు వేసే నీటితో పుట్టించబడ్డాడు. 7. అది వెన్నుముక, రొమ్ము ఎముకల మధ్య నుండి వెలువడుతుంది. 8. నిశ్చయంగా ఆయన

అతనిని మళ్లీ సృష్టించగలవాడు. 9. ఆ రోజు దాగివున్న విషయాలన్నీ పరికించబడతాయి. 10. అప్పుడు మనిషి దగ్గర ఏ బలమూ ఉండదు, ఏ సహాయకుడూ ఉండడు. 11. పరిభ్రమించే ఆకాశం సాక్షిగా! 12. మొలిపించే భూమి సాక్షిగా! 13. నిశ్చయంగా ఇది నిర్ణయాత్మకమయిన వాక్కు. 14. ఇదేదో ఆషామాషీ విషయం కాదు. 15. వారు తమ ఎత్తుగడలలో నిమగ్నులై ఉన్నారు. 16. నా ఎత్తులు నేను వేసుకుంటున్నాను. 17. కనుక (ఓ ముహమ్మద్!) ఈ సత్యతిరస్కారులకు కాస్త విడుపు ఇవ్వు. కొంతకాలం పాటు వారిని విడిచిపెట్టు.

## 87. అల్ ఆలా (సర్వోన్నతుడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. సర్వోన్నతుడు అయిన నీ ప్రభువు నామ పరిశుద్ధతను కీర్తించు. 2. ఆయనే (సమస్తాన్నీ) సృష్టించాడు. తరువాత (వాటిని) తీర్చిదిద్దాడు. 3. ఆయనే (వాటి లెక్కను) నిర్ధారించాడు. తరువాత మార్గబోధన చేశాడు. 4. ఆయనే పచ్చికను మొలిపించాడు. 5. తరువాత దానిని నల్లని చెత్తాచెదారంగా చేసేశాడు. 6. (ప్రవక్తా!) మేము నిన్ను చదివిస్తాము. తరువాత నీవు దానిని మరువజాలవు. 7. – అల్లాహ్ తలచినది మాత్రం మరువగలవు. నిశ్చయంగా బహిర్గతమై ఉన్నదానినీ, గుప్తంగా ఉన్నదానినీ ఆయన ఎరిగినవాడు. 8. మేము నిన్ను సులభమైన మార్గం వైపు తీసుకునిపోతాము. 9. కాబట్టి నీవు ఉపదేశం లాభదాయకమనుకుంటే ఉపదేశిస్తూ ఉండు. 10. భయము (భక్తి) ఉన్నవాడు తప్పక ఉపదేశాన్ని గ్రహిస్తాడు. 11. దౌర్భాగ్యుడు మాత్రమే దాని పట్ల అలక్ష్యంగా వ్యవహరిస్తాడు. 12. వాడు మహాతీవ్రమయిన అగ్నికి ఆహుతి అవుతాడు. 13. వాడందులో చావడు, బ్రతకడు. 14. తనను పరిశుద్ధపరచుకున్న వ్యక్తి సాఫల్యం పొందాడు. 15. అతను తన ప్రభువు నామాన్ని స్మరించాడు, నమాజు చేశాడు. 16. కాని మీరు మాత్రం ఈ ప్రాపంచిక జీవితానికే పెద్దపీట వేస్తున్నారు. 17. నిజానికి పరలోకం ఎంతో మేలైనది, ఎప్పటికీ మిగిలి ఉండేది.

18. ఈ విషయమే పూర్వప్రతులలోనూ ఉంది. 19. ఇబ్రాహీమ్, మూసాల మూలప్రతులలో!

## 88. అల్ ఘాషియహ్ (అలముకునే ఆపద)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఏమిటి, అలముకునే ఆపద గురించిన సమాచారం నీకు చేరిందా? 2. కొన్ని ముఖాలు ఆ రోజు అవమానభారంతో కృంగిపోయి ఉంటాయి. 3. శ్రమించి అలసిపోయి ఉంటాయి. 4. వారు దహించివేసే అగ్నిలో పడతారు. 5. సలసల కాగే చెలమ నుండి వారికి త్రాగు నీరు ఇవ్వబడుతుంది. 6. వారికి తినటానికి ముళ్ల వృక్షం తప్ప మరో ఆహారం ఉండదు. 7. అది లావెక్కించదు, వారి ఆకలినీ తీర్చదు. 8. కొన్ని ముఖాలు ఆ రోజు ఉల్లాసభరితంగా ఉంటాయి. 9. తమ సముపార్జనపై సంతోషపడుతుంటాయి. 10. ఉన్నతమయిన (స్వర్గ) వనంలో! 11. అందులో వారు అపసవ్యమయిన మాటలేమీ వినరు. 12. అందులో గల గల పారే సెలయేరులుంటాయి. 13. ఎత్తయిన ఆసనాలు వేయబడి ఉంటాయి. 14. వారి ముందు తీర్చిదిద్దినట్లుగా మధుపాత్రలు ఉంటాయి. 15. మరెంతో చక్కగా వేయబడిన పరుపులు. 16. అన్ని వైపులా పరచబడిన తివాచీలు ఉంటాయి. 17. ఏమిటి, ఒంటెలు ఎలా సృష్టించబడ్డాయో వారు గమనించటం లేదా? 18. ఆకాశం ఎలా పైకి ఎత్తబడిందో వారు వీక్షించటం లేదా? 19. పర్వతాలు ఎలా నిలబెట్టబడ్డాయో వారు చూడటం లేదా? 20. భూమి ఎలా పరచబడిందో వారు గమనించటం లేదా? 21. కనుక (ఓ ప్రవక్తా!) నీవు మాత్రం బోధపరుస్తూ ఉండు. నీవు బోధపరచే వాడవు మాత్రమే. 22. నీవు వారిపై కాపలాదారు కావు. 23. కాని ఎవడయితే విముఖుడై, తిరస్కారానికి పాల్పడతాడో, 24. అతనికి అల్లాహ్ చాలా పెద్ద శిక్ష విధిస్తాడు. 25. వారు మరలి రావలసినది మాత్రం మా వైపునకే. 26. వారి నుండి లెక్క తీసుకునే బాధ్యత కూడా మాదే.

# 89. అల్ ఫజ్ర్ (ఉషోదయం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఉషోదయం సాక్షిగా! 2. పది రాత్రుల సాక్షిగా! 3. సరి బేసీల సాక్షిగా! 4. గడచిపోతున్నప్పటి రాత్రి సాక్షిగా! 5. ఏమి, విజ్ఞులయిన వారికి ఇవి చాలినన్ని ప్రమాణాలు కావా? 6. నీ ప్రభువు ఆద్ వారిపట్ల ఎలా వ్యవహరించాడో నీవు చూడలేదా? 7. స్తంభాల వారైన ఇరము పట్ల? 8. అలాంటివారు రాజ్యాలలో అసలెక్కడా సృష్టించబడలేదు. 9. లోయలలో పెద్ద పెద్ద బండరాళ్ళను చెక్కిన సమూద్ వారి పట్ల (జరిగిన వ్యవహారమేమిటో నీవు గమనించలేదా)? 10. మేకులవాడైన ఫిరౌన్ పట్ల (జరిగిందేమిటి)? 11. వారంతా రాజ్యాలలో చెలరేగిపోయినవాళ్ళే. 12. వాటిలో వారు తీవ్ర విధ్వంసం సృష్టించారు. 13. అందువల్ల నీ ప్రభువు వారిపై శిక్షా కొరడాను ఝుళిపించాడు. 14. నిశ్చయంగా నీ ప్రభువు మాటేసి ఉన్నాడు. 15. మనిషి నైజం ఎటువంటిదంటే, అతని ప్రభువు అతనిని పరీక్షించటానికి అతనికి గౌరవాన్ని, సుఖసౌఖ్యాలను ప్రసాదించినపుడు, 'నా ప్రభువు నన్ను ఘనంగా సత్కరించాడు' అని (సగర్వంగా) చెప్పుకుంటాడు.

16. అతనిని (మరో విధంగా) పరీక్షించటానికి అతని జీవనోపాధిని తగ్గించినపుడు, 'నా ప్రభువే నన్ను పరాభవానికి లోనుచేశాడు' అని (నిష్ఠూరంగా) అంటాడు. 17. ఎంతమాత్రం కాదు ... మీరసలు అనాథను ఆదరించరు. 18. మీరు నిరుపేదకు అన్నం పెట్టమని కనీసం ఒండొకరిని పురికొల్పుకోరు. 19. పైగా మీరు వారసత్వ సొమ్మునంతా ప్రోగుచేసి స్వాహా చేస్తారు. 20. పైగా మీరు ధనాన్ని పిచ్చిగా ప్రేమిస్తున్నారు. 21. ఎంతమాత్రం కాదు ... భూమి దంచి తుత్తునియలుగా చేయబడినప్పుడు, 22. వరుస తీరి ఉన్న దైవదూతలతో సహా నీ ప్రభువు ఏతెంచినపుడు, 23. ఆ రోజు నరకం (దగ్గరకు) తీసుకురాబడుతుంది. ఆ రోజు మనిషికి వాస్తవం అర్థమవు తుంది. కాని అప్పుడు అర్థం అయి ఉపయోగం ఏమిటి? 24. అతనిలా

అంటాడు : 'అయ్యో! నేను నా జీవితకాలంలో ఏదన్నా ముందుకు పంపుకుని ఉంటే ఎంత బాగుండేది!?' 25. ఆ రోజు అల్లాహ్‌ శిక్షించినట్లుగా శిక్షించే వాడెవడూ ఉండడు. 26. ఆయన బంధించినట్లుగా బంధించేవాడెవడూ ఉండడు. 27. 'నెమ్మదించిన ఓ మనసా! 28. నీ ప్రభువు వైపునకు పద. నీవు ఆయన యెడల సంతోషించావు. ఆయన నీ పట్ల ప్రసన్నుడయ్యాడు. 29. నా దాసులలో చేరిపో. 30. నా స్వర్గంలో ప్రవేశించు.'

## 90. అల్‌ బలద్‌ (పురము)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్‌ పేరుతో*

1. లేదు ... నేను ఈ పురముపై ప్రమాణం చేస్తున్నాను. 2. (ప్రవక్తా!) నీవు ఈ పురములో నివసిస్తున్నావు. 3. తండ్రిమీద ఒట్టు. అతని సంతానం మీద ఒట్టు. 4. మేము మనిషిని కష్టపడేవాడుగానే పుట్టించాము. 5. ఏమిటి, తనపై ఎవరి నియంత్రణా లేదని అతను తలపోస్తున్నాడా? 6. 'నేనెంతో ధనాన్ని ధారబోశాన'ని అతనంటున్నాడు. 7. ఏమిటి, తనను ఎవరూ చూడటం లేదని అతననుకుంటున్నాడా? 8. మేమతనికి రెండు కళ్ళను ఇవ్వలేదా? 9. ఒక నాలుకను, రెండు పెదవులను (ప్రసాదించలేదా?) 10. ఇంకా మేమతనికి రెండు మార్గాలను చూపించాము. 11. కాని అతను కఠినమయిన కొండను ఎక్కలేదు. 12. కఠినమయిన కొండ గురించి నువ్వేమనుకున్నావు? 13. మెడను విడిపించటం (ఒక బానిసకు బానిసత్వం నుండి స్వేచ్ఛను ప్రసాదించటం)! 14. లేదా ఆకలిగొన్ననాడు అన్నంపెట్టడం – 15 సమీప బంధువు అయిన అనాథకు. 16. లేదా మట్టి కొట్టుకుని ఉన్న అగత్యపరునికి! 17. ఆ తరువాత అతను విశ్వసించినవాడై, పరస్పరం సహనబోధ, కనికరం గురించి తాకీదు చేసుకునే వారిలో చేరినవాడై ఉండాలి. 18. ఇలాంటివారే సౌభాగ్యవంతులు. 19. ఇకపోతే మా సూచనలను త్రోసిపుచ్చినవారు; వారే దౌర్భాగ్యులు. 20. వారిపై అగ్ని (అన్ని వైపుల నుండీ) క్రమ్ముకుని ఉంటుంది.

# 91. అష్ షమ్స్ (సూర్యుడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. సూర్యుని సాక్షిగా! పొద్దెక్కుతున్నప్పటి ఎండసాక్షిగా! 2. సూర్యుణ్ణి వెంబడిస్తున్నప్పటి చంద్రుని సాక్షిగా! 3. దేదీప్యమానం చేసినప్పటి పగటి సాక్షిగా! 4. దానిని ఆవరించినప్పటి రాత్రి సాక్షిగా! 5. ఆకాశం సాక్షిగా! దాని అపురూప నిర్మాణం సాక్షిగా! 6. భూమి సాక్షిగా! దానిని విస్తరింపజేసిన వాని సాక్షిగా! 7. ఆత్మ సాక్షిగా! దానిని సంస్కరించిన వాని సాక్షిగా! 8. మరి ఆయనే దానికి చెడును పరికించే విచక్షణా జ్ఞానాన్ని, దానినుండి తనను కాపాడుకునే అంతఃప్రేరణనూ నూరిపోశాడు. 9. దానిని (తన ఆత్మను) పరిశుద్ధపరచుకున్నవాడు సాఫల్యం పొందాడు. 10. దానిని కలుషితం చేసినవాడు విఫలుడయ్యాడు. 11. సమూద్ (జాతి) వారు తమ తలబిరుసు తనం వల్ల సత్యాన్ని నిరాకరించారు. 12. వారిలోని ఒక పరమ దౌర్భాగ్యుడు దురుద్దేశంతో నిలబడినప్పుడు, 13. దైవప్రవక్త (సాలిహ్), 'ఇది దేవుని సూచనగా ఉన్న ఆడ ఒంటె. కాబట్టి దాని వంతు నీరు విషయంలో జాగ్రత్త!' అన్నాడు. 14. కాని వారు అతని మాటను త్రోసిరాజని, ఆ ఆడ ఒంటెను చంపేశారు. అందువల్ల, వారి ప్రభువు – వారి దురాగతాల మూలంగా – వారిపై విపత్తును పంపి వారందరినీ తుదముట్టించాడు. 15. పరిణామ స్వరూపం గురించి ఆయన ఎంతమాత్రం భయపడడు.

# 92. అల్ లైల్ (రాత్రి)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అలముకున్నప్పటి రాత్రి సాక్షిగా! 2. ప్రకాశమానమైనప్పటి పగటి సాక్షిగా! 3. ఆయన సృష్టించిన ఆడ–మగల సాక్షిగా! 4. (ఓ మానవుడా!) నీ కృషి వైవిధ్యంతో కూడుకున్నది. 5. కనుక ఎవడయితే (దైవమార్గంలో) ఇచ్చాడో, భయభక్తులను పుణికిపుచ్చుకున్నాడో, 6. మంచిని నిజమని ధ్రువపరిచాడో, 7. అతనికి మేము సులభమార్గాన సాగిపోయేలా సౌలభ్యాలను సమకూర్చుతాము. 8. మరెవడయితే పిసినారిగా ప్రవర్తించాడో,

నిర్లక్ష్య ధోరణిని కనబరిచాడో, 9. మంచిని తృణీకరించాడో, 10. అతనికి మేము కఠిన మార్గాన పోయేలా అవకాశాలు కల్పిస్తాము. 11. గోతిలో పడినప్పుడు అతని ధనం అతనికి ఏ విధంగానూ ఉపయోగపడదు. 12. నిశ్చయంగా మార్గదర్శకత్వం వహించే బాధ్యత మాది. 13. నిశ్చయంగా ఇహపరాలు మా స్వాధీనంలోనే ఉన్నాయి. 14. నేను మాత్రం మిమ్మల్ని జ్వలించే అగ్ని గురించి హెచ్చరించాను. 15. పరమ దౌర్భాగ్యుడు మాత్రమే అందులో పడతాడు. 16. వాడు సత్యాన్ని నిరాకరించి, దాని నుండి మరలిపోయాడు. 17. దైవభీతిపరుణ్ణి మాత్రం దాని నుండి సురక్షితంగా ఉంచటం జరుగుతుంది. 18. పరిశుద్ధతను అవలంబించేందుకు అతను తన ధనాన్ని (దైవమార్గంలో) ఇస్తాడు. 19. వేరొకరు చేసిన ఉపకారానికి రుణం తీర్చుకునేందుకు గాకుండా, 20. సర్వోన్నతుడైన అల్లాహ్ మెప్పు పొందటానికి మాత్రమే అతను ఇస్తాడు. 21. త్వరలోనే అతను సంతోషిస్తాడు.

## 93. అజ్ జుహా (పగటి వెలుతురు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. పగటి వెలుతురు సాక్షిగా! 2. దట్టంగా అలముకున్నప్పటి రాత్రి సాక్షిగా! 3. (ఓ ముహమ్మద్!) నీ ప్రభువు నిన్ను విడువనూ లేదు, నీ పట్ల విసుగుచెందనూ లేదు. 4. నిశ్చయంగా పరలోకం నీ కొరకు ఇహలోకం కన్నా మేలైనది. 5. త్వరలోనే నీ ప్రభువు నీకు (అమితంగా) ప్రసాదిస్తాడు. దాంతో నీవు సంతోషిస్తావు. 6. ఏమిటి, అల్లాహ్ నిన్ను అనాథగా కనుగొనలేదా? మరి ఆయన నీకు ఆశ్రయం ఇచ్చాడు. 7. ఆయన నిన్ను మార్గాన్వేషకునిగా కనిపెట్టి, నీకు మార్గం చూపాడు. 8. నీవు పేదవానిగా ఉండటం చూసి, నీకు కలిమిని ప్రసాదించాడు. 9. కనుక నీవు అనాథ యెడల కఠినంగా ప్రవర్తించకు. 10. యాచించేవానిని కసురుకోకు. 11. నీ ప్రభువు అనుగ్రహాన్ని ప్రస్తుతిస్తూ ఉండు.

## 94. ఇన్ షరాహ్ (ఊరట, ఉపశమనం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ప్రవక్తా!) ఏమిటి, మేము నీ అంతర్యాన్ని నీ కొరకు విప్పలేదా? 2. నీ మీద ఉన్న ఆ బరువును కూడా దించివేశాము. 3. అది నీ వీపును కృంగదీసేది. 4. ఇంకా మేము నీ కీర్తిని (నలుదిశలా మార్మోగేవిధంగా) ఉన్నతం చేశాము. 5. కనుక నిశ్చయంగా కష్టంతోపాటే సుఖం కూడా ఉంది. 6. నిశ్చయంగా బాధతోపాటే సౌఖ్యం కూడా ఉంది. 7. కాబట్టి నీకు తీరిక లభించగానే ఆధ్యాత్మిక అభ్యాసం చెయ్యి. 8. నీ ప్రభువు వైపునకే దృష్టిని కేంద్రీకరించు.

## 95. అత్ తీన్ (అంజూరం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అత్తిపండు సాక్షిగా! ఆలివ్ సాక్షిగా! 2. సినాయ్ కొండ సాక్షిగా! 3. సురక్షితమైన ఈ నగరం (మక్కా) సాక్షిగా! 4. వాస్తవానికి మేము మనిషిని అత్యుత్తమమయిన ఆకృతిలో సృష్టించాము. 5. తరువాత అతనిని (అతని స్వయంకృతాపరాధాల కారణంగా) అట్టడుగు స్థానానికి చేర్చాము. 6. అయితే ఎవరు విశ్వసించి, సత్క్రియలాచరించారో, వారికి ఎన్నటికీ అంతంకాని ప్రతిఫలం ఉంది. 7. మరయితే ఇప్పుడు నీవు ఏ కారణంగా తీర్పుదినాన్ని తృణీకరిస్తున్నావు? 8. ఏమిటి, అల్లాహ్ అందరికంటే గొప్ప న్యాయాధీశుడు కాడా?

## 96. అల్ అలఖ్ (నెత్తుటి గడ్డ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. చదువు, సృష్టించిన నీ ప్రభువు పేరుతో. 2. మనిషిని ఆయన నెత్తుటి గడ్డతో సృష్టించాడు. 3. చదువు! నీ ప్రభువు పరమ ఉదాత్తుడు. 4. ఆయన కలము మూలముగా జ్ఞానబోధ చేశాడు. 5. మనిషి ఎరుగని ఎన్నో విషయాలను అతనికి తెలియపరిచాడు. 6. ఎంతమాత్రం కాదు ... మానవుడు మహా తలబిరుసుగా తయారయ్యాడు. 7. ఎందుకంటే, అతను

తన్ను తాను నిరపేక్షాపరునిగా భావించుకుంటున్నాడు. 8. నిజానికి మరలిపోవలసింది నీ ప్రభువు వైపునకే. 9. వారిస్తున్న ఆ వ్యక్తిని నీవు చూశావా? 10 – నమాజు చేస్తున్న ఒక భక్తుణ్ణి? 11. చూడు! ఒకవేళ అతను సన్మార్గాన ఉంటే, 12 లేదా అతను భక్తిపరాయణత గురించి బోధపరిచేవాడై ఉంటే అతని గురించి నీ ఉద్దేశమేమిటి? 13. చూడు! ఒకవేళ అతను సత్యాన్ని త్రోసిపుచ్చేవాడై, విముఖత చూపేవాడై ఉంటే అతని గురించి నీ అభిప్రాయమేమిటి? 14. ఏమిటి, అల్లాహ్ తనను చూస్తున్నాడన్న విషయం అతనికి తెలియదా? 15. ఎంతమాత్రం కాదు – అతను గనక (తన దుష్ట వైఖరిని) మానుకోకపోతే, మేమతని ముంగురులు పట్టి ఈడుస్తాము. 16. అంటే అసత్యానికి, అపరాధానికి ప్రబల తార్కాణంగా ఉన్న అతని నుదుటి జుత్తును. 17. అతను తన మద్దత్తుదారులను పిలుచుకోదలిస్తే పిలుచుకోమను. 18. మేము కూడా నరక భటులను పిలుస్తాము. 19. ఎంతమాత్రం కాదు ... నీవు అతని మాట వినకు. (నీ ప్రభువుకు) సాష్టాంగ ప్రణామం చేసి, ఆయన సామీప్యం పొందు.

## 97. అల్ ఖద్ర్ (మహత్పూర్వకమైనది)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. మేము దీనిని (ఈ ఖుర్‌ఆన్‌ను) మహత్పూర్వకమయిన రాత్రి యందు అవతరింపజేశాము. 2. మహత్పూర్వకమయిన రాత్రి గురించి నువ్వేమనుకున్నావు. 3. మహత్పూర్వకమయిన ఆ రాత్రి వెయ్యి నెలలకన్నా శ్రేష్ఠమైనది. 4. దైవదూతలూను, ఆత్మ (జిబ్రీల్) ఆ రాత్రివేళ తమ ప్రభువు అనుమతితో, సమస్త వ్యవహారాలకు సంబంధించిన ఆయన ఉత్తర్వులను తీసుకుని వస్తారు. 5. అది ఆద్యంతం శాంతితో కూడుకున్నది – ఉషోదయం వరకూ.

## 98. అల్ బయ్యినహ్ (స్పష్టమయిన సాక్ష్యాధారం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. గ్రంథం కల ప్రజలలో, బహుదైవారాధకులలో ఎవరయితే తిరస్కార

వైఖరిని అవలంబించారో, వారు తమ వద్దకు స్పష్టమయిన సాక్ష్యాధారం రానంత వరకూ తమ తిరస్కార ధోరణిని మానుకోనివారుగా ఉండేవారు. 2. అంటే, దేవుని తరఫు నుండి ఒక ప్రవక్త తమకు పవిత్రమయిన గ్రంథ పత్రాలను చదివి వినిపించాలి, 3. అందులో స్థిరమయిన, సహేతుకమయిన అంశాలు ఉండాలి (అనేది వారి అభిమతమై ఉండేది). 4. కాని గ్రంథం వొసగబడిన ప్రజలు తమ వద్దకు స్పష్టమయిన సాక్ష్యాధారం వచ్చిన మీదటే విభేదించుకున్నారు (అదీ విచిత్రం, విశేషం!). 5. నిజానికి వారికి అల్లాహ్‌నే ఆరాధించాలని, చిత్తశుద్ధితో ధర్మాన్ని ఆయనకే అంకితం చేసుకోవాలని, ఏకోన్ముఖులై ఉండాలని, నమాజును స్థాపించాలని, జకాత్‌ను ఇవ్వాలని మాత్రమే ఆదేశించబడింది. ఇదే స్థిరమయిన – సరయిన – జీవన ధర్మం. 6. నిశ్చయంగా గ్రంథం కల ప్రజలలో, బహుదైవోపాసకులలో సత్య తిరస్కారానికి ఒడిగట్టినవారు నరకాగ్నిలో పడతారు. వారు కలకాలం అందులోనే మాడుతూ ఉంటారు. వారు జీవరాశులలోకెల్లా అత్యంత చెడ్డవారు. 7. మరెవరయితే విశ్వసించారో, మంచిపనులు చేశారో – వారు జీవరాశులలోకెల్లా శ్రేష్ఠులు. 8. వారికి ప్రతిఫలంగా వారి ప్రభువు వద్ద శాశ్వతమయిన స్వర్గవనాలు ఉన్నాయి. వాటి దిగువన కాలువలు ప్రవహిస్తూ ఉంటాయి. వాటిలో వారు ఎల్లకాలం – శాశ్వతంగా – ఉంటారు. అల్లాహ్ వారిపట్ల ప్రసన్నుడయ్యాడు. వారు అల్లాహ్ యెడల సంతుష్టులయ్యారు. తన ప్రభువుకు భయపడేవానికి మాత్రమే ఇది ప్రత్యేకం!

## 99. అజ్ జిల్‌జాల్ (భూకంపం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. భూమి తీవ్రమయిన ప్రకంపనతో కంపింపజేయబడినప్పుడు, 2. ఇంకా భూమి తనలోని బరువునంతా బయటపడవేసినపుడు, 3. 'దీనికేమయిపోయిందీ!?' అని మనిషి అంటాడు. 4. ఆనాడు భూమి తన స్థితిగతులన్నింటినీ ఏకరువు పెడుతుంది. 5. ఎందుకంటే, నీ ప్రభువు దానికి ఆ విధంగా ఆజ్ఞాపించి ఉంటాడు మరి. 6. ఆ రోజు మనుషులు –

వారి కర్మలు వారికి చూపబడటానికి – వేర్వేరు బృందాలుగా బయలుదేర్తారు. 7. కనుక ఎవడు రవంత సత్కార్యం చేసివున్నా, అతను దానిని చూసుకుంటాడు. 8. మరెవడు రవంత దుష్కార్యం చేసివున్నా, దానిని అతను చూసుకుంటాడు.

## 100. అల్ ఆదియాత్ (ప్రచండ వేగంతో పరుగెత్తే అశ్వాలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. రొప్పుతూ వేగంగా పరుగెత్తే గుర్రాల సాక్షిగా! 2. తమ డెక్కల రాపిడితో నిప్పులు చెరిగే వాటి సాక్షిగా! 3. తెలతెలవారుతుండగా ఆకస్మిక దాడి జరిపేవాటి సాక్షిగా! 4. ఆ సమయంలో అవి దుమ్ము రేపుతూ, 5. సైనిక సమూహాల్లో చొచ్చుకుపోతాయి. 6. నిశ్చయంగా మానవుడు తన ప్రభువు మేళ్ళను మరచినవాడు. 7. దీనికి స్వయంగా తనే సాక్షిగా ఉన్నాడు. 8. అతను ధన వ్యామోహంలో బాగా మునిరిపోయాడు. 9. సమాధులలో ఉన్న వాటిని బయటికి తీసే సమయం గురించి అతనికి తెలియదా? 10. అంతర్యాల్లోని లోగుట్టు రట్టు చేయబడుతుందన్న సంగతి తెలీదా? 11. నిశ్చయంగా ఆ రోజు వారి ప్రభువుకు వారందరి గురించి అంతా తెలిసి ఉంటుంది.

## 101. అల్ ఖారిఅహ్ (కలకలం రేపేది)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కలకలం రేపేది 2. ఏమిటా కలకలం రేపేది? 3. ఆ కలకలం రేపే దాని గురించి నీకేం తెలుసు? 4. ఆ రోజు మనుషులు దీపపు పురుగుల మాదిరిగా చెల్లాచెదురు అయిపోతారు. 5. పర్వతాలు ఏకిన రంగురంగుల దూది పింజాల్లా అయిపోతాయి. 6. ఎవరి (సదాచరణల) త్రాసు పళ్ళెం బరువుగా ఉంటుందో, 7. అతను మనసు మెచ్చిన సుఖవిలాసాలలో ఉంటాడు. 8. మరెవరి త్రాసుపళ్ళెం తేలికగా ఉంటుందో, 9. అతని నివాస స్థలం లోతైన గొయ్యి అయి ఉంటుంది. 10. అదేమిటో నీకేమైనా తెలుసా? 11. అది మండే అగ్ని గుండం.

## 102. అత్ తకాసుర్ (అత్యాశ)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఇంకా ఇంకా ఆర్జించాలన్న అత్యాశ మిమ్మల్ని పరధ్యానంలో పడవేసింది. 2. కడకు మీరు (ఈ పేరాశతోనే) సమాధుల్లోనికి చేరుకుంటారు. 3. ఎంతమాత్రం కాదు ... శీఘ్రంగానే మీరు తెలుసుకుంటారు. 4. మరి ఎంతమాత్రం కాదు ... చాలా తొందరగానే మీరు తెలుసుకుంటారు. 5. కానేకాదు ... మీరు గనక ఖచ్చితమైన జ్ఞానంతో తెలుసుకుని ఉంటే (ఈ ఆశల ఆరాటంలో పడి ఉండేవారు కారు). 6. మీరు తప్పకుండా నరకాగ్నిని చూస్తారు. 7. మరి మీరు దానిని నిశ్చిత నేత్రంతో వీక్షిస్తారు. 8. మరి ఆ రోజు మిమ్మల్ని ఈ ఐహిక సుఖాల గురించి ప్రశ్నించటం జరుగుతుంది.

## 103. అల్ అస్ర్ (కాల గమనం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. కాలం సాక్షిగా! 2. నిశ్చయంగా మానవుడు నష్టంలో ఉన్నాడు. 3. అయితే విశ్వసించి మంచిపనులు చేసినవారు, ఒండొకరికి సత్యోపదేశం చేసుకున్నవారు, పరస్పరం ఓర్పు గురించి ఉపదేశించుకున్నవారు మాత్రం ఈ నష్టం నుండి సురక్షితంగా ఉంటారు.

## 104. అల్ హుమజహ్ (పరోక్షంగా నిందించేవాడు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఎదుటివారిని ఎత్తిపొడిచే, తప్పులెన్నే ప్రతివాడికీ వినాశం తథ్యం. 2. వాడు ధనాన్ని పోగుచేసి, మాటిమాటికీ లెక్కపెడుతూ ఉంటాడు. 3. తన ధనం ఎల్లప్పుడూ తన వెంటే ఉంటుందని వాడు భావిస్తున్నాడు. 4. అసంభవం! వాడు తొక్కివేసే దానిలో విసరివేయబడతాడు. 5. తొక్కివేసే దాని గురించి నువ్వేమనుకున్నావు? 6. అది అల్లాహ్‌చే రగుల్చొల్పబడిన అగ్ని. 7. అది హృదయాల వరకూ చొచ్చుకుపోతుంది. 8. అది వారిపై – అన్ని వైపుల నుండీ – మూసివేయబడుతుంది. 9. పొడవాటి (అగ్ని) స్తంభాల మధ్యన!

# 105. అల్ ఫీల్ (ఏనుగు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఏనుగుల వారిపట్ల నీ ప్రభువు ఎలా వ్యవహరించాడో నీవు చూడలేదా? 2. ఏమిటి, ఆయన వారి కుతంత్రాన్ని భగ్నం చేయలేదా? 3. ఆయన వారికి వ్యతిరేకంగా పక్షుల సమూహాలను పంపించాడు. 4. అవి వారిపై కంకరరాళ్ళను కురిపించి తరమసాగాయి. 5. ఎట్టకేలకు ఆయన వారిని (పశువులు) తిని తొక్కివేసిన గడ్డి మాదిరిగా చేసేశాడు.

# 106. ఖురైష్ (ఖురైష్ వర్గం వారు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఖురైషులు అలవాటు పడినందువల్ల, 2. చలికాలపు, వేసవి కాలపు ప్రయాణాలకు అలవాటు పడినందువల్ల, 3. వారు ఈ (పవిత్ర కాబా) గృహ ప్రభువునే ఆరాధించాలి. 4. ఆయనే వారికి ఆకలిగొన్నప్పుడు అన్నం పెట్టాడు. భయాందోళనలు ఉన్నప్పుడు శాంతిభద్రతలను కల్పించాడు.

# 107. అల్ మావూన్ (చిన్న చిన్న వస్తువులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఏమిటి, తీర్పుదినాన్ని అసత్యమంటూ త్రోసిపుచ్చే వ్యక్తిని నీవు చూడలేదా? 2. అనాథను బయటికి గెంటివేసే కఠినాత్ముడు వాడు! 3. నిరుపేదకు అన్నం పెట్టమని కనీసం ప్రోత్సహించనివాడు! 4. ఆ నమాజీలకు వినాశం ఖాయం. 5. (ఎందుకంటే) వారు తమ నమాజుల పట్ల మరుపునకు (అశ్రద్ధకు) లోనయ్యారు. 6. (చేసినా) కేవలం పరులకు చూపటానికే చేస్తారు. 7. నిత్యావసరాలకు సంబంధించిన అతి చిన్న వస్తువులను కూడా (సాటి జనులకు) ఇవ్వరు.

## 108. అల్ కౌసర్ (శుభాల సరస్సు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ఓ ముహమ్మద్!) మేము నీకు కౌసర్ (శుభాల సరస్సు)ను ప్రసాదించాము. 2. కనుక నీ ప్రభువు (ప్రీతి) కోసమే నమాజు చెయ్యి; ఖుర్బానీ ఇవ్వు. 3. ముమ్మాటికీ నీ శత్రువే నామరూపాల్లేకుండా పోతాడు.

## 109. అల్ కాఫిరూన్ (సత్యతిరస్కారులు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ప్రవక్తా!) వారికి చెప్పు. 'ఓ సత్యతిరస్కారులారా! 2. మీరు ఆరాధించే వాటిని నేను ఆరాధించను. 3. నేను ఆరాధిస్తున్న వానిని మీరు ఆరాధించరు. 4. మీరు పూజిస్తున్న వాటిని నేను పూజించేవాడను కాను. 5. నేను ఆరాధించే వానిని మీరెలాగూ ఆరాధించరు. 6. మీ ధర్మం మీకు. నా ధర్మం నాకు.'

## 110. అన్ నస్ర్ (సహాయం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. (ఓ ముహమ్మద్!) దైవసహాయం అందినప్పుడు, విజయం వరించినప్పుడు, 2. ప్రజలు తండోపతండాలుగా వచ్చి దైవధర్మంలో చేరటాన్ని నీవు తిలకించినప్పుడు, 3. నీవు నీ ప్రభువును స్తుతించటంతో పాటు, ఆయన పవిత్రతను కొనియాడు. క్షమాపణ కొరకు ఆయన్ని ప్రార్థించు. నిశ్చయంగా ఆయన అమితంగా క్షమించేవాడు.

## 111. అల్ లహబ్

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. అబూ లహబ్ చేతులు విరగ! వాడు నాశనమవ్వ! 2. వాడి ధనమూ వాడికి పనికి రాలేదు. వాడు సంపాదించినది కూడా వాడికి ఉపయోగపడలేదు. 3. శీఘ్రంగానే వాడు జ్వలించే అగ్నికి ఆహుతి అవుతాడు.

4. కట్టెలు మోస్తూ తిరిగే వాడి భార్యకూ అదే గతి పడుతుంది. 5. ఆవిడ మెడలో పేనబడిన త్రాడు ఉంటుంది.

## 112. అల్ ఇఖ్లాస్ (దేవుని ఏకత్వం)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. వారికి చెప్పు : 'ఆ అల్లాహ్ ఒక్కడే (అద్వితీయుడు). 2. అల్లాహ్ నిరపేక్షాపరుడు. 3. ఆయనకు సంతానం లేదు. ఆయన కూడా ఎవరికీ సంతానం కాడు. 4. ఆయనకు సరిసమానుడు ఎవడూ లేడు.'

## 113. అల్ ఫలఖ్ (తొలి పొడుపు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఇలా చెప్పు : 'నేను ప్రాతఃకాల ప్రభువు శరణు వేడుకుంటున్నాను – 2 – ఆయన సృష్టించిన ప్రతి వస్తువు కీడు నుండి! 3. అలముకున్నప్పటి దట్టమయిన చీకటి రాత్రి కీడు నుండి! 4. ముడులలో మంత్రించి ఊదే వారి కీడు నుండి! 5. అసూయ చెందేవాడు అసూయ చెందినప్పటి కీడు నుండి!'

## 114. అన్ నాస్ (ప్రజలు)

*అపార కరుణామయుడు, అమిత కృపాసాగరుడు అయిన అల్లాహ్ పేరుతో*

1. ఇలా అను : 'నేను ప్రజల ప్రభువు (అయిన అల్లాహ్) శరణు వేడుతున్నాను. 2. ప్రజల చక్రవర్తి, 3. ప్రజల ఆరాధ్య దైవం (అయిన అల్లాహ్ శరణు వేడుతున్నాను). 4. శంకలు రేకెత్తించి, అదృశ్యమయ్యేవాడి కీడు నుండి, 5. వాడు జనుల ఆంతర్యాలలో శంకలు రేకెత్తిస్తూ ఉంటాడు. 6. అలాంటివాడు జిన్నులలో నుండీ ఉండవచ్చు, మనుషులలో నుండీ ఉండవచ్చు!'

